వ్యాస ప్రపంచం - 3

# సంస్కృతి వ్యాసాలు

**కొడవటిగంటి కుటుంబరావు**


1, 4వ క్రాస్‌స్ట్రీట్, ట్రస్ట్‌పురం
మద్రాసు - 600 024

ప్రచురణ :
విప్లవ రచయితల సంఘం, ఆంధ్రప్రదేశ్

మొదటి ముద్రణ :
1999, అక్టోబరు

కవర్ డిజైన్ :
చలసాని ప్రసాదరావు

ముద్రణ :
చరిత గ్రాఫిక్స్, చిక్కడపల్లి, హైదరాబాద్.

ప్రతులకు :
నవోదయ బుక్ హౌస్, కాచిగూడ, హైదరాబాద్
దిశ పుస్తక కేంద్రం, చిక్కడపల్లి, హైదరాబాద్
ప్రగతి బుక్ హౌస్, ఏలూరు రోడ్, విజయవాడ

వెల : రూ. 90/-

# కృతజ్ఞతలు

సారస్వతనికేతనం, వేటపాలెం ;
గౌతమీ గ్రంథాలయం, రాజమండ్రి ;
ఫ్రమిరాంట గ్రంథాలయం, విజయవాడ ;
ఆంధ్ర మహిళాసభ, మద్రాసు.

'విశాలాంధ్ర' సంపాదకవర్గం, 'ప్రజాశక్తి', 'ఆంధ్రపత్రిక', 'తెలుగు విద్యార్థి',
'సృజన', 'అరుణతార', 'ప్రజాసాహితి' .

పురాణం సుబ్రహ్మణ్యాశర్మ (ఆంధ్రజ్యోతి)
నండూరి రామమోహన రావు (ఆంధ్రజ్యోతి)
లీలావతి రాఘవయ్య (జ్యోతి)
ఆలూరి సుధాకర్, ఆలూరి రంగారావు (యువ)

కె. వి. ఆర్., వి.సుబ్రహ్మణ్యం – కావలి, వెలగా వెంకటప్పయ్య –తెనాలి,
లంకా సూర్యనారాయణ –గుంటూరు, సజ్జా వెంకటేశ్వర్లు –వేటపాలెం,
సన్నిధానం నరసింహశర్మ –రాజమండ్రి, దాసరి సుబ్రహ్మణ్యం –మద్రాసు,
కాత్యాయనీ విద్మహే–వరంగల్లు, సుంకర కనకారావు –విజయవాడ,
కాకరాల –మద్రాసు, చలసాని ప్రసాదరావు, కేతు విశ్వనాథరెడ్డి, ఎన్.వేణుగోపాల్,
శివలక్ష్మి, వసంతలక్ష్మి, బి.జగన్, వాసిరెడ్డి వేణుగోపాల్–హైదరాబాద్, ఆంధ్ర
శేషగిరిరావు,
స్థానాపతి రుక్మిణమ్మ, మసూనా, అత్తలూరి నరసింహరావు, అత్తిలి కృష్ణారావు,
టి.వేణుగోపాలరావు –విశాఖపట్నం, కొత్తపల్లి రవిబాబు –నగరం.

కొడవటిగంటి వరూధిని గారి సహకారం, ప్రోత్సాహం మాకెంతో
ఉత్తేజాన్నిస్తున్నాయి.

విరసం

# సంస్కృతి పూర్వాపరాలు

'చరిత్ర' అగడ్త దాటి 'సంస్కృతి' లోగిలిలో ప్రవేశించాం. వ్యాసకర్తగా కొడవటిగంటి కుటుంబరావు చొరరాని చోటులేదు. ఎక్కలేని ఎత్తులేదు. దేన్నైనా సరే విశదీకరిస్తూ విశ్లేషించి లోతులు తడుముతారాయన. అందుకే ఆయన వ్యాసాలు అంత ప్రయోజనకరంగా వుంటాయి. వాటికొక భూమికను కూడా ఏర్పాటు చేసుకున్నారాయన. దీని ఆధారంగానే సంస్కృతిని విశదీకరించడానికి పూనుకున్నారు. నిజానికిది కత్తిమీద సాములాంటిది. ఎందుకంటే సంస్కృతికి సవాలక్ష నిర్వచనాలున్నాయి. అసలు సంస్కృతి అనే మాటలోనే బోలెడు మడతపేచీలు దాగివున్నాయి. ఇలాంటప్పుడు సంస్కృతి మీద నూరుపైచిలుకు వ్యాసాలు రాయడం నిజంగా సాహసమే.

అక్కడ టి.ఎస్. ఇలియట్ అంతటివాడు 'మతమే సంస్కృతి' అన్నాడు. ఇక్కడ కొందరు ఇంకొంత దూరం పోయి 'సంస్కృతమే సంస్కృతి' అంటున్నారు. సంస్కృతిని మతంతో, 'దేవభాష'తో ముడెయ్యాలనే ఈ తాపత్రయం శాస్త్రీయ అవగాహన అనిపించుకోదు.

మతములన్నియు మాసిపోవును
జ్ఞానమొక్కటి నిలిచి వెలుగును

అన్న గురజాడ మనకి గర్వకారణం. ఎక్కడ టి.ఎస్. ఇలియట్ ? ఎక్కడ గురజాడ అప్పారావు ? అలాగే ఇన్నివేల ఏళ్ళ నుంచీ ఈ నేలమీద నరులకు నూరిపోస్తున్నా ఇక్కడ సంస్కృతం వచ్చిన వారి సంఖ్య రెండుశాతం మించదు. వందలఏళ్ళ నుంచీ ఇంగ్లీషు మన నెత్తిన రుద్దినా ఇంగ్లీషు వచ్చిన వారి శాతం కూడా అంతకుమించదు. సంస్కృతిని మతంతో ముడిపెట్టాలనీ, సంస్కృతానికి పర్యాయపదం చేయాలని చూసే సనాతనులకి 'దేశమంటే మట్టే గాని మనుషులు' కాదు. ఈ దేశంలో వేల ఏళ్ళ నుంచీ ఎన్నో భాషలు, ప్రాంతాలు, రకరకాల మనుషులు, జాతులు, కులాలు, జీవన విధానాలు ఉనికిలో వుండడం మనకి తెలుసు.

ఈ వైవిధ్యం మనం రమ్మంటే వచ్చేది కాదు - పొమ్మంటే పోవడానికి. వీటిని గుర్తించడం సామాజిక శాస్త్రవేత్తల బాధ్యత. ప్రజల దైనందిన కార్యకలాపాలు ఆర్థిక, రాజకీయ రంగాల వల్ల ప్రభావితమవుతాయి. వాటిలో మూలాలు వుంటాయి. వాటి నుంచి వెల్లివిరిసే సామాజిక భావజాలాన్నే సంస్కృతి అంటారు. దీనిని మసిపూసి మారేడుకాయ చేయబూనడం పాలకులకి మొదటినుండీ అలవాటే. ఎందుకంటే అమెరికా ఆధ్వర్యం(1945)లో ఏర్పాటైన యునెస్కో ప్రారంభ సమావేశంలోనే ఒక అపశృతి ఎదురయ్యింది. సంస్కృతిని నిర్వచించాలంటే మేధావులకి పచ్చివెలక్కాయ గొంతులో పడింది. మింగాలేక కక్కాలేక ఆ మేధావులంతా కూడబలుక్కుని 'సంస్కృతి అంటే రాజకీయాలు మాత్రం కాదు' అని మాత్రమే చెప్పారు. ముఖ్యంగా రాజకీయాల నుంచి సంస్కృతికి ఉండే లంకెని తెంపెయ్యాలనేదే వీరి తాపత్రయం. ఆనాటి నుంచీ యునెస్కోని తన గుప్పెట్లో ఇరికించుకుని అమెరికా ఎలా తైతక్కలాడుతోందో మనకి తెలుసు.

సంస్కృతిని ఇంగ్లీషుభాషలో కల్చర్ అంటాం. కల్చర్ అనే మాట అగ్రికల్చర్ నుంచి వచ్చిందంటేనే దీని మూలం తెలుస్తుంది. జీవిత విధానానికి సంబంధించిందే కల్చర్. కాని ప్రజల భౌతిక జీవిత పునాదినుంచి సంస్కృతిని విడదీసి ప్రభువులు తమ దోపిడి కలకాలం కొనసాగించాలని కలలు కంటూ వుంటారు. ఆచరణ, అధ్యయనం, ఆసక్తి, పరిశీలన, విశ్లేషణ - ఇవి సంస్కృతికి దోహదం చేస్తాయి. కాని ఇవాళ వీటి స్థానంలో ముఖ్యంగా మనదేశంలో శుష్కవేదాంతం, ఆధ్యాత్మికత, అంధవిశ్వాసం, మతమౌఢ్యం పేరుకుపోతున్నాయి. వీటికి పరాకాష్ఠ బాబ్రీమసీదు కూల్చివేత (6 డిసెంబరు 1992). వీటి వికృతస్వరూపమే వినాయకవిగ్రహాల చేత పాలు తాగించడం (21 సెప్టెంబరు 1995). అచ్చంగా ఇది సంకరసంస్కృతి (మిత్ + మిషన్). ఈ రెండు మిత్‌లు ప్రచారం చేయడానికి మిషన్లనీ, సాంకేతిక పరిజ్ఞానాన్నీ పాలకులు అదేపనిగా వాడుకున్నారు. దీనికే కుటుంబరావుగారు సంకరసంస్కృతి అని ఏనాడో పేరు పెట్టారు. ఇదే ఈనాటి బూర్జువా శవసంస్కృతి. దీనికి విరుగుడు సజీవ శ్రామిక సంస్కృతి. దీన్ని వివరించేవే ఈ వ్యాసాలు

18 మార్చ్, 1999 సంపాదకులు

# ఇందులో ........

## I భూమిక



## II కళలు

## III సంగీతం



## IV నాటకం

# 1. బాధ్యతలు

ఒక వ్యక్తిగాని, సంఘంగాని, దేశంగాని అభివృద్ధి అవుతున్న కొద్దీ ఆ వ్యక్తి, సంఘ, దేశాల ప్రవర్తనకు కొంత విలువ కలగాలంటే బాధ్యతలెరిగి నడుచుకోవడం చాలా అవసరం ఈ విధంగా బాధ్యతలెరిగి నడుచుకోవడం దేశాలలో కన్నా సంఘాలలోనూ, అంతకన్నా వ్యక్తుల లోనూ కనబడుతున్నది కాని అంతటా సహజంగా జరిగేదేమిటంటే, సాధ్యమైనంత వరకు – పైన శాసించేవాడు లేనప్పుడు – బాధ్యతలను తోసేసి సంచరించటం, ఇది ఒక విధమైన దౌర్బల్యం. ఒక పసిపిల్లవాడి ప్రవర్తనకు మనమేమీ విలువ ఇవ్వదలవలేదు కనక వాడికి బాధ్యతలు లేకుండా చేస్తున్నాం. ఒక దేశం యొక్క ప్రవర్తనను శాసించే నాధుడులేక దేశాలు విచ్చలవిడిగా ప్రవర్తించ గలుగుతున్నై పిల్లవాణ్ణి పెంచడంలో వ్యవహారం ముదిరిపొయ్యేదాకా వాడి ప్రవర్తనకేమీ విలువ ఇవ్వక ఒక్కొక్కసారి నెగెటివ్ వాల్యూ కూడా ఇచ్చి ( పిల్ల లేది చెప్పినా అబద్ధమేననీ, పైన కనిపెట్టి ఉండనప్పుడల్లా వాళ్ళు చెయ్యరాని పనులు చేస్తారనీ అనుకోవటమే కాక పిల్లలకే తెలియ చెప్పటం కూడానూ!) – వాడినెత్తిన ఒక పెళ్ళాన్ని తోసి, అది కాపురానికి వచ్చిన ఏ సంవత్సరం లోపునో గర్భధారణ కానిపక్షంలో ఈ ముండాకొడుకును వావి కాని వాళ్ళదగ్గిర్నించీ వరసలాడి, అకస్మాత్తుగా ఒక దుర్ముహూర్తంలో ''చావు, ముండాకొడకా! ఎట్లా ఈదుతావో సంసారం ఈదు'', అని ఎవరిదారిన వారు చక్కాపోతే వాడు భ్రష్టుడై ఊరుకుంటాడు. ఇంటగెలవటమే వాడికి దుస్సాధ్యం చేసిపెట్టిన తరువాత వాడు రచ్చ గెలిచేదేమిటి? సంఘంలో ప్రతి వ్యక్తికీ ఇదే అనుభవమైతే, ఆ సంఘం సనాతన ధర్మాన్ని గురించి మాట్లాడక ఏం చేస్తుంది? ఇటువంటి సంఘాలతో నిండిన దేశం యొక్క రాజకీయాలు మరెవరో చేస్తున్నారంటే ఆశ్చర్యమేమిటి? రేపు మనదేశానికి స్వాతంత్ర్యం వచ్చినా మన మొహాలు చూసి రాదు. మన అర్హికాలు చూస్తున్న పరదేశవాసులే దాన్ని లక్షణంగా అందిపుచ్చుకుంటారు. అమెరికా స్వాతంత్ర్యం రెడ్ ఇండియనుల స్వాతంత్ర్యం అయిందా ఏమిటి? ఇక దేశాలు బాధ్యతలను మన్నించ నప్పుడు ఎందుకోచెప్పకుండా భయంకరమైన యుద్ధాలు చెయ్యటమూ, ఏ కొద్ది మందో కలిసి మిగిలిన దేశాన్ని పీల్చి పిప్పి చెయ్యటమూ, విప్లవాలు కలగటమూ, ప్రతి అయిదారేళ్ళకూ నాగరికతలు మొదటికి వస్తూండటమూ జరుగుతుంది ఈ యుగంలో బాధ్యత అనేది ఫాషనులో లేదు

అసలు మొదటికి వచ్చి విచారించినట్లయితే ఒక శిశువు ప్రపంచం మీద కళ్ళు తెరిచినప్పుడు ఆ శిశువుయొక్క రాకకు ఎవరూ పూచీ పడేవాళ్ళు లేరు. మన పూర్వ కర్మ ఫలంచేత మనం కలగటమూ నశించటమూ జరుగుతున్నదంటేనూ ఎవడి

క్షణను బాలకు వాడే బాధ్యుడంటేమో డిఫెన్ జస్టి స్ అవునేమో కాని, ఉదయం ప్రపంచానికి వర్తించేది కాదు. నా కర్మపరిపాకం కొద్దీ నేను వెళ్ళి ఎవడి జేబులో నుంచైనా కొంత సొమ్ము తస్కరిస్తే వాడు యూడో మనిషిని ( పోలీసును) దీన్లోకి లాక్కొస్తాడు కనక ఈ ప్రపంచానికి సంబంధించినంత వరకూ డిఫెన్ జస్టిస్ మెచ్చుకుదగినది. ఒకవేళ అది ఆమోదించుదామన్నా ఎవరు ఒప్పుకోరు. నేను పుట్టడం నా పూచీ మీదే కనక అదే పూచీమీద చచ్చి పోతానంటే ఒకవంక స్మృతులు ఘోషిల్లుతై, ఒక వెంప పోలీస్‌స్టేషన్‌కు నడిపిస్తాడు. కావాలంటే ఆత్మహత్య రహస్యంగా చేసుకోవచ్చుననుకోండి. అప్పుడది రంకుతనం మొదలైనవాటిల్లో చేరుతున్నది కాని సరైన పని కావటం లేదు. కనుక ఎవరి పుట్టుకకు వాడు బాధ్యుడు కాదని తేలి పోతున్నది.

ఇక తల్లి దండ్రులేమైనా కనే పిల్లలకు పూచీపడతారా? పడరు. ఒక వేళ పడదలచుకున్నా ఆ పూచీ ఎటువంటిదో తెలీదు. ఇక పిల్లలు వద్దో భగవంతుడా! అని మొత్తుకుంటూ ఏటేటా పిల్లలను కంటున్న దంపతులున్నారు – ఉన్న పిల్లలకు ఇంత గంజి పొయ్యలేకుండా, వాళ్ళను సంసారసుఖాన్నుంచి విరమించుమనటం క్రూరంగా ఉంటుంది. సంతాననిరోధం అవలంబించడానికి అటువంటిది ఉందని కూడా తెలీదు. తెలిస్తే అవలంబించడానికి తగిన దీక్ష ఉండదు. ఉన్నా ఒకవేళ అటువంటిది వేదసమ్మతం కాదేమో అనే అనుమానం!

ప్రపంచం యావత్తూ సంతాన నిరోధం అవలంబించడం మొదలు పెట్టిందనే అనుకుందాం. ఎవరు సంతాన నిరోధం అవలంబించాలి? ఎంతవరకూ అవలంబించాలి? ఈ సమస్యలు చప్పున తేలేవి కావు. యూజెనిక్స్‌శాస్త్రం ఉంది ఉండటానికి. అది చాలా అపరిపూర్ణంగా ఉంది. ''నీకు సిఫిలిస్ ఉంటే నీ పిల్లలు కూడా ఆ జాడ్యంతో బాధపడతారు కనక నువ్వు పిల్లలను కనవద్దు'' , అని మాత్రం చెబుతుంది యూజెనిక్స్, ఆ విధంగానే వంశంలో పిచ్చిగాని, మౌఢ్యం ( ఇంబెసిలిటీ) మొదలైనవిగాని ఉంటే ఆ వంశంలో అవి ఉంటూనే ఉంటై కనక ఆ వంశం అంతరించి పోవడం సంఘానికి క్షేమమని తెలుసుకోవచ్చును. ఈ యూజెనిక్స్ ఒక షా గాని, ఒక వెల్స్‌గాని, ఒక నెపోలియన్ కాని, ఒక గాంధీగానీ ఎక్కడ పుడతాడో చెప్పదు. వీళ్ళుపుట్టరు. దేశకాల పరిస్థితులను బట్టి అయిపోవటమే గాని అసైనా ఖండితంగా చెప్పగల శాస్త్రజ్ఞుడు లేడు. జ్యోతిషం ఒకటుంది. ఏ సంస్థకానీ పనిపెట్టుకుని ఆ జ్యోతిశాస్త్రం ఎంతవరకూ పరిపూర్ణంగా ఉందో శాస్త్రరీతిగా పరీక్షించలేదు. నమ్మితే నమ్మటం, మానితే మానటంగా ఉంది దాని అవస్థ. ఆ శాస్త్రమైనా మనిషిని తీసుకుని వీడికింత గొప్ప కొడుకు ( లేక కూతురు) పుట్టవచ్చును అని చెప్పదు.

దీని ఫలితమేమిటంటే ప్రపంచం ఒక విశాలమైన ధర్మ సత్రం కింద భావించ బడుతున్నది. ఇందులోకి వచ్చేవాళ్ళు వస్తుంటారు, పొయ్యేవాళ్ళు

పోలుంటారు ఎవరు వచ్చినా మిగతావాళ్ళూ, తానూ ఆగంతకుడికి చోటివ్వాలి ఈ ధర్మసత్రంలో బసచేసిన వారంతా రకాలవారీగా ఉన్నారు ఒక రకానికి తదితరులకు లేని హక్కులూ అవీ ఉన్నై వారిది ఉన్నత స్థానం వారెప్పుడు వారి ఇష్టంమీదనే ఇతరుల ఎల్లా బతకవలసిందీ ఆధారపడుతుంది ఈ అగ్రస్థానం ఒకప్పుడు మతప్రచారకుల వశంలో ఉండేది తరవాత యుద్ధం చేసి జయించగల బలశాలుల చేతుల్లో ఉండేది ఇప్పుడు వ్యాపారస్థులచేతుల్లో ఉంది త్వరలో సేవాపరాయణులచేతుల్లోకి పొయ్యే సూచనలు కనిపిస్తున్నై ఎవరు అగ్రస్థానంలో ఉన్నా ప్రతీ వ్యక్తీ తనయొక్క ఆహారనిద్రాదుల కోసం ఇంకోరు పూచీపడతారనుకోడానికి వీల్లేదు కావలిస్తే ప్రపంచం వ్యక్తిని తన ఇష్టం వచ్చినట్లు వాటిని సంపాదించుకోకుండా అరికడుతుంది అరికట్టటం వరకే దాని బాధ్యత నేటివరకూ విడవకుండా వచ్చిన నాగరికతలో ఇదొక చెప్పుకోతగ్గ లక్షణం సంఘం నిన్నెవరూ హత్య చెయ్యకుండా ఆపదు కావలిస్తే హంతకుణ్ణి పట్టుకోగలిగితే శిక్షిస్తుంది అంతవరకే బాధ్యత అగ్రస్థానం వారు ఏర్పాటు చేసిన రూల్సుకు భిన్నం కాకుండా ఈ ధర్మసత్రానికి ఉమ్మడిగా చెందిన ఆస్తిలో కొంత దొంగిలించగలిగి నట్టయితే నువ్వు సత్రానికి చేసిన ఉపకారానికి నిన్ను కష్టపడకుండా ఆహార నిద్రాదులు పొందనిస్తుంది. లేదా? అది ఎవరి పొరపాటైనా కానీ, నువ్వు ఆస్తిలేని వాడివై పుట్టావా, ఆ పొరపాటు యొక్క ఫలితం నువ్వనుభవించు, కూలిచెయ్యి, ఎంతముట్టితే అంత తీసుకో, చాలకపోతే చావు కాని అగ్రస్థానంలో ఒకప్పుడున్నవారు చేసినపనే, దేశాలింకా చేస్తున్న పనే, చేసి నీ బలం చేత ఎవడినైనా కొట్టి వాడి తాలూకు ద్రవ్యం అనుభవిస్తే సంఘం నిన్ను శిక్షించటం దాని బాధ్యత అయివున్నది ఈ సంఘం నన్ను పుట్టకుండానే చేసివుండరాదా అంటావా? అది ఈ సంఘంయొక్క నాగరికతకు అనుకూలమైన పని కాదు. ఇంత సంఘం లోనూ ఏ డజనుమందికి మెదడనేది ఉన్నా ఒక సంశయం తట్టి వుండును. తిండికీ, గుడ్డకూలేక మాడుతున్న వాళ్ళూ, ఇల్లువాకిళ్ళు లేక అల్లాడేవాళ్ళూ, బ్రహ్మచర్యవైధవ్యాలతో తపించేవాళ్ళూ ఈ సంఘానికి చెందినవాళ్ళేనా? అటువంటి వాళ్ళు సంఘంలో ఉన్నంతకాలమూ సంఘం నాగరికత గల దానల్లే నటించటానికి అధికారం ఉందా? అరణ్యమృగాలకు స్ట్రగుల్ ఫర్ ఎగ్జిస్టెన్స్ ఉన్నదంటే, ఆ జంతువుల స్ట్రగుల్‌ను ప్రతిఘటించి వాటి ప్రవర్తనను శాసించే నాగరికతా పరిస్థితులు లేవు. ఒక అరణ్యమృగం ప్రాణాలు అరచేతిలో పట్టుకుని ఆహారం సంపాదించుకోటానికేపనైనా చేస్తుంది ఒక్కొక్క జంతువు తన సంతానాన్ని తానే మింగుతుంది ఈ నాగరిక సంఘంలో అటువంటిది లేదే? ప్రతిరోజూ దొంగతనాలూ, హత్యలూ జరగవు ప్రతిరోజూ యుద్ధం రాదు అయినా పోలీసు డిపార్టుమెంటు కింద, సైన్యం కింద వల్లమాలిన ధనం వ్యయపరచబడుతున్నది. ప్రతిరోజూ ఆకలితో మాడుతున్నారు. పోలీసు డిపార్టుమెంటుయొక్క ఆవశ్యకత చాలాభాగం ఇట్లా

మాడుతున్న వాళ్ళ వల్లనే కలుగుతున్నది దమ్మిడీ ఖజానాకు రూపాయి కాపలా? ఇదెందుచేత? తిండిలేని వాళ్ళకు తిండి పెట్టే బాధ్యత ఎవరికీ అక్కర్లేదు

నేను చెప్పినట్టు బాధ్యత అనేది ఫాషనులో లేదు ''మనిషి ఇంత నీచమైన పనీ, ఇంతకన్నా ఎక్కువ నీచమైన పనులూ చెయ్యడూ!'' అని లోకం నమ్మగలగటం చూస్తే, ఆ మనిషి తన బాధ్యతలెంతవరకు గుర్తెరిగాడో తెలుస్తుంది అనేకమందిని చూపించి వీళ్ళు కాస్త కూస్త డబ్బుకు గడ్డి తినరు, అని చెప్పగలం ఈ మనిషి లక్షలకైనా సరే గడ్డి తినడు! అని చెప్పదగిన మనుషులు కూడా ఉన్నారు అటువంటివాళ్ళు సంఘానికెంతో అవసరం. ఎందుచేతంటే పొద్దస్తమానమూ ప్రతిమానవుడూ ప్రతిమానవుణ్ణీ బాధ్యతలేని, నమ్మదగని వాణ్ణిగా చూస్తూ ఉండడం అసంభవం. కాని సంఘ విషయం అంత గట్టిగా చెప్పలేం. దేశాల విషయం అడగక్కర్లేదు

ఇంత సనాతన ధర్మబుద్ధిగల ఈ సంఘం ఎంత నీచానికైనా ఒడిగట్టుతుంది సముద్రయానం చేసి వచ్చినవాళ్ళను బహిష్కరిస్తుంది. ఒక వేళ తనపనిమీదే ఎవరినైనా ఇంగ్లండు పంపించి (ఏ ప్రత్యేకరాష్ట్రం కావలిసో) తిరిగివచ్చిన తరువాత ప్రాయశ్చిత్తం చేస్తుంది చేజేతులా చేసిన పనికి ప్రాయశిత్తం! సంఘదౌర్జన్యానికి గురి కాకుండా ఒక స్త్రీ ఒంటరిగా ఉంటే దానికామనిషే పూచీ అనుకోగలం. పదేళ్ళ పిల్ల వితంతువైతే పదేళ్ళ పిల్లకు అనవసరంగా పెళ్ళి చేసినతను ఆ పిల్ల భావికష్టసుఖాల పూచీ పడకపోయినప్పటికీ ఆ అభాగిని తిరిగి పెళ్ళాడితే ఆ వివాహాన్ని ఖండిస్తాడు ఇందులో సంఘం చూపుతున్న ఇంటలెక్చువాలిటీ ఏమైనా ఉందా అంటే అదేమీ లేదు. కేవలం ఈ శాసించడం తన అభిరుచిని అనుసరించి మాత్రమే. వేదాధ్యయనం చెయ్యరూ? నిత్యాగ్నిహోత్రం చెయ్యరూ? నిజంగా బ్రాహ్మణ వర్ణం వాళ్ళు కారూ? ఫరవాలేదు! వివాహం 1 4 ఏళ్ళ పిల్లకు చేస్తారూ? అది తాటాకుగ్రంథాల్లో ఎక్కడుందో చూపండి? ఇది తెలివంటారా? అభిరుచా? తన అభిరుచులను వ్యక్తుల మీద పామే సంఘాని కెంత బాధ్యత ఉండవచ్చునో ఊహించండి.

*ఆంధ్రభూమి, మాసపత్రిక, జూలై 1 9 3 5*

# 2. ఎందుకో తెలుసా ?

నన్ను మా అమ్మ ఎందుకు కొట్టేదో తెలుసా? ఆవిడకు నా మీద ప్రేమ లేదనుకున్నావా? ఒకసారి నన్నావిడ కొడుతుంటే ఎవరో చూసి '' ఏమమ్మా నువ్వు పశువ్వా, గొడ్డువా? చిన్న పెధవను పట్టుకు అట్లా కొడతావు? '' అని అడిగారులే. నువ్వు కూడా ఆవిణ్ణి పశువని గాని గొడ్డని గాని అనుకున్నావా? పొరపాటు.

నన్ను కొట్టినప్పుడల్లా మా అమ్మ అంతరాత్మలో ఎంత బాధ పడేదో నీకుతెలుసా? పైకి మామూలు మొహం పెట్టి గుండెలో పెక్కి పెక్కి ఏడవొచ్చు తెలుసా? నీకు తెలీదు - తన కన్నకొడుకుని ఎవరూ చూడ[illegible]యంలో కూడా గట్టిగా కౌగిలించుకునే ధైర్యం లేకపోవడం ఎంత బాధాకరమో నీకు తెలుసా? నువ్వు నిద్రపోతున్నావనే నమ్మకంతో ఒక్కసారి ముద్దు పెట్టుకుందామని మొహం దగ్గరికి తెచ్చి, తీరా ఇంకో అంగుళంలో నీ చెంప ఉందనగా - ఆవిడ ఊపిరి నీ చెంపమీద తగిలి కూడా బిడియం కొద్దీ మొహం వెనక్కి తీసుకునే మనిషి అంతరాత్మ పంజరంలో పక్షిమాదిరిగా, ఎట్లా కొట్టుకుంటుందో నీకు తెలుసా?

నువ్వు ఏ చదువూ సంధ్యాలేని ఆడదానివై వుండి. సంఘంలో అమలులో వున్న ఆచారాలు హేయమైనవనే జ్ఞానం నీలో వుండి, వాటిని ప్రతిఘటించే సంస్కారం లేకపోతే ఏం చేస్తావు?

నీ కొడుకు తెలివిగలవాడనీ, తెలివికి తోడు సాహసం కూడా ఉంటే సమాజం ఆదరించని ప్రవర్తనలో పడతాడనీ భయం ఉంటే ఏం చేస్తావు?

నీ కొడుకును కొట్టకపోతే నీకు పిల్లల్ని పెంచే పద్ధతి చాతకాదనీ, నువ్వు పిల్లాణ్ణి పాడుచేస్తున్నావనీ నలుగురూ అంటారనే అభిమానం ఉంటే ఏం చేస్తావు?

నీ జీవితం మీద నీకు కాస్తయినా అధికారం లేదనుకో, ముప్పైయ్యేళ్ళ నీ జీవితంలో ఒక్క స్వల్ప విషయమైనా నీ కనుకూలంగా - నీకలలు నిజమైనట్టుగా, జరగలేదనుకో. నీలో కలలు కనే శక్తికూడా పూర్తిగా ఇంకి పోయిందనుకో, నీ కలలు మరొకరికి చెప్పుకోవటం కూడా సంఘద్రోహమేనని నీకు రూఢి అయిందనుకో ఏం చేస్తావో చెప్పగలవా? చెప్పలేవు. నీకు తెలీదు.

నీకు వస్తుతహ తెలివితేటలు లేకపోయినా, వాళ్ళూ వీళ్ళూ చదువుకుని చెప్పే మాటలు విన్నావు. వింటే ఏమయింది?

వేదాంతులు వేదాంతం చెప్పారు. కష్టసుఖాలు కర్మనుబట్టి కలుగుతాయన్నారు; ఇహం శాశ్వతం కాదు, పరమే చూసుకోమన్నారు; ద్వంద్వాలకు అతీతంగా ఉండమన్నారు. ఈ ప్రపంచం మొహం చూసి చెప్పూ - ఇది ఈ విశ్వాసాల మీదనే నడుస్తున్నదా?

నీతివేత్తలు నీతి చెబుతారు. పిపీలికాది బ్రహ్మపర్యంతమూ బ్రహ్మపదార్థమేననీ భేదాలు లేవనీ, అందర్నీ సమంగా చూడమనీ, అబద్ధాలాడవద్దనీ, ఒకరి సొమ్ముకు ఆశపడవద్దనీ, ఇంకొకరి కష్టాన్ని నీకష్టంగా చూడమనీ అంటారు. అట్లా ప్రవర్తించే వాళ్ళకి ఏది గతి?

డబ్బు తుచ్ఛమైనదని చెప్పటం ఎంత సులభం? డబ్బు లేకుండా ఒక్క పూట గడపటం ఎంతకష్టం? ఎన్నడైనా తిండికి మాడావా? నీకున్న శరీర కష్టమంతా మంచి నీళ్ళకింద పారపోసినా నీ అవసరాలు సహం కూడా తీరక పోతే ఎట్లా ఉంటుందో నీకు తెలుసా? వేలకు వేలు చేసుకునే వాళ్ళు లక్షలు చేసుకోవటానికి పడేపాట్లు గురించిన నిరసన ఎప్పుడైనా వెలిబుచ్చావా? తిండికి లేనివాళ్ళను గురించి ఎన్నడైనా ఒక్క మంచిమాట అన్నావా? దరిద్రపు జన్మ అంటే ఏమిటో నీకు తెలుసా? అందులో అడబతుకెట్లాంటిదో ఆలోచించావా? ఆలోచించేటందుకు నీకు తీరలేదు.

ఈ కష్ట జీవుల్ని గురించి నీకు ఆలోచించే శక్తి లేదు. నువ్వు చెప్పే నియమాలలో వాళ్ళని వుండమంటావు. నీ మాట వింటే వాళ్ళు బాగుబడే పూచీ ఇస్తావా? లేక వాళ్ళు నీ నీతి ప్రకారం నడిచి బాగుపడలేరనీ, వాళ్ళ ఇష్టం వచ్చిన నీతి వాళ్ళు అవలంబించుకుంటారనీ సమాధానపడి తొలగిపోతావా? ఏదీ చెయ్యవు. ఆర్చలేవు, తీర్చలేవు, చూస్తూ ఊరుకోలేవు.

నాకు తెలుసు, నీవన్నీ సదుద్దేశాలే, అందుచేత ఒకపని చెయ్యి, నువ్వు ప్రపంచాన్ని మార్చు. ఎట్లా మార్చుతావో నాకు తెలీదు! మా అమ్మలాంటి వాళ్ళు న్యాయమైన కలలు కనే అవకాశం కల్పించు. ప్రపంచం ఆవిడ వంటి మనుష్యుల సహజ ప్రేరణల కనుకూలంగా మారుతుందనే విశ్వాసం కల్గి... ...సుంటే ఆవిడ కర్దమయేటట్టు చెయ్యి. తన ప్రేమ ప్రకటించుకునే శక్తి ఆవిడ కియ్యి. సంఘాన్ని చూసి ఆవిడ బెదిరిపోకుండా చెయ్యి. జన్మ ఎత్తిన ఫలం మనోవాక్కాయలా ఉల్లాసం ప్రకటించటమేనని ఆవిడకి తెలియజెప్పు. ఆవిడికి, పాపం, జన్మ ఎత్తటం చేసిన పాపానికి శిక్ష అనుభవించడానికేననీ, అన్ని కోరికలూ చంపుకోటానికేననీ, తనకు నిలవనీడలేని సాంఘిక వ్యవస్థలో తన కాళ్ళ మీద తానే నిలబడాలి గాని గత్యంతరం లేదనీ, బతికి వుండడమే ఒక విషమపరీక్ష అనీ, అవసరాలు తగ్గించుకుని, ఇంకా తగ్గించుకుని, కాన్లూ అర్ధణాలూ రేపటి కోసం దాచుకోవటమే రేసేది లేకుండా పొయ్యేదాకా కార్యక్రమమనీ ఆవిడ అనుకుంటున్నది. ఇదంతా ఆవిడ పుస్తకాల్లో చదివింది కాదు - నీ వంటి వాళ్ళు రాసే పుస్తకాల్లో ఈ విషయాలెందుకుంటై? - అనుభవంవల్ల కట్టిన బొప్పెలద్వారా నేర్చుకుంది.

ఇదంతా మార్చటం ఎలాగో నీకు తెలుసా? నీకు తెలీదు; నేను చెబుతా పట్టు ..

*అభ్యుదయ, మాసపత్రిక ఫిబ్రవరి 1948*

# 3. సంస్కృతీ సమస్య

ఏ సమాజంలో అధిక సంఖ్యాకుల భౌతిక జీవితం హేయంగా ఉంటుందో, ఆ సంఘం లోని వ్యక్తులకు సంస్కారపు పలుపలు చాల నీరసించి ఉన్నవని కూడా మనం అనుకోవచ్చు. ఐతిహాసికులు చరిత్ర యొక్క మంచి చెడ్డలను వ్యక్తులకు అంటుగట్టడం ఆచారం. ఇది కేవలమూ పొరపాటు. హిట్లరును రాక్షసుడని తిట్టడం చాలా సులభం. హిట్లరు రాక్షసత్వాన్ని బలపర్చిన అసంఖ్యాక ప్రజల సంస్కారం మాటేమిటి?

మనుష్యులను పరిపాలించవలసింది సంస్కారం. కానీ సంస్కారం మానవ సమాజాన్ని పరిపాలించిన నిదర్శనం చరిత్రలో ఎక్కడా లేదు. ఎందరో ప్రవక్తలూ, ద్రష్టలూ, నీతివేత్తలూ, తాత్వికులూ, కవులు పుట్టి మన మానవ సంస్కారాన్ని పెంచారు. కాని మానవ జాతిని పరిపాలించినది కత్తి, పశుబలము, వ్యక్తి, వర్గస్వార్థాలు, మౌఢ్యమూను. సంస్కృతిని జీవితంలో వినియోగ పరచుకోవటానికి రాజకీయ ప్రతిబంధకాలు ఎప్పుడూ ఉంటూనే వచ్చాయి. ఏనాటికయినా జీవితాని కనుగుణ్యంగా సంస్కారమూ, సంస్కారానికనుగుణ్యంగా జీవితమూ మారుతూ వస్తే తప్ప, మానవ జీవితంలో మానవత్వం ప్రవేశించినట్లు భావించటానికి వీల్లేదు. ఇది సాధించడానికి ప్రయత్నం చెయ్యనివాళ్లు యథార్థమైన సంస్కారులు కారు. దేశాన్ని రక్షించుకోవాలనే ప్రేరణ కలిగించని దేశభక్తి, కళాపతనం గురించి ఉదాసీనంగా ఉండగల రసికత్వమూ, కుసంస్కారాన్ని అన్ని రంగాల్లోనూ ప్రతిఘటించని సంస్కారమూ యథార్థమైనవి కావు. దౌర్జన్యమూ, అన్యాయమూ, జాతి మత వైమనస్యాలూ అంతర్జాతీయ ప్రమాణాన పెరిగి పోతోంటే, సంస్కారులు ఏం చెయ్యగలరు? అనే ప్రశ్న వస్తుంది. ఈ ప్రశ్నకు సమాధానం చెప్పుకుంటే మనకు సంస్కారం, సంఘంలో నిర్వహించ వలసిన యథార్థమైన పాత్ర తెలుస్తుంది.

మన స్వాతంత్ర్యం ప్రజలకి దక్కి, జీవితం పెరగాలంటే మన శాస్త్రజ్ఞులూ, న్యాయవేత్తలూ, పండితులూ, కళాకారులు, సంస్కృతీ సమాజాలుగా ఏర్పడి, జీవితాన్ని సమగ్రంగా ఎప్పటికప్పుడు విమర్శించి ప్రజల్ని జాగృతం చేయాలి.

వీరేశలింగం గారు తన కాలంలో జాతి యొక్క సంస్కృతిని సంరక్షించి, పెంపొందించడానికి ఒంటిచేతి మీద శ్రమించారు. కానీ అన్నప్పుడల్లా వీరేశలింగంగారు పుట్టరు. ఈ పని సమాజం వల్ల కావలసింది. ఆంధ్రలో ఇటువంటి సమాజం నెలకొల్పడానికి పెద్దలు ముందుకు వచ్చి కృషి చేస్తారని నమ్ముతున్నాను.

*అనసూయ. మాసపత్రిక డిసెంబరు 1948, పునర్ముద్రణ కిన్నెర. మాసపత్రిక జనవరి. 1949*

# 4. శాస్త్ర దృష్టి: ప్రజా సంస్కృతి

వ్యక్తిగతమైన కోరికలూ, భావాలూ, ఆశయాలూ, వికారాలూ గల మానవులు సమాజం కింద కూడి ఉండాలంటే వారిని కూడగట్టేటందుకు కొన్ని శక్తులుండాలి తాత్విక, మత, రాజకీయ, కళాదిక సిద్ధాంతాల సామ్యం వల్ల ప్రజలు ఏకమవుతారు.

ఆదిమ సమాజాలు తాము చేసే నిత్యకర్మ వల్ల మాత్రమే ఐక్యత సాధించేవి. అటు తరువాత జాతి భావాలూ, సంప్రదాయాలూ, ఆచారాలూ, మతాలూ, జాతీయతా మొదలైనవి మనుష్యులను కూడగట్టాయి. మానవ చరిత్ర చూసి నట్టయితే ఇవన్నీ ప్రజల సామాజిక శక్తులనీ, వీటికోసం మనుష్యులు ఉత్సాహంతో ప్రాణాలను కూడా త్యాగం చేశారనీ, వీటిని అండగా పెట్టుకుని వీటి ప్రభావంతో గొప్ప సామాజికాభివృద్ధి సాధించారనీ మనకు తెలుస్తుంది. అయితే ఈ శక్తులతో ఉండే చిక్కేమంటే ఇవి ఒక దశలో సామాజికాభివృద్ధికి ఎంతగా తోడ్పడతాయో మరొక దానిలో అంతగా ప్రతిబంధకా లవుతాయి. అందుచేతనే కులాలను ఏకం చెయ్యటానికీ, మతాలను ఏకం చెయ్యటానికీ, పూర్వాచారాలను నిర్మూలించటానికీ, ఈ విధంగా సమాజాన్ని అభివృద్ధి చెయ్యటానికి కూడా బ్రహ్మాండమైన ఉద్యమాలు నడపవలసి వచ్చింది.

సమాజం ఒక పరిణామ దశనుండి మరొక పరిణామ దశకు మారేవిధానం విప్లవయుతమైనది. అంటే, ఆ మార్పు జరిగేకాలంలో సమాజాన్ని లోగడ ఆవహించి ఉండిన శక్తులకూ, నూతనంగా ఆవహించనున్న శక్తులకూ మధ్య బలాబలాలు తేలాలి. ఈ సంధికాలంలో సమాజంలోని వ్యక్తులు ఎంతగా శాస్త్ర దృష్టి కలవారై ఉంటే విప్లవం అంత సులభంగా విజయవంత మవుతుంది.

విప్లవం అనే మాట వింటే ఒక తరగతి శాంతి కాముకులకు వికారం కలుగుతుంది. దానికి కారణమేమంటే విప్లవం అశాంతికి బిడ్డ. శాంతి విప్లవానికి దారి తీయదు. సమాజాన్ని కూడగట్టే శక్తుల మధ్య సంఘర్షణలు ఆరంభమయినా, ఆ శక్తులు అభివృద్ధి సాధించటం మానేసి అభివృద్ధి నిరోధక పాత్ర నిర్వహించటం ఆరంభించినా అశాంతి చెలరేగుతుంది. ఈ అశాంతిని బలవంతాన అణచి శాంతి సాధించటంగాని, క్రమపరిణామం కావాలన్న సాకు చెప్పి సమాజాన్ని ముందుకు నడిపే శక్తులకు కళ్లాలు తగిలించి నిగ్రహించటం గాని చాలా పొరపాటు. విప్లవశక్తులను బలపరచటమే సత్వరశాంతికి మార్గం. సమాజంలో విప్లవశక్తులకు సత్వర పరిగణన లభించాలంటే శాస్త్ర దృష్టి అవసరం.

సామాన్యంగా శాస్త్ర దృష్టిలేని ప్రజలు తమకు పరిచితంగా ఉన్న భావాలనూ, విశ్వాసాలనూ సత్యంగా భావిస్తారు. అపరిచిత భావాలను అనుమానంతో చూస్తారు.

విప్లవం విజయం చేయటంలో ప్రముఖ పాత్ర నిర్వహించవలసిన ప్రజలు ఇల్లా ఉండగా, విప్లవశక్తులను అణచటానికి ప్రయత్నించేవారు తాము చేసే పనిని గురించి సూక్ష్మజ్ఞానం కలిగిన స్వార్థపరులై ఉంటారు. ప్రజలలో శాస్త్ర దృష్టి లోపించటం అభ్యుదయ నిరోధకులకు ఉపకరిస్తుంది. సినిమా ప్రేక్షకులలో అభిరుచి లోపించటం చిత్ర నిర్మాతకూ, యాత్రికుల మూఢభక్తి పూజార్లకూ ఎల్లా ఉపయోగిపడుతుందో మనం చూస్తూనే ఉన్నాం.

ప్రజలలో ఉండే సంస్కృతి వారి శాస్త్ర దృష్టికి గీటురాయి. జీవితాన్ని ముందుకు నడపటానికి ఉపయోగించే జ్ఞానమే సంస్కృతి. ఈ జ్ఞానం ప్రజలలో లేనప్పుడు వారు తమ జీవితాలలోని అశాంతికీ సంఘాన్ని అవేశించి ఉన్న శక్తులకూ గల సంబంధాలను చూడలేరు. అటువంటి ప్రజలలో గల శక్తులను అభ్యుదయ నిరోధకులు దుర్వినియోగపరచవచ్చు. ముస్లిములకు మతంలోగల మూఢ విశ్వాసాలను ఇస్లాం మతంలో ఏమీ విశ్వాసంలేని జిన్నా ఉపయోగించుకోగలిగాడు. హిందూ మతావేశ పరులు గాంధీని పొట్టన పెట్టుకున్నారు. శాస్త్ర దృష్టి లోపించట మనేది వెనకబడి ఉన్న దేశాలలోనే సాధ్యమనుకోనవసరం లేదు. హిట్లరు జర్మనీ ప్రజల అశాంతిని దుర్వినియోగ పరిచి జర్మనీ వినాశనం సాధించగలిగాడు.

మన దేశంలో ప్రజలకు శాస్త్ర పరిజ్ఞానం ఎంత ఉందో, శాస్త్ర దృష్టి కూడా అంతే ఉంది. ఈ పరిస్థితి మారితేనే గాని ఈ దేశం అభివృద్ధి కాదు. ఇటీవల మౌలానా అజాద్ మనకు జ్ఞాపకం చేసినట్టు, సహజ సంపద సమృద్ధిగాగల ఆఫ్రికా వంటి దేశాలలో ప్రజలు అజ్ఞానవంతులై దాస్యంలో ఉంటే జ్ఞానంగల ప్రజలు సైబీరియా వంటి ఎడారులను సయితం తోటగా మార్చేస్తున్నారు.

కాని ప్రస్తుతం మనదేశంలో ప్రభుత్వం అవలంబించే పద్ధతులు చూస్తే ముందుగా ప్రభుత్వం శాస్త్రదృష్టి అవలంబించాలనేది స్పష్ట మవుతుంది. రెండవ ప్రపంచయుద్ధానంతరం మన దేశంలోనే కాక ప్రపంచమంతటా చెలరేగిన అశాంతికి కారణాలేవో, ఏ ప్రజల శక్తుల సంఘర్షణ ఫలితంగా ప్రపంచం రెండు పక్షాలుగా చీలిపోయిందో, రెండు పక్షాలకూ చెందిన ప్రజల జీవితాలలో ఎటువంటి పరిణామాలు కలిగిస్తున్నాయో మన ప్రభుత్వం తెలుసుకోవాలి.

దేశంలో జరగవలసిన విప్లవ పరిణామాలను గురించి మన నాయకులకు కొన్ని అభిప్రాయాలు లేకపోలేదు. కాని ఈ పరిణామాలను సాధించటానికి ప్రభుత్వానికి అన్నీ అడ్డాలే కనిపిస్తున్నాయి. అవాంతరాలు మాత్రమే చూడగలిగే ప్రభుత్వం అభ్యుదయం సాధించలేదు. అభ్యుదయానికి రహదారి లేదు. అడ్డంకులను జయిస్తూ పోతే గాని అభ్యుదయం రాదు. ఈ ప్రభుత్వం సాంఘిక శక్తుల సంఘర్షణను సూటిగా ఎదుర్కోవటం లేదు. ప్రజల విప్లవ శక్తులను నిగ్రహించటానికి

ప్రయత్నిస్తూ అయోమయమైన ఆదర్శాలకు సాకుగా ఉపయోగిస్తున్నది ప్రత్యక్షంగా ధనిక వర్గాలకూ, ప్రజలకూ మధ్య జరిగే సంఘర్షణ విషయంలో నిర్మొహమాటంగా ధనికులను బలపరిచి ప్రజలను తొక్కి పెడుతున్నది ప్రజా క్షేమం కోసం ప్రభుత్వం చేసే ప్రయత్నాలకు ధనికవర్గం వారు బహిరంగంగా గోతులు తవ్వుతున్నా వారిని ప్రభుత్వం క్షమిస్తున్నది మరొక వంక ప్రజలలో పలుకుబడి గల వారిని, తమ విధానాలను ఆమోదించనివారిని, ప్రభుత్వం వారు వేటాడుతున్నారు

ప్రజల విద్యా, ఆరోగ్యమూ, ప్రజోపయోగాలైన స్కీములూ వాయిదా వేసి దేశరక్షణ కోసం ప్రభుత్వ ఆదాయంలో సగం ఖర్చు చేస్తున్నది ప్రజాక్షేమానికీ, దేశక్షేమానికీ వైరుధ్యం ఎందుకు రావలసి వచ్చిందో ఆలోచించగల స్థితిలో లేదు ప్రభుత్వం

తెలుగు స్వతంత్ర 13-1-1950

## 5. రేడియోల ఉపయోగం

ఈ కాలానికి జనబాహుళ్యానికి ప్రపంచజ్ఞానం ప్రసాదించగలవి సినిమా, రేడియో పూర్వం నిరక్షరులు కూడా విశ్రాంతి సమయాలలో పెద్దల సంభాషణ వినిచాలా విషయాలు తెలుసుకునేవారు చిన్నతనం నుంచీ ఏదో ఒక కులవృత్తిలో శిక్షణ పొందే సామాన్య జనులకు అక్షరాస్యత అంతగా అవసరమై ఉండేది కాదు కాని కొంత సంస్కారమూ, ప్రపంచ జ్ఞానమూ అందరికీ అవసరంగానే ఉండేది తెల్సిన వారి ద్వారా ఈ రెంటినీ సంపాదించటానికి తగిన అవకాశాలు ఆనాటి జీవితంలో కొన్ని ఏర్పాటై వుండేవి. తెల్సుకోవాలన్న అభిలాషగలవారు ఆ అవకాశాలన్నీ వినియోగ పరుచుకునే వారు

పాశ్చాత్యుల ఏలుబడిలో పరిస్థితులు తారుమారయాక సంస్కృతి అన్నది ఛిన్నాభిన్నమై ఒకరి భాష ఒకరిది కాకుండా, ఒకరి సంస్కృతి ఇంకొకరికి అందకుండా పోవటం జరిగింది. జీవిత విధానాలలో నిరక్షరులకూ అక్షరాస్యులకూ, ధనికులకూ, పేదలకూ, పల్లెలకూ, పట్టణాలకూ మధ్య అగాధాలు ఏర్పడ్డాయి.

ఈ పరిస్థితిని సరిచెయ్యగలిగిన ఆధునిక పరికరాలు నిస్సందేహంగా సినిమాలు, రేడియోలు ఇవి ఒకే విషయాన్ని, ఒకేభాషలో జనసామాన్యానికంతకూ చెప్పగలవు పదే పదే జనానికి జ్ఞాపకం చేయవలసిన జీవిత సత్యాలుంటాయి. జీవితంలో ఏర్పడే కొత్త మలుపులను విశదీకరించటానికి మేధావులు వివరించ దగిన విశేషాలుంటాయి వీటిని ప్రజల ఎదుట పెట్టటానికి సినిమాలకన్నా రేడియోకన్నా మంచి సాధనాలను మనం వూహించలేం మనకు స్వాతంత్ర్యం రాకముందు నుంచి ఇవి వున్నాయి కాని కనీసం స్వాతంత్ర్యానంతరం ఈ రెంటినీ మనం సరిగా ఉపయోగించుకోలేకపోతే అందుకు ఎవరిని గాని ఏమీ అనటానికి లేదు

రేడియోను అప్పుంగా ప్రభుత్వం నిర్వహిస్తున్నది సినిమాలు చాలా హెచ్చుభాగం పెట్టుబడిదార్ల అదీనంలో ఉన్నాయి చిత్రాలను సెన్సారు చెయ్యటమూ వార్తా చిత్రాలను డాక్యుమెంటరీ చిత్రాలను తయారు చెయ్యటమూ, విదేశ మంచి చిత్రాలను ఎంపి బహూకరించటమూ వరకే ప్రభుత్వం సినిమారంగంలో జోక్యం కలిగించుకుంటున్నది

రేడియోలో పేరుకు వివిధ కార్యక్రమాలున్నమాట నిజమే కాని ఇవి జనానికి ఎంతవరకు ఉపయుక్తంగా వున్నాయనేది చాలావరకు అనుమానాస్పదం. పిల్లల కార్యక్రమంలో చాలా వరకు కాలం వృధా చెయ్యటంగానే ఉంటుంది కొందరు పిల్లలు - ఆడా, మగా రేడియోస్టేషన్‌కి వచ్చి, తమకు వచ్చిన పద్యాలు చదవటమో, పిట్టకథలు చెప్పటమో చేస్తారు వీటిలో ప్రత్యేకత దాదాపు ఏమీ ఉండదు వాళ్ళ పేర్లు రేడియోలో చెబితే వాళ్ళ పెద్దలు సంతోషిస్తారు పిల్లలలో ప్రత్యేక ప్రతిభలు కలవారుంటే వారిని రేడియో ద్వారా పరిచయం చేయవచ్చు ముఖ్యంగా పిల్లల వాఙ్మయం విశేషంగా పెరుగుతున్న ఈ రోజులలో పిల్లలకు శాస్త్రజ్ఞాన శక్తి ఈ కార్యక్రమాల ద్వారా కలిగించవచ్చు ఒక్క ఏడాదిపాటు పిల్లల కార్యక్రమాలను శాస్త్రీయంగా నిర్వహిస్తే చిన్న పిల్లలకు భూమి పుట్టుకా, గ్రహాల ఏర్పాటూ, ఆకాశయానమూ, ప్రాణుల పరిణామమూ, వాతావరణమూ, విమానాలూ, టెలిఫోను, టెలిగ్రాఫ్, రేడియో, టెలివిజన్, అణుశక్తి, విద్యుచ్ఛక్తి మొదలైన ఎన్నో విషయాలను గురించి ప్రాథమిక జ్ఞానం ఏర్పడి, ఆయా విషయాలందు ఆసక్తి కూడా కలిగేలాగుచేయవచ్చు. పిల్లల ప్రోగ్రాములు, వాళ్ళచేత వేయించిన నాటకాలూ, అవి రాసే తీరూ చూస్తే పిల్లల తెలివితేటలను గురించి కార్యక్రమ నిర్వాహకులకు చాలా తక్కువ అభిప్రాయం ఉన్నట్టు కనిపిస్తుంది పిల్లల కార్యక్రమాలు వినే పిల్లలు అవతల పెద్దవాళ్ళ నాటకాలు వింటారనీ, ప్రఖ్యాత నటులు నటించిన సినిమా చిత్రాలు చూస్తారనీ రేడియో నిర్వాహకులకు తెలియటం అత్యవసరం

స్త్రీల కార్యక్రమాలు కూడా స్త్రీలకు నిజంగా వుపకరించేవిగా వుండటం లేదు స్త్రీల మానసిక దృక్పథాన్ని పెంచలేక పోయినట్టయితే ఈ కార్యక్రమాలు నిరుపయోగమనక తప్పదు ఈ కార్యక్రమాలు శ్రద్ధగా వినే స్త్రీలకూ, వినని స్త్రీలకూ ప్రవర్తనలోనూ, ప్రపంచ జ్ఞానంలోనూ తేడా కనిపించినప్పుడే ఈ కార్యక్రమాలు సఫలమైనాయనుకోవాలి ఈ తేడా వాస్తవమైనది మంచి సాహిత్యం చదివే వాడికీ, చదవని వాడికీ గల తేడా మనం స్పష్టంగా తెలుసుకుంటాం పిల్లల కార్యక్రమాలూ, స్త్రీల కార్యక్రమాలూ కూడా అటువంటి పరీక్ష నిలబడాలి

గ్రామస్తుల కార్యక్రమాలను గురించి నాకు విశేషం తెలియదుగాని వాటిని గురించి చప్పరించిన వారున్నారు ఈకార్యక్రమాలను నడిపేవారికి తాము చెప్పే విషయాలను గురించి ప్రత్యక్షానుభవం ఏమీ లేదన్న విమర్శకూడా వినవచ్చింది

మిగతా కార్యక్రమాలు హెచ్చుగా సాహిత్యానికీ, సంగీతానికీ, రాజకీయాలకు సంబంధించి వుంటాయి ఇవి కూడా జనసామాన్యానికి అందుబాటులో వుండవచ్చు కాని వుంటున్నట్టు కనబడదు నా అనుభవంలోకి వచ్చినంత వరకు సాహిత్యాన్ని గురించి చర్చించటానికీ, ప్రసంగించటానికీ నిర్ణయించే అంశాలు అల్పంగా వుండటమో, అవాస్తవంగా ఉండటమో జరుగుతున్నది చర్చించే విషయం వీలయినంత విశాలంగా చర్చించటానికి అవకాశం వుంటే వినేవారికి కొంత ఉపయోగం వుంటుంది. ఉదాహరణకు, నేను కథలు ఎలా వ్రాస్తాను? అన్నది అంత ఉపయోగకరమైన అంశం కాదు కథలు ఎందుకు? అంటే కొంత ప్రయోజనం వుండవచ్చు, ముగ్గురు నలుగురు మాట్లాడి నట్లయితే మూడు నాలుగు రకాల కథా ప్రయోజనాలు వ్యక్తమవుతాయి

రేడియో కార్యక్రమాలు నిర్ణయించే ప్రభుత్వోద్యోగులను ఏ అర్హతలను బట్టి నిర్ణయిస్తారో ఆ అర్హతలకూ వారి విధులకూ పొంతన లేకపోవచ్చు. రేడియోలు ప్రారంభమైన కొత్తలో ప్రోగ్రాములు చేసే వారు కొద్ది మందే ఉండినప్పటికీ వారికి హెచ్చు స్వేచ్ఛ ఉండినట్టు కనిపిస్తుంది వారు రేడియో కీర్తి ప్రతిష్ఠలకు తామే బాధ్యత వహించి రకరకాల ప్రతిభలు గల వారిని రేడియో వద్దకు చేర్చి, రేడియో ప్రసంగాలకూ సంగీతానికీ, నాటకాలకూ, తదితర కార్యక్రమాలకూ మంచి పునాది కలిగించారు ఏ కారణం చేతనో వారి స్వాతంత్ర్యం అడుగంటినట్టు కనిపిస్తుంది. డజన్లకొద్దీ కొత్త అధికారులు నియమించబడ్డారు. రేడియోకూ, తాలూకా కచేరీలకూ దాదాపు తేడా లేకుండా పోయింది. స్టాఫ్‌కు పని మూడింతలయింది కార్యక్రమాలలో చైతన్యం మూడో వంతుకు దిగిపోయింది.

అన్నిటికన్నశోచనీయం - దేశాన్ని ఏకం చేయవలసిన రేడియో భాషా ద్వేషానికో, ప్రాంతీయ దురహంకారానికో కూడా ఆటపట్టయినట్టు కనిపిస్తుంది. ప్రాడిజీ అయిన ఒక తెలుగు గాయకుణ్ణి ఒక దక్షిణ దేశపు రేడియో కేంద్రంనుంచి వ్యంగ్యంగా నిందించారు. ప్రసిద్ధ తెలుగు గాయకుల రేడియో కార్యక్రమాలు మద్రాసు కేంద్రం నుంచి రిలే కావటం లేదని తెలుస్తున్నది (వారు మద్రాసు వచ్చి పాట కచేరీలు చేస్తూనే వున్నారు )

ఈ సంకుచిత తత్వాలకు కేంద్ర ప్రభుత్వం కారణభూతం అనుకోవటానికి అవకాశం లేదు కాని కేంద్రం కొంచెం శ్రద్ధ బూనితే ఇది జరగకపోను.

మాజీ మంత్రి కేస్కర్‌గారు రేడియోల నిర్వహణలో ఆయ ఉపజ్ఞను ఎంతైనా ప్రదర్శించయత్నించారు పై మార్పులు చాలా వచ్చాయి. కాని ప్రజలకు ప్రపంచ జ్ఞానం అందించి, వారి మనోవీధులను విశాల పరచటానికి ఆయన ఉపజ్ఞలు అంతగా

ఉపకరించినట్టు కనబడదు ఆయన హయాంలో ప్రాముఖ్యానికి వచ్చిన జాతీయ కార్యక్రమాలు, ఇతర విషయాలలో కాకపోయినా, సంగీతం విషయంలో చాలా మంచి పని చేశాయనక తప్పదు

*విశాలాంధ్ర దినపత్రిక 6-5-62*

# 6. కళలు - యువకులు

శాస్త్రజ్ఞానం అందరికీ ఒకేవిధంగా ఉంటుంది మన అభిరుచులతో గాని, సాంఘిక స్థాయితో గాని దానికి సంబంధం లేదు. అది అందరికీ ఒకేరకంగా అర్థమవుతుంది - మొదలు కావటమంటూ ఉంటే

లలిత కళలు అలా కాదు. కొందరికి కొన్ని రకాల కథలూ, నవలలూ, పద్యాలూ, నాటకాలూ బోర్ కొడతాయి అవే మరికొందరికి చాలా ఆనందం చేకూర్చుతాయి వాటిని గురించి భిన్నాభిప్రాయాలకు అవకాశం ఉన్నది

కళలకూ శాస్త్రానికీ ఈ తేడా ఉండబట్టే ఈ రెండిటీ పురోగమనమూ ఒకే విధంగా ఉండదు నాగరిక జీవితం గడుపుతూ, రేడియోలు తయారు చేసుకోవడమూ, ట్రాన్స్‌మిటర్లను పనిచేయించటమూ, కార్లను మరమ్మతు చెయ్యటమూ బాగా తెలిసిన కుర్రకారు జాస్తిగాగల - అమెరికా దేశంలాటి దేశంలో ప్రజలలో వ్యాప్తి హెచ్చుగా గల కళలు చౌకబారుగా ఉండటమనేది సాధ్యం సాంకేతిక ప్రావీణ్యం బాగా పెంపొందుతున్న రష్యాలో కూడా ఈనాడు కళలను గురించి కొంత అసంతృప్తి వ్యాపించి ఉన్నట్టు మనం వింటున్నాం

శాస్త్ర జ్ఞానం ఎన్నడూ తరగదు. అది ఒకప్పుడు వేగంగా అభివృద్ధి కావచ్చు. మరొకప్పుడు మందంగా ముందుకు సాగవచ్చు - కాని దానికి తరుగూ విరుగూ ఉండదు. కళలు ఒకప్పుడు ఉచ్ఛస్థితిలో ఉంటాయి. మరొకప్పుడు హీనస్థితికి దిగజారిపోయి, మీ ఉత్తమ సాహిత్యం ఏదని ఎవరయినా అడిగితే వెనక్కు చూసుకుని సమాధానం చెప్పవలసి వస్తుంది

కళల ద్వారా నిజమైన ఉత్తేజం పొందినా, వాటి సత్ఫలితాలను తమ ఆలోచనల లోనూ, ప్రవర్తనలోనూ ప్రతిబింబించినా - యువకులే చెయ్యాలని నా దృఢనమ్మకం, కలుపు మొక్కలు పెరుగని సుక్షేత్రమైన భూములు యువకుల మనస్సులు. వాటిలో పడిన మంచి బీజాలు మంచి పంట నిస్తాయి

కళాభిలాష జ్ఞానపిపాసకన్న అలవరుచుకొనేటందుకు చాలా కష్టమైనది. చాలా మంది దీనికి విరుద్ధంగా భావిస్తారని నాకు తెలుసు కాని అది భ్రమ. ఆకాశయానాలను

గురించో, గ్రహాలను గురించో, ప్రాణి పరిణామం గురించో అర్థమయ్యే పుస్తకం రాస్తే దాన్ని ఎవరైనా చదువవచ్చు. అందులోని విషయం గ్రహించవచ్చు. ఒక కాళిదాసు కావ్యాన్ని గాని, శ్రీ శ్రీ గేయాన్ని గాని, కన్యాశుల్కం నాటకాన్ని గాని చదవటానికి ఎవరైనా ఎక్కువ ఉబలాటం ప్రదర్శించవచ్చునేమో గాని, వాటిని చదివినవాళ్ళందరూ సమగ్రమైన కావ్యానందాన్ని పొందుతారనేది అనుమానాస్పదం.

అందుకే సాహిత్యం వెంట విమర్శ అనే ఉపాంగం ఏర్పాటై ఉన్నది. సామాన్యంగా చెప్పుకోదగిన ఏ కళాఖండాన్నయినా రసపిపాసి కనీసం రెండు సార్లు పరిస్తాడు. ఒకసారి పఠించి, దాన్ని గురించి సరి అయిన విమర్శ చదివి మళ్ళా పఠించినప్పుడు మరింత ఆనందం పొందుతాడు. షేక్స్పియర్, కాళిదాసు, భాసుడు మొదలైన నాటకకర్తల రచనలను విమర్శకుల సహాయంతో చదివేవాడు అనేకసార్లు చదివి ఆనందం పొందవచ్చు.

కళాపిపాసిగా పరిణామం పొందుతున్న ప్రతివాడూ విమర్శకుడుగా కూడా పరిణామం పొందుతున్నాడని వేరే చెప్పనవసరం లేదు. విమర్శనాశక్తిని పెంచని కళానురక్తి పిప్పి నమలటం కన్న ఎక్కువ ప్రక్రియ కాదు.

ఆమాట ఈనాటి యువకులకు స్పష్టంగా చెప్పటం అవసరమని నాకు తోస్తున్నది. ఒకటి రెండు తరాల క్రితం ప్రజలకు అందుబాటులో కళలుండేవి కావు. అత్యల్ప సంఖ్యాకులు వాటిపట్ల శ్రద్ధాసక్తులు చూపేవారు. సాధారణంగా వారి కళాభిలాష వెంట అంతో ఇంతో విమర్శనాదృష్టి ఉండేది.

ఈనాడు పత్రికల మూలంగానూ, సినిమాల మూలంగానూ అంతులేని సాహిత్యం ప్రజలను ఆకర్షిస్తున్నది. దేశంలో అక్షరాస్యత పెరగటమూ, స్వాతంత్ర్యం వచ్చి అంతర్జాతీయంగా మన దేశానికి కూడా కొంత యశస్సు లభించటమూ ప్రజలలో చైతన్యాన్ని పెంపొందించి ఉత్సాహాన్ని రేకెత్తించాయి.

అయితే ప్రజలలో పఠనావ్యాసంగం పెరిగిన ప్రమాణంలో విమర్శనాదృష్టి పెరగకపోవటం శోచనీయం. దీనికోసమై ప్రత్యేకంగా పోలింగ్ జరపనవసరం లేదు. పత్రికలలోనూ, సినిమాలలోనూ వచ్చే చచ్చు సాహిత్యమే దీనికి ప్రబలతార్కాణం. ఈ సరుకులు చాలా భాగం గడిచిన క్షణాల్లాగా స్మృతిపథంనుంచి తేలికగా దాటిపోతున్నాయి.

ఇన్ని సినిమాలను ఇన్నేసి లక్షలమంది చూస్తున్నారు. ఇన్నేసిలక్షల కాపీలు వారం వారమూ అమ్ముడవుతున్నాయి. రేడియోలలో ఇన్నిన్ని నాటకాలూ, ప్రసంగాలూ జరుగుతున్నాయి, ఇందులో ఎన్నిటిని గురించి ఎక్కువ మంది మరిచిపోలేకుండా మళ్ళీమళ్ళీ చెప్పుకుంటున్నారు? ఇది సరి అయిన గీటురాయి కాదనుకోవద్దు. మాలపిల్ల గాని రైతుబిడ్డ గాని సాంకేతికంగా గొప్ప చిత్రాలు కావు – కాని వాటిని ఆనాడు

మానసమాత్రం రచయితలకా ఎందుకు చెప్పుకుంటున్నారనేది అందరూ ఆలోచించవలసిన విషయం

కొందరికి అంతే ఓపిక సమయాలు ఉండవు షేక్స్పియర్ యీనాడు ఆ తోట్లో వాళ్ళకు సరిపోయే భావాలన్నీ తన నాటకాలలో పెట్టాడని బెర్నార్డ్‌షా ఒప్పుకున్నాడు మన ఆధునిక సాహిత్యంలో యీనాడేళ్ళపాటు నిలవగలిగిన భావాలు గలది ఎంత ఉన్నదని ప్రశ్నించుకోనటం తప్పుకాదు

అంతక్షణికమైన ఆనందంకోసం లేదా ఒక్క గంటో రెండు గంటలో ఎలా గడపటమా అన్న సమస్య పరిష్కరించుకునేటందుకు కళానుభూతి అన్వేషించేవాళ్ళు కళల్లో చెత్తను ప్రోత్సాహించే వాళ్ళవుతున్నారు ముఖ్యంగా యువకుల్లో ఈ ధోరణి ఉండటం జాతి నిర్వీర్యతకు తప్పక దారితీస్తుంది కళానుభూతి అనేదాన్ని పెద్ద పనిగా చేస్తున్నానని నామీద ఆగ్రహించ వద్దు. కళానుభూతి అన్నది సరిగా పొందదలిస్తే అది అంతో ఇంతో శ్రమతో కూడిన పనే ఆ శ్రమకు ఫలితమే కావ్యానందం ఒకటి రెండు అమ్మాయి - అబ్బాయి కథలు చదివో, సినిమాలు చూసో పొందేది కావ్యానందం కాదు

ప్రతి యువకుడూ తన విమర్శనా దృష్టిని తానే పెంపొందించుకోవాలని ఎవరూ అనలేరు. యువకులకు కళాప్రవేశం కలిగించటానికి మంచి విమర్శ సహాయ భూతంగా వుండాలి అది కూడా ఈనాడు లోపించింది. విమర్శకులకు ఏ ప్రమాణాలున్నాయో, అసలు ప్రమాణాలంటూ ఉన్నాయో లేదో కూడా తెలుసుకోవడానికి వీలులేనంత అయోమయమైన విమర్శలు వెలువడుతున్నాయి ఉన్న విమర్శలేచాలా కొద్ది వాటిలో పొగడటమో, తెగడటమో ఉంటుంది తప్పకళాకారుడి సాంఘిక దృష్టినీ, పనితనాన్నీ, ప్రతిభను సరిగా అంచనాకట్టటానికి చేసే ప్రయత్నం కనిపించదు.

విమర్శ కొంత వరకు కళను పోలీ, కొంత వరకు శాస్త్రాన్ని పోలీ వుంటుంది మంచి సాహిత్యం లాగే మంచి విమర్శకూడా మనోవికాసాన్నిస్తుంది. మనోజ్ఞానాన్ని పెంచుతుంది కూడా ఇంగ్లండు నుంచి వెలువడే న్యూస్టేట్స్‌మెన్ ప్రతిక చాలా కాలంపాటు - ఒకటి రెండు దశాబ్దులు - రాజకీయ వ్యాసాలకుగాక పుస్తక సమీక్షలకు పేరు మోసిందట!

సరి అయిన విమర్శలకు కొంత సంప్రదాయమూ, కొంత కాలజ్ఞత వుండాలి. పత్రికలలో సరయిన విమర్శలు లోపించినంత మాత్రాన విమర్శకులు లోపించారనుకోరాదు కథలూ నవలలూ రాసే వారికి ముట్టినట్టే విమర్శకులకు కూడా తృణమో పణమో ఇవ్వటం పత్రికలకు పరిపాటి అయే దాకా మంచి విమర్శలు పాఠకులకు అందే అవకాశం లేదు

అందుచేత రచయితలు సాహిత్యంలో పడక మెప్పునాప్పుల్లో పత్రికలు చదివేటయినా, సినిమాలు చూడటయినా చాలా మంచిది సరి అయిన కళా పిపాసకు మంచి ప్రణాళిక సరి అయిన సాంఘిక దృక్పథమూ మిగిలిపోతున్న ఉపరితల గురించి విస్పష్టమైన అభిప్రాయాలు కలవాళ్ళు కళలు గురించి అస్పష్టమైన ఆలంబిచటం

యువకులలో ఒకరకమైన అభిరుచే, ఒకరకమైన సాంఘిక భావాలే ఉండాలని నేను వాదించను - అది మరొక రకమైన విషయం అయిపోయింది కాని అభ్యుదయాభిలాషులకు ఒక హెచ్చరిక చేస్తాను సంఘ సంక్షేమానికీ, పురోగమనానికీ విరుద్ధమైన భావాలు కలవారు కళల విషయంలో మెలుకువగానే ఉండటం గమనించండి మతావేశాలను రెచ్చగొట్టేవారూ, పెత్తందారీ పద్ధతుల పలాయనీ వాంఛించేవారూ, స్వలాభపరులూ తమకు అనుకూలంగా వుండే కళలపట్ల సాధ్యమైనంత దుష్ప్రచారం చేస్తూనే ఉన్నారు అందుచేత అభ్యుదయ భావాలుగల యువకులు అభ్యుదయ రహితమైన కళలపట్ల హెచ్చరిక ప్రదర్శించటం అవసరం

శాస్త్ర జ్ఞానం వెనక వ్యక్తులున్నమాట నిజమేగాని ఆ జ్ఞానాన్ని సంపాదించటానికి ఆ వ్యక్తులను గురించి మనకు తెలియనవసరం లేదు ప్రపంచానికి పారిశ్రామిక విద్యుత్తు ప్రసాదించిన ఫారడే ఒకప్పుడు పుస్తకాలు బైండు చేసేవాడనీ, భౌతిక శాస్త్రంలో సాపేక్ష సిద్ధాంతాన్ని ప్రతిపాదించిన ఐన్‌స్టయిన్ తీరికవేళల్లో స్త్రీల దుస్తులకు డిజైన్లు చేసేవాడనీ తెలియటం వల్ల మన విజ్ఞానం పెరగదు

కాని కళల వెనక వుండే వ్యక్తులు అట్లాకాదు వాళ్ళను కదిలించిన భావాలే మనని కదిలిస్తాయి కొందరు ప్రముఖ రచయితల రచనలన్నీ చదివిన వారికి రచయిత యొక్క సాంఘిక, నైతిక, ఆధ్యాత్మిక రూపం కళ్ళకు కట్టినట్టవుతుంది. ఒక గొప్పవాడి స్నేహ సాన్నిధ్యాల ప్రభావం మన జీవితాలపై ఉన్నంతగా ఒక గొప్ప కళాకారుడి రచనల ప్రభావం కూడా మన పై ఉంటుంది ఈ ప్రభావం వాంఛనీయమైనది

మనని అణుమాత్రం కూడా పైకిలాగలేని కళలు హీనమైనకళలు వాటి సంపర్కం మనని కుంగదీస్తుందేమోనని మనం భయపడవలసిన అవసరం కూడా వుంది

*తెలుగు విద్యార్థి, మాసపత్రిక జూలై, 1963*

# 7. మద్రాసులో తెలుగు సంస్కృతి

యుద్ధానికి పూర్వం రోజులలో కొందరు మేధావులు, తెలుగు సంస్కృతికి మద్రాసు ఎన్నటికీ కేంద్రం కాలేదు అనేవారు. ఆ రోజుల్లో ఆ మాట వాస్తవమే అనిపించేది. ఎందుకంటే, మద్రాసులో అనేక తెలుగు సంస్థలున్నప్పటికీ, మద్రాసు నుంచి ప్రముఖ తెలుగు వార్తా పత్రికలు వెలువడుతూ ఉండినప్పటికీ, కళాకారులు అత్యధిక సంఖ్యలో తెలుగు గడ్డపైనే ఉండిపోయారు.

అటు తరువాత పరిస్థితిలో కొద్దిగా మార్పు కలిగింది. ఈ మార్పుకు ప్రధాన కారణం మద్రాసులో తెలుగు సినిమా పరిశ్రమ ఇల్లు కట్టుకోవటం. సినిమాలు అభివృద్ధి చెందిన కొద్దీ అనేక మంది తెలుగు నటులకూ, రచయితలకూ, గాయకులకూ, చిత్రకారులకూ, సాంకేతిక ప్రముఖులకూ మద్రాసు నివాసస్థానంగా పరిణమించింది.

అయినప్పటికీ ఆంధ్రరాష్ట్రం ప్రత్యేకంగా ఏర్పడుతున్న సమయంలో అనేక మంది విజ్ఞులు, ప్రత్యేకాంధ్ర రాష్ట్రం ఏర్పడ్డాక తెలుగు వారికి మద్రాసులో ఏమీ మిగలదు అని జోస్యం చెప్పారు.

ఆ జోస్యం కూడా ఫలించలేదు. ఈనాడు బహుశా తెలుగు వాళ్ళు పూర్వం ఎన్నడూ లేనంత సంఖ్యలో మద్రాసులో స్థిరపడ్డారు. హైదరాబాదు ఒక తెలుగు సంస్కృతీ కేంద్రంగా రూపొందిన మాట నిజమేకావచ్చు. కాని మద్రాసు తెలుగు సంస్కృతికి కేంద్రంగా ఉండటం మానలేదు.

మద్రాసులో దిగబడినది పారిశ్రామిక సంస్కృతి, సినిమా సంస్కృతీ మాత్రమేనని ఎవరైనా ఆక్షేపించవచ్చు. కాని ఆ ఆక్షేపణ సరి అయినదిగా తోచదు. వాణిజ్యపరిశ్రమల ఆధారం లేకుండా సంస్కృతి అభివృద్ధికాగల రోజులుపోయాయి. ఈ యుగంలో సంస్కృతి పరిశ్రమల ద్వారానే అభివృద్ధి కావలసి ఉన్నది. సినిమా పరిశ్రమ అత్యుత్తమ కళాకారులను పోషించటమేగాక, కళలలో కొత్తఔన్నత్యాలు కూడా సృష్టించ గలుగుతున్నది. పాత ప్రమాణాలను బట్టి గొప్ప కళాకారులనటానికి లేని నటులూ, గాయకులూ, చిత్రకారులూ మొదలైనవారు సినిమా పరిశ్రమలో ఉన్నత స్థానాలందుకొని తమ కళానైపుణ్యాన్ని అసంఖ్యాక ప్రజానీకానికి అందించ గలుగుతున్నారు. కళాకారులు కళారాధనకోసం ఆత్మబలి చేసుకోవలసిన అగత్యాన్ని లేకుండా చేసింది పారిశ్రామిక నాగరికత.

నాగరికతకూ సంస్కృతికీ ఉండే సంబంధాన్ని మనం విస్మరించరాదు. యుగసంధులలో తప్పిస్తే, సామాజిక జీవితం మూడు పువ్వులూ, ఆరు కాయలుగా ఉన్న దశలలో నాగరికతను ఆశ్రయించే సంస్కృతి పెరుగుతూ వచ్చింది. వాల్మీకి

నాటినుంచి మంత్రయుగం ఆరంభమైన దాకా గొప్ప కళాకారులందరూ రాజధానీ నగరాలలో తిష్ఠవేసి రాజాశ్రయంతో ఉత్తమకళలను సృష్టించినవారే. మంత్రయుగంలో రాజులు లేకపోయినా పూర్వం ఎప్పుడూ లేనంత గొప్పగా రాజధానులు వెలిశాయి. సంస్కృతి వాటిని అంటిపెట్టుకోవటం సహజం.

నగరంగా చూసినట్టయితే హైదరాబాదు మద్రాసుతో ప్రస్తుతం పోటీ చెయ్యలేదు. అందుచేత మద్రాసులో కుదురు ఏర్పరుచుకొన్న సంస్కృతి ఇంతట్లో రద్దయిపోదు. అయితే మద్రాసులోని తెలుగు సంస్కృతీ, హైదరాబాదులోని తెలుగు సంస్కృతీ భిన్నంగా అభివృద్ధి చెందుతాయని తోస్తుంది. మద్రాసులో అభివృద్ధి అయ్యే తెలుగు సంస్కృతిలో జాతీయత రానురాను తగ్గిపోవచ్చు.

ఈ లక్షణాలు ఇప్పటికే కొన్ని కనిపిస్తున్నాయి. సినిమారంగంలో తెలుగు, తమిళ సంస్కృతులు కొంతవరకు కలగలపటం జరిగింది. తెలుగు తారలు- హెచ్చుమంది స్త్రీలూ, కొద్దిమంది పురుషులూ - తమిళచిత్రాలలో కూడా తారాత్వం సాధించుకున్నారు. సావిత్రి, భానుమతి, కన్నాంబ, దేవిక, జానకి, శాంత కుమారి, రంగారావు, నాగయ్య, మొదలైన అనేకమందికి తెలుగు నటులమని చెప్పుకునేటంత హక్కు తమిళనటులమని చెప్పుకోవటానికి కూడా ఉంది. తమిళచిత్రాలలో విజయవంతమైనవాటిని ఇటీవల వరకూ తెలుగులో డబ్ చేసేవారు. ఇప్పుడు వీటిని కొద్ది మార్పులతో తెలుగులో పునర్నిర్మిస్తున్నారు. వాటిని తెలుగు ప్రేక్షకులు ఆసక్తితో చూస్తున్నారు కూడా. ఇటువంటి చిత్రాలతో తెలుగు జాతీయత గట్టిపడుతుందని ఆశించటానికి అవకాశం లేదు.

ఇటువంటి మార్పే ఇతర తెలుగు కళాకారులు సృష్టించే కళలలో కూడా విధిగా కనిపిస్తుంది. మాటవరసకు, అనేక దశాబ్దాల పాటు మద్రాసులో పాతుకు పోయిన రచయితలు తెలుగు రాయగలుగుతారేమో కాని తెలుగు జీవితం గురించి వాస్తవంగా రాయలేరు.

కొన్ని కళలు స్థానిక ప్రయోజనం గలవై ఉంటాయి. నాటకాలు అటువంటివి. మద్రాసులో తెలుగు నాటకం ఆడితే మద్రాసులోని ఆంధ్రుల కొరకేగదా ఆడాలి! వారి సంస్కృతి మద్రాసు నాగరికతకు అనుగుణంగా అభివృద్ధి అవుతున్నప్పుడు అచ్చమైన తెలుగు జీవితాన్ని ప్రతిబింబించే నాటకాలు వారికి రుచించకపోవచ్చు.

ఈ విధంగా మద్రాసు తెలుగు సంస్కృతీ కేంద్రంగా నిలబడి తెలుగు కళలకు ఊతమిచ్చినప్పటికీ అవి తమ జాతీయతను నిలబెట్టుకోలేకపోతాయి. ఈ అవకాశం హైదరాబాదులోనూ అభివృద్ధి చెందే కళలకు హెచ్చుగా వుంటుంది. అందుచేతనే మద్రాసు హైదరాబాదులలో పెరిగే సంస్కృతులు భిన్నంగా వుండబోతాయని నా

అనుమానం ఈ మార్పును నివారించటం సాధ్యం కాదు పండితరాయలు తెలుగు వాడే కావచ్చు కాని ఆయన ఉత్తరదేశం వెళ్ళి అక్కడ జీవించి గంగాలహరి రాశాడు గాని కృష్ణాలహరీ, గోదావరీ లహరీ రాయలేదు

ఒక జాతి యొక్క సంస్కృతి ఏకముఖ పరిణామం కలిగి వుండాలన్న భావం కూడా అంత ఉచితమైనది కాదేమో ఆధునిక యుగంలో సంస్కృతి బహుముఖ పరిణతి చెందటమే వాంఛనీయం భవిష్యతులోకి పోనవసరం లేకుండా ఈనాటి ఆంగ్లసంస్కృతిని తీసుకున్నట్లయితే ఎన్నో దేశాలు దానికి దోహదం చేస్తున్నాయి ఈనాటి హిందీ సంస్కృతికి సైతం భారతదేశంలోని అన్ని ప్రాంతాలూ కృషి చేస్తున్నాయి అంచేత ఆంధ్రసంస్కృతి ఆంధ్రేతర ప్రాంతమైన మద్రాసునుంచి కూడా పెంగటం ఆంధ్రులకు గర్వకారణమే అవుతుంది

*తెలుగు మహాజన సంఘం సావనీరు 1963*

# 8. నాగరికత - కొన్ని సమస్యలు

మనం సాధారణంగా సంస్కృతిపట్ల చూపే శ్రద్ధ నాగరికత పట్ల చూపం నిజానికి సంస్కృతి, నాగరికతలు జంటకవుల లాంటివి, ఒకదానినొకటి పూరిస్తాయి సంస్కృతిలో చెప్పుకోదగిన మార్పులు రాకుండా నాగరికతను మార్చుకోవటం సాధ్యంకాదు ఆటవికుణ్ణి తెచ్చి మన మధ్య తరగతి నాగరికతలో జీవించమంటే వాడికది సాధ్యంకాదు మన మధ్యతరగతి వాణ్ణి ఏ రాజాంతఃపురాల లోనో పెడితే ఉక్కిరి బిక్కిరయిపోతాడు ఇందులో వింత ఏమి లేదు

నాగరికతకు డబ్బు అనేది ఒక సాధనంగా పనికివస్తుందన్నదీ భ్రమే. '' నడుమ సిరివచ్చి కలసిన వెడగు బుద్ధు'' లే కాలం లోనూ ఉన్నారు. ఈ కాలంలోనూ అలాంటి వాళ్లు తమ సంస్కారాన్ని అడుగడుగున బయట పెడుతున్నారు రాతిగోడలు జైళ్లు కావు, ఇనుప కమ్మీలు బోన్లూ కవు అని ఇంగ్లీషులో ఒక పద్యం ఉన్నది. అలాగే ఏర్‌కండిషనింగ్ గల ఇళ్లూ, ఖరీదైన కారులూ, సారా బుడ్లూ, నైట్‌క్లబ్బులూ సంస్కృతి కావు - నాగరికత కావు

**కృత్రిమ నాగరికత:**

కృత్రిమ నాగరికతకు మరొక అడ్డదారి పదవులు. ఇందుకు సాహిత్యంలో శాశ్వత నిదర్శనంగా నిలిచి ఉన్నవాడు మృచ్ఛకటికం లోని శ్యాలకుడు మనిషి యొక్క సంస్కార హీనతను డబ్బుకన్నకూడ పదవి మరింతగా బట్టబయలు చేసేటట్టు కనిపిస్తుంది

డబ్బున్నవాడు తాగుతాడు, [illegible]లేస్తాడు, [illegible]జనాలను పేర్చుతాడు, విర్రవీగుతాడు వాడి [illegible] వాటితోనే పోతుంది కాని ఆ డబ్బుతో వాడు పదవులను కూడా [illegible]పాదిస్తే వాడు నిర్వహించే సాంఘిక పాత్ర [illegible]రంగా తయారవుతుంది

పూర్వం ఒక స్కూలు సెక్రటరీగారు, టెస్ట్ ట్యూబులు గాజువి కొంటే పగిలిపోతున్నాయి రేకుతో చేయిస్తే సరిపోదా? అని అడిగారట అది హాస్యాన్ని మించిపోలేదు

కాని ఇంకా పెద్ద అధికారాలతో కూడిన పదవులు, ప్రజాజీవితాన్ని తీర్చిదిద్ద దగినవి ఏకారణంచేత సంస్కార హీనులచేతిలో పడినా తీవ్రమైన పరిణామాలు తప్పవు

వ్యక్తుల విషయం వదిలేసి దేశం విషయం చూసినట్టయితే మన భారతదేశం మొత్తంగా సంస్కారంలేని నాగరికతను, కృత్రిమంగా తెచ్చిపెట్టుకున్న నాగరికతను, చాలా అనర్థాలను ఎదుర్కొంటున్నది

మనం ఏర్పరచుకున్న రాజ్యాంగం మన ప్రజలలో నూరింట ఇద్దరికిమించి అంతుబట్టేదిగా కనబడదు. ప్రజాస్వామ్యంలో ప్రతి ఒకడికీ గల రాజకీయ హక్కులను ఎంత మంది ఎరుగుదురు? తమ ప్రతినిధిగా వెళ్ళే వాడికి ఉండదగిన అర్హత లెలాటివో ఎంతమందికి తెలుసు?

పార్లమెంటరీ డెమోక్రసీలో కులతత్వాలకూ, మతావేశాలకూ తావులేదు దాని వెనక నిజమైన బూర్జువా సంస్కృతి ఉంటేనేగాని పార్లమెంటరీ డెమోక్రసీ కొంత వరకైనా సక్రమంగా చెయ్యదు. బూర్జువా సంస్కృతిలో నిరక్షరులకు తావులేదు.

**భౌతిక దృష్టి**

భౌతిక దృష్టి పెరిగినకొద్దీ నాగరికత పెరుగుతుందన్న విషయం కూడా చాలా మందికి తెలిసినట్టు కనబడదు. తన ఆహారం మీదా, ఆరోగ్యం మీదా, ఉత్పత్తి శక్తి మీదా, తన పరిసరాలమీదా, నిసర్గ వాతావరణం మీదా మానవుడికి అధికారం పెరిగినకొద్దీ నాగరికత పెరుగుతున్నది. మానవుడు తన జీవితాన్ని పూర్తిగా తానే శాసించుకునే రోజు ఏనాటికీ రాకపోవచ్చు. కాని ఒక దశలో తీరని సమస్యలుగా ఉన్నవాటిని మానవుడు మరొక దశలో తేలికగా పరిష్కరించుకొనగలుగుతున్నాడు ఉదాహరణకు, నా చిన్నతనంలో మా కుటుంబాలవాళ్ళు ఆయుర్వేద మందులే వాడేవారు వాటితో నయంగాని రోగాలతో తీసుకునేవారు! చనిపోయేవారు వాళ్ల ప్రాణాలు తీసిన అనేక రోగాలకు ఈనాడు మందులున్నాయి. అయినా ఈనాడు కూడా ఆనాడులాగే - అంతకంటె కూడా ఎక్కువగా రోగం రాగానే దేవుడికి మొక్కుకుని ముడుపులు కట్టేవాళ్ళున్నారు. ఆధునిక [illegible]లో ప్రతిబింబించే నాగరికత అలాంటి వాళ్ళ [illegible] ప్రతిబింబించటం లేదు

## మూఢవిశ్వాసాలు

మూఢవిశ్వాసాలనేవి ఏవీ భౌతిక విజ్ఞానం స్పష్టంగా ఖండించినవి భౌతిక విజ్ఞానాన్ని విసర్జించి మూఢవిశ్వాసాలనే అంటిపెట్టుకుని ఈ దేశాన్ని సంస్కృతీ నాగరికతలను వదిలేసుకున్న వాళ్ళే నిత్య జీవితంలో ఇలా మూఢవిశ్వాసాల మీద తమ జీవితాన్ని నడుపుకుంటూ వస్తున్న అభాగ్యులు కోట్ల సంఖ్యలో ఉన్నట్టు కనిపిస్తారు

## తగినన్ని యిళ్ళు లేవు

రాజకీయ యంత్రాంగం పరిష్కరించ దగిన సమస్యలతో మన దేశం తీసుకుంటున్నది. ఇది తప్పనిసరి అని ఎవరూ అనలేరు మన దేశం నిండా నూరేసి ఇళ్ళు ఖరీదు చేసే సినిమా హాళ్ళున్నాయి హోటళ్ళున్నాయి వెయ్యి ఇళ్ళ ఖరీదుచేసే హోటళ్ళు కూడా ఉన్నాయి తగినన్ని ఇళ్ళే లేవు. పొలాలు చేసేవాళ్ళు రెండు పూటలా తిండికి నోచుకోక పోయినా, నాగరికతకు దోహదం చేసే కార్మికులు హీనమైన అనాగరిక జీవితాలు జీవిస్తున్నా దేశంలో ఉన్నది కృత్రిమ నాగరికతే అనుకోవాలి ఎక్కడో అమెరికాలో పాకీపని చేసేవాళ్ళు కూడా సొంతకార్లలో పోతారనీ, ఇంగ్లండులో కార్మికుల సగటు ఆదాయం వారానికి 400 రూపాయిలకు సమానమనీ, ఆ దేశాలలాగే మనమూ అభివృద్ధి అవుతున్నామని అనుకోవటం హాస్యాస్పదం ఆ దేశాలు నాగరికతను క్రమబద్ధంగా నిర్మించుకున్నాయి మన దేశంలో మనం ఆటవిక లక్షణాలను సైతం ఆచారాల పేర పట్టుకు వేళ్ళాడుతున్నాం.

## ప్రజా చైతన్యం

సోషలిస్టు దేశాలు మరొక రకం నాగరికతను అవలంబించాయి. దేశం మొత్తంగా అభివృద్ధిలోకి శీఘ్రంగా రావటానికి ఈ నాగరికత ఉపకరిస్తుందని గుర్తించి మననాయకులు సోషలిజం మనధ్యేయమని ప్రకటించారు. కాని మనం దాన్ని కూడా కృత్రిమంగానే అమలు జరుపడానికి పూనుకున్నాం. సోషలిస్టు వ్యవస్థ ఏర్పరచటానికి ప్రజాచైతన్యం అపారంగా కావాలి.

మన దేశాన్ని నడిపిస్తున్నది ఏ ఒక సంస్కృతీ కాదు. మనకు ఒక నాగరికత అంటూ లేదు. ఉన్న నాగరికత అంతా ఎరువు సరుకు. మనకున్న సమస్యలు ఆ నాగరికతకు సంబంధించినవి కావు

## నాగరిక దేశాలలో సమస్యలు :

ప్రతి నాగరికతకూ దానికి అనుగుణమైన సమస్యలుంటాయి ఈనాడు నాగరికత దేశాలను పీడిస్తున్న ఒక ప్రముఖ సమస్య. వాతావరణ కాలుష్యం (Air Pollution) ఇతరకాలుష్యాలూ, కార్లూ, ఫ్యాక్టరీ గొట్టాలు గాలిలోకి అపాయకరమైన

ఆవాస్తులకు పంపకం చేస్తున్నాయి. జెట్‌విమానాలు దాడిచేసి పొరుగు నగరాలు తగలబెడుతున్నాయి. రేడియో ధార్మికశక్తి వచ్చాక వాటి తాలూకు కాలుష్యం ఒకటి సమస్య [illegible] రసాయనిక ద్రవ్యాలు [illegible] మన శరీరంలోకీ, మానవులు నివసించేచుట్టు పరిసరాలలోకీ ప్రవేశించి జనసామాన్యానికి ప్రమాదం కలిగిస్తున్నాయి. ఈ విధంగా మనిషి అత్యున్నతమైన నాగరికత అనేది కొన్ని తీవ్ర సమస్యలను సృష్టించుకున్నది. ఏ నాగరికత అయినా తాము తెచ్చి పెట్టుకున్న సమస్యలను తాను సాధించిన విజ్ఞానంతోనే పరిష్కరించుకుని ముందుకు పోవాలి. లేనిపక్షంలో అది వినాశనానికి గురికాక తప్పదు.

**మన సమస్యలు:**

మనకున్న సమస్యలు – దారిద్ర్యమూ, అజ్ఞానమూ, నిరక్షరతా, అనారోగ్యమూ, తిండిలేమీ, గమ్యంలేని రాజకీయాలూ, మూఢమైన విద్యావిధానమూ, అంతకన్న మూఢమైన జీవిత విధానము – ఇవి ఏ సంస్కృతి నుంచి ఏర్పడిన సమస్యలో ఊహించటం కష్టంగా ఉన్నది. ఇవన్నీ మన దేశంలో ప్రజాతంత్రంలేని కాలంలో ఉన్నవే.

విచిత్రమేమిటంటే దాదాపు అన్ని సమస్యలూ ప్రజాతంత్రం వొచ్చాక మరింత తీవ్రమయాయి. మతోన్మాదమూ, కులతత్వాలూ, లంచగొండితనాలూ మొదలైనవి అనేక రెట్లు పెరిగాయి. జాతీయోద్యమంలో కులమత భేదాలు దాదాపు పోవటమూ, దారిద్ర్యం ఇంత దుర్భరంగా తోచకపోవటమూ నాతరం వాళ్లం ఎరుగుదుము. ఆనాడున్న సంస్కృతిలో ఈనాడు సగం కూడా ఉన్నట్టు కనబడదు. నాగరికత మాత్రం పెరిగినట్టు కనబడుతుంది. ఇది ఎలా సాధ్యమయింది?

దీన్ని గురించి మేధావులందరు ఆలోచించవలసి ఉన్నది. మన జాతీయ జీవిత వృక్షానికి వేరుపురుగులు చాలాచేరాయి. వాటిని విజ్ఞానంతో నిర్మూలిస్తేగాని ఈ చెట్టు బాగుపడదు. జీవితం అన్నిరంగాలలోను వైజ్ఞానిక దృక్పథము, భౌతిక వాదమూ ప్రవేశించి తన ప్రభావాన్ని చూపాలి. లేని పక్షంలో అవ్యవస్థ తీవ్రతరం కాక తప్పదు.

*ఆంధ్ర ప్రదేశ్, మాసపత్రిక, జనవరి 1971*

# 9. మనం ఎవరం?

''నిన్ను నువ్వు తెలుసుకో'', అన్నారు తత్త్వవేత్తలు

ఆ తెలుసుకోవడం వ్యక్తికి సంబంధించినది మోక్షం దాని పరమార్థం అది సమాజానికీ, జాతికీ సంబంధించే విషయం కాదు

మనని మనం తెలుసుకోవాలి అన్నది ఒక సమాజానికీ, ఒక జాతికీ సంబంధించినది కాదు - మానవ జాతికంతకూ సంబంధించినది ఈనాడు ప్రపంచంలో ఉన్న మానవులందరి భవిష్యత్తూ ఇది తెలుసుకోవటం మీద ఆధారపడి ఉందనే శాస్త్రవేత్తలు వున్నారు

మానవ జాతికి అంతకన్నా భవిష్యత్తే హెచ్చుగా వున్నదనీ ప్రపంచం మీద సృష్ట్యాది నుంచీ జీవించిన మొత్తం మానవ జనాభాలో దాదాపు మూడు శాతం ఈనాడు ప్రపంచం మీద జీవించి ఉన్నారని మనలో చాలా మందికి తెలియదు

భూమి పుట్టి ఏ 500 లేక 600 కోట్ల ఏళ్ళు అయితే, మానవుడి పూర్వులన దగిన ప్రాణులు సుమారు 20 లక్షల సంవత్సరాల క్రితం మాత్రమే అవతరించినట్లు శాస్త్రజ్ఞులు అంచనా కడుతున్నారు, కాని ఈ 20 లక్షల ఏళ్ళపాటూ మానవుల్లో నైతేనేం మానవులకు వెలపల అయితేనేం చాలా పరిణామాలు జరిగాయి. చాలా లక్షల ఏళ్ళపాటు మానవులలో వానర లక్షణాలు అంతో ఇంతో ఉంటూ వచ్చాయి!

రాళ్ళను చెక్కి రకరకాల పరికరాలు తయారుచేసి, వాటి సహాయంతో భూమి మీద ఏ ప్రాంతంలోనైనా జీవించ గలిగిన వాళ్ళే మనకు నిజమైన పూర్వులూ, మన నాగరికతకు నిజమైన అంకురార్పణ చేసిన వారూ అనుకునే పక్షంలో అలాంటివాళ్ళని నియాండర్తాల్ మానవులు అంటాం వీళ్ళు లక్షయేళ్ళకూ అరలక్షయేళ్ళకూ మధ్య భూమి మీద అనేక ప్రాంతాలలో జీవించారు

ఈ నియాండర్తాల్ మనిషికి పూర్వం అతని పూర్వులని చెప్పతగిన జీవులు చాలా రకాలుండేవి. సుమారు కోటిన్నర సంవత్సరాల క్రితం జీవించిన రయాపితికస్ అనే ప్రాణి సంపూర్ణమానవుడు కాకపోయినా, అతడినుంచి ఈనాటి మానవుడి దాకా పరిణామ పరంపర సూటిగా నిరూపించటం సాధ్యమయింది

పిరొపాక్ అంటేమనం, అంత్రోపాస్ అంటేమనిషి, పితికాంత్రోపస్ అంటే నరవానరం. అందుచేత రయాపితికస్ కూడా పూర్తి మనిషి కాదు.

అయిదారు లక్షల ఏళ్ళ క్రితం జీవించిన హోమో ఇరెక్టస్ అన్న ప్రాణి రెండు కాళ్ళమీద ధారాళంగా నడిచి, నిప్పును ఉపయోగించి, సమష్టి జీవితం జీవించినా అతన్ని

[illegible] కీర్తి నియాండర్తల్ మానవుడికి [illegible] సెపియన్స్ అనే హోమో ఇరెక్టస్ నుంచి పరిణామం [illegible]

మానవ శాస్త్రమంతా వివరించటం నా ఉద్దేశం కాదు. మన మెదడులో అన్నది [illegible] మనం ఎక్కడ నుంచి వచ్చామో ఏవిధంగా వచ్చామో, మన [illegible] తెలుసుకోవాలి.

నీటిమీద మఱ్ఱి ఆకుమీద కాలిబొటనవేలు చీకుతూ ఆదివిష్ణువు ఉండేవాడనీ, ఆ విష్ణువు బొడ్డులో నుంచి తామర పువ్వు పుట్టిందనీ, అందులో బ్రహ్మపుట్టి ప్రజాపతులను పుట్టించేడనీ, వాళ్లు సమస్త జీవరాసులనూ (పశువులూ, పాములూ, చెట్లూ మొదలయిన వాటితో సహా) సృష్టించారని మన పురాణాలు చెబుతున్నాయి. యెహోవా ఆదిలో ఆదామునూ, అవ్వనూ సృష్టించి, వారి ద్వార మానవజాతిని సృష్టించినట్టు బైబిలు చెబుతుంది. సూర్యుడు మానవరూపంలో వచ్చి భూమి మీద మనుషుల్ని కన్నాడని, తొలి మానవులంతా దేవతల నుంచే పుట్టారనీ అనేక దేశాల ప్రాచీన గ్రంథాలు చెబుతాయి.

మానవావతరణ గురించి శాస్త్ర పరిశోధనలు తెలుపుతున్నది దీనికి పూర్తిగా విరుద్ధం - మానవుడు తనకన్న హీనప్రాణులనుంచి పరిణామం చెందాడని! ఇది నిరూపించటానికి సాధ్యమైన విషయం. గతాన్ని గురించి తెలుసుకోవాలంటే భూమిలోకి తవ్వాలి. భూమి దిగువన ఎంత లోతుకుపోతే అంత ప్రాచీన రహస్యాలు బయటపడతాయి. అడుగున ఏ లోతున ఉన్న ఏ పొర ఎంతకాలం నాటిదో అంచనా కట్టటానికి శాస్త్రజ్ఞులకు మార్గాలున్నాయి. ఏ శిలలు ఎన్నికోట్ల ఏళ్ళనాటివో, ఏ బూడిద ఎన్ని లక్షల ఏళ్ళనాటిదో వాళ్ళు నిర్ణయించ గలరు. అదేవిధంగా ఒక దంతం దొరికితే అది కోతిదో, వానరానిదో, మనిషిదో చెప్పగలరు, మొల ఎముకలను బట్టి ఆ ప్రాణి నిటారుగా నడిచినదీ, వంగబడి నడిచినదీ, నాలుగు కాళ్ళమీద నడిచినదీ చెప్పవచ్చు.

పరిణామవాదం అన్నది ఒక విధంగా కాదు, బహువిధాల నిరూపణ అయింది. పరిణామంలో తల ప్రమాణమూ, అందులో ఉండే మెదడు పరిమాణమూ పెరిగాయి. ముఖంలోనూ, దంతాలలోనూ, అంగుడులోనూ మార్పులు వచ్చాయి. పరికరాలలో క్రమాభివృద్ధి కనిపిస్తుంది. ఇన్ని రకాల పరిణామాలూ ఒకే దిక్కుగా ఉండటం చేత పరిణామవాదం ఋజువవుతున్నది. ఇటీవల పొరలలో అతి ప్రాచీన శిలా పరికరాలు దొరకటం గానీ, అతిప్రాచీనమైన పొరలలో ఆధునిక మానవుడి అస్థికలు దొరకటం గాని ఎన్నడూ జరగలేదు.

ఇక అసలు విషయానికి వద్దాం. మన పూర్వీకులు మనకన్న తక్కువ నాగరికతగల వారనేది నమ్మడం మన వాళ్ళకు బాధగా ఉంటుంది. గతాన్ని గురించి మన అజ్ఞానం

ఎంత దూరం వెళ్ళిందంటే రాముడు అరణ్యవాసంలో అడవి పందులను కొట్టి తిన్నాడన్నా ప్రాచీనకాలంలో మన ఋషులు అనేకమైన ఇటువంటి యజ్ఞాలు చేసి నరమాంసమూ, గోమాంసమూ తినేవారన్నా బహుభార్యాత్వంలో జీవించేవారు. ఏకపత్నీ వ్రతాలు అంతగా ఉండేవి కావన్నా మీరు దూషిస్తున్నారు (వీటన్నిటికి మన ప్రాచీన సాహిత్యంలో ఆధారం వున్నప్పటికి)

మన ప్రాచీన సంస్కృతికి తిరిగి పోక చెడిపోతున్నామని పూర్వాచారపరాయణులు బాధపడుతుంటే, ఆటవిక దశనుండి మనం తగినంతగా ముందుకు పోలేక బాధపడుతున్నామని శాస్త్రజ్ఞులు చెబుతున్నారు

మానవ శాస్త్రవేత్తలు మానవుడి భౌతిక సంస్కృతిని - కేవలమూ మానవుడి పరికరసాధన సంపత్తిని - మూడు యుగాలుగా విభజించారు

1 శిలాయుగం ఈ యుగంలో మానవులు అత్యల్ప ప్రయోజనం గురించి పని ముట్లు నుంచి వివిధ పరికరాలను తయారు చేయటం దాకా అభివృద్ధి చెందారు పదిలక్షల సంవత్సరాలు గడిచిన ఈ యుగంలో అప్పటి ప్రజలు ఆఫ్రికా, ఆసియా, యూరపు ఖండాలలో వ్యాపించారు జనసంఖ్య పదింతలు పెరిగింది

2. సుమారు 10 వేల ఏళ్ళ క్రితం వ్యవసాయమూ, పశువులను మచ్చిక చెయ్యటమూ ప్రారంభమయాయి వ్యవసాయం ద్వారా సంచార జీవితానికి స్వస్తిచెప్పి జనపదాలూ, స్థిరనివాసాలూ ఏర్పాటు చేసుకున్నారు ఆ మధ్యయుగం మనుషులు కేవలమూ 4 వేల ఏళ్ళ కాలంలో ప్రపంచ జనాభా సుమారు 50 లక్షల నుంచీ ఎనిమిదిన్నర కోట్లకు పెరిగింది

3. మానవజీవిత యుగాలలో మూడవది పారిశ్రామిక యుగం. ఈ యుగం ప్రారంభమై 3000 ఏళ్ళయింది. ఈ యుగం ఆరంభమయే నాటికి ప్రపంచ జనాభా సుమారు 55 కోట్లు. ఈకొద్ది కాలంలోనే జనసంఖ్య ఈనాడు 300 కోట్లకు పెరిగింది మరో యాభై ఏళ్ళలో ఈ సంఖ్య రెట్టింపు కావచ్చునట.

హోమోసేపియన్ జాతిగా చెప్పబడే సమగ్ర మానవజాతి మొదటి యుగాన్ని గడపటానికి లక్షల ఏళ్ళు పట్టింది. రెండో యుగం వేల ఏళ్ళలోనే ముగిసింది మూడోది ఆరంభమై కొద్ది వందల ఏళ్ళయింది

దీనిని బట్టి మానవ నాగరికత పురోగమించే వేగం అంతకంతకూ ఎలా వృద్ధి అవుతున్నదీ మనం గ్రహించవచ్చు ఇటీవలి అభివృద్ధిని బట్టి చూస్తే ఈ శతాబ్ది అంతానికి మానవ నాగరికత ఏరూపం ధరిస్తుందో చెప్పటం అసాధ్యమనిపిస్తుంది కృత్రిమ ఉపగ్రహాలు ప్రయోగించటమూ మానవుడు ఇతరలోకాలకు ప్రయాణం కావటమూ ప్రారంభమై పదిహేనేళ్ళే అయింది మానవ నిర్మిత యంత్రం ఒకటి

ఇవాళ చంద్రుని మీద మానవపాదాలు అను... ..., అక్కడి వార్తలు భూమికి పంపుతున్నది

భూమి మీద ఉన్న ఇతర జీవరాసులు ప్రస్తుత పరిణామం చెందాయి. వాటిలో కొన్ని అంతరించాయి ఏ జీవి అయినా విజయం పొందినట్టుగుర్తు ఏమిటంటే వృద్ధిని సాధించటం మానవుడు అసాధారణమైన వృద్ధి సాధించాడు అతని సంఖ్య పెరిగింది అతను దాదాపు భూమిపైన ఏ ప్రాంతంలోనైనా జీవించ గలడు, భారరహితస్థితిలో చాల రోజులు ఉండిపోగలడు, ఎలాటి వాతావరణమూ లేని చంద్రగోళం మీద సహితం కొద్ది గంటలు మసలగలడు

సంఖ్యలోనేగాక సంస్కృతిలో కూడా భూమి మీద ఇతర జీవి సాధించనిది నియాండర్తల్ దశలోనే సాధించాడు ఈనాడు ఈసంస్కృతి కేవలమూ అతని పరికరాలు మాత్రమే కావు, సాహిత్యమూ, ఇతర కళలూ, శాస్త్రజ్ఞానమూ, పరిశోధనా దక్షతా వగైరాలు మానవ సంస్కృతిలో మహోన్నతస్థానంలో ఉన్నవి

అయితే ఈ సంస్కృతికి మొట్టమొదటి మెట్టు చేతులను పని చెయ్యటానికి ఉపయోగించటమని శాస్త్రజ్ఞులు ఒప్పుకుంటున్నారు. రెండు కాళ్ళమీద నడవటమూ భాషా, సాధనాల ఉత్పత్తీ, పశువులను మచ్చికచెయ్యటమూ, వ్యవసాయమూ మానవ సంస్కృతిని ఒక్కొక్క మెట్టే ముందుకు నడిపించాయి.

మానవుడు లోపలా బయటా - ప్రాణిగానూ, సామాజికుడుగానూ - శారీరకం గానూ జీవితంలోనూ - కూడా పరిణామాన్ని సాధించాడు హోమో ఇరెక్టస్ 5 లక్షల ఏళ్ళ మీద హోమో సేపియన్స్ గా మారగలిగాడు. మెదడు పెరిగింది, ముఖం చిన్నదయింది నాజూకు తేలింది నుదురు ఎత్తయింది. గడ్డం స్ఫుటమయింది

అలాగే, ఒకనాడు ఆహారంకోసం పోరాడుతూ, చిన్న చిన్న జంతువులను వేటాడుతూ బతికిన మానవుడు, మహానగరాలు నిర్మించి, విమానాలు సృష్టించి, అంతరిక్షం లోకి దూసుకుపోయి, విశ్వం అంచులలో ఉన్న బ్రహ్మాండాలను పరిశోధిస్తున్నాడు

కాళిదాసంతటి మహాకవి కాదగినవాడు కూడా ఓనమాలతో అక్షరాభ్యాసం ప్రారంభించినట్టే మనిషి కూడా తల్లి గర్భాన ఏకకణ జీవిగా ప్రవేశిస్తున్నాడు ఇలాంటి ఏకకణజీవులు కోట్ల ఏళ్ళ క్రితం భూమి మీద తొలిప్రాణులు తల్లి గర్భంలో ఏక కణజీవిగా ప్రవేశించిన మానవుడు కొద్ది వారాలలో చేపల లక్షణాలు సాధించి, కొద్ది మాసాలకు సరీసృపాల లక్షణాలు ప్రదర్శించి అనేక కోట్ల సంవత్సరాల మీదట జరిగిన పరిణామదశలన్నింటినీ అతివేగంగా గడిచి, సమగ్ర మానవుడుగా భూమి మీద పడుతున్నాడు

ఈ అంతరంత పరిణామం క్రమబద్ధంగా జరుగుతున్నది కాని సాంఘిక పరిణామం ఎంతవేగాన్ని సాధించిందంటే, ఇది ఇప్పటికే మానవుడి అదుపాజ్ఞలకు

లోబడకుండా పోతూ, అనేకరకాల ఒడుదుడుకులను సమస్యలను తెచ్చి పెట్టుతున్నది

ఏం జరగబోతున్నది ప్రపంచ జనాభా ఇప్పుడున్న దానికి రెట్టింపు అయిపోతే ఇంకో యాభై ఏళ్ళకు మనుషులు ఎలా నివసిస్తారు ఎలా తింటారు ఇంకొక నూరేళ్ళకు పెట్రోలూ బొగ్గూ, మొదలైన శక్తి సాధనాలు హొట్టిపోతే యీ నాగరికత పేకమేడలాగా కూలిపోతుందా

మొదటిరకం పరిణామం - శారీరకమైనది - జరిగినట్టయితే ఈ సమస్యలు విడునేమోకాని ఆ పరిణామం శతాబ్దాలమీదా, సహస్రాబ్దాల మీదా సాధించేది కాదు. అనేక లక్షల ఏళ్ళు పట్టేది ఇప్పటికీ మానవుడి సాంఘిక పరిణామం శారీరక పరిణామాన్ని అధిగమించి చాలాదూరం వచ్చేసింది

అదే సమస్యకు మూలమని శాస్త్రవేత్తలు నమ్ముతున్నారు మనం నాగరిక జీవితం గడుపుతున్నప్పటికీ మన శరీరధర్మం ఈనాటికీ వేటగాడి జీవితానికి తగినది గానే పనిచేస్తున్నదట దీనికీ గుండెజబ్బులకూ సంబంధం ఉండవచ్చునని శాస్త్రజ్ఞుల అభిప్రాయం

ఈ కాలంలో అనేకమందికి స్ట్రైన్ , స్ట్రెస్ ల ద్వారా రకరకా జబ్బులు కలుగుతున్నాయి కోటీశ్వరులకు కోట్లను గురించి ఆదుర్దా. బీదవాళ్ళకు అయిదులూ, పదులూ గురించి ఆదుర్దా అదుర్దా అన్నది ఈనాటి నాగరకతకు ఎన్నికల చిహ్నం అయిపోయింది

ఆదుర్దావల్ల శరీర ధర్మాలలో కొన్ని మార్పులు కలుగుతాయి. భయంగాని, కోపంగాని హెచ్చుగా కలిగినప్పుడు ఎడ్రినలిన్ గ్రంధి హెచ్చుగా స్రవించి, గుండె కాయకు బలాన్ని చేకూర్చుతుంది. దీనితో పాటు రక్త ప్రవాహంలో కొలెష్టరాల్, ఫాటీ ఏసిడ్స్ చేరుతాయి

ఈనాడు కూడా ప్రపంచంలో (ఆఫ్రికాలోని కలహరి ఎడారిలో) ఆహారం ఏరుకుంటూ వేటాడుతూ జీవించే వాళ్ళున్నారు వారిని శాస్త్రవేత్తలు పరీక్షించారు వేటగాడికి కూడా స్ట్రైన్ అనేది ఉన్నది వాడు వేటమృగం కోసం వెతకాలి అది దొరికితేగాని పొయ్యిలో పిల్లి లేవదు. మృగం కనిపించాక దాన్ని కొట్టాలి. కొట్టగానే అదిచావక పోవచ్చు దెబ్బతిన్న మృగం వేటగాణ్ణి రోజులపాటు తిప్పవచ్చు అది తన చేత చచ్చేదాకా వాడికి తిండి ఉండదు, తిప్పలే తప్ప. ఈ లోపల ఎడ్రినలిన్ వాడి రక్తంలోకి స్రవించి వాడికి బలాన్ని, శక్తినీ చేకూర్చుతుంది అది వాడి ఉదరానికి రక్తాన్ని తగ్గించి, తిండి లేనందువల్ల బాధలేకుండా చేస్తుంది. అయితే, వాడి రక్తంలో చేరే కొలెష్టరాల్, ఫాటి ఏసిడ్స్ వగైరా దుష్పదార్థాల మాటేమిటి. వాడి తిప్పలూ పరుగులూ శ్రమా వాటిని దహించివేస్తాయి

మనిషి ఆధునిక మానవుడైనా కూడా ఒక రకమైన వేటగాడే. వేటగాడి లక్షణాలైన వడి సమస్యలూ, అనిశ్చిత ఇలాంటి జీవితంలోనూ ఉన్నాయి. ఎక్కడ ప్రమాదం ఎదురైనా, ఏది ఎదురైనా సమస్య, దానిని ఎదుర్కొని పడిపోతే లేచి సాగి పోవటం కండరాల్ని సంపాదించాలంటే ఎడ్రినలిన్ సహాయం పొందాలి. ఎడ్రినలిన్ శరీరం ఉత్పత్తి చేస్తుంది. కాని ఇలాంటి ప్రమాదకరమైన వేటగాడి జీవితం జీవించడు, నడవడు పరిగెత్తడు, సమస్యలలోను పడిపోతాడు. అతని రక్తంలో చేరిన దుష్పదార్థాలు అతని గుండెను పాడుచేస్తాయి.

మన శరీరాలు వేటగాడి జీవితానికని నిర్మాణమైనవి. మనం జీవిస్తున్నది వేటగాడి జీవితం కాదు అంటారు శాస్త్రవేత్తలు.

ఈ సత్యాన్ని మన పూర్వీకులు ఏ రూపంలోనో గ్రహించి, నడివయస్సు దాటగానే వానప్రస్థం ఏర్పాటుచేసి ప్రశాంత జీవితం నిర్దేశించారు. నగరాలలో కంటే వనాలలో ఎక్కువ శాంతి లభిస్తుందని వారు ఏనాడో తెలుసుకుని ఉండటం చిత్రం. వనాలలో లభించేది శరీరశాంతి, వేటగాడి జీవితం, ఆహారం ఏరుకునే వాడి జీవితం, శరీర వ్యాయామం.

హృద్రోగులు కదలకుండా పడుకుని విశ్రాంతి తీసుకోవాలన్నది తప్పుడు సిద్ధాంతంగా కనిపిస్తున్నది. ఇప్పుడు డాక్టర్లు హృద్రోగులను నడవమనీ, సైకిలు తొక్కమని సలహా ఇస్తున్నారు.

మన శరీరాలలోనేనా, వాటి వెలపల కూడా ఇంకా వేటగాడున్నాడా? తప్పకుండా ఉన్నాడు. నాగరిక జాతులలో కూడా ఆటవిక అవశేషాలు చాలా ఉన్నాయి. మన సమాజంలో అనేక రకాల పూజలూ పండగలూ మతం పేరిట చేసే తంతులూ అనాగరిక సమాజం నాటివి.

స్త్రీలు పురుషులకు తీసికట్టుగా ఉండడమూ, సంఘసేవలో వారికి తక్కువస్థానం ఇచ్చి ఇంటిపనే వారికి ప్రధానంగా చెయ్యటం వేటాడేజాతుల లక్షణం. ఆహారం ఏరుకునే దశలో స్త్రీలకూ పురుషులకూ పిల్లలకూ తేడా ఉండేది కాదు. ఆ పని అందరికీ ఇంచుమించుగా సమంగానే చేతనవుతుంది. కాని వేటదగ్గిరికి వచ్చే సరికి బలిష్ఠులైన పురుషులే ఆ పని చేయగలరు. అది స్త్రీలకూ పిల్లలకూ అపాయకరమైన వ్యాపకం. మన ఈనాటి నాగరిక సమాజాలలో పాశ్చాత్యదేశాలలో సైతం స్త్రీకి సంఘశ్రమలో చాలా హీనస్థానం ఉంటున్నది.

''మనం ఎవరం?'' అన్న ప్రశ్నకు సమాధానం, ''మనం మౌలికంగా ఆటవిక వేటగాళ్ళ దశకు పరిణమించినవాళ్ళం'' అన్నదని స్పష్టమవుతున్నది. అలాంటప్పుడు మనం నాగరిక సామాజిక వ్యవస్థ అంటున్నది తప్పుతోవలో వున్నది. ఇంతకంటే

శ్రామికరాజ్యం లక్ష్యమే మానవపరిణామదశకు ఎక్కువ అనుకూలంగా ఉంటుందనటానికి సందేహం లేదు

ఇప్పుడున్న పరిస్థితుల్లో మనకు సాధించిన విజ్ఞానాన్ని, ఎక్కువభాగం లేదా ఆ విజ్ఞానాన్ని మనం ఉపయోగించుకోవడం లేదు. మారణాయుధాల్ని అనాగరిక యుద్ధ అవసరాలకోసం ఎక్కువగా కుంటిత్వాన్ని సిద్ధాంతాలకు సరిగా ప్రజాస్వామ్యం సాధ్యమవుతుందనుకునే రాజకీయ మహానాయకులు మనకున్నారు

ప్రపంచ యుద్ధాలూ, అపారశక్తిగల మారణాస్త్రాలు మనిషి వేటగాడి మనస్తత్త్వానికి ప్రత్యక్ష నిదర్శనాలు. అమెరికా సాధించిన భౌతిక నాగరికతనూ, అమెరికా వియత్నాం, కాంబోడియా, లాటిన్ అమెరికా వగైరా దేశాలలో చేసే పాశవిక పర్యలనూ సమన్వయించటం సాధ్యంకాదు. కాని అలాటి సమన్వయం ఉన్నది. అమెరికను నాగరికత అమెరికను సైనికులలోనూ సైనికాధికారులలోనూ క్రౌర్యాన్ని సంస్కరించలేకపోయింది

ఆధునిక మానవుడు ఆధునిక వాతావరణానికి అనుగుణంగా పరిణతి చెందలేదు. ఈ వాతావరణం మారకుండా ఇలాగే ఉంటే మానవుడు ఆ పరిణామాన్ని సాధించుకోగలుగుతాడు. ప్రాచీనులనుంచీ సంక్రమించిన సంచితం దెబ్బతీసి, నాచురల్ సెలెక్షన్ ద్వారా వాతావరణానికి అనుగుణంగా మారలేని వాళ్ళు గుండెజబ్బుతో చచ్చిపోతారు. మనుషులు మరింత శాంతమూ, సహనము గలవారైతే ఆధునిక ప్రపంచం ఇంకా చాలా బాగుంటుందనటానికి సందేహం లేదు. పాశ్చాత్యులలో గుండెజబ్బుల చావులు జాస్తిగా ఉండటం నాచురల్‌సెలక్షన్ ద్వారా జరుగుతున్నదే కావచ్చు అంటాడు ఎస్. క్లార్క్ హువెల్

ఆయన ఇంకా ఇలా అంటాడు

''మరొక మానవ నాగరికత పైమెరుగులు ఎలా ఉన్నప్పటికీ ఆధునిక మానవుడు సాధించినదానిలో విలువగలది, తనను తాను తెలుసుకోవటానికీ ప్రపంచాన్ని అర్థం చేసుకొనటానికీ పనికి వచ్చే జ్ఞానం. ఇందులో చాలా భాగం జనసామాన్యానికి అందుబాటులో లేదు. అనేకమంది దీనిని నిరాకరించటం కూడా శోచనీయంగా జరుగుతున్నది. పరిణామ సూత్రాలు వాస్తవమైనవి. వాటిని ఋజువు చేయవచ్చు. వాటిని ఉపేక్షించటం ప్రమాణ స్వీకారం, మానవుడు తనను తాను తెలుసుకొనటానికి అవి చాలా అవసరం. మన భావిపరిణామ గతిని మనమే నిర్ణయించుకునేపరిస్థితి త్వరలోనే ఏర్పడవచ్చు కనక, మన భవిష్యత్తుకు అది ముఖ్యమైనది. మానవుడికి గల సవాలు ఇది – చంద్రమండలాన్ని .. కాదు. కోట్ల సంవత్సరాల జీవిత చరిత్రలో వ్యక్తి క్షేమాన్ని మనిషి క్షేమంతో సమన్వయపరిచే అవకాశం మొదటిసారి కలగనున్నది. ఈ సమన్వయానికై లోగడ కృషి జరగలేదు. ఈనాడు సరిగా జరగడం లేదు.''

హెగెల్ చెప్పే సమన్వయం కొంతవరకు సోషలిస్టు సమాజంలో సాధ్యమైనట్లు కనిపిస్తుంది. అందుకనే మన దేశంలో సోషలిస్టు వ్యవస్థకు తెగపడుతూ వచ్చింది. కాని అలాంటి వ్యవస్థ ఏర్పడటానికి అడ్డంకులుగా ఉన్న శక్తులు దేశంలో స్వైర విహారం చేస్తూనే ఉన్నాయి. ఆ దుష్ట శక్తులను అర్థం చేసుకోవటానికి మానవ శాస్త్రమూ, పరిణామవాదమూ కొంతవరకైనా పనికివస్తాయేమో! వీటిని గురించి చదువుకున్న ప్రతివాడూ తెలుసుకోవటం అవసరం.

*ఆంధ్రజ్యోతి, వారపత్రిక 19-2-1971*

# 10. పెట్టుబడిదారీ సంస్కృతి

కదిలే సమాజానికి రెండు లక్షణాలు విధిగా వుండాలి. సమాజం తన వ్యవస్థకు అనుగుణమైన సంస్కృతిని ప్రదర్శించాలి, ఆ సంస్కృతిలో భవిష్యత్తుకు, అంటే పురోగమనానికి, అవసరమైన బీజాలు ఉండాలి.

ఈ సూత్రం ఒక్క సాంస్కృతిక రంగంలోనే కాదు జీవితం తాలూకు అన్ని రంగాలలోనూ వర్తిస్తుంది. వ్యవసాయ, ఆర్థిక, పారిశ్రామిక, విద్యాదిరంగాలలో అమలు జరిగినా జరగకపోయినా, ఈ లక్షణాలు ఉండాలన్నది గుర్తించబడుతున్నది. ఒక్క సాంస్కృతిక రంగానికే గుర్తింపులేనట్లు కనబడుతుంది, దానికే ప్రణాళికలు లేవు. మీదుమిక్కిలి అవాంతరాలు ఈ రంగంలోనే హెచ్చుగా కనబడుతున్నాయి.

"Under Capitalism all art above a certain mediocrity has always been an act of political criticism and revolt" అన్నాడు Ernest Fisher.

ఈ దేశంలో మనం అచ్చుగా పెట్టుబడిదారీకిందనే గాక కొంత సామ్యవాదం కింద కూడా ఉంటున్నట్టు నటిస్తున్నాం, ఒకచేత్తో సోషలిజమూ, ఇంకోచేత్తో వెల్ఫేర్ స్టేటూ సాధిస్తామని ప్రపంచాన్ని నమ్మించ జూస్తున్నాం.

కాని మన దేశంలో సంస్కృతికింద చలామణీ అవుతున్నది మన ప్రగల్భాలకు కనుచేటుదూరంలో ఎక్కడా లేదు. రేడియోలో గంట గంటకూ ఓడే భక్తిరసం వినండి, అకాడమీలు బహూకరించే పుస్తకాలు చదవండి, జ్ఞాన(జై)నపీఠంవారు ఏటా లక్షరూపాయలు చెల్లించే మహత్తర సాహిత్యాన్ని అవలోకించండి. సోషలిస్టు సంస్కృతి మాట దేవుడెరుగు, వాటిలో పెట్టుబడిదారీ సంస్కృతి కూడా కానరాదు.

మన సంస్కృతి అని బహిరంగంగా గుర్తించేదీ, పత్రికలు పెద్ద పెట్టున హర్షించేదీ, కొంపదీసి, below a certain mediocrity గా ఉంటున్నదా?

మన సమాజంలో మనుషులకు కనీస ఆలోచనాశక్తీ, చైతన్యమూ లేనందుకు ఆందోళన కనబరుస్తూ నేను నలభై ఏళ్ళ క్రితం రచనలు ప్రారంభించాను నేను పెరుగుతున్న కొద్దీ నా ఆందోళన సాంఘిక చైతన్యం కేసి మళ్ళింది ఈనాడు నేను గాఢంగా కోరుకుంటున్నది మనుషులలో విప్లవ చైతన్యం కాని నాలో ఉన్న పెటీబూర్జువా, 'ఈ దేశంలో, కనీసం, నికరమైన పెట్టుబడిదారీ సంస్కృతి అయినా ఎందుకు లేదు?' అని విచారిస్తూ ఉంటాడు

మన రచయితలలో చాలా మంది రచనలు చేసేటప్పుడు తమ రోజువారీ అనుభవాలను కూడా అర్థం చేసుకోలేనట్టు ఎందుకు కనబడతారు? (మన పెళ్లాల, బిడ్డల ముఖాలు కూడా మనం పోల్చుకోలేకపోవటం ఎంత విషాదకరం!) మతమూ, కులమూ, నీతి, విద్యా మొదలైనవాటిని గురించి బహుకొద్ది మందికి తప్ప వాస్తవం ఎందుకు తెలీదు? (మన జాతీయ వికాసం ప్రారంభమై అర్ధశతాబ్దం దాటుతున్నదే! ఈ జాతి ఊబిలో నుంచి పైకి రావటానికి ఎన్ని శతాబ్దాలు కావాలి? ఇది చేసుకున్న పాపమేమిటి?) మన పాలకులు ప్రజా ప్రతినిధులుగా ప్రవర్తించక గొర్రెలని తోలే వారల్లే ఎందుకు ప్రవర్తిస్తారు? అరతులం మెదడున్న వారికి కూడా అవమానకరంగా తోచే అబద్ధాలు ఎందుకు చెబుతారు? ప్రజలు గొర్రెలని వారనుకుంటుంటే, ప్రజలు నిజంగా గొర్రెలలాగే ఉండటం ఇంకా ఎంత దారుణం

దశాబ్దాల తరబడి అవినీతి ఆరోపణలకు గురి అయినవాళ్ళు ఇంకా అధికారం చలాయిస్తూనే ఉన్నారు రాజకీయరంగంలో సంఘర్షణ లేదనికాదు, అది పాలక వర్గానికి పరిమితమై ఉన్నది ఒక ఇందిరాగాంధీ ఒక మొరార్జీదేశాయినీ, ఒక ఎ స్.కే. పాటిల్‌నూ మట్టికరిపిస్తే అందులో ప్రజల రాజకీయ చైతన్యం ప్రతిబింబించదు. (ప్రజలు రాజకీయ చైతన్యం ఒక సాధారణ ఎన్నికలప్పుడే ప్రదర్శించినట్టు నాకు తోస్తుంది, ఆ ఎన్నికల్లో, మంత్రిత్వాలు నిర్వహించిన వారినందరినీ ప్రజలు కూడబలుక్కున్నట్టు దించేశారు అది చూసి అభ్యుదయ రాజకీయవాదులు హర్షించి, మరింత చైతన్యంతో పనిచెయ్యటానికి బదులు విశ్రాంతి తీసుకున్నారు!)

రెండో ప్రపంచ యుద్ధం అయిపోయే రోజుల్లో మహానుభావుడు శ్రీరంగం నారాయణ బాబు నాతో, ''ఈ దేశ మొదటి శత్రువు మతం!'' అంటేనేను నా అజ్ఞానంలో, 'వెర్రివాడ! సోషలిజం వచ్చి మతం కోరలు లాగేస్తుంది' అనుకున్నాను ఆ తరువాత రెండు మూడేళ్లకు మతాలు కొన్ని లక్షల ప్రాణాలను బలిపుచ్చుకున్నాయి మతం బుసలు కొట్టుతూండగా సోషలిజం రావటం కష్టసాధ్యమేమోనన్న అనుమానం నాలో చాలా ఆలస్యంగా తల ఎత్తింది

ఇటువంటి పొరపాటే కులాల విషయంలోనూ చేశాను. 1942 లోనే కులంగాడికి అంత్యక్రియలు చేశాను కాని 30 ఏళ్ళ అనంతరం కులంగాడు ఎప్పటికన్నా

జోరుగా ఉన్నాడు నేను కంపుకొడుతున్నదనుకున్నది కుళ్ళంగాడి శవం అని భ్రమపడ్డాను కాని అది బతికున్న కుళ్ళంగాడి సువాసనే!

చెప్పవచ్చేదేమంటే, అట్టడుగున మన సమస్య సాంస్కృతిక సమస్య అన్ని సమస్యలకూ అడుగున ఉన్న ఈ సాంస్కృతిక విప్లవాల కోసం కృషిచేయవలసినవారు శాస్త్రీయంగానూ, సమష్టిగానూ కృషిచెయ్యటం జరిగినట్టయితే చీనావారు సాధించిన సర్వతోముఖ కృషి మనదేశంలోనూ జరిగి, ఈ దేశంకూడా ప్రపంచ రాజ్యాలలో మూడోస్థానం కాకపోతే నాలుగోస్థానమైనా ఆక్రమించగలిగేది

కాని జరిగిందేమిటి? దేశం తన స్వాతంత్ర్యాన్ని నయావలసదార్లకు తాకట్టు పెట్టేసింది కుక్కల దొడ్డిలాగానూ, పందుల దొడ్డిలాగానూ తయారయింది పచ్చిఫాసిజం విలయతాండవం చేస్తున్నది ప్రజాక్షేమానికి ముఖ్యాధారాలైన విద్యాసంస్థలూ, పోలీసు శాఖా అవినీతికి, అరాజకానికీ ఆయువుపట్లుగా మారాయి సంతాననిరోధంలాంటి బైరాగిచిట్కాలు రాజకీయ వివాదాలయ్యాయి పెట్టుబడిదారీ పత్రికలు పాలకవర్గం కన్న కూడా మరింత హెచ్చుగా ప్రజలను - విద్యాధికులనుసైతం- దుష్ప్రచారానికీ, brain washingకూ గురిచేయటానికి శాయశక్తులా కృషిచేస్తున్నాయి

ఉన్న పరిస్థితులపైన జుగుప్సా, ఆగ్రహమూ సాంస్కృతిక విప్లవానికి కాళ్ళు సాయుధ విప్లవానికి సాంస్కృతిక విప్లవం వాహనం. సామాజిక విప్లవం రావటానికి అడ్డంగా ఉన్న ప్రతి ఆటవిక, జమీందారీ, బూర్జువా లక్షణాన్నీ చించి చెండాడటం విప్లవ రచయితల సాంస్కృతిక వైఖరికావాలి. చైతన్యంగలవారికే చైతన్యం అందించటంలో పురోగమనం లేదు కాళ్ళు కట్టేసి ఉన్నవారిని నడిపించాలి అంటే, వాళ్ళ కాళ్ళ సంకెళ్లు విడగొట్టాలి పురోగమనానికి అడ్డంగా ఉన్న సాంస్కృతిక బంధాలు తెంచటం విప్లవరచయితల కర్తవ్యం

రాజకీయ విమర్శలూ, తిరుగుబాటూ పెట్టుబడిదారీలో అన్ని కళలకూ ముఖ్యలక్షణమని ఫిషర్ అన్నాడు, అవి పెట్టుబడిదారీ వ్యవస్థలో కళలకుగల ముందుచూపుకు నిదర్శనాలు. కాని మనం ఈనాడు సాంస్కృతిక కీకారణ్యంలో ఉన్నాం. పెట్టుబడిదారీ వ్యవస్థతోపాటు దాని పూర్వ వ్యవస్థలుకూడా మనని పీడిస్తున్నాయి వాటిని మనం ఉపేక్షించటానికి లేదు నరబలిమొదలుకుని ఏ రాతియుగ లక్షణం నుంచీ పూర్తిగా బయటపడని దేశం మనది. అందుచేత విప్లవ రచయితలకు చేతినిండా పని.

*సృజన మాసపత్రిక, 1971 సెప్టెంబరు*

*పునర్ముద్రణ సాహిత్యంలో విప్లవోద్యమం, సృజన ప్రచురణ, 1971, అక్టోబరు*

# 11. సంస్కృతీ - సమస్య

ఈనాడు విరసం ఉద్యమాన్ని గురించి అనుకూలంగానూ, ప్రతికూలంగానూ కూడా మాట్లాడేవారు కొందరు మన సంస్కృతిని గురించి కూడా మాట్లాడుతున్నారు నిజానికి ఇది సంస్కృతిని గురించి మాట్లాడదగిన తరుణం కాదు

మన సంస్కృతి అనగానే మన సంస్కృతి ఏది అన్న ప్రశ్న వస్తుంది వలస దేశం అయిన నాడే మన జాతీయ సంస్కృతి పోయింది. మనం ఏ చదువులు చదవాలో, ఎలాటి దుస్తులు ధరించాలో, ఎలాటి సాహిత్యం పఠించాలో, ఎలా ప్రయాణాలు చెయ్యాలో, మన పాత సంస్కృతిని మారుతున్న జీవితానికి అనుగుణంగా ఎలా మలుచుకోవాలో, చివరకు ఏది నాగరికతో, ఏది కాదో బ్రిటీషు పాలకులే నిర్ణయించారు

తెలుగు సంస్కృతాలు చదువుకున్న వాళ్ళు బైతుల కింద చలామణి అయ్యే పరిస్థితి వచ్చింది పాఠశాలలలో సంస్కృతం తెలుగు మేష్టర్లు అందరికన్న హీనులయారు వాళ్ళెన్నడూ హెడ్మాష్టరు గిరీ వెలిగించినట్టు నేను వినలేదు. బ్రాహ్మణులు పౌరోహిత్యాలు మానేసి తమ పిల్లలకు ఇంగ్లీషు చదువులు చెప్పించారు. పురోహితులతో సంబంధాలు చేసుకోవటం సాటి బ్రాహ్మలకే న్యూనతగా ఉండేది. రాను రాను ప్రభుత్వోద్యోగాలకు బ్రాహ్మణులు హీనవర్ణులు కూడా అయారు

పంచముల కింద దూరాన వుంచబడినవారు క్రైస్తవ మతం పుచ్చుకుని పెద్ద ఉద్యోగాలు చేస్తే ఇతర వర్గాలవారు వారి అడుగులకు మడుగులొత్తారు

ఇలాటి మార్పులన్నిటినీ మన సమాజం ఆమోదించింది. ఆమోదించని వారు త్రేతాయుగం వాళ్ళనిపించుకున్నారు అంతేతప్ప, ''అయ్యో, మన జాతీయ సంస్కృతి మంటగలిసిందే!'' అని వాపోయినవాళ్ళు లేరు - ఉంటే, వాళ్ళు దాన్ని పునరుద్ధరించటానికి చేసినదీలేదు. మన పాత సంస్కృతి ఎంత మహోన్నతమైన దనుకున్నప్పటికీ అది కొనసాగటానికి తగిన భౌతిక పరిస్థితులు అంతరించాయని అందరికీ తెలుసు కనకనే ఆ పాత సంస్కృతిని అంటి పెట్టుకున్న వాళ్ళ జీవితం మోడైపోయింది ఆ మన సంస్కృతి ఏనాడో చచ్చింది

కాని మనం సంస్కృతీ రహితంగా జీవించలేదు. కొత్తసంస్కృతిని అందుకున్నాం

అయితే అది మన జాతీయ సంస్కృతి కాదు. పాశ్చాత్యులు వారి అవసరాల కోసం మనకు మప్పినది. బ్రిటీషువాళ్ళు ఈ దేశంలో తమ పరిపాలన సవ్యంగా సాగగలందులకు రైళ్ళూ, రవాణా సౌకర్యాలు ఏర్పాటు చేశారు తమ ప్రభుత్వ

యంత్రాంగం నడపటానికి అవసరమైన విద్యలు చెప్పటానికి స్కూళ్ళూ, కళాశాలలూ, విశ్వవిద్యాలయాలూ ఏర్పాటు చేశారు. మన దేశాన్ని దోచుకోవటానికీ, మనను మన హద్దులలో ఉంచటానికీ తగిన శాసనాలు చేశారు. మనలో పైకెత్తవలసిన వర్గాలను కొత్తగా సృష్టి చేశారు. మన గత చరిత్రను అనాగరికంగానూ, తమ పరిపాలనను నాగరికంగానూ చిత్రించే పుస్తకాలను మన చేత చదివించారు. వాళ్ళు మన మతం జోలికి రానట్టు పెద్ద పోజు పెట్టారు. నిజానికి కొన్ని ఆచారాలు తప్పిస్తే మనకున్న మతం ఏమిటి?

ఇదంతా మనకు బ్రిటీషు పరిపాలన చలవేనని ఏనాడు అనుకున్నామో, ఆనాడే మన సంస్కృతి బ్రిటీషువారి సంస్కృతికి చవుకబారు నకలు అయిపోయింది. సూటువేసుకుని ఇంగ్లీషులో అనర్గళంగా మాట్లాడగల వాడిది గొప్ప సంస్కృతీ, ధోవతీ కట్టుకుని తెలుగు మాత్రమే మాట్లాడగల వాడిది తక్కువ సంస్కృతీ, కొల్లాయి గుడ్డకట్టుకున్న వాడిది సంస్కృతిలేని స్థితీ అయింది.

ఈ సంస్కృతి అయినా బస్తీలకూ, పట్టణాలకూ మాత్రమే పరిమితమయింది. బస్తీవాళ్ళు ఏదన్నా 'నాగరిక' సూచిస్తే పల్లెటూరివాళ్ళు '' మాకెందుకురా అన్నీ, ఎద్దుముడ్డి పొడుచుకునే వాళ్ళకూ?'' అనేవారు. మనం ఉన్నత సంస్కృతి అనుకున్నది జాతీయ సంస్కృతి కాదని వేరే చెప్పనవసరం లేకపోయింది. నూటికి 80, 90 మందికి ఆ సంస్కృతి అందేదికాదు.

ఈ పరిస్థితిని జనం ఎలా సహించగలిగారు? మత విశ్వాసాలూ, మతాచారాలూ వారిని సమాధాన పరిచాయనటానికి సందేహం లేదు. పూజలూ, వ్రతాలూ పండగలూ వారికి మానసిక సంతృప్తి నిచ్చాయి. వారి సంపద మంచి ఇళ్ళూ, తిళ్ళూ, వైద్యసౌకర్యాలూ, బడులూ కావు. దీపారాధనలూ, లక్షపత్రి పూజలూ, గుడిలో అర్చనలూ, బ్రాహ్మలు చదివే (వారికే అర్థంగాని) మంత్రాలూ, తంత్రాలూ, నోములు, పేరంటాలూ, మేళాలూ, ఊరేగింపులూ (ఊళ్ళో ఎవరి పెళ్ళి అయినా ఒకటే) వాళ్ళ వినోదాలు, వీధినాటకాలూ, బుర్రకథలూ, హరికథలూ, రోగాలు వస్తే నాటువైద్యులు, శస్త్ర చికిత్సకు మంగళ్ళు ఇదిగాక ప్రతి ఇంటా పోపుతో పెట్టే నైవేద్యం ఆనవాయితీగా ఉండనే ఉంది. ఈ పరిధిలో వీలయినంత సుఖంగా - అంటే మానసిక తృప్తితో - జీవించటానికి ఏ సంస్కృతి కావాలో, ఆ సంస్కృతితోనే అత్యధిక సంఖ్యాకులు సరిపెట్టుకున్నారు.

''ఇదిత్సు! మీరు మూఢాచారాలలో జీవిస్తున్నారు. మీరు భూతవైద్యులచేత చికిత్సలు చేయించుకోరాదు. మీ ఆలోచనా విధానాలు మారితే గాని మీరు నిజంగా సుఖపడలేరు '' అని ఆ ప్రజలతో అన్నవాళ్ళు అరువు తెచ్చుకున్న నాగరికతా సంస్కారాలతో మాట్లాడిన సంస్కర్తలు. తమకు హేయంగా కనబడే ఈ 'పాత

సంస్కృతి ' కట్టుకుని లక్షమంది, కోట్ల మంది జీవిస్తూ ఉండటానికి గల భౌతిక కారణాలు ఏవో వారు విచారించలేదు

సంస్కర్తలు జీవిత విధానాలనే గాక ప్రజల మతాన్ని కూడా సంస్కరించ యత్నించారు వీరి కృషి కూడా బస్తీలలోనూ, పట్టణాలలోనూ మాత్రమే హెచ్చుగా విజయవంతమయింది '' మీరు విధినీ, ప్రారబ్ధాన్నీ నమ్మవద్దు స్వయంకృషితో మీ జీవితాలను తీర్చిదిద్దుకోండి '' అని సంస్కర్తలు బోధించినది బాగానే ఉన్నది గాని గ్రామీణులు స్వయంకృషి ద్వారా సాధించటానికి దాదాపు ఏమీ లేదు తమ కష్టాలకూ, అశక్తతకూ కారణం విధి , కాకపోతే మరెవరో తెలుసుకునే పరిజ్ఞానం వారికి లేదు ఉంటే విప్లవమే!

ఈ పరిస్థితి జాతీయోద్యమంతో మారింది జాతీయోద్యమంకూడా నగరాలలోనే పుట్టింది అది చాలా కాలం నగరాలకూ, పట్టణాలకూ, విద్యాధికులకూ పరిమితమై ఉండింది కాని అది వలస విధానానికి పుట్టిన అక్రమ సంతానం, దానికి నాయకత్వం వహించిన వారు వలస సంస్కృతిని పూర్తిగా తమది చేసుకోవాలన్న తీవ్రకాంక్షతో బయలుదేరినవాళ్ళు ఈ దేశాన్ని తెల్లవాళ్ళు పరిపాలించిన పాటి దేశీయులూ పరిపాలించగలరు, వీళ్లూ పరిశ్రమలు నడపగలరు. విదేశాలతో సమసంబంధాలు నెరపగలరు, రాజ్యాలేలగలరు, కార్లలో తిరగగలరు, స్వపరిపాలనకు కావలసిన అర్హత తమకున్నది

అయితే వలస వాళ్ళను పొమ్మనటానికి ఈ అర్హత ఒకటే చాలదు, ప్రజలు తమ మాట వింటారనీ, ప్రజాస్వామ్యం అమలు జరపటం తమకు సాధ్యమవుతుందనీ రుజువు చెయ్యాలి ప్రజాబలాన్ని కూడగట్టుకుని వలస ప్రభుత్వాన్ని కూలదోసే ఆలోచన జాతీయోద్యమం వెనక ఏనాడూ లేదు ( 1942 ఆగస్టు ఉద్యమం వెనక ఏ ఆలోచన ఉన్నదీ ఎవరికీ తెలీదు ) మన జాతీయోద్యమం బూర్జువా ప్రజాస్వామ్యం మించి ఆశించలేదు అదికూడా వలస పాలకులను నమ్మించి, మంచిగా వారినుంచి పుచ్చుకుందామనే అందుకే అహింసా నియమం.

అయితే ఇందుకుకూడా ప్రజలను కదిలించక తప్పలేదు. ప్రజ కదిలింది - కాని నిజమైన చైతన్యం పొందలేదు. పొందితే విప్లవమే!

ఈ జాతీయోద్యమంలో సంస్కృతి ప్రమేయం కొంత ఉన్నది. ఈ ఉద్యమం నుంచి రెండు రకాల ధోరణులు బయలుదేరాయి ఒకటి, నిజమైన జాతీయ సంస్కృతి కోసం గతాన్ని ఆశ్రయించేది, మరొకటి, పాశ్చాత్యానాగరికతతోనే వలసవాళ్లను జయించాలన్నది ఈ రెండు ధోరణుల మధ్య నలిగిన వాళ్ళు సంస్కర్తలు. పాత సంస్కృతికి కాలదోషం పట్టిందని వాళ్ళకు తెలుసు పాశ్చాత్య సంస్కృతి విషయంలో

'నాటు ' వాళ్ళు పాశ్చాత్యులతో పోటీపెయ్యలేరనీ తెలుసు వాళ్ళు అంతో ఇంతో జాతీయోద్యమాన్ని చిన్నచూపు చూశారు

రెండో ప్రపంచ యుద్ధం కూడా ముగిసి, బోలెడన్ని దేశాలలో విర్గంహాల సమూజాలు వెలసి, వలస దేశాలను నిగ్రహించి పాలించటం ప్రాణాంతక మనిపించిన మీదట బ్రిటీషు వాళ్ళు తొలగిపోయారు కాని తొలగి పోయేటప్పుడు తాము ఈ దేశంలో నెలకొల్పిన సంస్కృతికి అంగరక్షకులుగా ఉండి, తమ లాభాలకు దోహదం చేసే వర్గానికే దేశాన్ని అప్పజెప్పి వెళ్ళారు.

పిల్ల పోయినా పీతికంపు పోలేదన్నట్టు, సామ్రాజ్యవాదులు నెలకొల్పిన పరిపాలనా వ్యవస్థా, విద్యావిధానామూ, ఆర్థిక విధానాలూ పూర్వంలాగే ఉన్నాయి దేశం వలస నుంచి అర్ధవలసకు ఎదిగింది ( అర్ధవలస అన్నది పామర భాషలో కుక్కల దొడ్డి )

సహజంగా మనం ఇప్పుడు చూస్తున్నది కుక్కల దొడ్డి సంస్కృతి పంచకూళ్ళ కషాయం. మనవేషభాషలూ, కొనుగోలు వస్తువులూ, సినిమాలూ, సాహిత్యమూ, ఆలోచనా విధానాలూ నయావలస సంస్కృతీ ప్రభావితాలు పైవాక్యంలో 'మన ' అన్నమాట నూటికి తొంభైమంది భారతీయులకు వర్తించదు దేశంలోని అల్ప సంఖ్యాకులకూ అత్యధిక సంఖ్యాకులకూ మధ్య ఈ కృత్రిమ సంస్కృతి దాటరాని గండిగా ఉన్నది. దీన్ని జాతీయ సంస్కృతి అనే సమస్యే లేదు

నిలదీసి అడిగితే మేధావులెవరూ ఈ సెక్సు సాహిత్యాన్నీ, బూతుసినిమాలనూ, హిప్పీ అవతారాలనూ సంస్కృతి అని ఆమోదించరు ఆమాట అని మన పాత సంస్కృతికి తిరిగి పోనూ లేరు ఎందుచేతనంటే, ఆ సంస్కృతే మనలను తేలికగా వలసవాళ్ళ బానిసలను చేసింది మరి ఈ మేధావులు ఏ సంస్కృతిని గురించి మాట్లాడుతున్నారు? వారికే తెలీదు తెలిస్తే చెప్పమనండి. అది వెతికితే దొరుకుతుందా! దొరకదు. ఎందుకంటే జాతీయ సంస్కృతి అనేది ఎక్కడాలేదు

జాతీయ సంస్కృతి అన్నది జాతియొక్క సమష్టి కృషితో, సంఘర్షణ ద్వారా ఏర్పడవలసినది జాతినంతనూ దృఢంగా ఏకం చేయవలసినది ఉప్పుసత్యాగ్రహం కాలంలో ప్రజలు జాతీయ సంస్కతి యొక్క ఛాయలు ప్రదర్శించారు దేవుడి భజనలూ, కులతత్వాలూ చాలా తగ్గిపోయాయి. హిందూ ముస్లిము కొట్లాటలు ప్రాంతీయంగా ఒకటి రెండు చోట్ల జరిగినా అవి ప్రభుత్వ ప్రేరణతో జరిగాయని అందరికీ తెలుసు తొంభైశాతం హిందువులకూ, ముస్లింలకూ మత విద్వేషం లేదు మన జాతీయ రాజకీయ విముక్తి కింది నుంచి వచ్చి ఉంటే దేశంలో కులతత్వాలుండేవి కావు ఈ భజనలూ ఉండేవికావు కాని ఈ విముక్తి మనకు పైనుంచి వచ్చింది. ఈ దేశంలో రాజకీయ స్వాతంత్ర్యం పుట్టలేదు - అవతరించింది అందుకే ఈ

స్వాతంత్ర్యం పది శాతానికి మాత్రమే వచ్చింది తొంభైశాతానికి ఒక శత్రువు పోయి అంతకు ముప్పు వచ్చాడు ఈ తొంభైశాతానికి హక్కులు లేవు సాంఘిక హక్కులు లేవు మాటలు అని చెప్పుకునే కళలు లేవు, విద్యాసౌకర్యాలు లేవు, వైద్య సౌకర్యాలు లేవు ఇల్లూ, తిండీ, బట్టాలేదు

వీళ్ళు విప్లవం చెయ్యరా అనే సంస్కృతీవాదులు వీళ్ళకు ఏం చెయ్యమంటారో చెబితే బాగుండును. ప్రజా విప్లవం ద్వారా కాక ఈ దేశంలో జాతీయ సంస్కృతి మరేవిధంగా ఏర్పడుతుందో చెబితే బాగుండును సంఘతత్వం తెలియకుండా గొప్ప కవులు కాగలిగారు గదా అని వీళ్ళు తమకు తెలియని, అర్థంగాని విషయాలు మాట్లాడటం హాస్యాస్పదం

జాతీయ ప్రభుత్వం అన్ని సమస్యలూ పరిష్కరిస్తుంది అనే మాట మూఢవిశ్వాసం మన 'మహానాయకుడు' శాంతి ఉద్యమాలలో పాల్గొనదలచినవారికి పాస్‌పోర్టులు నిరాకరించటమే గాక, శాంతి కోసం ప్రభుత్వం కృషి చేయగలదు, అని సెలవిచ్చాడు (నెహ్రూ) మన జాతీయ ప్రభుత్వం అసమానతలను పెంచటానికి పంచవర్ష ప్రణాళికలను తయారు చేస్తున్నది, ఆకలి పెంచటానికి హరిత విప్లవాలు తెస్తున్నది, సంపదను పెంచటానికి దేశ ప్రజలను రుణగ్రస్తులను చేస్తున్నది, శాంతి భద్రతలను నిలబెట్టటానికి విరివిగా అరెస్టులూ, కాల్పులూ, జైలు నిర్బంధాలూ, జైళ్ళలో కాల్పులూ సాగిస్తున్నది ఈనాడు దేశంలో ఏమూల చూసినా అశాంతి తాండవిస్తున్నది. పత్రికల నిండా అశాంతి వార్తలే.

చాంగ్‌కైషేక్ కూడా జాతీయ ప్రభుత్వం వెలగబెట్టినవాడే. అతన్ని ఏ పరిస్థితులలో చరిత్ర తుడిచిపెట్టిందో మన సాంస్కృతిక వాదులు తెలుసుకోవటం మంచిది అంతేగాని ఈ కుక్కల దొడ్డిలాటి దేశంలో కాపాడవలసిన సంస్కృతి అంటూ ఒకటి ఉన్నదన్నట్టు నటించటం అవివేకం.

ప్రజలు ఆలకించదగిన సాహిత్యం ఇప్పుడిప్పుడే వెలువడుతున్నది. అది విప్లవ సాహిత్యం ఇది ప్రస్తుతం బలహీనంగా ఉండవచ్చు. దీనిని ప్రస్తుతం కొద్ది మంది ప్రజలే శ్రద్ధగా వినవచ్చు కాని దీనికున్న భవిష్యత్తు, సంస్కృతీవాదులు సృష్టించే ఆపసోపాల సాహిత్యానికి లేదు జాతీయ సంస్కృతిని జాతి యావత్తూ పోరాడి సృష్టిస్తుంది ఇది నిజం

*ప్రభంజనం, పక్షప్రతిక అక్టోబర్ 16, 1972*

# 12. విషాదం నుంచి హాస్యం

మానవ వ్యవహారాలలో మొదట విషాదంగా వుండేది పరిణామక్రమంలో హాస్యాస్పదం అవుతుందని మార్క్స్ చెప్పాడు ఇవ్వాళ భయానకంగా వున్నవి రేపు హాస్యాస్పదంగా ఎలా పరిణమిస్తాయో ఊహించటం వల్ల ఈనాటి పరిస్థితులను మార్పు చేయటానికి జరిగే కృషి తేలికవుతుంది

పాతకాలపు యుద్ధతంత్రాలు ఈనాడు హాస్యాస్పదంగా కనిపిస్తాయి మన సంప్రదాయ యుద్ధతంత్రం అల్పసంఖ్యాకులకు ఓడిపోవటానికి చక్కగా పనికి వచ్చింది కాని ఈ కాలంలో ఆ యుద్ధాలు విషాదాన్నేకలిగించాయి. మన పాత ఆచారాలు ఈనాడున్న వాస్తవ సామాజిక పరిస్థితులలో హాస్యాస్పదంగానే కనిపిస్తాయి పరమ దరిద్రుడు తన తండ్రిచస్తే బంధువుల పోరుపడలేక ఇల్లు వాకిలి తాకట్టు పెట్టి తండ్రికి శాస్త్రోక్తంగా ఉత్తర క్రియలూ, గోదానమూ చేయించటం మహాదారుణం కాని సామాజిక జ్ఞానంలో రెండడుగులు ముందుకు వేసిన వాళ్ళ దృష్టిలో ఈ ఉత్తర క్రియల తంతు అంతా హాస్యాస్పదం.

ఆడపిల్ల పెండ్లిచెయ్యటానికి తండ్రి దివాలా తీయడం విషాదకరం కాని కొత్త వివేచన వున్న వారి దృష్టిలో పిల్లనూ, డబ్బునూ కూడా పోగొట్టుకోవడం హాస్యాస్పదం పాతికేళ్ళు వచ్చిన ఆడపిల్లకు తండ్రి, కాళ్ళు బలపాలు కట్టేటట్లు తిరిగి వరుణ్ని వెతకడం కూడా హాస్యాస్పదమే. చిత్రమేమిటంటే వాస్తవంలో నిన్న విషాదంగా వున్నది, రేపు హాస్యంగా పరిణమించాలి కాని నిలువు నిచ్చెన లాంటి మన సమాజంలో ఒకే విషయాన్ని గురించి కొందరు ఏడ్వటం మరి కొందరు నవ్వటం జరుగుతుంది. జరుగుతున్నది ఎగుడు, దిగుడు పెరుగుదల! తిరుపతి వెళ్ళి క్షౌరమై వచ్చేవాళ్ళు కొందరూ, వాళ్ళను చూచి నవ్వేవాళ్ళు కొందరూ, పితృదేవతలకోసం శ్రాద్ధాలు పెట్టి సొమ్మసిల్లేవాళ్ళు కొందరూ, వాళ్ళను చూచి నవ్వేవాళ్ళు కొందరూ, ఇట్లా జీవితం అన్నిరంగాలలోను హాస్యవిషాదాలు పెనవేసుకున్నాయి. అమ్మాయికి గొప్పమొగుడు రావాలని జీవితమంతా కూడబెట్టినది అల్లుడి మొఖాన కొట్టడము ఆ అల్లుడు ఏదో వంక పెట్టి ఆ అమ్మాయిని తిరిగి తండ్రి మొహాన కొట్టడమూనూ! ఇలాంటివి మన దేశంలో జరుగుతాయని వింటే నాగరిక దేశాలవాళ్ళు నవ్వకేం చేస్తారు?

నాగరిక దేశాలను ఆకాశానికెత్త నవసరం వుందని కాదు. ఆ సోకాల్డ్ నాగరికదేశాలు, సోకాల్డ్ అనాగరిక దేశాల దృష్టిలో కూడా హాస్యాస్పదమవడం కద్దు. ఉదాహరణకు చీనా దేశంలో ప్రజా ప్రభుత్వం ఏర్పడిన అనంతరం కూడా అమెరికా నవనాగరికులు, చీనా ప్రజలు కమ్యూనిస్టుల మీద తిరుగబడి చాంగ్‌కైషేక్‌ను పిలిచి

''బాబూ మీరు మళ్ళీ బానిసత్వమూ, ద్రవ్యోల్బణమూ, గర్భదారిద్ర్యమూ, ఆకలి చావులూ, కొరడాదెబ్బలూ, తుపాకిగుండ్లూ దయచేయించండి ఈ కమ్యూనిష్టులు మా సమస్యలను పరిష్కరించి మాకు ఉద్యోదయం కలిగించటానికి దుర్మార్గంగా ప్రయత్నిస్తున్నారు'' అంటారన్న ఆశతో కోట్లకు కోట్లు డాలర్లు ఖర్చుచేశారు! చాంగ్‌కైషేక్ పరిపాలన కుళ్ళిపోయిందన్న వాళ్ళే ఇలా చేశారంటే ఇంతకన్నా హాస్యాస్పదం ఏముంటుంది? ఇప్పుడు నడిచే వాటర్ గేట్ విచారణ చూస్తే నిక్సన్ పాలక పార్టీయులను చూసి నవ్వక ఏ చేస్తాం?

ఇంతకూ విషాదానికి హాస్యానికి ఒక దశ వున్నది అది ఆగ్రహదశ. అదే విప్లవ దశ కూడానూ విషాదం హాస్యంగా పరిణమించే సంధిలో ఏదో ఒక పరిణామంలో విప్లవ పోరాటం వుంటుంది. చిన్న పరిధిలో జరిగేవి, సంఘంలో ఒక చిన్న వర్గానికి చెందినవి అయితే స్వల్ప ఘర్షణలుగా సాగుతాయి వితంతు వివాహాలూ, మతాంతర వివాహాలూ, అస్పృశ్యతా నివారణలూ మొదలయినవి యిలా జరుగుతాయి. రెండు మూడు వర్గాలు ఏకమై జరిపే పోరాటాలు ఇంకా తీవ్రంగా వుంటాయి శ్రామిక కర్షక విప్లవాలు సాయుధంగా సాగి అసలైన విప్లవాల క్రింద చరిత్రకెక్కుతాయి. ఏ విప్లవమైనా విషాదాన్ని ఆగ్రహం ద్వారా హాస్యంగా పరిణమించటానికే జరుగుతుంది

*జీవనాడి మాసపత్రిక, ఆగష్టు – సెప్టెంబరు, 1973*

# 13. సాంస్కృతిక దృక్పథం

సంస్కృతి అనేదాన్ని సులభంగా నిర్వచించడం కష్టం, అది చలనాత్మకంగానూ మిశ్రమంగానూ వుంటుంది జాతీయ సంస్కృతి అంటాం అలాంటిది విస్పష్టంగా ఏది వుండదు ఒకప్పుడుండేదేమో ఇప్పుడు లేదు. సంస్కృతి అనేది ఒకనది అనుకుంటే, అందులో అనేక ఉపనదులు చేరుతాయి. అది ప్రవహించే పరిసరాలను బట్టి, ఆ నదిలోని నీటి రసాయన స్వభావమూ, వేగమూ కూడా మారుతూంటాయి ఇంతే కాదు ఈ నది పాయలు చీలుతుంది ఈ పాయలు తిరిగి యేకం కావచ్చు కాకుండా వేటిదారిన అవి వెళ్ళిపోవచ్చు. ఈ నదిలో అనుక్షణమూ పాత ఒండ్రు దిగబడిపోతుంది కొత్తది వచ్చి చేరుతూ వుంటుంది ఇందులో అసంఖ్యాకమయిన రోగకారక క్రిములు కొట్టుకు వస్తూంటాయి

అందుచేత సంస్కృతిని గురించి సాధారణంగా మనం మాట్లాడేది అయిదోక్లాసు కుర్రాడు ఆవు గురించి పది వంక్తులు వ్రాసినట్లుగా వుంటుంది

ఉదాహరణకు మనసినిమాలు బాగుపడాలి , ఏ సినిమాలు? సినిమాలలో యెంత వైవిధ్యమయినా వుండే అవకాశం వుంది డ్యూన్ సర్కస్ , దో బిఘా జమీన్ , టెన్ కమాండ్‌మెంట్స్ శుపంజరు , సంస్కార ఇవన్నీ ఒకేరకం సినిమాలు కావు వీటి బాగు భిన్నభిన్నంగా వుంటుంది

దేశం బాగుపడాలి అన్న నినాదం తీసుకోండి దేశంలో అందరూ చితికిపోతున్నప్పుడే ఈ మాటకు అర్థం వున్నది బాగుపడవలసింది నూటికి తొంభైమంది అయిన పక్షంలో దేశమంటే ఆ తొంభైశాతం అవుతారు ఎందుకంటే, మిగిలిన పది శాతం బాగుపడుతూనే వున్నారు జూదిగాళ్ళూ, వడుపు గృహాలు నడిపేవాళ్ళూ, నల్ల బజారువాళ్ళూ, కోటీశ్వరులూ, వాళ్ళ మోచేతికింద నీళ్ళుతాగే రాజకీయవేత్తలూ, లంచాలు మరిగినవాళ్ళూ, అధికారం చాటున అకృత్యాలు చేసేవాళ్ళూ చాలా బాగు పడుతున్నారు వాళ్ళు చెడితేనే గాని తొంభై శాతం ప్రజలు బాగుపడని పరిస్థితి యీనాడు దేశంలో వున్నది

సంస్కృతిలో కూడా యీ వైవిధ్యమూ, వైరుధ్యమూ వున్నాయి ఒకే సంస్కృతి గలవాళ్ళు వేమన పద్యాలనూ, ముద్దుపళని రచననూ ఏకకాలంలో ఆమోదించటం సాధ్యమా? కానీ అలా అనుకునేవారున్నారు వారికి సంస్కృతి గురించి వైరూప్య భావాలున్నాయనుకోవాలి

సాంస్కృతిక రంగంలో కృషిచేసే వాళ్ళు తాము ఏ తరగతికోసం, ఏ సామాజిక వర్గం కోసం కృషి చేస్తున్నదీ స్పష్టంగా తెలుసుకోవాలి. ఒక సుప్రసిద్ధ దర్శక నిర్మాత తాను వేలిముద్రల గాళ్ళ కోసం చిత్రాలు తీస్తున్నానని బాహాటంగా చెప్పేవాడు ఆయనకూడా తెలుగువాళ్ళ సంస్కృతికి దోహదం చేస్తున్నట్లు భావించబడుతున్నది

ఈ విధంగా సంస్కృతి పేరుతో చాలా వ్యయప్రయాసలు కొనసాగటం చేత సంస్కృతికి ఒకే ఒక గీటురాయి ధనార్జన అయి కూర్చున్నది. అందులోనూ యీ ధనస్వామ్య సంస్కృతీ యుగంలో కళాకారుడికి యెంత హెచ్చు డబ్బు చేకూర్చి పెడితే అతడి కృషి అంత ఉత్తమ సంస్కృతి అవుతుంది. అందరికన్న హెచ్చు డబ్బు సంపాదించే సినిమాస్టార్లు యీనాటి మన సంస్కృతికి అత్యుత్తమ చిహ్నాలు మంత్రుల దగ్గర నుండి వారికి దీపారాధనలు చేస్తున్నారు ఇటువంటి కుహనా సంస్కృతి నిలవదు అది నిజమయిన సంస్కృతీ వెల్లువలో కొట్టుకుపోతుంది దేశంలో అత్యధిక సంఖ్యాకులు తమ సాంస్కృతిక జండాను నిలబెడతారు ఇలా జరగకపోతే సంస్కృతి అన్న మాటకు అర్థమేలేదు

*తెలుగు కల్చరల్ అకాడమీ ( శాస్త్రి భవన్ - మద్రాసు) సావనీరు, 1974*

# 14. శాస్త్రవేత్తల దృష్టిలో సంస్కృతి నాగరికతలు

మనం సాధారణంగా సంస్కృతినీ నాగరికతనూ కళాదృష్టినుంచీ, సామాజిక దృష్టినుంచీ చూస్తాం కాని ఈ విషయాలకు శాస్త్రవేత్తలు చారిత్రక దృష్టితో ఇచ్చే నిర్వచనం వేరుగా ఉంటుంది

మాటవరసకు మానవుడు రాళ్ళు చెక్కి పరికరాలు తయారు చేసుకోవడం ఆరంభించిన నాటి నుంచీ సంస్కృతి ఆరంభమయింది ఆ సంస్కృతి క్రమంగా అభివృద్ధి చెంది విస్తరించి, అనేక వేల సంవత్సరాల మీద నాగరికతగా రూపొందింది పరికరాలు, ఆయుధాలు తయారు చేయడానికి రాళ్ళకు బదులు రాగి, కంచూ, ఇనుమూ ఉపయోగించటమూ, పశువుల పెంపకమూ, వ్యవసాయమూ, సంచార జీవితం పోయి స్థిరమైన జీవితం ఏర్పడటమూ, చక్రం కనిపెట్టడమూ, కుండలూ, ఇటుకలూ చెయ్యటమూ, నగరాలు ఏర్పడటమూ, అధిక సంఖ్యగల జనసముదాయాలు ఒకే సమాజం కావటమూ, మతమూ, రాజ్యాంగమూ, వేరు వేరు వృత్తులు ఏర్పడటమూ మొదలగునవి సంస్కృతిలో కలిగిన అభివృద్ధులు

మనకు నగరాలతో ప్రారంభమైనదే నాగరికత కాని పాశ్చాత్యులు సివిలిజేషన్ అనే దాన్ని గురించి ఏకాభిప్రాయానికి రాలేదు సంస్కృతి గురించి అభిప్రాయభేదాలు లేవు అందుచేత సంస్కృతికీ, నాగరికతకూ అవినాభావ సంబంధం వున్నప్పటికీ, రెంటికీ మౌలికమైన తేడాకూడా ఉన్నదని గ్రహించాలి.

మనం ఈనాడు నాగరికతలుగా భావించేది పెద్ద పెద్ద భవనాలూ, విశాలమైన వీధులూ, కార్లూ, విమానాలూ, రేడియోలూ, టెలిఫోనులూ వగైరాలు నిజానికి ఇది నాగరికతలో ఒక దశ. తొలి నాగరికతలు సుమేరియా, ఈజిప్టు, సింధులోయ, చీనాలోని పచ్చనదిలోయ, అమెరికాలోని అజ్టెక్, మాయ, ఇన్కా సంస్కృతులు అని శాస్త్రజ్ఞులు చెబుతున్నారు కాని ఆనాడు ఆ ప్రాంతాలలో ఉండిన నాగరికతల వివరాలు తెలుసుకుంటే వాటిని నాగరికతలు అనటానికి మనకు మనసొప్పదు. ఎందుకంటే మన సంస్కృతి ఇంకా ముందుకుపోయింది

చరిత్రలో రెండోరకం నాగరికతలు చాలా వున్నాయి అవి అరువు తెచ్చుకున్న నాగరికతలు ఈ అరువు నాగరికతలు దత్తుపోయినచోట వేళ్ళు తన్ని స్వతంత్రంగా అభివృద్ధి అయినప్పుడు వాటికి వ్యక్తిత్వం వచ్చి, స్థానిక జాతీయ స్వరూపం ఏర్పడుతుంది. అలా కానప్పుడు నాగరికత - పై పై మెరుగుగానే ఉండిపోతుంది దానికి జాతీయత ఉండదు. అలాంటి నాగరికతను అరువు నాగరికత అనటం కన్న

అరువు సంస్కృతి అనటం సబబుగా ఉంటుంది మాటవరుసకు మనం పుట్టగోచీలు పెట్టుకునే ఆటవిక జాతులవాళ్ళకు దొరటోపీలూ, సూట్లూ, గౌనులు అంటగట్టి ట్రాన్సిస్టర్ రేడియోలు ఇవ్వవచ్చు అందువల్ల వారికి లేని నాగరికత రాదు

మనం ఈ దేశంలో ఈనాడు హెచ్చుగా ప్రదర్శిస్తున్నది అరువు సంస్కృతే గాని, అది మన నిజమైన నాగరికతను ప్రతిబింబించేది కాదు నిజానికి మువరు పిగ్గట్ చెప్పినట్లు, ప్రపంచంలో అత్యధిక భాగం అనాగరిక దశ లోనే ఉన్నది నాగరికత సకృతం రాకపోకలు సుగమమై, ప్రపంచం చిన్నది కావటంలో నాగరికతలో పెద్ద అభివృద్ధి అవసరం లేకుండా సంస్కృతి (శాస్త్రజ్ఞులు నిర్వచించేది) సులువుగా విస్తరించింది.

జాతీయ నాగరికత జాతి యొక్క సమష్టి కృషి ద్వారా సాధ్యమౌతుంది అందులో సామాజిక దోపిడి ఉంటే ఉండవచ్చు గాక నైల్(ఈజిప్టు) నాగరికత, సింధు (హరప్పా) నాగరికత ప్రజల సమష్టి కృషి ఫలితాలే వర్తకం ద్వారానో, విదేశీయుల కొలాబరేషన్ ద్వారానో 'సంస్కృతి ' సరుకులు సమితి చేసుకోవటం వల్ల జాతీయ నాగరికతలు పెరగవు అవి విలాస వస్తువులుగానే ఉండిపోతాయి

తొలి నాగరితలు ఏవి చూసినా మనకు కొట్టవచ్చినట్టు కనిపించేది ఆహార సమృద్ధి అనాగరిక దశలో ప్రజలందరూ తమ కృషిని ఆహార సముపార్జనకే అంకితం చేస్తారు. కొద్ది పాటి చేతి పనులున్నప్పటికీ, అవి అహారోత్పత్తికి అడ్డురావడానికి కాదు అవి తీరిక సమయాలలో సాధ్యమయే వ్యాపకాలు నాగరికతలో అది సాధ్యం కాదు దాదాపు అయిదువేల ఏళ్ళ క్రితం సింధులోయిలో డజన్లకొద్దీ వృత్తులుండేవి వేలకొద్దీ ప్రజలు వాటికే అంకితమయారు. వారు ఆహారోత్పత్తి కార్యక్రమాలలో పాల్గొనటం సాధ్యంకాదు. అందుచేత అహార సమృద్ధిమీదనే ఏ నిజమైన నాగరికత అయినా ఆధారపడింది. మెసొపొటేమియా దక్షిణ భాగంలో పొలాలు బీడువారిపోయి ఆహారోత్పత్తి దెబ్బ తినేసరికి, సుమేరియన్ నాగరికత క్షీణించసాగింది

సింధులోయలో ఆహారోత్పత్తి పెరిగిన కారణంగా హరప్పా నాగరికత అనాగరిక ప్రాంతాలైన బెలూచిస్తాన్ లాంటి పశ్చిమ ప్రాంతాలనుంచి తూర్పున దాదాపు గంగామైదానం దాకా విస్తరించింది. నాగరికతలు నశించటానికి ఎన్ని చారిత్రక కారణాలైనా ఉండవచ్చు. కాని దాని మనుగడకు ఆహార సమృద్ధి అత్యంత ప్రధానకారణం

ఈనాడు అనేక గొప్ప దేశాలు కూడా ఆహారాన్ని దిగుమతి చేసుకుంటున్నాయి కదా, అవి నాగరిక దేశాలు కాదా అని అడగవచ్చు. న్యాయానికి అవి స్వతంత్ర నాగరికతలు కావు. సమష్టి నాగరికతలు. ప్రపంచం సోషలిజం అవలంబించకుండా నాగరికత ముందుకు పోలేదనటానికి ఈ సమష్టి నాగరికతలు గొప్ప నిదర్శనం. ఆహారం దాకా పోనవసరం లేదు పెట్రోలు అరికట్టితే ఈనాటి ఉన్నత సంస్కృతి చావుదెబ్బ తింటుంది.

నాగరికతా, సంస్కృతీ ఒకటి కాకపోగా వాటిమధ్య వైరుధ్యాలు ఉన్న సంగతి ఇప్పుడిప్పుడే మనకు స్పష్టం అవుతున్నది నాగరికత లక్షణాలలో ఒకటి డబ్బు (minted money) ఇప్పుడు కరెన్సీనోట్లు కూడాను ఈ డబ్బు సంస్కృతిని (శాస్త్రజ్ఞాన నిర్మాణంలో అవసరపు వస్తుజాలాన్ని) పేదవాళ్ళకు దూరం చేస్తున్నది నగరాలకూ, పల్లెపట్టులకూ వైరుధ్యం ఏర్పడి ఉన్నది సామాజిక పరిణామంలో ఈ వైరుధ్యం అన్ని నాగరిక చిహ్నాలకూ - చదువూ రాజకీయ జీవితమూ, గృహ నిర్మాణమూ, వగైరాలకు - వ్యాపించింది

ఈ వైరుధ్యాన్ని గుర్తించి దాన్ని పరిష్కరించే ప్రయత్నం నేటి చీనాలో మాత్రమే జరుగుతున్నట్టు కనిపిస్తుంది అది ఎలా విజయవంతమవుతుందనే దాని మీద ప్రపంచ మానవుడు నేర్చుకోవలసినది చాలా ఉంటుంది. ఏమైనా మానవుడి సామాజిక రాజకీయ చైతన్యానికంతటికీ ఈ సంస్కృతి - నాగరికతల సమస్య పునాది అనటానికి సందేహం లేదు

*కేకలు, వారపత్రిక, 7-11-1975*

# 15. సంస్కృతీ ప్రభావం

సంస్కృతి కింద జమకట్టదగిన లలితకళలు ఎందుకైనా పనికి వస్తాయా అన్న అనుమానం భారతీయ సంప్రదాయంలో ఎన్నడూ తల ఎత్తలేదు All art is useless అని ఆస్కార్ వైల్డ్ అన్నాడుగాని దానికి కారణం పాశ్చాత్య కళలు అలంకార ప్రాయంగానూ, నిష్ప్రయోజనం గానూ కనిపించి వుండడం కావచ్చు. ప్రాచ్యదేశాలలో కళలు ఎప్పుడూ ప్రయోజనాత్మకంగానే ఉంటూ వచ్చాయి.

అయితే యిటీవల కళల ప్రభావం గురించి చాలా మంది శంకించటం చూస్తున్నాం చిత్రాల ద్వారా సంఘాన్ని బాగుచేయగలమా? రచనల ద్వారా జరిగే ఉపదేశాల వల్ల సంఘానికి ఏమైనా ఉపయోగం ఉన్నదా? ఇలాటి ప్రశ్నలు ఎడాపెడా వినిపిస్తున్నాయి

ఒక వంక ఇలా ప్రశ్నలు వేస్తూంటే, ఇంకోవక్క సినిమాలలో చూసి దొంగతనాలూ, ప్రణయకలాపాలూ జరుగుతున్నాయి , చలం కథలు చదివిన ఏ ఆడదైనా మొగుడితో కాపరం చేస్తుందా? అని ఒకప్పుడు సీరియస్‌గా అడిగేవాళ్ళు

దీన్ని బట్టి ఏమనుకోవాలి? కళల వల్ల దుష్ప్రభావం వుంటుంది గాని, వాటికి సత్ప్రభావం వుండదనా కొంచెం ఆలోచిస్తే ఈ రెండు అభిప్రాయాలు తప్పేనని

తెలుస్తుంది దొంగతనాలు చేసే పైనాలు సినిమాలు చూడని వారికి కూడా తెలియవచ్చు సినిమా చిత్రాలు తీసేవారు చోరవిద్యలో నిపుణులనటానికి ఆధారం లేదు అలాగే ప్రణయం గురించి వాళ్ళకు గల భావాలు నానాగొడ..గాను వుంటున్నట్లు కనబడుతుంది దొంగతనాలు చేసే వాళ్ళ సంఖ్య పెరగటం సినిమాల ప్రభావం కానే కాదు అలాగే మొగుడితో సరిగా కాపరం చెయ్యనవసరం లేదనుకున్న మనిషికి చలం కథల మద్దతు అవసరం లేదు సంఘంలో పాటించే నియమాల ఉల్లంఘనకు కారణాలు సంఘంలోనే ఉంటాయి

చిత్రం ఏమిటంటే, కళలద్వారా నిజంగా మంచి జరిగే అవకాశాలకు అడ్డువచ్చేది కూడా సంఘవ్యవస్థే వాస్తవ జీవితంలో దాదాపు అసాధ్యంగా కనిపించే సంస్కారం చాలా సులభసాధ్యమైనట్లు ఒక కథలో గాని, నాటకంలో గాని, సినిమాలో గాని చూపవచ్చు. జీవితంలో సాధ్యం కానిది కళలో సాధ్యంగా చూపడం ఎలా జరుగుతుందంటే జీవితంలో అడ్డుతగిలే వైరుధ్యాలను దాటవేయుటం వలన 'బంగారుపంజరం' చిత్రంలో ఒక అసమ వివాహం అంతర్గత వైరుధ్యాలతో ఎలా పరిణమించేదీ చూపితే, 'తరం మారింది ' లో మూడు అసమవివాహాలలో అంతర్గత వైరుధ్యాలను దాటవేసి బాహిర వైరుధ్యాలను చిత్రించారు.

నిజానికి కళలో సామాజిక సమస్యలు చిత్రించేటప్పుడు వాటివెంట ఉండే వైరుధ్యాలను చిత్రిస్తేనే అది ఉత్తమతరగతి కళ. అన్ని వైరుధ్యాలకూ పరిష్కారం రానే వస్తుంది ఎన్నికోట్ల వైరుధ్యాలను పరిష్కరించుకుని ఆటవిక మానవుడు నాగరిక మానవుడైనాడో! ఆ పరిష్కారం జరిగినట్టు కళలో చూపకపోయినా, కళలు పరిష్కారాలను సూచించి వదలాలి. పరిష్కారం జరిగినట్టు చూపితే జనాన్ని మోసగించినట్టు అవుతుంది, ఉత్త సమస్యను చిత్రిస్తే ప్రజలకు తెలిసిందే చెప్పినట్టు అవుతుంది.

నాగరిక సమాజంలోనే కళా సంస్కృతుల స్పర్శ లేకుండా బతుకుతున్న వాళ్ళున్నారు. వాళ్ళ పరిచయం ఉన్నవారికి కళల విలువా, సంస్కృతి విలువా చప్పున బోధపడుతుంది. నిజం చెప్పాలంటే, కళవల్ల మనుషులు ప్రభావితులవుతారా కాదా అన్నది కాదు సమస్య, వాటి దుష్ప్రభావం మనుషుల మీద లేకుండా చూడటం ఎట్లాగా అన్నది అసలు సమస్య.

ఇది సులభంగా పరిష్కారం అయ్యే సమస్య కాదు అందుకు చాలా కారణాలున్నాయి

ఒకటి, పాత కాలపు కళలలాగా ఆధునిక కళలు సంప్రదాయ నియమాలకు లోబడి ఉండవు, వీటికి ఎంతో స్వేచ్ఛ కావాలి.

రెండు, స్వేచ్ఛ దుర్వినియోగం కావటానికి ఎన్నో మార్గాలు అందులో ముఖ్యమైనది డబ్బు ఈనాటి కళలు ప్రధానంగా వ్యాపారకళలు కళాకారులకు పోషకులు, మహారాజ పోషకులూ లేరు అప్పుడప్పుడూ కళలు ముష్టి ఎత్తడం ఉన్నా అది యుగధర్మం కాదు కళలను వినియోగ వస్తువుల కింద తయారుచేసి బజారులో అమ్మాలి ఇతర వస్తువుల అమ్మకంలో లాగే కళల విషయంలో కూడా గిరాకీ కలిగించటానికి కొనుగోలు దార్లను మభ్యపెట్టే ప్రయత్నం వుంటుంది కళాకారుడికీ కొనుగోలుదారుకూ మధ్య విక్రయదారు ఉంటాడు అందుచేత రసికత అనేది కాలదోషం పట్టిన వస్తువైపోతుంది

కళలను రాజులు పోషించిన కాలంలోకూడా వారి అభిరుచులు సమకాలపు సామాజిక విలువలకన్న హీనంగా ఉన్నప్పుడు కవులు వారిని తిట్టి, వారికి తమ రచనలను అంకితం ఇయ్యనిరాకరించారు ఈ కాలంలో కళలను కొనే వారిలో నూటికి తొంభైమిందికి నిజమైన కళాభిరుచి లేకపోవచ్చు ఈ కాలపు సినిమాలు, నవలలు వినోద వస్తువుల కింద బహిరంగంగా చలామణి అవుతూ ఉండటం మనం చూస్తున్నాం కదా!

మూడు- అన్ని కళలకు 'పెద్ద పాము ' రాజకీయ శక్తులు (బ్రిటిషు వాళ్ళు విదేశీయులైనా - లేక విదేశీయులు కావటం చేతనో - కళలు అదుపులో వుండేటట్టు చూసినవి సామాజిక శక్తులు ( ఎక్కడైనా రాజకీయ శక్తులు అడ్డుపడితే కొన్ని పుస్తకాలు నిషేదింపబడ్డాయి, అంతే) ఈనాడు స్వతంత్ర భారతంలో సామాజిక శక్తులు చాలా వరకు కదలబారి, సామాజిక విషయాలను అంతో ఇంతో స్వేచ్ఛగా చర్చించే వాతావరణం ఏర్పడింది కాని రాజకీయ శక్తులు బాగా కరడుగట్టాయి. దీనికి ముఖ్యకారణం సంస్కారవంతులలో రాజకీయ చైతన్యం హెచ్చు కావచ్చు వీరేశలింగంగారి హయాంలో లాగా ఈనాడు వితంతువును పెళ్ళాడాలంటే గుండెదడ వచ్చేవారెవరూ లేరు. కావలిస్తే ఇద్దరు పిల్లలతో వితంతువును పెళ్ళాడినా అడ్డగల వాళ్ళూ లేరు. సంఘ సంస్కరణలు అవలంబించ దలచిన వారికి ఈనాడు సంఘ భయం అంతగా లేదు పల్లెపట్టులలో ఉన్నా, వర్ణాంతర వివాహం చేసుకున్న వాళ్ళు ఏ పట్టణానికో వచ్చి పడితే, వారి జీవితం సాగిపోతుంది

ఈనాడు అవసరమైన రాజకీయ - ఆర్థిక పరిణామాలను అదుపులో వుంచే ప్రబలమైన శక్తులు రాజకీయశక్తులు. సమాజంలో అమలు జరుగుతున్న రాక్షసదోపిడీని అవి తుపాకులతో రక్షిస్తాయి అట్టడుగు వారికి ఈ విధమైన రక్షణ ఉండకుండా చూడటానికీ, పైవారు హత్యలు చేసినా శిక్ష లేకుండా చూడటానికీ ఆ శక్తులు తమ రాజకీయ చతురత అంతా ఉపయోగిస్తాయి. సామాన్య ప్రజలకూ, వారికి నిజంగా ఉపకరించే కళలకూ మధ్య ఈనాడు ఉన్నంత ఎత్తయిన, బలమైన, సంస్కారశూన్యమైన గోడలు మానవ చరిత్రలో ఏనాడూ లేవేమో

రాజకీయాలలో లేని కళాకారులను కారణం చెప్పకుండా, దేశ రక్షణకోసం(!) జైళ్ళలో పెట్టడం ఈనాటి పరిణామం దేశాన్ని కళాకారుల నుంచి కాపాడవలసిన అవసరం ఈనాటి రాజకీయ శక్తులకు కలిగింది! సిద్ధాంతరీత్యా ఇది ప్రజాస్వామ్యం అంటే ప్రతి ఒక్కడికి రాజకీయ విశ్వాసాలుండే అధికారం ఉన్నది ఒక్క కళాకారులకే లేదన్న మాట! అంటే సంస్కృతి పట్ల ప్రజలకు ప్రమాదమని రాజకీయ శక్తులు నిర్ణయించాయి. బూతుపుస్తకాలు రాసే వారికి, సినిమాలలో కుళ్ళు మనస్తత్వాలను ప్రదర్శిస్తూ, అంతకన్న కుళ్ళు మనస్తత్వాలను కవ్వించే వారికీ, కళావ్యాపారం కొనసాగించే వారికీ శిక్షలంటూ ఉంటే అవి చాలా స్వల్పం కానిస్వార్థం లేకుండా, తుపాకులు గల వారి నెదిరించి, ప్రజల జీవితం ఒక్క అడుగు ముందుకు వెయ్యగలందులకు కళలను సృష్టించేవారు దేశద్రోహులు

ఇక్కడ దేశమంటే పాలక - పీడక వర్గాలన్న మాట ఇందిరాయే ఇండియా అన్న నినాదాన్ని ఆమోదించి, కృష్ణుడినోట బ్రహ్మాండాలన్నీ చూసిన యశోదలాగా, ఒక్క వ్యక్తిలో దేశమంతా చూడగలిగినవారు ఒక వర్గంలో దేశాన్ని చూడలేక పోతారా? అవసరమైతే అడ్డం వున్న వాళ్ళనందరినీ హత్య చేసి, సింహాసనం ఎక్కినవాణ్ణే విష్ణుమూర్తిగా ఆమోదించిన దేశం కాదా మనది?

కళలను గురించీ, సంస్కృతి గురించీ ఇంత గొడవ ఉండగా వీటి ప్రభావం ఏమీ ఉండదని ప్రవచించే ప్రబుద్ధులు అందరికన్నా వింత మనుషులు!

*రచనాకాలం, డిశెంబరు, 1978 అముద్రితం*

# 16. సంకర సంస్కృతి

సాంకర్యం దానికది దూష్యం కాదు అనేక సందర్భాలలో వాంఛనీయం ఉదాహరణకు, జాతుల మధ్య సాంకర్యం వల్ల లాభం ఉన్నది జాతి పెరుగుదలకు ఎలాంటి సాంకర్యమూ పనికిరాదనుకుంటే సపిండ వివాహాలు శ్రేష్ఠమైనవి కాని అందువల్ల మనుషులు ఇతర జాతుల స్త్రీలను బలాత్కారంగా తెచ్చి, రాక్షస వివాహాలు చేసుకున్నారు. సహజంగా అలాటి వివాహాల వెంట యుద్ధాలు జరిగేవి. వాటి జ్ఞాపకార్థం మనవాళ్ళు మొన్న మొన్నటిదాకా పెళ్ళి అయిదోరోజున ముచ్చటగా 'దండాడింపు' జరుపుకుని, నెత్తురుకు ప్రత్నామ్నాయంగా గులాం చల్లుకునేవారు!

తరువాత ఒక్కొక్క జాతిలోనూ కొన్ని తెగలు ఏర్పాటు చేసి, ఏ తెగల మధ్య వివాహం కూడునో, వేటి మధ్య కూడదో కట్టుబాటు చేసుకొని ''సాంకర్యాన్ని'' కొద్దిగా పెంచి, క్రమబద్ధం చేసుకున్నారు. కాని సాంకర్యం అక్కడే ఆగలేదు ప్రపంచం

విస్తరిస్తున్న కొద్దీ జాతుల సంపర్కం ఎక్కువైంది ఒక్కొక్క జాతికి ఒక్కొక్క జీన్‌పూల్ ఉండడం మూలంగా ఉపజాతులు ఏర్పడ్డాయి కాని ఇది ఎదుర్కొ ప్రాయమైన స్థితి కాదు మానవజాతి కంతటికీ ఒకే 'జీన్‌పూల్' ఉండాల అనే సాంకర్యం పరాకాష్ఠను చేరుకోవాలన్నమాట ఒక వెయ్యి తరాలలో ''సాంకర్యం'' సమగ్రమవు తున్నప్పటికీ, అత్యంత ప్రాచీనకాలంలో భూమి మీద ఉండిన ప్రతి ఒక్కడికీ, ఈనాడు భూమి మీద ఉన్న ప్రతి ఒక్కడూ వారసుడేనని హెచ్ జి వెల్స్ నిరూపించాడు జాత్యంతర వివాహాలు సమ్మతంగాని జాతుల మాట ఏమిటంటే, అలాంటి జాతులలో సాంకర్యం ప్రవేశించినాక మరింత శీఘ్రంగా వ్యాప్తిచెందుతుందని వెల్స్ జ్ఞాపకం చేశాడు

ఈ విధంగా చూస్తే మనం పుట్టుకను బట్టి నిర్ణయించే కులాలూ, అస్పృశ్యతా వగైరాలన్నీ నిరాధారమైనవి కాని ఆ ''అబద్ధాలతో'' పని ఉన్న వాళ్ళు వాటిని చలామణిలో ఉంచడానికి శ్రమపడుతున్నారు నేను చాలచోట్ల చూశాను పాలెంలో ఉండే శాస్త్రీలు గ్రామంలో కనబడుతాయి ఈనాడు పితృస్వామ్యం ఎంత జోరులో ఉన్నా మనిషి కులాన్ని తల్లి మాత్రమే నిర్ణయిస్తున్నది దీన్ని కాదనడం కంఠశోష

* * *

భాషా సాంకర్యం కూడా ఎంతో మేలు చేస్తుంది ఆ మాట స్పష్టం చేసినవాడు సాహితీపరుడు కాదు గాని, సాంకర్యం వల్ల కలిగే మేలు చక్కగా గుర్తించిన డార్విన్. భాషలు ఆధునికం కావడానికి సాంకర్యం తప్ప మరో మార్గం లేదు మూడు శతాబ్దాల క్రితం ఏ అధునిక అవసరాలకూ పనికిరాకపోయినా ఇంగ్లీషు భాష అనేక ఇతర భాషలనుంచి పదజాలాన్ని స్వీకరించి ''సాంకర్యాన్ని ఆహ్వానించి'' అగ్ర అంతర్జాతీయ భాషగా రూపొందింది అలా భాషా పదజాలాన్ని జీర్ణించుకునే శక్తి తెలుగు భాషకు ఉన్న సంగతి గ్రహించి, ప్రొఫెసర్ జె బి ఎస్ హాల్డేన్ తెలుగును జాతీయ భాష చెయ్యమన్నాడు తెలుగులో ఉన్నన్ని సంస్కృత, ఇంగ్లీషు, ఉర్దూ వగైరా పరభాషా పదాలు ఏ ఇతర భారతీయ భాషలోనూ ఉన్నట్టు కనబడదు.

భాషకుగూడా ఒకరకం ''జీన్ పూల్'' ఉన్నది. సంపర్కం అసాధ్యమో, నిషిద్ధమో అయినప్పుడు, ప్రాంతీయ పదజాలం ఏర్పడి, భాషకాస్తా ''ప్రాకృతాలు'' (dialects) గా చీలుతుంది. సంస్కృతానికి ఇదే గతి పట్టిందట. చిన్నయసూరిగారు గ్రాంథిక భాషా వాదం తెచ్చిపెట్టేదాకా మహాసముద్రంలాంటి తెలుగు సాహిత్యంలో ఏప్రాంతపు కవులు ఆ ప్రాంతపు పదజాలం వాడారు. నన్నయా, తిక్కనా, పోతనా, పెద్దనా వగైరాలంతా ఒకే పదజాలాన్ని వాడారనుకోవడం అవివేకం, పైపెచ్చు గ్రాంథికవాదం పేర కవిత్రయం తరవాత వచ్చిన వారంతా తప్పులు చేశారనటం శుద్ధ బుద్ధితక్కువ

అయితే చిన్నయసూరి అవివేకంతో సంబంధం లేకుండానే తెలుగు సాంఘిక, రాజకీయాది కారణాలవల్ల ఛిన్నాభిన్నమయింది తెలుగులో మాండలిక విభేదాలు

ఏర్పడ్డాయి రాయలసీమ భాష, తెలంగాణా భాష సర్కార్ల భాష! సర్కార్ల భాషలోనే గుంటూరు - కృష్ణా, ఉభయగోదావరీ, విశాఖపట్నం, నెల్లూరు, ఒంగోలు ప్రాంతాలవీ యాసలూ, పదజాలమూ, స్పష్టంగా గుర్తించగలిగినంత భిన్నత్వం ప్రదర్శించాయి కాని, గిడుగు రామమూర్తిగారు ప్రతిపాదించిన వ్యావహారిక భాషావాదం సాంకర్యాన్ని ప్రోత్సహించి మూడు నాలుగు దశాబ్దాలలో సాహిత్యభాషలోకి ప్రాంతీయ పదజాలాన్ని విరివిగ ప్రవేశపెట్టి, దాన్ని సుసంపన్నం చేసింది ఈనాడు సాహిత్యంలో పాత్రలచేత ప్రాంతీయభాషలు మాట్లాడిస్తున్నారంటే అది వాస్తవికత పెంపొందించడానికో, పాత్ర స్వభావాన్నీ, వ్యక్తుల సామాజిక దృక్పథాన్నీ సూచించటానికో మాత్రమే ఈనాడు గ్రంథస్థమయే తెలుగుభాషలో అన్ని ప్రాంతీయపదాలకూ, కొత్తగా వచ్చే పరభాషా పదాలకూ కూడా స్థానం ఉన్నది భాషా సాంకర్యం చేసిన మేలు ఇంతా, అంతా కాదు.

* * *

సాంకర్యం వల్ల సంగీతంలో జరిగిన పరిణామం కూడా గమనించదగినది. మన దేశంలో చెప్పుకోదగిన సంప్రదాయ సంగీతాలు రెండు హిందూస్థానీ, కర్ణాటకం ఒకప్పుడు ఈ రెండూ ఒకే కుదురునుంచి పుట్టాయని చెపుతారు రెంటికీ పునాది ఒకటేలాగ కనబడుతుంది కాని, ఈనాడు ఇవి రెండు విస్పష్ట సంప్రదాయాలు కరీమ్‌ఖాన్ కర్ణాటక సంప్రదాయంలో ఉన్న సమగ్రతను గుర్తించి ఆ సంప్రదాయాన్ని అనుసరించేసరికి, ఉత్తరాది గవయ్యాలు, 'కోయిల వెళ్ళికాకులతో చేరింది!' అని నిందించారు ఈనాటి గాయకులలో అగ్రగణ్యుడైన బాలమురళీకృష్ణ శ్రవణ లౌల్యంగా పాడుతుంటే విని, ఇది 'హిందూస్థానీ సంగీతం!' అన్నవారున్నారు ఉభయత్రా సాంకర్యభయం కనిపిస్తుంది.

కానీ సంగీతంలో గూడా సాంకర్యం జరిగింది ముఖ్యంగా మూడు ప్రాంతాల వాళ్ళు - మహారాష్ట్ర, తెలుగు, కన్నడ ప్రాంతాలవాళ్ళు- రెండు సంప్రదాయాలనూ మిశ్రమంచేసి, ప్రజలలో సంగీతాభిలాష చాలా పెంచారు సినిమాలన్నవి రాకముందు ఈప్రాంతాలలో నాటకరంగం మీద శ్లాఘనీయమైన ప్రజాసంగీతం వెలసింది తెలుగు నాటకరంగం మీద పావట్ల లక్ష్మీకాంతయ్యగారి పాటలు రాకమునుపు గూడా 'పార్శీ మట్లు' అన్నపేరుతో హిందుస్థానీ బాణీ పాటలు దిగాయి. అచ్చగా కర్ణాటక సంప్రదాయంలో సంగీత తృష్ణతీరని వేలాది ప్రజలకు స్టేజిసంగీతం ఎంతో ఆదరణీయమైంది లక్ష్మీకాంతయ్యగారు కొన్ని నాటకాలకు మాత్రమే పాటలు రాశారు కొత్త నాటకాలు వచ్చినప్పుడు మనవాళ్ళు మరాఠీ స్టేజి పాటల బాణీలు వాడుకున్నారు.

మహారాష్ట్రులు తెలుగు పద్ధతిని తలకిందులు చేసి, కర్ణాటక కృతులను శ్రవణపేయంగా మార్చి మరాఠీ స్టేజి పాటలు చేసుకున్నారు. ''వరము లొసగి'', ''శ్రీ

ఏముకుం మంము'', ''మరుగేలరా'' లాటి కృతులు అనేకం మరాఠీ స్టేజి పాటలుగా మారు పెట్టటమే గాక, ఆ మారిన రూపంలో తెలుగు స్టేజి పాటలు కూడా వచ్చాయి! ఈనాడు మనం సినిమా సంగీతంగా వినే ఎన్నో పాటల కన్న తెలుగు స్టేజి పాటల్లో ఎక్కువ సంగీతం ఉండేది (స్టేజి పాటలకు హార్మో మృదంగాలు ఉపయోగించలేదు

కర్ణాటక సంగీతం ''మడి'' కట్టుక కూర్చున్న మేరకు పాచిపట్టి పోక తప్పదు హిందూస్థానీ అయినా అంతే, అయితే హిందూస్థానీవాళ్ళు కర్ణాటక సంప్రదాయం నుంచి అరువు పుచ్చుకోవటంలో ఎక్కువ చొరవ చూపుతున్నారు ఎప్పటికైనా భారతీయ సంగీతం తిరిగి ఏకం అయితీరాలి ''సాంకర్యం'' తప్ప అందుకు మరో మార్గం లేదు రెండు సంగీతాలూ విదేశీయులను ఆకర్షిస్తున్నాయి ఇందులో కూడా హిందూస్థానీ సంగీతమే అధిక విజయం సాధిస్తున్నట్లు కనిపిస్తుంది భారతీయ సంగీతాల సమ్మేళనం ఏ అమెరికాలోనో జరిగితే అది అనూహ్యం కాదు కాని మన అజ్ఞానికి అంత కన్న మంచి నిదర్శనం ఉండబోదు.

* * *

సాంకర్యం వల్ల సంస్కృతికి జరిగే మేలు గురించి చెప్పుకున్నాక కీడును గురించి గూడా చెప్పుకోవటం ఉచితంగా ఉంటుంది ఈ కీడును అంచనా వెయ్యటం సంస్కృతి పరంగానే సాధ్యమవుతుంది ఎందుకంటే జాతికీ, జాతి సంస్కృతికీ మేలు చెయ్యని సాంకర్యం నిరుపయోగం, అపాయకరంగూడానూ

మన సంస్కృతిలో అలాంటి సాంకర్యం చాలా ఉన్నది ఒక ఉదాహరణ తీసుకుందాం ఏ ఖండాతరంనుంచో, లోకాంతరం నుంచో మనుషులు వచ్చితెలుగు సంస్కృతి గురించి పరిశోధనలు ప్రారంభిస్తే వాళ్ళు క్షణంలో అయోమయంలో పడిపోతారు. వాళ్ళ పరిశోధనలకు ఆధారం మన సినిమాలూ, సాహిత్యమూ, పత్రికలూ, చిత్తరువులూ వగైరాలే గదా

మన చిత్తరువుల్లో కనిపించే వ్యక్తులూ, వాతావరణమూ ఫోటోలలో గాని, జీవితంలో గాని ఎక్కడా కనబడదు పెళ్ళి సమస్యా, ఆర్థిక సమస్యా మొదలైనవి సినిమాలలో ఉన్నట్టు జీవితంలో ఉండవు వాస్తవ జీవితంలో ఎన్ని సంబంధాలు చూసినా ఒకంతట ముడిపడదు సినిమాలో ఇట్టే జంట కుదిరిపోతుంది సినిమా ఇంకా తీస్తుండగానే పాత్రధారులను బట్టి జంట చెప్పెయ్యవచ్చు సినిమాలో ప్రేయసీ ప్రియులు ఆరుబయట పొలాల్లో డూ యెట్లు పాడుతూ డాన్సు చెయ్యటమూ, పార్లిగింతలు పెట్టటమూ తెలుగువాళ్ళ జీవితానికి సంబంధించినది కాదు, అలా ఎవరన్నా చేస్తే తప్పక పెర్రాసుపత్రికి పంపిస్తారు.

సినిమాలలో తెలుగువాళ్ళ దుస్తుల గురించీ, ఇళ్ళను గురించీ, జీవిత విధానాలను గురించీ తెలిపే మాట అటుంచి, స్త్రీని గురించి తెలుగువాళ్ళ నిజమైన సంస్కృతి ఏది?

వాస్తవజీవితంలో మగవాడు భార్యకు ఇచ్చేవి 'నెగెటివ్ వాల్యూ' అని నిర్ణయించి, దాన్ని కట్నంగా పుచ్చుకుంటాడు పెళ్ళయాక నెగెటివ్ వాల్యూ పెరుగుతూ ఉంటుంది ఇది ఎలా సాధ్యమో తెలుగు వాళ్ళకే తెలియాల ( ఎ మాచ కట్నాలు తీసుకునే ప్రతి మారెప్పుడికి పెరుగుతుంది )

సినిమా ఆడదాని ఆదర్శం - బట్టలు విప్పుకు తిరిగినా, పరపురుషులతో కాబరే డాన్సులు చేసినా, చివరకు పాతివ్రత్యమే పతివ్రత కాని సినిమా హీరోయిన్ గాని, ఎవరికి బడితేవారికి స్వాధీనంగా ఉండని వాంప్‌గాని సినిమాలలో కనరాదు

కార్టూన్లలో కనిపించే తెలుగు ఆడది రకరకాలుగా ఉంటుంది ఆవిడ అప్పడాల కర్రచేత ధరించి, మొగుడి రాకకోసం ఎదురు చూస్తూండవచ్చు భర్త చేత వంట చేయిస్తూ తాను ''నవల్లు'' రాస్తూండవచ్చు పిట్టగోడ ఇవతల ఉన్న పిన్నిగారితో అబద్ధాలు, అతిశయోక్తులు ఆడుతుండవచ్చు

కథలలో ఉండే తెలుగు ఆడబడుచు డబ్బుండి జీవితం లేకనో, జీవితం ఉండి డబ్బులేకనో, మొగుడుండి సుఖం లేకనో, సుఖం అందుబాటులో ఉండి ధైర్యం లేకనో, లేక అవకాశానికి లొంగిపోయో రకరకాల భంగిమల్లో కనిపిస్తుంది

కళారూపాలలో గాక స్త్రీలకు సంబంధించిన ఉద్యమాలలో స్త్రీకి సంబంధించిన సంస్కృతి పూర్తిగా మరోరకంగా ఉంటుంది

ఒక సమస్య ఇన్ని రకాలుగా ఉండటం సాంకర్యమే ఇందులో వాస్తవ సంస్కృతిని ప్రతిబింబించేది ఒకేరకం అయితే మిగిలిన రకాలన్నీ అవాంఛనీయమే అవి మన అసలు సంస్కృతి మీద వాతలు - ఇతర సంస్కృతులను చూసి పెట్టుకున్న వాతలు ఇంగ్లీషు సినిమాలలో అందరు మగాళ్ళతోటీ స్వేచ్ఛగా తిరిగే స్త్రీలు ఉన్నత సంస్కృతి గలవారిలాగా కనిపిస్తారు గనక మన సినిమా హీరోయిన్లు ఆ సంస్కృతిని ప్రతిబింబించాలి కాని మన హీరోయిన్‌ను విలన్ మానభంగం చెయ్యటానికి వచ్చినప్పుడు ఏ దేవుడో అడ్డుపడి, ఆవిడ పాతివ్రత్యాన్ని కాపాడాలి 'రేప్' జరిగి పోయిందంటే, ఆవిడ హీరోయిన్ కాదని ప్రేక్షకుడు నిర్ధారణ చేసుకోవచ్చు.

ఇటువంటి సాంకర్య - సంస్కృతుల అడ్డగోలు మిశ్రణం అపాయకరం కాదనుకున్న వాడికన్న అమాయకుడు ఎలా ఉంటాడు? పుస్తకాలూ, సినిమాలూ, నాటకాలూ వాస్తవజీవితాన్ని చిత్రించలేని జాతి సంస్కృతి ఇలాంటి సాంకర్యాలకూ, విరుద్ధ ప్రభావాలకూ గురికాక తప్పదు

*అరుణతార, మాసపత్రిక, జనవరి 1979*

# 17. మనసంస్కృతి

సంస్కృతి కృత్రిమమైంది ఏ మనిషీ ఒకానొక సంస్కృతిలో పుట్టడు దాన్ని తన చుట్టూ ఉన్న సమాజంనుంచి, తనకుసాధ్యమైన మేరకూ, ఇష్టమైన మేరకూ అంది పుచ్చుకుంటాడు సంస్కృతి సామూహికమైనదీ, పరిణామ క్రమంలో ఏర్పడినదీ, బాహ్యపరిస్థితులలో మార్పులకు ప్రతిస్పందించేదీనూ, అందులో జాతి లక్షణాలూ, ప్రాంతీయ లక్షణాలూ ఉంటాయి కాని ఒక జాతికీ, ఒక ప్రాంతానికీ చెందిన వ్యక్తులందరూ ఒకేరకం సంస్కృతి ప్రదర్శించరు కొందరు వ్యక్తులలో సంస్కృతి చాలా దుర్బలంగా కనిపిస్తుంది మరి కొందరు తమ సంస్కృతితో సాటివారినీ, ఇతర జాతుల వారినిసైతం ప్రభావితులను చేయగలిగినట్టు కనబడతారు రష్యను టాల్‌స్టాయ్, ఇంగ్లీషు షేక్స్‌పియర్, భారతీయ టాగోర్, క్రీస్తూ, బుద్ధుడూ, మహమ్మద్- ఇలాటివాళ్ళు తమ సంస్కృతితో దాదాపు ప్రపంచంలోని అన్ని ప్రాంతాల వాళ్ళనూ ప్రభావితులను చేసినట్టు కనపడ్డారు అయితే అందరి ప్రభావమూ ఒకే యుగానికి, లేక ఒకే మానవ సమాజ పరిణామ దశకు సంబంధించినది కాదు. ఈనాడు మత ప్రభావం చాలా తక్కువ, మత సంస్కృతి కూడానూ ఈనాడు కార్ల్ మార్క్స్, లెనిన్, మావోల ప్రభావం హెచ్చుగా వున్నది వాళ్ళ ప్రభావం పూర్తిగా ఆధునిక యుగానికి చెందినది. ఈనాడు కూడా అన్ని దేశాలలోనూ తమ మత భావాలతో ఇతరులను ప్రభావితులను చేయగలవారున్నారు మన భారత దేశంలోని బాబాలకు దేశాంతరాలలో కూడా భక్తులున్నారు అయితే వీరి ప్రభావం విస్తృతమైన మానవ జీవిత పరిణామానికి తోడ్పడదు. ప్రపంచానికి మతయుగం అయిపోయింది అలాగే, ఇవాళ టాగోర్‌కన్నా గొప్ప కవులు మనదేశంలో ఉండవచ్చు. కాని వారికి ఖండాంతర ఖ్యాతిరాదు సాహిత్య సంస్కృతి ఈనాటి విశాలమానవ జీవితాన్ని ప్రభావితం చెయ్యలేదు ఈనాటి విశాల మానవ జీవితాన్ని ముందుకు నడపగలది ఆర్థిక - రాజకీయ సంస్కృతి దాన్ని అధునాతనంగా చేసుకొన్న జాతులు పురోగమిస్తాయి, ప్రాచీన ఆర్థిక - రాజకీయ సంస్కృతులను పట్టుకు వెళ్ళాడే జాతులు వెనకబడిపోతాయి

సంస్కృతి అనేది మానవుడి అవసరాలలో, ముఖ్యావసరాలలో ఒకటి. జీవిత సమస్యలను ఒక వ్యక్తిగాని, ఒక సమాజంగాని, ఎలా ఎదుర్కొనేది ఎలా పరిష్కరించుకొనేది ఆ జాతి యొక్క, లేక వ్యక్తియొక్క సంస్కారం నిర్ణయిస్తుంది సంస్కృతిలో యుగధర్మం ఉంటుందన్నది మనం స్పష్టంగా గుర్తించాలి ఉదాహరణకు, ఇంకా మత యుగంలోనే నివసిస్తున్నామనుకునే వాళ్లు ప్రపంచంలో ఉన్నారు మనిషి దోషి అవునా, కాదా అనేది నిర్ణయించటానికి మన పూర్వులు అగ్ని

పరీక్షలు లాంటివి పెట్టేవారు - ఎర్రగా కాల్చిన కర్రలు నాకటమూ, నిప్పులు చేత్తో పట్టుకోవటమూ వగైరాలు ఇలాంటి న్యాయనిర్ణయాలను ఈనాడు ఉత్తమ సంస్కారంగా భావించం కాని మత ప్రాతిపదిక మీద రాజ్యాంగాన్ని నడపటానికి పూనుకున్న దేశాలలో, దొంగతనం చేసిన వాళ్ళ చేతులు నరకటమూ, రంకుతనం చేసిన స్త్రీలను రాళ్ళతో కొట్టి చంపటమూ లాంటి శిక్షలను పునరుద్ధరించటం జరుగుతున్నది

విజ్ఞానం సోకని వ్యక్తుల లోనూ, జాతుల లోనూ మూఢవిశ్వాసాలు కనిపిస్తాయి వాళ్ళు వైజ్ఞానికంగా ఏ యుగంలో ఉన్నదీ సులువుగా అంచనా కట్టవచ్చు అలాగే ఆర్థిక, రాజకీయ భావాలలో వ్యక్తులు గానీ, దేశాలు గాని ఎంత వెనకబడి వున్నదీ ఆ రంగాలలో వ్యక్తుల ప్రవర్తనను బట్టి తేలికగా తెలుసుకోవచ్చు 'ప్రజాస్వామ్యం ' మంత్రం ఎవ్వరైనా జపించవచ్చు. కాని ఈనాడు మన రాజకీయ నాయకులు రాజకీయ రంగంలోనూ, ఆర్థిక విషయాలలోనూ అవలంబించే వైఖరులు చూస్తే వారికి ప్రజాస్వామ్యం గురించి ఓనమాలు కూడా రావని స్పష్టంగా తెలుస్తున్నది ఖరీదైన కార్లూ, టీవీసెట్లూ, అణుఇంధనాల లాగే ఆధునికయుగపు రాజకీయ ఆర్థిక భావాలు- ఆర్థిక అసమానతలు తగ్గించటమూ, అందరికీ పనులు చూపించటమూ వగైరా- మనకన్న ముందుకు పోయిన దేశాల నుంచి అరువు తెచ్చుకున్నాం

'ప్రజాస్వామ్యం' , 'సోషలిజం ' అన్న మాటలు చిలుకలకు కూడా నేర్పవచ్చు. వాటి అర్థం తెలియటం మాట వేరు!

ఈనాడు మనం కొత్తగా సంస్కృతిని కష్టపడి సృష్టించుకోనవసరం లేదు ఆర్థిక అసమానతలను తగ్గించుకుని, ప్రజలందరి లోనూ రాజకీయ చైతన్యం సాంఘిక చైతన్యం ప్రమాణానికి పెంచుకున్న దేశాలున్నాయి వాటిలో ద్రవ్యోల్బణం లేదు. ద్రవ్యోల్బణానికీ, అందరికీ పనులుండటానికి మధ్య వైరుధ్యం లేదు. ఈ యుగానికి అవి ముందున్న దేశాలు. అంటే మానవ సమస్యలను పరిష్కరించుకోవటానికి హెచ్చు సమర్థత కలిగి ఉన్నాయి ఒకవంక ధాన్యం నిలవచేసే సదుపాయాలులేక ఆరుబయట కుళ్ళుతూంటే, ఇంకొక వంక ఆకలితో చస్తున్నవాళ్లు అదే జాతిలో ఉండటంలాంటి చచ్చు వైరుధ్యాలతో సతమతమయే దేశాలు వాటి నుంచి ఆధునికయుగానికి కావలసిన సంస్కృతి అంది పుచ్చుకోవాలి

అంతేగాని భయంకరమైన సామాజిక దురన్యాయాల మధ్య, హరిజనుల హత్యాకాండ మధ్య, రాజకీయ దుర్గంధాలమధ్య మనం అభివృద్ధి చేసిన ఆటవికపు సినిమాకళను గురించీ, ఊసుపోక సాహిత్యాలను గురంచీ రొమ్ము బాదుకుని, మన సంస్కృతి అనుకోవడం హాస్యాస్పదం అని తోస్తుంది ఇవాళ కూడా ప్రపచంలో శిలాయుగి నాగరికత లో జీవిస్తున్న జాతులున్నాయిగనక, ఎక్కడికక్కడ ప్రతి వ్యక్తీ, ప్రతి జాతీ తాను సంస్కృతి విషయంలో పురోగమించినట్లు ఆత్మ వంచన చేసుకోవచ్చు.

కాని శిలాయుగపు సంస్కృతి మన నాగరిక జీవితపు అన్ని రంగాలలోనూ ఇంక సజీవంగా ఉన్నదన్న సంగతి గ్రహించడం మన సంస్కృతి ముందుకు పోవటానికి మొదటి మెట్టేమో! హత్యారాజకీయాలూ, కల్మాలకోల హత్యలూ, సేనస్థలకు ఉన్నత వర్గాల నుంచి రక్షణా, రాజకీయ పార్టీలకు కుమ్మక్కుగా గుండాలూ, నిరుపయోగమైన పోలీసు రక్షణ శాఖ, ప్రజలనెత్తురు పీల్చే అధికార భక్షణశాఖ – వీటి మధ్య వ్యక్తి సంస్కృతిగాని, జాతి సంస్కృతిగాని ఎలా సజీవంగా ఉంటుందో ఊహించటం సాధ్యం కాకుండా ఉన్నది

*సృజన, మాసపత్రిక, డిసెంబర్, 1979*

# 18. రాష్ట్రేతరాంధ్రుల కర్తవ్యాలు

తమిళనాడులో ఉన్న యువజన సేవాసంఘం రజతోత్సవం చేసుకుంటున్నది. రాష్ట్రేతరాంధ్రుడినైన నేను నలభై ఏళ్ళుగా మద్రాసులో ఉన్నాను గాని, ఈ సంఘం నిర్వహిస్తున్న కలాపాలను గురించి తెలియదు

తమిళనాడులోని ఆంధ్రులు రాష్ట్రేతరులైతే కావచ్చు గాని, తెలుగు సాంస్కృతిక కేంద్రాలలో మద్రాసుకు ఎంతో ప్రాధాన్యం ఉన్నది ఇక్కడి నుంచి ప్రసిద్ధ తెలుగు పత్రికలు వెలువడుతున్నాయి ఈనాటి భారతీయ సంస్కృతులన్నిటిలోనూ అగ్రస్థానంలో ఉంటున్న సినిమా పరిశ్రమ యొక్క తెలుగు శాఖ మద్రాసు నుంచి కృషి చేస్తూ ఉండటమేగాక, స్వతంత్ర భారతంలో ఏ ప్రభుత్వమూ సాధించలేని జాతీయ సమైక్యతను కొంతవరకు సాధించింది తెలుగు తారలు ఇతర భాషా ప్రాంతాలలోనూ, ఇతర భాషల తారలు తెలుగు చిత్రాలలోనూ కనిపిస్తున్నారు. తెలుగు చిత్రాలు ఇతర భాషలలోకి అనువదించబడి విజయాలు సాధిస్తున్నాయి. అలాగే ఇతర భాషలలో విజయాలు సాధించిన చిత్రాలు తెలుగు దేశంలో, తెలుగు భాషలో విడుదల అయి ప్రేక్షకులను ఆకర్షిస్తున్నాయి.

ఇతరుల సంగతి ఏమైనా తెలుగు వాళ్ళకు ఎన్నడూ ప్రాంతీయ దురభిమానాలు లేవు దాదాపు అరవై ఏళ్ళ క్రితం నేను రవీంద్రనాథ్ ఠాగూరు కథల పుస్తకమూ, బంకించంద్రచటర్జీ 'రజని ' నవలా, మరికొన్నాళ్ళ అనంతరం టాగూర్ 'గోరా ' పుస్తకాలు పాఠ్యపుస్తకాలుగా చదువుకున్నాను శరత్‌బాబు తెలుగు నవలాకారుల్లో అగ్రస్థానం సంపాదించుకున్న సంగతి మనకు తెలుసు. తెలుగులోకి చక్రపాణిగారు అనువదించిన పరశురామ్ , శరత్, రవీంద్రనాథ మైత్రా వగైరాల రచనలూ, దరిమిలా ఇతరులు అనువదించిన బెంగాలీ నవలలూ, ప్రేమ్‌చంద్ రచనలూ, ఇతర హిందీ

గ్రంథాలూ సాహిత్యాభిలాష గల తెలుగు వారికి బాగా తెలుసు ఇతర భాషాసాహిత్యాల మీద తెలుగు విమర్శకులు చక్కని వ్యాసాలు కూడా వెలువరించారు (తెలుగు సాహిత్యం ఇతర భాషాప్రాంతాలలో ఇంతగా ప్రసిద్ధి పొందిందో, లేదో, అలా ప్రసిద్ధి పొందే అర్హత దానికి ఉన్నదో లేదో చెప్పగల స్థితిలో నేను లేను!)

ఒకప్పుడు చెన్నపురి ఆంధ్రమహాసభ తెలుగు సాంస్కృతిక కార్యక్రమాలు విరివిగా కొనసాగించింది అంతకు పూర్వం కూడా మద్రాసు తెలుగు సంస్కృతికి ప్రముఖ కేంద్రంగా ఉండి, నాటకాలూ అవీ ఆడేవారు అయితే తెలుగువాళ్ళది మద్రాసు కాకుండా పోయినాక కళాసాగర్ సంస్థ ఈనాడు నిర్వహిస్తున్న తెలుగు సాంస్కృతిక కార్యక్రమాలకు రాష్ట్రేతరాంధ్రులే కాక, ఆంధ్రులందరూ గర్వపడవచ్చు కళాసాగర్‌లాటి సంస్థ ఇతర ఆంధ్రేతర ప్రాంతాల ఉన్నదని నేను అనుకోను, తెలుగు గడ్డమీద లేదని కచ్చితంగా చెప్పగలను

ఇతర ప్రాంతాల ఉన్న తెలుగు సాంస్కృతిక సంస్థలు ఏడాదికోసారి తద్దినం పెట్టినట్టు లాంఛనప్రాయంగా ఎవరూ రాని మీటింగులు పెట్టి, ఎవరికీ పట్టని విషయాలు చర్చించి, ఉడతా భక్తిగా కృషి చేస్తున్నామని తృప్తిపడటం ఎంత మాత్రమూ వాంఛనీయం కాదు ఇందువల్ల ఉండే పెద్ద నష్టం ఏమిటంటే, ఇతర ప్రాంతాలవారికి మన సంస్కృతి లోని హీనపు విలువలే చూపించటం అవుతుంది మన సంస్కృతి నుంచి ఇతరులు నేర్చుకోదగినది ఏదన్నా ఉంటే, అది వారికి అందదు

అందుచేత రాష్ట్రేతర సాంస్కృతిక సంస్థల ప్రథమకర్తవ్యం ఆంధ్రుల ఉత్తమ సంస్కృతిని ఇతర ప్రాంతాల ప్రదర్శించడం అలాగే ఈ సంస్థలుండే ప్రాంతాలగల ఉత్తమ సంస్కృతిని ఆంధ్రులకు అందుబాటులో ఉండేటట్టు కృషిచెయ్యటం అలా చేస్తే ఇతర ప్రాంతాల గల సంస్కృతి నుంచి ఆంధ్రులకు ఎంతో లాభం చేకూరుతుంది

ఇలాంటికృషి ఎంత మంచి ఫలితాన్నిస్తుందో మనం ఊహించ నవసరం లేదు. రాష్ట్రేతరాంధ్రుల కారణంగా బళ్ళారి రాఘవ, స్థానంలాటి నటుల ప్రతిభ దేశంలో అనేక ప్రాంతాల తెలిసింది. ద్వారం నాయుడుగారు, బాలమురళి, ఈమని శంకరశాస్త్రి లాటి సంగీత విద్వాంసులు అఖిలభారత ఖ్యాతీ, అంతర్జాతీయ ఖ్యాతీ కూడా సంపాదించారు. మన రచయితలు అంతగా లేదుగాని, మనగాయకులు యూరప్, అమెరికా ఖండాలలో పేరు తెచ్చుకుంటున్నారు. పారిస్‌లో ఈమని పాట కచేరీ చేస్తే ఒక పత్రిక దాన్ని కన్సర్ట్ ఆఫ్ ది సెంచరీ అన్నదట

ఉత్తమ రచయితలూ, కళాకారులూ ఉత్తరానే ఉన్నారన్న అభిప్రాయం ప్రపంచానికి కలిగితే అది దక్షిణాది సాంస్కృతిక సంస్థల కృషిలోపం దక్షిణాన ఉత్తమ సంస్కృతి అంతా తమిళులదేనన్న అభిప్రాయం దేశాంతరాలలో కలిగితే అది తెలుగు సాంస్కృతిక

సంస్థల కృషిలోపం మొన్న మొన్నటి దాకా ఈ దేశంలోనే ఇతర ప్రాంతాలవాళ్ళకు ఆంధ్రులంటూ వున్నారనీ తెలీదు తెలుగు వాళ్ళను మద్రాసీలు అనేవాళ్ళు!

సాంస్కృతిక సంస్థలు ప్రారంభించటం కష్టం కాదు ఒకే ఒక్క ఔత్సాహికుడు ప్రారంభించిన తెలుగు సభ కూడా నాకు తెలుసు కాని అలాటి సంస్థల బాధ్యతలు తెలుసుకుని నిర్వహించటం సాంస్కృతిక కార్యక్రమంలోనే ఒక విశిష్టమైన భాగం యువజన సేవాసంఘం వచ్చే 25 ఏళ్ళలో మరింత బాగా తన విధులను నిర్వహిస్తుందని ఆశిస్తాను

*యువజన సేవాసంఘం (వెంగంపేట, తమిళనాడు) రజతోత్సవ సంచిక 1980-1981*

# 19. సంపదా - సంస్కృతీ

కొందరు తాము సంస్కృతికి వారసులమనో, రక్షకులమనో అనుకొని, మనుషుల మనుగడలో భౌతికవాదం నిర్వహించే పాత్రను నిరసించి, హైడ్రోజన్ గాస్ నింపిన బెలూన్‌లలాగా గాలిలోకి లేచి, భూమిని కాళ్ళు అంటకుండా కల్చర్ గురించి మాట్లాడేస్తారు. కొందరు మాత్రం డబ్బుకూ, సంపదకూ పరిమితమైన ప్రయోజనం ఉన్నదని ఒప్పుకుంటారు. మానవ చరిత్ర అంతా సంపద సృష్టి అవుతూ వచ్చిన విధానం మీదనే పరిణామం చెందుతూ వచ్చిందని నాబోటివాడు అంటే అదొక ఇజం లే అంటారు ఇజం అనేది ఆధునిక తిట్టు మాటల్లో ఒకటి గద!

ఆరంభదశలో మానవులకు తిండిని మించిన సంపదలేదు తిండి సంపాదన కోసం మనుషులు పశువుల పద్ధతే అవలంభించారు - సహజంగా దొరికిన ఆహారం ఏరుకు తిన్నారు. మానవులకు ఈ దశ ఉన్నదన్న సిద్ధాంతం పాశ్చాత్య కల్పన అనీ, నాగరిక మానవులు ఎప్పుడూ ఉన్నారనీ వాదించే వాళ్ళు అబద్ధం ఆడుతున్నారు. పరిగ ఏరుకునీ, ఉంఛవృత్తి తోనూ పొట్ట పోసుకున్న మనుషులు మన పురాణాలలో ఉన్నారు బైబిల్‌లో ఉన్నారు. నాగరిక మానవుల మాట దేవుడెరుగు, అసలు మానవులే లేని కాలాలు ఉన్నట్టు జియాలజీ, ఆర్కియాలజీ వగైరా శాస్త్రాలు ఏనాడో రుజువు చేశాయి

చెప్పొచ్చిందేమంటే ఆహారం ఏరుకుతిన్న మానవులకు, తిండి ఉంటేసరా? అని చెప్పి లాభంలేదు వేదాలే ప్రపంచమంతా భోజనమూ, భోక్తాకూడా అని చెప్పాయి. అనాటి మానవులకు చావు బతుకుల మధ్య తిండి తప్ప మరేమీ లేదు వేదాలు అన్నమో రామచంద్రా అని అల్లాడాయట

పరిగ ఏరుకునే దశలో ఎవరి తిండి వారు సంపాదించుకునేవారు నడవటం చేతనైన పిల్లలు సైతం వాళ్ళ తిండి వాళ్ళు సంపాదించుకునేవారట. మరీ చంటిపిల్లలను

తప్పిస్తే, ఒకరిని ఒకరు పోషించే సమస్య లేదు అంతేకాదు రోజల్లా తిండి ఏరుకోవడంతో సరిపోయి. కల్చర్ కు టైముండేది కాదు

ఇంతకన్న ఒక్క మెట్టు పైది జంతువులను వేటాడటం వేటగాడు ఒక్కడుగా తన తిండి తాను సంపాదించుకోడు ఆడా, మగా, పిల్లా, జెల్లా అందరూ వేటాడలేరు వేట జంతువు పలువురు తినడానికి సరిపోతుంది అయితే, ఆహార సంపాదనకు వేట కష్టసాధ్యమైన పని. జంతువుకంటపడాలి, దాన్ని కొట్టాలి, దెబ్బ తిన్న జంతువు పడిపోయేలోపుగా వాటివెనక గంటల తరబడి ఒక్కోసారి రోజుల తరబడి పరిగెత్తాల

అందుచేత వేటమీద ఆధారపడిన జాతులు పరిగ ఏరుకునే పద్ధతి వదులుకోలేదు. ఈనాటికీ కలహరి ఎడారిలోని ఆటవిక జాతులు మాంసాహారం మీదకన్న శాకాహారం మీద ఎక్కువగా ఆధారపడతాయి

వేటాడేవాళ్ళు కూడా 'కల్చర్' ఎరగరు ఎందుకంటేవేటాడే సమాజాలు కొద్ది డజన్ల సంఖ్యలో ఉంటాయి శాకాహారం నమ్మకంగా దొరికే ప్రాంతాలను వదులుకోలేవు ఆ సమాజాలుండే పరిమితమైన క్షేత్రంలో దొరికిన జంతువులను దొరికినప్పుడు కొట్టుకు తినటం తప్ప గత్యంతరం లేదు

ఆ తరవాత సమాజంలో మరొక అభివృద్ధి సాధ్యమయింది కూడా ఆహారోత్పత్తి ద్వారానే. వ్యవసాయం సమాజ స్వరూపాన్నే మార్చింది దానికిముందు పశుపోషణ దశ ఒకటి ఉన్నది కాని అది స్థిరనివాసానికి అంతగా తోడ్పడలేదు పశువులను మచ్చిక చేయుడమూ, మందలను పోషించటమూ వేటకన్న చాలా సౌకర్యంగల జీవితమే. అయినా, లోగడ మనుషులు చేసిన పని – ఆహారం ఏరుకు తినటం– ఇప్పుడు పశువులు చేశాయి మనుషులు తమ ఆహారం కోసం సంచరించక పోయినా, పశువుల కోసం సంచరించవలసి వచ్చేది.

వ్యవసాయంతో ఈ సంచారం తోడ్పడటం మొదటి విశేషం. మనుషుల ఆహారధాన్యాలూ, పశుగ్రాసమూ కూడా వ్యవసాయం నుంచి లభించింది నీటి వసరూ, సారవంతమైన భూమీ లభిస్తే మనుషులు అక్కడ స్థిరంగా ఉండిపోవచ్చు మనిషిని భూమికి నాగలి బంధించింది వ్యవసాయ ప్రక్రియ అభివృద్ధి చెందిన కొద్దీ వ్యవసాయంలో పశువుల పాత్ర పెరిగింది. అడవులు కాల్చి, వ్యవసాయం చేసిన దశలో భూసారం త్వరగా తరిగిపోయేది. కాని పశువుల పేడ మంచి ఎరువన్నది బయట పడింది వ్యవసాయం ఎరగని దశలో పశుపోషకులు పేడకుప్పలను తగల బెట్టేసేవారు.

ఇంతకన్న కూడా గొప్ప పరిణామం ఏమిటంటే, వ్యవసాయం వచ్చేసరికి అధిక సంఖ్యాకులు సమష్టిగా జీవించే అవకాశం వచ్చింది. ఎందుకంటే, ఇప్పుడు ఒక మనిషి యాభై మందికి సరిపడా ఆహారం ఉత్పత్తి చేయగలడు అంటే ఒక్క వ్యవసాయకుడి

ధర్మమూ అంటూ యాబైయింది ఆహారోత్పత్తి నుండి విముక్తులైనారు వీరు ఇతర వృత్తులు కొనసాగించటానికీ సృష్టి అంటే ఏమిటి ప్రాణం అంటే ఏమిటి అంటూ తాత్త్విక చింతనలో పడి నేలమీది నుంచి కాళ్ళు గాలిలోకి ఎత్తే కల్చర్ సృష్టించటానికి అవకాశం ఏర్పడింది

అన్నం బ్రహ్మ అన్నారు బాగానే ఉంది దాన్ని సరిగా ఉత్పత్తి చెయ్యలేని దశలో ఆ బాధ్యత వైశ్యులకు అప్పజెప్పి, వాళ్ళను తక్కువరకం 'ఆర్యులు' గా చూసినవాళ్ళు, 'కల్చర్' పెరగటానికి వ్యవసాయం అద్భుతంగా తోడ్పడి, సామాజిక విప్లవం సాధించిన దశలో ఆహారోత్పత్తి శూద్రులకు అంటగట్టి వాళ్ళను అనార్యులు అనేశారు: అన్నం రూపంలో ఒకనాడు దర్శనమిచ్చిన బ్రహ్మ, కల్చర్ ముదిరిన కొద్దీ అవాఙ్మానస గోచరుడయిపోయాడు

దీన్ని బట్టి సంస్కృతి ఆరంభదశనుంచీ నేలవిడిచిన సాముగానే ఆరంభమయిందని మనం ఊహించవచ్చు

తిండి కలిగితే కండ గలదోయ్,

కండగల వాడేను మనిషోయ్!

అని మహాకవి అన్నాడు గాని, అన్నదాతకు తిండిలేదు. కండగల వాళ్ళు ఆ అన్నదాతను దోచుకొని బతుకుతూ సంస్కృతి గురించి ఊకదంపుడు కబుర్లు చెపుతున్నవాళ్ళే

అన్నగత ప్రాణి కాని ప్రాణి ఏదీ లేదు అన్నదాతను అత్యున్నత స్థానంలో ఉంచి సామాజిక సంస్కృతిని నిర్మించుకుంటూ వచ్చినట్టయితే మానవజీవితం ఈనాడు ఇంకోవిధంగా ఉండేది

సంఖ్యాబలం వల్లనైతేనేం, తమను అధమస్థితిలో ఉంచిన సామాజిక వ్యవస్థకు కాలదోషం పట్టటం చేతనైతేనేం, శూద్రులు ఆహారోత్పత్తికే అచ్చుగా అంటిపెట్టుకో లేదు వాళ్ళు సైనికులుగా పనిచేశారు ఇతర వృత్తులు చేపట్టారు రాజ్యాలు కూడా చేశారు సామ్రాజ్యాలను స్థాపించిన నందవంశం శూద్ర వంశం. శూద్రుల ప్రభావం పెరుగుతూ రావడంతో బాటు ఆటవిక జాతులు వర్ణసమాజంలోకి వచ్చి వ్యవసాయం చేపట్టారు కల్చర్ అంతస్థులు పెరుగుతున్న కొద్దీ అన్నదాతల స్థితి క్షీణించటం తప్పనిసరి గనక ఈ కొత్త అన్నదాతలు అస్పృశ్యులయారు ఆహారోత్పత్తి, పారిశుద్ధ్యమూ లాంటి తుచ్ఛపు పనులు వారికి అప్పగించబడ్డాయి

సంస్కృతిలో ఆహారానికి అస్పృశ్యత ఏర్పడ్డాక డబ్బుకు ఉన్నత స్థానం వచ్చింది చిత్రమేమిటంటే, ఒకప్పుడు ఏది ఆహారమో, అదే ధనం కూడానూ - గోధనం అనేవాళ్లు గోవులను సొమ్ములు అంటారు కాని కల్చర్ ముదిరినకొద్దీ

వాస్తవమైన ధనం స్థానాన్ని కృత్రిమమైన ధనం ఆక్రమించుకున్నది. ఆహారంగా గొర్రె లేక మేక, గొర్రె విలువ ఒక్కటే. కృత్రిమ ధనం అలా కాదు, ఒక దేశపు ధనం ఇంకో దేశంలో చెల్లదు. రూపాయలూ, యెన్‌లూ, డాలర్లూ, ఫ్రాంక్‌లూ, మార్క్‌లూ వగైరాలు ప్రాంతీయమూ, కృత్రిమమూ అయినవి. వెండి, బంగారాలు కృత్రిమమైనవి కావు, నిజమే. అయితే ధనరూపంలో వాటి విలువ మారుతూ రావటం చేత, సీమ వల్లానికి పోయినట్టు, వెండి బంగారాలు 'ఎత్తుకు' దొంగరూణా అవుతున్నాయి! వాటి అసలు విలువకు కారణం ఏమంటే, అవి మనిషి తాలూకు ఏ అవసరాలనూ తీర్చలేవు - నగలు పెట్టుకోవాలన్న ఆడవాళ్ళ అర్థంలేని కోరికలకు తప్ప.

డబ్బు సంస్కృతి ఇవాళ ఏ స్థితికి వచ్చిందంటే డబ్బుతో అన్ని నియమాలనూ, శాసనాలనూ, సహజ ధర్మాలనూ, సామాన్య నీతినీ తారుమారు చేయవచ్చు. దానికోసం జరగని నేరం లేదు. ఒక నూరు రూపాయల నోటు చేత పట్టుకుని దానికి లభించే సుఖాలనూ, దానితో చేయించగల ఘాతుకాలనూ తలచుకుంటే మనిషికి డబ్బుకాక వేరే సంస్కారం దేనికనిపిస్తుంది. సంస్కారపు విలువలు మానవజాతిని పీడించే అసలు సమస్యలను ఎందుకు పరిష్కరించుకోలేకుండా ఉన్నాయో, మానవజాతి నానాటికీ ఆత్మహత్యకు ఎందుకు దగ్గరవుతున్నదో తెలుస్తుంది. ఈ మానవజాతి నిర్మూలనకు అడ్డుపడేది ఏదన్నా ఉంటే, భూమి మీదికి దిగివచ్చి, నేలమీద నిలబడగల సాంస్కృతిక విలువలే! మానవజాతి విజయం వాటిమీద మాత్రమే ఆధారపడి ఉంది.

*యువ మాసపత్రిక, మే 1980*

# 1. కళాస్వరూపం

'కళ' అనే ముక్క చాలామందికి వినటానికి గాని వాడటానికి గాని అమిత అసహ్యం. దానికి తగినంత కారణం లేకపోలేదు. ఈ రెండక్షరాలచేతనూ నిర్దేశింపబడే వస్తువేదైతే వుందో దాన్ని గురించి తమకు స్పష్టంగా తెలియకపోవటం ఒక కారణం, ఇక ఎన్నటికీ తెలియబోదనే గట్టినమ్మకం రెండో కారణం. ఆ మాట ఉపయోగిస్తున్న కళావిదులకైనా తమకన్నా కళను గురించి అధికంగా తెలియదేమోననే సంశయం మూడో కారణం. ఈ జాతికి చెందినది రెండక్షరాల మాట యింకొకటి కూడా వుంది - 'ప్రేమ'

ఇటువంటి పదాలు వాడినపుడు ఎవరెవరికి కడుపులో తిప్పుతుందో వారందరికి నా సానుభూతి తెలియజేస్తున్నాను. పుట్టిపెరిగిన ప్రతి పత్రిక చేత ఉత్తమ కళావిదుడని ఆమోదింపబడ్డ స్థానం నరసింహారావు గారి వంటి వ్యక్తి ఒకటికి పదిసార్లు 'కళోపాసనయే బ్రహ్మోపాసన' అని మాట్లాడటానికి అవకాశం చిక్కిన పోటనల్లా ఉపన్యాసం దంచేస్తుంటే, కళను భూతద్దంలోంచి చూపించినా గుర్తుపట్టలేని వాళ్ళూ, ఈ కళాస్వరూపమేమిటో తెలుసుకుని కళాసేవ చేతామనుకుంటున్న వాళ్ళూ బెదిరిపోవటం తప్ప జరగగలది ఏమైనా వుందా? కళ అంటేనే తెలీకుండా వుంటే బ్రహ్మ ఎవరు?

నరసింహారావు గారిని, వారికి మద్దత్తుగా వుండుకున్న పత్రికాధిపతులను గాని చులకన చేసి మాట్లాడాలని ప్రయత్నించటం లేదు. ఈ విధమైన మంత్రాలతో మామిడికాయలు రాలవని మాత్రం మనవి చేస్తున్నాను. ఈ ధోరణిలో వెయ్యి సంవత్సరాలు ఉపన్యసించినా జనసామాన్యానికి కళ ఎడంగా వుండటమే కాక, కొంతకాలానికి జనసామాన్యానికి తిక్కరేగి కళ అనే ముక్క ఉచ్చరించినవాడికీ, వాడి కళకూ గిద్దెడు నీళ్ళు పుట్టకుండా కూడా పోవచ్చును. ఇది శ్రేయస్కరమైన విషయం కాదు. అసంభవమూ కాదు. ఊరూపేరూ దాచిపెట్టి ఎవరిని గురించి అయినా మాట్లాడటం మొదలుపెడితే వినేవాడికి చిరాకువేస్తుంది త్వరలో. ఎవరూ ఎన్నడూ కనీవినీ ఎరగని వస్తువును గురించి మాట్లాడదలచినవాడు ముందు చెయ్యవలసిన పని దాన్ని విపులంగా వర్ణించటం. ఆ పని చెయ్యకుండా ఉపన్యాసం ఆ వస్తువును 'గురించి' సాగిస్తే అంతా లేచిపోతారు. ఉపన్యాసకుడు మరో మెట్టు పైకి వెళ్ళి దాన్ని గురించి తనకు ఉద్రేకం - ప్రేమగానివ్వండి, భక్తి కానివ్వండి, భయమైనా కానివ్వండి! - వున్నట్టు కూడా కనబడ్డాడా పెర్రివాడి క్రింద జమకట్టేస్తారు.

లండన్ మహాపట్టణం చూసినవ్యక్తి ఆ అదృష్టం పట్టని వ్యక్తుల ఎదుట సంభాషణలో లండన్ తన మేనమామ కొడుకన్నట్టు నటించవచ్చును కావాలంటే.

అల్లాగే ఒకవ్యక్తి ఇతరవ్యక్తుల యెడల తనకు కళతో బాల్యస్నేహం వున్నట్టు సమర్థించవచ్చును కాని ఆ స్నేహమే అందరూ చేసుకునేట్టు చూడటం ధర్మం ఇందులో అరిగిపోయ్యేదేమీ లేదు ఎనక కళ ఒకరిసొత్తు కాదు కనక

'కోతి', 'మనిషి' మొదలైన పదాలు వాడినప్పుడు వినేవాళ్ళలో ఏ విధమైన వికారం గానీ పుట్టుతుందనే భయం అవసరం వుండదు ఆ పదాలు ఏ వస్తువును నిర్దేశిస్తున్నవో స్పష్టంగా తెలిసిపోతుంది ఎవడైనా తెలుసుకోలేని వాడుంటే అందరూ కలిసి వాడి తాళం పట్టిచ్చుటమే కాక ఒక్కొక్కసారి ఆ మనిషి శిక్షార్హుడు కూడా అవుతాడు వెనకటికి ఇల్లాగే మా ఊరికొక దొంగగారు వస్తే ఎలుగురు గడ్డాలు మీసాలు పెరిగిన వాళ్ళే 'కోతిరోయ్!' అని దొంగగారి మీద రాళ్ళు రువ్వారట ఇది కోతి – ఇది మనిషి అని తెలుసుకోలేనందుకు మాజిస్ట్రేటు గారు తలా కాస్త వదిలించారట కనక జనసామాన్యానికి మనిషిని మనిషి అని పోల్చుకోవటం ఎంత సులభసాధ్యమో కళను – ఒక్క కళనే కాదు, ఇమిటేషను కళను కూడా – పోల్చుకోవటం అంత సుకరం కావాలి అంతవరకు– ఎంత కళాకోవిదుడు కానీ కళను గురించి గొంతుచించుకోటం అరణ్యరోదనమే ఆ తరవాత కళోపాసన బ్రహ్మోపాసన అయిందీ కాందీ కావలసినంత మంది నిర్ణయిస్తారు ఇప్పుడంటే కేవలమూ నరసింహారావు గారి మాటే ఆధారంగా వుంది

అయితే ఒకటి వుంది ఒక వస్తువును ఎంత వర్ణించినా జరగని పని వస్తువును పదే పదే ప్రదర్శించటం వల్ల సులభంగా జరుగుతుంది 'మరి మేము కళాప్రదర్శన చెయ్యటం లేదా?'' అని అడగవచ్చును బాగానే వుంది మరి మీ కళా ప్రదర్శనాలకూ మీరు కళను గురించి చెప్పేదానికీ ఎక్కడా లంగరందటం లేదు కుక్కను చూపి ''ఇది కుక్క. దీనికి ఆరు కాళ్ళూ, రెండు కొమ్ములూ, ఒక తొండమూ కలవు దీని బరువు సుమారు ఐదువేల పౌనులు'' అన్నట్లుగా వుంది మీ ఉపన్యాసం. మీ కళాప్రదర్శనానికీ బ్రహ్మకూ ఏ విధమైన బాంధవ్యమూ స్ఫురించటం లేదు

ఈ కళావిదులు యింకో ధోరణిలో కూడా మాట్లాడతారు. ఎవరైనా అమాయకుడు ''మీ కళా ప్రదర్శనంలో కళ నేతిబీరకాయలో నెయ్యివతుగా వుంది'' అంటే, ''మీకు రసగ్రహణ పారీణత బొత్తిగా లేనట్లుంది. ఏంచెయ్యండి'' అని సమాధానం చెబుతారు

ఇటువంటి ఒక్క వాక్యంతో చాలా గుట్టు బట్టబయలౌతుంది చూడండి ఈ మాట కళావిదుణ్ణి అని చెప్పకుంటున్న వాడెవడైనా అంటే అతడికి కళను గురించి ఏమీ తెలీదని, తెలుసుకునే ధోరణిలో లేడనీ వెంటనే కనుక్కోవచ్చును!

జనసామాన్యానికి మీ కళను తెలుసుకుని ఆనందించే యోగ్యత లేదా? మీ కళను తెలుసుకుని ఆనందించడానికి కొంత ట్రెయినింగు కావాలా? అయితే మీరు కళ అనుకుంటున్నది, పాపం కళ కాదు

కళా ప్రకటన యొక్క ఉద్దేశ్యం ఏమిటి? రసోత్పాదన ప్రేక్షకులయందు కలిగేటట్లు జరిగించే భావప్రకటన కళ అవుతుంది నవరసాలలో ఏదో ఒకటి తీసుకుని దాన్ని ప్రకటించి - లేక ప్రకటించామనుకుని - మేము చేసింది కళా ప్రదర్శనమే అంటే లాభం లేదు. అది కళ కాదు కళయొక్క ముఖ్యోద్దేశం ప్రేక్షకుడియందు రసోత్పాదన కలిగించి అతడికి రసానుభవం యివ్వటం, రసానుభవం పొందటానికి ట్రెయినింగు అవసరం లేదు. పంచేంద్రియాలు సహజంగా పనిచేస్తున్నవారంతా కళను ఆనందించటానికి అర్హులే.

కళను ఆనందించటం రెండురకాల మనుష్యులకు అసంభవం అందులో మొదటివారు జాత్యంధులూ బధిరులూ మొదలైనవారు వీరికి ముక్తి లేదు. రెండో రకం వారు జీవిత పరివర్తనల వల్ల ఒక విధమైన గుడ్డితనమూ చెముడూ సంపాదించినవారు. బజారులో అడుగుపెట్టగానే ''కళ్ళు లేవు బాబయ్యా!'' అంటూ బిచ్చగాడు సమీపిస్తాడు. వాడి గొంతులోనూ, ఆకారంలోనూ కావలసినంత దైన్యం వుంటుంది. మానవుడు ఒకవిధంగా జీవించాలంటే గుండె రాయి చేసుకోవాలి. ఈ విధంగా మనహృదయాలు నిజమైన రసానుభవానికి దూరమవుతై నిజానికి మనిషి యిట్లా కావటం అట్టే శ్రేయస్కరం కాదు. జీవితంలో మనని మింగెయ్యాలని చూసే రసాలకు పెడమొహం పెట్టినవాడు హృదయం రాయికాకుండా వుండాలంటే తప్పకుండా ఉత్తమజాతి కళను ఆనందించుతూ వుండటం అలవాటు చేసుకోవాలి.

ఈ విధంగా నూటికి ఒకరిద్దరు పోగా మిగిలినవారిలో కూడా ఒకరికన్న ఒకరు అధికంగాను తక్కువగానూ రసాలను ఆనందించగలిగి వుండవచ్చును. ఒకరికన్న ఒకరు సున్నితంగా వినగలిగినట్టు, చూడగలిగినట్టు. కాని అంతా రసానుభవం పొందగలవారే.

అయితే మరి ''మా కళాప్రకటనలో గల కళ మీరు అర్థం చేసుకోలేదు'' అనటం ఎందుకు కలిగిందంటే, నేనే సమాధానం చెబుతాను.

ఒక గాయకశిఖామణి పాడిపోతాడు. ఏ నలుగురో ఆయనకు ఎదురుగా కూర్చుని ''ఓహో!'' అన్నారు. మిగిలిన వాళ్ళు గుడ్లు పెట్టుకు చూసి యివతలికి వచ్చేశారు. ఈ ఆనందించలేని వారిలో ఏ ఒకడైనా ''నీ ప్రదర్శనం అఘోరించినట్టున్నది'' అంటే గాయకుడు మండిపడి ''నీకు సంగీతాన్ని గురించి ఏం తెలుసు?'' అంటాడు. ''ఏం తెలియాలి?'' అనటం తెలీక కచేరీ ఆనందించ లేని వాడు ఆనాటి నించీ సంగీతాన్ని బహిష్కరించుతాడు. దాన్ని ఆనందించినట్లు కనపడేవాళ్ళను తన విరోధులల్లే భావిస్తాడు. కొన్నాళ్ళకామనిషిని గురించి ''వీడికి చెవిలేదు!'' అంటాము వాడికి చెవి వుందో లేదో చూడాలంటే, హార్మోనియం మీద షడ్జమ ప్రతిమధ్యమ స్వరాలు ఒక్కసారిగా మోగించి మేళవించి వినిపించండి. వాడు చెవులు మూసుకున్నంత కాలమూ వాడికి చెవి వున్నట్టే ఇక చెవిలేనిదెవరికంటే సంగీతం పాడే ఆయనకూ,

'ఓహో!' అనే వాళ్ళకూనూ వాళ్ళకైనా చెవి లేదని కాదు, వున్న చెవి కొంకరపోయింది

ఒక నటుడు, ఒక గాయికుడు, ఒక కవి ''నీకు తెలీదు'' అన్నప్పుడు వాళ్ళ ఉద్దేశంలో తెలీనిదేమిటి? టెక్నిక్! ఎవడైనా రాగజ్ఞానమూ, తాళజ్ఞనమూ ఇంకా ఏమేమి సంగీతశాస్త్ర జ్ఞానం వుండాలో అదంతా వున్నవాడు వచ్చి ''మీక్కూడా యింత జ్ఞానముందా?'' అని ఆశ్చర్యపడితే సంగీత సార్వభౌముడు సంతోషిస్తాడు! అట్లాగే ఒక బొమ్మను చూసి, ''ఓహో ఏమి బ్రెడ్త్! ఏమి రేడియేషన్! ఏమి కియరోస్క్యూరో!'' అంటే ఆ బొమ్మను గీసిన పెద్దమనిషి చాలా పొంగిపోతాడు ఒకవిధంగా ఈ జాతిలో కవి ఒకడే వెలి. ''ఆహా! మీ కవిత్వంలో ఏమి పాంకం! మీ శైలి ఏమి నయాగరా జలపాతం! మీ పదప్రయోగంలో ఏమి ధ్వని!'' అంటే యిప్పటి కవి సంతోషించడు ''అవాఙ్మనసగోచరమైనటువంటిదిన్నీ భావాతీతమైనటువంటిదిన్నీ అయిన గూఢభావం మీ కవిత్వంలో వుంది. మిస్టిసిజం మీ పద్యాల్లో శరీరం ధరించింది?'' అంటే కవి సంతోషిస్తాడు.

ఈ పరిస్థితులలో కళకు ఏ మాత్రం పరపతి వుంటుందో, జనసామాన్యానికి కళ అనే ముక్క చెవిని పడితేనే ఏవగింపు ఎందుకు కలుగుతుందో బుద్ధిమంతులు సులభంగా గ్రహించగలుగుతారు.

కళ శాస్త్రం కాదు. కాని కళాప్రదర్శనంలో శాస్త్రం ఎంతవరకు ఉపకరిస్తుందంటే టెక్నిక్‌తో ఉపయోగం వున్నంతవరకు కళాప్రదర్శనంలో టెక్నిక్ గోప్యంగా వుండాలి. అది ఏ మాత్రం ప్రేక్షకుడికి కంటబడినా రసాభాసం కాకతప్పదు తొడమీద దబాయించి తాళం వేస్తూ పాడే పాటగాడూ, ''నా బొమ్మనేం చూస్తారు, దాన్ని గియ్యటంలో నేను చూపించిన చాతుర్యం చూడండి! ఆ జుట్టు గియ్యటానికి నేను ఉపయోగించిన బ్రష్ చూడండి!'' అనే చిత్రకారుడూ మొదలైన కళోపాసకులు నిజానికి టెక్నిక్ ఉపాసకులు. కళ అంతుపట్టనివాడు టెక్నిక్ ఉపాసన చెయ్యక ఏం చేస్తాడు? బాబూరావు పెయింటరు స్టూడియోలో గుడ్డలతో కైలాసగిరి ఏర్పాటు చేశాడు. అది మన కళ్ళకు కైలాసపర్వతం మాదిరిగా కనపడేటట్లు చెయ్యగలిగిన తర్వాత అతను ''ముందు నుంచి ఏం చూస్తారు? వెనుక కట్టిన తాళ్ళూ బద్దలూ చూడండి!'' అంటాడా? ప్రాణం పోయినా వాటిని ఫిలింలో కనపడనిస్తాడా? ఏ గాయకుడైనా నన్ను సంగీతంతో ఏడిపించగలిగితే నేను అతన్ని ''ఏ కృత్రిమోపాయం వల్ల (లేక ఏ విధమైన టెక్నిక్ ఉపయోగించి) నన్ను ఏడిపించగలిగావు?'' అని అడగను. శాస్త్రం అట్లా కాదు ఎవరైనా పచ్చిచెట్లలో జీవం వున్నదని నిరూపిస్తానని యంత్రాలూ అవీ తెచ్చి ఎక్స్పెరిమెంటు ఏర్పాటు చేస్తే, ''ఏం చెయ్యబోతున్నావు? ఎట్లా నిరూపించబోతున్నావు?'' అని లక్షప్రశ్నలు వేస్తాను. ఏ ప్రశ్నకు సమాధానం చెప్పలేక పోయినా, ''నీ నిరూపణ అశాస్త్రీయంగా వుంది'' అనటానికి నాకు అర్హత వుంది, అతను చెప్పింది నాకు అర్థం గాకపోతే ''నువ్వు అర్థం చేసుకోలేవు వెళ్ళు'' అనటానికి అతనికీ అధికారం వుంది

కాని కళాకోవిదుడు ''నా ప్రదర్శనంలో వున్న కళ నీవు తెలుసుకోలేవు'' అనటానికేమధికారం వుందో నాకు బొత్తిగా బోధపడటం లేదు

కళ అనే మాట నిరర్థకంగా ఉపయోగించబడుతుంటే అంతకంటే కూడా అర్థం లేకుండా వాడబడుతున్నది 'కళోపాసన' అనే మాట. 'భూతదయ', 'ధర్మబుద్ధి' అన్నట్టు ప్రతివాడు నాకు భూతదయ చాలావుంది అనటానికి వల్లపడదు నీ దయతో ప్రసక్తి లేని భూతాలున్నై! మానవత్వమూ, దేహబలమూ ఉన్నతమైన స్థితిలో వున్నవాడు ఆ మాట దేశకాల పాత్రలెరిగి వాడితే బాగుంటుంది గుడ్డిదర్బారుగా ధర్మబుద్ధి చూపించబోతే ప్రమాదం జరగవచ్చును. కళోపాసన అంటే ఏ జాతి కళ యొక్క ఉపాసన? కళలో జాతులున్నై మరి 'ఆ' అని అంటూ గొంతుమీద కొట్టుకుని పిల్లలను భయపెట్టటం మొదలుగా పాషాణహృదయాలను సహితం లోకహితార్థం ద్రవింప చేయటం వరకూ అనేకమైన కళలు వున్నై రతిక్రీడను వర్ణించి అవతలవాడికి కామోద్రేకం కలిగించవచ్చును ముద్దుపళని రాసిన చెత్తరాతకు కూడా యిటువంటి శక్తి వుంది ఒకడికి కామోద్రేకం కలిగించటం కాని మరోవిధంగా వాడి స్వార్థపరత్వాన్ని రేపటం కాని మంచి కళ యొక్క లక్షణం కాదు. మనిషి యొక్క జీవయాత్రకు అనేక దారులున్నై అందులో ''ఈ దారిన వెళ్ళితేనే నువ్వు మానవత్వాన్ని ముందుకు చేరవేసినవాడివవుతావు'' అని మతం ఒక దారి చూపుతుంది కళ ఎప్పుడైతే మనిషిని ఆ దారిలోనే వుంచాలని మాస్తుందో అప్పుడది సత్కళ. అటువంటి కళ అందరిచేతా ఉపాసించబడ దగును వేదాంతికి మంచేమిటి చెడేమిటి అనిపించవచ్చును. కాని ప్రతిక్షణమూ కొన్ని గ్రహించి కొన్ని విసర్జించుతూ జీవించేవాళ్ళకు మంచిచెడ్డలు వుండి తీరాలి.

కళాస్వరూపం సామాన్య మానవుడికి దురూహ్యమైనది కాదు. కళను గ్రహించే శక్తి దాదాపు ప్రతివాడిలోనూ వుంది కళను తాము మాత్రమే గుర్తించ గలిగినట్టూ ఎంతో సంస్కారం వుంటేనే గాని అది సాధ్యం కానట్టూ నటించేవాళ్ళు పచ్చిదొంగలు. స్టేజిలో వుండి నాటకం చూడటం అలవాటైన వాడికి కొంతకాలానికి ప్రేక్షకులలో వుండి చూడటం నామోషీ అయినట్టు ఒకసారి టెక్నిక్ గురించి తెలుసుకోవటం మొదలుపెట్టిన తర్వాత కళను ఆనందించటం మీద గౌరవం తగ్గుతుంది దేశమంతటా యిటువంటి ఆచారమే అయిన తర్వాత కళ అంటే ఏమిటో తెలీదు గాని నాట్యకళోపాసకుడు కావటానికి సంవత్సరమూ, గానకళోపాసకుడు కావటానికి నాలుగేళ్ళూ, చిత్రకళోపాసకుడు కావటానికి 18 పాఠాల పోస్టల్ కోర్సు (ఎంత కాలం పట్టినా సరే!) సారస్వత కళోపాసకుడు కావటానికి ఒక సాహిత్యపత్రికలో ఒక వ్యాసం పడటానికి ఎంతకాలం పట్టితే అంత కాలం

*ప్రబుద్ధాంధ్ర 1935, సెప్టెంబరు*

# 2. కళ వల్ల ప్రయోజనం

ఒక ప్రదర్శనం యొక్క లక్షణం కళ. కళను ప్రదర్శనం నుంచి విడదీయటం అసంభవం. అట్లా విడదీసి దాని తత్వాన్ని గురించి సత్యం కనుక్కోవాలని ప్రయత్నించటం అంతకంటె కూడా అసంభవం.

మన ప్రయోజనాల నించి భగవంతుణ్ణి ప్రత్యేకించటానికి ప్రయత్నం చేసినా అర్థం వుండదు. కాని బుద్ధిమంతులు సహితం అటువంటి ప్రయత్నం చేస్తూనే వున్నారు. కళకు కూడా అటువంటి దుర్గతే పట్టింది. కళారాధకులూ, కళను గురించి అర్థం కాని ఉపన్యాసాలు చేసేవారూ, 'కళ' అనే మాట చెవినపడగానే చేతులు జోడించి కళ్ళు మూసేవారూ జనసామాన్యానికి కళ అంటే హడలు పుట్టేటట్లు చేసినమాట వాస్తవం. ఈ పరిస్థితులను Anatole France తన Penguin Island కు ఉపోద్ఘాతం రాస్తూ మహోదారుణంగా విమర్శించాడు. ఒక ప్రదర్శన యొక్క లక్షణం కళ అయినట్టే, ప్రదర్శనా విధానం శిల్పం అవుతుంది. ఈ రెంటికీ ప్రదర్శనం యొక్క ప్రయోజనంతో ఏమీ సంబంధము లేకపోయినట్టయితే కళనూ శిల్పాన్నీ ఆరాధించటంలో అర్థం లేదు.

'కళ నిష్ప్రయోజనమైనది' అనే మాట అర్థం లేని మాట – 'రంగు ప్రయోజనం లేనిది' అన్నట్టే.

పాల యొక్క తెలుపుకూ, బొగ్గుయొక్క నలుపుకూ మన ప్రయోజనాలతో అవినాభావ సంబంధం వుంది మరి. తెల్లగా లేని పాలను సాహసించి తాగం, నల్లగా లేని బొగ్గును పొయ్యిలో పెట్టి అయినా చూడం. భగవంతుడి నామరూపరాహిత్యం వెంకటేశ్వరస్వామి విగ్రహంలో మృగ్యమైపోయింది. మన కోర్కెలు తీర్చవలసిన దేవుడూ, మన మొర ఆలకించే దేవుడూ నిర్గుణుడు కాలేడు.

సామాన్యమానవుడు రంగులను మాత్రమే ఆరాధించటం ఎంత అసంభవమో కళను మాత్రమే ఆరాధించటం అంత అసంభవం. కళను నిర్వచించమంటే, ఒక ప్రదర్శనం ద్వారా ఒక ప్రయోజనం సాధించటానికి అతి సుళువైన మార్గం ఏదైతే వుందో అది శిల్పమనీ, ఆ శిల్పం వల్ల ఆ ప్రదర్శనానికి కలిగే లక్షణం కళ అనీ చెబుతాను. శిల్పం యొక్క ప్రతిభా, కళ యొక్క పరిపూర్ణత్వమూ సాధించబడిన ప్రయోజనం యొక్క సంపూర్ణత్వం మీద ఆధారపడి వుంటుంది.

అసలు చిక్కు కళకు సంబంధించినది కాదు. కళ ద్వారా సాధించే ప్రయోజనాలకు సంబంధించినది. వట్టి బూతుపాటలను ఎంత శిల్పంతోనైనా రాయవచ్చును. కళ వల్ల సాధ్యమయ్యే ప్రయోజనం అవినీతికరంగా గాని అపాయకరంగా

గాని వుండదని యేమీ నిర్ధారణ లేదు పామూ దాని పడగా అమిత నాజూకుగానూ అందంగానూ వుంటై మొత్తాన్ని అనేకమంది మూఢులు రోజూ దుర్వినియోగ పరుస్తున్నారు దేశభక్తి పేరిటా దేవుడి పేరిటా అనేక అత్యాచారాలు జరుగుతున్నై

దేశభక్తి గాని, దేవుడు గాని, కళ గాని నీతికి అతీతమైనదంటే ఏమీ లాభం లేదు వాటన్నిటికీ ఏదో ప్రయోజనం వుండటం మూలంగానే వాటికి మనజీవితంలో స్థానం ఏర్పడుతున్నది ప్రయోజనం అంటూ ఉన్న తరువాత ఆ ప్రయోజనం తాలూకు మంచిచెడ్డలు వాటిని అంటకుండా వుండవు

కాని ప్రపంచంలో కొద్దిమంది అపూర్వవ్యక్తులు ఎప్పుడూ వుంటారు. ఇతరులు సాధనాలుగా ఉపయోగించుకునేవి వారికి ప్రయోజనాలుగా ఉపయోగపడుతై వారిని specialists అనాలి గణితం ఒక సాధనం కాని కొందరికి అదే పరమార్ధం మనస్సుకు ఉల్లాసంగా వుండేటందుకు Integral Equations చేసే వారున్నారు భగవంతుణ్ణి కనుక్కోవటానికి ఉద్యమించి, ఆఖరుకు భగవంతుణ్ణి గురించి తమ అన్వేషణా ప్రయత్నంలోనే తమ ముక్తిని చూసుకోగలిగిన వారున్నారు ఈ అపూర్వవ్యక్తులు తమ బుద్ధి కుశలతను వినియోగపరచి కళను దాని ప్రయోజనం నించి వేరుచేసి ఆనందించగలుగుతారు వారికి బూతుబొమ్మలలో వున్న అందాన్ని చూసేటప్పుడు యితరులకు కలిగే జుగుప్సకానీ ఉద్రేకం కానీ కలుగదు. వారు పాము సౌందర్యాన్ని గమనించేటప్పుడు దాని విషదంష్ట్రలను స్మరించలేరు

ఈ అపూర్వ వ్యక్తులను జనసామాన్యం అర్ధం చేసుకోగలగటం అసంభవం. కాని యిటువంటి వారి సంఖ్య అభివృద్ధి అయినకొద్దీ నాగరికత అభివృద్ధి అవుతుంది. Clive Bell చెప్పినట్టు ఆకలి అయిన అనాగరికుడు కుందేటిని పట్టుకుని చంపి తింటాడు దానిని ఇంటికి తీసుకుపోయి కాల్చి తినాలని ఆలోచన పుట్టగానే వాడిలో నాగరికత ప్రవేశించింది బాహ్యపరిస్థితులు అనుకూలిస్తే వాడు నాగరికతలో ఎంత దూరమైనా వెళ్ళవచ్చును. ఏ జాతిలోనైనా కొంత నాగరికత వుంది. మానం కాపాడుకొనటానికి ధరించే గుడ్డలు అందంగా వుండాలనీ, వాటిని అందంగా ధరించాలనీ ఆలోచన కలగటం నాగరికత.

అనాగరికుల మాదిరిగానే అతి నాగరికులు కూడా తాము ధరించే వస్త్రాల వల్ల తమ శరీరాలను సరిగా కప్పటానికి విశేష ప్రయత్నం చెయ్యకపోవటం మనం కళ్ళారా చూస్తున్నప్పటికీ, నాగరికత యొక్క ఉద్దేశం స్థూలప్రయోజనాలను దూరంచెయ్యటమే కాని బొత్తిగా తోసివెయ్యటం కాదేమోననుకుంటాను.

అందుకనే నాకు Art for the sake of Art అనే సూత్రాన్ని అవలంబించే వాళ్ళతో సానుభూతి లేదు ప్రయోజనాన్ని పూర్తిగా నిరసించిన కళాప్రదర్శనం నాకు

హాస్యాస్పదంగా వుంటుంది ఎంత దుఃఖంలో వుండి కూడా యితరులకు నవ్వువచ్చేటట్లు ఏడవటం ఎంత నగుబాటు విషయమో, ఏమీ కారణం లేకుండా అత్యద్భుతంగా ఏడవటం కూడా అంత నగుబాటు పనే ''నే నీ పని ఎందుకు చేస్తున్నానో నీకవసరం లేదు నా శిల్పం మాత్రం చూడు!'' అని ఏ కళాకారుడూ అనరాదు అతనికీ కళను గురించి ఏమైనా తెలిసివుంటే అట్లా అనలేదు

ఒక ప్రదర్శనం యొక్క ప్రయోజనం ఏమిటో మనం తెలుసుకోలేనంతవరకూ అందులో కళ వున్నదీ లేనిదీ తెలుసుకోవటం కూడా అసంభవమేనని నా తాత్పర్యం. ఈ అభిప్రాయం అనేక మందికి విపరీతంగా తోచవచ్చును దీన్ని సమర్థించేటందుకు ఒక ఉదాహరణ తీసుకుంటాను

ఇద్దరు టెన్నిస్ ఆడుతున్నారనుకుందాం! ఆటయొక్క ప్రయోజనం గెలవటమైనంత సేపూ యిద్దరి లోనూ బాగా ఆడేవాడు గెలిచితీరాలి బంతులను నెట్టుకు కొడుతూ కోర్టుబయటికి కొడుతూ ఆడేవాడు 'బాగా' ఆడుతున్నట్టు లెక్క కాదు.

అయినప్పటికీ టెన్నిస్ ఆడేవాడు గెలవటం తన ఆశయంగా పెట్టుకోకుండా యితర ప్రయోజనాల కోసం పాటుపడవచ్చును తన ఆటలో స్టైలూ, కదలికలో నాజూకూ - ఇవి ప్రేక్షకులకు ఇంపుగా కనిపించేటందుకు ఎక్కువ శ్రమపడవచ్చును అటువంటి వాడు 'బాగా' ఆడికూడా ఓడిపోవచ్చును ఫలాని ఆటగాడు బాగా ఆడాడన్నప్పుడు ఏదో ఒక ప్రయోజనం ద్యోతకమవుతూ వుండితీరాలి

అట్లాగే ఒక కవి పద్యం రాసినప్పుడు అందులో కళ వున్నదీ లేనిదీ తెలుసుకోవటానికి కవి సాధించుతున్న ప్రయోజనం ఏమిటో తెలియాలి. ఒక కవి ఆశయం మాటల పొందిక కావచ్చును మరొక కవి కేవలమూ శయ్యనే లక్ష్యంలో వుంచుకుని రాయవచ్చును.

కాని, నేను చెప్పవచ్చిందేమంటే తను చేస్తున్న పనియొక్క స్థూలప్రయోజనాన్ని ఏ కళాకారుడూ సంపూర్ణంగా తోసివెయ్యరాదు. టెన్నిసు ఆడేవాడు తను గెలిచే ప్రయత్నాన్ని నిర్లక్ష్యం చెయ్యరాదు, కవి తన రచన యొక్క ఆశయాన్ని తృణీకరించరాదు

భోజనం దగ్గిర ఎంత నాజూకూ అభిరుచీ వున్నా అభ్యంతరం లేదు - భోజనం చెయ్యటం యొక్క ఉద్దేశాన్ని ఏమారకుండా వుంటే సరి! నాగరికత యొక్క ఆశయం స్థూల ప్రయోజనాలను తన్నేసి సూక్ష్మ ప్రయోజనాలకు ఎగబాకటం కాదు, ఆ స్థూల ప్రయోజనాలను యితర సూక్ష్మప్రయోజనాలతో సమన్వయించ గలగటం

కళావ్యాప్తికి రెండుకారణాలవల్ల ఆటంకం కలుగుతున్నది.

నాగరికత వల్ల కళ ద్వారా సాధించబడే సూక్ష్మ ప్రయోజనాలతో అనాగరికుడు సానుభూతి చూపలేక పోవటం తినే వస్తువులలో రుచీ, వాడుకునే వస్తువులలో

సౌందర్యమూ కోరే వారిని నిరసించేవాళ్ళూ ఎగతాళి చేసేవాళ్ళూ ఎప్పుడూ ఉండటం అయితే ఇలాంటివాళ్ళు ఎప్పుడూ వుంటూనే వున్నారు

అనేకముంది కళోపాసకులలో ఇమిటేషను నాగరికత జాస్తిగా వుండి ఇమిటేషన్ వేదాంతులు భౌతిక సుఖాలను నోటితో తృణీకరిస్తున్నట్టు, ఇమిటేషను నాగరికులు ప్రదర్శనల తాలూకు స్థూలప్రయోజనాలను తృణీకరించుతున్నారు ఆ ప్రయోజనాలను మాత్రమే గుర్తించగలిగే జనసామాన్యానికి కళ అయోమయం అయిపోతున్నది

కళాప్రచారానికి యింకా యితర అంతరాయాలు లేకపోలేదు కళకు ఏ విధంగానూ సంబంధించని మూఢవిశ్వాసాలు కళకు అడ్డంగా వుండటం శోచనీయమైన విషయం ఒక స్త్రీ సౌందర్యాన్ని కంటితో చూసి ఆనందించడం అవినీతిగా భావించబడటం లేదు కాని ఆ చక్కదనాన్ని నోటితో చెప్పటం కాని కాగితం మీది కెక్కించటం గాని చాలా జుగుప్సాకరమైన సంగతిగా భావించ బడుతున్నది ఒకడికి స్త్రీని ఆలింగనం చేసుకుంటే స్పర్శ ద్వారా ఎంత ఆనందం కలుగుతుందో మరొకడికి స్త్రీ సౌందర్యం చూడటం వల్ల కూడా అంత ఆనందం కలుగుతుందని తెలిసినట్టయితే స్త్రీ వంక చూడటమే పాపమని శాసించేవారుండకపోరు

మనస్సును ఆనందపరచటమే మహాపాతకమనే సూత్రం మీద మన జీవితం నడుస్తున్నంత కాలమూ కళ ద్వారా మనకు స్థూలమైన ప్రయోజనాలు దప్ప మరొకటి సాధ్యం కావటం అసంభవం

*ప్రతిభ, గిడుగు రామమూర్తి గారి స్మారక సంపుటి, సంపుటి- 4, 1940*

## 3. పురోగామి

ప్రజానాట్యమండలి ఆంధ్రుల నాట్యకళాచరిత్రలో ఒక విశాలమైన కొత్తపేజీ. ఇది యిటీవలనే తిరిగింది. ఇది తెలుగుదేశంలో ఉదయించిన మరో నాట్యకళాసంస్థ మాత్రమే అనుకోరాదు. భావి నాట్యకళా పరిణామానికిది పురోగామి తెలుగు జీవితం తాలూకు వివిధ కోణాలనుండి యదార్థం కృత్రిమాహార్యం అవసరం లేకుండానే రంగస్థలం ఎక్కి సత్యాన్ని వెల్లడించి ఆ సత్యాన్ని తిరిగి జీవితంలోకి పంపి తద్వారా పరిణామం సాధించటానికి అనువైన వాతావరణం ఏర్పరుస్తుంది

*ప్రజాశక్తి, దినపత్రిక, 23-12-1945*

*పునర్ముద్రణ విశాలాంధ్ర, దినపత్రిక, 2-4-1961*

# 4. నిజమూ - కల్పనా

కల్పన అనేది మానవుడి సొత్తనే చెప్పాలి జంతువులకి కల్పన చాతకాదు. కల్పన మంచిదైనా, చెడ్డదైనా, పనికి వచ్చేదైనా, పనికిరానిదైనా దాని జవాబుదారి మనిషిదే అబద్ధాలకు సయితం కల్పన అని నాజూకు పేరుంది అబద్ధాలు కూడా మనిషి సృష్టే

కల్పనకూ భ్రమకూ చాలా వ్యత్యాసం వుంది కల్పన ద్వారా భ్రమ కల్పించవచ్చు గాని అన్నిరకాల భ్రమా కల్పనకింద జమకాదు

ప్రకృతి అనేక భ్రమలు కల్పిస్తుంది ఎడారి ప్రదేశంలో ఎండమావులు కనిపిస్తాయి. బాటసారి అంత దూరంలో నీరున్నట్టు భ్రమపడతాడు బాటసారిని భ్రమింపచెయ్యాలనే ఉద్దేశం ఎండమావులకే మాత్రమూ లేదు బుద్ధిపూర్వకంగా భ్రమ తెచ్చి పెట్టినప్పుడే అది కల్పన అవుతుంది మంత్రిత్రయం వారు తమ పథకం ద్వారా భారతీయులకు స్వతంత్రం వస్తున్నదనే భ్రమ కల్పించటం కల్పన అనిపించుకుంటుంది. ప్రకృతి యింకా అనేకమైన భ్రమలు కల్పిస్తుంది కాని ప్రకృతికి కల్పన సాధ్యం కాదు

కల్పనకూ నటనకూ కొంత వ్యత్యాసం వుంది కల్పనలో నటన ఒక అంశం కావచ్చు కాని నటనయావత్తూ కల్పన కాదు.

పిల్లి కుక్కను చూడగానే శరీరం మీద రోమాలన్నీ నిటారుగా నిలబెట్టి, వీపు పల్లకీబొంగల్లే వొంచి, తోక భయంకరంగా పైకెత్తి బుస్సలు కొడుతుంది

ఆ విధంగానే పఫ్ఆడర్ అనే పాము- దీన్నే బ్లఫ్ఆడర్ అని కూడా అంటారు- ఆపద ఎదురైనప్పుడు శరీరమంతా యింతలావు చేసి తోకమీదలేచి భీభత్సంగా నాట్యం చేస్తూ భయంకరంగా బుసకొడుతుంది. ఇట్లా కొంతసేపు చేసి అప్పటికీ ఆపద తొలగిపోనట్టయితే శరీరమంతా ముడుచుకుని చిన్నదైపోయి గంటల తరబడి కదలకుండా చచ్చినట్టు నటిస్తుంది.

అనేక క్రిమి కీటకాలు మనం ముట్టుకోగానే ముడుచుకుపోయి చచ్చినట్టు నటిస్తాయి.

కోతులు ఒకదానికొకటి పేలు చూచుకోవటమూ, వాటిని మధ్యమధ్య నోట్లో వేసుకోవటమూ వచ్చి నటన అని వాటిసంగతి తెలిసినవాళ్ళు చెబుతున్నారు కోతులు మొహాలమీద ముడతలు తెప్పించి నిశ్చలంగా కూచుని ఆధ్యాత్మిక చింతనలో వద్దట్టు కనిపించటం నటన అనేది మనం ఎరిగిన విషయమే. ఎందుకంటే ఇట్లా ఆధ్యాత్మిక చింతన చేస్తున్నట్టే వుండి వుండి అకస్మాత్తుగా కోతిపక్కనున్న మరోకోతి చెవులు పట్టుకుని లాగి దానికందకుండా పారి పోతుంది ఈ విషయంలో కోతి కొంతమంది స్వాములార్లమాదిరిగా ప్రవర్తించి నప్పటికీ దాన్ని నటనే అనాలి గాని కల్పన అనలేం

రంగస్థలాన నటించే నటుల్లో అనేకమంది నటనే సాధిస్తారు గాని కల్పన సాధించలేరు

భ్రమలోనూ, నటనలోనూ లేని రెండంశాలు కల్పనలో వుండాలి! ఒకటి సృష్టి మరోటి సంకల్పమూనూ సంకల్పంతో కూడిన సృష్టే కల్పన. దానికి ఒక ప్రయోజనం వుంటుంది దానికే మానవసంస్కారంలో స్థానం వుంది అటువంటి కల్పన ద్వారానే మనిషి ఎండమావులకన్నా పక్షఅడర్లకన్నా, కోతులకన్నా, దొంగస్వాములకన్నా ఉన్నతస్థాయి అందుకుంటాడు.

కల్పనలో- యదార్థమైన ఉత్తమ కల్పనలో – భ్రమ కల్పించే అంశం వున్నా ఆ భ్రమ వంచనకిందికి రాదు. అందులో నటన వున్నప్పటికీ భ్రమకు దారితీయదు.

కల్పన కళలకు పునాది. సంస్కారంతో కూడిన సమాజం యొక్క ప్రగతి కళాయుతమైన కల్పన మీద ఆధారపడి వుంటుంది

కల్పన లేకుండా సంస్కారం ముందరికి పోనట్టే, సంస్కారం లేకుండా కల్పన కూడా ముందుకుపోలేదు, ఆ రెంటికీ పరస్పరాశ్రయం. బొత్తిగా సంస్కారం లేనివాడు కల్పనకీ, నిజానికీ తేడా తెలుసుకోలేక, దానివల్ల ప్రయోజనం పొందనివాడవుతాడు. అందుచేత కల్పన నిజానికెంత సమీపంగా వచ్చేదీ సంఘంలో వున్న సంస్కారం మీద ఆధార పడుతుంది. 'రియలిజమ్' లేక వాస్తవికత అనేది కల్పనకి ఆదర్శంగా పెట్టుకున్నంత మాత్రం చేత లాభం లేదు దాన్ని సమగ్రంగా సాధించాలంటే సంస్కారాన్ని కూడా పెంచాలి

వెనకటి రోజుల్లో కళ ప్రజలకు దగ్గిరిగా వుండేదంటే దానికి కారణం వుంది. ఆ కల్పనకూ నిజానికీ వుండే తేడా అప్పటి ప్రజలకు సులభంగా అర్థమయేది. తోలుబొమ్మలూ, వీధి నాటకాలూ, పగటి భాగోతాలూ, బుర్రకథలూ కల్పనలని ప్రజలకి తెలుస్తూనే ప్రజల దగ్గిరికి వచ్చేవి.

కాని రానురాను కల్పన రెండురకాల పరిణామం పొంది ప్రజలకు దూరమయింది.

కల్పనలో ప్రజలకు సంబంధించిన ప్రయోజనం మృగ్యమయింది. కల్పనా విధానం నిజానికి చాలా దగ్గిరికి వచ్చేసింది ఈ పరిణామానికి తగ్గట్టుగానే ప్రజల సంస్కారం హెచ్చటానికి బదులు తగ్గింది (అది తగ్గబట్టే కల్పనలో యిటువంటి పరిణామం జరిగిందని కూడా అనుకోవచ్చు).

ఇవాళ కల్పనకీ నిజానికీ తేడా కనిపెట్టలేని వారిలో లక్షాధికార్లూ, పట్టభద్రులూ, మంత్రులూ, ప్రభుత్వాధికారులూ కూడా వున్నారు ఈనాటి మధ్యతరగతికి కల్పన ఏదో నిజమేదో తెలీదనే చెప్పవచ్చు. ముందు ప్రేక్షక పాఠకలోకాన్ని తీసుకుందాం.

ఏ పాపమూ ఎరగని విద్యార్థి ప్రణయకథకులను చూసి పాఠకులు అభినవ కృష్ణులని భ్రమించటం చూస్తున్నాం.

అభ్యుదయ రచయితలంతా ఆరితేరిన కమ్యూనిస్టులనే అనవసరఖ్యాతి అనవసరంగా ఏర్పడుతున్నది

రామదాసు నాటకం జరుగుతూంటే భజనపార్టీ స్టేజిమీదికి రాగానే ప్రేక్షకులు - కుర్చీలలో కూర్చునే సంస్కార్లే - కాసీలూ, అర్ధణాలూ, అణాలూ, బీడీపెక్కాలూ, పిప్పరమెంటు బిళ్ళలూ పారేస్తారు

ఒక పెళ్ళి సందర్భంలో చక్కగా నాట్యం చెయ్యగల ఒక పిల్ల పాములదాని వేషంవేసి అందరిదగ్గిరా అడుక్కున్నట్టు అభినయిస్తుంటే ఎవరో ఒక కానీ పారేస్తారు ఆ పిల్లకు బహూకరించటానికి తెచ్చిన వెండివస్తువును పెళ్ళికూతురు కూడా విసిరిపారేస్తుంది.

జమీందారీవిధానంలో వుండే కుళ్ళును బయటపెడుతూ రాసిన నాటకం ప్రదర్శించబడుతుంటే, నాటకంలో జమీందారుకు పట్టిన గతి నిజంగానే తన మిత్రులైన జమీందార్లకందరికీ పట్టినట్టు భయపడి నాటకప్రదర్శనం మీద ఆంక్ష పెడుతుంది ఆ ఆంక్ష తొలిగించమని ప్రజాప్రతినిధి అయిన మంత్రిగారికి సంఘంలో ఆర్జీ పెట్టుకుంటే, యింతమందీ కలిసి తన్ను వంచన చేస్తున్నారని మంత్రిగారు భ్రమపడతాడు. ఆ నాటకప్రదర్శనం మీద ఆంక్షపెట్టింది తనేననే భ్రమ కూడా ఆయనకు పాపం కలుగుతుంది.

కల్పన చూసేవారి సంగతి ఈ విధంగా వుంటే చేసేవారి సంగతి ఎట్లావుంది?

శ్రీమతి కుమారి తారామణీదేవి గారికి చంద్రమతి పాత్ర యిచ్చి చివరి భాగంలో పసుపుకొమ్ము తోటీ పాతచీరె తోటీ పాత్రధారణ చెయ్యమంటారు శ్రీమతి కుమారి తారామణీదేవి గారికి కోపం వస్తుంది అయిదులక్షలదివరకే ఆర్జించి మరో మూడులక్షలకి కాంట్రాక్టులు సంతకం చేసిన తారామణి పసుపుకొమ్ముతో పాత్రధారణ చేస్తుందా? పచ్చలహారమూ, లోలక్కులూ, జరీసిల్కు చీరా వుండవలసిందే!

ఒకానొక నటుడు పాపారాయుడు పాత్ర ధరించగా విజయరామరాజు వేషధారి ఆఖరు సీను కొరవ వుండగానే వేషం కడిగేసుకుంటాడు!

ఒకానొక రేడియోతార ''ఇటువంటి దాసి వేషమూ నాకిచ్చేది?'' అని పోట్లాడుతుంది.

ఒకానొక హరిదాసుగారు ప్రహ్లాదోపాఖ్యానం చెబుతూ మధ్యలో తానే ప్రహ్లాదుణ్ణనుకొని విరుచుకు పడిపొయ్యేసరికి, నిజంగా ఆయనకు నరసింహస్వామి పూనాడని ప్రేక్షకులు హారతిపళ్ళెంలో రూపాయలు కురిపించి నరసింహస్వామిని వదలగొడతారు!

ఈ పరిస్థితుల్లో తెలుగువాళ్ళ కల్పనాపటిమ గురించి తెలుగు సంస్కారం గురించీ ఎవరు గర్వించరూ?

*ఆంధ్రజ్యోతి మాసపత్రిక, సెప్టెంబరు 1946*

# 5. కళ, కళకోసమా?

ఉత్తమమైన శిల్పమూ, జాతీయతా కలదాన్నే కళ అంటాం ఈ లక్షణాలు లేని సృష్టిని గురించి యిక్కడ మనం చర్చించనవసరంలేదు జీవించటం యొక్క పరమార్థమే కళయొక్క పరమార్థం కూడానూ అదేమంటే ఆనందం సాధించటం. ఆనందానికి సుఖానికి తేడా వుంది సుఖం ఎప్పటికప్పుడు తిరిగితిరిగి సాధిస్తూ వుండాలి ఒకసారి సాధించిన ఆనందాన్ని మళ్ళీ సాధించనవసరం లేదు

కోరికలు సమగ్రంగా తీర్చుకోవటం వల్ల సుఖం కలుగుతుంది చక్కగా భోంచేస్తే సుఖంగా వుంటుంది మంచిపక్క మీద పడుకుంటే సుఖంగా వుంటుంది. సుఖం జాస్తి అయితే వికటిస్తుంది. ఆనందాన్ని ఈ విధంగా పూటా పూటా సాధించనవసరం లేదు అది వికటించనూ వికటించదు పొలం కొనుక్కున్నా, ఇల్లు కట్టించినా, మంచి ఉద్యోగం సంపాదించినా, రాబడి హెచ్చించుతున్నా, స్వాతంత్ర్యం సంపాదించినా, ప్రేమించినా ఆనందం కలుగుతుంది జీవితాన్ని ఒక అడుగు ముందుకు తీసుకుపోవటానికి చేసే కృషి ఫలవంతమవుతున్నప్పుడు అడుగడుగునా ఆనందం వుంది. కష్టాలనెదుర్కోవటం లోనూ, ఆశయసిద్ధి కోసం త్యాగాలు చెయ్యటం లోనూ కూడా ఆనందం వుంది. సుఖమనేది కృషి ఫలించినప్పుడు గాని లభించదు

వ్యక్తిగతమైన ఆనందం లేకపోలేదు కాని మనం వ్యక్తిగతమైన ఆనందం అనుకునేది కూడా పంచుకునేటందుకు ఒక చిన్న వర్గం – వ్యక్తి కృషి ఫలించటం వల్ల సుఖపడేవర్గం– వుంటుంది నా జీతంపెరిగితే నేనూ, నాభార్యా, పిల్లలూ సంతోషిస్తాం. ఆనందంలో వర్గవైఖరి వున్నదనటానికి సందేహం లేదు ప్రభుత్వాన్ని బెదిరించి ప్రత్యక్ష పన్నులు తగ్గించుకోవటమూ, కార్మికులను అణచివేసే శాసనాలు అమలు జరిపించటమూ ధనికవర్గానికి ఆనందం. సమ్మెలు సాగించి పారిశ్రామికుల మీద విజయం సాధించి తమ కోర్కెలు రాబట్టటానికి పాటుపడటం కార్మికులకు ఆనందం

ఉత్తమమైన ఆనందానికి లక్షణాలేవంటే, జీవితాన్ని ముందుకు తీసుకు పోవటానికి కృషి జరగటమూ, ఆ కృషి ఫలవంతం కావటమూ, కృషిచేయటానికీ కృషి ఫలితం అనుభవించటానికీ కూడా స్వేచ్ఛ వుండటమూనూ ఇల్లు కట్టించుకున్న వాడికుండే ఆనందం కంట్రాక్టరుకూ కూలీలకూ వుంటుందా? ఇల్లు బాగా కట్టి మరి నలుగురి దగ్గర ఆర్డర్లు సంపాదించుకునేటట్టు చేశానని కంట్రాక్టరు ఆనందించవచ్చు. నాలుగు డబ్బులు సంపాదించామని కూలీలు ఆనందించవచ్చు ఈ విధంగా ఎవరి ఆనందం వారి స్వేచ్ఛయొక్క పరిమితిలోనూ ఫలప్రాప్తిపరిమితి లోనూ ఇమిడివుంటుంది.

ధనికవర్గం యొక్క ఆనందం తుచ్ఛమైనదని నేను భావిస్తాను వారు తమ జీవితాన్ని ముందుకు తీసుకుపోయే ధోరణిలో అసంఖ్యాకుల జీవితాలను వెనక్కు తోస్తారు పెత్తనకు - తమ జీవితావసరాలకు కాదు- అసంఖ్యాకులను నియోగించటమే కాక, వడ్డీవ్యాపారస్థుల లాగా వీరు డబ్బు సాధించడానికి డబ్బునూ, అధికారం సాధించడానికి అధికారాన్నీ సాధనాలుగా చేస్తారు సాధనమూ, సాధ్యమూ ఒకటే అయిపోవటం ప్రగతిలక్షణం కాదు; జీవితం ముందుకుపోవటం ఆగిపోయే లక్షణం.

శ్రామికవర్గం తమ జీవితాలను పెంచుకొనటానికి కృషిచేసే వర్గం, ఆ వర్గానికి అధికారం వచ్చినా అధికారాన్ని అధికారం పెంచటానికి వినియోగించదు ఆ కారణం చేత ఆ వర్గానికి నిజమైన ఆనందం సాధ్యమవుతుంది.

కళలు కూడా యిటువంటి ఆనందాన్నే సాధించాలి జీవితాన్ని ముందుకు తీసుకుపోయే కృషినీ, కృషి చేయటానికీ కృషిఫలితం అనుభవించటానికీ వుండవలసిన స్వాతంత్ర్యాన్నీ కళలు సమర్థించి బలపరచాలి

పీడితవర్గాన్ని సమర్థించే వంకపెట్టుకుని వారి అజ్ఞానాన్నీ, దారిద్ర్యాన్నీ బలపరిచే కళలు తుచ్ఛమైనవి బూతుకథల ద్వారానో, ఘోరభయానక సంఘటనల ద్వారానో ఉద్రేకాన్ని రెచ్చగొట్టి సంతృప్తి పరిచేవి కూడా తుచ్ఛమైన కళలే

జీవితం బహుముఖమైనది. అందులో ప్రగతి అనేది అనేకస్థాయిలలో అనేక స్వరూపాలుగా వుంటుంది. అనుక్షణమూ అనేకవస్తువులు దాని స్వరూపాన్ని మార్చటానికి పనిచేస్తున్నాయి. అటువంటప్పుడు కళాకారులు తమ కళల ద్వారా జీవితాన్ని ముందుకుతీసుకుపోవటానికీ, అటువంటి ప్రయత్నంలో జరిగే కృషిని బలపరచటానికీ, నిరోధకశక్తులను ఎదుర్కోవటానికీ, ఎదుర్కొనేవారిని బలపరచటానికీ అంతులేని అవకాశాలున్నాయి ముందుకుపోవలసివున్నది ఒక్క శ్రామికవర్గం, వారి జీవితాలే కావు కళలను వినోదం కింద పరిగణించేవారిని మినహాయిస్తే మిగిలిన వారందరికీ కళలవల్ల మనోవికాసమూ, ఉత్తేజమూ, ప్రగతీ లభ్యం చేసుకొనే అవకాశం వుంది

*సమీక్ష, మానపత్రిక, 1-8-49*

# 6. తోలుబొమ్మల పునరుద్ధరణ

అతి ప్రాచీనకళ అయిన 'తోలుబొమ్మలు' పునరుద్ధరించటానికి ప్రభుత్వం పూనుకుంటే ఎంతైనా బాగుంటుంది. ఇది పామరజనాన్ని విశేషంగా ఆకర్షించటమే కాక అతి చౌకలో తేలిపోతుంది. తోలుబొమ్మలాడించే వారు విశేషధనం సంపాదించ లేరు వారు మామూలుగా పొలంపనీ అవీ చేసుకొని పొట్టపోసుకుంటారు. వాళ్ళు పగలు అడుక్కుంటూ రాత్రిపూట తోలుబొమ్మలాడించటం కూడా కద్దు. అందుచేత తోలు బొమ్మలను పునరుద్ధరించటం వల్ల దేశంలో లక్షాధికారులు తయారై వర్గరహిత వ్యవస్థకు భంగం రావడం గాని పెట్టుబడిదార్లు ఈ తోలుబొమ్మలాటను దోపిడీ విధానానికి గురిచేసి గాంధీజీ సత్యాహింసలకు విఘ్నం చేకూర్చడం గాని జరుగుతుందనే భయం లేదు.

తోలుబొమ్మలాడటానికి పెద్ద థియేటర్లూ, తెరలూ, సెట్టింగులూ, రంగులూ, దీపాలూ, కుర్చీలూ అవసరం లేదు. మామూలు పందిరివేసి, చుట్టూ సైనుగుడ్డ కట్టి, లోపల నాలుగు ఇల్లాయిబుడ్లు వెలిగిస్తే రంగస్థలం తయారవుతుంది. తొక్కటానికి లోపల ఒక బల్ల వుంటే చాలు

తోలుబొమ్మలు చేయడం ఒక గృహపరిశ్రమ తోలుబొమ్మలాడించే వాళ్ళే ఆ బొమ్మల నిర్మాణం చూసుకుంటారు ఒకసారి బొమ్మలు తయారుచేస్తే ఎన్ని ఏళ్ళపాటయినా చెక్కుచెదరకుండా వుంటాయి

ఒక కళ అనే దృష్టితో చూచినా తోలుబొమ్మలు మామూలు సినిమా చిత్రాలకన్నా, నాటకాలకన్నా ఎంతో రక్తిగా వుంటాయి ప్రేక్షకులు సినిమా తెరలు చించటమూ, స్టేజినటులమీద చెప్పులు విసరడమూ ఎరుగుదుము గాని, తోలుబొమ్మలాట రక్తికట్టక ప్రేక్షకులు గలాటా చెయ్యటం కనీవినీ ఎరగం.

ఇటువంటి ప్రజాకళ పతనమైపోతున్న మాట యధార్థం. పల్లెటూరి ప్రజలు కూడా చౌకబారు సినిమాలనూ, నాటకాలనూ మరిగి తోలుబొమ్మలను చిన్నచూపు చూస్తున్నారు ప్రభుత్వం పూనుకొని ఈ కళను పునరుద్ధరించని పక్షాన కొద్దికాలంలో తోలుబొమ్మలుండవు. తోలుబొమ్మలు చేసేవారుండరు. వాటిని ఆడించే వారుండరు. తారాస్థాయిలో పంచమాన్ని అవలీలగా అందుకొనే ఆ కోకిల కంఠాలు, కవి చెప్పినట్టు మూగవోతై.

ఈ కళను ఉద్ధరించడం ఏమంత కష్టమైన పనికాదు తోలుబొమ్మలను గురించి ఎటువంటి పరిజ్ఞానమూ లేని కొందరు అర్హులను చేర్చి ఒక కమిటీగా నిర్ణయించాలి (ఏమైనా తెలిసివున్న వాళ్ళను నియమిస్తే వాళ్ళు నిష్పాక్షికంగా వ్యవహరించలేకపోతారు).

ఈ కమిటీ వాళ్ళు ఈ కింది పంపణీమీద ఒక ప్రశ్నావళి తయారుచేయాలి

1 తోలుబొమ్మలంటే ఏమిటి? ఇవి క్రీస్తుపూర్వం గానీ క్రీస్తుపరంగా గానీ ఏ సంవత్సరంలో పుట్టాయి? వీటిని ఆదరించిన ఎనుగురు మహారాజుల పేర్లు చెప్పండి.

2. మీరు తోలుబొమ్మలు ఎప్పుడైనా చూశారా? వాటిని గురించి మీ అభిప్రాయం ఏమిటి?

3 ప్రజలు తోలుబొమ్మలను ఎందుకు చూస్తారు? లేక, ఎందుకు చూడరు? వాటిని తరచు చూసేవారిలో నూటికి ఎంతమంది కంటిజబ్బులతో బాధపడతారు?

4 మీ జిల్లాలో తోలుబొమ్మలాడించేవారు ఎవరు? వారి పేర్లూ, వయసూ, చిరునామా ఏమిటి?

5 తోలుబొమ్మలాడించే వాళ్ళు వేరే ఏయే వృత్తులు చేసుకుంటారు? మీ ఎరుకలో తోలుబొమ్మల యూనియను వున్నదా?

6 తోలుబొమ్మలు దేనితో తయారుచేస్తారు? వాటికి ఏయే రంగులు వేస్తారు? దేనికి? ఎప్పుడు? ఎవరు? ఏమిటి?

7 సాధారణమైన తోలుబొమ్మలాట చూడటానికి ఎంతమంది వస్తారు? రానివారెంతమంది? వారు కూర్చోటానికి ఎన్ని చదరపుఅడుగుల జాగా కావాలి?

8 ఈ పై ప్రశ్నలలో మీరెన్నిటికి సమాధానం యివ్వగలరు? ఎందుచేత?

ఈ ధోరణిలో పాతిక ముప్పయి ప్రశ్నలు తయారుచేసి వాటిని కాగితాలమీద అచ్చుకొట్టించి, పది పన్నెండు లక్షల కాపీలు అన్ని జిల్లాలకు పంపేది తోలుబొమ్మల మీద వ్యాసాలు వ్రాసిన వారినీ, ఉపన్యాసాలిచ్చినవారినీ, తోలుబొమ్మలాట ఆడించిన వారినీ ఒక కంట కనిపెట్టి వుండాలి ప్రశ్నావళికి అందరూ పంపే సమాధానాలను బట్టిగాని పట్టకుండా గాని పరిస్థితులననుసరించి తోలుబొమ్మలను అభివృద్ధిలోకి తీసుకొచ్చేది

దీనికంతా ఎంతో ఖర్చు కాదు అచ్చు ఖర్చులకూ, పోస్టుఖర్చులకూ ఒక పదివేలూ, కమిటీ వారి సాదర ఖర్చులకు తిరుగుడు ఖర్చులకూ మరో 30,40 వేలూ అయితే మహారాజుగా పని గడిచిపోతుంది.

*ఆంధ్రపత్రిక, దినపత్రిక, 16-10-1949*

# 7. ప్రజల కళలు

రెండేళ్ళు దాటి వుండవచ్చు, మద్రాసుకు చైనా కళాకారుల వర్గం ఒకటి వచ్చింది విలేఖరుల గోష్ఠి జరిగింది కళాకారుల వర్గం నాయకుడు 'ప్రజలకళలు' అనే మాట వాడాడు తన ప్రసంగంలో ఒక విలేఖరి లేచి, 'ప్రజలకళలు అనే దానికి మీ నిర్వచనం ఏమిటి?'' అని అడిగాడు తడుముకోకుండా అతిథి సమాధానాలిచ్చాడు. ప్రజలంటే నా ఉద్దేశం మా చైనాలో వుండే 60 కోట్ల మనుష్యులు. వాళ్ళకు తిండీ, గుడ్డ, ఇల్లూ, పనీ కావలసినట్టే కళలు కూడా కావాలి. వారి అవసరాలకు సృష్టి అయే కళలు ప్రజలకళలు!

'ప్రజల కళలు' అనే మాటకు ఆయన చెప్పిన ఈ నిర్వచనం నాకు సరిగానూ, సమగ్రంగానూ వున్నట్టు కనబడింది ఆ నిర్వచనంలో 'అవసరం' అనే మాట చాలా ముఖ్యమైనదని నాకు తోస్తుంది.

'ప్రజల కళలు' అనే పదానికి చాలా అర్థాలు తీయవచ్చు జనసామాన్యం, లేక అత్యధిక సంఖ్యాకులు ఆదరించేవి ప్రజల కళలు అని ఒక సిద్ధాంతం వుంది. ఈ సిద్ధాంతం ప్రకారం హెచ్చుడబ్బులు వచ్చిన సినిమా చిత్రాలూ, అందరూ హెచ్చుగా పాడుకునే సినిమా పాటలూ, విడుదల అయిన నెలలోపలే అనేకవేల కాపీలు ఎగిరిపోయే డిటెక్టివు నవలలూ, వాటి అట్టలమీద వుండే త్రివర్ణచిత్రాలూ ప్రజల కళలు కావాలి.

ఈ సిద్ధాంతాన్ని అంగీకరించి ఈ కళలను మాత్రమే బలపరిచే పక్షంలో దేశంలో ఏ కళలూ వుండవు. ఎందుకంటే, ఇవి పరభృతాలు. సంప్రదాయ సిద్ధమైన కళల తాలూకు వికృత రూపాలు వీటి వికృతత్వం సర్వత్రా ఒకటిగా వుండక పోవచ్చు. ఏ డిటెక్టివు నవల అయినా మంచిసాహిత్యానికి చేరువగా రావచ్చు. ఏ సినిమాపాట అయినా సంగీతకళకు చాలా సన్నిహితంగా వుండవచ్చు. కాని ఒక్క విషయం గట్టిగా చెప్పవచ్చు అవతల నుంచి కళలు లేకపోతే యివి రాపటం జరగదు వాస్తవమైన కళల నుండే కొన్ని లక్షణాలు వీటిలో కూడా లేకపోతే యివి చలామణి కాలేవు.

ఒకనాటి కళలు పరిణామం చెందిన ఫలితంగా ఈ కళలు ఏర్పడ్డాయని కొందరు వాదిస్తున్నారు అదికూడా తప్పుడు వాదమే. ఏనాటి కళలైనా ఆనాటి సంస్కృతి వికాసాలను ప్రతిబింబించాలి, పెంపొందించాలి. ఈ రెండు కర్తవ్యాలలో ఏ ఒకటీ నెరవేర్చలేని కళను పరిణితమైన కళ అనటం చాలా పొరపాటు

ఈ చవుకబారు కళలను నిషేధించినంత మాత్రాన కూడా ప్రయోజనం వుండదు మనుష్యుల మనసులను వికృతంగా మార్చి, వారిని సంఘశత్రువులుగా చేసే కళలను నిషేధించటానికి ప్రజాస్వామికమైన మార్గాలుండక పోవు. ఇటీవల అమెరికా నుంచి వచ్చే ఒకరకం సాహిత్యాన్ని మన దేశంలో నిషేధించారు ఆ దేశంలోనైనా యిది హేయమైన సాహిత్యమే. ప్రజాస్వామికం సరిగా అమలుకాకనే అక్కడ మనుష్యులను

రాక్షసులుగా చేస నేరాలను పెంచే కళలు విజృంభించాయని చెప్పాలి అది అమెరికనులు పరిష్కరించుకోవలసిన సమస్య

పౌకబారు కళలన్నీ న్యాయంగా ఈ తరగతి కిందికి రావు ఆపి ప్రజలలో క్రౌర్యాన్ని ప్రకోపింపజేసే వారి డబ్బు కాజేసేటందుకు గాను కళావ్యాపారం చేసేవారికి మాత్రమే ఆర్థికంగా ఉపయోగపడినాయి కళలను గురించి ఆసక్తిగాని, కళలలో ప్రవేశంగాని లేనివారికి సయితం యివి అందుబాటులో వుండటం చేత అధిక సంఖ్యాకులు వీటికోసం ఎగబడతారు దాని ఫలితంగా యివి 'ప్రజలకు సన్నిహితమైన కళలు' అనే అనుమానాస్పదమైన కీర్తిని తెచ్చుకుంటాయి.

సరి అయిన కళలు ప్రజలలో ప్రచారం అయినప్పుడు కళలతో పరిచయం వున్నవాడికీ, లేనివాడికీ ప్రవర్తనలో తేడా వుండాలి కళలతో పరిచయం వున్నవాడు ఎక్కువ యోగ్యమైన పౌరుడుగా, మరింత మంచి భర్తగా, మరింత మంచి తండ్రిగా, సామాజికుడుగా రాణించాలి. కాని ఈ దృష్టితో చూస్తే ప్రజలకు సన్నిహితమైన కళలు కళలుకావని వెంటనే తేలిపోయింది.

సవ్యమైన సమాజంలో తిండీ, గుడ్డ లాగే కళలుకూడా ప్రజల అవసరాలను తీర్చేవిగా వుండాలి. జీవితాన్ని సమగ్రంగా అర్థం చేసుకోవడం, జాతియొక్క అభ్యుదయానికి యథాశక్తి సాయపడటం, అనుక్షణమూ పెరిగే విజ్ఞానాన్ని జీవితంలో ఉపయోగపరచుకోవటం, ప్రవర్తనలో అవసరమైన మార్పులు సాధించటం ప్రజలందరికీ అవసరం. ప్రజలసంస్కృతి ఎంతగా అభివృద్ధి అయితే సమష్టిజీవితం అంతగా అభివృద్ధి పొందుతుంది.

ఈ విషయాన్ని సనాతనవాదులు – సంప్రదాయవాదమైన కళలను బలపరచేవారైనప్పటికీ – అర్థం చేసుకోలేరు. ఎందుచేతనంటే వారి అంచనాప్రకారం వేదాలలోనే సమస్త విజ్ఞానసారమూ వున్నది. అజంతా చిత్రాలతోనే చిత్రకళ పరాకాష్ఠ అందుకున్నది. త్యాగరాజు తర్వాత సంగీతం లేదు. ఇటువంటి వారి సంకుచితత్వం ఎంతదూరం వెనక్కువెళ్ళి ఆగుతుందో ఎవరూ చెప్పలేరు. కొందరు కావ్యాన్నే ఒప్పుకోలేదు. వాళ్ళదృష్టిలో రామాయణం కూడా తప్పుడుగ్రంథమే. కొందరు వీరేశలింగం గారి దాకా ఒప్పుకుంటారు. ఎవరి యిష్టం వారిది. సనాతనతత్వాని కంతటికీ ఒకే సులోచనాలజోడు పనికిరాదు.

కాని ప్రజల కళావసరాలంటూ వున్నాయని గ్రహించినవాడు కొత్తకళల ఆవశ్యకతను సులువుగా గుర్తిస్తాడు. పాతకాలపు మనుస్మృతీ, కౌటిల్యుడి అర్థశాస్త్రమూ ఈనాడు అమలులో లేవు. ఆ తరానికాతరం జీవితం మారుతున్నది. కొత్త పరిస్థితులు ఏర్పడుతున్నాయి. కొత్త చట్టాలు అమలులోకి వస్తున్నాయి. పాతచట్టాలు సంస్కరణ పొందుతున్నాయి. రెండో ఏటనో మూడో ఏటనో పెళ్ళి అయిన స్త్రీలు యింకా జీవించి వున్నారు.

తెలుగు విద్యార్థి, మాసపత్రిక, నవంబర్ *1956*

# 8. సాహితీ స్రవంతి

విద్యార్థులు దేశంయొక్క భవిష్యత్తు సంతకం కూడా సరిగా చేయలేని నిరక్షరులు వాణిజ్యములోనూ, పరిశ్రమలోనూ, ఆఖరుకు రాజకీయరంగాల్లోనూ గొప్పపాత్రలు నిర్వహిస్తూ వుండటము మనము ఈనాడు కూడా అక్కడక్కడ చూస్తూ వున్నప్పటికీ దాన్ని గురించి గొప్పగా చెప్పుకునేటందుకు లేదు, వర్తమాన సమాజంలో విద్యావంతులే అన్ని రంగాల్లోనూ కీలకస్థానాలనధిష్టించాలి. ఇక ముందు ఈ దేశంలో అలాగే జరుగుతుంది కూడా.

అందుచేత భావినాయకులూ, ఇంజనీర్లు, పరిశోధకులు, యితరసంఘ నిర్మాతలు, కళాకారులు విద్యార్థులనుంచే వస్తారు, రచయితలు కూడాను. కొందరు వ్యక్తులు విద్యార్థులుగా వుండగానే రచనలు సాగించారు; కొందరు పేరు తెచ్చుకున్నారు కూడా.

చాలామందికి మటుకు రాయాలనే ఉబలాటం వుంటుంది. రాయటానికి యత్నిస్తారు. కాని విజయం సాధించలేక నిరుత్సాహం పొందుతారు. ఒక్కొక్కప్పుడు ఈ నిరుత్సాహం వారిని రచనకు విముఖులుగా కూడా చేయవచ్చు. ఇది చాలా శోచనీయం. భావి రచయితలు తమ విద్యార్థిదశ లోనే తొలిరచనలు చెయ్యటము స్వాభావికమూ, వాంఛనీయము కూడా.

అయితే, తమ ప్రయత్నాలు ఫలించక నిరుత్సాహపడే విద్యార్థుల కోసం కొన్ని విషయాలు స్పష్టం చేయదలిచాను.

రచన విజయవంతం కావాలంటే - కనీసం మంచి రచయిత కావటానికి పునాది ఏర్పడాలంటే- కొన్ని నియమాలు పాటించాలి.

అందులో మొట్టమొదటిది భాష. రచయితకు కలం యెటువంటిదో, రచనకు భాష అటువంటిది - సాధనం- భాషమీద కొంత అధికారం లేకుండా రచన సాగించటం సాధ్యం కాదు.

నిజానికి మాతృభాష మీద ప్రతివాడికీ సులువుగానే అధికారం లభించవచ్చు. కాని మనదేశంలో యిది సులభసాధ్యం కాని పని అయికూచున్నది. దీనికి కారణమేమంటే మనకు మనోవికాసం చేకూరుస్తూ వచ్చిన భాషలు యితర భాషలు ముఖ్యంగా ఇంగ్లీషు, తరువాత హిందీ. ఈనాడు కూడా మనిషి విద్యావంతుడు కావటమంటే ఇంగ్లీషు సంస్కృతిని అలవర్చుకోవటమే అవుతున్నది. ఈ శతాబ్దంలో వచ్చిన రచయితలు దాదాపు అందరూ ఇంగ్లీషుభాషలో తమకు అంద సాహిత్యాన్ని చదివి దాని ప్రభావానికి గురి అయినవారే. వారి భాషలో ఇంగ్లీషు నుడికారం అక్కడక్కడా కనిపిస్తూనే వుంటుంది. వీరేశలింగం గారివంటి పండితుడు కూడా తన స్వీయ

చరిత్రలో ఒకచోట 'వీరిని గురించి ఒకటికన్నా ఎక్కువసార్లు చెప్పియుంటిని'' అని రాశాడు! ఇక యితరులమాట చెప్పనే అక్కరలేదు. ఇలాగే హిందీబాస తాలూకు నుడికారాన్ని కూడా తెలుగులోనికి దించుతున్న వాళ్ళున్నారు.

విజాతీయమైన నుడికారం గల భాషలో రచించే గ్రంథాలు యితరభాషలు రానివారికి పట్టవు. జనసామాన్యం వాటిని చదవలేరు కూడా.

భాషకు ఒక నుడికారమే గాక యితర లక్షణాలు కూడా వుండాలి. పల్లెటూళ్ళల్లో వుండే జనం నిత్యజీవితంలో వాడే ప్రయోగాలూ, పదజాలమూ తెలియని 'పేరుపడ్డ' రచయితలం చాలామందిమి వున్నాం. ఈ లోపం రాను రాను సర్దుకుంటుందని నేను ఒకప్పుడు ఆశించాను. కాని అటువంటి లక్షణాలేవీ ఇంతవరకు పొడగట్టటం లేదు. పైపెచ్చు ఈనాటి యువకులు రాసే భాష బొత్తిగా పేలవంగా, దుష్టంగా కూడా వుంటున్నది.

అందుచేత భావిరచయితలు ఇంగ్లీషు గ్రంథాలతో బాటు తెలుగు గ్రంథాలు కూడా చదవటం చాలా అవసరం. ''ఇతరుల భావాలను అరువు తెచ్చుకున్నంత మాత్రాన లాభం లేదు, వాటిని స్వంతం చేసుకోవాలి'' అంటాం. 'స్వంతం' చేసుకున్నట్టు దాఖలా భాషలోనే కనిపిస్తుంది. ఒక యెల్లయ్య వ్యక్తం చేసిన భావాన్ని మరొక పుల్లయ్య తన 'స్వంత' భాషలో చెప్పగలిగినప్పుడే ఆ భావం పుల్లయ్యదవుతుంది. విద్యార్థికి పాఠం వంటబట్టినదీ లేనిదీ చూడటానికి ఉపాధ్యాయుడు, ''నీ స్వంతభాషలో చెప్పు!'' అంటాడు. పుస్తకంలో వున్న భాష వప్పగించడమూ పుస్తకంలో వుండే విషయాలు ఏ మాత్రమూ అర్థం కానవసరం లేదు. 'భట్టీయం వేసిన' వేదం అర్థం కానవసరం లేదు!

ఇతరజాతుల సంస్కృతి అయినా అంతే, మనం ఈనాడు పాశ్చాత్యుల నుంచి నేర్చుకోవలసిన విషయాలూ, స్వీకరించదగిన భావాలూ బోలెడున్నాయి. కాని అవి మన 'స్వంతం' కావాలంటే మన భాషలోకి రావాలి! లేకపోతే అవి జీర్ణమయినట్టు కాదు.

ఇక రెండో విషయమేమిటంటే, యితర వృత్తులలోనూ వ్యాపకాలలోనూ పరిశ్రమ చేసేవారిలాగే రచయిత కూడా ఒక 'స్పెషలిస్ట్'. స్పెషలిస్టయినవాడు తనకు సంబంధించిన విషయంలో యితరులకు లేని జ్ఞానాన్ని ప్రదర్శించి, యితరులు గ్రహించలేని సత్యాన్ని గ్రహించగలుగుతాడు. స్టెతస్కోప్ తీసుకొని మనం కూడా యితరులను పరీక్షించ వచ్చు, కాని డాక్టరుకే నిజం తెలుస్తుంది. గుండెకాయ, ఊపిరితిత్తులు ఆరోగ్యంగా వుంటే ఎలా వినిపిస్తుందో అతనికి తెలుసు. స్టెతస్కోప్ సహాయంతో వినేటప్పుడు కొత్తచప్పుడు ఏమాత్రం వినిపించినా అతను వెంటనే 'రియాక్ట్' అవుతాడు.

రచయిత కూడా సమాజం విషయంలో ఒక విధమైన స్పెషలిస్టుగా తయారుకావాలి. డాక్టర్లను తయారుచేయటానికి కాలేజీలున్నాయి. రచయితలు

స్వయంకృషి చెయ్యాలి ''ఒకడి జోలి మనకెందుకు మన మానాన మనం బ్రతుకుదాం'' అనుకునేవాడు అయితే కావచ్చు గాని రచయిత మాత్రం కాలేడు ఈ సమాజం నాది, ఇందులో జరిగే మహాపరిణామాలన్నీ నన్ను చలిస్తాయి నా పని నేను మానీచూడనట్టు పోనివ్వలేను'' అనే వైఖరి అవలంబించిన వాడే ఏనాటికైనా రచయిత అవుతాడు

అయితే యిటువంటి వైఖరి రాజకీయవాదికి కూడా ఉంటుంది రచయితది కళాకారుడి చైతన్యం రాజకీయవేత్త కార్యసామాజిక జీవితంలో ఏయే మార్పులు తీసుకురావటానికి కృషి చేస్తాడో, తదనుగుణమైన మానసిక పరివర్తన మనుషుల హృదయాలలో కలిగించటానికి రచయిత కృషిజేస్తాడు

అందుచేత రచయితలూ రాజకీయవేత్తలూ వేరు వేరు ప్రపంచాలలో ఉండటం అంత వాంఛనీయం కాదు మానవచరిత్రలో సాహిత్యమూ, రాజకీయాలూ చేతులు కలిసినవి దర్శనాలు చాలా కనిపిస్తాయి భారతం పదిహేను పర్వాలు రాసిన తిక్కన రాజకీయరంగంలో కూడా కృషిజేసాడు సమాజంలో చైతన్యం తరిగి సంఘం నెర్రెలు విచ్చినప్పుడు వివిధ సామాజికరంగాల మధ్య ఏకత్వము లేకుండా పోయి ''ఎవరికి వారే యమునాతీరే'' అవుతుంది. కాని అది ఆదర్శం కాదు

విద్యార్థులకు రాజకీయాలు పనికిరావనే మాటలో కొంచెం కూడా అర్థం ఉన్నట్టు కనబడదు వారికి కళావ్యాసంగమూ, రాజకీయవ్యాసంగమూ కూడా ఉండవలసిందే దేశం యొక్క రాజకీయ భవిష్యత్తుకూ, భావి సంస్కృతికి పునాది విద్యార్థిలోకంలోనే ఏర్పడాలని నా నమ్మకం

తెలుగు విద్యార్థి మాసపత్రిక, జూన్ 1957

# 9. ప్రజాచిత్రకారిణి కాథే కోల్విట్జ్

## మాతృత్వం, యుద్ధ బీభత్సం అద్భుతంగా చిత్రించిన జర్మన్ కళాతపస్విని

కళాకారులు తమకుగల శక్తులను శ్రామికుల జీవితాలకు అంకితం చేసినట్టయితే ఉత్తమకళాఖండాలను సృష్టించి జగద్విఖ్యాతి సంపాదిస్తారనటానికి కాథేకోల్విట్జ్ చిత్రాలు మంచి నిదర్శనం( ఇవి ఈనెల 4 నుంచి 10 దాకా మద్రాసులో ప్రదర్శించబడ్డాయి).

మనదేశంలో అనేకచోట్ల ప్రదర్శింపబడిన ఈమె చిత్రాలు50 లోనూ డ్రాయింగులూ, ఎచింగులూ, లితోగ్రాఫులూ వున్నాయి. వీటిలో 10 స్వీయచిత్తరువులు వీటిలో మొట్టమొదటిది 1889 నాటిది కట్టకడపటిది 1941 నాటిది

మిగిలిన చిత్రాలలో కొన్ని మాతృత్వానికి చెందినవి, కొన్ని యుద్ధానికి సంబంధించినవి, కొన్ని శ్రామికులకు సంబంధించినవి, రెండు నేత కార్మికపోరాటానికి సంబంధించినవి, నాలుగు రైతులయుద్ధం (16వ శతాబ్దం)కు సంబంధించినవి

కాథే కోల్విట్జ్ చిత్రాలను చూస్తూ నిర్లిప్తంగా వుండటం ఎవరికీ సాధ్యం కాదు ఆమె కళ భావపూరితమూ, చైతన్యవంతమూ అయినది తన కళలో తనకాలపు జీవితం ప్రతిబింబించాలనీ, దాని ప్రయోజనం తనకాలంలోనే లభించాలనీ ఆమె ఆశించింది ఆ ఆశయం ఫలించింది

ఈ చిత్రకారిణి 1861లో మధ్యతరగతి కుటుంబంలో జన్మించింది. ఈమెలో విప్లవ లక్షణాలు అనువంశికంగా కలిగినట్లు కనబడుతుంది. ఈమె తాతగారు 1848 విప్లవాన్ని బలపరిచాడు. ఈమె తండ్రి లాయరు అయివుండి కూడా ఇంపీరియల్ ప్రభుత్వం కింద ఉద్యోగం చెయ్యటం యిష్టం లేక తాపీపని చేసుకుని జీవించాడట!

ఈమె భర్త డాక్టర్ కార్ల్‌కోల్విట్జ్. ఈయన బెర్లిన్ నగరంలో వుండి వైద్యవృత్తి చేసేవాడు పేదలదగ్గర డబ్బు పుచ్చుకోక పోవటమే గాక, వారికి ఔషధాలు కూడా ఒక్కొక్కప్పుడు ఉచితంగా యిచ్చేవాడు

కాథే చిత్రలేఖనం ప్రారంభించింది మొదలు జీవితాంతం వరకూ తన కళను శ్రామికులకే ప్రధానంగా అంటిపెట్టుకుని చిత్రాలు రచించింది 19వ శతాబ్దాంతంలో జర్మనీ పారిశ్రామికంగా ఎంత అభివృద్ధి అయిందో కార్మికుల కష్టాలూ, నైరాశ్యమూ అంతగానూ హెచ్చాయి. ఈ నైరాశ్యాన్ని, దానివెనక వుండే పైశాచిక శక్తులనూ బయటపెట్టాలని ఆమె ఆశించింది.

కాథే ఎక్కువకాలం వర్ణచిత్రాలు చిత్రించలేదు. వాటిని చిన్నతనం లోనే విడిచిపెట్టి, డ్రాయింగులు, దారుచిత్రాలు, లితోగ్రాఫులూ తయారు చేయనారంభించింది.

ఈమె చిత్రాలలో మూడు విషయాలకు ప్రాముఖ్యం కనబడుతోంది. విప్లవమూ, మాతృత్వమూ, మృత్యువూ. ఆమె తన 26వ యేట ఎమిలీజోలా రచించిన ‘జెర్మినాల్’ నవల యొక్క ప్రభావానికి గురిఅయింది. ఈ నవలలో బొగ్గుగని కార్మికుల నికృష్ట, హేయ జీవితం యథాతథంగా చిత్రించబడింది. దాని ప్రభావంతో ఆమె చాలా ఎచింగ్‌లు తయారుచేసింది. తరువాత ఆమె గెర్‌హార్ట్ హాప్ట్‌మెన్ రచించిన ‘నేత కార్మికులు’ అన్న నాటకం యొక్క ప్రభావానికి గురి అయింది. ఈ నాటకంలో మిల్లులోని కార్మికులు సాగించే సమ్మె, దాని తాలూకు దారుణపరిణామాలు చిత్రించబడ్డాయి. ఈ నేతకార్మికుల సమ్మెను చిత్రిస్తూ ఆమె ఐదు సంవత్సరాలలో ఆరు చిత్రాలు తయారుచేసింది.

1898లో ఈ చిత్రాలను మొదటిసారి బెర్లిన్ కళాప్రదర్శనంలో ప్రదర్శించినప్పుడు చిత్రకారిణిగా ఈమె ఖ్యాతికి గొప్పపునాది ఏర్పడింది.

నేత కార్మికుల పోరాటానికి చెందిన చిత్రాలను పూర్తిచేశాక ఆమె రైతుల యుద్ధం చిత్రింప పూనుకున్నది 1524-25లలో జరిగిన ఈ యుద్ధం జర్మను చరిత్రలో ఒక ప్రముఖఘటన

ఈ చిత్రాలు పూర్తిచేసిన తరవాత మొదటి ప్రపంచయుద్ధం ప్రారంభమయే దాకా ఈమె మాతృత్వాన్ని చిత్రించే చిత్రాలు తయారు చేసింది. బాధనూ, మృత్యువునూ చిత్రించింది ఆ యుద్ధంలో ఆమె కుమారుడు పీటర్ మరణించాడు. ఆమె భవిష్యత్తులో యివే విషయాలను గురించి చిత్రాలు తయారు చేయ నిశ్చయించటానికి యిది కూడా కొంతకారణం కావచ్చు సాంఘిక దోపిడీ, వలసవాదులు తెచ్చిపెట్టే యుద్ధాలూ - వాటిని ఖండిస్తూ ఆమె చిత్రాలనూ, పోస్టర్లనూ తయారుచేసింది.

సామ్రాజ్యవాదుల యుద్ధతంత్రాలను వీరోచితంగా ప్రతిఘటించిన కార్ల్ లీబ్‌నెక్‌ను హత్యచేశారు అతని స్మారకచిహ్నంగా కాదే ఒక చిత్రాన్ని తయారు చేసింది అతనిని మరణశయ్య పై చిత్రించుతూ మరొక బొమ్మ తయారుచేసింది

ఈమె తయారుచేసిన ప్రతియుద్ధచిత్రమూ ఒక యుద్ధవ్యతిరేక నినాదమే. 'వాలంటీర్లు', 'వితంతువు', 'తల్లులు', 'ప్రజలు', 'హతశేషులు' మొదలైన అనేక చిత్రాలను చూస్తే యుద్ధం ఎంత పైశాచికమో తెలుస్తుంది.

కాథేకోల్విట్జ్ 1945లో చనిపోయింది. జర్మన్ డెమోక్రటిక్ రిపబ్లిక్ ప్రభుత్వం ఆమె కళకు ఉన్నతస్థానం యిచ్చి గౌరవించింది.

విశాలాంధ్ర, *17-5-59*

## 10. తెలుగు కళలు

సంపదను అభివృద్ధి చేసుకోవటానికి పరిశ్రమలు ఎంత అవసరమో, సంస్కారాన్ని పెంపొందించుకోవటానికి కళాపరిశ్రమ అంత అవసరం. సంస్కృతి ఒక మహత్తరమైన సాంఘికశక్తి అది నియమబద్ధంగా ప్రవర్తిల్లినట్టయితే అపూర్వమైన సాంఘిక చైతన్యం ఉత్పన్నమై జాతి ఘనవిజయాలను సాధించగలుగుతుంది లేనిపక్షంలో వున్న సంస్కృతి కాస్తా తెరిచిన గిన్నె లోని నీరులాగా ఆవిరి అయి గాలిలో కలిసిపోతుంది తప్ప, రైళ్ళను లాగలేదు, ఇంజన్లను నడపలేదు.

ప్రస్తుతం తెలుగుకళలు తెరిచిన గిన్నెలోని నీరులాగా వున్నట్టు తోస్తుంది తెలుగుజాతి కళాసంప్రదాయాలు ఎరగని జాతి కాదు తెలుగు గడ్డమీద ఎప్పుడో ఒకప్పుడు ప్రతి కళా ఉచ్చ దశలో రాణించింది. కాని రానురాను తెలుగు కళాపరిశ్రమ ఎదుగూ బొదుగూ లేకపోవటమో, గుంటపూలు పూయటమో, నశించిపోవటమో

జరిగింది ఇందుకు రాజకీయమైన మార్పులూ, సామాజికమైన మార్పులూ ప్రధానకారణాలనటానికి సందేహం లేదు

గాంధీ ఉద్యమంలో జనంలో కలిగిన చైతన్యం ఆ కాలపు కళలలో చాలావరకు ప్రతిబింబించనే లేదని చెప్పవచ్చు వెలువడిన కొద్దిరచనలు వగైరాలను అప్పటి ప్రభుత్వం నిషేధించింది అయితే గాంధీజీ ప్రచారం చేసిన సాంఘికసంస్కరణల ప్రభావం మరింత ప్రస్ఫుటంగా తెలుగుకళలలో వ్యక్తమయింది ముఖ్యంగా దరిద్రనారాయణులను గురించి, హరిజనులను గురించీ భావవాదంతో కూడిన కథలూ, పాటలూ, చిత్రాలూ, నాటకాలూ కూడా వెలువడ్డాయి భావవాదం దేనికంటే ప్రత్యక్ష చర్యలకింకా మార్గాలు ఏర్పాటు కాలేదు ఇవి పరిమితమైన ప్రయోజనాన్ని కూడా సాధించాయనవచ్చు

అయితే జీవితంలో చెప్పుకోదగిన పెద్దమార్పులు తీసుకువచ్చినది రెండవ ప్రపంచయుద్ధం దీనితో ప్రపంచఖండాలు ఒకే మూసలో ఎచ్చిపడ్డాయి ప్రజలలో ఒక విశాల అంతర్జాతీయ దృక్పథం ఏర్పడింది మేధావులు తమ పరిస్థితుల సాదృశ్యాల కోసం ప్రపంచమంతా, చరిత్ర అంతా గాలించసాగారు యుద్ధంలో ఓడిపోయి గూడా ఫాసిజం మంచి గుణపాఠం నేర్పింది ఫాసిజం అన్నది ప్రజాతంత్రానికి గొడ్డలిపెట్టు గానూ, సైనిక సమీకరణ గానూ నిర్వచించ బడింది ప్రపంచమంతటా ప్రజాతంత్రానికీ, విశ్వశాంతికీ పరపతి హెచ్చింది అదేవిధంగా పేదదేశాలలో సోషలిస్టు విధానాలకు పరపతి హెచ్చింది.

మన పురోభివృద్ధికి దోహదం చేసే ఈ ప్రధానాంశాలన్నిటినీ మన రాజ్యాంగం స్వీకరించింది. మనం యుద్ధతంత్రాల జోలికి పోకుండా ప్రపంచశాంతికి శాయశక్తులా కృషి చేస్తూ ప్రజాతంత్రాన్ని కాపాడుకుంటూ మత విభేదాలు దేశాభ్యుదయానికి అడ్డు రాకుండా చూసుకుంటూ సోషలిస్టు విధానంలో దేశసంపదను పెంపొందించుకొని పంచశీల సూత్రంతో అన్ని ప్రపంచ దేశాలతోనూ సత్సంబంధాలు ఏర్పరచుకుని వర్గరహిత సమాజ వ్యవస్థ లక్ష్యంగా పెట్టుకుని పురోగమించటానికి ప్రమాణం స్వీకరించాలి.

ఇది ఆచరణలో అమలు జరగటానికి ఎంతో కృషి అవసరం ఆ కృషికి అవసరమైన అనంతశక్తి మన సంస్కృతిలో నుంచి ఉద్భవించాలి ప్రజలలో పాత వాసనలు ఏ మాత్రమూ చావలేదు మతస్పర్ధలూ కులతత్వాలూ విజృంభిస్తూనే వున్నాయి లాభ కాంక్ష, స్వార్థమూ, అధికార వ్యామోహమూ, అవినీతి పక్షపాతమూ, దేశద్రోహచింతా, యుద్ధోన్మాదమూ మొదలుగా గల అనేకమైన అవాంఛనీయమైన మానసిక ప్రవృత్తులు అంటువ్యాధుల లాగా జాతిని పీడిస్తున్నాయి 1930 లోనూ, తిరిగి 1942 లోనూ ప్రజలలో వుండిన ఐక్యభావం స్వాతంత్ర్యం సిద్ధించిన

యింతకాలానికి దేశంలో మృగ్యంగా ప్రశ్నల్ని స్పష్టమవుతున్నది. ఈ అంటువ్యాధులు నిర్మూలనం కాకపోతే మన గమ్యానికీ గమనానికీ ఎలాంటి పొంతనా వుండబోదు.

[illegible] ప్రభుత్వమూ, ప్రజలు ఎన్నుకున్న మంత్రులూ పరిష్కరించ గలరని ఎవరన్నా అనుకుంటే అది కేవలం భ్రమ. శాసనాలూ, చట్టాలూ మనిషిలోని కుసంస్కారాన్ని కొంతవరకు నిగ్రహింపగలవు గాని మనిషికి సంస్కారాన్ని యివ్వలేవు. సంస్కారానికి తిలోదకాలిచ్చినవాడు శాసనాలన్నిటినీ అధిగమించి స్వప్రయోజనం చూసుకోవటానికి తన యావచ్ఛక్తిని వినియోగిస్తాడు. అందుచేత మంచి శాసనాలూ, చట్టాలూ సవ్యంగా అమలు జరగటానికి కూడా ప్రజలకు ఒక కనీససంస్కృతి అత్యవసరం. రాతియుగంలో నివసించేవారికి నాగరికమైన చట్టాలనిచ్చి నాగరికులను చేయలేం, వాళ్ళ జీవితం భౌతికంగా ఒక్కొక్క మెట్టే ఎక్కిరావాలి. అందుకు తగిన సంస్కారం కూడా వారికి అడుగడుగునా లభించాలి.

ప్రజల సంస్కృతిని పెంచేవి కళలు. ఈనాటి తెలుగు కళలలో రేపటి తెలుగు ప్రజల భవిష్యత్తు ఛాయలు కనిపించటం లేదు. నిన్న మొన్నటిదాకా తెలుగువారికి మద్రాసు నగరమే సంస్కృతీకేంద్రంగా వుండేది. ఇప్పుడిప్పుడు హైదరాబాదు నగరం ఆ స్థానం ఆక్రమించుకుంటున్నది. కాని సంస్కృతీకేంద్రంగా హైదరాబాదు మద్రాసుకు చాలా దశాబ్దాలు వెనకబడి వున్నట్టుగా కనిపిస్తుంది. కళాప్రచార సాధనాల దృష్ట్యా చూస్తే యిందులో అబద్ధం అవగింజంత కూడా లేదు.

ప్రజాసామాన్యాన్ని సంస్కృతీవంతం చేయాలంటే పారిశ్రామిక సాధనాలు అత్యవసరం. నన్నయ తిక్కనల కాలంలో తాటాకులతోనూ గంటాలతోనూ సాహిత్య దేవతకు అమూల్యాలంకారాలు లభ్యమయాయి. ఈనాటి సాహిత్యం అచ్చుయంత్రాల మీద చౌకగా తయారై, రైళ్ళమీదా, విమానాలలోనూ, రేడియోద్వారానూ దేశం నాలుగు మూలలా అందాలి. అచ్చుయంత్రాలున్నాయి. రైళ్ళూ, విమానాలూ రేడియోలూ వున్నాయి. ప్రజలలో అత్యవసరమైన సంస్కృతిని పెంపొందించి వారి జడత్వాన్ని వదలగొట్టి, చైతన్యాన్ని ప్రసాదించే సాహిత్యమే బహుతక్కువగా వున్నది. కళలలో చాలారకాలుంటాయి. వెనక్కు చూసేవీ, ముందుకు చూసేవీ, జాతికి ఉపకరించేవీ, నష్టం కలిగించేవీ, ఏదీ చెయ్యనివీ యిత్యాది. వీటిలో కొన్ని మాత్రమే ప్రచార యోగ్యమైనవి, ముఖ్యంగా కళాసాధనాలు వ్యాపారవస్తువులైనప్పుడు లాభం ప్రధానంగా వుంటుంది. కళాసాధనాలు చేతిలో వున్నవాడు ప్రజలవెనక నడిచే కళలనే ప్రోత్సహిస్తాడు. అందువల్ల అతడికి ఎక్కువ లాభం. ఈ లక్షణం సినిమా పరిశ్రమలో కొట్టవచ్చినట్టు కనిపిస్తుంది. సినిమా చిత్రాలను నిర్మించేవారు తమ ఆశయాలను బహిరంగంగానే ఒప్పుకుంటున్నారు. ప్రజలకు అత్యంత సన్నిహితంగా వున్న సినిమాకళ నుంచి మనం చైతన్యవంతమైన సంస్కృతిని ఆశించటానికి లేదు.

తెలుగు సంగీతమూ, తెలుగు చిత్రకళ, తెలుగు నాట్యకళా గుంటపూలు పూస్తున్నాయి. ఉత్తమసంగీతమూ, చిత్రకళా పాతసంప్రదాయాలను వదిలి ముందుకుపడ్డినట్టు కనబడదు. ప్రజలను అధికంగా ఆకర్షించే గాయకులూ, చిత్రకారులూ, నటులూ సినిమా పరిశ్రమలో నాలుగుడబ్బులు చేసుకుంటున్నారు. ఇక నాటకాల మాటకు వస్తే తెలుగుదేశంలో నాటకరంగమే మృగ్యమైపోయింది.

ఈ సమస్య ఇలా వుంచి తెలుగుదేశంలో యాంత్రికసాధనాలే మృగ్యమైపోయాయి. తెలుగుపత్రికలూ, పుస్తకాలూ, బొమ్మల పుస్తకాలూ విరివిగా తయారు చేసే మంచి అచ్చు యంత్రాలూ లేవు. కళాసాధనాలను కేవలవ్యాపార సరుకులుగా పరిగణించినా వాటిని చౌకగానూ, ఆకర్షవంతంగానూ, విరివిగానూ తయారుచేసే పారిశ్రామిక యంత్రాలు తెలుగుదేశంలో ఏర్పాటుకాలేదు. తెలుగువాళ్ళు పరిశ్రమలు నెలకొల్పి విజయవంతంగా నిర్వహించటం నేర్చుకోవటమనేది తెలుగుజాతి యొక్క పురోభివృద్ధికి మొదటిమెట్టులాగా కనిపిస్తుంది. అలాటి సాధనసంపత్తి ఏర్పడిననాడు సంస్కృతిని సరిఅయిన మార్గాన నడిపించే సమర్థతగల వాళ్ళు వాటిని ఉపయోగ పరుచుకోగలుగుతారు.

తెలుగుదేశం పారిశ్రామికంగా అభివృద్ధి కావటం తక్షణకర్తవ్యం.

ఆంధ్రప్రదేశ్ మాసపత్రిక, మార్చ్ *1960*

# 11. ఆధ్యాత్మిక విలువలూ, నైతిక విలువలూ భౌతికవిలువల పైనే ఆధారపడి వున్నవి

తోలుబొమ్మలూ, వీధినాటకమూ, హరికథ, బుర్రకథ, నాటకమూ, సినిమా-ఇవన్నీ కళాస్వరూపాలే అయినప్పటికీ వివిధ సామాజిక వ్యవస్థలను ప్రతిబింబిస్తాయి. వీటిలో ఒక పరిణామక్రమం కూడా మనం చూడగలం.

లిపి లేఖనాలు లేనికాలంలో బ్రహ్మ (ప్రాచీన ఆర్యసమూహం) ముఖాన వెలువడిన వేదాలు ముఖత వ్యాప్తి చెందవలసి వచ్చింది. తాటాకులమీద గంటాలతో రాసేకాలంలో వెలువడిన పురాణాలు వగైరాలు హిమానీనదాల వలె చాలా నింపాదిగా ప్రచారం అయాయి. (వీటిని అచ్చుయంత్రాల పై ముద్రించే అవకాశం దొరికేనాటికి బహుకొద్ది ప్రతులే లభ్యమయ్యాయి). అచ్చుయంత్రాలు వచ్చాక బహుళమైన సాహిత్యం వెలువడుతున్నది. రైళ్ళూ, విమానాలూ వీటిని క్రమంగా ప్రపంచం మీద విరజిమ్ముతున్నాయి.

బాహ్య నాగరికతలో కలిగిన ఈ పరిణామాలకు అనుగుణంగా సాంఘిక స్వరూపంలోనూ, సంఘంలోని వివిధ వర్గాల మధ్య వుండే సంబంధాలలోనూ కూడా మార్పులు జరిగాయి. ఆ మార్పులు కళలలో ప్రతిబింబించాయి ఈ మార్పులు ప్రధానంగా ఇతివృత్తంలో కనిపిస్తాయి

ప్రపంచంలోని ఏ ప్రాంతాన్ని తీసుకున్నా అక్కడి అత్యంత ప్రాచీనకళలు మతసంబంధమైనవిగా వుంటాయి మానవ సమాజంలో మత చైతన్యం 'నవీన' రాతియుగం లో బయలుదేరినట్టు మనకు తెలుస్తున్నది అప్పుడప్పుడే మానవ జీవితంలో కొంతవిస్తృతి సాగింది. రకరకాల పనిముట్లను మానవుడు సృష్టించటం నేర్చుకుంటున్నాడు. సంఘంలో శ్రమవిభజనా, వర్గవిభజనా ఏర్పడుతున్నాయి. ఈ పరిణామాలను నియమబద్ధం చేసి, సంఘంలో శాంతీ, అభ్యుదయమూ సాధించటం ప్రయోజనంగా పెట్టుకుని మతసాహిత్యం వెలువడింది. సంఘం యొక్క స్వరూపమూ, స్వభావమూ మారకుండా అలాగే నిలిచి వున్నట్టయితే ఆ సాహిత్యమే ఈనాటికీ అత్యుత్తమ సాహిత్యంగా నిలిచి సంఘం యొక్క అభివృద్ధికి తోడ్పడివుండును

కాని సంఘం యొక్క స్వరూప స్వభావాలు పరిణామం చెందాయి. ప్రకృతిలోని సంపదను వినియోగించే జ్ఞానం మనిషి అలవరచుకున్నాడు - లోహాలతో తయారైన పరికరాలు చేతిపరిశ్రమలకూ, సంపదకూ ఉపాధి కలిగించాయి నగరాలు వెలిశాయి వ్యవసాయం వృద్ధి చెందింది వేటాడటం జీవితావసరం కాక వినోదంగా మారింది యుద్ధాలు చేయటం మనుగడ సాధనంగా వుండటం మాని నాగరికతా వ్యాప్తికి సాధనంగా తయారయింది. సంఘం నాయకులకు స్వస్తి చెప్పి తనను పరిపాలించటానికి రాజులను నియమించు కున్నది. పాలించే వర్గానికీ సంపదను సృష్టించేవారికీ మధ్య గల అంతరం హెచ్చింది శూద్రులు అనే బానిసజాతికి సంఘంలో స్థానం ఏర్పడింది. పూర్వయుగపు మతసాహిత్యం తోసిపేయ బడలేదు. అందులో పనికివచ్చేది అమలులో వుంటూ సంఘం పాటించవలసిన కొత్తధర్మాలు నిరూపించటానికి కొత్తసాహిత్యం వెలువడింది. చాతుర్వర్ణ్యాన్ని మించి పంచములనే వాళ్ళు వచ్చినట్టుగానే, పంచమవేదంగా భారతం వెలిసింది మతప్రధానమైన సమాజ వ్యవస్థలో అగ్రవర్ణులైనవారు (బ్రాహ్మణులు) తమ గొప్పతనాన్ని కాపాడుకుంటూనే, చరిత్రయొక్క అగ్రస్థానంలో క్షత్రియరాజుల నుంచి పురాణాలు రచించారు. అయినప్పటికీ బుద్ధుడికాలం నాటి సాహిత్యంలో అగ్రవర్ణులుగా పేర్కొనబడినది బ్రాహ్మణులు కారు, క్షత్రియులు

రాతియుగం అంతమై ఆధునిక యంత్రయుగం వచ్చే మధ్యకాలంలో జరిగిన యుగం సుదీర్ఘమైనది. ఈ మధ్యయుగంలో సంఘం ఎన్ని మార్పులు చెందినా కొత్త పరిణామ దశను అందుకోలేకపోయింది ఏ ప్రాంతంలోని జీవితం ఆ ప్రాంతంలో స్తంభించిపోయి ప్రాంతీయాచారాలూ, సంప్రదాయాలూ, సంస్కృతీ ఏర్పాటయాయి

భాషా నుడికారాలు కూడా ప్రాంతీయమయాయి కళలు కూడా కొన్ని ప్రాంతీయ వైశిష్ట్యాన్ని సంపాదించుకున్నాయి

మధ్యయుగపు కళలు ఉన్నతవర్గాల వినోదం కోసం సృష్టి అయినాయి. వారిలోని ఉత్తమ లక్షణాలను ప్రతిబింబించాయి , ఒక కొత్త ఆదర్శవాదాన్ని అవలంబించాయి పాలకుల ఔదార్యశీల పరాక్రమాలూ, ధర్మనిరతీ, పాలితుల భక్తి విశ్వాసాలూ, త్యాగబుద్ధీ, సౌందర్యపిపాసా, ప్రణయసౌందర్యమూ ఈ కళలకు ప్రధానమైన ముడివస్తువులు

మధ్యయుగపు కళలలో శిల్పపుష్టీ పాండిత్యప్రకర్షా, అలంకార విన్యాసాలూ జాస్తి ఈ యుగంలో కవిత్వం కావ్యంకంటె ప్రాశస్త్యం సంపాదించుకున్నదని చెప్పవచ్చు అన్నికళలలోనూ శిల్పరీతులు పదునెక్కాయి

మానవసమాజాలు సాంస్కృతిక మార్గాన అడుగుపెట్టినాక సామాన్యప్రజలకు కళలు మధ్యయుగంలో వెళ్ళినంత దూరంగా మరెన్నడూ పోలేదు ఇది ఎంత తీవ్రమైన సాంఘికసమస్య అయిందంటే సామాన్యప్రజలు తమ కళలను తాము వేరేగా సృష్టించుకున్నారు ఇవే జానపదకళలు భాషా పాండిత్యమూ, అలంకార శాస్త్రాలూ, సాముగరిడీలూ లేకుండా 'అప్రయత్నంగా' ప్రజలనుంచి పుట్టుకువచ్చిన ఈ కళలలో మధ్యయుగపు సామాన్యప్రజల జీవితం సమృద్ధిగా ప్రతిబింబించింది అయినప్పటికీ ఆ కళలు మనం ఈనాడు వాస్తవిక కళలుగా భావించే కళలు కావు మధ్యయుగపు కళలలో కనిపించే కళాతృష్ణా, సౌందర్యపిపాసా ఈ జానపద కళలలో కూడా కనిపిస్తుంది. ప్రజల కష్టసుఖాలు జానపదకళలలో ప్రతిబింబించినా జీవితాన్ని మార్చాలనే ధోరణి జానపద కళలలో కనపడదు

నిజానికి ఈ 'విప్లవ' ధోరణి జీవితంలోనే లేదు మధ్యయుగంలో ఎన్నోసార్లు ప్రజలు ఏకమై తమ ఏలికలపైన తిరుగుబాటు చేసి విజయం సాధించటం జరిగింది కాని అది విప్లవయుతమైన తిరుగుబాటు కానందుచేత 'చెడ్డ' ఏలిక స్థానే 'మంచి' ఏలిక రావటమూ ప్రజలు తాత్కాలిక సంతృప్తి చెందటమూ జరిగింది సమాజ స్వరూపంలో వాస్తవమైన మార్పులు తెచ్చే భౌతికశక్తులు లేవు

ఆ శక్తులు యంత్రయుగంతో ఆరంభమయ్యాయి. ఈ యుగానికి సంబంధించిన విప్లవశక్తులు ఉత్పత్తిదార్లనుంచి వచ్చాయి. నిరంకుశ రాజకీయాధికారానికి స్వస్తి చెప్పటం జరిగింది యంత్రయుగపు సాంఘిక పరిణతి రాజకీయస్వాతంత్ర్యం గల ప్రజలపైనా, పెట్టుబడిద్వారా నిర్మాణమై నడిచే యంత్రపరికరాల పైనా ఆధారపడి వుంది.

అందుచేత యంత్ర నాగరికతకు ప్రజాతంత్రం బావుటా అయింది. ఏ సాంఘిక విప్లవమూ ప్రతీపశక్తుల సంఘర్షణను ఎదుర్కోకుండా జరగలేదు

యంత్రయుగంతో పోటీ పడలేపోయిన మహత్తరశక్తుల గాథలను మనం పరీక్షగా చదువుతున్నాం. ఇలాంటి మహాయుద్ధాలలో ఒకటి అమెరికా రాష్ట్రాలమధ్య బానిసత్వ నిర్మూలనకోసం జరిగిన అంతర్యుద్ధం. ఆ యుద్ధంలో దక్షిణరాష్ట్రాలు నెగ్గివుంటే అమెరికా యొక్క అభ్యుదయం మరికొన్ని శతాబ్దాలు వెనకపడి వుండేది.

యంత్రయుగంలో రెండు సాంఘిక పద్ధతులను మనం ప్రత్యక్షంగా చూస్తున్నాం. ఒకటి వర్గసమాజ వ్యవస్థ, రెండవది వర్గరహిత సమాజ వ్యవస్థ. ఈ వర్గరహిత సమాజ వ్యవస్థ అన్నదానికి నాంది రష్యను విప్లవంతో ప్రారంభమయింది. అందుచేతనే హెచ్.జి.వెల్స్ వంటి మితవాది కూడా ఆధునిక ప్రపంచచరిత్రలో మొదటి ప్రపంచయుద్ధానికి యివ్వని ప్రాముఖ్యం రష్యన్ విప్లవానికి యిచ్చాడు.

'ఆధునిక' కళలను గురించి ప్రస్తావించే వారిలో చాలామంది గడిచిన యాభై సంవత్సరాలలో వెలువడిన కళలు అనో, ఇరవయ్యోశతాబ్దపు కళలు అనో అనుకుంటున్నట్టు కనిపిస్తుంది. వారు ఆ విధంగా అనుకోదలిస్తే అడ్డులేం గాని అది శాస్త్రీయమైన దృక్పథం కాదనిమటుకు స్పష్టం. యంత్రయుగ లక్షణాలున్నదే ఆధునిక కళ. ఏమిటా లక్షణాలు? యంత్రయుగ సమాజ లక్షణాలే! 1) ప్రజల భాషకూ భావాలకూ ప్రాధాన్యం, 2) ఇతివృత్తం సామాన్యుల జీవితం, 3) వాస్తవికత.

వాస్తవికతకు ప్రాముఖ్యం రావటానికి కారణం కళలలో ఆదర్శవాదానికీ, భావవాదానికీ స్థానం లేకుండా పోవటమే. ఇతివృత్తం ప్రజాస్వామ్యస్వభావం కలదై వుండాలి. ఈ కళలకు పోషకులు కూడా ప్రజ బాహుళ్యం. కళలలో శిల్పప్రాధాన్యం తగ్గిపోతుంది. వెయ్యేళ్ళు నిలబడే జీవితసత్యాలకు కళలలో స్థానం వుండదు.

యంత్రయుగంలో కళలు కూడా పారిశ్రామికసంపదగా పరిణమిస్తాయి. ప్రపంచంలో ముగ్గురు మాత్రమే ఆస్వాదించగలిగి వెయ్యేళ్ళు మనగల గ్రంథం ఏదైనా యంత్రయుగంలో రచించబడితే దాని ప్రచారానికి అచ్చుయంత్రాలు, తపాలాశాఖ, రైళ్ళూ అనవసరం.

సహజంగా పాతసంస్కృతి ఒకంతట చావదు. యంత్రయుగంలో కూడా చిత్రకవిత్వమూ, బంధకవిత్వమూ, ఇనుప గుగ్గిళ్ళలాటి కవిత్వమూ, పిల్లి మొగ్గల కవిత్వమూ వుంటూనే వుంటాయి. కాని ఇవి యాంత్రికసృష్టి ద్వారా ఉత్పత్తి అయే కళలతో పోటీ చెయ్యలేకపోతాయి.

ఆధునిక (యంత్ర) యుగం తాలూకు మొదటిదశలో - అంటే వర్గసమాజంలో - కళలు ప్రజాతంత్ర స్వభావమూ, వ్యాపారసరుకుల స్వరూపమూ కలిగివుంటాయి. ప్రకటనల సహాయంతో చౌకగా, మంచిమంచి బొమ్మలతో అందంగా అచ్చయి లభించే పత్రికలూ, బ్రహ్మాండమైన సెట్టింగులూ, అందమైన ఆడామగా తారలూ, చక్కని ఫోటోగ్రఫీ, మంచి ఆర్కెస్ట్రాతో కూడిన పాటలూ గల

సినిమాలూ, ఊరికే వినిపించే రేడియో పాటలూ, నాటకాలూ ప్రజాబాహుళ్యం యొక్క కళాతృష్ణను సంతృప్తిపరుస్తాయి

అయితే కళ యొక్క ఈ స్వరూపం స్థిరమైనది కాదు ఎందుచేతనంటే ప్రజాతంత్రానికీ ధనికత్వానికీ ఎంతోకాలం పొత్తుకుదరదు యంత్ర పరిశ్రమలు తెచ్చిపెట్టే ఆర్థిక సాంఘిక సమస్యలు పెట్టుబడిదారుకీ, ప్రజాస్వామ్యానికీ కూడా విషమసమస్యలుగా పరిణమిస్తాయి. ఈ సమస్యలను పరిష్కరించటానికి ధనికవాదం సామ్రాజ్య విస్తరణకు వలస విధానాలు అవలంబించి, నియంతృత్వాలను ప్రోత్సహించీ, ప్రజోపద్రవకరమైన పాలకులకు కుమ్మక్కు యిచ్చీ, ప్రపంచాన్ని శాశ్వత యుద్ధ క్షేత్రంగా మార్చి అంతులేని చిక్కులు తెచ్చిపెట్టుతుంది.

అందుకే మేధావులందరూ వర్గరహిత సామాజిక వ్యవస్థదే భవిష్యత్తు అని గుర్తిస్తున్నారు ఈ సత్యాన్ని ప్రజలు గుర్తించకుండా వుండగలందులకు రాజకీయ రంగంలో వాళ్ళు కమ్యూనిస్టు బూచిని చూపి మభ్యపెట్టినట్టే కళారంగంలో కూడా భయపెట్టాలని చూస్తున్నారు.

వర్గరహిత యంత్రయుగపు కళలు ప్రజాతంత్ర స్వభావమూ, వర్గరహిత స్వరూపమూ కలిగి వుంటాయి అలాకాకుండా కళలు జీవితాన్ని ప్రతిబింబించలేవు.

కళలో వాస్తవికత అనేదాన్ని గురించి మనం తరచు వింటూవుంటాం. వర్గ సమాజాలు గల అమెరికా, ఇంగ్లాండు, ఫ్రాన్సు మొదలుగా గల దేశాలలో చాలాకాలంగా కళలు వాస్తవజీవితాన్ని ప్రతిబింబిస్తూనే వున్నాయి కాని అది వాస్తవికత కాదు.

దీనికి మనకు బాగా తెలిసిన ఉదాహరణ ఒకటి తీసుకుందాం. స్టేజిమీద ఏ పాత్ర అయినా నల్లరంగు పూసుకుని బొంగురు గొంతుతో మాట్లాడితే అది కోమటిపాత్ర అని మనం అనుకుంటాం , పిలక పెట్టుకుని విభూతిపెండలూ, పింజెకట్టూ ధరించి కనిపిస్తే బ్రాహ్మణపాత్ర అనుకుంటాం. కాని ఈ లక్షణాలు కోమటి, బ్రాహ్మణ కులాలకు సంబంధించిన చిహ్నాలే గాని సత్యాలు కావు. ఎర్రగా, అందంగా వుండి చక్కని గొంతుతో మాట్లాడే కోమటిలో ఈ సత్యం కనిపించదు

వర్గసమాజపు 'వాస్తవ' కళలనిండా జీవిత సత్యానికి బదులుగా యిటువంటి సంకేతాలు ప్రచారం కావటం మనం సినిమాలలో చాలాబాగా చూస్తున్నాం. మన సాహిత్యంలోనూ, సినిమాలలోనూ కూడా 'సామాన్య' పాత్రలను ప్రవేశపెట్టి వాటిని అసామాన్యంగా పోషించటం జరుగుతుంది. 'మాలపిల్ల' చిత్రంలో మాలపిల్ల అష్టపది విని తన్మయం కావటం చాలామందికి జ్ఞాపకం వుండవచ్చు. ఇటీవల వెలువడిన ఒక చిత్రంలో కథానాయిక చాకిరీ చేసి తమ్ముణ్ణి చదివించటమే గాక- పోస్టుమేష్టర్లు కూడా ఎంతో కష్టం మీద చేసే పని - (చేస్తుంది .) చిత్రం పొడుగునా సినిమాతార మేకప్‌లోనే వుంటుంది.

వ్యాపారకళలు వాస్తవికతను చిత్రించలేవు సరికదా విషంలాగా మారుస్తాయి అది వాటి స్వభావం. ధనికస్వామ్యానికీ ప్రజాస్వామ్యానికీ మధ్య కలగే ఘర్షణ మూలంగా ఏర్పడే సాంఘిక సమస్యలకు పరిష్కార మార్గం చూపేపని యంత్ర పరిశ్రమలు నడిపేవారిది కాదు ఆ మాట వారే ఒప్పుకుంటారు. దానిని బట్టే సాంఘిక పురోభివృద్ధికి అడ్డంగా వున్నది వారేనని కూడా స్పష్టమవుతుంది

ఈ కళలు ప్రజలను మభ్యపెడతాయి కితకితలు పెడతాయి, జోకొడతాయి, కాని జీవితసత్యాన్ని మాత్రం చెప్పవు ప్రపంచపు పెట్టుబడిదారీకి కాణాచి అయిన అమెరికాలో అణచివేయబడే కళలు ఏవో, వేటాడబడే కళాకారులు ఏ ఆశయాలు గలవారో కొంచెం జాగ్రత్తగా పరిశీలించినట్టయితే వర్గరహిత సమాజంలో కళలు ఏపాత్ర నిర్వహించేదీ మనకు స్పష్టమవుతుంది.

మనం ప్రస్తుతం అచ్చంగా యంత్రయుగపు వర్గసమాజంలో వున్నామని కూడా అనుకోవటం భ్రమ అవుతుంది మనదేశంలో రాతియుగపు జీవితం నుంచి పారిశ్రామిక నాగరికతను ఉన్నతంగా ప్రతిబింబించే జీవితం జీవించే వారి దాకా వున్నారు, చెట్లకింద జీవించేవారి లగాయతు గాలిమిద్దెలలో జీవించే వారిదాకా వున్నారు. ఎంతోమంది అక్షరాస్యులు సయితం మధ్యయుగపు నాగరికతాసంస్కృతుల ప్రభావం నుంచి యింకా బయటపడలేదు. రామాయణ మహాభారతాలను దాటి వారు రాలేరు. అవతలి చివర తోలుబొమ్మలనూ, జంగం కథలనూ దాటి ముందుకురాలేని వారున్నారు.

పైన చెప్పిన విషయాలన్నీ కేవలం శాస్త్రీయమైన దృష్టితో రాసినవి. శాస్త్రానికి ప్రబలశత్రువులైనవారు కూడా పండితులలో వున్నారు. రాతియుగం నుంచి మానవుడు రాకెట్‌యుగం దాకా రావటానికి అంగుళం అంగుళమూ శాస్త్రజ్ఞానమే తోడ్పడిన సంగతి కూడా వారికి తెలియదు.

జీవితంలో ఎంతసేపూ భౌతిక విలువలేనా. ఆధ్యాత్మిక విలువలూ, నైతిక విలువలూ లేవా అని కొందరు అడుగుతారు. ఉన్నాయి. అవి మనిషికి అత్యవసరం కూడాను! కాని అవ భౌతిక విలువలపైన ఆధారపడి వున్నాయి. యంత్రనాగరికత వచ్చేదాకా బానిసత్వం అవినీతి అని ఎవరూ గ్రహించలేదు. ఒక బానిసవ్యాపారి చాలామంది ఆడబానిసలను భార్యలుగా పెట్టుకుని వారికి పిల్లలను కని వారినందరినీ బానిసలుగా అమ్మి విశేషంగా ధనం ఆర్జించాడట! వాడికి ఆధ్యాత్మికవిలువలు లేవని ఈనాడు మనం అనుకోగలుగుతున్నామంటే మనం ఆనాటి భౌతికజీవితం నుంచి విముక్తిపొందాం గనకనే కదా!

ఈనాడు మన సంస్కృతికి అడ్డంగా వుండే ఎన్నో పనులను చట్టం నిషేధించితే తప్ప మనం మానడం లేదు!

నైతిక విలువలూ, ఆధ్యాత్మిక విలువలూ విని సంతోషించటానికే అయితే మనం భారతంతో తృప్తిచెందిపోవచ్చు బారతం గాని, రామాయణం గాని మన ఈనాటి జీవితాన్ని ప్రతిబింబించవు, ఈ జీవితంపై తమ ప్రభావాన్ని వదలలేదు గనకనే మనం ఈ కళాసమస్య గురించి శాస్త్రీయమైన అభిప్రాయాలు పెంపొందించుకోవలసిన అవసరం ఏర్పడుతున్నది అలాంటి అభిప్రాయాలు లేనట్టయితే మనం మన కళల భవిష్యత్తు గురించి ఏమీ తెలుసుకోలేము

కృష్ణాపత్రిక, *13-8-1960*

## 12. కళ - కళాకారుడు

మనం కళలను గురించి చర్చించినంతగా కూడా కళాకారులను గురించి చర్చించం ఇంటికప్పెక్కిన వాడు అందరికళ్ళల్లో పడ్డట్టే, అఘాయిత్యం చేసి గాని, అందరిదృష్టినీ ఆకట్టే కొత్తమార్గాలు తొక్కిగాని, శిష్యగణం చేత ప్రచారం చేయించుకునో, అధిక సంఖ్యాకుల విశ్వాసాలను గట్టిగా బలపరిచో, నిజంగ ప్రతిభ వుండో పైకి తోసుకు వచ్చిన కళాకారుణ్ని ఆరాధించటం తప్ప సంఘం కళను పట్టించుకున్నంతగా కళాకారుణ్ణి పట్టించుకోదు

కాని కళాకారుడు కలం కాదు, కుంచె కాదు, స్వరస్థానాలు కాదు - మనిషి, సంఘంతో నిర్దిష్టమైన సంబంధాలు కలిగి, ఒక నిర్దిష్ట ప్రయోజనాన్ని ఆశించి తన మేధస్సును ప్రయోగించి కళను సృష్టించే మనిషి ఈ పరిస్థితులలో కళాకారుడిని గురించీ, కళాసృష్టిని గురించీ యిటీవలనే చదివిన కొన్ని విషయాలు - సిద్ధాంతాలు - ఆశ్చర్యకరంగా వున్నాయి.

ఈ సిద్ధాంతం చూడండి కళాకారుడు కళాసృష్టి చేసేటప్పుడు మాత్రమే ఒక ప్రత్యేక వ్యక్తిగా వుంటాడు కళను అంచనా కట్టేటప్పుడు కళాకారుడి జీవితాన్ని పరిగణించ కూడదు కళలో వున్న గొప్పతనాన్ని మాత్రమే అంచనా వెయ్యాలి కళకు వేరే వ్యక్తిత్వం వుండాలి

ఈ ధోరణిని పనిపెట్టుకుని సమర్థించటానికి ప్రయత్నించినా నేను కొంతవరకే విజయం పొందగలుగుతాను ఆ పరిమితి సూచించి అటుతరువాత ఈ ధోరణి వల్ల కలిగే నష్టాలు పేర్కొంటాను

అమరావతి శిల్పాలు మొదలైన ప్రాచీన శిల్పాలు తయారుచేసిన వారెవరో మనకు తెలీదు అజంతా చిత్రాలను చూసి ఆనందించే వారంతా ఆ చిత్రకారుల జీవితాలెలాటివని అడిగి తెలుసుకోనవసరం లేదు అట్లాగే ప్రాచీనకవులూ, వారి చరిత్రలూ మరుగై

పోయినా వారి గ్రంథాలు నేటికి నిలిచివున్నాయి వాటిని మనం నిరాక్షేపణగా చదివి ఆనందిస్తున్నాం ఈ దృష్టితో చూస్తే కళాకారుడి జీవితానికీ, కళకూ ముడిపెట్టడంలో అర్థం లేదనిపిస్తుంది

అయితే ఈ దృక్పథాన్నే ప్రమాణంగా పెట్టుకుంటే ఏం జరుగుతుంది? ఒక సమాధిలాంటి స్థితిలోకి వెళ్ళి కళాకారుడు కళను సృష్టించి ప్రపంచం మీద వదులుతాడు అది అతడి జీవితాన్ని ఏ విధంగానూ ప్రతిబింబించదు – ప్రతిబింబించనవసరం లేదు ఆ కళాకారుడు లోభి అయి వుండి దాతృత్వాన్ని ఆకాశానికెత్తవచ్చు. దేశద్రోహి అయివుండి దేశాభిమానాన్ని ఉపదేశించవచ్చు స్త్రీలంపటుడై వుండి ఇంద్రియ నిగ్రహాన్ని ఘనంగా చిత్రించవచ్చు అతని కళ మనమైనది కావచ్చు, అతను నీచుడు కావచ్చు

కళాకారుడికి 'హక్కు' వుంటే కళాస్వాదకుడికి కూడా వుండితీరాలి అతను కూడా ఒక 'సమాధి' లోకి వెళ్ళి కళను ఆనందించి తిరిగి తన నిత్యజీవితంలో అడుగుపెడతాడు ఆ కళ యొక్క ప్రభావం వాడిపైన వుండనవసరమేముందీ? కళాకారుడికి, జీవితానికి విలక్షణంగా వున్నట్టే సాంఘిక జీవితానిక్కూడా విలక్షణంగా వుండి ఆరాధనీయం గావచ్చునన్నమాట! క్రియకు కళ నిష్ప్రయోజనం!

కళ నిష్ప్రయోజనమే అయితే దానియొక్క ఉచ్చనీచాలు నిర్ణయించటానికి ప్రమాణాలేమి వుంటాయి అన్న ప్రశ్న కలుగుతుంది దీనికి సరి అయిన సమాధానం లేదు.

కళ నిష్ప్రయోజనమని వాదించే వాళ్ళు కూడా దానికి కొన్ని మానసిక, ఆధ్యాత్మిక మహత్తులు అంటగడతారు గదా అది 'ప్రక్షాళనం' చేస్తుంది. 'పునీతం చేస్తుంది' అని చెబుతారు. కళకు యిదే ఆశయమనుకున్నప్పటికీ అది కళాకారుణ్ణి ప్రక్షాళన చేసి పునీతుణ్ణి చెయ్యకుండా ఆస్వాదించే వారిని మాత్రమే ఎందుకు ప్రక్షాళన చేసి పునీతుణ్ణి చేస్తుందన్న ప్రశ్న కలుగుతుంది ఈ ఊబిలో దిగబడేకంటే, కళకు జీవితంతో సంబంధం లేదనీ, అందులో ఉచ్చనీచాలు లేవనీ అనుకోవటమే తేలికైన పని కాని కళాకారుణ్ణని చెప్పుకునే వాడెవడూ ఈమాట అనే స్థితికి దిగజారడు

కళాకారుడి జీవితానికీ, కళకూ ముడిపెట్టరాదనుకోవటంలోనే అసలు పొరపాటున్నది ఈ రెంటికీ సంబంధం వుండటమే గాక చాలా సన్నిహిత సంబంధం వున్నది. కళాసృష్టికి ప్రేరణ యిచ్చేది జీవితం, కళాకారుడి జీవితానికి కూడా రూపం కల్పించేది అతని సాంఘికభావాలు. కళాకారుడు ఆత్మద్రోహం చేసుకోవటం సాధ్యం కాదని నేనను సంసారలంపటంలోనుంచి బయటపడటానికి అణుమాత్రమైనా ప్రయత్నం చెయ్యనివాడు అత్యుత్తమమైన వేదాంతాన్ని తన రచనల్లో ప్రవేశపెట్టవచ్చు. అంతకంటే కూడా రెట్టింపు 'లౌకికులు' భేషని మెచ్చుకోవచ్చు. కాని యిటువంటి కళాకారులూ, వాళ్ళ కళలూ ఒక్కనాటికీ ఉత్తమస్థాయినందుకోలేవు ఆ కళలలో వుండే 'వంచన' సమకాలికులు అర్థంచేసుకోకపోరు తరువాత వాళ్ళయినా కళలో కళాకారుడికి చిత్తశుద్ధి లోపించటం

కనిపెట్టకపోరు. కొద్దిమంది అమాయికులు 'ఉదాత్తం'గా గణించిన కళావస్తువులు కాలగర్భంలో లీనం కావటం జరిగింది చిత్తశుద్ధితో సృష్టించిన కళలు జీవించే వున్నాయి.

కళలంటే అభిమానం గలవారు కళాకారుడి ఆత్మవంచనకు, పరవంచనకు అవకాశం కల్పించే సిద్ధాంతాలను చేయరాదు. పోతనగారి భాగవతం ఈనాటి జీవితానికి ప్రమాణగ్రంథం కాకపోవచ్చు. కాని పోతన చిత్తశుద్ధి భాగవతం నిండా కనిపిస్తుంది. త్యాగరాజ భక్తి గురించీ, నన్నయభట్టు, తిక్కన సోమయాజుల సంఘశ్రేయోభిలాషా. అజంతా చిత్రకారుల మతాభిమానమూ శంకించటానికి ఎవరికీ హక్కుండదు. వ్యాపారకళలు సృష్టించేవారి మాట చెప్పలేం గాని వీరేశలింగం గారూ, అప్పారావు గారూ తమ రచనలను తమ జీవితాలనుంచి వేరుచేయటాన్ని గురించి ఏమనుకుంటారో మనం ఊహించవచ్చు. మన ఎదుట చలంగారు తమ రచనలను చిత్తశుద్ధితో రాయలేదని ఆయన ప్రబలశత్రువులు కూడా ఏనాడూ శంకించలేదు.

అందరు కళాకారులూ ఉద్యమాల్లో పాల్గొంటారని నా తాత్పర్యం కాదు. అట్లా ఉద్యమాలతో నడిచేవారు కేవలం ప్రచారభూయిష్టమైన కళలను సృష్టించేవారు. అటువంటి ప్రచారానికి పూనుకోనివారు కూడా తాము తీసుకునే సాంఘిక సమస్యలను గురించి తమకు గల విశ్వాసాలను స్పష్టంచేయకుండా వుండటం సాధ్యంకాదు. గురజాడవారి రచనల్లో ప్రచారం కనపడదు. కాని సాంఘిక సమస్యల పట్ల ఆయన విశ్వాసాలు స్పష్టంగా మనకు తెలుస్తాయి.

టెక్నిక్‌ను ఆరాధించే వాళ్ళు కళారాధకులమనుకొని ఎటువంటి సిద్ధాంతాలైనా చేయవచ్చు. కాని, నిజమైన కళారాధకులు కలాకారుడి జీవితానికీ, అతని కళకూ అత్యంత సన్నిహితమైన సంబంధం వుండి తీరుతుందని గ్రహించటం మంచిది.

విశాలాంధ్ర, 3-9-1961

## 13. చిత్రజగత్తు

మిగతా అన్ని కళలకన్నా ఒకటి రెండుయుగాలు వెనకబడి వున్నది చిత్రలేఖనం. ఇందుకు కారణం బహుశా ఈ కళయొక్క తత్వంలో కొంత వుండవచ్చు. న్యాయత: యిది సంగీతంలాగే క్రమబద్ధంగా నేర్చుకోవలసిన కళ. సాహిత్యం రాసేవాళ్ళు ఆ కళను ఎప్పుడు నేర్చుకున్నదీ, ఎవరిదగ్గర నేర్చుకున్నదీ అజవుండదు. చిత్రలేఖనం అటువంటిది కాదు.

కళను అభ్యసించటమంటే శిల్పాన్ని సానబట్టటమే. అందుచేత మన చిత్రకారులు కొన్నిఏళ్ళపాటు శిల్పాన్ని సానబట్టి, శిల్పం వేళ్ళకూ, కుంచెలకూ

అంటుకు పోయి ప్రపంచం లోకి వచ్చి 'విరహం', 'అభిసారిక, 'మాతృహృదయం', 'రాధిక', 'నవనీతచోరుడు', 'మునిమాపు' మొదలైన గొప్పచిత్రాలు తయారుచేసి, వాటిని ఆకాశానికెత్తే వాళ్ళే గాని తమను భుజాలకెత్తుకునేవాళ్ళు లేక, 'ఇంత కష్టపడి సాధించిన ఈ కళ ఎవరికీ అక్కర్లేదా?' అని దిగులు పడతారు

కనీసం యిటువంటి అనుభవం చాలామంది కళాకారులకు జరిగింది. కొందరు ధైర్యంగా తమ కళకు బలికావటానికి సిద్ధపడ్డారు మరికొందరు ఇతర బతుకు తెరువులు చూసుకున్నారు చాలామంది కళను ఉన్నతశిఖరాల మీదినుంచి వాసయోగ్యమైన చోట్లకు దింపారు.

వ్యక్తిగతమైన సమస్య తీసుకుందాం – చిత్రకారుడైనవాడు ఎట్లా బతకాలి? ఎటువంటి బొమ్మలు వేస్తే తనకు అనిర్వచనీయానందం కలుగుతుందో, ఎలాటి చిత్రాలలో తనలోని ఉత్తమ కళాశక్తిలోకానికి వ్యక్తమవుతుందో అలాటి బొమ్మలు చిత్రించుతూ, వాటిని ఎవరన్నా కొంటే ఆ డబ్బుతో సంసారం ఈడ్చాలి లేదా తనకు చాతనయినవిధంగా యితరులు డబ్బిచ్చి కొనుక్కోదగిన బొమ్మలు రాసి, తన వ్యక్తిత్వమూ, స్వయిచ్ఛా చంపుకుని బతకాలి అదీకాకపోతే కొంత ఆర్భాటం చేసి, మీటింగులు పెట్టి, ఉపన్యాసాలిచ్చి, పత్రికల్లో వ్యాసాలు రాసి, నలుగురు గొప్పవాళ్ళను పట్టుకుని, చిత్రకళ మీద అందరికీ తెలిసిన 'అథారిటీ'గా తయారై మంత్రులను, వాళ్ళను ఆశ్రయించి, ప్రాపకం సంపాదించుకుని, ప్రభుత్వం యిచ్చే కమిషనులూ అవీ సంపాదించి పైకిరావాలి. ఏదీ లేకపోతే డ్రాయింగు మేష్టరై తనలాటి వారిని మరి కొందరిని తయారుచేసే ప్రాపకం వుండనే వున్నది.

పైన చెప్పిన పద్ధతుల్లో 'నా ఆనందం కోసమే నేను బొమ్మలు వేస్తాను' అనే ధోరణిలో ఒక విధమైన స్వార్థం వుండటమేగాక సంఘచింత లోపించటం కూడా వున్నది. కళను పోషించవలసిన వాళ్ళుకూడా అలాంటి స్వార్థచింతనలోనే పడితే కళకు సాంఘిక పురోభివృద్ధి వుండదన్నమాటే. 'నా చిత్రాలు అంతసులువుగా అందరికీ అర్థంకావు లెండి' అన్న నిక్కు కూడా ఈ తరగతికి చెందినదే. కాని మొదటి ధోరణికంటే కాస్త మెరుగు. ఈ'హైబ్రో' సంఘంలో కనీసం కొందరి అభిరుచులనైనా ఖాతరుచేస్తాడు. వాళ్ళు మెచ్చుకుంటే చాలు తన కృషి ఫలించినట్టు భావిస్తాడు.

ఎక్కువమంది చిత్రకారులు తమ 'కళాశ్రమ'ను బజారులో అమ్మి బతకటానికి సిద్ధంగా వున్నారు. ఈ 'బజారు' పరిస్థితి చూద్దాం. చిత్రకళకు 'పెద్దబజారు' సినిమా రంగం. ఆర్టుడైరెక్టర్లుగా సినిమాలలో పనిచేస్తూ, నెలకు నాలుగైదువందలు మొదలుకొని వెయ్యీ, రెండువేలూ కూడా సంపాదించుకుంటున్న చిత్రకారులున్నారు. కాని వీరిసంఖ్య చాలాకొద్ది. ఆర్టు డైరెక్టర్లకు కూడా కొంతలో కొంత స్టార్‌వాల్యూ వున్నది

పబ్లిసిటీ సంస్థలలో కూడా ఆర్టిస్టులకు మంచి జీతాలు యిస్తారు అయితే ఆ కంపెనీలలో సంప్రదాయ చిత్రకళకు ఆదరం తక్కువ వారికి కావలసింది 'కమర్షియల్ ఆర్ట్' - వ్యాపార చిత్రకళ ఈ కళను నేర్పే సంస్థలు వేరే వున్నాయి నిజానికి స్వయంకృషి చేత వ్యాపారచిత్రకళను సాధించిన వారుకూడా వున్నారు

పత్రికలలో కథలకు బొమ్మలు వేయటానికీ, అట్టలమీద బొమ్మలు తయారుచేయటానికీ, పుస్తకాల అట్టలమీద బొమ్మలు వేయటానికీ కూడా చిత్రకారులు కావాలి ఈ చిత్రకారులు కూడా వ్యాపారకళ తెలిసిన వారై వుంటే మంచిది కార్టూను వెయ్యటం కూడా ఒక వ్యాపారకళే.

ఈ పరిస్థితులలో ఆర్టుస్టూడెంటు కాదలచినవాడు తన భవిష్యత్తు గురించి జాగ్రత్తగా ఆలోచించవలసి వుంటుంది బొమ్మకు డబ్బు విలువ నమ్మకంగా వుండాలి రెండువేల రూపాయలు ఖరీదుగల బొమ్మలను ఏళ్ళ తరబడి దగ్గర దాచుకునేకన్నా ఇరవై రూపాయలకు నమ్మకంగా అమ్ముకోగలిగిన బొమ్మలను వేసేవాడికి బతుకుతెరువున్నది

ఇటువంటి బొమ్మలు మామూలు ప్రజలకు సన్నిహితంగా వుండాలి - కళాకారుడు సామాన్యప్రజలతో సన్నిహితసంబంధాలు పెట్టుకున్నవాడు అటువంటి బొమ్మలు వేస్తాడు వాటికి గిరాకీ వస్తుంది

నిన్న మొన్నటిదాకా పత్రికలు తమకు బొమ్మలతో నిమిత్తమే లేనట్టు ఏదో కళను ఉద్ధరించడానికి గాను, మాసానికొక త్రివర్ణచిత్రం వేసేటట్టు నటించాయి కనీసం 'బాపు' వచ్చినప్పటినుంచీ పత్రికల్లో బొమ్మకు స్థానం వచ్చింది పాఠకులు బొమ్మలరుచిమరిగారు. కళ్ళు మూసుకుని కళాదేవిని ఆరాధించేవారు శక్తి వుంటే యితర రకాల బొమ్మలకు కూడా గిరాకీ తెప్పించుకోవచ్చు. అది వారి వారి సాంఘికభావాలపైనా, ఉపజ్ఞ పైనా ఆధారపడి వుంటుంది.

*విశాలాంధ్ర*, 30-7-1961

## 14. కళాకారుని పరిణతి

ప్రతిమనిషీ ఏదో ఒక కళలో ప్రతిభావంతుడు కావటం సాధ్యమా అన్న ప్రశ్నకు శాస్త్రీయమైన సమాధానమేమిటో నాకు తెలీదు నిత్యజీవితంలో మనం కళలను సృష్టించలేని వారినే గాక కళలను ఆనందించలేని వారిని కూడా చూస్తున్నాం. కొందరికి పుస్తకం పట్టుకుంటే నిద్ర ముంచుకొస్తుంది కొందరికి అన్ని పాటలూ ఒకటిగానే వుంటాయి. కొందరికి బొమ్మల్లో ఏమీ కనపడదు.

పసితనం నుంచీ ఆసక్తి కలగిస్తే ఎవరికైనా సంగీతంలోనూ, చిత్రలేఖనం - యితర కళలలోనూ ఆనందం తెలిసే అవకాశం వుంటుందట ఈ ఆసక్తి వారిని గాయకులు గానూ, చిత్రకారులుగానూ చేస్తుందో లేదో తెలియదు పుట్టుకలోనే కళాకారుడయ్యే లక్షణాలు ఏర్పడతాయనేది నిజమైతే ఒకమనిషి కళాకారుడవుతాడా కాడా అన్నది కేవలం దైవికమన్నమాట కాని యిది నేను నమ్మలేను జ్ఞానేంద్రియాలలో ఏదో లోపం లేనివారందరూ కళలు అభ్యసించవచ్చునని నా నమ్మకం

ఒక్కటిమాత్రం చెప్పవచ్చు - ఒకవేళ జన్మత కళాకారుడు అయేదీ కానిదీ ముందే నిర్ధారణ అవుతుందనే అనుకున్నప్పటికీ, కళాకారులు కావలసిన వారందరూ కళలు సృష్టించడంలేదు ఈ విషయం అందరూ ఆమోదించవచ్చు

దీనికి కారణమేమిటి? పూర్వదశలో కళాకారుడు తాను సృష్టించబోయే కళ యందు అధికమైన ఆసక్తి పెంపొందించుకుంటాడు అది అతన్ని బలంగా ఆకర్షించి, అతని మేధస్సును మధిస్తుంది మెదడు పొరలలోకి యింకుతుంది. రచయిత కాబోయేవాడైతే మాటలలో శక్తిని గ్రహిస్తాడు గాయకుడు కాబోయేవాడు స్వరాలమధ్య వుండేసామరస్యం గ్రహిస్తాడు చిత్రకారుడైతే రంగులవెంట వుండే భావాలను గ్రహిస్తాడు నటుడు కాబోయేవాడు ప్రతిచిన్న విన్యాసంలోనూ వుండే భావస్ఫురణను గ్రహిస్తాడు

పైన చెప్పినదంతా కళాకారుడికి పునాదిలాంటిది ఈ పునాదిపైన అతడు కళను అభ్యసించనారంభిస్తాడు తొలిదశలో ఈ అభ్యాసం అనుకరణరూపంలో వుంటుంది. విద్యార్థిగురువును అనుకరిస్తాడు ఈదశలో కళాభ్యాసికి విశ్వాసం (నమ్మకం) అత్యవసరం. గురువు బోధించే కళాసూత్రాలపట్ల విద్యార్థికి అచంచలమైన విశ్వాసం వుండాలి.

ఈవిధంగా విద్యార్థి తాను సృష్టించబోయే కళయొక్క శిల్పాన్ని అలవరుచుకుంటాడు శిల్పానికి గల ప్రాముఖ్యతను ఏమాత్రమూ తగ్గించటానికి వీలులేదు మాటలమీదా, భాష మీదా, భావప్రకటన మీదా అధికారం సంపాదించమని గోర్కీ యువరచయితలను హెచ్చరిస్తూ వుండేవాడు

సైకిలు తొక్కేవాడు బాలెన్స్ అలవరుచుకొనటానికి తొలిదశలో తన సర్వశక్తులనూ వినియోగిస్తాడు. ఆ తరువాత అతనికి బాలెన్స్ అప్రయత్నంగానే లభిస్తుంది కళలు శిల్పం కూడా అంతే - కళాసృష్టికి ఉపక్రమించే సమయానికి కళాకారుడికి శిల్పం అప్రయత్నంగా రావాలి, దాన్ని గురించి తడువుకునేవాడు యింకా కళాసృష్టికి అర్హుడు కాడన్నమాట.

ఏ కళలోనైనా శిల్పం నిర్దుష్టంగా వుండాలి ఈవిషయంలో ఎటువంటి అపోహకూ తావులేదు. అయితే కళాప్రదర్శనమంటే శిల్పప్రదర్శనం మటుకు కాదు శిల్పంతో గారడీలు చెయ్యటం అసలేకాదు క్షీణదశలోకి వచ్చిన కళలు శిల్పపుగారడీల కింద దిగజారిపోవటం జరుగుతుంది ఆ విషయం హెచ్చరించటానికి

అభ్యుదయంవచ్చుతలం శిల్పంకన్న ప్రయోజనం ముఖ్యమని యువకులను హెచ్చరించాం కళలకు శిల్పం అవసరంలేదనే భావం కొందరియువకులలో నాటుకుపోవడం జరిగింది జనానికి కళాకారుడి శిల్పచాతుర్యం ప్రధానం కాదు, విమర్శకుడైనవాడు కళాకారుడి శిల్పాన్ని కూడా గణనలోకి తీసుకుంటాడు, కళాకారుడు శిల్పాన్ని ఏమాత్రమూ ఏమారటానికి వీల్లేదు అమలులో వున్న శిల్పనియమాలను తోసిరాజనదలచినవాడు కూడా ఆ నియమాలను ఎరిగివుండటం అవసరం కొత్తశిల్పాన్ని సృష్టించగలవాడు శిల్పంలో ఒకమెట్టు పైకెక్కినట్టు లెక్క - శిల్పాన్ని తృణీకరించినవాడి కింద లెక్కకాదు. వ్యాకరణపు సంకెళ్ళను బద్దలుకొడతామనే వాళ్ళు కూడా 'ఆమె వున్నాడు' అని రాయరు

ఈ దశలన్నీ గడిచి మనిషి కళాకారుడవుతాడు. ఏయేదశలో ఏయేరకాల అడ్డంకులు ఎదురవుతాయో మనం సులువుగా ఊహించవచ్చు. కళాకారులు కాదగిన వారిలో చాలామంది కళలకు ఎందుకు దూరంగా వుండిపోతున్నారో తెలుసుకోవచ్చు మనదేశంలో పెద్దవాళ్ళకే కళాదృష్టి అనేది తక్కువ. 'అదేం పుణ్యమా, పురుషార్థమా?' అని ప్రశ్నించే మనస్తత్వం మనవాళ్ళకు హెచ్చు ఈ పరిస్థితిలో చిన్నపిల్లలు ఏ కళలో ఆసక్తిగాని, తన్మయత్వంగాని కనబరిచినా తిట్లూ తన్నులూ తినటం జరిగే అవకాశం వుంది. అందుచేత వారికి చిన్నతనంలో ఏర్పడ దగిన పునాది కాస్తా లేకుండా పోతుంది. కొందరైనా కళాకారులు వస్తున్నారంటే వారు కాస్త సంస్కారం గల కుటుంబాల నుంచీ, కళలు వృత్తిగా గల కుటుంబాల నుంచీ వస్తున్నారు. పరిస్థితులకుట్ర వల్ల- మరేదీ దారిలేక - కళలకు సంబంధించిన విద్యలు అభ్యసించేవారు కొందరుంటే వారు ఉత్తమశ్రేణి కళాకారులయే అవకాశాలు చాలా తక్కువగానే వుంటాయి.

పెరిగిన పిల్లలను కూడా 'ఆ కూనిరాగాలు తీయకపోతే చదువుకోరాదా?' అనీ, 'ఎప్పుడు చూసినా ఏవో పిచ్చిగీతలు గీస్తావు, పరీక్షలో సున్నాలు తెచ్చుకుంటావా ఏమిటి?' అనీ పెద్దవాళ్ళు మందలించటం మనం వింటాం. ఇటువంటివారిలో నుంచే గొప్పగాయకులూ. చిత్రకారులూ వస్తారని మనకు సాధారణంగా తట్టదు.

ఒకవేళ తట్టినా మనలో చాలామందిమి మన పిల్లలలో కళాశక్తిని ప్రోత్సహించ టానికి భయపడతాం మగపిల్లలైతే ఏ టైపిస్టుగానో, గుమాస్తాగానో, బడిపంతులుగానో, డాక్టరుగానో, ప్లీడరుగానో తమ పొట్ట తాము పోసుకోగలరని మనకు ధైర్యం వుంటుంది గాని ఏ గాయకుడో, చిత్రకారుడో, కవో, కథకుడో, నటుడో అయితే అడుక్కు తింటాడని మనలో చాలామందిమి భయపడతాం. భయపడ వలసిందే కూడానూ.

సినిమాలూ, పత్రికలూ వచ్చి కొందరు కళాకారులకు మంచి సంపాదనా, హోదా, ఖ్యాతీ కలిగిస్తున్నప్పటికీ అటువంటి సదవకాశం నూరుమందిలో ఒకడికి కూడా లభించటం లేదు ఒక ఆర్టు డైరెక్టరు వేలకు వేలు సంపాదిస్తుంటే అనేకవందలమంది చిత్రకారులు తిండికి మాడుతున్నారు.

కళ యొక్క ఆశయం సాంఘికప్రయోజనమా? ఉదరపోషణా? అన్న ప్రశ్నే అడిగేటందుకు కూడా అవకాశం లేకుండా పోతున్నది ఎందుకంటే సాంఘిక ప్రయోజనాలనూ, ఉదరపోషణనూ సమన్వయించే సాంఘిక పరిస్థితులు లేవు.

ఇటువంటి స్థితిలో కూడా మనలో కళాకారులు వస్తున్నారు ఒక్కొక్కరూ ఎంత నిరుత్సాహానికి గురి అయి, ఎటువంటి సంఘర్షణలను ఎదుర్కొంటున్నారో వారికే తెలియాలి ముఖ్యంగా కళాకారుడి ఆశయం ఎంత ఉదాత్తమైనదైతే అతనికి కలిగే నిరాశ అంత హెచ్చుగా వుంటుంది బొత్తిగా నిరుపయోగమైన కళలు సృష్టించేవారికి, ప్రగతిశత్రువులకూ, శిల్పంలో గారడీ చేసే వారికీ సంఘంలో లభించే ఆదరణ చూస్తున్న కొద్దీ నిస్పృహ ముంచుకురావటం సహజం

కాని అటువంటి కళాకారులు ఒకటి జ్ఞాపకం పెట్టుకుని నైరాశ్యం నుంచి బైటపడాలి. సంఘమూ, సంస్కృతీ అరాజకస్థితినుండి బయటపడటానికి ఎన్నో జీవితరంగాలలో అవిరామకృషి జరగాలి. కొంతకాలం అల్పసంఖ్యాకుల వెంటనే వుంటాడు అతని కళయొక్క ప్రభావం కాలంగడిచినకొద్దీ అధికసంఖ్యాకుల పై తన ప్రభావాన్ని ప్రసరిస్తుంది

కళలకు వ్యాపారధర్మం సోకినప్పుడు శిల్పంలో సత్వరాభివృద్ధి కనిపిస్తుంది నిన్నటి సాహితీపరులకన్న రేపటి జర్నలిస్టులు శక్తివంతమైన భాష రాయవచ్చు. నిన్నటి చిత్రకళలో లేని సౌందర్యం రేపటి వ్యాపారచిత్రాలలో కనిపించవచ్చు సినిమాలు వచ్చినాక కొన్నికళల తాలూకు శిల్పాలు పదునెక్కిన మాట నిజం. కాని అంతకంటె ముందుకు పోయి ప్రజల మనసులలో వాంఛనీయమైన చైతన్యం కలిగించినప్పుడే కళలు సార్థకమవుతాయి. అందుకుగాను ఏ కొద్దిమంది ఎంతకొద్ది కృషిచేసినా అది వృథాపోదు.

విశాలాంధ్ర, 5 – 3 – 62

## 15. 'బాపు' చిత్రకళ

ప్రపంచంలో ప్రతిఒక్కడికీ పనిచేసుకునే హక్కు, తిండి తినే హక్కు తనను పరిపాలించేవాడికి ఓటువేసే హక్కూ వగైరాలుండడం ఎంత అవసరమో, తమకానందం చేకూర్చే సాహిత్యాన్ని, సంగీతాన్ని, చిత్రలేఖనాన్ని, నాట్యకళనూ అనుభవించే హక్కు కూడా అవసరమే అయితే చాలాకాలం పాటు అనేక కళలవాళ్ళు కొమ్మెక్కి కూచుని జనసామాన్యం పట్ల లక్ష్యం వుంచారు కాదు. నాకు బుద్ధితెలిసినాక కూడా కళలు కొద్దిడజన్లమంది కాణాచిగా వుంటూవచ్చాయి

ఈ పరిస్థితి నుంచి పురోగమనం సాధ్యమవడానికి రెండే మార్గాలు కళలు ప్రభుత్వపరం కావటమో, వ్యాపారధర్మాన్ని అవలంబించటమో, మొదటిదానికి అవకాశం లేదు గనక రెండోది అసలుకి వచ్చింది కళావ్యాపారం పేకపెక మాజిక్‌లాటిది ఇందులో 'ఫోర్సింగ్ ది కార్డ్' ట్రిక్కులాంటిది వుంటుంది సాదా సరుక్కు గిల్టు పామి మేలుజాతి సరుకుకింద ప్రచారపు ఒత్తిడితో విక్రయించవచ్చు అయినా మన వ్యాపారస్తులకి హస్తలాఘవం అంతగా లేని కారణం చేత కొందరు 'జెమ్స్' లాటివాళ్ళు ముందుకొచ్చి ప్రజాభిమానాన్ని చూరగొన్నారు. చిత్రకళారంగంలో బాపు స్వయంప్రకాశంతో ముందుకొచ్చిన 'వజ్రపుతునక'

బాపు బొమ్మలతో పత్రికాచిత్రలేఖనంలో ఒక కొత్త యుగం ఆరంభమయింది అతనిది స్వతంత్రబాణీ అనేకమంది పాశ్చాత్య చిత్రకారులనుంచి అతను 'గీత' ల్లో వుండే మహిమ గ్రహించాడు అందుచేతనే బాపు బొమ్మల్లో నిర్జీవమైన గీత అంటూ వుండదు కాని అతని బొమ్మల్లో 'మినిమమ్' గీతలుంటాయి

బాపు అందమైన మనుషులనే - ముఖ్యంగా స్త్రీలను - వేస్తాడేమో అనుకొని కొన్నాళ్ళు నేనుకూడా అపోహపడ్డాను కాని బాపు సృష్టించే అందం అతని బొమ్మల్లో వుంది - మనుషులలో కాదు. ఇంకొక విశేషమేమంటే బాపు బొమ్మలు కథకుడు చెప్పని ఎన్నో విషయాలను చెబుతాయి అది సృజనాత్మకమైన కళ

బాపు వేసే బొమ్మల్లోను మనుషులు వాస్తవవ్యక్తులే అయివుంటే వారు అసమానమైన నటులనుకోవలసిందే ఆయా పాత్రల మనస్థితీ, స్వభావమూ బొమ్మలో రూపుకట్టినట్టు కనిపిస్తుంది ఈ శక్తి నేను ఏ యితర తెలుగు కళాకారుడిలోనూ చూడలేదు

బాపు ప్రతిభ సర్వతోముఖమైనదని వేరే చెప్పనవసరం లేదు. పురాణకథలకూ, చారిత్రక కథలకూ, ఆధునిక సాంఘిక కథలకూ కూడా అతను చిత్రాలు చిత్రించాడు ఏరకం చిత్రరచనలోనూ [illegible] ందుకోగలవాణ్ణి చూచినట్టు నాకు జ్ఞాపకంలేదు బాపు చిత్రకళాప్రదర్శనం చూసినవా[illegible]ఎవరూ నాతో ఏకీభవిస్తారనుకుంటాను

బాపు చిత్రకళాప్రదర్శనం ప్రత్యేక సంచిక, విజయవాడ, *26 జనవరి 1963*
పునర్ముద్రణ విశాలాంధ్ర, *27-1-1963*, ఆంధ్రజ్యోతి వారపత్రిక, *3-12-1982*

# 16. కళలతో పేచీలు

ఇటీవల రష్యాలో మాస్కో చిత్రకళాప్రదర్శనం జరిగింది దానికి క్రుశ్చేవ్ మొదలుగల ప్రభుత్వ నాయకులూ, పార్టీ నాయకులూ వెళ్ళి, కళాప్రదర్శనంలోని చిత్తరువులు, శిల్పాలూ మొదలైన వాటిలో గల 'క్షీణ బూర్జువా సంస్కృతి' యొక్క ఛాయలను గుర్తించి, వాటిని నిశితంగా విమర్శించారు

తదనంతరం 1962 డిసెంబరు 17న ఆ నాయకులే సోవియట్ రచయితలనూ, కళాకారులనూ కలుసుకొని సమావేశం జరిపారు ఆ సమావేశంలో సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్రసంఘ కార్యదర్శి ఈల్యిచవ్ ఒక ప్రసంగం చేసాడు ఈ ప్రసంగం ప్రచురితమయింది

సోవియట్ రష్యాలో కళాధోరణిలో ఏర్పడిన అనేక హీనలక్షణాలు ఈ ప్రసంగంలో వివరించబడ్డాయి చిత్రలేఖనంలో 'ఫార్మలిజం', 'అబ్‌స్ట్రాక్షనిజం', సంగీతంలో 'కాకిగోల' ధోరణీ, సినిమా చిత్రాలలో భావపుష్టి లోపించటమూ, లేనిపోని 'సొగసులూ', క్లిష్ట శిల్పసాంప్రదాయమూ, కథారచనలోనూ, కవిత్వంలోనూ కొత్తదనం కోసం పాకులాటా, భాషను ఖూనీచేయుటమూ - అన్ని కళలలోనూ ఏదో ఒక విధమైన అసంతృప్తిని వ్యక్తం చేస్తూ, జీవితాన్ని దుయ్యబట్టే మనస్తత్వం

ఈ అవాంఛనీయమైన ధోరణులు విస్తృతంగా కానప్పటికీ విజృంభణస్థితిలో వున్నట్టు పై ప్రసంగం స్పష్టం చేస్తున్నది వీటిని గురించి కళాభిమానులు ఆందోళన పడటానికి అనేక కారణాలుంటాయి ఇవి సోవియట్ జీవితాన్ని ప్రతిబింబించవు, ఇతర దేశాలవారు సోవియట్ జీవితం గురించి దుష్ప్రచారాలు సాగించటానికి ఈ కళలను ఉపయోగించుకుంటారు ఉపయోగించుకుంటూనే వున్నారు వీటిద్వారా క్షుద్రమైన ఆదర్శాలూ, అభిరుచులూ జనంలో ప్రచారమవుతాయి

ఈ ధోరణులు ఎందుకు ఏర్పడుతున్నాయి? ఈ ప్రశ్నకు ఈల్యిచవ్ చెప్పిన సమాధానం స్వయంగా నాకు అంత తృప్తి కలిగించలేదని చెప్పాలి ఇవి యాదృచ్ఛికంగా ఏర్పడిన ధోరణులు కావనీ, కొందరు కామ్రేడ్‌లు బూర్జువా ఆదర్శాలకు విరుద్ధంగా సాగే పోరాటాన్ని తప్పుగా అవగాహన చేసుకుని, కమ్యూనిస్టు ఆదర్శాలకూ, వాటికీ సామరస్యం సాధ్యమని అపోహ పడుతున్నారనీ ఆయన అంటాడు (ఈ అపోహపడేది విమర్శకులు, కళలలో అన్ని ధోరణులనూ సహనంతో చూడాలనేవారు)

కళలలో విచ్ఛిన్నకర ధోరణులు ప్రమాదవశాన జరగకపోతే ఎవరైనా పని పెట్టుకుని తెచ్చిపెట్టాలి అప్పుడది కళలపట్ల అత్యాచారమూ, రాజకీయంగా ద్రోహమూ అవుతుంది కాని కళాకారుడు ఎట్టి దురుద్దేశం లేకుండానే, సదుద్దేశంతోనే తప్పుడు

ధోరణిలో వుండవచ్చుననీ, కిందటి యుద్ధంలో తన రక్తాన్ని ధారపోసినవాడై వుండవచ్చుననీ ఈల్యిచెవ్ అంటున్నాడు

అలా ఒప్పుతోప్పట్టేసి కళాకారులను ఎవరో ఒకరు నిగ్రహించాలి ఆ నిగ్రహించేది ఎవరు? అది కమ్యూనిస్టు పార్టీ వల్లనే కావాలని ఈల్యిచవ్ ఉద్దేశంగా కనబడుతుంది

నలభై అయిదేళ్ళ నుంచీ 'దోపిడీ' విధానాన్ని ఎరగకుండా జీవించే సోవియుట్ ప్రజలు తమ కళలలో విచ్ఛిన్నకర ధోరణులను ఎందుకు అరికట్టలేరు? ఈ కళలు ప్రజలను ఆకర్షించటం లేదనీ, ప్రజలకు పనికిరాని కళలవల్ల ప్రయోజనం ఏమిటనీ, ప్రజాసామాన్యం యొక్క నిశ్చితాభిప్రాయంకన్న కొద్దిమంది 'విమర్శకుల' అభిప్రాయం ఘనమని ఎలా అనుకోవటమనీ అయన అడుగుతున్నాడు నాకు కలిగే సందేహమేమిటంటే, కొద్దిమంది కళాభిమానులు, విమర్శకులు ఊతం యిచ్చి, ప్రజలకు పనికిరాని కళారీతులు 'విజృంభణ' పొందేలాగు ఎట్లా చెయ్యగలుగు తున్నారని! వారు అలా చెయ్యగలగటం చేతనే పార్టీ వచ్చి జోక్యం కలిగించుకోవలసి వస్తున్నది.

కళలలో విచ్ఛిన్నకరధోరణులూ, పిదపలక్షణాలూ ఏర్పడినప్పుడు వాటిని ఎవ్వరైనా తీవ్రంగా విమర్శించవలసిందే. అధికసంఖ్యాకులు మెచ్చుకున్నవాటినైనా సవ్యంగా విమర్శించినవాడు ఒంటరిగాడే అయినా విమర్శకుడే రైటు 'సోవియట్ సమాజంలో ప్రజాస్వామ్యం అభివృద్ధి అయే విధానాన్ని పార్టీ అనుసరిస్తున్నది'' అని ఈల్యిచవ్ అంటున్నాడు. కళల విషయంలో ప్రజాతంత్రం ఎలా వుండాలి? కళాకారులు కళలు సృష్టిస్తారు. విమర్శకులు వారిని విమర్శిస్తారు. ప్రజలు యిద్దరి మధ్యా ఒక నిర్ణయం చేస్తారు ప్రజలే విమర్శకులై తమంతట తామే విచ్ఛిన్నకర ధోరణులను విసర్జించగలిగితే అది సర్వోత్తమం. కాని అంత ఆదర్శవంతమైన పరిస్థితి సోవియట్‌రష్యాలో కూడా వుండకపోవచ్చు సరిఅయిన విమర్శ ఏదో తెలుసుకుని దాని సహాయంతో కళలను బేరీజుకట్టటం సాధ్యమైన మార్గం విమర్శ కమ్యూనిస్టుపార్టీ సభ్యులనుంచీ, పార్టీ ప్రతినిధులనుంచి రారాదని ఎవరూ అనరు. కాని ప్రజలను తుచ్ఛమైన కళలనుంచి కాపాడే భారం పార్టీ తనపైనే వేసుకున్న పక్షంలో అందువల్ల చాలానష్టాలున్నాయి. ఏకారణం చేతనైనా పార్టీ యొక్క ఆమోదముద్ర పడిన కళాఖండాన్ని మరెవరూ విమర్శించరు- విమర్శించవలసిన అగత్యం వున్నప్పటికీ ప్రజలు పార్టీ కలిపిపెట్టే కళాముద్దలు కళ్ళుమూసుకుని మింగటానికి అలవాటు పడతారు. ఇది సోవియట్ కళల పురోభివృద్ధికి అంత మంచిదికాదని నా దృఢనమ్మకం.

మనదేశంలో మనం అనేకరకాల కళలు పుట్టటం చూస్తున్నాం. ఏది మంచికళో, ఏది కాదో తెలుసుకునే శక్తి ఈ సమాజంలో ప్రజలకు లేదని నేనెరుగుదును అమెరికా, ఇంగ్లీషు మొదలైన దేశాలలో వున్నంత ముమ్మరంగా లేకపోయినా మనదేశంలో కూడా ప్రచారంతో జనాన్ని ఊదరబెట్టి, చచ్చుకళలను

మంచికళలుగా ప్రజలను నమ్మించటానికి అవకాశాలున్నాయి. అయినప్పటికీ మన కళలను ఎక్కదిద్దేపని ఏ కాంగ్రెసు పార్టీ గాని, కమ్యూనిస్టు పార్టీగాని, మరోపార్టీగాని పూచి వేసుకుంటే, మనకళలు అభివృద్ధి అయిపోతాయన్న నమ్మకం నాకే కోశానాలేదు. కాని సరిఅయిన విమర్శకు అవకాశం లేని కారణంచేత సినిమా కళలాంటిది దిగజారిపోతుండటం నాకు స్పష్టంగా కనిపిస్తున్నది.

కళలలో వదిపలక్షణాలు కలగటానికి బలమైన కారణాలు జీవితంలోనే వుంటాయి. ''నేను ఎందుకు బతుకుతున్నానో, క్రూరమైన మాస్కో బోనులో చిక్కుకుని మృగాలనుంచి ఏమి ఆశిస్తున్నానో నాకే తెలీదు'' అని అలెగ్జాండర్ ఎసెనిన్ వోల్పిన్ అనేవాడు కవిత్వం రాసాడట. ఇంతటితో పోనివ్వక విశ్వసించటమూ, ప్రేమించటమూ తప్పని కుర్రకారు తెలుసుకోలేకుండా వున్నదనీ, వాళ్ళ తలిదండ్రులను ఎప్పుడో చంపివేసి వుండవలసిందనీ అంటాడు. సహజంగా పశ్చిమదేశాలవాళ్ళు వీడి వ్యాధిలక్షణాలను సోవియట్ జీవితంపై 'తిరుగుబాటు' గా ప్రచారం చేస్తున్నారు! ఇలాటి వ్యాధి లక్షణాలు జీవితంనుంచి సంక్రమిస్తాయి. అది కలవాడు కవిత్వం చెప్పగలిగితే వాటిని పద్యాలలో కూడా పెట్టేస్తాడు. కాని ఆ కవిత్వాన్ని చదివి ఎవడానందిస్తాడు? ఒక వ్యక్తి యొక్క మనోవ్యాధికన్న జీవితం బలంగలదై వుండవద్దా? అందులో సోషలిస్టు జీవితం?

విచ్ఛిన్నధోరణి గల కవిత్వం విరివిగా ప్రజాదరణ పొందితే దానికి రెండు కారణాలుంటాయి. ఒకటి వ్యాపారబుద్ధితో చేసే ఘాటైన ప్రచారం. రెండు జీవితంలో విస్తృతంగా వుండే సాంఘిక రుగ్మత. మొదటిదానికి సోవియట్ రష్యాలో అవకాశం లేదు. రెండవదానికి కూడా అవకాశం వుండకూడదని అనుకోవాలనే నాకోరిక. ఎవరూ ఆదరించని నీచకళను గాలికి వదిలెయ్యవచ్చు. అవి నశించేపోతాయి. అలాకాక, నీచకళకు కొంతైనా ప్రచారం కలిగి అవి వ్యక్తుల విమర్శలతో చావనప్పుడేగదా వాటిని నిర్మూలించ డానికి సోవియట్ కమ్యూనిస్టుపార్టీ నడుము కట్టుకోవలసివచ్చేది? అంతదాకా వచ్చినాక ఈ సమస్యకు కారణం జీవితంలోనే వుందేమో ఆలోచించటం మంచిది కాదా?

విశాలాంధ్ర, 10-2-63

# 17. కార్టూను చిత్రాలు

నాకు చాలా ఏళ్ళుగా - అనేక దశాబ్దాలుగా - ఒక అలవాటున్నది. ఏ పత్రిక అయినా, చేతికి రాగానే, ముందుగా అందులో వుండే కార్టూన్లు చూస్తాను. ఈ అలవాటు నాలాగా యింకా అనేకమందికి వుండొచ్చు. కొందరు రాజకీయ సంబంధమైన కార్టూనుల పట్ల హెచ్చు ఆసక్తి చూపుతారు. అలాంటి విచక్షణ నాకు అంతగా లేదు.

ఏ సినిమా అయినా చూడగలవారూ, ఏ కథ (నవల) అయినా చదవగలవారూ వుంటారట. అలాగే అన్ని కార్టూనులూ చూసి తృప్తిపడగల వారూ వుండవచ్చు. కానీ నాకు కార్టూన్లలో చాలా రకాలు కనిపిస్తాయి. బహుకొద్ది కార్టూన్లు నా స్పృహను పెంచుతాయి. కొన్ని అసభ్యంగా, అంటే bad taste లో వుంటాయి. కొన్ని, నా నమ్మకాలకు సూటిగా వుండటం చేత కావచ్చు- చాలా తృప్తి కలిగిస్తాయి. కొన్ని సాదాగా చిరునవ్వు తెప్పిస్తాయి. కొన్ని నవ్వు కూడా తెప్పించలేవు. కొన్నిటిని చూడగానే ''ఆరి దుర్మార్గుడా!'' అని కార్టూనిస్టుని మెచ్చుకోబుద్ధి పుడుతుంది. కొన్నింటిని చూస్తే ''పాపం!'' అని కార్టూనిస్టు మీద జాలి పుట్టుకొస్తుంది.

ఇంతకూ కార్టూన్లు హాస్యప్రధానమే అయినా, అవి నవరసాలనూ పోషించగలిగి వుంటాయి. ఆమాట అని కార్టూన్లను వర్గీకరించటం భావ్యం కాదు. ఇందులో చూసేవాడికి స్వీయమానసిక ధోరణి, ఒకటి ప్రగాఢంగా వుంటుంది. ఒకే కార్టూను పదిమందిలో పదిరకాల ఆస్వాదన రేకెత్తించవచ్చు. ఒకరు ''చెత్తకార్టూను' అని గానీ, 'చెత్తరచన' అని గానీ అనుకున్నది ఒక పత్రికలో వచ్చిందంటే, దాన్ని ఆ పత్రిక ఎడిటరు ఆమోదించే వేసుకుని వుంటాడు కదా! పత్రికలకి పంపే రచనలూ, కార్టూనులూ అన్నీ పడటం లేదుగదా! ఏదో ఒకలెక్కన ప్రచురణయోగ్యమైనవి అనుకున్నవే పత్రికలలో వేస్తాయి. అవి కూడా, అన్నీ పాఠకులందరికీ నచ్చుతాయని ఎవరూ అనుకోరు! అందుచేత యిలాంటి విషయాలలో ప్రమాణాలు చాలా భిన్నంగా వుండటం తప్పదు. ఆ ఒక్క కారణం చేతనే అయినా వర్గీకరించటం అసాధ్యమవుతుంది. అందుచేత, కార్టూన్ల విషయంలో కూడా, 'బాగుంది', 'బాగాలేదు' అనేమాట పుట్టినప్పుడు 'ఎవరికి బాగుంది? ఎవరికి బాగాలేదు' అన్న ప్రశ్న దానంతట అదే పుట్టుతుంది,

అయినా కొన్ని కొలబద్దలను గుర్తించక తప్పదని ఒప్పుకోవాలి.

అందులో ఒకటి 'డ్రాయింగు' బాగుండటం. పత్రిక గెటప్ దృష్ట్యా డ్రాయింగు బాగాలేని కార్టూన్లు ఎబ్బెట్టుగా వుంటాయన్నది నిజమే. ఇప్పుడు మనం చూసే కార్టూన్లలో డ్రాయింగు అంతబాగుండని మాటా నిజమే. అయితే, నాకు ఏమనిపిస్తుందంటే, కార్టూను ఐడియాలో పదునువుంటే డ్రాయింగు అంతగా గణనానికి రాదని. డ్రాయింగును ఏమీ లక్ష్యపెట్టని కార్టూన్లు విదేశీ పత్రికలలో కూడా వస్తాయి.

అరువు కార్టూన్లు హర్షించదగినవి కావు. విదేశీ సంస్కృతిదిగుమతి కాకుండా నిషేధించగలమని కాదు కానీ, అందుకు అంకితమైన కార్టూన్లనను ఆకాశానికి ఎత్తవలసిన అవసరంలేదనుకొంటాను. ఇందులో వుండే మరో బెడద ఏమిటంటే, ఒకే పాశ్చాత్యకార్టూన్ ఐడియాను పదిమంది కార్టూనిస్టులు చేతివాటు వేసి పత్రికలకి పంపిస్తే, అది పత్రికలలో పడితే కార్టూన్లు ఆసక్తితో చూసేవాళ్ళు బోరెత్తిపోతారు. ఊరికే నవ్వించటమే కార్టూనిస్టు చరమాశయమూ పరమాశయమూ అయితే తప్ప యీ అరువు కార్టూనులతో పనే లేదనుకొంటాను.

పై దేశాలనుండి మనం ఏమీ నేర్చుకోరాదని నా ఉద్దేశం కాదు. కార్టూను శిల్పం మనం యితర దేశాలనుండే నేర్చుకున్నాం. ఐడియాలు కూడా మనపరిస్థితులకు అనుగుణంగా వున్నప్పుడు వాటిని కూడా వాడుకొని మనం ప్రయోజనం సాధించవచ్చు.

కార్టూన్లు జాతీయంగానూ, వర్తమానానికి చెందినవిగానూ వుండాలని సిద్ధాంతీకరించటానికి నేను మొహమాటపడను. నేను కార్టూన్ల నుండి నేర్చుకున్నది ఏదైనా వుంటే అలాటివాటినుంచే.

కార్టూన్లలో 'జర్నలిజం' కూడా తప్పుపట్టటానికి లేదు. ఏ వినాయకచవితో, దీపావళో, సంవత్సరాదో, స్వాతంత్ర్య దినమో రావచ్చు. కార్టూనిస్టులకు చేతినిండా పని. పత్రికలకు కార్టూన్ల అవసరమూ వుంటుంది. కాదనరాదు. ఇలాటి జర్నలిస్టు కార్టూన్లలో కొన్ని నిజంగా 'తెలివిగా' వుండటం కూడా కద్దు.

సమర్ధులైన కార్టూనిస్టులు ప్రజలలో ఆలోచనా శక్తిని పెంచటంలో గానీ, మానసిక చైతన్యాన్ని చురుకుపరచటంలోగానీ, సామాజిక చైతన్యాన్ని ముందుకు తీసుకుపోవటంలో గాని, ఏ రచయితకూ ఏ ఉపన్యాసకుడికీ తీసిపోనవసరం లేదు. ఒకగంట పూాకదంపుడు ఉపన్యాసం చేయిలేని పని ఒక కార్టూను చేయవచ్చు. ఆమాటకు వస్తే కవిత్వంకన్న కూడా సూక్ష్మమైనది కార్టూను.

నా దృష్టిలో యిప్పుడు వస్తున్నన్ని కార్టూన్లు అనవసరం. పత్రికలు వీటిని శృతిమించి ఆశ్రయించటం జర్నలిజం దౌర్బల్యం కావచ్చు.

కార్టూనిస్టులు యితర కళాకారులలాగే, తమ సృష్టి ద్వారా తమ సంస్కారాన్ని అనుకోకుండా బయటపెట్టుకుంటారు. ఇది ఒకప్పుడు కుసంస్కారంగా బయట పడవచ్చు (ఆడవాళ్ళమీద జోకులు కొన్ని బొత్తిగా వందొమ్మిదో శతాబ్దిలాగుంటాయి). కార్టూనిస్టు తన సంస్కృతిని అత్యున్నతంగా వుంచుకోవటానికి ప్రయత్నించటం స్థూలంగా కార్టూను కళ అభివృద్ధి కావటానికి ఎంతైనా తోడ్పడుతుందని నా విశ్వాసం.

## 18. కళలలో సామూహికలక్షణాలు

ప్రపంచంలో అనేకప్రాంతాల్లో గల గుహలలో ఆదిమవాసులు చిత్రించిన బొమ్మలు బయటపడుతున్నాయి. వీటిలో కొన్ని పదివేల ఏళ్ళనాటివి, వేదాలకన్నా కూడా ఆరేడువేల ఏళ్ళు పూర్వం నాటి వన్నమాట. ఈ చిత్రాలను చిత్రించినవారు మృగాలను వేటాడి జీవించినవారు, బొత్తిగా నాగరికత అనేది ఎరుగని ఆటవికులు.

ఆ కాలపు ఆటవిక, అనాగరిక మానవులు గుహలలో ఆ బొమ్మలను అంత శ్రద్ధగా ఎందుకు చిత్రించారు. మన ఈనాటి నాగరికతను మనసులో వుంచుకుని చూస్తే

ఆ బొమ్మలకు అర్థం దొరక్కపోవచ్చు అవి అలంకారార్థం వేసిన కుడ్యచిత్రాలు కావటానికి అవకాశం లేదు ఈకాలపు బడిపంతుళ్ళు క్లాసులో బ్లాక్‌బోర్డు పైన వేసే బోధనా చిత్రాలు కావటానికి కూడా అవకాశం లేదు వేట విధానాలు కుర్రకారుకు బోధించాలంటే గుహలలో బొమ్మలువేసి, జంతువులను ఎక్కడ కొడితే అవి త్వరగా చస్తాయో చూపే కన్న, వేటాడి చంపిన మృగాలను తెచ్చి, ఏ బాణం ఆ కళేబరం లోని మర్మస్థానానికి తగిలినదీ ప్రత్యక్షంగా చూపడం ఎక్కువ ఫలంపాలు

ఆదిమవాసులను గురించి ఈనాడు మనం సంపాదించిన విజ్ఞానం దృష్ట్యా చూసినట్లయితే, ఈ గుహాచిత్రాలు 'మాజిక్' కిందికి వస్తాయి ఆదిమమానవుల జీవితాలలో 'మాజిక్' అడుగడుగునా వుండేది నాగరికత చాలా అభివృద్ధి అయిన తెగలలో కూడా వ్యవసాయానికిముందు పాటలూ, నృత్యాలు వుండేవి వానకురవటమూ, పొలాలు దున్నటమూ, పైర్లు పెరగటమూ, పంట కొయ్యటమూ మొదలైన కర్మకాండ యావత్తూ వానలు రాబోయే ముందే నృత్యాలద్వారా అభినయించే వారట అలా చేయటం ద్వారా జనమంతా వ్యవసాయపు పనులలో దీక్షతో కలిసి పనిచేసే మనస్తత్వం ఒకటి రూఢిగా ఏర్పడిపోయింది. ఇదంతా 'మాజిక్' అసలు పనులకిది ఉపాధి

వ్యవసాయం రాకపూర్వం కొన్నివేల సంవత్సరాలక్రితం మృగాలను వేటాడటమే జీవనోపాధిగా గల మానవులు ఈ 'మాజిక్' పై ఎంతగా ఆధారపడివుంటారో మనం ఊహించవచ్చు. ఒక తెగవారంతా వేటకు బయలుదేరుతున్నారు వేటకు నాయకత్వం వహించేవాడు, తాము చెయ్యబోయే వేటను చిత్రిస్తాడు. పారిపోయే మృగాలు, వాటి గుండెల లోనూ, ఇతర మర్మస్థానాలలోనూ నాటుకున్న బాణాలు! ఇంకా వేటకు బయలుదేరకముందే వేటగాళ్ళ ఊహలో మృగాలు చూవబడ్డాయి! ఇక జరగవలసింది ఈ 'మాజిక్'ను వాస్తవంచెయ్యడం మాత్రమే... ఇంకా వానలు రాకపూర్వమే 'మాజిక్' ద్వారా కోతలూ, నూర్పిళ్ళూ కూడా ముగిసినట్టే!

వేదాలకాలం నాటికే, ఉపనిషత్తుల కాలం నాటికే ఈ 'మాజిక్' వున్నది ఉద్గీథ అన్నది (గానం) 'మాజిక్' కిందికే వస్తుంది. ఆకలి అవుతున్న వాళ్ళు తమ కోరిక తీర్చుకోవటానికి 'ఓం తింటున్నాం, ఓం, తాగుతున్నాం'' అని గానంచేస్తారు. అసలైన తినటానికీ తాగటానికీ ఈ గానం ఉపాధి

'మాజిక్' సామూహిక స్వభావం గలది. ఒక్క వేటగాడు యితరుల ప్రమేయం లేకుండా వేటకు బయలుదేరేటప్పుడు 'మాజిక్'తో పనిలేదు. కాని ఆదిమ సమాజాలలో అలాంటి వ్యష్టి ప్రయత్నం దురూహ్యం. అనేకమంది బుద్ధిని ఒకే దిక్కుకు కేంద్రీకరించటానికే 'మాజిక్'

మానవుడు శిలాయుగం నుంచి బయట పడ్డాడు సమాజాలు నిర్మించాడు అనేక కులాలనూ, వర్గాలనూ ఏకం చేసి సామాజిక వ్యవస్థ ఏర్పాటు చేసుకున్నాడు.

ప్రకృతి శక్తులను అదుపులోకి తెచ్చుకున్నాడు ఉత్పత్తిశక్తులను అపారంగా పెంచుకున్నాడు 'మాజిక్'తో పని లేకుండా శాస్త్రీయమైన విధానాలలో సామాజిక కృషిని కొనసాగిస్తున్నాడు

ఈనాడు మనం సాంఘిక విషయాలలోనూ, రాజకీయ విషయాలలోనూ, కళకు సంబంధించిన విషయాలలోనూ వ్యక్తికి అగ్రస్థానం యిస్తున్నాం కళాసృష్టిలో కూడా వ్యక్తి స్వాతంత్ర్యం బలపరుస్తున్నాం అప్పుడప్పుడూ సాంఘిక ప్రయోజనం గురించి కూడా ప్రస్తావిస్తూ వుంటాం సాంఘిక ప్రయోజనాన్నీ, వ్యక్తిస్వాతంత్ర్యాన్నీ సమన్వయించినదే నిజమైన కళ అని కూడా ప్రవచిస్తూ వుంటాం.

ఇవాళ వున్న వాతావరణంలో కళాస్వభావం సామూహికమైనదని నాబోటి వాడెవడైనా అంటే నన్ను విజ్ఞులు బర్బరుడి కింద జమ కట్టే అవకాశం లేకపోలేదు కాని మనం సామూహిక తత్వాన్ని సరిగా లక్ష్యపెట్టడం లేదని నా అనుమానం.

'సామాజిక' అనే మాటకూ 'సామూహిక' అనే మాటకూ ఒకే అర్థం రాదా అని కొందరనవచ్చును. రాదని నా నమ్మకం. 'సామాజిక' లేక 'సాంఘిక' ప్రయోజనం అన్నది చాలా అస్పష్టమైనది ఆధునిక సమాజాలు మిశ్రమమైనవి. రకరకాల అంతస్తులు గల భవంతులు. ఈ సంగతి ప్రతి కళాకారుడికీ తెలుసు ''నీబోటి వాడి కోసం చిత్రాలు తీస్తే మేం కొట్టుకుపోతాం'' అంటాడు సినిమా ప్రొడ్యూసరు. '' పుస్తకం జనసామాన్యానికి పట్టదు'' అంటాం. శతావధానాలు చేస్తుంటే చూసి ఆనందించటానికి 'అలగా' జనం రాదు. తోలుబొమ్మలాటలు చూడటానికి సంస్కారులు పోరు. ఒక గ్రామంలో ఒక భోగం విదుషీమణి ఆధ్యాత్మ రామాయణ కీర్తనలు అభినయిస్తూ పాడితే ఊళ్ళో బ్రాహ్మలెవరూ అటుకేసి పోలేదు!

ఇన్ని కులాలూ, యిన్ని మతాలూ, యిన్ని వర్గాలూ, యిన్ని రాజకీయ విశ్వాసాలూ గల సమాజంలో 'సామాజిక' ప్రయోజనం ఏమిటో ఎట్లా నిర్ణయించటం?

మనకళ్ళ ఎదుట గాంధీగారు సామూహికమైన చైతన్యం దేశమంతటా పుట్టించాడు. ఇవాళ హిందీ వ్యతిరేకోద్యమం సామూహికంగానే నడుస్తున్నది.

కళలకన్నిటికీ సామూహిక తత్వం విధిగా వుండితీరాలని నేను సూచిస్తున్నాను. ప్రస్తుతం మనకున్న క్షీణ నాగరికత కళలనుంచి సామూహిక తత్వాన్ని వేరుచేసే ధోరణిలో వున్నది. రేడియో దగ్గిర కూర్చుని 'నాకు' ఇంపైన సంగీతం వింటాను. పత్రిక తీసుకుని 'నాకు' ఇంపైన కథో కవిత్వమో చదువుకుంటాను ఆధునిక యంత్రపరికరాలు ప్రసాదించే ఈ కళల్లో సామూహికతత్వం వున్నట్టా, లేనట్టా?

ఒక పాటకచ్చేరీకి వెళ్ళి వెయ్యిమంది ఒకే విధంగా సంగీతానికి చైతన్యం పొందటం ఎట్లావుంటుందో చూడండి పత్రికలకు పాఠకులు రాసే లేఖలూ, రేడియోకు శ్రోతలు

రాసే ఉత్తరాలు స్పష్టం చెయ్యలేనిది ఆ పాట కచ్చేరీలో స్పష్టమవుతుంది ఒక రసవత్తరమైన నాటకప్రదర్శనం చూడండి తెలుస్తుంది

మనం చాలా నాగరికత సంపాదించాం మనకన్నా నాగరికతలో ఎన్నో యోజనాలు ముందుకు పోయినవాళ్ళున్నారు వాళ్ళు ప్రాజెక్టుల నిర్మాణారంభాలకు మంత్రాలు చదివి, కొబ్బరికాయలు కొట్టారు. కాని ఈ నాగరికత 'మాజిక్'ను రద్దుచేసిందా? చెయ్యలేదనుకుంటాను

ప్రతి ఉద్యమం వెంటా 'మ్యాజిక్' వున్నది ప్రతి ప్రణాళికలోనూ ఏదో రూపంలో 'ఉద్గీథ' వున్నది. ''ఓం 1960కి యిన్నిలక్షల టన్నుల ఉక్కు తయారుచేస్తాం!'' ''ఓం, అభ్యుదయకరమైన రచనలు చేస్తాం!'' ఈ 'మాజిక్'ను వాస్తవం చెయ్యటానికీ, 'ఉద్గీథ'ను ప్రత్యక్షం చెయ్యటానికీ అవసరమైన కార్యాచరణే లోపిస్తుంది అది కూడ మనం నాగరికులమైనందున

జాతీయోద్యమం నడిచిన రోజుల్లో పల్లెటూళ్ళలో ఎవరో ఒకరు ఆంధ్రపత్రిక సంపాదకీయాలు చదవటమూ ఊళ్ళో జనం విని 'మాజిక్'కు గురికావటమూ మనలో చాలామందికి తెలిసివుండవచ్చు. ఆ సంపాదకీయంలో సామూహిక తత్వం వుండేది

ఇక్కడ 'వర్గాల' ప్రసక్తి తీసుకురాలేదు అందుకు కారణం వున్నది 'సామూహిక' తత్వానికీ 'వర్గ' తత్వానికీ తేడా వున్నది. 'సమూహం' వర్గంకన్న అస్పష్టమూ, విస్తృతమూ అయినది సమూహ ప్రభావం వర్గస్వభావంలో మార్పులు తెస్తుంది. అమెరికాలో నీగ్రోలు మాత్రమే తమ హక్కులకోసం ఆందోళన చేస్తే అది వర్గ స్వభావం గల ఆందోళన. అందులోకి తెల్లవాళ్ళు కూడా ప్రవేశించిన నాడు ఆందోళనకు సామూహికతత్వం వస్తుంది. వియత్నాం యుద్ధవ్యతిరేకోద్యమం అమెరికాలో సామూహికంగా జరుగుతున్నది, వర్గాల వారీగా జరగటంలేదు

కళలకు విస్పష్టమైన వర్గప్రయోజనం వుండటం అసంభావ్యం కాదు. నిజమైన అభ్యుదయ కళలన్నీ ప్రత్యక్షంగానో పరోక్షంగానో శ్రామికవర్గ ప్రయోజనానికే అనుకూలంగా వుంటాయి కాని వాటి స్వభావం సామూహికంగా వుండాలి. అంటే శ్రామిక వర్గానికి చెందనివాళ్ళు కూడా వాటి ప్రభావానికి బలంగా గురికావాలి.

ఈ దృష్టితో చూస్తే abstract art అనేది వెర్రితల అని స్పష్టమవుతుంది. కళాకారుడి వ్యక్తిగత స్వాతంత్ర్యం అన్నది వట్టి మృగతృష్ణ ఇటువంటి సిద్ధాంతాలు కళాసృష్టిని ఏస్థితికి తెచ్చాయంటే నూటికి 90 మంది ఏ సంగీతం నుంచీ, ఏ చిత్రలేఖనం నుంచీ ఆవంత చైతన్యాన్ని పొందలేని స్థితిలోకి దిగజారిపోయారు రానురాను మనకు వెండితెర ఒకటే- అదైనా సెక్సుభరితమైతే - కళాసాధనంగా మిగిలిపోయే రోజు ఎంతోదూరంలో లేనట్టు కనబడుతుంది.

కళ, 1968

పునర్ముద్రణ సాహిత్యప్రయోజనం, విశాలాంధ్ర పబ్లిషింగ్‌హౌస్, అక్టోబరు 1969

# 19. లేఖ

కళాకారుణ్ణి మాత్రమే ప్రదర్శించి, వస్తువును అముఖ్యంగా పరిగణించే కళాసిద్ధాంతాన్ని ఎలా ఆమోదించగలం?

మనం వెర్రాసుపత్రి ఆవరణలోకి ఆసక్తితో ప్రవేశించినట్లయితే, అక్కడి విజ్ఞులు వెయ్యిరకాల వెర్రులను గురించి 'శాస్త్రీయంగా' ఎంతైనా చెప్పగలుగుతారు - కళావిమర్శకులు నేటికళను వివరిస్తున్నట్లు

కాని, నాకు వెర్రాసుపత్రిలోకి అడుగుపెట్టే ఆలోచనేలేదు ఎవరన్నా అందులోకి పోతుంటే వాళ్ళను చూసి జాలిపడతాను ప్రపంచంలో వున్న అబ్‌స్ట్రాక్ట్ ఆర్ట్ యావత్తూ ఒక్కసారి మాయమైపోతే ప్రపంచానికి చిన్నమెత్తు అపకారం జరుగుతుందని గాని, దాని పురోగమనం ఆవగింజలో అరభాగం కుంటుపడుతుందని గాని నేను నమ్మలేని స్థితిలో వున్నాను

(చలసాని ప్రసాదరావుకు రాసిన లేఖలోని ఒకభాగం) కళ, *1969*

# 20. ప్రజాకళోద్యమము

నాకు సాహిత్యోద్యమాలతో చిన్నతనం నుంచీ సంబంధం వుంటూ వస్తున్నది సాహితీసమితి నా కళ్ళ ఎదుట, మా యింట్లోనే పుట్టింది తరువాత నవ్యసాహిత్య పరిషత్తు ఏర్పడిన మీదట నన్ను కూడా అందులో సభ్యుడుగా చేర్చుకున్నారు. నేనింకా రచనలు ప్రారంభించకపూర్వమే గిడుగు రామమూర్తి గారి వ్యావహారిక భాషావాదం బాగా తలకు పట్టించుకున్నాను. ఆయన ఉపన్యాసాలు విన్నాను.

అయితే రానురానూ నాకు సాహిత్యోద్యమాలలో నమ్మకంపోయింది. నేను చూసిన ఉద్యమాల ప్రభావం వర్తమాన సాహిత్యం మీద ఏమీ వుంటున్నట్టు నాకు తోచలేదు. నవ్య సాహిత్యోద్యమం నా కళ్ళ ఎదుటే మోడు బారిపోయింది బందరులో నవ్యసాహిత్య పరిషత్తు జరిగినప్పుడు, ఆ సంస్థ ...టువంటి వారికి సభ్యులయే అర్హత వుంటుందో, ఎటువంటి వారికి వుండదో తేల్చుమని కోరాను. సంస్థకు కొన్ని ఆదర్శాలు లేకపోతే గమ్యం కూడా వుండదని నా అనుమానం కాని, బందరులోనూ, అటు తరువాత కూడా నవ్యసాహిత్యపరిషత్తు ఏ ఆశయాలకు నిలబడేదీ స్పష్టంగా నిర్ణయం కాలేదు.

అటుతర్వాత 1943లో నన్ను అభ్యుదయసంఘ నిర్వాహకులు ఆసంస్థలో చేరమని అడిగారు. 'అభ్యుదయ రచయిత' అన్నమాటలోనే నాకేదో పునరుక్తి

కనబడింది అభ్యుదయకరమైన రచనలు చేయనివాడు తాను రచయితనని చెప్పుకోరాదనే నా విశ్వాసం అటువంటి విశ్వాసంతోనే నేను అంతకుపూర్వం చాలా ఏళ్ళక్రితం, విశ్వనాథ సత్యనారాయణగారి లాటి గొప్పకవి రామాయణం మళ్ళీ రాయటం గురించి ఆక్షేపిస్తూ 'భారతి'లో వ్యాసం రాసాను

నన్ను నేను 'అభ్యుదయరచయితను' అని చెప్పుకోవటం చాలా అసహ్యమనిపించి, నేను అభ్యుదయరచయితల సంఘం లో చేరనని స్పష్టంగా చెప్పేశాను నిజానికి అభ్యుదయ రచయితల సంఘం ఆశయాలు నాకు సరిపడనివి కావు. కాని నేను వాటి ప్రసక్తే ఎత్తుకోలేదు

తరువాత నేను బొంబాయిలో వుంటూ, అభ్యుదయరచయితల సంఘం కార్యకలాపాలను గురించి పత్రికలలో చదివాను. వాళ్ళు గిడుగు రామమూర్తిగారినీ, గురజాడనూ, వీరేశలింగం గారినీ స్మరించి, పునరుజ్జీవింప చేశారు. నవ్యసాహిత్య పరిషత్తు ఏనాడూ ఆ పనిచేసి వుండలేదు. నేను వాస్తవంగా పులకితుణ్ణయాను తుమ్మల వెంకటరామయ్యగారికి రాసి అభ్యుదయ ప్రత్యేకసంచికలు తెప్పించుకుని చూశాను. ఈ ఉద్యమంలో నేను వుండి తీరవలసిందే ననిపించింది. నన్ను సభ్యుడుగా వేసుకోమని రాశాను. మాటలకు లొంగని దశలో నేను చేతలకు లొంగాను. ఇదే మనస్తత్వం యింకా అనేకమందిలో నేను గమనించాను

ఉత్తమాటలే కాదు, ఒక్కొక్కసారి సిద్ధాంతాలకన్నా కూడా కార్యకలాపాలకు ఎక్కువ ప్రాముఖ్యం వుంటుంది ఈ సంగతి ప్రజానాట్యమండలి ద్వారా ఎన్నోసార్లు రుజువయింది

ప్రజానాట్యమండలి వాళ్ళ ప్రదర్శనలను నేను బొంబాయిలో చూశాను. అవి ప్రజలను కేవలం ఆకర్షించి, రంజింప జెయ్యటంతో ఊరుకోక వారిని కదిలించాయి. ప్రజాప్రదర్శనాలలో యిది ఒక సరికొత్త లక్షణం.

ఆంధ్రలో బుర్రకథ దళాలు ఏర్పడ్డాయి. నాజరు స్టార్ అయికూర్చున్నాడు. నిజానికి నాకు బుర్రకథరూపాన్ని పైకితీయటం అంత యిష్టం లేదు. అభ్యుదయోద్యమాలు కొత్త క[illegible]పాలను సృష్టించుకోవాలి. తోలుబొమ్మలూ, బుర్రకథలూ, హరికథలూ, పురాణ[illegible]ా, భాగోతాలూ వేరు వేరు దశలలో వేరు వేరు ప్రయోజనాలకు వాడేసుకున్నారు. [illegible]్యరూపాలుగా అవన్నీ శిథిలమై పోయాయని నా సిద్ధాంతం

కాని ఆచరణలో నా సిద్ధాంతం ఎందుకూ పనికిరాలేదు. ఆ రూపాలన్నిటినీ ప్రజలు ఆప్యాయంగా స్వీకరించటం నేను కళ్ళారా చూశాను బెంగాలు క్షామం బుర్రకథ, హిట్లరు భాగోతం, క్రిప్స్ రాయబారం జనాన్ని అద్భుతంగా చైతన్యవంతులను చేశాయి.

'ముందడుగు', 'మాభూమి' నాటకాల విషయంలో కూడా యిదే జరిగింది. సిద్ధాంతరీత్యా అవి పూర్తి అభ్యుదయదృక్పథం కలవి కావు. అందులోని దుష్టపాత్రలు వర్గరీత్యా మాత్రమే కాక, వ్యక్తిగతంగా కూడా దుష్టపాత్రలు. అయినప్పటికీ ప్రేక్షకుల పైన వాటి ప్రభావం అద్భుతం

ప్రజానాట్యమండలి కళారూపాల ప్రభావం బహుముఖంగా వుండటం మనకు తెలుసు రెండవ ప్రపంచయుద్ధంలో ఫాసిజమును నిర్మూలించటానికి నిజంగా కృషిచేసినవి ప్రపంచ ప్రజాశక్తులే గాని, ధనికవర్గ నాయకులూ, సామ్రాజ్యవాదులూ కారని యుద్ధానంతరం తేటతెల్లమయింది ఈ వర్గాలు హిట్లరును అన్నివిధాలా ప్రోత్సహించారు తప్పనిసరి అయి యుద్ధానికి దిగి, బలవంతాన యుద్ధం చేశాయి. యుద్ధం ముగిసిన మరుక్షణమే మాజీ ఫాసిస్టులను చేరదీసి, మళ్ళీ బలపరుచుతున్నాయి. అందుచేత రెండవప్రపంచయుద్ధ విజయం సోషలిస్టు వ్యవస్థదీ, ప్రజాశక్తులదీనూ.

సామ్రాజ్యవాద వ్యతిరేకోద్యమాలు నడిపిన మనదేశంలో కూడా ప్రజాశక్తులు ఆ సమయంలో తలఎత్తాయి అలా తలఎత్తిన ప్రజాశక్తులను ప్రజానాట్యమండలి వివిధ కళారూపాలతో చైతన్యవంతం చేసింది. జమీందారీ వ్యతిరేకతా, ఫాసిస్టు వ్యతిరేకతా, ఇంపీరియలిజం వ్యతిరేకతా బాగానే ప్రచారమయ్యాయి

కాని స్వరాజ్యం వచ్చినాక పరిస్థితి మారింది ప్రజాశత్రువులు పాలకవర్గంలోకి ప్రవేశించారు ప్రభుత్వం కమ్యూనిస్టులను వేటాడబూనుకున్నది. ప్రజానాట్యమండలి కార్యకలాపాలు విచ్ఛిన్నమయాయి.

అభ్యుదయ రచయితలసంఘం కూడా దెబ్బతిన్నది. అందులోకి అభ్యుదయ నిరోధకులు సైతం ప్రవేశించారు. కాంగ్రెసు ప్రభుత్వం 'మాభూమి' నాటకాన్నీ, 'సీతారామరాజు' బుర్రకథనూ నిషేధించి, కమ్యూనిస్టుపార్టీ పైన కట్టిన కత్తిసే ప్రజాకళల పైన కూడా కట్టి తన అసలురంగును ఆనాడే బయటపెట్టుకున్నది.

కాంగ్రెసు తీసుకున్న ఈ వైఖరి మూలాన ప్రజానాట్యమండలి, అభ్యుదయ రచయితలసంఘమూ కూడా కమ్యూనిస్టు పార్టీ మారురూపాలేనన్న భావం ప్రజలలో కలగడానికి అవకాశం ఏర్పడింది.

నిజానికి ప్రజానాట్యమండలి ప్రదర్శనలను కమ్యూనిస్టు వ్యతిరేకులు చూసి ఆనందించారు. కీ.శే. గూడవల్లి రామబ్రహ్మం గారు కమ్యూనిస్టు వ్యతిరేకి అయివుండి కూడా నాజరు బుర్రకథ విని పరమానందం చెంది, నాజరును కౌగలించుకున్నారు. 'మాభూమి' నాటకం మధ్యలో కళావెంకట్రావు గారు ఆ నాటకాన్ని ప్రశంసిస్తూ ప్రసంగించారు. అది నిషేధించబడటానికి ఆ తరువాత ఎంతోకాలం పట్టలేదు!

అభ్యుదయ కళాసంస్థలు కమ్యూనిస్టుసంస్థలనటానికి కొందరు తెచ్చిన రుజువేమిటంటే, కమ్యూనిస్టుపార్టీ ఆ సంస్థల విషయంలో ఆసక్తి చూపుతున్నదని! మిగిలిన రాజకీయ సంస్థలు ఈ ప్రజాకళల పట్ల ఆసక్తి చూపక పోవడం వాటి కుళ్ళునే బయటపెట్టిందన్న సంగతి ఎవరికీ తట్టలేదు.

నిజానికి ఆ రోజుల్లో చదువుకున్నవారిలో కూడా రాజకీయవిజ్ఞానం చాలా తక్కువగా వుండేది శ్రామికవర్గ చిహ్నమైన ఎర్రజెండా స్టేజీమీదికి తెస్తే దాన్ని

కమ్యూనిస్టు పార్టీ జెండా అన్నారు! అభ్యుదయ రచయితల సంఘంలోకి కమ్యూనిస్టులను చేర్చుకోకుండా వుంటే యిది ''రాజకీయాలకు అతీతమైనది అని నమ్ముతాం'' అన్నారు కొందరు! 'మధ్యతరగతి రచయితలు' అనేమాట ప్రసంగాలలో రావటం చూసి, ''రచయితలు ఉత్తమ, మధ్యమ, అధమశ్రేణులను గురించి ప్రసంగించటం సబబుగా లేదు'' అన్నారు ఒకరు!

ఇటువంటి అయోమయంలో వున్న ప్రజలను - ముఖ్యంగా మధ్యతరగతి వారిని - చైతన్యం పొందించటానికి ఎంతగానో తోడ్పడి వుండదగిన ప్రజాకళోద్యమం దెబ్బతిని పోయింది అసంఖ్యాకమైన కళాకారులు ప్రజానాట్యమండలి ద్వారా ఆవిర్భవించారు. ఉద్యమం దెబ్బతినగానే వారు చెల్లాచెదురై పోయారు కొద్దిమందికి సినిమాలు ఆశ్రయమయాయి మిగిలినవారు అజ్ఞాతవాసంలో పడిపోయారు.

ఈ ట్రాజెడీకి ముఖ్యకారణం ప్రజానాట్యమండలికి ఒక ప్రత్యేకమైన ఆర్గనైజేషను సొంతంగా లేక, కమ్యూనిస్టుపార్టీ సహకారంపైన జాస్తిగా ఆధారపడటం తిరిగి ప్రజానాట్యమండలిని వ్యవస్థాపించే ప్రయత్నాలు జరుగుతున్నాయి దీనికి ప్రోత్సాహం ఎక్కడినుంచి వచ్చినా అభ్యంతరం వుండగూడదు (ప్రజావ్యతిరేక శక్తులు ప్రజాకళలను ప్రోత్సహిస్తాయనిమాత్రం కాదు!) కాని ఈసారయినా ప్రజానాట్యమండలి యితరసంస్థలపై ఆధారపడకుండా తన కాళ్ళమీద తాను నిలబడి, పూర్తిగా ప్రజల సహకారం తోనే పైకి రాగలగాలి. అలా అది పనిచేసిననాడు అది అసంఖ్యాకులైన కళాకారులను మళ్ళీ సృష్టి చేసి, ప్రజలను చైతన్యవంతులను చేయగల కళారూపాలను పెంపొందించగలుగుతుంది

ఈనాడు రచయితలకు కూడా ఒక సజీవమైన ఉద్యమం అవసరంగా కనబడుతుంది. అనేకమంది యువరచయితలూ, యువ కవులూ అంధకారంలో వుండి, విచ్చుడానికి అవకాశం కోసం ఎదురుచూసే మొగ్గలలాగా వుండిపోయారు. వారు వికసించాలంటే ప్రజలకు దగ్గిరగా వెళ్ళగల కళలకు ఉపాధి ఏర్పరచడం తప్ప మరొకమార్గం లేదు.

*ఆంధ్రప్రజానాట్యమండలి సదస్సు ప్రత్యేకసంచిక, ఫిబ్రవరి 1968*

# 21. కళలూ - కళాకారులు

ఒకదేశం లేక ఒకజాతి సంస్కృతిని కళాప్రమాణాల ద్వారా నిర్ణయించ వచ్చునని చెబుతారు. ఏ రవిశంకరో, అలీఅక్బరుఖానో, యామినీ కృష్ణమూర్తో, మరొకరో యింకొకరో దేశాంతరాలకు వెళ్ళి గొప్పగా 'అప్లాజ్' సంపాదించారంటే భారతీయులమంతా ఎందుకు గర్విస్తాం? సత్యజిత్‌రాయ్ చిత్రాలను పాశ్చాత్య పత్రికలు ఆకాశానికెత్తితే, అదివరకు వాటిని చూసి, ''ఎబ్బే'' అన్న మనం, అలా అననట్టు మొహం పెట్టి, ఆ చిత్రాలలో వుండే గొప్పదనాన్ని సత్యజిత్‌రాయ్‌కే విస్మయం కలిగేట్టుగా ఎందుకు విపులీకరిస్తాం?

మన కళలను చూసి గర్వించటం మన సంస్కృతిని చూసి గర్వించటమే గనక!

చిక్కెక్కడొస్తుందంటే, మనం మన కళలను చూసి ఎప్పుడు గర్విస్తున్నాం అన్న దగ్గిర, పై దేశాలవాళ్ళు చప్పట్లు కొట్టే దాకా మనం వాటిని చూసి గర్వించం. అంటే ఏమిటి? మన కళలు గొప్పసంస్కృతినే ప్రతిబింబిస్తున్నాయి గాని, ఆ సంస్కృతి మనలో లేదు పాశ్చాత్యదేశీయులలో వున్నదని భావం

ఇదే మన కళలకు పట్టుకున్న ప్రారబ్దం వాటి విలువ మనంతట మనం తెలుసుకోలేం. అని మన సంస్కృతిని ప్రతిబింబించలేకుండా వున్నాయి.

రాజకీయంగా స్వతంత్రులమయామని ఓ వేళ వొప్పుకున్నప్పటికీ కళల విషయంలో మనం, పాపం, చాలా అస్వతంత్రులం. అందుకే రెండోతరగతి, మూడో తరగతి కళాకారులు కూడా నానా అగచాట్లు పడి విదేశాలకు వెళ్ళివొస్తున్నారు.

దేశంలో నిజమైన కళాపిపాసువులు లేనే లేరని కాదు. లేకపోతే కళలు ఏనాడో తుడిచిపెట్టుకు పోయేవి. సత్యజిత్‌రాయ్ తొలిచిత్రం 'పథేర్‌పాంచాలి' రషెస్‌ను చూసి పారవశ్యం చెందినవాళ్ళుంటారు రవిశంకర్ సితార్‌వాద్యం విని ఆరంభంలోనే అతని భుజం తట్టి, ''పైకి వస్తావు బేటా'' అని అన్నవాళ్ళుంటారు.

వాళ్ళు బహు అల్పసంఖ్యాకులు, సముద్రంలో కాకిరెట్టలు. నీచోపమను మన్నించాలి. ఈ బహు అల్పసంఖ్యాకుల కళావివేచనలో పూర్తివిశ్వాసం గల మరొకవర్గం కూడా విధిగా వుంటుండ. ఆ పైన అంతా ఎడారే.

కళాప్రియుల మధ్య ఒకరకం వాగ్వాదం మనం తరచు వింటాం.

సితార్ వాయించడంలో రవిశంకర్ గొప్పవాడా? విలాయత్ ఖానా?

అభిప్రాయభేదం వస్తే జుట్టూ జుట్టూ పట్టుకోవడం జరుగుతుంది. చిట్టచివరకు

– నాకదంతా తెలీదు, ఎవరు విదేశాలలో ఎక్కువ తిరిగారు? ఎవరికి ఎక్కువ విదేశీఖ్యాతి వచ్చింది? అది చెప్పు ముందు.

అదీ వరస.

పెనకటికెవరో న్యాయాధికారి ముద్దాయిని ''నువ్వు నేరం చేసినమాట నిజమేనా?'' అని అడిగాట్ట

''ఇద్దరు ప్లీడర్లూ పర్చించుకుని తేల్చేదాకా నేను మాత్రం ఏం చెప్పగలను'' అన్నాట్ట ముద్దాయి.

మన కళలకు ఖరీదుగట్టే షరాబులు పాశ్చాత్యులు

స్వతంత్రంగా కళలను అంచనావెయ్యగల వాళ్ళమనుకునే వాళ్ళుకూడా ఈ విషయాన్ని తమకు తెలియకుండానే ఆమోదిస్తారు వాళ్ళేమంటారు?

''అయ్యో యీ దిక్కుమాలిన దేశంలో పుట్టావు గనక నీకు గుర్తింపులేకుండా వుంది గాని, ఇదే ఏ పాశ్చాత్యదేశంలోనన్నా అయితే నీకు ఎంతో గణన వచ్చేది!''

కళాకారుణ్ణి మనస్ఫూర్తిగా మెచ్చుకునేవాడు తన అభిమానాన్ని కళాకారుడికి తెలియపరచటానికి యింతకన్న మంచిమార్గం వున్నట్టు కనబడదు ఈ మాట అనటం ద్వారా కళాకారుడి కళకు పాశ్చాత్య ప్రమాణాలు అంటుగట్టినట్టూ అవుతుంది, అతని గొప్పతనాన్ని గుర్తించలేని దేశాన్ని, అంటే దేశంలోని మూకని - ఎత్తిపొడిచినట్టూ అవుతుంది.

అయితే మన కళలకు పాశ్చాత్యసంస్కృతిని గీటురాయిగా పెట్టటంలో కనీసం రెండుచిక్కులున్నాయి అవి ఎటువంటివో మనవి చేస్తాను.

ఒకటి - ఒక కళాకారుడు పాశ్చాత్యదేశాలలో చప్పట్లు కొట్టించుకున్నాడన్నది ఎంతమందిని కదిలిస్తుంది? చదువుకున్నవాళ్ళను, పత్రికలు చదివేవాళ్ళనూ కదిలిస్తుంది. మామూలువాళ్ళు కదిలేట్టు కనబడరు. యామిని కృష్ణమూర్తి భామాకలాపం చూసే పామర ప్రేక్షకుడికి, ఆవిడ విదేశాలు పర్యటించి వచ్చిందన్న మీదట, ఆ భామాకలాపం మరింత కళాన్వితంగా కనబడక పోవచ్చును.

అందుకు క్రెడిట్; మన కళలు సాధారణంగా చదువుసంధ్యలు లేని పామరుల కోసం కాదు. అందుచేత ఈ అభ్యంతరం అంతగా బాధించనేరదు.

రెండోపాయింటు, కొంచెం బాధకలిగించేదే. అదేమిటంటే: మన జాతీయ కళలు మన సంస్కృతిని ప్రతిబింబించటం అర్థం చేసుకోవచ్చు గాని యితర సంస్కృతులను ప్రతిబింబిస్తే ఎలాగా? మన జాతీయత ఏమయేటట్టు?

అదే మరోవిధంగా చెప్పాలంటే, పాశ్చాత్యుల చప్పట్లకు ఎంత విలువ యివ్వడం సబబు? ఏ చీనావాళ్ళో, రష్యా వాళ్ళో, ఫ్రెంచి వాళ్ళో, జర్మనులో వచ్చి తమ జాతీయ కళలను యిక్కడ ప్రదర్శిస్తే మనం చప్పట్లు కొట్టామనుకోండి. వాటికేం విలువుంటుంది? ఆ కళల ఆంతర్యం మనకేం తెలుసునని?

మన కళలను చూసి వాళ్ళు చప్పట్లు కొట్టినా అంతేగా? లేక, కాదా?

మళ్ళీ మాటాడితే, మన మీద రెండువందల ఏళ్ళు తెల్లవాడి బావుటా ఎగిరింది గనక మనదేశంలో పాశ్చాత్య సంస్కృతి కొంత పేరుతున్నది పాశ్చాత్యులు వెళ్ళిపోయినా, అక్కడి సంస్కృతి వేసే వెర్రితలలు మనదేశంలో కూడా కానవస్తున్నాయి కాని మన సంస్కృతి వాళ్ళకు అసలేమీ లేదే, హాలీవుడ్ ఋష్యాశ్రమాలలో తప్పిస్తే

ఇది నిజంగా గడ్డుసమస్యే విప్పలేని చిక్కే గార్డియన్ నాట్ లను ఏం చెయ్యాలో అలగ్జాండరు సూచించాడు మనవాళ్ళూ ఆ పనే చేస్తున్నారు విప్పలేని చిక్కును తెంచెయ్యి.

ఈ పీటముడిని తెంచటంలో కృతకృత్యులైన తొలి భారతీయ కళాకారులు, రచయితలు, నా భాషలో నేను నా సజాతీయుల కోసం రాస్తే ఎవరమూ చూడని పుస్తకాన్ని ఇంగ్లీషులో, పాశ్చాత్యుల సంస్కృతిని గీటురాయిగా పెట్టుకుని రాస్తే అది అచ్చయి, అనేకవేలు కాపీలు అమ్మటమే గాక, నా దేశంలోనే నా సజాతీయులే నాకు బ్రహ్మరథం పట్టే అవకాశం వున్నది, డబ్బూ, కీర్తీ లభ్యమవుతున్నప్పుడు దాన్ని వద్దనే వెర్రికుట్టె ఎవడుంటాడు?

ఈ అవకాశం యితర కళాకారులకు అంతగా లేదని ఒప్పుకుంటాను. పుస్తకాలను ఇంగ్లీషులో రాసినంత తేలిగ్గా ఇంగ్లీషులో పాడటమూ, బొమ్మలు వెయ్యటమూ లాటివి సాధ్యం కావు

అంచేత మన కళాకారులు జాతీయతను వదులుకోవటం ఒకటే మార్గం, వాయించేది ఫిడేలే అయినా దానిమీద బ్లూ డాన్యూబ్ ఛాయలూ, చెకోవ్‌స్కీ సంగీత ఛాయలూ, బీటిల్స్ సంగీతఛాయలూ పలికించు విదేశాలలో చప్పట్లు చరిచారంటే ఈ దేశానికి వినిపిస్తుంది ఇక్కడకూడా చప్పట్లు చరుస్తారు. ఈ దేశం వాళ్ళకు సంబంధించినా, సంబంధించక పోయినా అర్థమైనా, కాకపోయినా లండన్ ఆర్టు క్రిటిక్కులూ, న్యూయార్కు ఆర్టుక్రిటిక్కులూ మూర్ఛపోయే బొమ్మలు గియ్యి. నీ పేరు ఈ దేశంలోని పత్రికలన్నిటా ప్రతిధ్వనిస్తుంది.

ఎందుకయ్యా జాతీయత? నీ సజాతీయుడు నీకేం వొరగబెడతాడు గనకా?

*ఆంధ్రజ్యోతి వారపత్రిక, 14-6-1968*

# 22. చీనా జానపద ప్రదర్శనలు

ఇరవై ఏళ్ళు దాటింది చీనాలో ప్రజాప్రభుత్వం నెలకొన్న మూడు, నాలుగేళ్ళ లోపుగా, చీనా కళాకారుల బృందం ఈ దేశానికి వచ్చి, ఇక్కడ ప్రదర్శనలిచ్చారు అవి నిజానికి జానపద ప్రదర్శనలే గాని, మన జానపదప్రదర్శనల లాగా కాక, ఆహార్యం విషయం లోనూ టెక్నిక్‌లోనూ చాలా ఉన్నతస్థాయిలో వున్నాయి ఈ ప్రదర్శనలిచ్చిన వారిలో కనీసం ఒకరిద్దరు గొప్ప బిరుదులు కలవారు వారి పేర్లు నాకు గుర్తులేవు ప్రదర్శనలన్నీ కూడా జ్ఞాపకం లేవు. కాని జ్ఞాపకం వున్నవి చెబితే, చీనా జానపద ప్రదర్శనల తత్వం కొంత తెలుస్తుంది.

ఇంకొక విషయం కూడా చెప్పాలి ఈ ప్రదర్శనలు ఈనాడు చీనాలో జరుగు తున్నాయో లేదో తెలీదు. ఈ స్టేజి ప్రదర్శనలు కాక రెండు ఓపెరాలూ, ఒక సినిమా చిత్రమూ (వైట్ హేర్డ్ గర్ల్) కూడా చీనాబృందం వారు తెరమీద చూపించారు. ఈ ఓపెరాలూ యిప్పుడు చీనాలో ఆడటం లేదని చదివినట్టు గుర్తు కాకపోయినా, గడచిన ఇరవై చిల్లర ఏళ్ళలో, చీనాలో సామాజిక పరిస్థితి చాలా మారింది - ముఖ్యంగా సాంస్కృతికవిప్లవం అనంతరం కళారూపాలలో కూడా పెద్ద విప్లవం వచ్చింది. ఆ వెల్లువలో ఏవి కొట్టుకపోయాయో, ఏవి మిగిలాయో తెలీదు.

అయితే నేనిప్పుడు రాసే ప్రదర్శనలేవీ రాజకీయస్వభావం కలవి కావు. కేవలమూ శిల్పప్రధానమైనవి బహుశా అవి విప్లవానికి పూర్వం వుండినవే అయివుంటాయి కొన్నిటికి ఇతివృత్తాలు కూడా లేవు వాటిలో కొన్ని డ్యాన్సులవంటివి - కలువల నృత్యం, రిబ్బన్ల నృత్యం లాంటివి మరికొన్ని 'ఆక్రోబాటిక్స్', యుద్ధాలు వగైరా నీటిలో 'వానరదేవుడు' (మన ఆంజనేయుడికి సరిపోతాడు) రాక్షసులతో యుద్ధంచేసి చంపుతాడు అలాగే ఒక 'వీరనారి' అనేకమందితో ఒకేసారి యుద్ధం చేస్తుంది.

మరికొన్ని అత్యల్పసంఘటనలు , ఉదాహరణకు ఒక తాత మనుమరాలిని వాహ్యాళికి తెస్తాడు ప్రదర్శన యిచ్చినది ఒక్క స్త్రీ మాత్రమే, ఆమె పై భాగం మనుమరాలు, కింద భాగం తాత. తాతపై భాగం బొమ్మ. అది ముందుకు వంగివుంటుంది. తాత లాగా నడుస్తూ, తాతను అటు తిరగమనీ, యిటు తిరగమనీ, అది చూపించమనీ యిది చూపించమనీ అడుగుతూ ఆమె, స్టేజిమీద యిద్దరువ్యక్తులున్న భ్రమ చాలా అద్భుతంగా సృష్టించింది. మధ్య మధ్య తాత వీపుమీద వున్న మనుమరాలు జారిపోతుంటే ఆమెను పైకి తోస్తుంటాడు తాత. ప్రేక్షకులు అమితంగా హర్షించిన ప్రదర్శనలలో యిది ఒకటి

భ్రమ కలిగించటం మాటకు వస్తే అత్యద్భుతమని చెప్పుకోతగినది ‘తెప్ప ప్రయాణం’ ఇందులో సూత్రప్రాయంగా చిన్న కథ వున్నది ఒక పల్లె తనకు పెద్దలు నిర్ణయించిన వాణ్ణి చేసుకోవటం ఇష్టంలేక నది అవతల వున్న తన ప్రియుణ్ణి కలుసుకునేటందుకు అర్ధరాత్రివేళ నది ఒడ్డుకు వస్తుంది నదిమీద తెప్పనడిపే ముసలివాణ్ణి కలుస్తుంది నది దాటించమంటుంది ‘చీకటి, నది వరదల్లో వుంది! రేపు చూద్దాం’ అంటాడు ముసలాడు తెడ్డుతో వచ్చి వీల్లేదంటుంది పిల్ల. ముసలాడు చివరకు సాహసించి ఆమెను తీసుకుపోవటానికి వొప్పుకున్నాడు. మిగిలినదంతా నదిలో పడవ పడేపాట్లు ఆ తెప్ప నదివెంబడి కొట్టుకుపోయింది గుండ్రంగా సుడులు తిరుగుతుంది అటూ యిటూ భయంకరంగా ‘సీ-సా’ ఆడుతుంది.

ఇది చూసేటప్పుడు నేను ప్రేక్షకుల మధ్య కాక, సైడ్ వింగ్సులో వున్నాను అయినా నాకు కళ్ళు తిరిగిపోయాయి పైత్యవికారం వచ్చినంత పనయింది విచిత్రమేమంటే పడవ లేదు నదిలేదు ఆ పిల్లా, ముసలాడి వేషం వేసినవాడూ కలిసి వరదలో నదిని దాటేటప్పుడు తెప్పకు కలగదగిన అనుభవాలన్నీ అద్భుతంగా, కోఆర్డినేటెడ్‌గా ప్రదర్శించారు ఈ ప్రదర్శనను మరవటం నాకు అసాధ్యం

ఇలాంటిదే మరొకటి ‘చీకట్లో చిందులాట’ ఒక ‘ఇన్’లో కొందరు యువకులు వుంటారు కొంతదూరాన జరిగిన యుద్ధంలో తమ పక్షం ఓడిపోయినట్టు వారికి వార్త అందింది. పొద్దుపోయినాక ఒక యోధుడు వచ్చి, ఆ రాత్రికి అక్కడ పడుకుంటానంటాడు. చీకట్లో వాడెవడైనదీ వాళ్ళకు తెలీదు శత్రువు అయి వుంటాడని నిర్ణయిస్తారు ఒక యువకుడు ఆరాత్రి వాణ్ణి సఫా చెయ్యటానికి పూనుకుంటాడు ఒక రాత్రివేళ వాడు కత్తిపట్టుకుని, ‘శత్రువు’ పడుకుని వున్న చోటికి వస్తాడు. వాడికోసం చీకట్లో వెతుకుతాడు. పడుకున్న వాడి పాదం తగులుతుంది. నిద్రపోతున్న వాడు కాస్తా చటాలున లేచి నిలబడి, మోసం పసిగట్టి తాను కూడా రెండోవాడి కోసం చీకట్లో తారాడతాడు అతి నిశ్శబ్దంగా ఒకరికోసం ఒకరు తారాడటం పూర్తి వెలుగులో అత్యద్భుతంగా నటించారు. ఒక సమయంలో ఒకడి వెనక ఒకడు నిలబడతాడు. ముందున్నవాడి కత్తి ఎంత చీకట్లోనయినా కాస్త మెరవకపోదు. వెనకనున్నవాడు తలముందుకు చాచి అనుమానంగా ఆ మెరుపును చూస్తాడు. ఇది కూడా మరవరాని ప్రదర్శన.

చీనా జానపద ప్రదర్శనలన్నిటిలోనూ అందమూ సమర్థతా కనిపించాయి.

*మైత్రి, ‘భారత చైనా మిత్రమండలి’ వారి పత్రిక, 1969*

# 23. తెలుగువాళ్ళ కళాభిరుచి

తెలుగుకళలు బొత్తిగా వెనకపడి వున్నాయనుకోనవసరం లేదు తెలుగులో 'కన్యాశుల్కం' వెలువడేనాటికి ఆపాటి నాటకం ఈ దేశంలో ఏ ప్రాంతంలోనూ వెలువడలేదని అందరూ అభిప్రాయపడుతున్నారు తెలుగు కథానికలు దేశమంతటా తలెత్తుకు తిరగగలిగి వున్నట్టు చెబుతున్నారు, వాటిని యితరభాషల్లోకి అనువదించే వాళ్ళు. తెలుగు కవిత్వ చరిత్రలో పోటీ చేయగలది భారతదేశంలో మరెక్కడా లేదనిపిస్తుంది.

తెలుగు శిల్పాలకూ, చిత్రలేఖనానికి, సంగీతానికి కూడా యితర ప్రాంతాలలో ఖ్యాతి వున్నదనటానికి సందేహం లేదు

కాని తెలుగువాళ్ళకు తమ కళావైభవాన్ని గురించి గొప్పలు కొట్టుకోవటం తప్ప నిజమైన కళాభిరుచి ఏమీలేదు ఇక్కడ మద్రాసులో పాతుకుపోయిన వేణుగాన కళారంగంలో తెలుగువాళ్ళ ఆసక్తి ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ చూస్తున్నాను.

మనకున్న గాయకులలో అగ్రస్థానం అలంకరించదగిన మంగళంపల్లి బాలమురళీకృష్ణ మద్రాసులో స్థిరపడిపోవలసి వచ్చింది ఆయనకు తమిళులూ, కన్నడిగులూ, మళయాళీలూ హెచ్చు ఆదరం చూపుతున్నారన్నది నిజం. మన వైణికులలో గొప్పగా చెప్పుకోదగిన ఈమని శంకరశాస్త్రి, చిట్టిబాబూ ఆంధ్రలో లేరు సరికదా, వారి విద్య పట్ల ఆసక్తి గల వారిలో ఆంధ్రులు చివరనున్నారు. సన్నాయివాద్య ప్రవీణుడు షేక్ చిన్నమౌలాసాహెబ్‌కు దక్షిణదేశంలోనే ఎక్కువ ఆదరం వున్నట్టు కనిపిస్తుంది. ఇటీవల ఎం ఎస్. బాలసుబ్రహ్మణ్యశర్మ మద్రాసులో పాటకచేరీ చేస్తే తమిళ కళాపిపాసువులు తన్మయత్వంలో ఓలలాడారు.

నిజానికి మన కళాకారులు మద్రాసులో స్థిరపడిపోవటం గాని, వారికి తమిళులు అపారమైన ఆదరం చూపటం గాని, తెలుగువాళ్ళ అనాసక్తికి నిదర్శనాలు కాకపోవచ్చు. అందుకు పరోక్ష సాక్ష్యం ఒకటి నాకు ఏళ్ళ తరబడి లభిస్తున్నది. అదేమిటంటే మన గాయకులు మద్రాసులో ఎప్పుడు పాటకచ్చేరీ చేసినా వినటానికి వచ్చే ఆంధ్రులసంఖ్య అయిదారునుంచి, పన్నెండు దాటకుండా వుంటుంది

మద్రాసులో సినిమా పరిశ్రమ పాతుకుపోయి వుండటం చేత, దాని గురుత్వాకర్షణ ఫలితంగా పేరుమోసిన రచయితలూ, నటులూ, నాట్యగత్తెలూ తదితరులు యిక్కడ పరిభ్రమిస్తూండటం చేత ఈ మద్రాసు తెలుగు సంస్కృతికి ఒక కేంద్రమనే అభాస కలిగిస్తుంది కాని యిది శుద్ధ అబద్ధం బాలమురళీకృష్ణ గాని,

పిట్టిబాబు గాని, పిన షొలాగాని, శంకరశాస్త్రి గాని అరుదుగా పాటకచేరీ చేస్తే ఒక మ్యూజిక్ డైరెక్టరు గాని, ప్లేబాక్ పాటగాడు గాని, సినిమా కవి గాని, డైరెక్టరు గాని, యితర సినిమా గొప్పవాడు గాని వినటానికి రావటం నా కంట పడలేదు

మన ప్రాంతాలకు సినీప్లేబాక్ ఆర్టిస్టులను పిలిపించి, వారికి ఎక్కని సత్కారాలు చేసి సినిమాపాటలు పాడించి, వాటిని పాటకచ్చేరీలంటున్నారని నేనెరుగుదును తెలుగువాళ్ళ గాన కళాభిరుచికి యిదొక నిదర్శనం

ద్వారం వారి అమోఘమైన బాణీని మనకు స్ఫురింపజేయటానికి ద్వారం సత్యనారాయణ, మంగతాయార్లు, మారెళ్ళ కేశవరావులున్నారు అక్టోబరు 11న మద్రాసులో ఫిలింజర్నలిస్టుల సమాఖ్య శ్రీశ్రీకి సన్మానం చేసి, రాచకొండ విశ్వనాథశాస్త్రి రచించిన 'నిజం' నాటకం ఆడిన సమయంలోనే మద్రాసులో సత్యనారాయణ, మంగతాయార్ల కచేరీ ఏర్పాటయింది. దానికి హాజరయే అరడజనుమంది తెలుగువాళ్ళు ఎక్కడికి వెళ్ళాలో తేల్చుకోవాల్సిన విషమసమస్య ఏర్పడింది, ఈ 'క్లాష్' రాకుండా చూడటానికి ఎవరూ ప్రయత్నించలేదు నాబోటి ఛాందసుడికి తప్ప యిదొక సమస్య అని కూడా తట్టివుండదేమో దాన్ని బట్టే చాలావరకు మన కళాభిలాష వ్యక్తమవుతుందనుకోవచ్చు.

ఈ విషయాలు నాకు యివాళ తెలిసినవి కాకపోయినా నన్నీమాటలు రాయటానికి ప్రేరేపించినది పైన చెప్పిన శ్రీశ్రీ సన్మాన సందర్భమే. ఆనాడు శ్రీశ్రీ సన్మానం సాయంకాలం అయిదింటికి 'నిజం' నాటకప్రదర్శనారంభం ఆరింటికి అనుకున్నారు. కాని అయిదింటికి హాలువద్ద చేరినవారు కొంచెం అటు ఇటూగా అయిదుగురే. నిజంగా రాదల్చుకున్నవారందరూ ఆరుకు రాలేరనిపించింది వారు వచ్చింది నాటకం చూడటానికే గాని శ్రీశ్రీ సన్మానం చూడటానికి కాదేమోనని నాకు అనిపించింది.

మద్రాసులో శ్రీశ్రీ వంటి మహాకవికి సన్మానం జరుగుతున్నదంటే అధమం రెండు మూడు వేల జనం వస్తారనీ, సీట్లు దొరకవేమోనని నాలుగున్నర నుంచే హాలులో తిష్ఠవేస్తారనీ ఎవరన్నా అనుకోవచ్చు కాని అటువంటిదేమీ జరగలేదు మద్రాసులో హెచ్చుమంది తెలుగువాళ్ళకు శ్రీశ్రీ సినిమా కవులలో ఒకడన్నభావం మాత్రమే వున్నదేమో.

ఈ సన్మానానికి కూడా ఒక క్లాష్ వచ్చింది. అనంతపురంలో ఏదో సమ్మేళనం జరుగుతున్నదట. దాశరథి, స నారాయణరెడ్డి మొదలైన కవులు అక్కడికి వెళ్ళారు ప్రసిద్ధులైన కవులెవరూ హాజరుకాలేదు.

అయిదుకు ఆరంభం కావలసిన సన్మానం ఆరింటికి జరిగితే ఆరింటికి ప్రారంభం కావలసిన నాటకం ఏడింటికి ప్రారంభమయింది

'నిజం' నాటకం అపూర్వరచన అని చెప్పవచ్చు. సామాజిక దురన్యాయాలను గురించి ప్రచారధోరణిలో చిత్రించిన నాటకాలెన్ని వున్నా ఆ దురన్యాయాన్ని యింత వాస్తవంగా చూపే నాటకం ఇప్పటిదాకా కనబడదు. దాని ప్రదర్శన కూడా చాలా సమర్థంగా సాగింది. ప్రతి ఒక నటుడూ నాటకానికి దాసోహం అయిపోయి నటించడం జరిగింది. ఈ నాటకం[illegible]లో నాటకీయత' ప్రమాణం మాట ఎలా వున్నా సంభాషణలు మతాబా జల్లుల్లాగా [illegible] వాటి 'ఇంపాక్ట్' ప్రేక్షకుల మీద వుండవలసిన దానిలో దశాంశం కూడా కన[illegible]ము. ప్రదర్శన 'స్లో' అయిందన్న విమర్శ వచ్చింది. కొందరు మధ్యలో వెళ్ళిపోయారు. మరికొందరు చివరదాకా వున్నా, అనుకున్న టైముకు ఇంటికి వెళ్ళలేకపోయినందుకు విచారించారు. ఇదే ఏ కురుక్షేత్రమో ఆడితే, ఏ విమర్శా వచ్చేది కాదు. ప్రతి నటుడూ పద్యాలు పాడి గిరికీలుకొట్టితే నాటకం 'స్లో' అయిందనిపించేది కాదు. నాటకం నాలుగు గంటలు పట్టినా ప్రేక్షకులు త్వరగా ఇల్లు చేరనందుకు చింతించేవారు కారు. 'నిజం' ఆడినవారు సినీనటులయి వుంటే ప్రేక్షకులు ఈ నాటకాన్ని యింతకు పదింతలు శ్రద్ధతో చూసి వుండేవారన్నది తలుచుకుంటే తెలుగువాళ్ళ అభిరుచులు ఏమైపోతున్నాయా అనిపిస్తున్నది. ఈ పరిస్థితి మారదేమోననుకుంటే నిస్పృహ కలుగుతున్నది.

*ఆంధ్రజ్యోతి వారపత్రిక, 31-10-1969*

# 24. కళాకారుడి సామాజిక దృక్పథం

సమాజంలో ప్రతివ్యక్తీ తన వర్గస్వభావాన్ని ఏదో రూపంలో ప్రదర్శిస్తాడు. ఏ ఫ్యాక్టరీలోనో ఒక కార్మికుడు యంత్రానికి బలి అయితే ఫ్యాక్టరీదారుకు కలిగే మానసిక వికారాలూ, తోటి పారిశ్రామికులకు కలిగే వికారాలూ, చనిపోయినవాడి పెళ్ళానికీ, పిల్లలకూ కలిగే వికారాలూ వేరువేరుగా వుంటాయి. ఫ్యాక్టరీ యజమాని పరమ దయాళుడే అయినా అతనికి ఎవరి మీదా ఆగ్రహం కలగదు - కలిగితే చచ్చినవాడి మీదనే కలగాలి. తోటి కార్మికులకు విచారంతో పాటు ఆగ్రహం కూడా కలుగుతుంది - అది స్పష్టంగా ఫ్యాక్టరీ యజమాని పట్ల కాకపోయినా.

అలాగే దరిద్రుల కష్టాలూ, బాధలూ మధ్య తరగతి వాళ్ళకు విముఖత్వం కలిగిస్తాయి. కథల్లోనూ, నవలల్లోనూ వాటిని గురించి చదవటం తటస్థించినప్పుడు వాళ్ళు చాలా చిరాకు పడతారు. కొద్దిమంది వాటిని అతిశయోక్తులుగా పాటించినా, వాస్తవమని నమ్మేవాళ్ళు కూడా, ''ఎందుకిదంతా? జీవితంలో వున్న కష్టాలు చాలవనా, వీటితో పుస్తకాలూ, పత్రికలూ ఖరాబు చేస్తారు?'' అని విసుక్కుంటారు.

సినిమాలలో వాస్తవజీవితాన్ని చూపటానికి నిర్మాతలు చెప్పే అభ్యంతరం - వాస్తవ జీవితం వినోదకారకం గానూ, ఉత్సాహ జనకంగానూ వుండదని సినిమా చిత్రాలను చూసే లక్షలాది సామాన్యప్రజలు కూడా జీవితాన్ని మరపించటానికే వాటిని చూస్తున్నారు అజంతా దుస్తులూ, జీన్స్ ధరించిన స్త్రీలూ, పాడే స్త్రీలూ వాళ్ళకెక్కడ కనపడతారు? బూతుపాటల రొమాన్సు జీవితంలో ఎక్కడ లభిస్తుంది? నిషిద్ధ వస్తువులు కలిగించే నిషా సినిమాలు కలిగిస్తున్నాయి

వర్గస్వభావం దానంతట అదే ఏర్పడుతుంది దాన్ని ఒకరు నేర్పనవసరం లేదు అది పరిస్థితులకనుగుణంగా మార్పు కూడా చెందుతుంది మధ్యతరగతి కింది అంతస్తు నుంచి పై అంతస్తు అందుకున్నవాడు కొంత స్వభావ పరివర్తనకు గురి అవుతాడు తన పాత సవర్గీయులు దూరమవుతారు వారితో 'సహానుభూతి' సన్నగిల్లిపోతుంది - కొండ ఎక్కినవాడికి కిందవున్న వాళ్ళు కనిపించినట్టు

అయితే జీవితంలో అచ్చంగా వర్గస్వభావలే గాక వర్గచైతన్యం అనేది కూడా వున్నది పెద్దలు కూడబెట్టిన సంచితం, బీదసాదల పైన జాలితో పంచిపెట్టేవాడు వర్గచైతన్యం లేనివాడు వర్గచైతన్యం లేని వాడు వర్గచ్యుతి పొందటం ధనిక వర్గీయులలో తరచు జరుగుతుంది అలాగే నిర్ధనుడై వుండి ధనికుల జీవిత వివరాలను తెరమీద చూసీ, నవలల్లో చదివీ, వారి ప్రణయగాధలకు తన్మయత్వం చెందేవాళ్ళు వర్గచైతన్యం లేని వాళ్ళు సినిమాలు చూసి ఆనందించేవాళ్ళలో అత్యధిక సంఖ్యాకులు వర్గచైతన్యం లేనివాళ్ళే లక్షాధికార్ల ప్రణయకథలను చదివి ఆనందించే మధ్యతరగతి ఇల్లాళ్ళు వర్గచైతన్యం లేనివాళ్ళే.

వర్గచైతన్యం దానంతట అది స్వభావ సిద్ధంగా ఏర్పడదు. దానికి వర్గసంస్కృతి అవసరం. ఈ వర్గసంస్కృతి అప్పుడప్పుడూ పాలకవర్గం వారి తీవ్ర నిషేధానికి గురి అవుతుంది, దుష్ప్రచారాలను ఎదుర్కొంటుంది. రా.వి శాస్త్రి గారి 'పిపీలికం' తానొక సాదా కార్మికుడని తెలుసుకోవటం పాములకు ఎంతమాత్రమూ రుచించదు, ఎందుకంటే చీమలపుట్టలు పాములకిరవు!

వర్గచైతన్యాన్ని పెంపొందించే సంస్కృతిని ప్రభుత్వ వర్గాలు బలాత్కారంగాను ప్రత్యక్షంగానూ అణచిపెట్టడమే గాక, వారి చేతిలో యింకా అనేక బ్రహ్మాస్త్రాలున్నాయి. ఇందులో కొన్ని సనాతనమైనవి. మతం అలాంటిది పూర్వజన్మలో చేసుకున్న పాపం ఈ జన్మలో కట్టి కుడుపుతుంది. పాపం చేసుకున్న వాళ్ళు హీనజన్మలెత్తి, దారిద్ర్యమూ, రోగమూ మొదలైన ఈతిబాధలకు గురి అవుతారు! అందుచేత దరిద్రులు ధనికులను చూసి, కార్మికులు యజమానులను చూసీ ఆగ్రహిస్తే వాళ్ళు ముందు జన్మలకు కూడా బాగుపడే దారిలేకుండా మూసుకుంటున్నారు.

మొతంపెంట భ పెంతుడుంటాడు వాణ్ణి నమ్ముకుంటే, వాడికి లంచాలు పెట్టి, వాణ్ణే నమ్ముకుంటే, వాడిమీదే భారమంతా వేస్తే మనస్సు తేలికవుతుంది అమువంటివాడికి వర్గచైతన్యం లాటి అపలక్షణాలు ఏర్పడవు వర్గచైతన్య సంస్కారాన్ని ప్రచారం చేసేవాళ్ళు ఎవరు? మతభ్రష్టులు, నాస్తికులు! దైవభక్తీ, ప్రభుభక్తీ, త్యాగనిరతీ, నిస్వార్థతా యివి ఉన్నత జీవితానికి సోపానాలు (త్యాగమూ, నిస్వార్థతా) చూపవలసినది కటికదరిద్రులు, కలిగినవాళ్ళు కారు!

ఇదొక పెద్ద లంపటం. దీన్నంతా తోసిపారేసి వర్గచైతన్యం తెచ్చుకోవటం పీడితవర్గానికి ఏటికి ఎదురీతే వర్గచైతన్యం పొందిన హీనవర్గీయులను తిట్టటానికి చాలా పదజాలం వున్నది. వాళ్ళు కమ్యూనిస్టులు, మార్క్సిస్టులు, నక్సలైట్లు, అరాచకవాదులు, దేశద్రోహులు, హింసావాదులు! భారత జాతీయత - గాంధీ సిద్ధాంతాలు, మన ప్రాచీనసంస్కృతి - ఏదీ వర్గచైతన్యాన్ని సహించదు

విదేశీ పెట్టుబడులూ, ప్రజాసామాన్యంలో పెరిగిపోయే దారిద్ర్యమూ, నిరుద్యోగమూ, అనారోగ్యమూ, బాధ, ఖేదమూ, రాజకీయ కుట్రలూ, కూహకాలూ, పరిపాలనలో అవినీతీ - ఇవేవీ దేశాభ్యుదయానికి అడ్డం రావు, కాని వర్గచైతన్యం - అందులోనూ పీడిత వర్గంలో పెరిగే చైతన్యం - దేశాభ్యుదయానికి గొడ్డలిపెట్టు బూతుచిత్రాలూ, బూతు పత్రికలూ మన సంస్కృతికి అపచారం చెయ్యవు ఏవేవో రచనలు అయితే ప్రళయం తెప్పించగలవు, పాలకవర్గాన్ని బాధించగలవు

ఈ 55 కోట్ల జనసంఖ్య గల దేశంలో వున్న మధ్యతరగతి వారందరికీ, పేద ప్రజానీకానికి అంతటికీ నిజంగా వర్గచైతన్యమే వస్తే ఏం జరుగుతుంది? ఈ సినిమాలన్నీ ఎవరు చూస్తారు? ఈ పుస్తకాలూ, పత్రికలూ ఎవరు కొంటారు? వెంకటేశ్వరస్వామి లాంటి దేవుళ్ళకు లక్షలూ, కోట్లూ ఎవరిస్తారు? గుర్రప్పందాలు, లాటరీలు ఏమవుతాయి? అందుచేత వీటికి తభావతు కలగకుండా చూసుకోవడం కూడా పాలకవర్గీయులు అనుసరించే విధానాలలో ప్రముఖంగా వుంటుంది.

అయితే నేను చెప్పదలచుకున్నది వర్గచైతన్యం దగ్గిర ఆగిపోదు. పైన చెప్పిన వర్గస్వభావమూ వర్గచైతన్యమూ అన్నవి సామాజిక దృక్పథానికి ఉపోద్ఘాతం

కళాకారుడికి వర్గస్వభావం సహజంగా అలవడుతుంది వర్గచైతన్యం కష్టపడి అలవరచుకోవాలి కాని అంతటితో అతగాడు తృప్తి చెందరాదు అతడికి సమగ్రమైన సామాజికదృక్పథం కూడా అవసరం

మన కళాకారులందరూ చాలవరకు మధ్యతరగతి మధ్యపొరలకు సంబంధించిన వారు. అలాంటి కళాకారులు అచ్చంగా తమ తరగతికోసమే కళలను సృష్టించి సాంఘిక చైతన్యం పుట్టించలేరు వాళ్ళు అటువంటి ప్రయత్నం చేస్తూనే వున్నారు సాంఘిక చైతన్యం సామెతలో గొంగళిలాగ వున్న చోటనే వుంటున్నది

పురాణయుగంలో బ్రాహ్మణులు సాంఘికచైతన్యం క్షత్రియవర్గం నుంచి రావాలని తెలుసుకుని, వారిని దేవాంశసంభూతులు గానూ సాక్షాత్తూ శ్రీమన్నారాయణుడి అవతారాలుగానూ కల్పించి పురాణాలు రాసి, ఆ చేతితోనే తాము 'డప్పు' కూడా వాయించుకున్నారు. ప్రపంచం మరికొంత చిన్నదై, వర్తకవాణిజ్యాలు విస్తరించి, లక్ష్మీకటాక్షం వైశ్యుల పైన ప్రసరించాక, చితికిపోతున్న క్షత్రియవంశాల వాళ్ళు తమ కూతుళ్ళను వైశ్యోత్తముల కుమార్లకిచ్చి పెళ్ళిళ్ళు చేసినట్లు, కదాసరిత్సాగరంలో కథలు రుజువు చేస్తున్నాయి

ఈనాటి సమాజంలో విప్లవకరమైన పాత్ర నిర్వహించగలవాళ్ళు శ్రామికులు. ప్రభుత్వ యంత్రాంగం వారిని మభ్యపెట్టటానికీ, వారిలో ఏమాత్రం చైతన్యం కనిపించినా రిజర్వుపోలీసు దళాలను పంపటానికీ సిద్ధంగా వున్నది. ఈనాటి మన క్షుద్రజీవితం ముందడుగు వెయ్యటానికి అడ్డంగా వున్న శక్తులేవో, వాటిని బలపరిచేది ఎవరో, అలా బలపరిచే శక్తులను ఏయే కళలు సమర్థిస్తున్నాయో, అలాంటి శక్తులను ఏయే కళాకారులు వ్యతిరేకిస్తున్నారో, అసలు దేశం నాలుగుమూలలా ఏమేమి జరుగుతున్నదో అర్థం అయితేనే గాని ఎవరికీ సరిఅయిన సామాజిక దృక్పథం ఏర్పడదు. ఇటీవల మన దేశానికి వచ్చిన మెర్విన్‌జోన్స్ అనే రచయితతో ఒక భారతీయోత్తముడు విమానంలో ప్రయాణం చేస్తూ, దారిద్ర్యం మాట వచ్చేసరికి, 'ఈ దేశంలో దరిద్రులెవరూ లేరు - సోమరిపోతులు మాత్రమే వున్నారు' అన్నాడట. ఆ భారతీయోత్తముడికి ఎలాంటి సామాజికదృక్పథం వున్నదో జోన్స్ క్షణంలో గ్రహించాడు. విమానాలెక్కి తిరిగే భారతీయులే ఇలాంటి అంధత్వంతో బాధపడుతూంటే నిజం కప్పిపెట్టడానికీ, అబద్ధాలు ప్రచారాలు చెయ్యటానికీ కంకణం కట్టుకున్న పత్రికలద్వారా వార్తలు తెలుసుకునే మనబోటి వాళ్ళకు నిజం తెలియటం చాలా కష్టం. నిజం నిలకడమీద తెలుస్తుందంటారు కాని ఈ నిలకడ అన్నది ఈనాటి జీవితానికి విషం లాంటిది. నిలకడమీద ఆహారం పురుగులు పడి పోతుంది. తియ్యని మజ్జిగ పులుపెక్కుతుంది. అత్యవసరమైన సాంఘిక పరిణామాలు దశాబ్దాలు వాయిదా పడతాయి, గోళ్ళతో పొయ్యేదానికి గొడ్డళ్ళు చాలకుండా పోతాయి.

సామాజిక దృక్పథం లేకుండా ఏ కళా శక్తివంతం కాలేదు. అది లోపించిన కారణం చేతనే కళలు ఇంతగా విజృంభిస్తున్నా, మన సంస్కృతి అధోగతికి దిగజారి పోతున్నది. సరైన సామాజిక దృక్పథాన్ని అలవరచు కోవటానికి కళాకారులు పెద్ద తపస్సే చేయాలి, దానితో పాటు అంతులేని ఆత్మపరిశోధన కూడా చేసుకోవాలి. ఇది తప్పనిసరి.

*జమీన్‌రైతు వారపత్రిక, సాధారణ ఉగాది సంచిక, 1970 మార్చ్ -ఏప్రిల్*

# 25. కళలు - సమాజ పరిణామం

ఒక్క సాహిత్యం తప్పిస్తే మిగిలిన కళలేవీ సమాజ పరిణామం చెందటానికి దోహదం చేయలేవనిపిస్తుంది. అవి సామాజిక చైతన్యాన్ని కొంతవరకు ప్రతిబింబించగలవే గాని దానికి దోహదం చెయ్యలేవు.

మరొకటి ఏమంటే, అన్ని కళలకూ శిల్పం అవసరమే అయినా, సాహిత్యం కొన్ని యితర కళలలో శిల్పం ప్రాముఖ్యం హెచ్చుగా వున్నట్లు తోస్తుంది.

సంగీతం తీసుకోండి. పాటలు రాసే వాళ్ళుంటారు. వాళ్ళది సాహిత్య ప్రధానమైన కృషి. వీటిని పాడేవాళ్ళుంటారు. సంగీతం వినేవారికి పాడేవాళ్ళే ముఖ్యులవుతారు. వీళ్ళు స్వరపరచిన పాటలనే పాడుతారు. త్యాగరాజు, ముత్తుస్వామి దీక్షితులు, శ్యామశాస్త్రి కట్టిన పాటలను గాయకులు యిన్నాళ్ళు పాడుతున్నారు ఇకముందు పాడుతారు. పాడడంలో తీరు ప్రజ్ఞ చూపించటంలోనే గాయకుల మధ్య తేడాలు గమనిస్తాం.

కృతి ఎంత ప్రాముఖ్యమవుతుంటే, దానికి అర్థం తెలియనివాళ్ళు పాడినా, వినేవారికి అది ఏ భాషో తెలియకుండా పాడినా కూడా, గాయకుడు ఉత్తమ తరగతికి చెందినవాడనిపించుకోవటానికి అడ్డమేమీ లేదు.

కృతి అప్రధానం అయిపోవటం మరొక విషయం కూడా మనం గమనించవచ్చు. మన సంప్రదాయసంగీతమంతా చాలావరకు భగవంతుణ్ణి ఆశ్రయించినది. త్యాగరాజు గారికి రాముడు అభిమానదైవం. కాని ఈనాడు సంప్రదాయ సంగీతం విని ఆనందించటానికి మనం భక్తులం కానవసరం లేదు. పచ్చి నాస్తికులం కూడా కావచ్చు. భక్తి ఒక సామాజిక శక్తిగా వుండటం మానినా ఈ కృతులు చలామణిలో వుంటున్నాయి. అంటే ఏమిటి? సామాజిక పరిణామ లక్షణాలు కృతులలో కనబడటం లేదు.

ఔత్తరాహిక సంగీతంలోనూ యిదే మనకు కనబడుతుంది. ఇస్లాము మతస్థులైన గవయ్యాలు రాధాకృష్ణ ప్రణయగీతాలు పాడేస్తారు. ఔత్తరాహిక సంగీతానికి పుష్టివచ్చిన కాలంలో ఎలాటి గేయాలుండేవో అలాటివే ఆ సంగీతానికి ఈనాడు కూడా ఆధారంగా వుంటున్నాయి. ఉత్తరహిందూస్తానంలో సాహిత్య సంస్కృతి మారిపోయిది. కాని హిందూస్తానీ సంగీతానికి ఆధారంగా వున్న సాహిత్యం మార్పులేకుండా నిలిచివున్నది. అందులో సామాజిక పరిణామం ప్రతిబింబించటం లేదు.

(పైన చెప్పిన పరిణామరాహిత్యం అచ్చంగా పాతకాలపు పాటలకే వర్తిస్తుందనుకోనవసరం లేదు. కొత్త కొత్త వాగ్గేయకారులు రాస్తూనే వున్నారు. కాని వారు సృష్టించే వాగ్గేయాలు అనాదిగా వున్న సంప్రదాయానికి చెందినవే గాని ఈ కాలపు సాహిత్యాన్ని అనుసరించటం లేదు)

సంప్రదాయ సంగీతానికి ఆధారభూతంగా వున్న సాహిత్యంకన్న ఈ కాలపు సినిమాపాటలు ఆధునిక సాహిత్యానికి చాల దగ్గరగా వున్నాయి అవి కూడా సంగీతంతో కూడినవే అయితే సినిమా సంగీత కళకు సరి అయిన పునాది లేక నీరసంగా వుంటున్నది ఇందుకు కారణం సంప్రదాయ సంగీతంలోని బలాన్ని ఉపయుక్తమైన విధానాలనూ సినిమా సంగీతం ఉపయోగపరచక పోవటమే దీనికి భిన్నంగా కొన్ని మంచి సినిమాపాటలు వచ్చిన మాట నిజమే సినిమా సంగీతదర్శకులలో చాలా సమర్థులున్నారు కాని అల్పజ్ఞులు వారితో పోటీ చేయగలగటం అంత మంచి లక్షణం కాదు

ఏమైనప్పటికీ సినిమా సంగీతం కొంతవరకు ఈకాలపు ప్రజల సంగీత ప్రియత్వాన్ని ప్రతిబింబిస్తున్నదని చెప్పవచ్చు గాని, సామాజిక చైతన్యాన్ని పెంపొందించే శక్తి దానికి అణుమాత్రం కూడా లేదు

అలాటిదే నాట్యకళ నటనకు మూలాధారమైన నాటకం సాహిత్యప్రక్రియే. రాసిన నాటకాన్ని ప్రదర్శించే నటులు తమ నటనాసామర్థ్యాన్ని వెల్లడించగలరే తప్ప తామై ప్రేక్షకులలో చైతన్యం కలిగించలేరు. నటులలో హెచ్చుతగ్గులను మనం వారిలోగల ఈ శక్తి ద్వారా నిర్ణయిస్తాం నాటకంలో వుండే భావచైతన్యాన్ని ఎంత హెచ్చుగా వెలువరించి ప్రదర్శించగలవాడు అంత మంచి నటుడు.

సాహిత్యానికి సంబంధించినంతవరకు కీర్తనలకన్న నాటకాలు ఆధునికంగా వుండటానికి కృషిచేసి హెచ్చు విజయం సాధించగలుగుతున్నాయి అభ్యుదయ నాటకాలలో పాత్రలు ధరించి విజయం సాధించిన నటులను మనం అభ్యుదయ నటులుగా ఆమోదించటానికి కూడా ఆత్రపడుతున్నాం. మరోరోజు అదే నటుణ్ణి ఏ పురాణ నాటకంలోనో చూసేసరికి మనకు జుగుప్స కూడా కలగవచ్చు

నాటకాల దగ్గిరికి వచ్చేసరికి ఒక విచిత్రమైన విషయం మనకు స్పష్టమవుతుంది. సాహిత్యమూ, రాజకీయాలూ, నాట్యకళా వీటిసరిహద్దులు యిక్కడ ఏకమవుతాయి. అభ్యుదయ నాటకకర్త అన్నమాట పుట్టినంత సులువుగా అభ్యుదయ నటుడు, లేక నటి అన్నమాట పుడుతుంది. నాటకకర్తలలో ఆశించే నాటక చైతన్యాన్నే ప్రేక్షకులు (ప్రజలు) నటుడిలోనూ ఆశిస్తారు (అభ్యుదయ గాయకుడు అనేమాట అభ్యుదయ కవి అన్నమాట లాగా పుట్టటం సాధ్యం కాదు).

అయినప్పటికీ న్యాయానికి నాట్యకళ అన్నది సాంఘిక చైతన్యంతో కూడినది కాదు. అది కేవలమూ ఒకశిల్పం. ఆ శిల్పి సాంఘిక చైతన్యం కూడా కలవాడైనప్పుడు పార్టిజాన్‌గా మారుతున్నాడు. అభ్యుదయ నటుడికి రెండు ఆశయాలు· నటనలో ప్రతిభ చూపించటమూ, తన ప్రతిభను సాంఘికాభివృద్ధికే అంకితం చేయటమూనూ. మొదటి ఆశయమంత మార్పులేనిది కాదు రెండో ఆశయం.

ఈ వైరుధ్యాన్ని సినిమాలు మరింత స్పష్టంగా చూపటమే గాక, యితర శిల్పాల ప్రభావం వల్ల నటుడి కళకు ప్రాముఖ్యం కూడా తగ్గిపోయింది. సమర్థుడైన డైరెక్టరు ప్రాణంలేని పదార్థం చేత 'నటింప' జేయునప్పు (కట్పీస్లు) స్టేజీమీదకు రావటానికి ఏమీ అర్హతలు లేనివాళ్ళు కూడా సినిమాలలో నటులుగా రాణించే అవకాశం వున్నది.

నృత్యం సంగతి వేరే చెప్పక్కర్లేదు. శాస్త్రీయ సంగీతం లాగే అది కూడా ఎంతో కాలంగా మారలేదు. అందుచేత అది కూడా ఒక శిల్పంగానే మిగిలిపోయింది. నటన ఆధునికమయింది కాని అభినయం ఆధునికం కాలేదు. అభినయంలోకి నటన లక్షణాలను ప్రవేశపెట్టటానికి కొందరు చూస్తున్నారు. కాని అది నప్పటం లేదు.

నృత్యసంగీతాలు శిల్పప్రధానాలు కావటానికి యింకొక కారణం కూడా వున్నదేమో. సాహిత్యంతో ఎలాంటి సంబంధమూ లేకుండా, భావానికి స్థానం లేకుండా కొన్ని ప్రక్రియలు ఈ రెండు కళలలోను వుంటున్నాయి. సంగీతంలో ఆలాపన, తాళం, పల్లవి అనేవి యిటువంటివే. స్వరకల్పన కూడా అటువంటిదే. పాట కచేరీలలో వీటికి గొప్పస్థానం వున్నది.

అలాగే నృత్యంలోనూ పల్లవికి నృత్యం చెయ్యటం వున్నది. పల్లవిలో స్వరం మాత్రమే వుండొచ్చు. సాహిత్యం ప్రమేయం లేకుండా లయవిన్యాసాలతో కూడిన నృత్యం వున్నది.

నృత్యగాన కళలలో వున్న విశేషమేమంటే వీటిని సాహిత్యంతో సంబంధం లేకుండా ప్రదర్శించవచ్చు! సాహిత్యం వున్నప్పటికీ దానికి విలువ వుండటం లేదు.

చిత్రకళ, సాహిత్యం లాగే, చాలా మార్పులు చెందింది. కాని ఈ మార్పులన్నీ శిల్పానికి సంబంధించినవే చాలావరకు. కొద్దిమంది చిత్రకారులే 'వస్తువు'కు ప్రాముఖ్యం యిచ్చారు. చాలామంది చిత్రకారులు పురాణయుగాన్ని వదిలి రాలేదు. కొందరు బుద్ధుడి చుట్టూ తారట్లాడారు. అజంతా చిత్రాలు ఒక పెద్ద జంక్షన్. మరి కొందరు 'ఆధునికత' కోసం పాలాలనూ, మీదికి వెళ్ళి రైతుకూలీలనూ, రవికెలు లేకుండా వారి భార్యలనూ గూట్లో ప్రమిద దీపాలనూ, నెత్తిన గడ్డిమోపులనూ, ఆవులనూ, దూడలనూ, గుడిసెలనూ చాలా అందంగా చిత్రించారు. నిజానికి ఆ నిరుపేదల జీవితంలో మృగ్యమైనదే అందం. 'పాస్టరల్ బ్యూటీ' అన్నది ఈనాటిది కాదు.

కొద్దిమంది అభ్యుదయ చిత్రకారులు డొక్కలంటుకపోయిన వాళ్ళనూ, బిచ్చగాళ్ళనూ చిత్రించయత్నించారు. కాని ఈ అభ్యుదయ చిత్రకళకు ప్రత్యేకమైన గణన గాని ప్రజాదరణ గాని లభించినట్టు కనబడలేదు. అలా కాకుండా కొంత పబ్లిసిటీ సంపాదించుకున్న నైరూప్యచిత్రకళ పచ్చి శిల్పం – టెక్నిక్.

ఇదంతా చూస్తుంటే మనం ఈనాటి జీవితం కళలలో ప్రతిబింబించటం గాని, కళల నుంచి ఉత్తేజం పొందటం గాని జరగటం లేదనిపిస్తుంది. 'విరాగిణి' బొమ్మలను

వారపత్రికలలో ప్రకటించే ఆటకాయలు గాని, స్త్రీజీవుని '[illegible]' ఆడేవాళ్ళు గాని, 'కోటల' నృత్యాలు చేసేవాళ్ళు గాని రేడియోలో 'మూనాడి' పాడుతు గేయాలు ప్రచారం చేసేవాళ్ళు గాని [illegible] కనబడరు ఎన్నాదగితే యిలాంటి జీవితం చాలా శోచనీయమనిపించాలి

[illegible]

## 26. సామాన్యుడు కోరే చిత్రకళ

సామాన్యుడంటే మరెవరో కాదు, నేనే చిత్రకళకు సంబంధించినంత వరకు నేను అతి సామాన్యులలో సామాన్యుణ్ణి ప్రతి కళారంగానికీ చెందిన 'పామరులు' వున్నారు అక్షరాస్యత వుండి కూడా పుస్తకాల నుంచి - అంటే మంచి సాహిత్యం నుంచి గ్రహించవలసినదంతా గ్రహించలేని వాళ్ళు వుంటారు నేను ఒకప్పుడు ఉన్నవ వారి 'మాలపల్లి' మీద రేడియోలో ప్రసంగం చేస్తే ఒక పెద్దమనిషి, సాహిత్యాభిలాష గల వాడు, ''నేను 'మాలపల్లి' ఆరేడుసార్లు చదివాను, కాని మీరు చెప్పిన అంశాలు ఏవీ నేను గమనించలేదు'' అన్నాడు. ''మరోసారి చదవండి. 'మాలపల్లి' లో నేను చెప్పిన అంశాలన్నీ వున్నాయి'' అన్నాను నేను గమనించనివి అందులో ఎన్ని వున్నాయో!

సాహిత్య పామరత్వం ప్రతివారిలోనూ ఏదోశాతం వుంటుంది. అలాటిదే సంగీత పామరత్వం అలాటిదే చిత్రకళా పామరత్వం నాటక పామరత్వం, నృత్యపామరత్వం వగైరాలను మనం ఊహించవచ్చు. సినిమా పరిశ్రమ ప్రజా సామాన్యంలో వుండే పామరత్వాలను ఆధారం చేసుకుని విజృంభిస్తున్నది. సామాన్య ప్రజలకు ఏ కళను గురించీ గుణాగుణ విచక్షణ లేని కారణం చేత నటులూ, గాయనులూ, గేయకారులూ, కళాకారులూ కొంతమంది అయినా తమకున్న ప్రతిభకు మించి కీర్తి ప్రతిష్ఠలూ, డబ్బూ గడించుకోగలుగుతున్నారు. ఆ విషయం వదిలేద్దాం

నాగరికయుగంలో ప్రతి ఒక్కడికీ అన్ని కళల ప్రయోజనమూ సిద్ధించి తీరాలన్నది సిద్ధాంతం కాని వారిలో వుండే పామరత్వం అందుకు అడ్డొచ్చే మాట వాస్తవం. దానికి విరుగుడు ఏమిటి? విమర్శ- తాను ఏ కళలో అయితే విమర్శకుడుగా ముందుకు వస్తాడో వాడికి ఆ కళకు సంబంధించిన పామరత్వం ఏమీ వుండకూడదు. ఇది సిద్ధాంతమే అయితే అలాటి విమర్శకులున్నారనుకోవటం ఒక భ్రమ అవుతుంది. దానికి కూడా విరుగుడున్నది - విమర్శకుల మీద విమర్శ - 'విజయవిలాసం' లో సొంపులు అనేకమందికి అర్థం కాకపోవచ్చు కాని తాపీవారి వ్యాఖ్య చదివిన మీదట అది

మరింత బాగా అర్థమవుతుంది అది సమగ్రంగా వున్నదనో, తప్పుగా వున్నదనో అనుకున్న వారు ఆ వ్యాఖ్యను విమర్శిస్తే 'విజయవిలాసం' ప్రయోజనం మరింత సిద్ధిస్తుంది

అంటే ఏమిటి? ఏ కళ ప్రజలలో ప్రచారమై దాని ప్రయోజనాన్ని సాధించాలన్నా, ప్రజలలో పామరత్వాన్ని పోగొట్టి కళాభిరుచులను పెంపొందించే విమర్శలు చాలా అవసరం వాటి సహాయంతోనే ప్రజలు తమ పామరత్వాన్ని అధిగమించి కళల పట్ల పూర్తి ప్రయోజనాన్ని సాధించగలుగుతారు. (సినిమాలు తీసేవాళ్ళు విమర్శలను ఎందుకు సహించరో ఒక చిత్రాన్ని తీవ్రంగా విమర్శించినా మిగిలిన ప్రొడ్యూసర్లూ, డిస్ట్రిబ్యూటర్లూ ప్రకటనలు ఎందుకు బిగిస్తారో మనం సులువుగా ఊహించుకోవచ్చు. సినిమాలు ప్రేక్షకుల పామరత్వాన్ని ఆశ్రయించుకున్నటువంటివి).

నాకు నాగరిక మానవుడుగా అన్ని కళలనూ ఆస్వాదించాలన్న ఆశ వున్నది. మిగతా అన్ని కళలనూ ఆనందించేటందుకు తగిన మేరకు నా పామరత్వాన్ని సంస్కరించుకున్నాను సొంతం పోగొట్టుకోలేదనుకోండి సొంతం పోగొట్టుకోవటం చాలా కష్టం దానికి ఉద్దండులైన విమర్శకుల సహాయం కావాలి.

ఒక్క చిత్రకళ విషయంలో నేను పాతరాతియుగం దాటి ముందుకు రాలేకుండా వున్నాను చాలామందిని సహాయం అడిగాను వాళ్ళకు చెప్పటం చేతకాలేదో, నాకు వాళ్ళు చెప్పినది అర్థం కాలేదో తెలీదు. నేను ఒక్క అడుగు ముందుకు వెయ్యలేదు.

''చిత్రకళను ఆస్వాదించటానికి కూడా కొంత శిక్షణ అవసరం. ఈనాటి చిత్రకళ స్వభావసిద్ధంగా అందరికీ అర్థం అయేది కాదు'', అన్నాడు హెబ్బార్

కావచ్చు సంగీతం అలాటిదే. కాని చిత్రకళాస్వాదనకు ఉపకరించే శిక్షణ ఎక్కడ, ఏ విధంగా దొరుకుతుంది. సంగీతం వినగా వినగా అర్థమైనట్టు ఒక అపోహ కలుగుతుంది. బొమ్మలు చూడగా చూడగా అలాటి అపోహే కలుగుతుందా? అదే ఒక అభిరుచి అని తృప్తి పెట్టుకోవచ్చు. కాని చిత్రకళను చూస్తున్న కొద్దీ ఉన్న మతి కూడా పోతున్నది పాశ్చాత్యదేశాలలో కళాప్రదర్శనల పుకార్లు వింటుంటే యింకా మతిపోతున్నది. చిత్రకళా ప్రదర్శనలను గురించి కార్టూన్లు చూస్తూ వుంటే ఇవాళ చిత్రకళ అనే ఒక వాస్తవమైన కళ వున్నదా అన్న అనుమానం కూడా కలుగుతున్నది. శంకరాచార్ల వారి మాయావాదం చిత్రకళను ఆవహించిందా అనిపిస్తున్నది.

ఒక చిత్రకళా ప్రదర్శనంలో ఒక శిల్పి ఒక కాంస్యశిల్పాన్ని ప్రదర్శించి దానికి ఇటాలియన్ భాషలో ఏదో పేరుపెట్టాడు దాన్ని పత్రికలు తెగపొగిడాయి. అందులో అద్భుతభావాలు భావుకులకు (విమర్శకులకు) కనిపించాయి తీరా ఇటాలియన్ భాష తెలిసినవాడు వచ్చి, ఆ శిల్పం పేరు 'ఏనుగు -- అని చెప్పాట్ట! ఇది కార్టూను జోక్ కాదు నేనా శిల్పం తాలూకు ఫోటో చూసాను

పిల్లిని రంగులలో నడిపించి, దానిచేత కాగితం మీద తొక్కించి, కుక్కతోకకు రంగులు పూసి వాటిని కాగితం మీద పులిమించి తయారు చేసిన చిత్రాలకు మొదటి బహుమానాలివ్వటం నిజంగానే జరిగిందనుకుంటున్నాను

ఇదంతా పాశ్చాత్యదేశాలలో చిత్రకళ వేస్తున్న పెర్రితలలని సరిపెట్టుకుందా మనుకుంటే , నిన్నటి పాశ్చాత్య పెర్రితల ఇవాళ మనదేశంలో ప్రత్యక్షమవుతున్నది

అది అలా వుంచి, నేను మనదేశం సంగతి ప్రస్తావించవలసిన అవసరం వేరే వున్నది.

ఇతర దేశాలలో గొప్ప రచనలూ, గొప్ప సంగీతమూ, గొప్ప సినిమాలూ, గొప్ప చిత్రాలూ వుండడం సహజం వాటినుంచి నేను చైతన్యం పొందలేకపోతే విచారించను. వాళ్ళ సమాజం వేరు అక్కడి సంప్రదాయాలు వేరు, జీవిత దృక్పథాలు వేరు ఒక తెలుగువాడు రాసిన పుస్తకమో, చేసిన పాట కచేరీయో, తీసిన సినిమానో, వేసిన బొమ్మో నాలో ఎలాంటి చైతన్యమూ తెప్పించలేనప్పుడు నేను కంగారుపడిపోతాను ''ఎందుకిది?'' అన్న ప్రశ్న అప్రయత్నంగా నా బుర్రలో తల ఎత్తుతుంది

కళలు సామాజిక స్వభావం గల అనుభవాలు. వాటికి వుండవలసిన అనుభవం మాట అలా వుంచినా, ఒక జాతి యొక్క కళలు ఆ జాతియొక్క జీవశక్తినీ, చైతన్యాన్నీ, సంస్కృతినీ, గమనాన్నీ ప్రతిబింబించాలి. నేను ఎడాపెడా కథలు రాస్తున్నప్పుడు – దాదాపు 35 ఏళ్ళ క్రితం – ''నేను రాస్తున్న కథలు తెలుగువాడు తప్ప మరెవడూ రాయటానికి వీలులేనివేనా?'' అన్న ప్రశ్న నన్ను బాధించసాగింది. 'తాతయ్య' అన్న కథ రాసినదాకా నాకు నిజమైన తెలుగుకథ రాసిన తృప్తి లేకపోయింది. ఏ కళలో సాధనచేసేవాడికైనా అలాంటి ప్రశ్న ఎదురుకావలసిందే గదా అని నా ఆలోచన.

కళాకారుడు సంఘజీవి రాబిన్సన్ క్రూసోకు కళలతో పని లేదు. ఒక కళాకారుడికి కనీసం ఒక పాఠకుడు, లేక ఒక ప్రేక్షకుడు, లేక ఒక శ్రోత తప్పనిసరిగా వుండాలను కోవటంలో తప్పు లేదనుకుంటాను సంఘంలో ఎంత ఎక్కువమంది కోసం కళలు సృష్టిస్తే అంత మంచిదన్నది కూడా నిరాక్షేపణీయమేగద.

సామాజికులందరి కోసమూ కళలను సృష్టించటం వర్గసమాజంలో సాధ్యం కాకపోవచ్చు వర్గాలమధ్యవైరుధ్యం మాట అటుంచినా అనుభవాలలోనూ, దృక్పథాల లోనూ, ఆశయాలలోనూ భిన్నత్వం ఒకటి స్పష్టంగా వున్నది జీవిత సమస్యలు కూడా వర్గానికీ, వర్గానికీ వేరుగా వున్నాయి అత్యున్నత వర్గాల కళాతృష్ణలో నాకు చాలాకాలంగా విశ్వాసం పోయింది వాళ్ళు పాటకచ్చేరీకి వచ్చి, గాయకుడి చేత నమస్కారం పెట్టించుకుని, అరగంట కూర్చుని అర్ధంతరంగా వెళ్ళిపోవటం చూశాను. వాళ్ళు గొప్పరచనలు అనుకునేవి ఏవో నాకు తెలుసును. వాళ్ళు (చాలా అరుదుగా) బొమ్మలు డబ్బుపెట్టి కొన్నప్పుడు వాళ్ళు అందులో వున్న కళావైభవానికి ముగ్ధులై కొన్నారని నేను నమ్మలేను

మరింత బాగా అర్థమవుతుంది అది సమగ్రంగా వున్నదనో, తప్పుగా వున్నదనో అనుకున్న వారు ఆ వ్యాఖ్యను విమర్శిస్తే 'విజయవిలాసం' ప్రయోజనం మరింత సిద్ధిస్తుంది

అంటే ఏమిటి? ఏ కళ ప్రజలలో ప్రచారమై దాని ప్రయోజనాన్ని సాధించాలన్నా, ప్రజలలో పామరత్వాన్ని పోగొట్టి కళాభిరుచులను పెంపొందించే విమర్శలు చాలా అవసరం వాటి సహాయంతోనే ప్రజలు తమ పామరత్వాన్ని అధిగమించి కళల పట్ల పూర్తి ప్రయోజనాన్ని సాధించగలుగుతారు. (సినిమాలు తీసేవాళ్ళు విమర్శలను ఎందుకు సహించరో ఒక చిత్రాన్ని తీవ్రంగా విమర్శించినా మిగిలిన ప్రొడ్యూసర్లూ, డిస్ట్రిబ్యూటర్లూ ప్రకటనలు ఎందుకు బిగిస్తారో మనం సులువుగా ఊహించుకోవచ్చు సినిమాలు ప్రేక్షకుల పామరత్వాన్ని ఆశ్రయించుకున్నటువంటివి).

నాకు నాగరిక మానవుడుగా అన్ని కళలనూ ఆస్వాదించాలన్న ఆస్థ వున్నది మిగతా అన్ని కళలనూ ఆనందించేటందుకు తగిన మేరకు నా పామరత్వాన్ని సంస్కరించుకున్నాను సొంతం పోగొట్టుకోలేదనుకోండి సొంతం పోగొట్టుకోవటం చాలా కష్టం. దానికి ఉద్దండులైన విమర్శకుల సహాయం కావాలి

ఒక్క చిత్రకళ విషయంలో నేను పాతరాతియుగం దాటి ముందుకు రాలేకుండా వున్నాను చాలామందిని సహాయం అడిగాను. వాళ్ళకు చెప్పటం చేతకాలేదో, నాకు వాళ్ళు చెప్పినది అర్థం కాలేదో తెలీదు. నేను ఒక్క అడుగు ముందుకు వెయ్యలేదు

''చిత్రకళను ఆస్వాదించటానికి కూడా కొంత శిక్షణ అవసరం ఈనాటి చిత్రకళ స్వభావసిద్ధంగా అందరికీ అర్థం అయేది కాదు'', అన్నాడు హెబ్బార్.

కావచ్చు సంగీతం అలాటిదే కాని చిత్రకళాస్వాదనకు ఉపకరించే శిక్షణ ఎక్కడ, ఏ విధంగా దొరుకుతుంది సంగీతం వినగా వినగా అర్థమైనట్టు ఒక అపోహ కలుగుతుంది బొమ్మలు చూడగా చూడగా అలాటి అపోహే కలుగుతుందా? అదే ఒక అభిరుచి అని తృప్తి పెట్టుకోవచ్చు. కాని చిత్రకళను చూస్తున్న కొద్దీ ఉన్న మతి కూడా పోతున్నది. పాశ్చాత్యదేశాలలో కళాప్రదర్శనల పుకార్లు వింటుంటే యింకా మతిపోతున్నది. చిత్రకళా ప్రదర్శనలను గురించి కార్టూన్లు చూస్తూ వుంటే ఇవాళ చిత్రకళ అనే ఒక వాస్తవమైన కళ వున్నదా అన్న అనుమానం కూడా కలుగుతున్నది. శంకరాచార్యుల వారి మాయావాదం చిత్రకళను ఆవహించిందా అనిపిస్తున్నది.

ఒక చిత్రకళా ప్రదర్శనంలో ఒక శిల్పి ఒక కాంస్యశిల్పాన్ని ప్రదర్శించి దానికి ఇటాలియన్ భాషలో ఏదో పేరుపెట్టాడు. దాన్ని పత్రికలు తెగపొగిడాయి. అందులో అద్భుతభావాలు భావుకులకు (విమర్శకులకు) కనిపించాయి. తీరా ఇటాలియన్ భాష తెలిసినవాడు వచ్చి, ఆ శిల్పం పేరు 'ఏనుగు ... అని చెప్పాట్ట! ఇది కార్టూను జోక్ కాదు. నేనా శిల్పం తాలూకు ఫోటో చూశాను

పిల్లిని రంగులలో నడిపించి, దానిచేత కాగితం మీద తొక్కించీ, కుక్కతోకకు రంగులు పూసి వాటిని కాగితం మీద పులిమించీ తయారు చేసిన చిత్రాలకు మొదటి బహుమానాలివ్వటం నిజంగానే జరిగిందనుకుంటున్నాను

ఇదంతా పాశ్చాత్యదేశాలలో చిత్రకళ వేస్తున్న వెర్రితలలని సరిపెట్టుకుందా మనుకుంటే , నిస్సారమైన పాశ్చాత్య వెర్రితల ఇవాళ మనదేశంలో ప్రత్యక్షమవుతున్నది

అది అలా వుంచి, నేను మనదేశం సంగతి ప్రస్తావించవలసిన అవసరం వేరే వున్నది

ఇతర దేశాలలో గొప్ప రచనలూ, గొప్ప సంగీతమూ, గొప్ప సినిమాలూ, గొప్ప చిత్రాలూ వుండడం సహజం. వాటినుంచి నేను చైతన్యం పొందలేకపోతే విచారించను. వాళ్ళ సమాజం వేరు అక్కడి సంప్రదాయాలు వేరు, జీవిత దృక్పథాలు వేరు. ఒక తెలుగువాడు రాసిన పుస్తకమో, చేసిన పాట కచేరీయో, తీసిన సినిమానో, వేసిన బొమ్మో నాలో ఎలాంటి చైతన్యమూ తెప్పించలేనప్పుడు నేను కంగారుపడిపోతాను ''ఎందుకిది?'' అన్న ప్రశ్న అప్రయత్నంగా నా బుర్రలో తల ఎత్తుతుంది.

కళలు సామాజిక స్వభావం గల అనుభవాలు వాటికి వుండవలసిన అనుభవం మాట అలా వుంచినా, ఒక జాతి యొక్క కళలు ఆ జాతియొక్క జీవశక్తినీ, చైతన్యాన్నీ, సంస్కృతినీ, గమనాన్నీ ప్రతిబింబించాలి నేను ఎడాపెడా కథలు రాస్తున్నప్పుడు - దాదాపు 35 ఏళ్ళ క్రితం - ''నేను రాస్తున్న కథలు తెలుగువాడు తప్ప మరెవడూ రాయటానికి వీలులేనివేనా?'' అన్న ప్రశ్న నన్ను బాధించసాగింది 'తాతయ్య' అన్న కథ రాసినదాకా నాకు నిజమైన తెలుగుకథ రాసిన తృప్తి లేకపోయింది ఏ కళలో సాధనచేసేవాడికైనా అలాంటి ప్రశ్న ఎదురుకావలసిందే గదా అని నా ఆలోచన.

కళాకారుడు సంఘజీవి రాబిన్సన్ క్రూసోకు కళలతో పని లేదు. ఒక కళాకారుడికి కనీసం ఒక పాఠకుడు, లేక ఒక ప్రేక్షకుడు, లేక ఒక శ్రోత తప్పనిసరిగా వుండాలను కోవటంలో తప్పు లేదనుకుంటాను సంఘంలో ఎంత ఎక్కువమంది కోసం కళలు సృష్టిస్తే అంత మంచిదన్నది కూడా నిరాక్షేపణీయమేగద.

సామాజికులందరి కోసమూ కళలను సృష్టించటం వర్గసమాజంలో సాధ్యం కాకపోవచ్చు వర్గాలమధ్య వైరుధ్యం మాట అటుంచినా అనుభవాలలోనూ, దృక్పథాల లోనూ, ఆశయాలలోనూ భిన్నత్వం ఒకటి స్పష్టంగా వున్నది. జీవిత సమస్యలు కూడా వర్గానికీ, వర్గానికీ వేరుగా వున్నాయి. అత్యున్నత వర్గాల కళాతృష్ణలో నాకు చాలాకాలంగా విశ్వాసం పోయింది వాళ్ళు పాటకచ్చేరీకి వచ్చి, గాయకుడి చేత నమస్కారం పెట్టించుకుని, అరగంట కూర్చుని అర్జంటుగా వెళ్ళిపోవటం చూశాను. వాళ్ళు గొప్పరచనలు అనుకునేవి ఏవో నాకు తెలుసును. వాళ్ళు (చాలా అరుదుగా) బొమ్మలు డబ్బుపెట్టి కొన్నప్పుడు వాళ్ళు అందులో వున్న కళావైభవానికి ముగ్ధులై కొన్నారని నేను నమ్మలేను.

(సందర్భం వచ్చింది గనక చిత్ర-కళయా సంబంధించిన అభిప్రాయం చెప్తాను సాధారణంగా వస్తువుల్ని తెలియనివాళ్ళు ఏ వస్తువుకోసమైనా మార్కెట్‌కి వెళ్ళి పేరుపేరు కంపెనీల [illegible] వస్తువు [illegible] వస్తువు లనుకొంటుంటారు, తాము తమ ఆదాయాలకు తగిన ధరలో ఆ వస్తువు కొంటుంటారు జరుగుతుంది ఇదొక తలకిందుల సంస్కారం కూడా. వినియోగదారుల్ని ఆకర్షిస్తే కొనుగోలు వస్తువులకు ఏజెంట్లు వుంటారు. వాళ్ళు మన 'సౌందర్యాన్ని' వినియోగపరుచుకుంటారు. ఈ తలకిందుల సంస్కృతి కళవిషయంలో కూడా వున్నది ఏ బొమ్మ ఎంత హెచ్చుధరకు అమ్ముడైతే అంత గొప్ప కళాఖండం ఏ సినిమా చిత్రం ఎక్కువగా జనాన్ని ఆకర్షిస్తే అంత మహత్తరచిత్రం ఈ తలకిందులు సంస్కృతితో నాకు పనిలేదు )

పోతే ఈనాడు కళాతృష్ణ అంతో ఇంతో మధ్యతరగతిలో వున్నది. వాళ్ళే డబ్బు వెచ్చించి నిజంగా మంచిపుస్తకం అని నమ్మినదాన్ని కొని చదువుతారు బాగుంటే మళ్ళీ మళ్ళీ చదివి, అందులో తమకు పనికివచ్చే భావాలు సొంతం చేసుకున్న దాకా వదలరు (ఒక యువకుడు శ్రీశ్రీ రాసిన కవిత్వమంతా తనకు కంఠస్థమని చెప్పాడు) అలాగే వాళ్ళు తమకిష్టమైన గాయకుడి పాట వినటానికి ఎగబడి టిక్కెట్లు కొని, పాట బాగుంటే అందరికన్న ముందే వాళ్ళు చప్పట్లు కొడతారు (ముందు కుర్చీలలో వాళ్ళు చప్పట్లు కొట్టడం IPSEDIXIT [1])

మన మధ్యతరగతి వాళ్ళను చిత్రకళ ద్వారా ఉత్తేజపరచటానికి మన ప్రముఖ కళాకారులు ఏం చేస్తున్నారో నాకు తెలుసుకోవాలని వున్నది మధ్యతరగతి జీవితం ఘర్షణలమయం ఈ ఘర్షణల తాలూకు వాస్తవం ఏ విధంగా మన చిత్రాలలో ప్రతిబింబిస్తున్నది? కళాకారుల నుంచి మధ్యతరగతి వాళ్ళు ఎలాటి బలం పొందుతున్నారు? వెలువడే చిత్రాలను గురించి విమర్శలు ఎక్కడ వెలువడుతున్నాయి? ఈ ప్రశ్నలు నేను సవాళ్ళుగా వేస్తున్నాననుకోవద్దు తెలుసుకునేటందుకే అడుగుతున్నాను.

మధ్యతరగతి చిత్రకళాభిరుచి చాలా నీరస స్థితిలో వున్నదని ఒప్పుకుంటాను వారపత్రికల ముఖచిత్రాలను ప్రశంసిస్తూ వచ్చే పాఠకుల లేఖలే అందుకు తార్కాణం నేనా పాఠకులను తప్పుపట్టను. వారిలో వున్న సౌందర్యపిపాస ఆ ముఖచిత్రాలలో తీరుతున్నది. వారి అభిరుచి అలాటి సౌందర్యపిపాసను అధిగమించి పైకి వెళ్ళకపోతే అది వాళ్ళ తప్పు కాదు దేశంలో కోట్లాది ప్రజల కళాపిపాస చాలా తక్కువరకం సినిమా సంగీతంతో తృప్తి పడుతున్నది

అభిరుచి అనేది అవకాశం వుంటే పెరుగుతుంది. చిన్నతనంలో సినిమాపాటలు తప్ప విననివాళ్ళు అవకాశం వుంటే సంప్రదాయసంగీతం విని ఆనందించేస్థితికి వస్తారు. ప్రజల అభిరుచి తక్కువస్థాయిలో వున్నందుకు తప్పుపట్టటం అవివేకం చిత్రకళలో

ఎదిగి పెరగాలంటే దానికి చిత్రకారులూ చిత్రకళా విమర్శకులూ కృషిచెయ్యాలి అలాంటి కృషి జరుగుతున్నదా

[illegible]
కనీసం రెండురకాల చిత్రాలుంటాయి కొన్ని రేఖాచిత్రాలు - చిరిపాణి 'నిరీక్షణ', 'వెలుపుకు' ఇగ్గిరా పేర్లుగలవి ఇవి చిత్రకళా సమన్వితమైనవే కావచ్చు కాని సంఘజీవుల దృక్పథం నుంచి పుట్టి వచ్చినవి కావు

రెండోరకం చిత్రాలు కార్టూన్లు వీటిలో హాస్యం ప్రధానమైనప్పటికీ సమకాలిక జీవిత విమర్శ చాలా వుంటున్నది ఈనాటి సాంఘిక చైతన్యం వీటిలో వున్నంతగా మరేరకం చిత్రకళలోనూ వున్నట్టు నాకు తోచదు ఈ కార్టూనులలో కొన్నిటికి రేఖా సౌష్టవం కూడా వుండదు కాని ఇవి వాటి ప్రయోజనాన్ని సాహిత్యం సాధించినంత చక్కగా సాధిస్తున్నాయి వాటి ధాటికి గురి అయే సాంఘిక విలువలు దెబ్బతినక తప్పదనిపిస్తుంది

ఇప్పుడు చెలామణీ చిత్రకళారూపాలన్నిటిలోకీ కార్టూనులు అత్యంత ప్రయోజనకరంగా వుండటం ప్రసిద్ధులనబడే చిత్రకారుల కీర్తికి నిజంగా కళంకమే ఒక చిత్రకారుణ్ణి మిగిలిన చిత్రకారులు భళీ అన్నంతమాత్రాన ఆ చిత్రకారుడు గొప్ప సామాజికపాత్ర నిర్వహించినట్టు కాదు కవులలో లాగే ఇతర కళాకారులు కూడా ఒకరి వీపు ఒకరు తట్టుకోవటం కళా పతనాన్ని స్పష్టం చేస్తుంది ఒక కవి చుట్టూ, లేక గాయకుడి చుట్టూ, లేక నటుడి చుట్టూ సామాన్యజనం మూగినట్టు కళాకారుల చుట్టూ మూగటం మొదలు పెడితేనే గాని కళాకారుడికి సమాజంలో విశిష్టస్థానం ఏర్పడిందన్న ప్రాథమిక సత్యం రుజువు కాదు. అతడు సృష్టించిన కళ ఎలాంటిదన్నది ఆ తరువాత విచారించదగిన అంశం

కళాకారులు ఇంకా గోదాలోకి దిగలేదని నా అనుమానం. ప్రజలకూ వాళ్ళకూ మధ్య చాలా అడ్డుగోడలు వున్నట్టు కనపడుతుంది. అవి పడిపోక తప్పదు

*కళ, 1971-72 సంచిక*

---

1 తిరుగులేని తీర్పు

# 27. కళారూపాలు

మొదటి ప్రశ్న - కళారూపాలకు సామాజిక వ్యవస్థాపరంగా నామకరణం చెయ్యవచ్చునా? ఫ్యూడల్ కళలూ, బూర్జువా కళలూ, పెటీబూర్జువా కళలూ, ప్రోలిటేరియన్ కళలూ అంటూ వుంటాయా? కళలకు సంబంధించిన విషయం గురించి ఈ ప్రశ్న అనవసరం. ఎందుకంటే యిలాటి విభజన కళావస్తువులలో కొట్టవచ్చినట్టు కనిపిస్తున్నది. వర్గసమాజంలో వర్గకళల ప్రచారం మనం ప్రత్యక్షంగా చూస్తున్నాం. కాని యిలాంటి విభజన కళారూపాలకు అనువర్తింపచేయవచ్చునా?

ఇదే ప్రశ్నను ఇంకోవిధంగా వేసుకోవచ్చు '' ఈ కళా రూపం ఈ కాలానికి మాత్రమే చెందినది, ఈ రకం సామాజిక వ్యవస్థకే చెందినది, ఈ వర్గానికే చెందినది'' అని స్పష్టంగా చెప్పటానికి సాధ్యం అవుతుందా?

మనం కొంచెం ఆలోచించినట్టయితే, ఈ ప్రశ్నకు సూటిగా సమాధానం చెప్పటం కష్టమవుతుంది అందులో వున్న కష్టాన్ని స్పష్టం చెయ్యటానికి మాత్రమే ప్రస్తుతం ఈ వ్యాసం రాస్తున్నాను

ఏ తోలుబొమ్మలో, వీధినాటకాలో తీసుకుని ఈ కళారూపాలు కాలానుగుణ్యంగా అభివృద్ధి కాకపోవటమో, లేక ఆ కళారూపాలు ఆధునిక సందేశాలు అందించటానికి పనికి రాకపోవటమో, చెప్పటం అంత తేలిక కాదు

నిజానికి ఈనాటి సినిమాలు ఆధునికత సాధించిన తోలుబొమ్మలాట లనటానికి ఏమిటి అభ్యంతరం? ఒకప్పుడు తోలుబొమ్మలాటలను జనసామాన్యం ఎంతగా ఆదరించారో ఈనాడు సామాన్యప్రజలు అంతకంటె కూడా ఎక్కువగానే ఆదరిస్తున్నారు. ఇటీవల సినిమాలలో కేతిగాడు, బంగారక్క కూడా అవతరించి, సినిమాలలో 'బూతు' లేనిలోటు తీర్చేశారు.

అన్నట్టు, సినిమా ఏ వర్గానికి చెందిన కళ అందాం? ఆ కళకు ఫలానా వర్గస్వభావం వున్నదని రుజువు చెయ్యటం అసంభవం ఒక్క సినిమా మాత్రమే కాదు, ఈనాడు ప్రచారంలో వున్న ఏ వ్యాపార కళారూపానికైనా వర్గముద్ర వెయ్యటం సాధ్యం కాదు. ఈ కళలలో వర్గస్వభావం లేదా అంటే వున్నది. కాని ఆ వర్గస్వభావం విషయాన్ని బట్టి ఏర్పడుతున్నది గాని కళారూపాన్ని బట్టి ఏర్పడదు విప్లవకవిత్వమూ, విప్లవ వ్యతిరేక కవిత్వమూ ఒకే రూపంలో వుండవచ్చు. ప్రజలదృష్టిలో ఉత్తమ రచనా, అధమ రచనా కూడా ఒకే పద్ధతిలో రచించినవే. అలాగే సినిమాలూ, సినిమా పాటలూ, బొమ్మలూ వగైరాలన్నీనీ.

ఈ వాదన ఇంతటితో పరిష్కారం అయేటట్టుంటే, అంత విషయంలోనే వున్నది గాని కళారూపాలలో ఏమీ లేదు అని తేల్చిపారెయ్యొచ్చు కాని అది కూడా నిజం కాదు అందులోనే వున్నది అసలు చిక్కు

మాటవరుసకు విప్లవ కవిత్వం ఛందస్సులో రాదు కాళీపట్నం వారి కథలను ప్రబోధగేయరూపంలో ఊహించలేం రా వి శాస్త్రి గారి 'నిజం' జముకుల కథగా ప్రదర్శించటం వాంఛనీయం కాదు కొన్ని ప్రత్యక్ష కళాఖండాలను వున్న రూపంలో తప్ప మరో రూపంలో ఊహించటం సాధ్యం కాదు.

దానికి కారణం మార్క్సిస్టులందరికీ తెలిసినదే, అయినా ఇక్కడ టూకీగా చెబుతాను కళావస్తువుకూ, దాని రూపానికీ అవినాభావ వైరుధ్యం వుంటుంది. దాన్ని విజయవంతంగా పరిష్కరించిన వాడే కళాకారుడు, అలా పరిష్కృతమైన వైరుధ్యం కలదే నిజమైన కళ (ఇది అన్నివర్గాల, అన్ని రకాల కళలకూ వర్తిస్తుంది) అలాగే, ఒక నవలను నాటకరూపంలోకో, సినిమా రూపంలోకో పరివర్తన చెయ్యాలన్నప్పుడు మళ్ళీ వైరుధ్యం తల ఎత్తుతుంది దాన్ని విజయవంతంగా పరిష్కరించినప్పుడే రెండో రూపానికి కూడా విజయం లభిస్తుంది. లేకపోతే, నవల బాగుంది గాని, పిక్చరుతీసి చెడగొట్టారు'' అనో, ''ఆ నవలకూ ఈ పిక్చరుకూ సంబంధమే లేదు'' అనో మాట వస్తుంది. ఇదంతా మనం చూస్తున్నదే.

ఒకే జాతికి చెందిన అసంఖ్యాక కళారూపాలు ఆ జాతికి చెందిన సామాజిక పరిణామం ఫలితంగా వేరు వేరు దశలలో అంతరించిపోయాయన్నది నిర్వివాదం. వాటికి కాలం తీరిపోయిందనుకోవటం కూడా సహజమే. కాని కొంచెం ఆలోచించినట్టయితే కొన్ని కొన్ని రూపాలు కొన్ని చారిత్రక దశలలో అంతరించిపోవటానికి కారణం పూర్తిగా విషయంలో మార్పు కలగటం కాదేమోనని సందేహం కలుగుతుంది పురాణాలు పోయి ప్రబంధాలు వచ్చాయి అయితే పురాణాలలోని చిన్న చిన్న ఘట్టాలనే పెంచి ప్రబంధాలు రాశారు. అన్ని ప్రబంధాలకూ ఒకటే ఒరవడి! అష్టా దశ వర్ణనలూ, నాయికా నాయకుల శృంగారమూ వగైరా. Medium is the message అంటే కళారూపం ప్రధానమయింది; విషయం అప్రధానం ప్రమీలార్జునీయమైనా సరే, ప్రభావతీ ప్రద్యుమ్నమైనా సరే - అన్నింటిదీ ఒకే లక్ష్యం

ఇలా కళారూపం ప్రధానం కావటం కళల పతనాన్ని సూచిస్తుందన్న నా అనుమానం సరి అయినదైతే, కళారూపాలను గురించి అట్టే తర్జన భర్జనలు చెయ్యటం వృథా.

కొన్ని సందర్భాలలో ఒక కళారూపాన్ని అంతకన్న అభివృద్ధి చెందిన కళారూపం కొట్టెయ్యటం మనకు తెలుసు. స్టేజినాటకాలు వీధినాటకాలను కొట్టేశాయి సినిమాలు తోలుబొమ్మలను ఖచ్చితంగా కొట్టేశాయి ఆదిలో సినిమాలు నాటకాల చిత్రీకరణగా వుండేది ఆ దశలో సినిమాలు నాటకకళను పెద్దదెబ్బ తీశాయి

కృష్ణుడి పాండవోద్యోగ విజయాలకూ, చింతామణి వగైరా పాత నాటకాలకూ ఉపకారం కలిగించాయి

ఇటువంటిదే సంగీతంలో కూడా జరిగింది మన సంప్రదాయ సంగీతమంతా భక్తిమయం పాటకచేరీలలో పాడేవి 'కీర్తనలు' - వైష్ణవ సంకీర్తనలు కాని రాను రాను పాటకచేరీలలో భక్తికి ప్రాముఖ్యం లేకుండా పోయి - పాటకచేరీ చేసే విధానం ప్రాముఖ్యమయింది Medium became the message రాగాలాపనా, స్వరకల్పనా, 'లయవిన్యాసాలు' ఎంత బాగుంటే అంత మంచి పాటకచేరీ ఒక నలభై ఏళ్ళ క్రితం 'స్టేజి' సంగీతం వచ్చి సంప్రదాయ సంగీతానికి దాదాపు మంచినీళ్ళు పుట్టకుండా చేసింది స్టేజి పాటగాళ్ళు సినిమాలలోకి వచ్చారు సినిమా సంగీతంలో స్టేజి సంగీతంలో వున్న సంగీతం కూడా లేకుండా పోయి, ఆర్కెస్ట్రాల ఆర్భాటం వచ్చేసరికి, సంప్రదాయ సంగీతం మళ్ళీ తల ఎత్తింది

కొన్ని కళారూపాలు అడుగున పడిపోవటానికి ఇలాటి పోటీ కూడా తోడ్పడుతుంది

నా ఉద్దేశ్యంలో కళారూపం జడమైనది అది సబుడి ఆహార్యం లాంటిది, విప్పి అవతల పారేసినాక అందులో చైతన్యం వుండదు

కళాకారుడు ఏ కాలానికి చెందిన కళారూపాన్నయినా తీసుకొని ఆధునిక కళను సృష్టించవచ్చు తాను చెప్పదలచిన సందేశాన్ని ఆ కళారూపంలో విజయవంతంగా చెప్పటంలో అతడి కళాప్రాభవం వుంటుంది రా వి శాస్త్రి గారి 'పిపీలికం' ఒక ఆధునిక ఉపనిషత్తులాంటిదనీ, 'గోవులొస్తున్నాయి, జాగ్రత్త' ఒక ఆధునిక పురాణం (ఎపిక్) అనీ చాలామంది గమనించే వుంటారు

ప్రజానాట్యమండలి వారు బుర్రకథలనూ, వీధి భాగవతాన్నీ కమ్యూనిస్టు పార్టీ సందేశాలను ప్రచారం చెయ్యటాన్కి అద్భుతంగా ఉపయోగించారు. బొంబాయి 'ఇప్టా' వారు పాటలూ, భజనలూ ద్వారా కమ్యూనిస్టుపార్టీ సందేశాలను ప్రచారం చేశారు అంటే కళారూపాలన్నీ ఆకస్మికంగా ఆధునికం అయిపోయాయని కాదు, అవి వున్నవి వున్నట్టుగానే ఆధునిక సందేశాలకు వాహనాలు కాగలిగాయి

భేతాళ కథలు కూడా ఒక ప్రత్యేక రూపం గలవి. నన్నడిగితే అవి చాలా మంచి రూపం గలవి అంటాను. ఎందుకంటే ఆ రూపం విషయాన్ని అప్రధానం చేసి, medium is the message అనిపించలేదు

జాతక కథలు కూడా చాలా చక్కని సాధనాలు. ఒక వర్తమాన సంఘటన తీసుకొని ఒక అతీత కథ చెప్పటం. సమర్థత గలవాళ్ళు విప్లవ సాహిత్యాన్ని ఈ రూపంలో కూడా రాయవచ్చును.

పంచతంత్రంలోని జంతువుల కథలు పాతబడి పోయాయా? నేను అలా అనుకోవటం లేదు

ఇంతసేపూ నేను చెబుతున్న దాని సారాంశం ఏమిటంటే కళారూపాలలో విషయమూ, విధానాలూ విడదీయరానివే అయినా విధానం కంటెనూ, విషయం ప్రాముఖ్యమైనదనీనూ

అయితే కళారూపానికి ఒక ఆకర్షణ లేకపోలేదు రకరకాల సంస్కృతుల్లో రకరకాల కళారూపాల పట్ల ఆత్మీయత వుంటుంది సినిమాలు చూడటం బాగా అలవాటయే వరకూ సాధారణ ప్రజలు నాటకం కన్నా, జానపద రూపమైన బుర్రకథ తమకు చాలా సన్నిహితమని భావించేవారు అలాగే వీధినాటకరూపం పట్ల ప్రజలకు గల ఆత్మీయతను ప్రజానాట్యమండలి చాలా చక్కగా వాడుకున్నది

మన దేశంలో ఇరవయ్యోశతాబ్ది ముక్కాలు ముగియ వస్తున్నా కూడా మనదేశంలో - ఆంధ్రలో మాత్రమే కాదు - జానపద సాహిత్యాన్ని అన్ని వర్గాల వారూ, వయసుల వారూ ఆప్యాయంగా చదువుతున్నారు దీనికి కారణం మన దేశంలో సాంస్కృతిక పరిణామం సరిగా జరగకపోవటమే కావచ్చు కాని ప్రజల సాంస్కృతిక స్థాయితో నిమిత్తం లేకుండా కొన్ని కొన్ని కళాస్వరూపాలకు పనికిమాలిన పేర్లు తగిలించి వాటిని నిషేధించాలనటం నాకు మటుకు సరి అయిన దృక్పథంగా కనబడటం లేదు

*'జీవనాడి', అక్టోబర్ 1973*

# 28. కళాసాంకర్యం

కళాసాంకర్యం అనగానే పాతకాలపు వారికి స్ఫురించేది ఒక జాతికి చెందిన కళలపై విజాతీయతమైన కళల ప్రభావం నేనిప్పుడు చర్చించదలచుకొన్నది అటువంటి సాంకర్యం గురించి కానే కాదు. అటువంటి సాంకర్యం వల్ల ప్రపంచ కళలన్నీ ఎంతో లాభం పొందాయని కూడా నేను నమ్ముతున్నాను ఈ సాంకర్యాన్ని ఎప్పటికప్పుడు 'శుద్ధ కళావాదులు' ప్రతిఘటించుతూనే వచ్చారు వారి ప్రయత్నాలు విఫలమవుతూనే వచ్చాయి. తొలి మానవులలో వాటంతట అవే మొలకెత్తిన కళలు, వివిధ సమాజాలలో వివిధంగా పరిణామం చెంది, ఒక సమాజం నుంచి మరొక సమాజానికి వెంపుడు రావటం చేతనే అన్ని సమాజాలలోనూ కళలు ఏపుగా పెరిగాయి తెరలు కట్టి ఆడే నాటకాలను మనం గ్రీకుల నుంచి నేర్చుకున్నామని తెలుస్తున్నది విన్ రాజుల కాలంలో

అనుకుంటాను, భారతీయ సంగీత విధానం చీనాకు చేరి అక్కడ గొప్ప ఆదరాన్ని పొందింది. బుర్రకథను మహారాష్ట్రులు ఆంధ్రుల వద్ద నుంచి పుచ్చుకున్నారట వారు మనకు తోలుబొమ్మలు ప్రసాదించినట్టు కనబడుతుంది ఈనాడు ప్రపంచమంతటా అమలులో వుండే సాహిత్య రూపాలు పాశ్చాత్య ప్రభావం వల్ల ప్రాచ్య దేశాలలో అవతరించినవి . ఈ జాబితాకు అంతు వుండదు , దానిని వివరించగల పరిజ్ఞానం నాకు లేదు కూడా. ఈ రకం సాంకర్యాన్ని నిరోధించటానికి ప్రయత్నించటం మూఢాచారమని చెప్పటం మటుకే నా పని

ఇంకొకరకం సాంకర్యం వున్నది. దాన్ని కళాభిమానులు ప్రతిఘటించాలి ఎందుకంటే అది కళా ప్రయోజనాలకే వ్యతిరేకం. ఈ సాంకర్యాన్ని తెచ్చిపెడుతున్న వారు కళాజ్ఞానం కలవారు కారు. ఆ జ్ఞానం లేని వారు. కొత్తదనం కోసంగుడ్డిగా పాకులాడేవారు. అందువల్ల తమకు గాని, తమకు జీతాలిచ్చి పోషించేవారికి గాని ఆర్థికంగా లాభం కలుగుతుందనుకునేవారు.

ఈనాటి సంస్కృతి 'అరాజక'మైనది ఎన్నో రకాల మత, సాంఘిక, ఆర్థిక, రాజకీయ విశ్వాసాలు ఏక కాలమందే చలామణీ అవుతున్నాయి. మత, భాషా, కుల, సంస్కార, దురహంకారాలూ, ద్వేషాలూ కళలో ప్రత్యక్షంగానూ, వ్యంగ్యంగానూ ద్యోతకమవుతున్నాయి. ఒకరికి మూఢవిశ్వాసాలు మరొకరికి పవిత్ర భావాలు, ఒకరి దృష్టిలో తిరోగమనం మరొకరి దృష్టిలో పురోగమనం , కొందరు తమ ఆశలన్నీ శాస్త్రజ్ఞానం పెరుగుదల పైననే పెట్టుకుంటే మరికొందరు దాన్ని విషప్రాయంగా చూస్తున్నారు.

ఇలాటి వైవిధ్యాల వల్ల నేటి కళలలో - వాటి స్వరూపాలలోనూ, స్వభావాల లోనూ కూడా - ఈ యుగంతోబాటు గతించిన యుగాలన్నీ ప్రతిబింబిస్తున్నాయి నన్నయ లగాయతు ఆరుద్ర దాకా సాగిన కవితాస్రవంతిలో ఎవరికి కావలసినచోట వారు తమ మణికర్ణికా ఘట్టాలను ఏర్పాటు చేసుకుని అక్కడే తరించాలని చూస్తున్నారు.

విషయం మాట విడిచి పెట్టి ఉత్త స్వరూపం మాత్రమే పరిశీలించినా తోలుబొమ్మలూ, బుర్రకథలూ, వీధి నాటకాలూ, సినిమాలూ ఒక కాలానికీ, ఒక సాంఘిక వ్యవస్థకూ చెందినవి కావు. సినిమా ఆధునిక యంత్ర నిర్మితమైన కళారూపం. దానిని ఒకే కాలమందు కొన్ని లక్షలమంది, వేరు వేరు ప్రాంతాల వారు చూడవచ్చు. కళాస్వరూపాలలో వుండే ఈ తేడాలు విషయంలో కూడా ప్రతిబింబించాలి. కాని, అట్లా జరగటం లేదు. ఒకే విషయాన్ని తోలుబొమ్మలలోనూ, వీధి నాటకాలలోనూ, సినిమాల లోనూ మనం చూస్తున్నాం.

పైన చెప్పిన కళారూపాలలో వాస్తవికత ఒకే విధంగా సాధ్యపడదు. సినిమా కళ నూటికి నూరుపాళ్ళు వాస్తవికత సాధించగలదు. తోలుబొమ్మలాట నూటికి

అయిదుపాళ్ళు వాస్తవికతను కూడా సాధించలేదు అయినా సినిమా చిత్రాలు తీసేవారు నూటికి 30 పాళ్ళు వాస్తవికత తోనూ, అంతకంటె తక్కువ వాస్తవికత తోనూ తృప్తి పడుతున్నారు రంగస్థలాని కన్నంటే ఇక్కడికి సినిమా ఇళ్ళు ఎక్కువ వాస్తవంగా వుండటం లేదు.

...''కాళ్ళ గజ్జ కంకాళమ్మా'' అనే పాటను హిందూస్థానీ ఠుమ్రీ పద్ధతిలో పాడితే మరింత రక్తిగానూ, 'ఆధునికం' గానూ వుంటుందనుకునే వెర్రివాళ్ళు దేశంలో కొందరున్నట్టు స్పష్టమవుతున్నది

పౌరాణిక చిత్రాలలో పార్సీవంట్లూ, జానపద చిత్రాలలో రాజులకూ, రాణులకూ ఈ కాలపు మధ్యతరగతి వస్త్రాలూ, కోయగూడాలలో ఆధునిక బృందనృత్యాలూ, గ్రీకులూ, రోమనులూ ధరించిన యుద్ధసామాగ్రి, సాంఘిక చిత్రాలలో పోలీసుల ప్రమేయం లేకుండా హత్యలూ, హంతకుల వేటలూ . . మనం చూస్తున్నాం ప్రేమ కోసమే జీవిస్తున్నట్టుగా మనులుకోవటం మధ్య తరగతి కుటుంబాలలో స్త్రీలకే సాధ్యం కాదు కాని కార్మికస్త్రీలు సయితం అనుక్షణమూ ప్రేమ కోసమే బ్రతుకుతున్నట్టు మనం సినిమాలలో చూస్తున్నాం! రచయిత కార్మికుడి కూతుర్ని చిత్రిస్తున్నాననుకుంటూ ప్రబంధ నాయికను - మరొక యుగపు దాన్ని, మరొక తరగతి దాన్ని - చిత్రిస్తాడు.

ఇలాటి సాంకర్యం వల్ల కళాప్రయోజనం శూన్యం. ఒక్కొక్క శతాబ్దంలో ఒక్కొక్క తరగతికి చెందిన మనుష్యుల జీవితాలు ఒక ప్రత్యేక సాంఘిక వాతావరణంలో, కొన్ని ప్రత్యేక జీవిత దృక్పథాల తోటీ, ప్రేరణల తోటీ, ఆశయాల తోటీ, సంస్కారంతోటీ కొనసాగుతాయి. ఈనాటి 'లోవర్ డివిజన్' గుమాస్తా జీవితాన్ని పురాణంగా గాని, ప్రబంధంగా గాని రాయటానికి పూనుకుంటే విధిగా కళాసాంకర్యం జరుగుతుంది.

ప్రజలు కళావిమర్శలకు దిగరు. తమకు నచ్చితే కళలను ఆనందిస్తారు. నచ్చకపోతే ఎడంగా వుంటారు. కొత్తదనం వారిని కొంతవరకు ఆనందింపజేస్తుంది. కళాకారులే తాము సాధన చేసే కళల స్వభావాన్ని అర్థం చేసుకొని వాటిని గుర్తించి, తాము అవలంబించే కళావిధానాలకూ, ప్రయోజనాలకూ సామరస్యం చూసుకొని కళలను ప్రయోజనాత్మకంగా చక్కదిద్దాలి. ఇప్పుడు నేను వివరించిన కళాసాంకర్యం ఏ విధంగానూ, ఎవరినీ సంస్కరించలేదు. అది సంఘానికి పూర్తిగా నిరుపయోగం.

# 29. శాస్త్రమూ - కళా

శాస్త్రానికీ, కళలకూ పొంతన కుదరదన్న నమ్మకం చాలామందికున్నది శాస్త్రజ్ఞుల దృష్టిలో కళాకారులు గాలిమేడలు కట్టేవాళ్ళు కళాకారుల దృష్టిలో శాస్త్రజ్ఞులు మట్టి ఎండుకట్టెలు

ఈ రెంటికీ వైరుధ్యం వున్నమాట అబద్ధం కాదు వైరుధ్యం వున్నదంటే వాటిమధ్య అవినాభావ సంబంధము కూడా వున్నట్టే వెలుగు లేకపోతే నీడ వుండదు గదా అనారోగ్యమన్నది ఆరోగ్యం లేనిదే వుండదు గదా (అందరికీ పంటినొప్పి వుంటే అది రోగమని ఎవరూ అనుకోరని ఒక మేధావి అన్నాడు)

అందుచేత శాస్త్రానికీ, కళకూ వైరుధ్యం వున్నదని ఒప్పుకునే పక్షంలో వాటిమధ్య అవినాభావం కూడా వున్నదని ఒప్పుకోవలసి వుంటుంది అలాటి అవినాభావం మనకు కనిపిస్తుందా?

మన పూర్వులు కళా, శాస్త్రమూ, విద్యా అనే వాటిని పర్యాయపదాలుగా వాడారు అయినా వారు ప్రతి కళ గురించీ కొంత కొంత శాస్త్రం సృష్టించారు మన సంప్రదాయ కళలన్నీ శాస్త్రబద్ధమైనవే. గానానికి సంగీతశాస్త్రం, సాహిత్యానికి వ్యాకరణం వగైరాలు సంప్రదాయాలలో మార్పులు జరిగినపుడు శాస్త్రంలో కూడా మార్పు జరిగింది రోగాలు నయం చేయటానికి వైద్యశాస్త్రం వున్నది రోగచికిత్స కళ అంటే ఎవరూ నమ్మరు, కాని బెర్నార్డ్‌షా దాన్ని ఒక కళ అన్నాడు. శాస్త్ర సిద్ధాంతాలకు సంబంధించిన కొన్ని సూత్రాలలో 'సౌందర్యం' వున్నది ఉదాహరణకు కెప్లెర్ సూత్రాలు

శాస్త్రంలో కళా, కళలో శాస్త్రమూ పరివ్యాప్తం చెంది వుంటాయనటానికి సందేహం లేదు ఆ మాటకు వస్తే శాస్త్రమూ, కళ కూడా సత్యాన్వేషణ ఆశయంగా గల వేరు వేరు పంథాలే.

అయితే వీటివైరుధ్యం ఎందులో వున్నది? వాటి మధ్య పూర్ణమైన సామరస్యం ఎందుకు లేదు?

కళాసృష్టి ప్రధానంగా భావజాలం ఆధారంగా కలది. దానికి వాస్తవజగత్తు ప్రయోగంలో మాత్రమే తగులుతుంది కవి భావనచేసి పద్యం రాస్తాడు గాయకుడు స్వరకల్పన చేసి పాట పాడుతాడు చిత్రకారుడు మనసులో నిర్మించినదాన్ని బొమ్మగా దించుతాడు. భగీరథుడు తెచ్చిన గంగ లాగా, కళ ఆకాశం నుంచి భూమికి దిగుతుంది. శాస్త్రజ్ఞుడి పని దీనికి భిన్నంగా వుంటుంది వాడు భూమి నుండిపైకి లేస్తాడు మట్టి, రసాయనాలూ, కొలతలూ, తూకాలూ, గణితమూ వగైరాలు వాడి ముడిసామాగ్రి.

కళాకారుడికీ, శాస్త్రజ్ఞుడికీ గల ఈ వైరుధ్యంలో కూడా కొంత ఐక్యత వున్నది. ఎంతగా ఆకాశం నుంచి భూమికి దిగినా, కళాకారుడు భూమి మీద నుంచి ఆకాశంలోకి వెళ్ళగలిగినవాడే ('దిగంతాల మీద విహరించే భావుకుడు' అన్నవాడు కూడా తాను ముందు భూమి మీద వుండవలసినదేనని ఒప్పుకుతీరాల) కళ కేవలము నభోవీథి నుండి భూమికి దిగేదే అయితే అది భూమి మీది వాళ్ళకు పూర్తిగా విజాతీయంగా వుండిపోతుంది (అలాంటి విజాతీయమైన కళలకు నమూనాలు లేకపోలేదు కూడా)

అలాగే నేలమీద నుంచి ఆకాశంలోనికి లేచే శాస్త్రజ్ఞుడికి కూడా భావనాబలం వుండాలి. యాదృచ్ఛికంగా కనిపెట్టిన శాస్త్రసత్యాలు కొన్ని వున్నప్పటికీ భావనాబలం లేని శాస్త్రవేత్త సత్యాన్వేషణలో విఫలుడవుతాడు

కళకూ శాస్త్రానికీ మధ్య వుండే వైరుధ్యం మరొక విధంగా కూడా బయట పడుతుంది. శాస్త్రం నిరూపించిన సత్యాన్ని తృణీకరించి కళలు కల్పనలు చేయలేవు చేస్తే, అవి నిరుపయోగం అవుతాయి. శాస్త్ర అజ్ఞానం 'కళారూపంలో' మనకు సినిమాలలో కొట్టవచ్చినట్టు కనబడుతుంది. తలకాయ పగిలి నెత్తురు వరదలుగా పారుతున్న వ్యక్తి మూడుపేజీల ఉపన్యాసం ఇస్తాడు. నిజానికి వాడు 'స్ట్రెచ్చర్' కేసు. డాక్టరు వచ్చి గాయానికి డ్రెస్ చేస్తే పట్టీ మీద నెత్తురు మరక వుంటుంది. ఇటీవల ఒక చిత్రంలో కథానాయిక తన తల నుంచి కారిన రక్తం ఓ గ్లాసులో తెచ్చి కథానాయకుడికి తాగమని ఇస్తుంది. ఇంకో చిత్రంలో ఒక పేషెంటు చావటానికి వ్యవధి సెకండ్లతో సహా డాక్టరు చెబుతాడు. ఆ డాక్టరు తెమ్మన్న మందు తేగానే ఇంకో క్షణంలో చచ్చే పేషెంటు లేచి కూర్చుంటాడు. సినిమాలలో వయొలిన్‌లూ, వీణలూ, సితార్లూ వాయించేవాళ్ళకు ఆ వాద్యాలను వాయించటము తెలీదని స్పష్టంగా తెలిసిపోతుంది , రసాభాస!

ఇలాంటి శాస్త్ర అజ్ఞానము నాటకాలలోనూ, కథలలోనూ, నవలల లోనూ కొల్లలుగా కనబడుతుంది. ఇలాంటి కళలు ప్రజలను ఉత్తేజపరచగలవా? మీరే చెప్పండి!

సంప్రదాయంలో మార్పులు వస్తాయనుకొన్నాం. కనీస నియమాలలాంటివి అన్ని కళలలోను వుంటాయి. సంప్రదాయం పేరుతో అవి అశాస్త్రీయమైనా కూడా చలామణీ కావచ్చు. కాని శాస్త్రజ్ఞానం అభివృద్ధి అయినకొద్దీ వాటిలో మార్పు రాకపోతే శిథిలం కాకతప్పదు. కళాపురోగమనాన్ని కనీసం కళలయినా నిర్ణయించాలి గదా. ఒక ఉదాహరణ తీసుకుందాం. దుర్మార్గులు ఒక అమాయకపురాలుకు రంకు కట్టి ఆమె తన కన్యాత్వం కోల్పోయిందని అపవాదు వేస్తే ఆమెను ఎవరూ పెళ్ళాడనట్టు ఒక సినిమాలో చిత్రించారనుకొందాం. దాన్ని ప్రేక్షకులు ఆమోదించవచ్చు. కాని మరొక చిత్రంలో అలాంటి మనిషిని డాక్టర్లు పరీక్ష చేసి ఆమె ఇంకా కన్యయే అన్నట్టు చూపిన అనంతరం కూడా మొదటి సంఘటన మీద 'కడివెడు కన్నీళ్ళు' చిత్రం తీస్తే దాని నిర్మాత బొత్తిగా అజ్ఞానాంధకారంలో వున్నాడు అనిపించుకుంటాడు.

ఇలా కళాసంప్రదాయాలలో మార్పు తెచ్చే శక్తి శాస్త్రజ్ఞానానికున్నది శాస్త్రం తన సాంప్రదాయాల్ని తానే మార్చుకుంటూ పోతుంది. దాని మీద కళల ప్రభావం దాదాపు వుండదు

ఇక కళాకారులకూ శాస్త్రజ్ఞులకూ జీవితం తోనూ, ప్రజలతోనూ గల సంబంధాలను ఆలోచిద్దాం

కళాకారుడు కళను సృష్టించడానికి భువి నుండి దివికి లేచేటప్పుడు వాడి వెంట భూమి వాసనలు వస్తాయి. వాడు కళను సృష్టించడానికి తన బాషనూ, తన జ్ఞానాన్నీ, అనుభవాలనూ మాత్రమే వినియోగించుకోగలడు. వాడికి భూమి మీద జీవితంతో ఎలాంటి సంబంధాలుంటే అలాంటి సంబంధాలే కళలో ప్రతిబింబిస్తాయి (వాడి కోరికలు కూడా వాడి మానసిక అనుభవంగానే భావించాము). జీవితంలో తనను గురించి తప్ప ఆలోచించనివాడు 'తాను' కవిత్వం రాసాడు. అంత సొంత గొడవ అల్లా కూడా అతను తనలాంటి వారిక్కొందరికి ప్రతినిధిగా వుండి వారి మెప్పు పొందగలుగుతాడు

కళాకారుడు తన సంస్కృతి అనుకునేది అతని జీవితవిధానం నుంచీ, వర్గసంబంధాల నుంచీ, ఇష్టపడి చదివినదాని గురించీ, భవిష్యత్తు గురించి కనే కలల నుంచీ ఏర్పడుతుంది కేవలం కీర్తికాముడు ఎలాటి కళలతో తనకు కీర్తి వస్తుందనుకుంటే అలాంటి కళలు సృష్టిస్తాడు ('అందరూ విప్లవ గేయాలంటె వెర్రెత్తిపోతున్నారు పోనీ అవే రాద్దాం!' లేదా 'జీవితాన్ని చిత్రిస్తే ఏమొస్తుంది? సినిమాకు పనికివచ్చే నవల ఒకటి రాస్తే కీర్తికి కీర్తీ, డబ్బుకు డబ్బూ వస్తుంది!')

రెండో చివర నిజమైన విప్లవరచయిత విప్లవం ద్వారా తప్ప దేశానికీ ప్రజలకూ భవిష్యత్తు లేదనీ, అమలులోనున్న ఆర్థిక, రాజకీయ, సామాజిక వ్యవస్థ కుళ్ళు కంపుకొడుతున్నదని శాస్త్రీయంగా తెలుసుకొని విప్లవరచనలని చేస్తాడు విప్లవానికి దోహదం చేసే గేయాలూ, కథలూ, పాటలూ, నాటకాలు వగైరా ఇలాంటి సామాజిక, శాస్త్రీయజ్ఞానం నుంచి పుట్టుకొస్తాయి.

ఈ మధ్యలో అర్ధశాస్త్రీయజ్ఞానంతో తెలిసీ తెలియని రచనలు చేస్తూ, తమకన్నా తెలిసినవాళ్ళు 'అతి'గా పోతున్నారనీ తమకున్న జ్ఞానం కూడా లేని వాళ్ళు వెనకపడే వున్నారని తృప్తిచెంది కళలను సృష్టిస్తారు. కళల రూపాన్ని శాస్త్రజ్ఞానం ఎంతవరకు మార్చగలదో మార్క్సిస్టు-లెనినిస్టు గతితార్కిక భౌతికవాదం నిరూపించినంతగా మరేదీ నిరూపించలేదు. దాన్ని మించిన సామాజిక శాస్త్రీయ దృక్కోణం ఇప్పటికి ఇంకా రాలేదు.

శాస్త్రజ్ఞానం మాటేమిటి?

పూర్వశిలాయుగం నుంచీ ఈనాటి వరకు జరిగిన అనూహ్య సామాజిక పరిణామానికి అడుగడుగున శాస్త్రజ్ఞానమే చేతనశక్తి అయింది పరిత్రకారులు కొందరు వ్యక్తుల తెలివితేటలకూ, పౌరుషాలకూ, దుర్మార్గాలకూ, సుజనత్వానికీ,

ధర్మబుద్ధికీ ఇచ్చే ప్రాముఖ్యం సమాజంలో గుణాత్మకమైన పరిణామం కించిత్తు కూడా సాధించలేదు ఎంతటి మేధావి అయినా శిలాయుగపు మనిషి ఆకాశంలో ఏర్పడే ఇంద్రధనుస్సు ఏమిటో మబ్బుల మధ్య వచ్చే మెరుపులేమిటో, పగలూ రాత్రీ ఎందుకు మారి మారి వస్తున్నాయో తెలుసుకోగలిగి వుండడు ఎంతటి ప్రతాపశాలి కూడా ఒక దెబ్బన మూడులక్షల ప్రాణాలను హిరోషిమా మీద బాంబులు వేసినవాడి లాగా - తీసివుండడు. మానవ చరిత్రలో వ్యవసాయం కనిపెట్టటమూ, ఇనుము నుపయోగించడమూ తెచ్చిన పరిణామాలు విప్లవాత్మకమైనవి యంత్రశాస్త్రంలో 'చక్రం' కనిపెట్టడం చాలా పెద్ద విప్లవం తెచ్చింది గణితంలో 'సున్నా' అత్యద్భుతమైన పురోభివృద్ధికి మూలమైంది.

శాస్త్రజ్ఞానం విప్లవ పరిణామాలు సాధించడమే గాక సామాజికాభివృద్ధిని వేగవంతం చేసింది. నియాండర్తల్ మానవుడు సగటున ఇరువయితొమ్మిదేళ్ళు బతికాడని అంచనా ఈనాడు ముందుకువచ్చిన దేశాల్లో సగటు ఆయుర్దాయం 70 ఏళ్ళు రాతి పనిముట్లు ప్రపంచమంతటా వ్యాపించే శక్తినిచ్చాయి. పూర్వశిలాయుగం అంతానికి జనాభా పదింతలు పెరిగింది పదివేల ఏళ్ళ క్రితం వ్యవసాయం, పశుపోషణ వచ్చాక ప్రపంచ జనాభా ఆరులక్షల నుంచి ఎనిమిదికోట్ల అరవై లక్షలకు పెరిగింది మూడువందల ఏళ్ళ క్రితం ప్రారంభమయిన పారిశ్రామికయుగంలో ఈనాటికి ప్రపంచ జనాభా మూడువందలకోట్లు. ఇంకొక ఏభయిఏళ్ళలో ఇది రెట్టింపు కూడా కావచ్చు. ప్రపంచ జనాభా పెరుగుదల క్రమంగా జరుగలేదని కొన్ని ఘట్టాలలో విప్లవాత్మక పరిణామంగా జరిగిందని ఎడ్వర్డ్. యస్. డేవీ లాంటి శాస్త్రజ్ఞులు చెప్పారు

మనిషి జ్ఞానం ఎంతగా అభివృద్ధి అయిందంటే మనుషులు అందరూ శాస్త్రీయంగా ఆలోచించినట్టయితే ఈనాడు మూడువందల కోట్ల చిల్లర జనాభాకు సరిపోయే తిండీ, బట్టా, ఇళ్ళూ, స్కూళ్ళూ, ఆస్పత్రులూ, పనీ, మందులూ, వినోదాలూ, ప్రయాణ సౌకర్యాలూ సాధ్యమే కాని అలా ఎందుకు లేవు. మనదేశం లాంటి దేశాలలో దారిద్ర్యం ఎందుకు తాండవిస్తున్నది. సాంకేతిక ప్రవీణులూ, వైద్యులూ, అధ్యాపకులూ కొరత కావటం వల్లనా? సేద్యపు భూములూ వాటిని చేసే రైతులూ లేకనా? మందులు ఉత్పత్తి కాకనా? ఇదేదీ కాదు. దేశంలో అత్యధిక సంఖ్యాకులకు ఉన్న తిండీ, ఉన్న ఆస్పత్రులూ, ఉన్న బట్టా అందుబాట్లో లేవు. ఇంజనీయర్లూ, డాక్టర్లూ, అధ్యాపకులూ, చిల్లర ఉత్పత్తిదార్లూ, అసంఖ్యాకమైన వృత్తులవాళ్ళూ, కూలీలూ, శ్రామికులూ తమ తమ శ్రమకు అనుగుణంగా ఎందుకు సుఖపడలేకుండా వున్నామని ఆలోచిస్తే ఒకటే సమాధానం వస్తుంది అత్యల్ప సంఖ్యాకుల స్వార్థమూ, అధికారమూ, సంఘ విద్రోహక వైఖరీ అడ్డుగోడగా వున్నాయి. ఈ అడ్డుగోడలను కూలదోసిన చోట జీవితం మూడుపువ్వులూ ఆరుకాయలూ

అయ్యింది. సంపద దోపిడీదార్లయిన పది శాతానికి కాదు. దోపిడీకి గురైన 90 శాతానికి రోజురోజుకూ పెరిగే పిల్లల చదువు చేయటం మన పాలకులకు చేత కాలేదు. ఆ మాట చెప్తే ఒప్పుకోలేకున్నారు. చీనాలో 1949 తర్వాత పిల్లలు పుష్టిగా వున్నాయి. ఎందుచేతంటే పేదవాడుగాని వాడి పెళ్ళాం సమర్థత గల వాడి పెళ్ళాన్ని చూసి బాధపడ్డట్టు మనం మన పెళ్ళిళ్ళను చూసి బాధపడాలి, సిగ్గుపడాల - లేదా నేర్చుకోవాలి. చీనాలో మార్క్సిస్టు-లెనినిస్టు సామాజిక శాస్త్రం అమలు జరుగుతున్నది. మనదేశంలో అది పోలీసుల చేత 'స్వాధీనం' చేసుకోబడుతున్నది.

చెప్పవచ్చిందేమంటే మన శాస్త్రవేత్తలు ప్రపంచ శాస్త్రాభివృద్ధికి ఎంత సేవ చేశారన్నది ప్రజల దృష్టిలో ప్రధాన విషయం కాదు. పత్రికలలో ఆరోగ్యం గురించీ మందులను గురించీ వ్యాసాలు వస్తాయి. అవి వారికి ఉపయోగించవు. పత్రికలలో ఎడ్వర్టయిజ్ చేసే ఏ వస్తువూ ప్రజలకోసం కాదు, ఒక్క సినిమా ప్రకటనలు తప్ప. అవైనా ప్రజలకు పనికిరావాలని తీసిన సినిమాలు కావు. జాతి మొత్తానికి సంబంధించిన సమస్యలను సాంకేతికపరిశోధనలు పరిష్కరించవు. దానికి మార్క్సిజం-లెనినిజం ఒకటే శాస్త్రం. మన కళాకారులు కలలు కనదలచినప్పటికీ ఆ శాస్త్రం ద్వారా ప్రజాభ్యుదయం సాధించిన దేశాలలోని ప్రజా జీవితం గురించి కలలు కనడమే మంచిది.

*(ఈ వ్యాసం 'PULSUS OSMECO' - ఉస్మానియా మెడికల్ కాలేజి మాగజైన్‌లో 1974లో అచ్చయింది. కొకు 1973లో రాసి వుంటారు)*

## 30. మెదడుకు మేత

ఆరోగ్యంతో జీవించే వాడికి వేటాడటం ఎంత అవసరమో, క్రూరమృగాల నుంచి ఆత్మరక్షణ చేసుకోవటమూ, వాటిని అదుపులో వుంచటమూ కూడా అంత అవసరమే. ఆ విద్యను వాడు చిన్నతనం నుంచీ, అనేక విధాల నేర్చుకుంటాడు. విలువిద్యా, ఈటెలు ఉపయోగించటమూ, కత్తులతో పోరాడటమూ మొదలైన వాటిలో శిక్షణ పొందుతాడు. ముందు వేటగాళ్ళు మాట్లాడుకొనేవి విని కొంత శ్రుతపాండిత్యం సంపాదిస్తాడు. తరవాత వేటగాళ్ళ వెంట వెళ్ళి వారి ఆచరణ చూస్తాడు. తరవాత తానే స్వతంత్రంగా వేటాడటమూ, క్రూరమృగాలను చంపటమూ నేర్చుకుంటాడు. అంటే, వాడు అరణ్య జీవితాన్ని అనేక దశలలో అలవరుచుకుంటాడు.

నాగరిక జీవితమైనా అంతే. ప్రతి నాగరిక ప్రాణీ తమకు ప్రాప్తమయే జీవితం గురించి యదార్థం చిన్నతనం నుంచీ వినాలి. ఆ జీవితపు లోతుపాతులు ఇతరుల

జీవితాల నుంచి చూసి గ్రహించాలి. అనంతరం తాను ఆ జీవితంలోకి దిగాలి. అప్పుడే సమగ్రంగా జీవించాలి

మనిషి సమగ్రజీవి కావాలంటే జీవిత పరిజ్ఞానమూ, ప్రత్యక్షానుభవమూ కూడా కావాలి. ఎందుకంటే తుపాకీతో గురిగా కొట్టగలవాడు అమాంతం వేటగాడు అయిపోవచ్చు. చెట్టుమీద పులికోసం మాటువేసిన వాడు పులి రాగానే వణికిపోయి తుపాకీని కింద పడవేయవచ్చు. చావు తప్పి కన్ను లొట్టపోయి, ఇంటికి తిరిగి రావచ్చు. అందువల్ల ఏమీ లాభం లేదు.

అలాగే అచ్చగా అనుభవం చాలుననుకునే వాడు కూడా రాణించడు. నీటిలో దిగితే ఈత అదే వస్తుందనుకున్నవాడి శవం దొరకను కూడా దొరక్కపోవచ్చు. మంచినైనా, చెడునైనా కొంత జ్ఞానసాధన లేకుండా ప్రత్యక్షానుభవం రాణించదు. హరిజనులను సజీవదహనం చేసేవాళ్ళూ, పట్టుబడిన నేరస్థులను ప్రశ్నించే పోలీసు అధికారులూ, ఆకలితో వీధులలో పడే జనాన్ని తుపాకులతో కాల్చి చంపమని ఉత్తరువులిచ్చే వాళ్ళూ ఇంత కిరాతకంగా, అమానుషంగా ఎలా వుంటారా అని మామూలు మనుషులకు ఆశ్చర్యం కలగవచ్చు. కాని అలా నరపిశాచాలుగా తయారు కావటానికి అవసరమైన ఆధ్యాత్మిక, మానసిక శిక్షణను వారు పొంది వుంటారు. మనం పొందలేదు.

ఈనాటి ప్రజలకు సార్థకంగా జీవించేటందుకవసరమైన ఆధ్యాత్మిక, మానసిక శిక్షణ ఎలా లభించాలి? ఈనాటి జీవితం ఎంత క్లిష్టమూ, వర్గభూయిష్టమూ అయినదంటే, ఆటవికుల పిల్లల లాగా మనం పెద్దల నుంచి జీవితసత్యాలన్నీ విని నేర్చుకోలేం. కారణం : పెద్దలకు కూడా జీవితం గురించి సరిగా తెలియదు. వారూ జీవితం గురించిన అజ్ఞానాంధకారం నుంచి బయటపడక, ఊపిరి సలపని జీవితాల్లో జీవిస్తున్నవారే!

కళలు మాత్రమే జీవితసత్యాలను ప్రజలకు బోధించగలవు. మన కళలు సార్థకమైనవై వున్నట్టయితే మన జీవితాచరణ ఇలా వుండేది కాదు. మూడు దశాబ్దాలపాటు ప్రజాతంత్రం కోసం మూకుమ్మడిగా తపించి, 1945 నాటికి సమసమాజం గురించి కలలు కన్న మనం ప్రజాతంత్రం అంటే ఏమిటో, సమసమాజం కోసం ఎటుగా వెళ్ళాలో తెలుసుకుని వుంటే ఈనాడు అర్థఫాసిస్టు పరిపాలనాయంత్రంలో ఇరుక్కుపోయి, పౌరహక్కులకోసం పోరాడడమూ, అశాంతిని దేశమంతటా ఆవిష్కరిస్తూ బతకవలసిన అవసరం వుండేది కాదు.

మన కళలు మనకు ఏమి చెయ్యలేదు? స్వాతంత్ర్యం వచ్చాక కూడా మనం కళలు పరమార్థాలనే వాదనను విన్నాం; కళల శాశ్వత విలువలను గురించి చర్చించాం! సమకాలీన జీవితాన్ని ప్రతిబింబించని కళలు నిరర్థకమని మనం ఈనాడు కూడా

పూర్తిగా సద్వినియోగం లేదు. అందుకే, శిష్టుల హాలాహలాన్ని దిగమింగినట్లు మన ప్రభోజా ప్రభుత్వ హింసను గురించి, భూస్వామ్య కిరాతకాలను గురించి, పోలీసు అత్యాచారాలను గురించి, తిండి లేక ఆత్మహత్యలు చేసుకునేవాళ్ళను గురించి, ఉగ్రశ్రేణి వాళ్ళ లంపటి గురించి, హత్యాచార సచ్చితృత్యాల వార్తలను చదువుతూ కూడా చలించకుండా ఉన్నాం. మన పూర్వులు బోధించిన వ్యక్తిమోక్షం లాగే మన కళలు వ్యక్తి ఆనందాన్ని సరఫరా చేస్తున్నాయి. సమాజం ఈ లోపున చెదలుపట్టి పోతున్నది.

''మాకు ఉపదేశించే అర్హత లేదు. వినోదం మాత్రమే ఇయ్యగలం'' అనటం సినిమా చిత్రాలు తీసేవారికె చెల్లింది! పరసగా దివాలా చిత్రాలు తియ్యటం కూడా వారికే చెల్లింది. అలాంటి దృక్పథం గల కళాకారుడు షండుడు. తనకు తెలిసిన జీవితాన్నయినా వాస్తవంగానూ, జీవితసత్యం నిరూపితమయేటట్టూ చిత్రించలేనివాడు కళాకారుడని చెప్పుకునేటందుకు అర్హుడుకాడు. ఆ పని చేసినప్పటికీ అతడి కళాసృష్టి సమాజాన్ని ఉద్ధరించకపోవచ్చు. దాని లోపాలను విమర్శనం చేస్తుంది. ప్రత్యేక కళాఖండాలు చెయ్యలేని పని కళలు సమష్టిగా చెయ్యవచ్చు.

ఇటీవలి ఉదాహరణ 'ఇది నాటకం కాదు' అన్న నాటకం తీసుకుందాం. ఇది ప్రయోగాత్మక నాటకమన్నది వేడుక విమర్శ అవుతుంది. ఈ నాటకం చూసే ప్రేక్షకుడు నాటకంలో తన్మయత్వం పొందే అవకాశం లేకపోయినా, అనేక జీవితసత్యాలు అతని ముఖాన సూటిగా తగులుతాయి. అంతవరకు ఇది జయప్రదమైన నాటకాలలో ఒకటి అని చెప్పాలి. కాని దీని ప్రయోజనం మొక్కవోయింది. స్టేజిమీద మనం చూసేదంతా సామాజిక విప్లవానికి అనుకూలమైన పరిస్థితి. కాని ఈ నాటకం విప్లవాన్ని నిర్దేశిస్తుందా? నిర్దేశించదు. విప్లవం అనగానే, అమాయకుల హత్య అని వాపోయింది. మనం నాటకంలో చూసే అన్ని అభాగ్యపాత్రలూ అమాయకమైనవే! వాటి జీవితాలు ధ్వంసమయాయి. కాని విప్లవం ద్వారా మాత్రం అమాయకుల హింస వద్దు. విప్లవంలో అమాయకులేగాక మాయకులు కూడా ముట్టికరుస్తారు. విప్లవం వొద్దంటే అమాయకులు మాత్రమే ముట్టికొట్టుకుపోతారు. మాయకులు మరింత కొవ్వుతారు. విప్లవం అంటే ఏడ్చిన ఈ నాటకం అమాయకుల భవిష్యత్తు గురించి ఏమంటూంది? లాభం లేదు! ఈ జీవితం మారదు. ఇది బాగుపడదు! నిరాశావాదం. విప్లవాన్ని బోధించదగిన మంచి నాటకం నిరాశావాదాన్ని బోధించటం అన్యాయం!

ఇటువంటి పరిస్థితి కళలకు పట్టింది గనకనే విప్లవరచయితలూ, విప్లవ కళలూ అంటూ ఒక ఉద్యమం బయలుదేరాల్సిన అవసరం ఏర్పడింది. న్యాయంగా ఈనాడు సాహిత్యమంతా విప్లవసాహిత్యంగానే వుండాలి. కళలన్నీ విప్లవ కళలుగానే వుండాలి. మన కళాకారులు ఈ సంగతి ఎంత త్వరగా గ్రహిస్తే దేశానికి అంత మంచిది.

కళాసాగర్, ద్వితీయ వార్షికోత్సవ సంచిక, 1974

# 31. "ప్రజాసాంస్కృతికోద్యమం ప్రజ్వరిల్లే నాటికి డాక్టరు రాజారావు లాంటి వారు రావాలి"

డాక్టరు రాజారావు గతించి పన్నెండేళ్ళయింది. అతని వర్ధంతి ఏటా ఎనిమిది చోట్ల జరుగుతూ వున్నది. నటుడుగానూ, నాటక ప్రయోక్తగానూ ఆంధ్రులు రాజారావును మరవలేదు. ఇలాంటి గౌరవం గురజాడ అప్పారావుకూ, కందుకూరి వీరేశలింగానికీ మాత్రమే జరుగుతున్నది. ఏ విధంగా రాజారావు ఈ ఇద్దరి కోవలోకి వస్తాడన్నది ఆలోచించదగిన విషయం.

డాక్టరు రాజారావు వర్ధంతి సభలలో అనేకమంది ప్రముఖులు, అతనితో దీర్ఘకాల పరిచయం వున్నవారూ, అతనితో కలిసి పనిచేసిన వారూ, అతని శిష్యులూ, మానసపుత్రులు అనదగిన వారూ, ప్రసంగాలు చేస్తున్నారు. ఈ ప్రసంగాలలో రాజారావు ఘనతను రకరకాలుగ ఉగ్గడించటం జరుగుతున్నది. దీపావళి పండగ ఎందుకు పుట్టిందో కొంచెమైనా తెలియకుండా అనేక కోట్లమంది ఆ పండగ చేసుకుంటున్న విధంగా రాజారావు విశిష్టతకు అర్థం తెలియకుండానే అతని వర్ధంతులు జరుపుతూ పోయే దుస్థితి ఏర్పడవచ్చును. ఏసుక్రీస్తు కలలో కూడా ఊహించని క్రైస్తవమతమూ, బుద్ధుడు తీవ్రంగా నిరసించదగిన బౌద్ధమూ ప్రచారమయినట్టుగానే రాజారావు ఆశయాలకు భిన్నమైన ఆశయాలు రాజారావు వర్ధంతుల ద్వారా ప్రచారం కావచ్చును.

నేను ఆలకించిన చాలా ప్రసంగాలలో నటుడుగానూ, ప్రయోక్తగానూ, నాటకరంగం ద్వారానూ, నాటకరంగానికి రాజారావు చేసిన కృషి గురించి ఎక్కువగా వినిపించింది. ఇది రాజారావు ప్రత్యేకత అని నాకు తోచదు (అలా ప్రసంగించిన వారి వ్యక్తిగతాభిప్రాయాలకన్న నా వ్యక్తిగతాభిప్రాయం ఎక్కువైనదని నేను వాదించబోవటం లేదు). రాజారావు గురించి ప్రచారమవుతున్న అభిప్రాయాలకు నాది కూడా చేర్చే ఉద్దేశంతో ఇది రాస్తున్నాను.

రాజారావు ఉత్తమ నటులలో ఒకడనీ, ఉత్తమ నాటక ప్రయోక్తలలో ఒకడనీ అనుకున్నప్పటికీ యితర ఉత్తమ నటులకూ, ప్రయోక్తలకూ ఇలా సంస్మరణం జరగటం లేదు. రాజారావు ప్రత్యేకతను అన్వేషించటానికి ఇక్కడే బయలుదేరాలి. అలాంటి అన్వేషణ గురజాడ, కందుకూరి గార్ల విషయంలో అవసరం కాలేదు. వారి రచనలు మన కళ్ళ ఎదుట వున్నాయి. రాజారావు కృషి మన కళ్ళయెదుట లేదు.

ఒక వ్యక్తిని ఒక జాతి దీర్ఘకాలం సంస్మరిస్తుందంటే ఆ వ్యక్తి ఒక ఉద్యమాన్ని సాగించి వుండాలి, లేదా ఆ వ్యక్తి నుంచి ఒక ఉద్యమం పుట్టి అయినా వుండాలి. వ్యక్తిని సమాజానికి శాశ్వతంగా బంధించేది ఉద్యమం తప్ప మరేదీ లేదు.

రాజారావు ఒక ఉద్యమం నుంచి పుట్టాడు. అందులో అనేక సాంస్కృతిక శాఖలూ రూపాలూ పాల్గొన్నాయి. వాటిలో నాటకరంగం ఒకటి. ఆ ఉద్యమం నాటకరంగం కన్నా చాలా విస్తృతమైనదీ, జన బాహుళ్యాన్ని బలంగా కదిలించినదీనూ. ప్రపంచ విప్లవ ప్రణాళికలు రెండవ దశా, భారత జాతీయ విమోచన పరమ దశా రూపం ధరిస్తున్నాయి. ప్రజలలో బహుముఖ జాగృతి కలుగుతున్నది. దేశపటాల రంగులు మారబోతున్నాయి. ఒక యుగం అంతరించి మరొక యుగం రాబోతున్నది.

ఆ తరుణంలో వృత్తి చేత డాక్టరూ, ఔత్సాహిక నటుడు అయిన రాజారావు 'ప్రజానటుడు' అయాడు. అలా నటులుగా రూపొందిన అనేకమంది లాగా కాకుండా రాజారావు ప్రజానాటకాన్ని ఒక ఉద్యమంగా తీర్చిదిద్దటానికి తన ప్రతిభా జీవితాలను ధారవోశాడు.

నాటకం కూడా యితర కళల లాగే ఒక నిర్లిప్త కళ. దాని శిల్పమూ, చక్కదనమూ, గొప్పదనమూ, వైశిష్ట్యమూ దానికి వున్నాయి. నాటకం విలువలను పెంపొందించటానికి మాత్రమే జరిగే కృషి ఆ రంగానికే పరిమితమవుతుంది గాని సామాజికోద్యమం అనిపించుకోదు.

ప్రజా నాట్యమండలి నాటకాలు సామాజికోద్యమంగా ముందుకువచ్చాయి. 'ముందడుగు' లాంటి నాటకాలు లోకోత్తరమైన నాటకాలు కావు. అవి లోకాన్ని ఒక తరుణంలో సంచలింపజేసిన నాటకాలు. ఈ ఒక్క లక్షణంతో నాటకరంగపు విలువలు ఎలాంటి విప్లవ పరిణామాలకు గురి అవుతాయో ఎవరైనా ఊహించవచ్చు. 'సత్యహరిశ్చంద్రీయమూ', 'చింతామణి', 'శ్రీకృష్ణరాయబారమూ', 'శ్రీకృష్ణ తులాభారం' లాంటి నాటకాలు ఆడితే ప్రేక్షకుడు వాటిని తన ఆత్మచైతన్యం పెంపొందించటానికి చూడరాడు. ఎవరు ఏ పాత్రను ఎంత బాగా చేశారో, ఎవరు ఎంతబాగా పాడారో, ఎవరికన్నా ఎవరు ఏ పాత్రను ఎక్కువ రక్తికట్టిస్తారో గ్రహించటానికి చూడవస్తాడు. అది ఒక సంస్కృతి, దాని నుంచే కిరాయి నాటకాలు పుట్టాయి. నటులు 'తారత్వం' సంపాదించుకున్నారు.

నటులలోనూ తేడా వున్నది. ప్రజానాటకాలలో హీరోపాత్ర ధరించేవాడు తాను అసంఖ్యాకులైన పీడితప్రజల తరఫున నిలబడినవాడి పాత్ర ధరిస్తున్నానన్న స్పృహతో నటిస్తాడు. అలాగే 'విలన్' పాత్ర ధరించేవాడు సమాజంలోని కుళ్ళును ప్రేక్షకులముందు బట్టబయలు చేస్తున్నానన్న స్పృహతో నటిస్తాడు. తారత్వం సమస్యా, కిరాయి సమస్యా మచ్చుకైనా లేదు. నటులకు పెద్దపీటలూ, చిన్నపీటలూ లేవు. ప్రజానాటకాలు నాటకరంగంలో తెచ్చిన పరిణామం విప్లవ పరిణామమనటానికి ఎలాంటి సందేహమూ లేదు. లోగడ చాలా ప్రసిద్ధమైన నాటకాలుండేవి. అవి యింకా

వున్నాయి. కాని అవి ప్రజా నాటకాలు కావు. ఇప్పటికీ గొప్ప నటులని మనం చెప్పుకునే మహానటులు కూడా లోగడ వుండేవారు వారు ప్రజానటులు కారు. వారి వెనకా, వారి వెంటా ప్రజోద్యమం లేదు

ప్రజా నాటకాలను ఎలా ప్రదర్శించినా జనం చూసి వుండేవారే కాని వాటిలో నాటకశిల్పమూ, నటనాశిల్పమూ ఉన్నతంగా వుంచడానికి రాజారావు చేసిన కృషీ, పడిన శ్రమా మరపురానివి అతను నాటక కళకూ ఉద్యమానికీ సమన్వయం సాధించటానికి తన బుద్ధిని నిర్దాక్షిణ్యంగా ధారపోశాడు.

కాని చారిత్రక కారణాల వల్ల ఉద్యమం అంతరించింది. రాజారావు బతికి వుండగానే అది అంతరించింది ప్రాణి నశిస్తే అస్తికలు మిగిలినట్టు, ఉద్యమంతో వచ్చిన కళలు తమ అంతరంగ దార్ఢ్యం వున్నమేరకు అవశేషాలుగా మిగిలివుంటాయి– కన్యాశుల్కం మిగిలి వున్నట్టు కళకోసం పుట్టే నాటకాలు చచ్చిపుట్టితే, ఉద్యమం కోసం పుట్టేవి చచ్చి కూడా మిగిలి వుంటాయి ఉద్యమం పోగానే నటులు విరమిస్తారు లేదా కిరాయినటులుగా పరివర్తన చెందుతారు, ఎగబాకడానికి పోటీ పడతారు. తమకు దొరికిన వేషం వేస్తారు. ప్రజలకు తాము ఏమవుతారన్నది అంతగా వారిని బాధించదు, నిచ్చెనమెట్లు ఎక్కటానికి తప్ప.

ఉద్యమంలో చేరి తాను చేసిన కృషినే రాజారావు ఉద్యమం లేకుండా కొనసాగించడానికి ప్రయత్నించాడు అతనికి అంతకన్న గత్యంతరం లేదు. కాని అది ఇసకపర్రలో వ్యవసాయం అందులో భాగమే అతను తీసిన 'పుట్టిల్లు' సినిమా చిత్రం. దాన్ని జనం ఎగబడి చూడలేదు. అందులో వున్న సందేశం కూడా జనానికి పట్టలేదు. ఇంకా నాలుగుకాలాల పాటు బతకవలసిన రాజారావు ఆకస్మికంగా పోతే నాటకకళకు తీరని నష్టం జరిగిందని ఎవరూ విచారించినట్టు లేదు. నాటక కళకు అతని చావు వల్ల తీరని నష్టం కూడా ఏమీ జరగలేదు.

రాజారావు సంస్మరణ నిరుపయోగమని చెప్పటానికి నేను ఇదంతా రాయలేదు రాజారావు సంస్మరణ సభ జరిగి తీరాలి. ఎందుకో చెబుతాను. ప్రజోద్యమం అణగారిపోయినా ప్రజానాటకపు బీజాలను దేశంలో విరివిగా వెదజల్లి పోయింది. దాని నుంచి 'కొత్తనాటకం' వచ్చింది. దాన్ని మనం ఔత్సాహిక నాటకరంగంలో అడపాదడపా చూస్తున్నాం. ఈ నాటకాలు రాసేవాళ్ళూ, అందులో నటించేవాళ్ళూ సినిమారంగం మీద కన్నువేసి వుంచితే అందుకు వారిని తప్పుపట్టే పనిలేదు. కాని వాళ్ళు ప్రజానాటకాల ఆనవాయితీలను కొన్నింటిని సజీవంగా వుంచుకున్నారు. అట్టడుగు జీవితాన్ని చిత్రించటానికి నాటకాలు ప్రయత్నిస్తున్నాయి. ఒక్కొక్కసారి వాటిలో సామాజిక సిద్ధాంత పటుత్వం వుంటం లేదు. జీవిత

సత్యాలకు ఎప్పుడెప్పుడు పెరుగుతున్నాయి. ఈ లోపాన్ని గురించి ఇంకా స్పష్టంగా వివరించి చెప్పాలంటే, ఒక ప్రజోద్యమం లేకపోతే జీవితం ఎంత స్తంభించిపోతుందో కనిపించినా ఎంతో కాలం ఆగదు ప్రజానాట్యమండలి కార్యక్రమం ప్రజ్వరిల్లే సమయానికి రాజారావు లాంటి వాళ్లు కావాలి. అయితే రాజారావు సంస్మరణ ఉత్సవాలు జరగాలి కాని అది స్మారకోత్సవం కారాదు. రాజారావు అభిమానులు, శిష్యులూ అభ్యుదయ నటులు, రాజారావు లాగా స్టేజికి తమ జీవితాలను ధారపోద్దామనుకొనేవారు నేను చెప్పిన అంశాలను గురించి ఆలోచించటం అవసరం 'నాటకాల పిచ్చి' లో ఎస్టేట్లు పోగొట్టుకున్నవాళ్ళున్నారు వారు సోదిలోకి కూడా రారు. వ్యర్థత్యాగాలు అవగాహన లోపించటంతో జరుగుతాయి దాని ఫలితంగా కనువిప్పు కలగటమూ, సాధించుకున్న ప్రగతిని కూడా కోల్పోవటమూ జరుగుతుంది ఈనాడు 'నాటకోద్ధరణ పేరిట జరిగే కృషిలో చాలాభాగం రాజారావు ఆత్మకు విషతుల్యమైనది నాటకాలూ నటులూ తమను తాము ఉద్ధరించుకోవటానికి ఏ ఉద్యమాలూ అవసరం లేదు సమర్థులైన నటులు పరమ చెత్త నాటకాలను ఉద్ధరించారు కాస్త మంచి నాటకాలు సినిమాల లాగే - దాదాపు ఏ మాత్రమూ ప్రతిభలేని వాళ్ళను సైతం 'గొప్ప' నటులను చేశాయి ప్రజానాటకాల ఆశయాలను ఉన్నతస్థితిలో పిలయునంత సజీవంగా వుంచటం తప్ప నాటకరచయితలూ, నటులూ చేయదగినది ఏమీలేదు

*ఆంధ్రజ్యోతి దినపత్రిక, 5-10-75*

## 32. కళలు జీవితానికి గీటురాళ్ళు

ఎంతమంది వద్ద రేడియోలు, లేక టి వి సెట్లు, లేక ఫ్రిజిడేర్‌లు, లేక స్కూటర్లు, లేక కార్లు, లేక ఏర్‌కండిషనింగ్ యంత్రాలు వున్నాయనేది జీవితానికి గీటురాయి కాదు. విదేశీద్రవ్యం పిచ్చిలవడిగా ఖర్చుచేసే తాహతూ, అవకాశమూ వున్నవాళ్ళు వీటిని సంపాదించుకోవచ్చు. ఇటీవల జైళ్ళలోకి వెళ్ళిన స్మగ్లర్లూ, జైలుకు వెళ్ళిన వారి అనుయాయులూ ఇలాటి 'సంస్కారాన్ని' తేలిగ్గా దిగుమతి చేసుకోవటానికి కృషి చేసారు. ఆఫ్రికాలో ఆటవిక దశలో వున్నవాళ్ళు కూడా అవకాశం దొరికితే ట్రాన్సిస్టర్లు వగైరా సంపాదించుకోవచ్చు అవి వారి జీవితానికి కొలబద్దలుగా పనికి రావు

అలాగే ప్రభుత్వ ఆర్థిక గణితం జీవితానికి గీటురాయిగా పనికి రాదు ఈ దేశంలో తలసరి ఆదాయం ఇంత అంటే అందులో సగం కూడా లేని జనాభా 60

శాతం వుండొచ్చు. అంతకు మూడింతలు ఆదాయం గలవారు 10 శాతం వుండొచ్చు (ఎప్పుడో ఎవరో గణిత ప్రవీణుడు నది సగటులోతు నాలుగున్నర అడుగులు అని లెక్కగట్టి నదిని దాటటానికి దిగాడు!)

రాజకీయ శాసనాలూ, పత్రాలూ కూడా జీవిత వాస్తవికతను ప్రతిబింబించక పోవచ్చు. ప్రభుత్వం అరాచకానికి వెరిచి లక్షమందిని జైళ్ళలోకి తోస్తే దేశద్రోహులు దేశంలో లక్షమంది వున్నారనీ, మిగిలినవారిలో దేశద్రోహులు లేరనీ చెప్పటానికి లేదు. అలాగే దేశప్రజలకు ప్రాథమిక హక్కులు లేవంటే బందిలదొడ్డిలో వుంచే పశువులకూ, దేశ ప్రజలనబడే వ్యపాత్తులకూ తేడా ఏమీలేదని చెప్పటానికి లేదు. చివరకు ఎన్నికలలో విశేషంగా ప్రజలు ఒక పార్టీకి హెచ్చుగా ఓట్లు ఇస్తే ప్రజలు ఆ రాజకీయ పార్టీ రాజకీయాలను అభిమానిస్తున్నారని కూడా చెప్పటానికి లేదు. ఎన్నికలలో గెలిచి ప్రజా ప్రతినిధులమని చెప్పుకునేవారు మధ్యలో 'కోటు' మార్చితే, వారిని ఎన్నుకున్న ప్రజలు కూడా తమ రాజకీయ విశ్వాసాలను మార్చుకున్నారని అర్థం కాదు. ఇలా కోటు మార్చేవారిని చట్టం పదవీభ్రష్టులను చెయ్యదు గనక వారు ప్రజా ప్రతినిధులన్నది శుద్ధ అబద్ధం అవుతున్నది.

చెప్పవచ్చిందేమంటే ప్రజల జీవితానికి ఇవేవీ గీటురాళ్ళు కావు. మన విదేశీ వర్తకం చాటునా, ఆర్థిక గణితాల వెనకా, రాజకీయ వ్యవస్థ చాటునా ప్రజలు ఎలా జీవిస్తున్నారో చెప్పటం సాధ్యం కాదు.

ఈ విషయంలో నిజాన్ని నిష్కర్షగా బయటపెట్టేవి కళలు. స్థూలంగా చెప్పుకోవాలన్నా, హెచ్చు సంస్కారం గల వాడికి తక్కువ సంస్కారం గల కళలు పనికి రావు, తక్కువ సంస్కారం గలవాడికి హెచ్చు సంస్కృతిని ప్రతిబింబించే కళలు పట్టవు. సినిమా పాటలకోసం చెవికోసుకునేవాణ్ణి పాటకచ్చేరీ వినమంటే చాలా బాధపడతాడు.

సంగీతమూ, సాహిత్యమూ, చిత్రలేఖనమూ, నాటకాలూ, సినిమాలూ - వీటి ప్రచారం గురించి మనకు నిర్దుష్టమైన వివరాలు లభ్యమవుతాయి.

సంగీతం తీసుకుందాం. ఇందులో చెప్పుకోదగినవి సినిమా సంగీతమూ, పాట కచ్చేరీలూ.

ఈ సందర్భంలో ఒక విచిత్రమైన విషయం ఎంతమంది గమనించారో తెలీదు- మన దేశంలో పాటకచ్చేరీలు చేయగల సంగీత విద్వాంసులకన్న సినిమా ప్లేబాక్ పాడేవాళ్ళ సంఖ్య తక్కువ! చాలా తక్కువ. అయితే ఈ అల్పసంఖ్యాకులు అత్యధిక సంఖ్యాకులైన ప్రజలకు కావలసిన సంగీతం అందిస్తున్నారు. శాస్త్రీయ సంగీతాన్ని ప్రోత్సహించటానికి ఏర్పడిన 'సభలు' సినిమా సంగీతకారులను హెచ్చుగా ప్రోత్సహించవలసి రావటం జరుగుతున్నది.

సంగీతం విషయంలో సంస్కృతి గురించి గాని, వర్గస్వభావం గురించి గాని, అంచనా కట్టటం సాధ్యం కాదు. ఉభయత్రా సంగీతాభిమానులలో అన్ని వర్గాలవారూ, సంస్కృతులవారూ వున్నారు. అయినా రెండురకాల సంగీతాల సాపేక్ష విలువలు నిర్ణయించవచ్చు. సంగీత విద్వాంసుడు కావటానికి అయిదు మొదలు పదిసంవత్సరాల శిక్షణ అవసరం కావచ్చు. ఆ తరవాత కూడా యావజ్జీవ సాధన వుండనే వున్నది. ప్లేబాక్ పాడేవాళ్ళు దాదాపు గాలిలోనుంచి పుట్టుకొస్తారు. ఘంటసాల లాంటి విద్వాంసులు చాలా అరుదు. సగటు ప్లేబాక్ పాటగాడికి గురువు ఎవరో, ఎంతకాలం సంగీతశిక్షణ పొందాడో తెలీదు, తెలియవలసిన అవసరం కూడాలేదు. ఒకసారి లతామంగేశ్కర్ నాతో ''మేమంత పెద్ద సంగీత విద్వాంసులమని చెప్పను. కాని సంగీతం మూలసూత్రాలు బాగా తెలియకుండా సినిమా పాటలు పాడేవారంటే నాకు చాలా మంట!'' అన్నది. సినిమా పాటలు పాడటానికి కూడా శాస్త్రీయసంగీతం పునాది వుండాలని లతా అభిప్రాయం. దాన్ని బట్టి రెండు రకాల సంగీతాలను మనం అంచనా వేసుకోవచ్చు. క్రమశిక్షణ లేని ఏ కళ అయినా వినోదం కింద దిగి, ప్రజల సంస్కృతికి పరోక్షంగానైనా దోహదం చెయ్యలేని స్థితికి రాక తప్పదు.

కళలు ప్రజలకు వినోద సాధనాలు కావటం ఎంత అవాంఛనీయమో, కళాకారులకు 'హాబీ' కావటం అంత అవాంఛనీయం. అయితే నాటకాలకు ఈ దుస్థితి పట్టుతున్నది. నాటకాల మీద ఎంత సమర్థులైన నటులు సైతం జీవించటం సాధ్యం కాదు. మన ప్రజలు నాటక కళను పోషించలేని స్థితిలో వున్నారు. నలభై, యాభై ఏళ్ళ క్రితం హరిప్రసాదరావు, బళ్ళారి రాఘవ లాంటి మహానటులు నటనను వృత్తిగా పెట్టుకోలేదు. తరవాత తరవాత వృత్తినటులు వచ్చారు. వారి వెనకే కిరాయినటులూ, నాటక కళ పతనమూ వచ్చాయి. రెండో ప్రపంచ యుద్ధానంతరం నాటకం పునర్జన్మ ఎత్తినమాట నిజమే గాని, దాని రూపురేఖలు తెలుసుకోవాలంటే ఆ నాటక కర్తలూ, నటులూ సినిమా గొడుగుకిందికి వచ్చారన్నది గుర్తిస్తే చాలు!

నాటకాలతోబాటే చెప్పుకోవచ్చు నాట్యం గురించి. ఇది కూడా శాస్త్రీయ సంగీతం లాగే క్రమశిక్షణతో కూడిన కళ. ఒక మహాసముద్రం లాంటిది. కాని ఇది వృత్తిగా పెట్టుకుని ఎవరూ బతకలేరు. బహుకొద్ది ట్రూపులు మంచి ప్రదర్శన లిస్తున్నాయి. కాని ఇతివృత్తాలు పౌరాణికాలు. వర్తమాన ప్రజాజీవితానికి అంటేవి కావు! గత సంస్కృతులను కొంచెం ఆధునికంగా ప్రతిబింబిస్తాయి.

చిత్రలేఖనా, శిల్పమూ గురించి చెప్పుకోనవసరం లేదు. పాశ్చాత్య ధోరణులను అన్ని కళలకన్నా ఎక్కువగా అందిపుచ్చుకుని, ప్రజలకు వీలయినంత దూరంగా వుండటానికి ప్రయత్నించేవి ఈ కళలు.

సాహిత్యమంటే తొంభైశాతం పత్రికలు, తొమ్మిదిశాతం ఆ పత్రికలనుంచి పునర్ముద్రితమయే నవలలు వగైరాలు విజయవంతమైన రచనలు చేసేవారికి ప్రపంచం గురించి ఏమీ తెలియనవసరం లేదు, ఆర్థికాలూ, రాజకీయాలూ, మానవ శాస్త్రమూ, సామాజిక శాస్త్రమూ, సాధారణ శాస్త్ర పరిజ్ఞానమూ - ఇవేవీ అవసరం లేదు వాటిల్లో కృతకజీవితం ప్రతిబింబించినా ప్రజాదరణకు అడ్డం వుండదు సినిమాలకూ, సినిమాకారులకూ ఇదే వర్తిస్తుంది

ఈ సినిమాలకూ, రచనలకూ గల ప్రచారం చూస్తే ఈ దేశంలో జన సామాన్యానికి తమ వాస్తవ జీవితాలను గురించి ఏమీ తెలీదనుకోవాలి. లేదా, వాస్తవ జీవితం మీద కళల ప్రభావం వుండవచ్చునన్నది వారికి తెలియదనుకోవాలి. ప్రజల ఈ దీనస్థితి జీవితం గురించి సరి అయిన అంచనా ఇస్తుందని చెప్పాలి

*కళాసాగర్ పంచమ వార్షికోత్సవ సంచిక, 1977*

## 33. కళా విమర్శ

ఒకప్పుడు, కళాస్వాదన చెయ్యగల వాళ్ళు అత్యల్పసంఖ్యాకులుగా వున్న కాలంలో, ''శిష్టులు''గా సంఘంలో చలామణీ అయినవారు కళలకు నిబంధనలూ, ప్రమాణాలూ, విమర్శకు కొలబద్దలూ నిర్ణయించి, తమ వాదాన్ని నెగ్గించుకోగలిగారు. వారు ఆదరించిన కళారూపాలు మాత్రమే వుండేవని కాదు! అన్ని రకాల జానపద కళలూ వుండేవి. అత్యధిక సంఖ్యాకులు బహుశా వాటినే ఆదరించేవారు, అయితే అవి కళలుగా తలఎత్తుకు తిరిగే అర్హత సంపాదించుకోలేకపోయాయి ఆనాటి రాజకీయ, సాంఘిక వ్యవస్థ అందుకు అనుకూలంగా లేకపోయింది.

ఆనాటి రాజకీయ-సాంఘిక వ్యవస్థ గుర్తించటానికి వీలులేకుండా మారిపోయినా ఈనాడు కూడా ఆనాటి కళాసిద్ధాంతాలను పట్టుకు వేళ్ళాడుతూన్న వాళ్ళు వున్నారు. కొందరు బుద్ధిమంతులు ఇది అసంగతమని గుర్తించి కూడా, కొత్త ప్రమాణాలు రావాలి, రాకపోతే రంగాలు అరాజకంగా వుంటాయి అంటున్నారు. ఈ రెండు ధోరణులూ తప్పేనని నా నమ్మకం అందుకు కారణాలు చెబుతాను.

ఒకప్పుడు ఏ రాజకీయ, సామాజిక శక్తులు తమకు అనుకూలమైన కళలకే ప్రమాణాలు నిర్ణయించి, ప్రచారం చేసాయో, వాటి స్థానంలో భిన్నమైన రాజకీయ, సామాజిక శక్తులు పుట్టుకొచ్చి రకరకాల కళాప్రమాణాలు చలామణీ కావటానికి అనుకూలించే పరిస్థితులను కలిగించాయి. మన కళ్ళ ఎదుట ప్రజాస్వామ్యం జానపద

కళలను వర్గీకరించటం మొదలుపెట్టింది ''ఇదే కళ, ఇది కళ గాదు'' అని శాసించే హక్కు ఎవరికీ లేదు. అలా అనే హక్కును కొందరు ఉపయోగించుకున్నప్పటికీ దాన్ని శాసనంగా అమలు చేసే హక్కు వారికి లేదు. ఒక్క సాహిత్యాంగాన్నే తీసుకున్నా, ఎన్నో సనాతనవాదం మొదలుకొని విప్లవవాదం దాకా అన్ని రకాల వాదాలనూ ప్రతిబింబించే రచనలు వెలువడుతున్నాయి. వీటిలో కళాకారుల సంస్కారంలోని భిన్నత్వమూ కళాస్వాదకుల సంస్కారాలలోని భిన్నత్వమూ ప్రతిబింబిస్తున్నది. అభ్యుదయ రచనలను చదివినంతమంది విశ్వనాథవారి రచనలను చదివి వుండకపోవచ్చు. కాని విశ్వనాథ అభిమానులు చేసినంత ''వల్లడు'' అభ్యుదయ సాహిత్యాభిమానులు ఏనాడూ చేయలేదు. ఒక కారణం బలమైన రాజకీయ, సామాజిక శక్తులు విశ్వనాథవారి సంస్కృతికి అనుకూలంగా వుండటమే. ''విశ్వనాథ అపర వ్యాసుడు! అపరకాళిదాసు! ఆధునిక నన్నయ భట్టు!'' అనటానికి కొందరికి హక్కు వున్నట్టే, ''విశ్వనాథ రచనలు చెత్త! కుళ్ళు!'' అనటానికి ఇతరులకు అంత హక్కు వున్నది. కాకపోతే ఒకరి హక్కును రెండోవారు గుర్తించరు, కాని రద్దుచెయ్యనూ లేరు! ఇది గమనించవలసిన విషయం.

మార్క్సిస్టు ఏమంటాడో అడిగితే, ''ఏమీ లేదు, ఈ వ్యత్యాసాలు వర్గస్వభావాన్ని బట్టి ఏర్పడ్డవే. వీటి మధ్య సంఘర్షణ అనివార్యం'' అంటాడు. నిజమే కావచ్చు గాని, ఈ వివరణ కొన్ని సందేహాలను రేపుతుంది. ఒకటి, కళారంగంలో వర్గమనస్తత్వాలు ఎంతవరకు స్ఫుటంగా వున్నాయి? కమ్యూనిస్టు వ్యతిరేకులు అభ్యుదయ కళారూపాలను చూసి తన్మయత్వం పొందారు. మన దేశంలో వర్గచైతన్యం ఏ మాత్రం ఎదుగులో వున్నా కులతత్వం ఇంత బలంగా వుండదు. చారిత్రక కారణాల వల్ల దేశాభ్యుదయం వర్గచైతన్యాన్ని ఓనమాల స్థితినుంచీ ప్రజలను రంగరించి పోయటంపైనా అమితంగా ఆధారపడి వున్నది. పిపీలికం తాను శ్రామికుణ్ణి అని తెలుసుకునే దాకా కర్తవ్యం తెలుసుకోలేదు!

ఇక రెండోది, కళాసంస్కృతుల మధ్య ఘర్షణలో జయాపజయాలు లేవు. అవి సినిమా కొట్లాటలు, చాలావరకు పాఠకుల వినోదానికి, ఒక్కోసారి పత్రికల సర్క్యులేషన్ పెరగటానికీ పనికివస్తాయి.

• ఈ విషయాలు స్పష్టంగా గ్రహించిన వాళ్ళు ఏ రకం కళతోనూ, అభిరుచి తోనూ పేచీపడి లాభం లేదు. ఒకరకం కళను ఇంకొక కళాభిమానులు తూర్పారబట్టవచ్చు. దాని ఫలితం ఎంతవరకు వుంటుందంటే, ఏ రకం సంస్కారం గలవాళ్ళు ఆ రకం సంస్కారంతో కూడిన విమర్శలను మెచ్చుకుంటారు. కళారూపాలతోనైనా సంస్కారం ఒక మెట్టు పెరగవచ్చు గాని, విమర్శతో పెరగటం చాలా అరుదని నా నమ్మకం.

సంస్కారంలో హెచ్చుతగ్గులు లేవా అంటే వున్నాయి. ఉన్నతమైన సాహిత్యం వల్ల వుండే అభిరుచికన్న ఛండాలపు సాహిత్యం మీద వుండే అభిరుచి హెచ్చు పరిణతి పొందినదని నేను అనుకోను. ఒకనికి జీవితంలో సంస్కారపు పాలు అసంపూర్ణంగా వున్నాయి- ఏ ఇద్దరి సంస్కారమూ ఒకటి కావడం కూడా అరుదు. కాని ఎవరి సంస్కారం వారికి పరమ వాస్తవమైనది - మారుతూ వుండేదే. దాని తోలుబొమ్మలు చూసి పారవశ్యం చెందేవాడు సినిమాలు మంచివని నిరూపించటానికి ప్రయత్నించి లాభం లేదు వాడంతట వాడే కాలక్రమాన మారి సినిమాలే మంచివనే స్థాయికి పెరగవచ్చు ''కేతిగాడు బంగారక్క' హాస్యం లాంటిది సినిమాలలో లేదని ఒక మూల బాధగా వున్నా (ఈ లోటు కూడా తీరుతూ సినిమాలు వస్తున్నాయి మీ దయవల్ల!)

ఆత్మ పరిశీలన చేసుకుంటే ప్రతి ఒక్కరి అభిరుచీ వివిధ కళారంగాలలో ఎలా, ఎన్ని సార్లు మారినదీ తెలుస్తుంది ఒకప్పుడు నాకు ఎసజాక్షిని మించిన గాయకురాలు లేదు 'వాడే వీడు' కన్న గొప్ప సాహిత్యం వుండేది కాదు కనక, అభిరుచులూ, సంస్కారమూ మారతాయి మార్పు అనివార్యం అయితే ఇది ఎలా వచ్చేదీ తెలియకుండా, దానంతట అదే, యాదృచ్ఛిక సంఘటనల ఫలితంగా రావాలా, లేక కళారంగంలో అభివృద్ధికి దోహదం చేసే సంస్కారం పెరుగుదలను ప్రయత్నపూర్వకంగా సాదించవచ్చునా? అంటే ఈ లక్ష్యం సాధించటానికి ప్రకృతినీ, విధినీ నమ్ముకోవాలా? కృషిచెయ్యాలా? మానవ ప్రయత్నం ఊహాతీతమైన అద్భుతాలు సాధించే ఈ కాలంలో (యంత్రసహాయంతో అంగారకగ్రహం ఫోటోలు తీసి వాటిని భూమికి పంపటం అద్భుతం కాదా?) దేన్నీ ప్రకృతికి వదలవలసిన అవసరం లేదు.

కళలనూ, సంస్కారాన్ని ఉన్నతికి తీసుకుపోయే ప్రయత్నం రాజకీయ-సామాజిక రంగాలలో జరగాలి. వర్గరహిత సమసమాజం అత్యున్నత సామాజికదశ అయిన పక్షంలో ఆ సమాజ సంస్కారం నుంచి అత్యున్నత కళలు పుట్టుకురావాలి అటువంటి సంస్కారం పెంపొందని స్థితిలో కళాకారుడు ఉన్నత కళలను సృష్టించనూ లేడు, ప్రజలు ఆస్వాదించనూ లేరు అభ్యుదయ కళలలోనూ, విప్లవ సాహిత్యం లోనూ విఫల ప్రయత్నాలు కనిపిస్తే అందుకు కారణం వాటి వెనక వుండవలసిన సంస్కారబలం లేకపోవటమూ, నిజమైన సంస్కారానికి ప్రత్యామ్నాయంగా పిడివాదం అమలు కావటమూ మాత్రమే.

*స్పందనవాణి మాసపత్రిక ప్రారంభసంచిక, జులై 1978*

# 34. కళలు

## 1) కళల సామాజిక స్వరూపం

సాహిత్యమూ, నాటకాలూ, సంగీతమూ, శిల్పమూ, చిత్రలేఖనమూ, నృత్యమూ, సినిమాలూ మొదలైనవి ఒక సమాజం తాలూకు సంస్కృతి నుంచి ఉద్భవించి, ఆ సంస్కృతికి కొలబద్దలుగా వుండటమే గాక ఆ సమాజం యొక్క పురోగమనానికి గాని, తిరోగమనానికి గాని తోడ్పడతాయి.

ప్రస్తుత పరిస్థితిలో మనదేశం పై విషయాన్ని నిరూపించటం చాలా కష్టం ఎనిమిదో తరగతి విద్యార్థులు చిన్నపిల్లలకు రచనలనూ, రచనోత్సాహం గల వాళ్ళు ఊసుపోక కోసం రాసే కథలనూ, నవలలనూ, కారణాంతరాలవల్ల సినిమా చిత్రాలు తీసి అందులో జీన్స్ ధరించిన అమ్మాయిలనూ, ఇంట్లో కూడా సూట్‌తో టై వేసుకొని, హాట్ ధరించే అమ్మాయిల తండ్రులనూ, నైట్‌డ్రస్‌తో గాని పడుకోని హీరోలనూ చిత్రించే నిర్మాతలనూ ప్రమాణంగా తీసుకొని, నైరూప్య చిత్రకళలో ఓలలాడే చిత్రకారులను చూస్తే, కళలకు సామాజిక సంస్కృతితో ఎలాటి సంబంధంగాని వుందని వూహించడం కష్టం.

విదేశీయ, విజాతీయ కళలతో- సంస్కృతితో కాకపోవచ్చు – సంపర్కమూ, సొంత సంస్కృతి అనేది తన జాతికి వుందని గాని, వుండాలని గాని కళాకారుడికి తెలియక పోవటమూ, కళాపోషకులకు – అంటే డబ్బిచ్చేవాళ్ళకు – సంస్కృతి అనేది వున్నదని కూడా తెలియకపోవటమూ, ఇలాటి వికృత కళలకు అవకాశం కలిగిస్తాయి.

ఇవి న్యాయంగా సామాజిక జీవితం నుంచి పుట్టినవి కావు గనక సామాజిక సంస్కృతిని ఏ వైపునుంచీ స్పృశించలేవు, అదే కారణం చేత ఆ సంస్కృతిని గాని, దాని ద్వారా సామాజిక జీవితాన్ని గాని మార్చలేవు.

అయితే ఇటువంటి కళలు సమాజస్థితిని ప్రతిబింబించవని చెప్పడానికి లేదు. ఎందుకంటే, ఇవి కళాకారులలోనూ కళాస్వాదకుల లోనూ గల సాంస్కృతిక బానిసత్వాన్ని, నిర్వీర్యత్వాన్నీ, అరాజకత్వాన్నీ చక్కగా వ్యక్తం చేస్తాయి.

## 2) కళాసృష్టి : వ్యక్తుల పాత్ర

కళలను సృష్టించేవాళ్ళు వ్యక్తులు గౌరవంతోనో, వెటకారానికో వాళ్ళను మనం కళాకారులంటాం. వీళ్ళు ఆకాశం నుంచి ఊడిపడరు గనకా, అనాదిగా వస్తున్న కళాసంప్రదాయాలలో ఏ మాత్రమూ సంబంధం లేకుండా వీరు కళావ్యాసంగం చెయ్యలేరు గనకా, వీరి కళలకు చలామణీ సమాజంలో వుండాలి గనకా, కళల వల్ల

లాభనష్టాలు పొందేవాళ్ళు, కళాకారులు కూడా సమాజబంధితులు గనకా, కళలకు సన్నిహితమైన సంబంధం వుండితీరాలి

కళాకారుడు సనాతనిష్టు అనుకోండి. సంఘంలో సనాతన సంస్కృతిని ఆరాధించేవారే ఆ కళాకారుడికి బ్రహ్మరథం పడతారు. అలాగే తెలుగు సాహిత్యానికి ఒరవడి 'మామ్' రచనలు అనుకుని రచనలు చేసినవారిని మామ్ సంస్కృతీ ప్రియులే ఆకాశానికెత్తారు.

నికరమైన జాతీయ సంస్కృతి లేనిచోటా, వర్గసంస్కారాలు భిన్నంగా వున్నచోట కూడా కళాకారుడికి సమాజంలో ఏదో ఒక విభాగం నుంచి గుర్తింపూ, ప్రోత్సాహమూ రావాలి. సమాజంలో ఏ విభాగానికీ, వర్గానికీ సంబంధించని కళలను సృష్టించబూనుకున్నవాడు విఫలుడు కాకపోవటంతో పోక, పెర్రాసుపత్రికి వెళ్ళే ప్రమాదం కూడా వున్నది

కళాకారుడి వ్యక్తిత్వమూ, స్వాతంత్ర్యమూ, వ్యక్తి అభిరుచీ మొదలైన మహత్తర విషయాలను గురించి ఊక దంచేవారు ఈ పచ్చినిజాన్ని విస్మరించరాదు.

3 ) కళలనుంచి కలిగే అనుభూతి

ఆటవిక దశలో వున్న సమాజంలో కూడా కళలు సమష్టి అనుభూతికి కారణాలవుతాయి. వ్యక్తులకు జీవితంలో అడుగడుగునా అనుభవాలు కలుగుతాయి అపరిణత, అల్పసంఖ్యాక సమాజాలలో ఈ వ్యష్టి అనుభవాలు సమష్టి అనుభవాలు కావటానికి కళలు అంతగా అవసరం లేదు. అలాటి సమాజాలలో కళలు గత అనుభవాలను విస్మరించకుండా వుంచటానికే సమష్టి జీవితం సాంప్రదాయక పాత్ర నిర్వహించటానికి మాత్రమే పనికివస్తాయి.

ఆర్థికంగా ఎదిగివచ్చిన పరిధిలో సమాజాలలో అనేక రకాల వ్యక్తుల అనుభవం సమష్టి అనుభవం కావటానికి కళలు ఎంతగానో ఉపయోగపడతాయి. ఈ పని వార్తల ద్వారా జరగదా అనవచ్చు. జరగదు ఇక వ్యవహారాలను నిర్లిప్తంగా తెలుసుకునే వరకే వార్తలు పనిచేస్తాయి. ఎక్కడో ఒక విమానం కూలి వందమంది చస్తే, దూరాన వున్నవారిని లేదా దేశాంతరాల వారిని, ఆ వార్త నిజంగా కదిలించదు. కళలు వార్తలను మాత్రమే అందించవు. విమానం కూలి కొందరు చావటం కథలోని సంఘటన అయే పక్షంలో, ప్రయాణీకులలో కనీసం ఒకరి మృతి వారి కుటుంబం యొక్క గతిమీద ఎలాంటి ప్రభావం కలిగించినదీ కథ చెబుతుంది. వార్తలలో వ్యక్తులు పాత్రలు కారు. కథలో వ్యక్తులు పాత్రలు. అవి కల్పిత పాత్రలే అయినా సామాజిక దృక్పథం గల వాడికి అది నిజమైన వ్యక్తులకన్న నిజమైనవి.

వాస్తవ సమాజంలో ఎవరైనా సమస్తమూ కోల్పోయి అస్తవ్యస్తానికి గురి అయితే, వారికి సంబంధించిన వాళ్ళు, ఎరిగిన వాళ్ళు బాధపడతారు కాని పరిష్కరించుకుని పోట్లు అనేకకోట్ల మంది పంచుకోగల జీవితసత్యాలకే కళలు సార్వజనీనతను కల్పిస్తాయి

ఇంతేకాదు, వాస్తవ జీవితంలో జరిగే అవాంఛనీయ పరిస్థితులకు మనుషుల 'స్వేచ్ఛ'గా స్పందించరు స్వార్థమూ, సంయమనమూ, పక్షపాతమూ వ్యక్తియొక్క బాహ్యచైతన్యానికి అడ్డుపడ్డాయి తిండికి మాడుతున్న దరిద్రులను గురించి కథలలో చదివి సానుభూతి చూపటం తేలికే. డబ్బు ఇబ్బందిలో వున్న మిత్రుడైనా, సోదరుడైనా సరే వస్తుంటే చూడగానే కలిగేది సానుభూతి కాదు, డబ్బు అడుగుతాడన్న భయం! అలాగే కోడలిని అత్తగారూ, మొగుడూ కలిసి చావగొట్టుతుంటే ''మీకు బుద్ధి వుందా?'' అని అడిగే ధైర్యం ఎంతమందికి వుంటుంది? కాని కళలు ప్రతిబింబించే జీవిత వాస్తవికతకు అడ్డుగోడ ఉండదు కమ్యూనిజం అన్న మాట వింటేనే మొర్రెత్తిపోయే వాళ్ళు 'మాభూమి' నాటకం చూసి తన్మయత్వం చెందటం నాకు తెలుసు

కాని ఒకటి అడగవచ్చు. కళలు కలిగించే ఈ శుష్క చైతన్యం ఎవరిని ఉద్ధరిస్తుంది? దీని వల్ల లాభం ఏమిటి? ఇక్కడే వున్నది అసలు రహస్యం జీవితంలో సామాజిక దురన్యాయాలకు వ్యక్తిగతంగా స్పందించేవాళ్ళు లేనిపోని చిక్కులు తెచ్చిపెట్టుకోవటం తప్ప ఏమీ సాధించలేరు. కళల ద్వారా కలిగే స్పందన సామూహికమైనది దాని వల్ల సద్యోఫలితం లేకపోయినా, భావి సామూహిక చైతన్యానికి పునాది వేస్తుంది.

ఒక వర్గానికి సంబంధించిన సమస్యలే అయినా జీవితం కలిగించే ప్రేరణతో అన్ని వర్గాల్నీ ఏకం చెయ్యలేకపోవచ్చు కాని వర్గకళలు చెయ్యగలుగుతాయి అంతే కాదు, వర్గసాహిత్య ప్రభావం వర్గాన్ని దాటి కూడా పోతుంది. భూస్వాములు రైతులకు చేసే ద్రోహం చిత్రించినట్టయితే ఆ చిత్రణ అచ్చంగా రైతులనే ప్రభావితులను చేస్తుందనుకోనవసరం లేదు భూస్వాములలో కొందరైనా ప్రభావితులు కాకపోవచ్చు అస్పృశ్యుల పట్ల అగ్రవర్ణాల వారికి సానుభూతి కలగటానికి కళ మాత్రమే ఉపయోగపడుతుంది, జీవితం కాదు ఈ సమస్యలను శాసనాలు కూడా కళల తోడ్పాటు లేకుండా పరిష్కరించలేవు.

### 4) కళలలో చైతన్యం

కళల వల్ల సమాజంలో కలిగే చైతన్యం ఎంత ముఖ్యమైనదో, జీవితగతి ప్రభావం చేత కళలలో కలగవలసిన చైతన్యం కూడా అంత ముఖ్యమైనదే అంతకన్న ముఖ్యమైనది కూడాను

ఆటవిక సమాజాలు శతాబ్దాల తరబడి మారవు కలహారి ఎడారిలో ఇప్పటికీ ఆహారం ఏరుకునే పూర్వ శిలాయుగపు సమాజాలున్నాయి ఆటవిక దశ నుంచి

ఇప్పుడు దేశకు వచ్చిన సమాజాంలో కూడా మార్పు త్వరగా రాదు. వచ్చే కొద్దిపాటి మార్పు అంత కళలకు కొన్ని, ఇతర కారణాల వల్ల ఎక్కువగా వుంటుంది. ఉదాహరణకు మనది వ్యవసాయ సమాజం కాకపోయినా కూడా, మన దేశంలో నా నాగరికత సంస్కృతులలోనూ తెచ్చుకుంటున్న మార్పులు ఏ రాతలకు ... అటువు తెచ్చుకున్నవే. కాని సామాన్య ప్రజల జీవితం మారనిట్లయితే వస్తుందేశి వాసులకు పనికివచ్చే సూక్తులు తులసీదాసులోనూ, కబీర్దాసులోనూ, ఇంకా దొరుకుతాయి. అట్లాగే మనకు వెయ్యేళ్లనాటి తెలుగు భారతం- రెండువేల ఏళ్ళనాటి సంస్కృత భారతం అనువాదం - ఇంకా మార్గదర్శకంగానే వుంటున్నది. కాని వేగంగా సమాజ స్వరూప స్వభావాలు మారే దేశాలలో మూడునాలుగు వందల ఏళ్ళనాటి సాహిత్యంలో కూడా వర్తమానానికి పనికి వచ్చే ముక్కలు అట్టే లేకపోవచ్చు.

'పనికివచ్చేది' అన్నమాట కళల విషయంలో అతి ముఖ్యం. సమాజంలో జరిగిపోయే మార్పుల విషయంలో కళాసృష్టి వుండాలి(?) కళల ఊహకూ, అవగాహనకూ అందకుండా సమాజంలో జరిగే మార్పులు ప్రజల కృషికి అందకుండా జరిగినవే అనాలి. తాము సామాజికులుగా ఏ శక్తులచేత ప్రభావితులవుతున్నదీ వారికే తెలియదన్నమాట. అలాంటి సమాజంలో కళలు విధిగా జీవితానికి వెనుకబడి పోతాయి. అటువంటి పరిస్థితిలో రెండు రకాల పరిణామాలు కలగవచ్చు, ఒకటి, కళలు జీవితానికి పది అడుగులు వెనుకగా, అసహాయంగా నడవవచ్చు, అవి కళాబూతాయి! లేదా రెండు, జీవితం దారి జీవితానిదీ, కళల దారి కళలదీ కావచ్చు.

రెండూ అవాంఛనీయమైన పరిణామాలే. ఎందుకంటే ఎంత ప్రాకృత సమాజం కూడా కళల అవసరం లేకుండా నడవలేదు. కాని కళలకూ, జీవితానికీ పరస్పరాలంబన కోల్పోయిన సమాజం, పైన ఎంత నాగరికంగా కనిపించినా, అది చచ్చిపోతున్న సమాజమే.

ఈ కారణాల చేత, కళాకారులకు సామాజిక స్పృహ అత్యున్నత స్థాయిలో వుండటం ఎంతో అవసరం. ఎనిమిదోక్లాసు కుర్రాళ్ళూ, సజ్జలు తిని సజ్జలు రెట్ట వేసేవాళ్ళూ, స్వజాతి సంస్కృతి మీద రోత, పర సంస్కృతీ వ్యామోహమూ గలవాళ్ళూ, ''మీకు కళలంటే ఏమిటో తెలీదు. మేం సినిమా గిల్లాపెట్టెల వాళ్ళం'' అనే వాళ్ళూ ఎంత విజృంభించనియ్యండి, సమాజం యొక్క పురోగతి అసలైన కళాకారుల కృషి మీద ఆధారపడి వున్నది.

'కళా స్వేచ్ఛ', 'వ్యక్తి స్వాతంత్ర్యం', 'కళాకారుడి ఉన్నత కళాభిరుచి' లాంటి శుష్కపదాలు కళలనూ ఉద్ధరించవు, సమాజాన్నీ ఉద్ధరించవు. ''యాదృచ్ఛికంగా కూడా ఉత్తమ కళలు జీవితానుభవం నుంచి రావొచ్చు'' అన్నది కుంటివాదం. జీవితానుభవం జీర్ణం కావటానికైనా సామాజికతత్వం బోధపడాలి. లేకపోతే జీవితానుభవం వున్న ప్రతివాడూ ఉత్తమ కళలు సృష్టించవచ్చు. మళ్ళీ మాట్లాడితే అందరికీ జీవితానుభవం

వున్నది గనక కళంతో పనేలేదు ఎవరిమటుకు వారే జీవితాన్ని కాపి, వడబోసి, కాఫీ లాగ తాగెయ్యవచ్చు!

సమాజతత్వం కొంచెం గూడా అర్థం చేసుకోకుండా గంపలకొద్దీ కథలూ, కవితలూ, చిత్తరువులూ సృష్టించటం అసాధ్యం కాదు ముఖ్యంగా పురాణకాలపు సంస్కృతికి పరిమితమై దాన్ని ఎగదోస్తూ కళలు సృష్టించే కొంతమంది విభూతిపళ్ళ చేత బ్రహ్మరథం పట్టించుకోవచ్చు కాని అమలులో వున్న సంస్కృతికి కాలదోషం పట్టిన మనదేశం లాటి దేశాలలో కళాకారుడు తన విధిని తాను సరిగా నిర్వర్తిస్తే జైలుకు పోవటమో, పోలీసు తుపాకులకు గురికావటమో జరగటం తథ్యం. నలభై యాభై ఏళ్ళ క్రితం జైలుకు పోవటం దేశభక్తుడికి ఎటువంటి సిఫార్సో, ఈనాడు పోలీసు చిఠాలోకి ఎక్కి, జైలుకో, తుపాకి గుండుకో ఎర అయే పరిస్థితిలో వుండటం అలాంటి సిఫార్సుగా కనబడుతుంది.

నిజమైన కళలకు సంధియుగంలో ప్రబలమైన శత్రువులుంటారు. లేకపోతే అవి నిజమైన కళలు కావు.

*అవగాహన 2-10-1979*

## 35. కళానుభూతిలో రకాలు

సినిమాలు చూస్తాం, సంగీతం వింటాం. పుస్తకాలు చదువుతాం. నచ్చినవి నచ్చుతాయి, నచ్చనివి నచ్చవు. ఎందుకు నచ్చింది? ఎందుకు నచ్చలేదు? అన్న ప్రశ్నలకు చాలామంది సరిగా సమాధానాలు చెప్పలేరు. చెప్పేవాళ్ళ సమాధానాలు కూడా అన్నీ ఒకరకంగా వుండవు. కళల ప్రభావాన్ని గురించి శాస్త్రీయంగా పరిశీలన చేస్తున్నవాడికి ఇన్నిరకాల సమాధానాలుండటం చాలా తలనొప్పిగా వుంటుంది.

ఇలా శాస్త్రీయంగా పరిశీలించే అవసరమైనా సినిమాలాంటి భారీ కళాపరిశ్రమ మూలంగా కలిగింది. మన నిర్మాతలు శాస్త్రీయంగా ఆలోచించేశక్తి లేక, ఊహాగానాలతో ప్రారంభించారు. ఆ విధంగా మొట్టమొదట ఆరంభమైన ఊహాగానాలు చిత్రనిర్మాణం తాలూకు ఫార్ములాలతో కూడుకున్నవి.

లక్ష్యం సినిమా కళాఖండం అత్యధిక సంఖ్యాకులైన ప్రేక్షకులను ఎలా ఆకర్షించటం?

సమాధానం నంబరు 1: తారలను బుక్ చెయ్యి.

ఆ పద్ధతి కొనసాగింది కొంతవరకు ఫలించింది ఎందుకంటే ప్రేక్షకులకు తారల మొహం మొత్తటం ఆరంభించినా డిస్ట్రిబ్యూటర్లకు వారిలో విశ్వాసం పోలేదు అందుచేత ప్రొడ్యూసర్ కర్తవ్యం ప్రేక్షకులను గురించి ఆలోచించడం కాదు, డిస్ట్రిబ్యూటర్ల విశ్వాసాలకు హారతి పట్టటం!

సహజంగా ఈ దశలో సినిమా పరిశ్రమ నుంచి కళ, కళానుభూతి అనేవి నిశ్శబ్దంగా నిష్క్రమించాయి. నిర్మాతలు హాయిగా నిట్టూర్చారు వ్యాపార సరుకు తయారుచెయ్యటం డబ్బున్నవాడు ఎవడైనా చెయ్యొచ్చు. కళాఖండం అనేసరికి కళాకారుళ్ళు కావాలి ఎవరా కళాకారుళ్ళు? వాళ్ళ కళ జనానికి పట్టుతుందని ఏమిటి?

అయితే తొలి ఊహాగానం బెడిసి కొట్టసాగింది అందరు తారలనూ గుప్పించినా చిత్రాలు జనాన్ని ఆకర్షించలేదు. సినీ జర్నలిస్టులు, ''కొత్త ముఖాలు కావాలి'' అని రెండో ఫార్ములా లేవదీసారు, కాని ప్రొడ్యూసర్లు డిస్ట్రిబ్యూటర్లను ఖాతరుచేస్తారు గాని జర్నలిస్టులను ఎందుకు ఖాతరు చెయ్యాలి? లక్షలు పెట్టి పిక్చరు తీస్తూ ఊరూ పేరూ లేని నటులను బుక్ చెయ్యటమా? ఆత్మహత్య కదా!

అయినా కొత్తనటులు రానే వచ్చారు అందులో కొందరు అతిశీఘ్రంగా తారలు అయి కూర్చున్నారు వాళ్ళు కూడా జనాన్ని ఆకర్షిస్తున్నట్టే కనబడ్డారు

అయితే చిత్రాలు ఇంకా దెబ్బతింటూనే వున్నాయి ఉన్నట్టుండి ఒక చిత్రం నూరురోజులు ఆడుతుంది ప్రేక్షకులు దాన్ని ఎందుకు ఎగబడి చూస్తారు.

''అసలు కీలకం కథలో వుంది'' అన్నారు

ఈ కొత్త ఫార్ములా మళ్ళీ కళవాసన కొట్టుతున్నట్టు కనబడింది. కాని ఏం చెయ్యాలి? డబ్బు కోసం కళను గురించి ఆలోచించాలిసొస్తే తప్పుతుందా? సంకురుమయ్య కథల మీద ఎక్కేసాడు!

అయినా పిక్చర్లు దెబ్బతింటూనే వున్నాయి విజయవంతంగా నడిచిన పిక్చర్లన్నిటినుంచీ రసపట్టు గల డయిలాగులూ, సన్నివేశాలూ కాపీ కొట్టినా పిక్చరు దక్కటం లేదు

డైరెక్షను బాగుంటే డబ్బు వస్తుందేమో? అదీ రుజువు కాలేదు. సూపర్ హిట్ తీసినవాడే ఫ్లాప్ పిక్చరూ తీశాడు

ఇలాంటి తడుపులాటలో నడుస్తున్న పరిశ్రమలోకి 'కళాఖండాలు' గా చలామణి అయే ఏపుక చిత్రాలు వచ్చాయి వ్యాపార దృష్టిలో వీటికి వున్న గొప్పతనం ఏమిటంటే, నాలుగువారాలు నడిచినా పెట్టుబడి వచ్చేస్తుంది తారల కాల్‌షీట్ల తగాదాలు లేవు 20 రోజుల్లో పిక్చరు లాగిపారేయ్యొచ్చు ఒకవేళ నష్టం వచ్చినా పెద్ద నష్టం రాదు

అయితే ఈ చిత్రాలకు డెబిట్ పద్దులూ వున్నాయి. వీటిని డిస్ట్రిబ్యూటర్లు అంటుకపోవచ్చు. అంతకన్నా మరీ దారుణం ఏమిటంటే ఎవరు పడితే వాళ్ళు మూసపద్ధతిలో సినిమా తీసే అవకాశం లేదు. డైరెక్టరూ కథకుడూ, కెమెరామెన్, నటులూ ఆరితేరిన కళాకారులు కావాలి. లక్షలు పోసి తీసే భారీ చిత్రాలలో వుండే అనర్థాలు, అవకతవకలూ ఈ 'కళా' చిత్రాలలో ఏ మాత్రం వున్నా పట్టిస్తాయి.

ఇంత అయి, ఈ చిత్రాలను విడుదలచేసినా, విమర్శకులు 'అద్భుతం' అనవచ్చు! జనం చూడకపోవచ్చు!

మొత్తం మీద 'కళా' చిత్రాలు చెయ్యి తిరిగిన ప్రొడ్యూసర్లకు కళ అనేమాట వింటే కలిగే భయాన్ని ఓ విధంగా రుజువు చేసాయి. రెండు కళాచిత్రాలలో నటించిన హీరో, ''నేను గ్లామర్ వేషాలు వెయ్యటానికి సిద్ధంగానే వున్నాను'' అన్నాడు.

''నూరు ఆరయినా నేను ఆర్ట్ పిక్చర్లే తీస్తాను'' అని భీష్మించుకున్న వాళ్ళు ఎవరన్నా వుంటారేమో తెలీదు. వుంటే, బహుశా వారి ద్వారా సినిమా చరిత్ర సృష్టి కాదేమో. ఆర్టు చిత్రాలు డైరెక్టు చేసిన వాళ్ళు మామూలు చిత్రాలు డైరెక్టు చెయ్యటానికి ఒప్పుకుంటున్నారు. ఇంత అయ్యాక, కొన్ని చిత్రాలు - కొన్ని కళాఖండాలు - జనాన్ని ఎందుకు ఆకర్షిస్తాయి అన్న ప్రశ్న ప్రశ్నగానే వుండిపోయింది. దానికి సమాధానం వున్నదని నా నమ్మకం.

ఎన్ని కోట్లు కుమ్మరించి, పెట్టుబడికి ఎన్నిరెట్లు లాభం రావాలో అంచనా వేసుకొని, ప్రపంచంలో గల అత్యుత్తమ నటులనూ, టెక్నీషియనులనూ నియోగించి తీసిన పిక్చరైనా ప్రేక్షకులకు కళానుభూతిని ఇచ్చి మాత్రమే విజయం సాధించగలదు. ఇది ఎవరూ ఏ పరిస్థితులలోనూ మరవగూడని విషయం.

అయితే కళానుభూతిలో తేడాలున్నాయి. విజయవంతంగా సినిమాలు తీయదలచిన వాళ్ళు ఈ తేడాలను పాటించటం అవసరం.

''ఇది ఆడవాళ్ళను భలే పట్టేస్తుంది, గురూ!'' అని జోస్యం చెబుతారు అంటే సినిమా నిండా సెంటిమెంటు గుప్పించారన్నమాట.

సెంటిమెంటు జనాన్ని పట్టే మాట నిజమే. కాని దానికి ఒక చిన్న పేచీ వున్నది. అది ప్రేక్షకులకు గురిగా తగలాలంటే చిత్రంలో చాలా వాస్తవికత వుండాలి. పాత్రలు పడే కష్టాలు ఏ మాత్రం కృత్రిమంగా వున్నా ప్రేక్షకుడు తాదాత్మ్యం పొందలేడు. సూర్యకాంతం చేత చేయించిన ఆడ విలన్ పాత్రలు ఎంత అసహజంగా తయారయ్యాయంటే ఆ పాత్ర ప్రభావం ప్రేక్షకుల మీద వుండవలసిన విధంగా లేకపోయింది.

ఇంకోటేమిటంటే సెంటిమెంటు అనేది పాత్రల కష్టాలతో సానుభూతి అనే అర్థంలోనే చలామణీ అవుతుంది మొత్తం చిత్రమంత కాకపోయినా కొన్ని చిత్రాలలో అక్కడక్కడా ప్రేక్షకుడికి గొంతు బిగబట్టటమో, కన్నీళ్ళు తిరగటమో ఊపిరి ఆడకపోవటమో జరగటం నాకు స్వయంగా తెలుసు ఇలాంటి అనుభవం కలిగినంత మాత్రాన ఆ చిత్రాలు చాలా గొప్పవి అని నేను ఎన్నడూ అనుకోలేదు కాని అటువంటి సన్నివేశాలు తగినన్ని వున్నప్పుడు చిత్రం ఫ్లాప్ కావటం జరగలేదనుకుంటాను

అయితే 'చక్రపాణి' గారు సినిమా గురించి చెప్పిన అనేక సత్యాలలో ఒకటి ''ఇవాళ ప్రేక్షకులు ఏడిస్తే, రేపు ప్రొడ్యూసరూ ఏడుస్తాడు!''

ఈ మాటలో అచ్చంగా వ్యాపారానికి సంబంధించిన సత్యమే కాదు, కళకు సంబంధించిన సత్యం కూడా వున్నది

కళ ప్రేక్షకుణ్ణి వివశుణ్ణి చెయ్యవచ్చు లేదా పరవశుణ్ణి చెయ్యవచ్చు (ఇది నేను స్వయంగా సృష్టించిన తేడా గనక, దీన్ని నివారించటం అవసరం వివశత్వంలో ప్రేక్షకుడు అసహాయస్థితిలో వుంటాడు - ఏడుస్తాడు, భయపడతాడు, దిమ్మెరపోతాడు కాని పారవశ్యంలో ప్రేక్షకుడు అసహాయుడు కాడు, కాని ఒక కొత్త అనుభవాన్ని కళ నుంచి జుట్టుపట్టుకు లాగేసుకుని తన సొంతం చేసుకొంటాడు ఒకటి సబ్జెక్టివ్, రెండోది ఆబ్జెక్టివ్.)

వివశత్వం కలిగించే కళను నిజంగా 'ఆనందించటం' సాధ్యం కాదు. అది అంతో ఇంతో బాధతో కూడుకున్నదే అలాటి కళను తేలికగా మరచిపోలేమన్న మాటే గాని, పదే పదే ఆస్వాదించను కూడా లేం.

ఒక సినిమా గాని, రచన గాని, గానం గాని వివశత్వం కలిగించేదిగా వుంటే ప్రజలు దాన్ని గౌరవించినా సొంతం చేసుకోవటానికి తహతహలాడరు. (సంగీతం వింటే ఆపుకోలేకుండా ఏడ్చేవాళ్ళున్నారన్నది మరచిపోరాదు.)

కళాభిరుచిలో కలుగుతూ వస్తున్న పరిణామాలన్నిటినీ చర్చించేటందుకు ఇది సందర్భం కాదు. కాని ఈనాటి సామాజిక పరిస్థితిలో ప్రజల జేబులు కొట్టేవాళ్ళను ఏడిపించవచ్చునేమో గాని, ఏడిపించి జేబులు కొట్టటం సాధ్యం కాదు ఈనాటి కళాభిమాని తన వ్యక్తిత్వాన్ని కోల్పోకుండా మాత్రమే కళాస్వాదన చెయ్యటానికి సిద్ధపడతాడు సాహిత్యంలో కూడా ప్రబోధం పారదన్న విషయం ఏనాడో రుజువయింది కళ యొక్క ఆశయం కళాభిమాని స్వయంనిర్ణయం నుంచి పుట్టుకురావాలి. ఇది కళలో డెమోక్రసీ అనండి, కావాలంటే!

ఇందులో వింత కూడా ఏమీలేదు. యాంటీ సెంటిమెంటు చిత్రాలు జయప్రదం కావటమూ, యాంటీ హీరో చిత్రాలు జనాదరణ పొందటం విమర్శకులు

చదువరికే గ్రహించారు కళానుభూతిలో వుండే ఆ రహస్యాన్ని గురించి సినిమా వ్యాపారస్థులు కొంచెం లోతుగా ఆలోచిస్తే, కొన్ని చిత్రాలు "అన్నీ వుండీ [illegible] ఏమీ అన్నీ వుండి [illegible] ఎత్తేస్తున్నారో. [illegible] చిత్రాలు ఏమీ లేనట్టే వుండి జనాన్ని బంక లాగా ఎందుకు పట్టుకుంటున్నాయో అర్థం కావచ్చు. ఆ రహస్యం సినిమాకళ- సారం - పరిశ్రమ - ఇప్పుడున్న దశలో ఎలా బయటపడినా పడవచ్చు.

యువ అక్టోబరు 19[illegible]

# 36. కళారంగాలలో పోటీలు

పోటీలు సుందోపసుందుల కాలం నుంచీ వున్నాయి. అమీ-తుమీ తేల్చుకోనిదే మానవులకు జరగదు. వ్యక్తుల స్వార్థం మొదలుకొని ప్రపంచ కళ్యాణానికి పాటుపడటం దాకా ప్రతివిషయంలోనూ పోటీ వుంటున్నది. అనగా, మంచికీ, చెడుకూ కూడా పోటీ అవసరంగా కనబడుతుంది. వ్యక్తిస్వార్థం లాటిదే వర్గస్వార్థమూ, జాతి స్వార్థమూనూ. వర్గస్వార్థం సామాజిక సంఘర్షణకు దారి తీస్తే, జాతి స్వార్థం రాజ్యవిస్తరణలకూ, దురాక్రమణలకూ, యుద్ధాలకూ దారి తీస్తుంది. అలాటి పోటీలను మనం హర్షించనవసరం లేదు.

కాని మంచికి పోటీ పడటం అలాటిది కాదు. దాని వల్ల ఇతోధికమైన లాభం వుంటుంది. ఇళ్ళు కాలిన వారికీ, వరద బాధితులకూ సహాయం చెయ్యటంలోనూ, విరాళాలు ఇయ్యటం లోనూ ఎంత పోటీ వుంటే అంత మంచిది కద- ఆ డబ్బు తినెయ్యటంలో ఎంత తక్కువ పోటీ వుంటే అంత మంచిదయినట్టే!

కళారంగాలలో పోటీ ప్రోత్సహించ దగిన, మేలు కలిగించే పోటీ కింద జమ అవుతుంది.

అయితే ఈ పోటీలు జరపటంలో అవలంబించే పద్ధతుల మీద ఎంతో ఆధారపడి వుంటుంది. వెనుకటికి కాళిదాసుకీ, భవభూతికీ పోటీ పెట్టారనీ చెరొకశ్లోకమూ రాస్తే వాటిని త్రాసుతో తూచారనీ, కాళిదాసు శ్లోకం ఎక్కువ తూగిందనీ ఒక కథ చెబుతారు. ఇది అబద్ధమే గాక, ఈ పోటీ జరిపిన పద్ధతి చాలా ముదనష్టంగా వున్నది. దాశరథి 'కవిత్వాలకు గానమా కొలత?' అని అడిగినట్టే, 'కవిత్వాలకి తూకమా కొలత?' అని ఎవరైనా అడగవచ్చు. సినిమాలలో సంగీతపు పోటీలు కూడా ఇలాగే ముదనష్టంగా వుంటూ వచ్చాయి. ఇటువంటి పోటీలు ఎంతో సదుద్దేశంతో ఏర్పాటు చేసినా మనం హర్షించరాదు.

కొత్త వారికి బహుమతికీ (ఇష్టం ఒక కారణం చెప్పు రాదు) పోటీ పెట్టామే చెయ్యటంలో ఇంకో అసంబద్ధం కూడా వున్నది. అంత ప్రసిద్ధుడు అయిన పోటీ చేసా తెలుసటం చెప్పు రాదు. సంగీతవిద్వాంసుల ముఖ్యం గాని, వాయిద్యకారుల ముఖ్యం గాని, గాయకుల ముఖ్యం గాని, నటకుల ముఖ్యం గాని ఎవరూ పోటీ పెట్టరు. వాళ్ళ స్థాయి ఏనాడో స్థిరపడి పోయింది. ఎవరయినా రామారావుకూ, నాగేశ్వరరావుకూ పోటీ పెట్టడానికి ఎవరైనా ప్రయత్నిస్తే రక్తపాతం జరుగుతుంది.

అందుచేత కళాకారుల మధ్య, కవులలోనూ పోటీలు ఏర్పాటు చేసేవారు అజ్ఞానులను ప్రోత్సహించటానికే పోటీలు జరుపుతారు. పత్రికలు కథలకూ, నవలలకూ పోటీలు జరుపుతాయి. వాటిలో పేరుమోసిన రచయితలు డబ్బుకోసం పాల్గొన్నా, కీర్తికోసం పాల్గొన్నా కూడా తప్పే. నిజానికి వాళ్ళు ఈ రెండురకాల ప్రోత్సాహానికీ అర్హులు కారు. (చాలాఏళ్ళ క్రితం నేను ఒక వారపత్రికకు ఒక చెత్తనవల పంపాను. ఆ సమయంలో ఆ వారపత్రిక నవలలపోటీ నిర్వహిస్తున్నదేమో, ఆ సంగతి నాకు తెలియదు. కొంతకాలం అయినాక అది నాకు తిరిగివచ్చింది. దాని మీద 36 అంకె వేసి వున్నది. ఇంకా నయం నా చెత్త నవలకు ఏదో బహుమతి ఇవ్వారు కాదు! ఆ వారపత్రిక నడిపిన కథలపోటీకి ఒకసారి నేను ఒక జడ్జిగా పనిచేసినవాణ్ణి కూడానూ!)

పత్రికలు ఏర్పాటు చేసే ఈ నవలల, కథల పోటీలు కూడా తప్పే. కల్పనా సాహిత్యాన్ని ఉద్ధరించే ఉద్దేశమే వుంటే పత్రికలు ఇలాటి పోటీలు పెట్టవు. తమ సౌకర్యం కోసం పత్రికలు వీటిని జరుపుతాయే గాని, సరి అయిన పద్ధతి ఏమిటంటే, ఏటా వచ్చే కథలలోనూ, నవలలోనూ ఏవి ఉత్తమమైనవో విమర్శకుల చేత నిర్ణయింపజేసి, వాటికి బహుమానాలు ప్రకటించటం – ఒక విధంగా సాహిత్య పరిషత్తులు చేస్తున్న పని. పోటీలు పెట్టి, డబ్బు ఆశ చూపి, రచనలు ఆహ్వానిస్తే జరిగేదేమిటి? కాగితం మీద అక్షరం పెట్టలేని వాళ్ళు కూడా పోటీల్లో పాల్గొని, పోస్టాఫీసులకు డబ్బు ధారపోసి, పత్రికల వాళ్ళకు తలనొప్పి పని కలిగిస్తారు.

నాటకాలను ప్రోత్సహించటం కూడా ఈ విధంగానే జరగాలి. దేశంలో ఔత్సాహిక నాటక సమాజాలు బోలెడన్ని నాటకాలు ఆడతాయి. ఊరూ, పేరూ లేని రచయితలూ, నటులూ, ప్రయోక్తలూ చక్కని పనితనం ప్రదర్శిస్తారు. అలాటివారికి ముందుగానే బహుమానాలు ప్రకటించి, నాట్యకళాపరిషత్తు రెండుమూడు నాటకాలను మాత్రమే ఆహ్వానించి వార్షిక ప్రదర్శనలు ఏర్పాటుచేస్తే రక్తిగా వుంటుంది.

ఆలిండియా రేడియో వారు సంగీతం పోటీలు ఏర్పాటు చేస్తున్న పద్ధతిలో లోపం ఏమీ కనిపించదు. కాకపోతే, బహుమతులు పొందినవారు భవిష్యత్తులో ఎలా

పైకి వస్తున్నారనేది ఎవరూ పట్టించుకున్నట్లు లేదు. బహుమతులు పొందిన నటులు నాటకరంగంలో గాని, సినిమారంగంలో గాని కనిపించకుండా పోవటం కూడా అప్పుడప్పుడూ జరుగుతూ వస్తుంటాయి. 'పోటీలో' బహుమతులు గెలుచుకున్న వారి భవిష్యత్తుకు బాటలు వేసే బాధ్యత ప్రభుత్వం గాని, పరిషత్తులు గాని వహించక పోతే ఈ పోటీల ప్రయోజనం ఏమిటి?

రాతప్రతి, అముద్రితం

ళుళుళు

# 1. అరికట్టరాని వెల్లువ

ఫిబ్రవరి 3వ తేది ఆంధ్ర వారపత్రిక సంచికలో శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి గారు 'అరికట్టవలసిన వెల్లువ' అనే వ్యాసం రాశారు దాని సారాంశం ఇదీ

శ్రీ శాస్త్రి గారికి సంగీతశాస్త్రంతో పరిచయమూ, గానకళతో పరిచయమూ కూడా కలవు

వారికి కర్నాటక సంగీతం వించే బుద్ధి చమత్కృతం అవుతుంది, హృదయం ఆనందముగ్ధం అవుతుంది హిందూస్థానీ సంగీతం వింటే చెవులు మూడినట్లువుతుంది

కర్నాటక సంగీతం ముస్లిముల ప్రభుత్వం వల్ల ఇతర దేశ, ప్రాంతాల సంకరం అయిపోయి, దక్షిణ దేశంలో మటుకే సంకరం కాకుండా నిలిచివుంది

బెంగాలీ సంగీతమూ, మరాఠీ సంగీతమూ మొదలైన ప్రాంతీయ సంగీతాలకూ హిందూస్థానీ సంగీతానికీ వ్యత్యాసం లేదు

రైళ్ళ ద్వారా, గ్రామఫోనుల ద్వార హిందూస్థానీ సంగీతం మన ప్రాంతాల [illegible] అయింది ఇటీవల రేడియోలు, సినిమాలూ వచ్చి మనదేశాన్ని ఈ సంగీతంతో ముంచేస్తున్నాయి

[illegible], తమకింత భుక్తి పెట్టిన కృతజ్ఞతైనా లేకుండా తెలుగు సంగీతాన్ని అరికట్టటానికి చూడడమూ, మరో వేపునించి మనదేశం మీద హిందూస్థానీ సంగీతం వెల్లువై మన మీదికి వస్తూండటమూ చాలా శోచనీయం హిందూస్థానీ సంగీతం నేర్చుకోవడం వల్ల మనకు భావదాస్యం మాత్రం మిగులుతుంది.

శ్రీ శాస్త్రిగారు చెప్పిన పై విషయముల మీద చాలామందికి చాలారకాల సందేహాలు పుట్టడానికవకాశం వున్నది నాకు ముఖ్యమనిపించిన కొన్నిటి నిక్కడ ప్రకటిస్తున్నాను.

శ్రీ శాస్త్రిగారిలాగే సంగీతశాస్త్రం గాని, గానకళగానీ తెలియకుండానే కర్నాటకసంగీతంకంటె హిందూస్థానీ సంగీతం చెవులకింపుగా తోచిన వాడేం చెయ్యాలి?

నా మటుకు నాకు హిందూస్థానీ సంగీతంలో వుండే మాధుర్యం దానంతట అదే అవగతం అయింది కర్నాటకసంగీతం తాలూకు గొప్పతనం కష్టపడి తెలుసుకోవలసి వచ్చింది

హిందూస్థానీ సంగీతం ఎవరి ప్రచారం వల్లనో మనదేశంలో ప్రసరిస్తున్నదని శ్రీ శాస్త్రిగారు భావిస్తే ఆయన చాలా పొరపాటు పడ్డారని ఖచ్చితంగా చెప్పగలను అది ముగ్ధానందం ఇవ్వటం వల్లనే ప్రచారం అవుతున్నది. అరవదేశంలో రామనాథశాస్త్రి రికార్డులకు ఎవ్వరూ ప్రచారం ఇవ్వలేదు కాని ముగ్ధానందం ఇవ్వటం వల్ల, శాస్త్రరీత్యా అస్పృశ్యజాతికి చెందవలసిన రామనాథశాస్త్రి సంగీతం అరవదేశంలో పెద్దిగా ప్రచారం అయింది.

కర్నాటక సంగీతం తాలూకు గొప్పతనం హిందుస్థానీ వాళ్ళకు తెలిసివచ్చినప్పుడు అబ్దుల్ కరీంఖాన్ లాంటి గవయ్యాలు కర్నాటకం పాడి మన పాటగాళ్ళ మెప్పు సంపాదించారు వ్యాసం వారి ఫేవరు రికార్డు హౌలావాయి రేడియో స్టేషన్ నుంచి ఎన్నోసార్లు ప్రసారం అయింది ప్రమాదం ఏమీ లేదు

కర్నాటక సంగీతానికీ హిందూస్థానీ సంగీతానికీ శాస్త్రిగారి చెవిభేదం కనిపెట్టినట్టే, బెంగాలీ సంగీతానికీ, మహారాష్ట్ర సంగీతానికీ, పంజాబీ సంగీతానికీ పరస్పరం వున్న తేడా నా చెవికి అంక్షణంలో తెలుస్తుంది శ్రీ శాస్త్రిగారు పొరపడ్డారు అయితే ఇన్ని సంగీతాలకు చెందిన శాస్త్రాలకూ తేడా లేదు కాని శ్రీ శాస్త్రిగారు శాస్త్రాలలో తేడా విషయం ఎత్తుకోలేదు

హిందూస్థానీ సంగీతానికీ, కర్నాటక సంగీతానికీ శాస్త్రవిషయికమైన తేడా లేకపోలేదు కాని ఆ తేడాకు కారణం మొగలాయీ పరిపాలన అని శ్రాస్తిగారు నిరూపించి వుండలేదు ఒకవేళ హిందూస్థానీ సంగీతం ముస్లిముల వల్ల సంకరం అయిందనే ఒప్పుకున్నా, దాన్ని గురించి మనం ఈనాడు చేసేదేమిటో తెలీలేదు ముస్లిములు ఉత్తర హిందూస్థానంలో పరిపాలన చెయ్యకుండా వుండగలందులకు అక్కడివాళ్ళేం చేసివుండవలసింది? ఆ తరవాత సంగీతం సంకరం కాకుండా వుండగలందులకేం చేసి వుండవలసింది? అది తెలిస్తే, ఈ ఆంగ్ల పరిపాలనా ఫలితంగా రైళ్ళూ, సినిమాలూ, రేడియోలూ మొదలైనవాటి ద్వారా వచ్చిపడుతున్న హిందూస్థానీ సంగీతాన్ని అరికట్టటానికి మనం కూడా ఆ పనే చేద్దాం ఇంగ్లీషు పరిపాలనాఫలితంగా బెంగాలీ సంగీతంలోకి పాశ్చాత్యసంగీతం వచ్చి కొద్దిగా చేరింది దాన్ని అరికట్టటానికి కూడా శ్రీ శాస్త్రిగారేదైనా ఉపాయం ఆలోచించదగును

కర్నాటక సంగీతంలోకి ముస్లిముల సాంకర్యం రాలేదని చెప్పటానికి వీల్లేదు మనవాళ్ళు హుసేని అనే రాగం ఒకటి పాడతారు. ఇంకా ఇతర రాగాలు సంగీతపుస్తకాలు తిరగేస్తే దొరక్కపోవు.

హిందూస్థానీ సంగీతం గురించి శ్రీ శాస్త్రిగారు చారిత్రక దృష్టి నిగిడించి వుండటం శ్లాఘనీయమే గాని, వారికి చారిత్రకదృష్టి సమగ్రంగా లేదు. ఉంటే సాంకర్యం గురించి మాట్లాడివుండరు. సాంకర్యం అనేది కేవలమూ ఫాసిస్టు ఆయుధమే గాని, చారిత్రక దృష్టిలో ఆ ముక్కకు అర్థం లేదని యెన్నడో రుజువయింది

ఆంధ్ర సంస్కృతీ, ఆంధ్ర సంప్రదాయమూ ఆంధ్రులకు పూజనీయాలనీ, ఆంధ్రులు హిందూస్థానీ సంగీతాన్ని అరికట్టవలసి వుందనీ తేల్చిన శ్రీ శాస్త్రిగారు అరవలను నిష్టూరాలాడటం దేనికో స్పష్టంగా తెలీటం లేదు. అరవలు తెలుగు సంగీతాన్ని అరికట్టి ఒక అరవ సంస్కృతినీ సంప్రదాయాన్నీ యెందుకు నిర్మించుకోరాదూ? శ్రీ శాస్త్రిగారి వాదన ప్రకారం తప్పక నిర్మించుకోవచ్చుననే అనిపిస్తుంది

ఈ సంగీతసమన్వయను గురించి నాకు తోచిన ముక్కలు కూడా రెండు చెబుతాను.

మనవాళ్ళు హిందూస్తానీ సంగీతం పాడటం నాకిష్టం లేదు. దానికి ఒకటే కారణం మనవాళ్ళకు హిందూస్తానీ బాణీ రాదు. మన సంస్కృతి వేరు. తెలుగువాడికి హిందూస్తానీ బాణీ లబ్బాలంటే వాడి సంస్కృతి మారిపోయి సంపూర్ణంగా మారిపోవాలి. అది అనేక కారణాల వల్ల వాంఛనీయం కాదు.

కాని మనం హిందూస్తానీ సంగీతం విని ఆనందించటంలో తప్పేమీ లేదు. పాశ్చాత్య సంగీతం విని ఆనందించినా అందులో తప్పు లేదు. ప్రపంచంలో వున్న ఇతర జాతులకు చెందిన కళలను ఆనందించగలగటం వల్ల మనజాతికి చాలా లాభం వుంది.

ఇక కర్నాటక సంగీతం గురించి ఒక ముక్క - కర్నాటక సంగీతాన్ని ఆంధ్రులు అరవవాళ్ళ బారినించి ఉద్ధరించవలసి వుంది. అరవలు కర్నాటకశాస్త్రం అవలంబించవచ్చు కాని, తెలుగు కృతులు పాడటం చాలా ఘోరం. వారు తెలుగు పాటలను మానదలిస్తే మనం వారిని ప్రోత్సహించాలి.

సంగీత శాస్త్రం తాలూకు సమస్యలనూ గానకళ తాలూకు సమస్యలనూ విడదీసి గ్రహించగలగటం చాలా ముఖ్యం. లేనట్టయితే చర్చ ముళ్ళకంచెలకడ్డం పడుతుంది.

*ఆంధ్ర పత్రిక వారపత్రిక, 24-2-1943*

## 2. ప్రజల సంగీతం

ప్రజల జీవితంలో కలుగుతూ వచ్చే రాజకీయ పరిణామాల అభ్యుదయం అటుంచి సాంస్కృతికంగా కూడా వాంఛనీయమైన పరిణామం జరుగుతూ వస్తున్నది. ఇరవై అయిదేళ్ళ నాటికన్న ఈనాటి ప్రజల నిత్యజీవితంలో సాహిత్యం, సంగీతం, నృత్యం, అభినయం, చిత్రలేఖనం మొదలైన కళలకు అధికస్థానం వుంటున్నది. ఈనాడు పత్రికలు, రేడియోలు సినిమాలు మొదలైనవాటి ధర్మమా అంటూ ఎవరుపడితే వారు నిత్యమూ తమకు కావలసిన కళలు ఆనందించవచ్చు. పూర్వం కూడా ఏవో కళలు ప్రజల జీవితంలో వుండేవి నాటకాలూ, తోలుబొమ్మలు, వీధి నాటకాలూ, జంగం కథలూ, జముకుల పాటలూ, సుద్దులూ, హరికథలూ, భజనలూ, కోలాటాలూ మొదలైనవి. అయితే అవి గృహ పరిశ్రమల లాటివి, తరుణంలో తప్ప లభ్యమయ్యేవి కావు.

ఈ లోపం అలా వుంచి, ఆనాటి కళలకు ప్రాంతీయ లక్షణాలుండేవి. ఒక్కొక్క జిల్లాలో ఒక్కొక్క రకం పాటలుండేవి. అచ్చుయంత్రాల ధర్మమా అంటూ నాటకాలు మాత్రం ఆంధ్ర అంతటా ఒకేరకం నాటకాలు ప్రసిద్ధిలోకి రావటం జరిగింది. అప్పటికీ నాటకాలలో కూడా ప్రాంతీయ ప్రశస్తి వుంటూ వచ్చింది.

ఈ ప్రజల కళలు పారిశ్రామికమైనవి. రేడియోలో పాటలు పాడితే అన్ని ప్రాంతాల వారూ వింటారు. ఒక సినిమా చిత్రం తయారైతే అంతటా ఆడుతుంది.

దేశంలో వున్న జనం అంతటి ఆదరణా పొందే గాయకులూ, నటులూ, రచయితలూ, చిత్రకారులూ మొదలైన వారినాడు వెలిసారు పారిశ్రామిక కళా ఉత్పత్తి ధర్మమా అలయా సాంస్కృతికంగా దేశమంతటినీ ఒకటే చేస్తున్నది తమిళులకూ - తెలుగువారికీ మధ్య, ఉత్తరదేశానికీ - దక్షిణదేశానికీ మధ్య, సాంస్కృతికసంబంధాలు ఏర్పడ్డాయి రాజకీయవేత్తలు, నాయకులు గొంతు చించుకున్నా ఇటువంటి ఏకత్వం సాధ్యమై వుండకపోను

ఇదంతా ప్రశంసనీయమే, వాంఛనీయమే, కాని, పారిశ్రామిక ఉత్పత్తిలో వుండే మైల ఈ కళలకు విధిగా సోకుతుంది ఇందువల్ల ఒక కళ- సంగీతం - ఏమవుతున్నదీ చూద్దాం ఈనాడు రేడియో ద్వారా ప్రజలకు కర్నాటక, హిందూస్థానీ సాంప్రదాయ సంగీతమూ, సుగమ సంగీతమూ, లలిత సంగీతమూ, సినిమా పాటలూ వినిపిస్తున్నాయి సినిమాలు చూసే లక్షలాది ప్రజలు సినిమా పాటలు వింటున్నారు ఇందులో ప్రజారంజకంగా వుండేది సినిమా సంగీతమూ, ఉత్తమ సంగీత లక్షణాలతో కూడుకున్న సంప్రదాయ సంగీతమూనూ, మిగిలినవి మిడిమిడి సంగీతాలు

ఒకప్పుడు సినిమా సంగీతం సంగీతమే కాదన్న వైఖరి అవలంబించిన రేడియోవారు రాజీ విధానానికి వచ్చి ఇష్టాయిష్టంగా నాటి సినిమా రికార్డులను మిడిమిడి సంగీతం కింద చలామణీ కావిస్తున్నారు పాత చింతకాయ పచ్చడి పథ్యమన్న ధోరణి తప్ప ఇందులో మరేమీ స్ఫురించటం లేదు ఏనాడో సూర్యకుమారి, రాజేశ్వరరావు, బెజవాడ రాజరత్నం, టి. జి కమల మొదలైన వారు పాడిన పాతపాటలు లలిత సంగీతంగా ప్రజలకు అందుతున్నాయి ఈనాటి సినిమా పాటలు మరో ఇరవైయేళ్ళకు ఊరి లలితసంగీతమవుతాయనుకోవచ్చు, సినిమాలలో పాడటం మానుకున్న వారి పాటలు లలితసంగీతమేమో!

మిడిమిడి సంగీతాలు మరొకరకం ఏమిటంటే ఇమిటేషన్ ఘంటసాలల చేతా, ఇమిటేషన్ లీలల చేతా పాడించే పాటలు ఏ యెంకి పాటనో పట్టుకుని ఒక ఇమిటేషన్ ఘంటసాల నండూరి వారి ఆత్మ క్షోభించేటట్టుగా – చాతనయినంత మటుకు సినిమా ఫక్కీలో పాడేస్తాడు. వినేవాళ్ళు అభిరుచి గలవారయితే వాంతి చేసుకోవలసిందే. ఈ పాటలు పాడే బృందానికి చెందిన వారికి సినిమా ఛాన్సులు జన్మలో రావు.

ఈ విధంగా రేడియో మిడిమిడి సంగీతం సినిమా సంగీతానికి, ఈ కొసనూ ఆ కొసనూ పట్టుకు వేళ్ళాడుతున్నది ఈ సంగీతం నుంచి భగవంతుడు ప్రజలను కాపాడు గాక

ఇక అసలు సినిమాసంగీతానికే వద్దాం విటమిన్ బి కాంప్లెక్స్ లాగా ఇందులో అనేకరకాల సంగీతం చేరి వున్నది. ఒక చివర నికరమైన కర్నాటకసంగీతమూ, రెండో చివర ఎవరు పడితే వాళ్ళు పాడదగిన చచ్చురకం లలలా సంగీతమూ వున్నది ఇది జాతీయ సంగీతంలో ప్రైవేట్ సెక్టర్ ఈ సంగీతం యొక్క ప్రధానాశయం

జనరంజకంగా వుండటమూ, ఉద్బోధించటమూ అనుమానించే ఈ సంగీతంలో ఎప్పటికప్పుడు నూతనత్వం వుంటుంది మొత్తం మీద వైవిధ్యం కూడా వుంటుంది

ఈ వైవిధ్యం మూలంగానే సినిమా సంగీతంలో నిజమైన సంగీతం ఎంత పాలు వుండేదీ చెప్పటం కష్టమవుతున్నది సంగీతంలో ఏమీ అభిరుచి లేని జనాన్ని ఆకర్షించటానికి ఇప్పుడు చాలామంది సినిమా వాళ్ళు రకరకాల సంగీతాలు సినిమాలో ప్రవేశపెడుతున్నారు ప్లేబాకు పాడే ఆడకూతుళ్ళు ఎవరో తమను పట్టుకుని తోస్తున్నట్లు పాడటమూ, తాగి వున్నట్టో, పేమురెత్తినట్టో పాడటమూ మనం వింటున్నాం ప్లేబాకు మొగరాయుళ్ళు మోడలింగ్ ప్రారంభించారు దానితో పాటు దగ్గటమూ, కక్కటమూ, జంతువులు చేసే పన్లన్నీ చేయటం కూడా సాగించారు ఈ రకం సినిమా సంగీతంలో సంగీతం ఏమీ వుండదు కాని రేడియోలో ఈ పాటలను విని చిన్నపిల్లలు పారవశ్యం చెందుతారు ఎవ్వరైనా చెయ్యకూడని పని చేసి శిక్షింపబడకుండా వుండటం వారికి ఎటువంటి ఆనందాన్ని కలిగిస్తుందో ఈ సంగీతం అదే ఆనందాన్ని కలిగిస్తుంది.

ఇంతకంటే పాతపద్ధతి సంగీతంతో కూడా చిక్కులున్నాయి. అన్నిటికన్న ముఖ్యమైన చిక్కేమిటంటే సినిమా సంగీతంలో సంగీత హృదయం లేకపోవటం ఈ మాట అనటంలో నా అభిప్రాయం ఏమిటో వివరిస్తాను

ప్రతి కళలోనూ రసభావాలు ప్రకటించే మార్గాలు వేరువేరుగా వుంటాయి సంగీతంలో నవరసాలూ ఒప్పించవచ్చు. రాగాలు ఎన్నిక ద్వారానైతే నేమి, పాడే పద్ధతిలోనైతేనేమి శృంగార, వీర, రౌద్ర, భీభత్స, భయానకాది రసాలనూ ఒప్పించవచ్చు దానికి అభినయం తోడు పెట్టనవసరం లేదు స్టేజి సంగీతం పాడేవాళ్ళు కూడా సంగీతహృదయం తెలిసిన రోజులలో బాలగంధర్వ (నారాయణరావు రాజహంస) అనేక నాటకాలలో కరుణరసపూరితమైన పాటలు పాడేవాడు. కాని పాట మధ్య ఎన్నడూ ఎక్కిళ్ళూ, ఎగబీల్పులూ పెట్టేవాడు కాడు. ఆంధ్ర గంధర్వ జొన్నవిత్తుల శేషగిరి ముఖారి రాగంలో 'రామోనామ బభూవ' అన్న శ్లోకం పాడుతూ, మొదటి మూడు చరణాలలో కరుణరసాన్ని, నాలుగో చరణంలో వీరరసాన్ని ఒకటే రాగంలో ప్రదర్శించాడు ఈనాటి సినిమా పాటగాళ్ళను విని ఒక్కసారి ఆ తరం గాయకులను జ్ఞాపకం తెచ్చుకుంటే వారు సరస్వతీ అవతారాలనిపిస్తారు.

దురదృష్టవశాత్తూ సినిమా సంగీతంలోకి ఏనాడో అభినయం ప్రవేశించింది. కరుణరసం విషయంలో చిత్రనిర్మాతలు మరీ కనికరం లేకుండా ప్రవర్తిస్తున్నారు. ముక్కు చీదుకోవటం మినహాగా మిగిలిన అభినయమంతా ప్లేబాకు ఆర్టిస్టుచేతనే చేయిస్తున్నారు ఇలాటి పాటలు అకస్మాత్తుగా రేడియోలో – సినిమా సందర్భం లేకుండా, మన మానసికస్థితితో ప్రమేయం లేకుండా – వినిపించేసరికి కంపరమెత్తుకొస్తుంది సంగీత భావం మాత్రమే – ప్రధానంగా గల సంగీతమైతే ఎప్పుడు బడితే అప్పుడు వినటానికి ఇలాటి అభ్యంతరం వుండకపోను. ఈ కారణం చేత ఏడుపు సినిమా పాటలు ప్రజల సంగీతంగా రాణించలేకపోతున్నాయి

ప్రజల సంగీతానికి తగిన సాహిత్యం కూడా వుండటం అవసరం జానపదగేయ సాహిత్యం ఈ విషయాన్ని స్పష్టంగా నిరూపిస్తుంది సంప్రదాయసంగీత సాహిత్యం జనానికి అంతగా పట్టదు అది సామాన్యంగా భక్తిమయంగానూ, దేవుడి పరంగానూ వుంటుంది కృతులు మొదలైనవి పాడేవారు కూడా సాహిత్యంలో వుండే భావానికి అట్టే ప్రాధాన్యం ఇవ్వక సంగీతం పైనే తమ శక్తిసామర్థ్యాలు ప్రయోగిస్తారు

ఈ దృష్టితో చూసినట్టైతే కొద్ది సినిమా పాటలు తమ సాహిత్యంతో ప్రజలను అపారంగా ఆకర్షించాయి – ''అందమయా గురుడ'', ''గణనాథా'' లాటివి మిగిలిన పాటలలో వుండే సాహిత్యం కేవలం కథాసందర్భాన్ని పురస్కరించుకుని వుంటుంది ఆ పాటలను కథామట్టం నుంచి వేరుచేస్తే వాటికి అర్థం వుండదు– ''కనుల కొకసారైన కనపడని నా తల్లి'' ఎక్కిళ్ళతో సహా!

మరికొన్ని పాటలలో అసలు సాహిత్యమే వున్నట్టుండదు పల్లవి ''హాహాహ హాహాహా'' అనుపల్లవి ''లలలా, లలిలే'' పాటలో ముప్పాతిక మూడువంతులు ఏకాక్షర నిఘంటువులో కూడా కనబడని పాడి అక్షరాలుంటాయి! మిగిలిన పాటకు కూడా అర్థం వున్నట్టుండదు

అయినప్పటికీ ప్రజల సంగీతంగా పరిగణించటానికి ఈ సినిమా ప్రైవేటు సెక్టరు సంగీతం తప్ప ఈనాడు మరొకటి కనబడదు

*అభ్యుదయ, జనవరి 1959*

# 3. బాలగంధర్వ

బళ్ళారి రాఘవాచార్లు గారు ఆంధ్రలో 'రామదాసు' నాటకం ఆడుతున్నారు ఆయన పక్కన పర్వతరెడ్డి రామచంద్రారెడ్డి గారు కబీరుపాత్ర ధరిస్తున్నారు సంగీతంలో ఆసక్తిగల మా బంధువొకాయన రామచంద్రారెడ్డి గారిని గురించి చెబుతూ, ''ఆయన నటన సంగతి తెలీదు గాని, పాట మాత్రం బాలగంధర్వ లాగా పాడతారట'' అన్నాడు.

అదే మొదటిసారి నేను బాలగంధర్వ పేరు వినటం – 1924 లో

అప్పటికే బాలగంధర్వ రికార్డులు దేశంలో వున్నాయి. కాని నేను వినలేదు. వాటిని నేను విన్నది 1925 లో.

అప్పుడు నేను గుంటూరు కాలేజీలో ఇంటరు మొదటిసంవత్సరం చదువుతూ, శని ఆదివారాలకు తెనాలి వచ్చేవాణ్ణి. ఒక శుక్రవారం సాయంకాలం తెనాలి వచ్చి, తిన్నగా మా పెత్తల్లి గారింటికి వెళ్ళాను ఇంట్లో ఎవరూ లేరు ఎవరి దగ్గిరో

అయిపు తెప్పిస్తున్నారు ఒక పాతకాలపు 'పుప్పుల' గ్రామఫోనూ, రికార్డులూ వున్నాయి నా అభిమాన గాయకులైన బెడదం కృష్ణప్ప, రామప్పల రికార్డులెమైనా వున్నాయేమోనని ఒక రికార్డు తీసాను దానిమీద 'బాలగంధర్వ' అని వ్రాసుంది వెంటనే గ్రామఫోనుకు కి ఇచ్చి ఆ రికార్డు పెట్టాను

అది మోగిన మూడునిమిషాలలో నాకు కలిగిన భావావేశం వర్ణనాతీతం నేను అంతవరకూ మంచి సంగీతమనుకుంటూ వచ్చినదానికి దీనికీ ఏమీ సంబంధం లేదు ఇది సంగీతమయితే మిగిలినది సంగీతమే కాదు మనుష్యమాత్రుడెవడూ ఇట్లా పాడలేడు

అది ఏ భాషో, ఆ రాగం పేరేమిటో నాకు తెలీదు (అప్పటికి నాకు తెలిసిన పాతికరాగాలలో దేన్నీ అది పోలి లేదు) రికార్డు మళ్ళీ పరీక్షించాను ఇంగ్లీషులో 'మల్హాడ్' అని రాసి వుంది అది రాగం పేరని కూడా నేనెరిగను అయినా ఆ సమయంలో నాకు రాగం పేరు పట్టలేదు ఆ రికార్డును పది పన్నెండుసార్లయినా పెట్టి వుంటాను.

''అన్నతచి గోపాలా మృత్యు అలా'' అనే రికార్డు అది. రాగం 'సూరమల్హార్' 'స్వయంవర్' అన్న నాటకంలో రుక్మిణి పాత్ర ధరించి బాలగంధర్వ దాన్ని పాడతాడు

ఆంధ్రులను అత్యధికంగా ఆకర్షించిన బాలగంధర్వ పాట ''మూర్తిమంత భీతి ఉభా'' అన్నది యడవల్లి సూర్యనారాయణ గారి వక్కాన 'రత్నావళి' నాటకంలో రత్నావళి పాత్ర ధరించి స్టేజిమీదికి వస్తూనే రఘురామయ్యగారు ఈ పాటకు అనుకరణ పాడి ప్రేక్షక శ్రోతలపైన సమ్మోహనాస్త్రం వేసేవారు.

కాని 'తొలి ప్రణయం' లాగా నా అభిమాన కీర్తన 'అన్నతచి గోపాలా మృత్యు అలా''.

రఘురామయ్యగారికన్న ముందుగానే బాలగంధర్వ పాటల ప్రభావం తెలుగునాటకరంగం మీదికి వచ్చింది బాలగంధర్వ గానంతో ప్రభావితుడైన స్టేజి గాయకులలో జొన్నవిత్తుల శేషగిరిరావు గారు – ఆంధ్ర గంధర్వ – మొదటివాడని చెప్పవచ్చు 'మాండ్', 'మాండ్‌గర్బ్', 'పిలూ', 'జింగ్లా' మొదలైన రాగాలు ఆయన పద్యాలకు జోడించి పాడేటప్పుడు బాలగంధర్వ ప్రభావం కొట్టవచ్చినట్టు కనపడేది.

బాలగంధర్వ ప్రభావానికి గురిఅయిన నటులలో, లేక నటగాయకులలో, సి. యస్. ఆర్. ఆంజనేయులు, తుంగల చలపతిరావు, పారుపల్లి సత్యనారాయణ, పారుపల్లి సుబ్బారావు మొదలైన ప్రముఖులనూ, అనేకమంది ఇతరులనూ చేర్చవచ్చును

'మూర్తిమంత', 'అసే పతిదేవచి లలనా', 'శశిసూర్యప్రభా', 'కితి సాంగూతులా', 'స్వకుల తారకసుతా', 'మమ మనీ కృష్ణసఖారమలా', 'సత్యసత్యన చహోలా', 'మధుకర వనవన' మొదలైన అసంఖ్యాకమైన బాలగంధర్వ పాటలు స్టేజిమీదా, తొలిదశలో సినిమాలలోనూ అనుకరించబడ్డాయి. వాటి పూర్తి జాబితా ఈనాడు లభించటం కూడా కష్టమే

సినిమా (టాకీ) పరిశ్రమ ఆరంభమైనప్పుడు సంగీత దర్శకులుగా వచ్చినవారు స్టేజి హార్మోనిస్టులు, చాలావరకు వారంతా బాలగంధర్వ పాటలు ఎరిగిన వారే ఆ ట్యూనులనే వారు ఉపయోగించారు చాలా ఆరంభ పరిస్థితులలో మొదట 'వీరాభిమన్యు' చిత్రం తయారయిన కొత్తలో సంగీత దర్శకుడు లేకుండా కాంచనమాల రెండుపాటలు రికార్డు చేయమని వస్తే, నేను బాలగంధర్వ మెట్లు - 'ప్రణతనాద', 'మాన్యకాంతవరిలా' - ఇవ్వటం జరిగింది ఆ రోజుల్లో బాలగంధర్వ పాటల మెట్లు ఒక బంగారు పాతరే.

చిత్రమేమిటంటే బాలగంధర్వ పాడిన పాటలమెట్లన్నీ అంతకుపూర్వం వుండినవే గాని కొత్తవి కావు మరాఠీ నాటకకర్తలు పాటలు రాస్తూ అవి పాడవలసిన మట్లు కూడా నిర్దేశించారు ''వరములొసగి', 'మరుగేలరా', 'శ్రీ రఘుకులమందు బుట్టి' మొదలైన అనేక కర్నాటక కీర్తనలు మరాఠీ నాటకాల పాటలకు మట్లు ప్రసాదించాయి. వీటిలో కొన్ని మరాఠీనుంచి మనం తెలుగులోకి మళ్ళీ తెచ్చుకుని వుండటం విశేషం

బాలగంధర్వ మాత్రమే కాదు. ఆయన వెనకగా పేంఢర్కార్, రనడే, మాస్టర్ కృష్ణా మొదలైన మరాఠీ గాయకుల పాటలు కూడా ఆంధ్రదేశంలో బాగా చలామణీ అయాయి స్టేజి నటుడు కాకపోయినా నారాయణరావు వ్యాస్ పాటలు కూడా ప్రజాదరణ పొంది, స్టేజిమీదికీ, సినిమాలలోకీ ఎక్కాయి అందరికన్న ఆలస్యంగా బహుశా ఆంధ్రదేశంలో అడుగుపెట్టినవాడు దీనానాథ్ మంగేశ్కర్ - ప్రసిద్ధ సినిమా గాయనీమణులైన లతా, ఆశా, ఉషాల తండ్రి

ఒక్క విషయం చెప్పుకోవాలి. బాలగంధర్వ పాటలు ఆంధ్రదేశాన్ని జయించటానికి పూర్వమే అందుకు కొంత దోహదం జరిగింది అనేక నాటకాలకు పాటలూ. మాటలూ - అంటే పాటల మాటలు తయారుచేసిన పాపట్ల లక్ష్మీకాంతయ్యగారు మరాఠీపాటల ధోరణిలో రచించిన పాటలను నాటకప్రేక్షక లోకానికి పరిచయం చేసారు. 'బాగేశ్రీ', 'భీంపలాస్', 'బేహాగ్', 'భైరవి', 'మాల్‌కాస్' మొదలైన హిందూస్థానీ రాగాల మీద ఆయన చాలా స్టేజిపాటలు రాసారు. కర్నాటక సంప్రదాయానికి విలక్షణమైన 'విలంబిత్' పద్ధతిలో లక్ష్మీకాంతయ్యగారు కనీసం ఒక పాట - ద్రౌపదీ వస్త్రాపహరణంలో 'దీనజన పోషణా' అన్న ద్రౌపదిపాట - రాసారు.



బాలగంధర్వ ఏపాటి గాయకుడు?

ఆయన గొప్పగాయకులలో జమ కాడు. అందరి లాగే ఆయనా ఆరేళ్ళు సంగీతం నేర్చుకుని విద్వాన్ పుచ్చుకున్నాడు. కాని ఆయన విద్వత్తుతో పైకి రాలేదు. పాడటానికే పుట్టాడు లేకపోతే పదేళ్ళకే 'బాలగంధర్వ' అనే బిరుదు సంపాదిస్తాడా? తన పాడే శక్తిని సామాన్యప్రజలను పారవశ్యంలో ముంచటానికి ఉపయోగించాడు.

''బాలగావాళ్ళ చేత పాడించాడు! ఎవరు చెయ్యగలిగారా పని'' అని ఆయనను మెచ్చుకున్నవాళ్ళున్నారు

బాలగంధర్వలో ప్రజారంజకంగా పాడే నేర్పుతో పాటు ఇంకా కొన్ని మంచి లక్షణాలున్నాయి. పాటతో మాటలను చాలా భావయుక్తంగా అనేవాడు. మరాఠీ భాష రాని వాళ్ళే ఎవరికైనా ఈ సంగతి తెలిస్తే అదే మాతృభాషగా గల వాళ్ళు, ఆయన కీర్తన పాడే పద్ధతికి ఎంత ముగ్ధులై వుండేవారో ఊహించుకోవచ్చు. ఉదాహరణకు, 'నాథ హా మారుఝా' అన్న పాటలో 'రుక్మి శిశు సమ' అన్న మాటను ఎంత తేల్చి అనే వాడంటే 'కుర్రకుంక' అన్నట్టుగా వినిపించేది!

ఇంకొక అద్భుత విషయమేమంటే, బాలగంధర్వ పాడుతుంటే భాష తెలీని వాడికి కూడా, భావం తెలిసేది 'రాజసబాళా' అన్న పాట 'ఏకచ్ప్యాలా' నాటకంలోది. ఇది చాలా విషాదఘట్టంలోది బాలగంధర్వ దాన్ని విషాదం ఉట్టిపడేటట్టు పాడేవాడు కాని ఎక్కడా ఎక్కిళ్ళు, ఎగబీల్పులూ, గొంతు గద్గదం చెయ్యటాలూ వుండేవి కావు ఆ విషాదం పాడే తీరులోనే - రాగభావంగా మాత్రమే వుండేది ఒక కర్నాటక విద్వాంసుడు బాలగంధర్వ పాటల రికార్డులనేకం విని, ఈ 'రాజసబాళా' రికార్డు పెట్టేసరికి తన్మయుడై పోయి, ''బాలగంధర్వ ఎంత గొప్ప పాటగాడో ఈ పాటలో తెలుస్తోంది'' అన్నాడు.

తెలుగువాళ్ళు దాదాపు ఒక కాలు శతాబ్దం పాటు బాలగంధర్వను నెత్తినపెట్టుకుని ఊరేగించి కూడా, గాయకుడుగా ఆయనలో గల ఈ రెండు గుణాలనూ అలవరుచుకోలేదు. ఈనాటి మన సినిమా పాటలలో దుఃఖం ప్రదర్శించవలసి వస్తే ముక్కు చీదుకోవటం మినహాగా అంతా చేసేస్తున్నారు

ఒక్కొక్క రాగం వెంట ఒక్కొక్క భావం వుంటుందనే నమ్మకానికి బాలగంధర్వ కట్టుబడినట్టు కనపడలేదు

ఒకే రాగం మీద ఆయన వేరు వేరు పాటలు పాడి వేరు వేరు భావాలు ప్రదర్శించాడు. 'జాన్‌పురి' మీద ఆయిన పాడిన 'బాళా జాయీ పరతోని' అనే పాట వింటుంటే మనకు జాలితో కూడిన ఆవేదన పుట్టుకొస్తుంది. అదే రాగంమీద పాడిన 'అజిపురవాహీ' అనే పాట వింటుంటే మనసు నృత్యం చేస్తుంది. సాధారణంగా దుఃఖాన్ని సూచించే 'పూర్యధనాశ్రీ' రాగం మీద 'సాహసకర్మ నకాకరు ఆతా' అనే పాట దాదాపు రౌద్రం స్ఫురించేలాగా పాడాడు

బాలగంధర్వ తన పాటలో సమస్త రసాలనూ వ్యక్తం చెయ్యటమే గాక వాటి మిశ్రణాలనూ, ఛాయాభేదాలనూ కూడా వ్యక్తం చేసాడు. ఇలాంటి అవకాశం స్టేజి గాయకుడికి వున్నంతగా శాస్త్ర సంగీతం పాడే వాడికి వుండదు అందుచేత బాలగంధర్వ స్టేజి గాయకుడుగా నిలిచిపోయినందుకు ఎవరూ తప్పుపట్టలేరు.

ఏ కళనుగాని ప్రేమించనివాడు ఆ కళ ప్రదర్శించి ఇతరులు దాన్ని ప్రేమించేటట్టు చేయలేడు. ఇది సిద్ధాంతం. బాలగంధర్వకు సంగీతమంటే చాలా ప్రేమ తాను స్టేజిమీద వుండగా మరొక పాత్రధారి పాడుతుంటే తాను కూడా ఆ పాట పాడాలన్నంతగా ఊగిపోయేవాడు ఇది ఒకే ప్రదర్శనంలో నేను అనేక పర్యాయాలు గమనించాను గానంతో తన్మయుడు కాగలిగాడు కనకనే ఆయన తన గానంతో అనేకులందిని తన్మయులను చేయగలిగాడు

తాను శాస్త్రీయ సంగీతాన్ని అనుసరించకపోయినా బాలగంధర్వకు ఆ సంగీతమంటే భక్తి వుండేది. ఆయన ట్రూపు నాటకాలాడుతూ మారుమూల గ్రామాలకు వెళ్ళినప్పుడు స్థానిక విద్వాంసుడొకడు వచ్చి, ''మహా పాడేవాళ్ళు వచ్చారు! నాతో సమంగా పాడండి'' అని సవాలు చేశాడట అప్పుడు ''నా బోటి వాళ్ళ వల్ల ఏమవుతుంది? మా కృష్ణారావును ముందుకు నెట్టేవాళ్ళం'' అని బాలగంధర్వ మా తమ్ముడితో అన్నాడట కృష్ణారావంటే మాస్టర్ కృష్ణా పెద్ద విద్వాంసుడి కింద లెక్క. బాలగంధర్వ నాటకాలలో మగపాత్రలు ధరించేవాడు కంపెనీకి మ్యూజిక్ డైరెక్టరు కూడా

కనక, బాలగంధర్వ శాస్త్ర సంగీతాన్ని చిన్నచూపు చూడలేదు కావాలంటే ఆయన శాస్త్రసంగీతంతో కచేరీలు చేయగలిగేవాడో లేదో తెలీదు కొన్ని కొన్ని రాగాలలో అపస్వరాలు - మాల్‌కాస్‌లో రిషభం - బుద్ధిపూర్వకంగా వేసేవాడు అవి ఎంతో రమ్యంగా వుండేవి. గానదేవతను ఆయన శాస్త్రీయమైన పద్ధతిలో ఆరాధించలేదేమో గాని, మరొక పద్ధతిలో ఎంతో భక్తితోనే ఆరాధించాడు

బాలగంధర్వ స్టేజి మీద స్త్రీ పాత్రలే ధరించాడు ఆయన మరాఠీ ఆడవాళ్ళకు వాలుగోచీతో చీరె కట్టటం నేర్పిన మాట కూడా నిజమే. బిళ్ళ గోచీతో చీరె కట్టటం మరాఠీ సంప్రదాయం నేను బొంబాయికి వెళ్ళటం జరిగేసరికి బాలగంధర్వ నేర్పిన చీరె కట్టుతో వందలాది మరాఠీ అమ్మాయిలు కనిపించారు.

బాలగంధర్వ పాడటానికి పుట్టినట్టే ఆడవేషం వెయ్యటానికి పుట్టినట్టు కనపడేవాడు నేను ఆయనను స్టేజి మీద ఒక నాటకంలోనే చూసాను. అది 'సంశయ కల్లోల్' అనే హాస్యనాటకం అందులో బాలగంధర్వ రేవతి అనే వేశ్యవేషం వేస్తాడు. ఆయన స్టేజిమీదకు రాగానే నిర్ఘాంతపోయాను. మామూలుగా తెల్లగా మంచిరంగుతో వుంటాడు స్టేజిమీద ఆయనే అందరికన్నా తక్కువ ఛాయలో కనబడ్డాడు 'లోకట్' చోళీ ధరించాడు చాలా పలచని చీరె కట్టాడు. అందులోనుంచి కాళ్ళు తొడలదాకా కనబడుతున్నాయి మన నటులు కూడా స్త్రీ వేషాలు వెయ్యటం నేనెరుగుదును రెండు డజన్ల పిన్నులైనా వుంటే గాని మనవాళ్ళ స్త్రీ పాత్రధారణ పూర్తి కాదు బాలగంధర్వ 'సాహసం' చూసి నాకు ఆశ్చర్యం కలిగింది. మొహానికి ఆయన 'కోటా' వేసుకోకపోవటానికి కారణం చెప్పారు – పెయింట్ పూస్తే ఆయన చర్మం పెట్లుతుందిట

పాట చెప్పినప్పుడల్లా స్టేజి ముందుకు వచ్చి ప్రేక్షకుల కోసం పాడి. ఎన్నిసార్లు ప్రేక్షకులు కోరితే అన్నిసార్లూ పాడేవాణ్ణి గొప్పనటుడని అనడానికి మనకు మనసొప్పదు కాని రంగస్థలమైతే ఒకటి లేకపోతే బాలగంధర్వ మంచి నటుడనిపించుకోవటానికి తగిన హంగులన్నీ వున్నవాడే అందమైన ముఖంలో అన్ని భావాలూ సులువుగా పలుకుతాయి సంభాషణలు చాలా చక్కగా అనగలడు

బాలగంధర్వ చాలా నాటకాలలో పాత్రలు ధరించాడు 'ఏకచ్ ప్యాలా' లో సింధుపాత్ర (ట్రాజిక్ హీరోయిన్ 'సంశయకల్లోల్' లో రేవతి హాస్య ప్రధాన పాత్ర రుక్మిణీ, సుభద్రా, మీరా, 'మానాపమాన్' లో నాయిక (పేరు గుర్తులేదు) మొదలైన అనేక పాత్రలు ఆయన ధరించాడు. అన్ని పాత్రలలోనూ ఆయన రాణించినట్టే కనబడుతుంది. సాటినటుడైన దీనానాథ్ మంగేశ్కర్ బాలగంధర్వను గురించి చెబుతూ 'ఏకచ్‌ప్యాలా' మొదటి సగంలో సింధూపాత్రను నేను బాగా పోషిస్తాను రెండవ సగంలో బాలగంధర్వ నాకన్న బాగా చేస్తాడు'' అన్నాడు సింధు పాత్రలో నిజంగా చెయ్యవలసిన నటనంతా ఉత్తరార్ధంలోనే వున్నది గనక, బాలగంధర్వ మంచి నటుడనటానికి ఈ కితాబు చాలు

బాలగంధర్వ ఒకే ఒక మగపాత్ర ధరించాడు. అది 'ధర్మాత్మ' చిత్రంలో. ఈ చిత్రంలో నటించేదాకా ఆయనకు హిందీ కూడా రాదు ఇంగ్లీషు ఎన్నడూ రాదు 'ధర్మాత్మ' చిత్రంలో ఆయన ఏకనాథ్ పాత్రను చక్కగా నిర్వహించాడు.

ఆయన మనస్సు అతి కోమలమైనదిగా కనబడుతుంది. 1920 ప్రాంతంలో తన నాటక కంపెనీ దెబ్బతిన్నప్పుడాయనకు మనోవ్యాధి వచ్చిందట. మిత్రులందరూ ఆయనకు ధైర్యం ఇచ్చి తిరిగి కంపెనీ పెట్టించారట.

నాటకాల నుంచి విరమించుకొనే కాలంలో ఆయన ఎక్కువగా భక్తిప్రధానమైన నాటకాలు ఆడాడు భక్తి పాటలు స్టేజిమీద పాడాడు నాటకాలు మానేశాక కూడా ఆయన భజనలు జాస్తిగా పాడాడని విన్నా మన దక్షిణాది వాగ్గేయకారులు భక్తినుంచి సంగీతం సృష్టిస్తే బాలగంధర్వ సంగీతం నుంచి భక్తిలోకి వెళ్ళిపోయాడు. ఇప్పుడీలోకం నుంచే వెళ్ళిపోయాడు. కాని ఆయనకన్న ముందుగానే ఆయనశకం వెళ్ళిపోయింది.

ఆయన ఇంటిపేరు రాజ్‌హంస్ అన్నప్పుడు నేను నమ్మలేకపోయాను. అంత చక్కని పేరు కూడా కుదురుతుందా? కుదిరింది! ఆయన సొంతపేరు నారాయణరావ్. నిజంగా ఆయన సంగీతంలో రాజహంసే ఆయన సంగీతాన్ని ఎవరూ శాసించలేదు. దాని కవసరమైన శాసనాలన్నీ ఆయనే చేసుకుని, రాజహంస లాగా సంగీత సముద్రంలో విహరించి తరించాడు

మరొక బాలగంధర్వ అవతరిస్తే ఈసారి సినిమా సంగీత సాగరంలోనే అవతరించాలి ఇప్పటికింకా అలాంటి సూచనలేమీ లేవు

* * *

(పురుషులు స్త్రీ పాత్రలు ధరించే కాలంలో తమ స్త్రీ పాత్రలతో ఐదు దశాబ్దాల పాటు లక్షలాది ప్రేక్షకులను ఉర్రూతలూపినవారు శ్రీ బాలగంధర్వ. ఆయన 1888 జూన్ 28వ తేదిన పూనాలో జన్మించారు. ఆయన అసలు పేరు నారాయణరావ్ రాజ్‌హంస్. ఆయన అసామాన్య ప్రతిభావంతుడు)

బాలగంధర్వ బాల్యంలో అంత తెలివితేటలు కలవారేమీ కాదు. ఎలాగో రెండవఫారం నెట్టగలిగారు. అతనికి ఇక చదువు అబ్బదని తండ్రి అతనిని సంగీతం నేర్చుకోడానికి కొల్హాపురం పంపాడు. ఒకమారు లోకమాన్య బాలగంగాధరతిలక్ ఆ కుర్రవాణ్ణి చూడడం తటస్థించింది. ఆ సుందరాకారుడయిన బాలకుని శ్రావ్యమయిన కంఠానికి లోకమాన్యులు ముగ్ధులయ్యారు. వెంటనే 'బాలగంధర్వ' అని సంబోధించారు. అప్పటినుండి అతనికి 'బాలగంధర్వ' అనే బిరుదమే, వ్యవహారనామం కూడా అయింది.

శ్రీ బాలగంధర్వ 1905లో తన 17వ ఏట కిర్లోస్కర్ నాటకమండలి అనే నాటకాల కంపెనీలో నాయికాపాత్రధారిగ చేరారు. కిర్లోస్కర్ నాటకమండలి, మరాఠీ రంగస్థల సముద్ధరణకు ఉద్యమించిన మొట్టమొదటి నాటకసంఘం. శ్రీ బాలగంధర్వ మొట్టమొదటి నాయికపాత్ర శకుంతల. ఈ నాటక మండలి సంస్కృత నాటకాలను మరాఠీలో అనువదించి ప్రదర్శించేది. ఈ మండలి మీరజ్‌లో శాకుంతలం ప్రదర్శించినప్పుడు శ్రీ బాలగంధర్వ తొలిసారిగా శకుంతలపాత్ర ధరించి రంగస్థలంలో అడుగు పెట్టగానే ప్రేక్షకులు అచ్చెరువు పడ్డారు. తమకు తెలియకుండానే హర్షనినాదాలు చేసారు.

శ్రీ బాలగంధర్వ మీరజ్‌లోను, తర్వాత పూనా బొంబాయి నగరాలలోను నాయికాపాత్రలు ధరించి లక్షోపలక్షల ప్రేక్షకులను పరవశులను చేసారు. మీరజ్‌లో ఆరంభమయిన ఆయన కీర్తికి పురోగతే గాని ఎప్పుడూ జీవితంలో పశ్చాద్గతి కలుగలేదు.

శ్రీ బాలగంధర్వ 1913లో కిర్లోస్కర్ నాటకమండలిని వదిలిపెట్టి, మరాఠీ నాటకకర్త శ్రీ కె.పి. ఖాడిల్‌కర్ ప్రోత్సాహంతో 'గంధర్వ నాటకమండలి' అనే నాటకసంఘం స్థాపించారు. దీనితో మరాఠీ రంగస్థలంలో నూతనశకం ప్రారంభమయింది.

బాలగంధర్వ నాటకమండలి అప్పటి గొప్ప సంగీత విద్వాంసులకు, జంత్రవిద్యానిపుణులకు ఉనికి పట్టు అయింది. ఆయన శ్రావ్యకంఠాన్ని అప్పటి శ్రీ అల్లాదియాఖాన్ వంటి మహాసంగీత విద్వాంసులు కూడా వినడానికి చెవి కోసుకునేవారు.

శ్రీ బాలగంధర్వ పెక్కు పౌరాణిక, సాంఘిక నాటకాలలో నాయికాపాత్రలు ధరించేవారు. శకుంతల, వసంతసేన, శారద, సుభద్ర మొదలయినవి. కాని వాటిలో నేటికీ చాలమందికి జ్ఞాపకమున్నవి శ్రీ ఖాడిల్‌కర్ 'స్వయంవర్' అనే నాటకంలో రుక్మిణి పాత్ర, శ్రీ ఆర్. జి. గడ్‌కర్ 'ఏక్ చా ప్యాలా' అనే నాటకంలో 'సింధు' పాత్ర సుభద్ర, మానాపమాన్, సంశయకల్లోల్, వీరతనాజీ, విద్యాహరణ్ మొదలయిన నాటకాలలో ఆయన ధరించిన నాయికాపాత్రలు గూడ నేటికీ పలువురికి జ్ఞాపకం వుంటాయి.

శ్రీ బాలగంధర్వ ఎంతో వినయశీలురు. తమ నాటకమండలిలోని వారు పొరపాట్లు చేసినా మన్నించే మెత్తని మనస్సు కలవారు అయినా న్యాయమైన విషయాలలో గట్టిగాను, దృఢసంకల్పంతోను ప్ర... ు

ఆయనకు రాష్ట్రపతి 1955లో ఉత్తమ నటునికిచ్చే పతకం, ఆవార్డు బహూకరించారు 64లో 'పద్మభూషణ్' బిరుదం ఇచ్చారు

శ్రీ బాలగంధర్వ ఈ సంవత్సరం జూలై నెల 15వ తేదీ అపరాహ్ణంలో పూనాలో మరణించారు ఆయన వయస్సు 79 సంవత్సరాలు. ముత్తానదీతీరం లోని ఓంకారేశ్వర్ పితృభూమిలో అంత్యక్రియలు జరిగాయి.

ఆయనకు ఇద్దరు కుమార్తెలున్నారు )

*భారతి, మాసపత్రిక, ఆగస్టు 1967*

# 4. కర్నాటక సంగీతంలో శ్రీ బాలమురళీకృష్ణ ప్రతిభ

ఈనాడు కర్ణాటకసంగీతం పాడగలవారిలో బాలమురళి దరిదాపులకు రాగలవాళ్ళెవరూ లేరని ఘంటాపథంగా చెప్పవచ్చు ఈ మధ్యకాలంలో కొందరు కర్ణాటక సంగీత విద్వాంసులు కీర్తిశేషులు కావడం చేత ఈమాట అనే అవకాశం వచ్చిందనుకోనవసరం లేదు. 1943లో నేను మొదటిసారి బాలమురళి కచేరి బొంబాయిలో విన్నప్పుడు కూడా (అప్పుడు తనకు పధ్నాలుగేళ్ళని చెప్పాడు) అతని ప్రమాణం ఇంతా వున్నది. అప్పటికీ ఇప్పటికీ అది అంతటి వజ్రమే. అయితే ఈ మధ్యకాలంలో బాగా సానపడి మరింత మిరుమిట్లు గొలిపేటట్టుగా మెరుస్తున్నది.

బాలమురళి మద్రాసు చేరాక అతని పాట తరచుగా వినే అవకాశం నాకు లభించింది కొంతకాలంగా నాకు, అతను పాడుతూంటే అస్పష్టంగా త్యాగరాజు గారు జ్ఞాపకం వస్తూండేవాడు (అందుకు కారణం అతను త్యాగరాజు కీర్తనలు జాస్తిగా పాడడం మటుకు కాదు, అతను సంప్రదాయ కీర్తనలు వదిలి తన సొంత రచనలు హెచ్చుగా పాడుకుంటున్నాడని మద్రాసు పత్రికలలో విమర్శ కూడా వచ్చింది. అలాటి విమర్శ చూడగానే నేను అప్రయత్నంగా ''తప్పేం? త్యాగరాజు తన పాటలను పాడుకున్నాడు కాడా?'' అనేశాను... సొంత పాటలు పాడుకోవడమేనా త్యాగరాజుకూ, బాలమురళికీ పోలిక? కాదు! ఇంకా ఏదో వున్నది )

'త్యాగరాజు' సంగీత నాటకం

ఇంతలో 'త్యాగరాజు' సంగీతనాటకం వచ్చింది తమిళ నాటకం – త్యాగరాజపాత్ర ధరిస్తున్నది బాలమురళి బాలమురళి కాకపోతే ఆ వేషానికింకెవరున్నారు? ఆలోచించి చూసుకున్నాను ఇంకెవరూ లేరు

'త్యాగరాజు' తొలిప్రదర్శన చూసే అవకాశం నాకు కలగలేదు మలి ప్రదర్శనం చూసాను త్యాగ బ్రహ్మసమాజం వారు త్యాగరాజ ఉత్సవాల సందర్భంలో ఆ నాటకాన్ని ... అయిదవ తేదీన మద్రాసులోని వాణీమహలులో ఆడించారు

నాటకం మద్రాసుపౌరులకు చాలా తృప్తికరంగా వున్నట్టు కనబడింది నాకు ...లేదు సినిమా రంగం లాగా చిన్న చిన్న రంగాలు స్టేజి మీద లైట్లు వెలిగిన దానికన్న ఆరి వున్న కాలమే హెచ్చనిపించింది అచ్చుగా రామభక్తుడుగా మాత్రమే చూపి త్యాగరాజస్వామి పాత్రను చాలా సంకుచిత పరిచారు ఈ కాస్త నాటకంలోకి నారదుణ్ణీ, హనుమంతుణ్ణీ, రామలక్ష్మణులను తీసుకువస్తే తప్ప త్యాగరాజుగారి జీవితం కదముట్టలేక పోయింది! కాని ఈ ప్రదర్శన చూసినందుకు నేను విచారించలేదు ఇది చూస్తుంటే నాకు, బాలమురళి త్యాగయ్యల మధ్య లింకు దొరికింది (గొప్ప విషయం కనిపెట్టానని కాదు, నేనింత కాలానికి గమనించినది ఇతరులు ఏనాడో కనిపెట్టి వుండవచ్చు)

నాకు నచ్చని ఈ నాటకంలో బాలమురళి ని ఒక్కందుకు మెచ్చుకున్నాను అతను తన అనర్గళ గానపటిమను ఎక్కడా ప్రదర్శించలేదు రెండో రకానికీ, మూడో రకానికీ చెందిన గాయకులు సైతం ఇలాటి పాత్రలు దొరికితే పాటకచ్చేరీలు చేసి పారెయ్యడం నాకు బాగా తెలుసు. త్యాగరాజు పాత్రలో బాలమురళీ ఎక్కడా పాటకచ్చేరీ చెయ్యలేదు. తనకు గల పాటలో శతాంశం కూడా చూపలేదు కాని ''ఎందరో మహానుభావులు'' పాడేటప్పుడు బాలమురళి త్యాగయ్య అయిపోయాడు!

బాలమురళి అనర్గళమైన పాటలకూ, స్వరప్రస్తారానికి బీజాలు ఆ పాటలో లేవా? నేనెందుకింతకాలం గమనించలేదు? ఎంతో మంది ఈ విషయం ఏనాడో గ్రహించి వుంటారనుకుని నేను చాలా సిగ్గుపడ్డాను.

## త్యాగయ్య ఆవేదన

త్యాగయ్య భక్తుడు, కవి, గాయకుడు, సంగీత కళానిధి, సంఘ విమర్శకుడు. కాని, అన్నింటిని మించి సంగీతపు పుట్ట, సంగీతం మహాసముద్రమైతే, త్యాగరాజు గజ ఈతగాడు కాదు తిమింగలం. ఆయన సంగీతం కోసం బతికాడు అమిత అరాజక పరిస్థితులలో బతికి భక్తిద్వారా ఆత్మ సాక్షాత్కారం సాధించాడు అమాయకుడు కాడు, ఆత్మాభిమానం లేనివాడు కాడు తన గేయాల ద్వారా తన గోడు ఎంత వెళ్ళబోసుకున్నాడో చెప్పడం కష్టం. ''నాదు పై పలికేరు నరులు'' అన్నాడు, ''పుట్టులోభులను పొట్టకై పొగడితి, దుష్టులతో గూడి, దుష్కృత్యములు సలిపినట్టు చేసిన త్యాగరాజును'' అని కూడా తానే చెప్పుకున్నాడు. కాని లోకాన్ని వెయ్యి కళ్ళతో చూసి అసహ్యించుకున్నాడు, నవ్వుకున్నాడు, మెచ్చుకున్నాడు, ఏ నాటకం చూసాడో ఏమో, ''స్త్రీ వేషధారికి సాధ్వినడతలు ఏమైనా తెలుసునా?'' అనుకున్నాడు

ఇటువంటి లక్షణాలు కొన్ని బాలమురళిలో కనిపిస్తున్నాయా? బాలమురళి తన రచనలలో కొన్ని విసుర్లు విసురుతున్నాడు తన పాటను విమర్శించే వాళ్ళను

గడ్డిపరకల కింద కట్టేస్తున్నాడు - శ్రోతలు హర్షిస్తున్నారు త్యాగరాజ గారి పాటల భిక్షతో ప్రభుత్వ బిరుదులు సంపాదించే వారిని గురించి ప్రస్తాపిస్తున్నాడు తప్పేమిటి? ఎంతమంది పద్మవిభూషణులు కర్నాటక సంగీతాన్ని కసరత్తు కింద తయారుచేసి కీర్తి, డబ్బూ గడించలేదు? నిజమైన సంగీత ప్రియులు బాలమురళి పాట విని అదే చెప్పుతో మరొక ఊకదంపుడు పాట విని ఆనందించగలరా?

కర్నాటక సంగీతానికి కాణాచిగా వుంటూ వస్తున్న దక్షిణ దేశంలో ఆ సంగీతానికి కొత్తజీవం పొయ్యడానికి బాలమురళి అవతరించాడనడానికి ఆధారం వున్నది ఆ కర్తవ్యం అతను నిర్వహించగలిగితే బాలమురళి నిజంగా అభినవ త్యాగరాజే

*ఆంధ్రజ్యోతి దినపత్రిక, 9-3-1967*

# 5. గాన సుధాకరుడు

నేను మొట్టమొదటిసారిగా బాలమురళీకృష్ణ పేరు వినటం 1941లో ఆంధ్రపత్రికాఫీసుకు ఒక ప్రసిద్ధగాయకుడు వస్తే నా మిత్రులు నీలంరాజు వెంకటశేషయ్య గారు, ''ఈ బాలమురళీకృష్ణ నిజంగా గొప్ప పాటగాడేనా? లేక, కుర్రవాణ్ణి ప్రోత్సహించటానికి అందరూ మెచ్చుకుంటున్నారా?'' అని అడిగారు

''మేమంతా పదిహేనేళ్ళు సాధించి నేర్చుకున్నది అతనికి తొమ్మిదేళ్ళకే వచ్చునండి. అతను సరస్వతీ అవతారం!'' అన్నాడా గాయకుడు.

ఆ సరస్వతీ అవతారానికి అప్పటికి పదకొండేళ్ళు. అయితేనేం? అప్పటికే రెండేళ్ళుగా పాటకచ్చేరీలు చేస్తున్నాడు

తరవాత మరి రెండు మూడేళ్ళకు నేను బొంబాయిలో బాలమురళీ కచేరీ విన్నాను. నాకున్న అల్పసంగీత జ్ఞానంతో నేను, అతను సమగ్రగాయకుడని గ్రహించగలిగాను. రాగాలాపన, కీర్తన, స్వరకల్పన, లయ, ఎందులోనూ అతవిలో తడుముకోవటం గాని, వెలితి గాని వున్నట్టు కనిపించలేదు. అప్పటికి అతనికి పధ్నాలుగో ఏడు. నాలుగైదేళ్ళుగా పాటకచ్చేరీలు చేస్తున్నాడు. నలభై ఏళ్ళుగా కచేరీలు చేస్తున్న ధీమా అతనిలో కనిపించిది.

ప్రాడిజీ

అంత చిన్న వయసులో అసాధారణ ప్రజ్ఞాపాటవాలు ప్రదర్శించేవారిని ప్రాడిజీలంటారు గానం, గణితం, చిత్రలేఖనం, కవనం మొదలైన విద్యలలో ప్రాడిజీలు కనిపిస్తారు. పూర్వజన్మలలో విశ్వాసం వున్నవాళ్ళు వాళ్ళ శక్తులు సంచితమంటారు అలాటి నమ్మకం లేనివాళ్ళకు అవి అంతుబట్టటం చాలా కష్టం.

అయితే ఈ ప్రాడిజీలతో తరచు ఒక చిక్కు ఉంటుంది యుక్తవయస్కులయే సరికి వాళ్ళ శక్తులన్నీ కోల్పోయి చాల మామూలుగా తయారవుతారు ఇంగ్లండులోని రాయల్ ఎకాడమీలో 14 ఏళ్ళ లోపు పిల్లలు వేసిన అద్భుత చిత్రాలు కొన్ని వున్నాయి. ఆ చిత్రకారులలో కొందరు పెద్దవాళ్ళు అయ్యాక పిల్లి బొమ్మ కూడా వేయలేకపోయారుట!

బాలమురళి ఈ రకం ప్రాడిజీ మాత్రం కాదు అందుకే అతను నలభయ్యో ఏట అత్యుత్తమ కర్నాటక గాయకుడి హోదాలో వుండి, ముప్పై ఏళ్ళుగా పాటకచ్చేరీలు చేసినందుకు జనవరి 11 న మద్రాసులో ఘనమైన సన్మానం జరిపించుకున్నాడు.

**బాల్యం**

బాలమురళి తండ్రిగారు పట్టాభిరామయ్యగారు రాజగురువుల కుటుంబానికి చెందినవారు పదిమంది అన్నదమ్ములలో నాలుగోవారు ఆయన కొంతకాలం వేదమూ, కొంతకాలం శాస్త్రమూ చదువుకున్నారు. ఏ చదువుమీదా బుద్ధి నిలవలేదు చివరకాయనకు సంగీతం మీద గురి కుదిరింది సుసర్ల దక్షిణామూర్తి శాస్త్రుల వారి దగ్గర నాలుగేళ్ళు సంగీతం అభ్యసించి, ఫ్లూట్ వాయించటం సాధన చేసి బెజవాడ చేరి, సంగీతపాఠాలు చెప్పసాగారు

అప్పుడు ఆయనకు వివాహమయింది ఆయన మామగారు సుప్రసిద్ధులైన ప్రయాగ రంగదాసుగారు. ఆధ్యాత్మరాయణ కీర్తనలు అద్భుతంగా పాడేవారు ఆయన కుమార్తె అయిన సూర్యకాంతమ్మ గారు కూడా ఆధ్యాత్మరామాయణం పాడేవారు కాపరానికి వచ్చాక ఆమె భర్త ప్రోత్సాహంతో వీణ నేర్చుకుని, చిన్న చిన్న పాట కచ్చేరీలు కూడా చేశారు.

ఈ దంపతులకు 1930 లో తొలి ఏకాదశినాడు బాలమురళి జన్మించాడు. మలి ఏకాదశినాడు, బాలమురళి పుట్టిన 15 రోజులకు, అతని తల్లి కన్నుమూసింది తరవాత రెండుమూడేళ్ళ పాటు పెత్తల్లిగారు పెంచారు తరవాత అతను తండ్రివద్దనే పెరిగాడు.

గురుశిష్య పరంపరలో సుసర్ల దక్షిణామూర్తి శాస్త్రుల వారు త్యాగరాజస్వామికి ప్రశిష్యులు అందుచేత పట్టాభిరామయ్యగారు ఆ పరంపరలో నాలుగోతరం వారు. అలాగే గాయక సార్వభౌమ పారుపల్లి రామకృష్ణయ్య పంతులుగారు కూడా దక్షిణామూర్తి శాస్త్రులవారి శిష్యులే - అయితే పట్టాభిరామయ్య గారికి చాలా సీనియర్

పట్టాభిరామయ్య గారే బాలమురళికి మొదటి గురువని ఈనాడు అందరూ చెప్పుకున్నా, ఆ సంగతి చాలాకాలం పట్టాభిరామయ్యగారికే తెలీదు ఆయన వద్ద నూకల చినసత్యనారాయణ, అక్కాజీరావు మొదలైన శిష్యులే గాక, సన్నాయి వాయించే వాళ్ళూ తదితరులూ సంగీతపాఠాలు చెప్పుకునేవారు. బాల బాలమురళి ఆ పాఠాలు విని పట్టుకున్నాడు ఏడవ ఏటనే అతనికి అనేక గీతాలు, వర్ణాలూ, కొన్ని కీర్తనలూ వచ్చును.

ఈ సంగతి పట్టాభిరామయ్య గారికి వారి శిష్యుల ద్వారా తెలిసింది. కాని విషయం పూర్తిగా తెలిసినట్టు కనబడదు. ఎందుచేతనంటే బాలమురళిని ఎనిమిదో ఏ షష్టవారంలో చేర్పారు. అయితే ఆయనే బాలమురళిని పారుపల్లి రామకృష్ణయ్య పంతులుగారి దగ్గిర చేర్చి, సంగీతం చెప్పిస్తున్నారు. కుర్రవాడు అవినంతకే కొంత తయారై వినిపిస్తున్న సంగతి పంతులు గారికి చెప్పలేదు. అందుచేత ఆయన ఏదో ఒక్క పాట ప్రారంభించి చెబుతూ సగంలో గ్రామాంతరం వెళ్ళారు.

ఆ పాట పూర్తి కానేలేదు.

ఈలోగా బెజవాడలో దక్షిణామూర్తి శాస్త్రుల వారి ఉత్సవాలు జరపటానికి నిశ్చయమయింది. కార్యక్రమంలో పదిమంది పేర్లతో పాటు బాలమురళి పేరు కూడా చేర్చారు.

ఆనాడు తొలి ఏకాదశి. బాలమురళి 9వ పుట్టినరోజు. ఉదయం 8 నుంచి కాబోలు బాలమురళిని ఏ గంటసేపో పాడనిచ్చి, ఆటు తరవాత భోజనాల వేళ దాకా మునునూరి సూర్యనారాయణ భాగవతార్ గారి హరికథా కాలక్షేపం అనుకున్నారు.

కాని తొమ్మిదేళ్ళ బాలమురళి ఏ రెండున్నర గంటలసేపో పక్కా పాటకచేరి చేసాడు. ఆలాపనా, కీర్తనా, స్వరకల్పనా- సమస్త హంగులతోనూ! వింటున్న పండితులకు మతులు పోయి వుండాలి.

పారుపల్లి రామకృష్ణయ్య పంతులు గారిని మెచ్చుకోవాలి. తమ దగ్గిర సంగీతం నేర్చుకున్న బొట్టికాయ తనతో సమంగా పాటకచేరి చేస్తే మరొక గురువు ఆగ్రహించటానికి ఎన్ని కారణాలైనా వుండవచ్చు. కాని రామకృష్ణయ్య పంతులు గారు ఆనందాశ్రువులు రాల్చి, గురుత్వంను కొనసాగించారు. బాలమురళి ఒక వంక పాటకచేరీలు చేస్తూ, శిష్యరికం చేసి కీర్తనలు నేర్చుకున్నాడు. (ఇలాటి సంఘటన నా ఎరికలో మరొకటే వున్నది. సుప్రసిద్ధ సినీ గాయని లత తండ్రి దీనానాథ్ మంగేష్కర్ గాయకుడిగా అంతులేని కీర్తి గడించినాక వజేబువాకు కోరి శిష్యుడయ్యాడు).

మా గురువులాంటి గురువు - నభూతో న భవిష్యతి! అంటాడు బాలమురళి. ఒక్కొక్క గురుశిష్య సంబంధం మన వంటి పామరులకు సులభగ్రాహ్యం కాదు.

ఈ విధంగా బాలమురళి అణుబాంబు పేల్చినట్టు మొదటి పాటకచ్చేరీ చేసినప్పుడు కుర్తాలం స్వాములవారు విన్నారు. (కుర్తాలం స్వాముల వార్లందరూ తెలుగువారేనట). ఆయన మూలంగా బందరు బుట్టయిపేటలో బాలమురళి రెండో పాటకచ్చేరి జరిగింది. ప్రసిద్ధ విద్వాంసులందరినీ ఆహ్వానించారు. వాగ్గేయకారక హరినాగభూషణం గారు కూడా కచేరికి వచ్చారట.

అయితే, కొద్దిసేపు పాట విని హరి నాగభూషణం గారు లేచి వెళ్ళిపోయి, బాలమురళి అభిమానులకూ, సన్నిహితులకూ ఆందోళన కలిగించారట. కాని కొద్దిసేపట్లో ఆయన తన భార్యనూ, పిల్లలనూ వెంటబెట్టుకుని తిరిగి వచ్చారట!

తరువాత 1942లో త్యాగరాజు ఉత్సవాలకు తిరువాయియూరు వెళుతూ రామకృష్ణయ్య పంతులుగారు బాలమురళిని వెంట తీసుకువెళ్ళారు ఏ కారణం చేతనో ఆయనకు అస్వస్థత కలిగి ఆయన పాడవలసిన సందర్భంలో బాలమురళికి అవకాశం ఇచ్చారట అన్ని వేలమంది ప్రజలలో అందరు విద్వాంసుల మధ్య బాలమురళి పాట అద్భుత సంచలనం కలిగించిందట మర్నాడు ఒక నాయుకోటి చెట్టియారు గారు, సంప్రదాయ విరుద్ధంగా, బాలమురళి కోసం బహుమతులు తెచ్చాడట!

బాలమురళికి విద్యార్థిగా బడిలో చదవటం అసంభవం కావటం చేత, ప్రైవేటుగా ఇంగ్లీషూ, సంస్కృతమూ చెప్పించారు అతనికి ముగ్గురు ఆడపిల్లలూ, ముగ్గురు మగపిల్లలూనూ. అతని సమగ్ర జీవితకథ తయారవుతున్నట్టు తెలుస్తున్నది అందులో కొన్ని అపూర్వ సన్నివేశాలుంటాయనుకుంటున్నాను. ఎందుకంటే బాలమురళి అనేకవిధాల అపూర్వవ్యక్తి

**గాయకుడు, వాగ్గేయకారుడు, నటుడు**

అన్నివిధాలా ప్రతిభావంతుడైన వ్యక్తిని పూర్ణ పురుషుడు అంటారు ఆ మాటకు అందరూ తగరు ఏదో ఒకటి రెండు అంశాలలో పరాకాష్ట అందుకున్నంత మాత్రాన పూర్ణ పురుషుడు కాజాలడు.

ఆ పరిభాషలో బాలమురళిని ''పూర్ణ గాయకుడు'' అనవచ్చు. ఆమాట అతనికి పూర్తిగా అతుకుతుంది

సాధారణంగా గానం వృత్తిగా పెట్టుకున్న వాళ్ళు కొంత దాకా అభివృద్ధిలోకి వచ్చి, ఇంక పైకి పోవటం అసాధ్యమనో, ప్రయాస అనో అనుకున్న నాడు విశ్రాంతిలో పడతారు - మూలధనం మీది వడ్డీతో బతికేవాళ్ళ లాగ. అలాటి గాయకులు తాము సాధించుకున్న శక్తియుక్తులతోనే జీవితశేషమంతా తమ వృత్తిని కొనసాగిస్తారు పెరగని శక్తులు తరగటం జరగవచ్చునని చాలామందికి తెలిసినట్టు కనబడదు.

బాలమురళీకృష్ణలో ఆ 'విశ్రాంతి' ధోరణి ఏ మాత్రమూ కనిపించదు. అవకాశం దొరికినప్పుడల్లా అతని పాట వినే నాబోటివాడికి, అతను రోజు రోజుకు కాకపోతే, నెల నెలా పెరుగుతున్నట్టు అనిపిస్తుంది. ఏ పదేళ్ళ క్రితమో అతను ఎలాటి స్థాయిలో వున్నాడో, అదే స్థాయిలో అతను నిలిచిపోయినా శ్రోతలు నిరాక్షేపణగా అతనికి బ్రహ్మరథం పట్టగలరు. అలాటి స్థితిలో అతను వామనమూర్తి లాగా ఇంకా ఇంకా ఎందుకు పెరుగుతున్నాడు?

అది డబ్బు కోసం కావటానికి వీలు లేదు పెరగకపోయినా డబ్బు రానేవస్తుంది. అదీగాక, ఒకసారి నాతో అతను, ''ఈ పాటకచేరీలు కాక జరుగుబాటు కావటానికి ఇంకా ఏ మార్గం వున్నా బాగుండును! సంగీతం అమ్ముకోవటం బాధగా వుంది!'' అన్నాడు.

పెరగటం తన అంతస్స్వభావం గనక పెరుగుతున్న గాయకులు ఎంతమంది వుంటారు? సంగీతం అమ్ముకోవటం బాధగా వుందని ఏ గాయకుడు అంటాడు? ఈ లక్షణాలు గలవాళ్ళు ఇంకా వుంటే వాళ్ళు విలక్షణమైన గాయకులే!

గాయకుడుగా అతనికి అద్భుతమైన శారీరం వున్నది అది మంద్ర గాంధారం నుంచి తారషడ్జమం దాకా పలకటం నేను ఉజస్లసార్లు విన్నాను అతని శారీరం అతిరథుడి లాంటిది. ఎలాంటి క్లిష్టస్థితిలోనూ క్రమశిక్షణ పొరపాటున కూడా కోల్పోదు రాగమూ, స్వరమూ, లయా అతనికి బానిసలలా వుంటాయి వాటిపైన అతను చూపే అధికారం అనన్యమనిపిస్తుంది అతని సంగీతం అగాధమనిపిస్తుంది చాలామంది తమ యావచ్ఛక్తినీ ప్రదర్శించినట్టూ, అంతకుపైన పోలేరన్నట్టూ ఎప్పుడన్నా అనిపించవచ్చు బాలమురళి విషయంలో అలా ఏనాడూ అనిపించలేదు నాకు (నా రసికత యొక్క పరిమితికి కొంత వదిలెయ్యండి). అంటే నాకు అతని 'అడుగు' ఇంతవరకు తగిలినట్టు భావన కలగలేదు.

అతను 7 2 మేళకర్తల మీదా కీర్తనలు రాశాడనీ, ఇంకా అనేక కీర్తనలూ, పదాలూ, గీతాలూ, వర్ణాలూ, తిల్లానాలూ రాశాడనీ అందరికీ తెలిసినదే. ఇతని వాగ్గేయకారత్వంలో నాకు కలిగిన భావమేమంటే, అనేక రాగాలమీద ఇతని రచనలు అవే రాగాల మీద పూర్వం వున్న రచనల కన్న మంచి కాంపోజిషనులని, మోహన, చారుకేసి, షణ్ముఖప్రియ మొదలైన రాగాలతో ఇతని గేయాలు నాకు సర్వోత్తమమైనవిగా తోస్తాయి పండితులు నాతో ఎంతవరకు ఏకీభవిస్తారో మరి.

తిల్లానాలు కూడా చాలామంది రాశారు బాలమురళి తిల్లానాలు విని, మిగిలినవాళ్ళని విని ఆనందించటం దాదాపూ అసంభవమనిపిస్తుంది. ఈ విషయం నేను కాస్త గట్టిగానే చెప్పగలను.

ఎందుకో నాకు చాలా కాలంగా బాలమురళి సంగీతంలో త్యాగరాజు హృదయం వున్నట్టు అనిపిస్తూ వచ్చింది ఇటీవల బాలమురళి సన్మానసభలో ప్రసంగిస్తూ సంధ్యావందనం శ్రీనివాసరావుగారు అతన్ని ''ఛోటా త్యాగరాజు'' అన్నప్పుడు, నేను బొత్తిగా తప్పుదారిన పడలేదేమోననుకున్నాను.

ఈ సందర్భంలో గాయకుడూ, వాగ్గేయకారుడూ అన్నమాటల వెంట 'నటుడు' అన్న మాట కూడా ఎందుకు చేర్చానో చెప్పాలి అతను స్టేజి మీద త్యాగయ్య వేషమూ, 'ప్రహ్లాద' చిత్రంలో నారదుడి వేషమూ, రేడియో గేయనాటికలలో వివిధ పాత్రలూ ధరించి, జయప్రదంగా నిర్వహించాడని కాదు, అతని సంగీతంలో నటన - అభినయం - వున్నది. ఏ కళ అయినా భావస్ఫోరకంగా వుండాలంటే దాని వెంట ఇతర కళలు అనేకం వుండాలి సంగీతమంటే అచ్చుగా పాడటం కాదు, మాటల ద్వారా భావాలను

షేషేంవాడు తమ యిష్టంతో ఎటువంటి రాగాన్నైనా గొంతులో పలికించగల ఈ
వ్యక్తిలో వాయిద్యానికి పనికివచ్చే విద్వత్తు మెండుగా వున్నట్లనిపిస్తుంది
కొత్త పాటలనే కాదు పాతవాటిలో కూడా అతను తన ప్రత్యేకత
చూపించి అతను స్వరకల్పనలో అతను చూపే త్రాయ - చిన్న చిన్న ముగ్గులు కట్టు-
కున్నట్టు కనబడే మెరుపులు వినిపిస్తాయి అతనివి
''కర్ణాటక సంగీతం తమిళ దేశం నుంచి ఆంధ్రకు వలసపోయింది ఇవాళ,
బాలమురళి, పిట్టిబాబు, ఓలేటి, నేమనూరి, బాలసుబ్రహ్మణ్యశర్మల లాగా కర్ణాటకం
పాడగలవాళ్ళు తమిళులలో లేకుండా పోతున్నారు'' అన్నాడు ఎస్.వై. కృష్ణస్వామి గారు
అయితే, సన్నా పెద్దలు క్షమిస్తే, మన పెద్ద గాయకులందరూ బాలమురళి వద్ద
'గానాభినయం' నేర్చుకోవలసి వున్నది
అది అలా వుంచి, కర్ణాటక సంగీతం ఆంధ్రులను వరించిందేమో గాని,
ఆంధ్రదేశాన్ని ఇంకా వరించినట్టు కనబడదు బాలమురళికి తమిళసోదరులు చేసిన
సన్మానాల్లో ఎన్నో వంతు ఆంధ్రులు చేస్తారో చూడాలి తమిళులు బ్రహ్మరథం
పడుతున్న తెలుగుగాయకులకు తెలుగువాళ్ళు ఎటువంటి సన్మానాలు చేస్తారో
అదికూడా చూడవలసి వున్నది

*(ఈ వ్యాసరచనానంతరం శ్రీ బాలమురళికృష్ణకు 'పద్మశ్రీ' బిరుదిచ్చినట్లు వార్త వెలువడింది)*

వసుధ, ఫిబ్రవరి *1971*

# 6. సంగీత సాహిత్యం

మధ్యతరగతి వాళ్ళు ప్రోత్సహించటం తోనే సాధారణంగా కళలకు వావు గాని బలుపు గాని సిద్ధిస్తుంది. గడచిన పాతికేళ్ళలో పత్రికల సంఖ్యా, సర్క్యులేషనూ, పుస్తకాల సంఖ్యా, అమ్మకాలూ కొన్ని డజన్ల రెట్లు పెరిగాయంటే అది మధ్యతరగతి చలవే. మధ్యతరగతి కూడా పెరిగింది సంగీతం విషయంలో కూడా ఇంచుమించి అలాటి పరిణామమే కనబడుతుంది. యుద్ధకాలంలో కూడా, సుబ్బులక్ష్మి గాని, ద్వారం వారు గాని, రామానుజయ్యంగారు గాని పాటకచేరీలు చేస్తే శ్రోతల సంఖ్య మద్రాసులో వందకు మించేది కాదు సభల సంఖ్య కూడా చాలా స్వల్పంగా వుండేది.

సాహిత్యంలోనూ, సంగీతంలోనూ ఇటీవల కలిగినది వాపు కావచ్చు, బలుపే కావచ్చు కాని దీనివెంట కొన్ని సమస్యలు కూడా వచ్చాయి రాశి పెరిగితే గుణాత్మకమైన మార్పులు వస్తాయి మరి ఈ సమస్యలు సాహిత్యరంగంలో

ఒకటికిం గానూ, సంగీతరంగంలో ఒకటొకటిగా గానూ ప్రస్తుతించారు. సాహిత్యరంగంలో పెద్ద ఉద్యమాలే బయలుదేరాయి. ప్రాముఖ్యమైన సామాజిక శక్తుల ప్రభావం సాహిత్యంపైన పడింది. ప్రగతివాదమూ విప్లవవాదమూ పెద్ద సాహిత్యం వచ్చినా, పేదల్ని విస్మృత్తికేన నాటకం చెప్తున్నది అది సామాజిక శక్తులను ప్రతిస్పందించంగా తయారుచేసే చక్కని సీదాగా తీర్చిదిద్దే వానికి పోరాటం సాగించే ఎత్తుకు పెరిగింది.

అలాటి పరిణామాలు సంగీతంలో రాలేదు కాకపోతే, సాహిత్యంలో లాగే సంగీతంలో కూడా విభజన వున్నది. సాహిత్యంలో ఊసుపోక సాహిత్యమూ, 'ఎల్లమందు' సాహిత్యమూ, సెక్సు సాహిత్యమూ, భక్తి ప్రాజ సాహిత్యమూ, అభ్యుదయ సాహిత్యమూ, విప్లవ సాహిత్యమూ వగైరా శ్రేణులున్నట్టే, సంగీతంలో కూడా జానపద సంగీతమూ, భజన సంగీతమూ, సినిమా సంగీతమూ, సంప్రదాయ సంగీతమూ లాంటి శ్రేణులున్నాయి స్టేజి సంగీతానికి తోక కాస్త పెరిగిందేమో గాని, ఏ సంగీత శ్రేణిలోనూ చెప్పుకోదగిన పెరుగుదల అంతగా కనిపించదు కాకపోతే, మిగిలిన సంగీత శ్రేణులలో లాగా కాక, సంప్రదాయ సంగీతంలో కొన్ని సమస్యలు బయలుదేరాయి అందులో ఒకటి సంగీత సాహిత్య సమస్య – సంగీతకృతుల సమస్య.

ఇది జాత్యభిమానంతో ఒకప్పుడు ప్రారంభమయింది. సంగీత విద్వాంసులు తెలుగుకృతులు ఎందుకు పాడాలి? సంస్కృతకృతులు ఎందుకు పాడాలి? కర్నాటక గాయకులు కేవలమూ తమిళ కృతులే పాడాలి అని ఒక ఉద్యమం బయలుదేరింది.

ఈ ఉద్యమం ప్రారంభించినవారి తమిళ భాషాభిమానం మెచ్చుకోదగ్గదే కాని ఈ ఉద్యమంలో సార్థక్యం లోపించింది ఎందుచేతనంటే అచ్చగా తమిళకృతులే పాడిన మాత్రాన సంగీతానికి కలిగే మేలు అణుమాత్రమైనా వుండదు తమిళ కృతులైతే తమిళ శ్రోతలకు వాటి భావం మరింత బాగా తెలిసి స్వారస్యం కలుగుతుంది గదా అనవచ్చు అందుకు డెబిట్– మిగిలిన భాషల వారికి అర్థం కాకుండా పోతాయి. కర్నాటక సంగీతం దాక్షిణాత్యులందరిదీ కదా!

నిజానికి కృతులు అర్థం కావటం అనేది కర్నాటక సంగీతానికి ఒక సమస్యే కాదు. భాషనూ, భావాన్నీ విసర్జించటం వల్లనే కర్నాటక సంగీతం పెరిగి, విస్తరించింది. (నాకు తెలిసినంత వరకు హిందూస్థానీ సంగీతం కూడా ఇంతే). తమిళ సంగీత విద్వాంసులు త్యాగరాజు గారి రచనలను అర్థం చేసుకోవలసిన అవసరం లేకుండానే గొప్ప సంగీతం పాడారు, కొందరు పాడుతూంటే తెలుగు తెలిసిన వాళ్ళకు భాష ఖూనీ అయిపోతున్నదనిపించినా, పాట విని ఆనందించటానికి అడ్డు రాలేదు ఈ విధంగా కర్నాటకసంగీతం భాష నుంచి విముక్తి పొంది అభివృద్ధి చెందింది – కనీసం తన వ్యక్తిత్వాన్ని నిరూపించుకున్నది

కర్ణాటక సంగీతానికి తెలుగు భాష తప్ప పనికిరాదు అన్న మూఢవిశ్వాసం కూడా ఏనాడో బద్దలయింది. ఈ మూఢ విశ్వాసానికి ఆధారం త్యాగయ్యగారి అసంఖ్యాకమైన తెలుగుకృతులూ, క్షేత్రయ్య, అన్నమాచార్యులూ లాంటి వాగ్గేయకారుల పదాలూ అయి వుండవచ్చు. కాని స్వాతి తిరునాళ్‌గారు సవ్యసాచి లాగా అటు ఉత్తరాదివాళ్లూ, ఇటు దక్షిణాత్యులూ కూడా పాడుకునేటందుకు అనేక భాషల్లో కృతులు రాసారు. పాపనాశం శివన్‌గారి లాటివాళ్ళు తమిళంలో ఎక్కువ కృతులు రాసారు.

ఇలా భాష నుంచి విముక్తి పొందటానికి కృషిచేసిన దాక్షిణాత్య సంప్రదాయ సంగీతం తిరిగి భాషలో కూరుకుపోవటానికి చేసిన ప్రయత్నం- తమిళ కృతుల ఉద్యమం - దెబ్బతిన్నది.

హిందూస్థానీ సంగీతం లాగా కర్ణాటక సంగీతం రాజుల దర్బార్లలో పెరగలేదు; దేవాలయాల ప్రాపకంలో పెరిగింది. అది ప్రధానంగా భక్తి సంగీతం. కాని కర్ణాటక సంగీతం కచేరీలు విని భక్తి పారవశ్యంతో ఇంటికి వెళ్ళేవాడు ఒక్కడైనా వుండడు. భక్తి మాత్రమే పాటకుడి లక్ష్యమైతే, విద్వాంసులు బాలమురళీకృష్ణ అడిగినట్టు, పాటకచేరీలు చెయ్యటం ఎందుకు? ఏ మూలనో కూర్చుని దేవుణ్ణి తలుచుకుంటూ పాడుకోవచ్చునే! సాహిత్యభావం వేరు, సంగీతభావం వేరు. ఈ రెంటికీ విడాకులు ముట్టకపోతే సంగీతం ముందుకువచ్చేది కాదు. ఖాన్‌సాహెబ్‌గార్లు ''భజరే హరనామ్'' అనీ, ''జమునా కే తీర్'' అనీ ఎందుకు పాడటం జరుగుతుంది?

ప్రతి సంప్రదాయం వెంటా ఏవో మూఢవిశ్వాసాలు చేరుతాయి, నదుల వెంట ఒండ్రు చేరినట్టు. హిందూస్థానీ వాళ్ళు వేళను బట్టి రాగాలు పాడతారు. ఉదయం పాడే రాగాలు కొన్ని, సాయంకాలం పాడే రాగాలు కొన్ని, రాత్రి పాడే రాగాలు కొన్ని. ఇలాటి నియమం రాగభావానికి సంకెల. దీన్ని కూడా కర్ణాటక సంగీతం విసర్జించింది. ఏ రాగం ఎప్పుడన్నా పాడవచ్చు. 'మేఘ్' పాడి వానలు కురిపించటమూ, ఇంకేదో పాడి రాళ్ళను కరిగించటమూ లాటి కట్టుకథలు కర్ణాటక సంప్రదాయం వెంట వున్నట్టు కనబడదు.

ఇంత స్వేచ్ఛగల కర్ణాటక సంగీతం పురోగమించటానికి అడ్డు ఏమిటి? కర్ణాటక సంగీత విద్వాంసులు 'పాచిపళ్ళ దాసర్ల' లాగా పాడిందే పాడటం అని కొందరి అభిప్రాయం. ఇందులో నిజం లేకపోలేదు. కదలటం మానేస్తే గంగకూడా గంజికుంట అవుతుంది. కర్ణాటక గాన కచేరీలలో కదలిక లోపించటం వల్ల, లోగడ అనేకవేల సార్లు చెవినపడిన సంగతులు చెవిన పడితేనే శ్రోతలు తలలూపే స్థితికి వచ్చారు. కొత్తపాటలు చెవిన పడితే వాళ్ళు అయోమయంలో పడిపోయేవారు. ఒకసారి రసికరంజనీ సభలో బాలమురళి రాగాలాపన చేస్తూంటే తన్మయత్వంతో తల ఊపిన పెద్దమనిషి, బాలమురళీ సొంత కృతి ప్రారంభించగానే మొహం వికారంగా పెట్టేనాతో,

''ఇది యెన్న?'' అన్నాడు పాపం, ఆ పెద్దమనిషి పాటకచేరీ కాస్తా భ్రష్టు అయిపోయింది!

దీనికి ఏ మాత్రమూ సమర్థన లేదు. నాకు శేషన్ గారి కృతులు కొన్ని చాలా ఇంపుగా వుంటాయి. మొదటిసారి విన్నప్పుడు కూడా అర్థం తెలియకుండానే నేను ఎన్నో ఇతర భాషల పాటలు వింటాను. ముఖ్యంగా హిందూస్తానీ వాళ్ళు పాడుతుంటే మాటలే తెలీవు. కాని అంతమాత్రాన సంగీతంలో స్వారస్యం చెడుతుందా? రాగాలాపనా, తానమూ, పల్లవీ- వీటిలో సాహిత్య ప్రసక్తి ఏముందీ? ఒకసారి రేడియోలో ఒక హిందూస్తానీ గాయకుడు 'కుతుబుద్దీన్, కుతుబాలం' అనే మాటలు ఆధారం చేసుకుని గుజరీతోడి అరగంటసేపు అద్భుతంగా పాడాడు

సాహిత్యభావాన్ని సంగీతం ద్వారా వ్యక్తం చెయ్యరాదని నేను చెప్పటం లేదు అలా అయ్యేట్టుంటే నేను బాలమురళీకృష్ణ సంగీతానికి దాసోహం అయిపోను. కాని ఆ ప్రక్రియ సంగీతభావాన్ని మరింత రక్తికట్టించేదిగా వుండాలి- రాఘవాచారి గారు పద్యం చదివినట్టుగా వుండరాదు ఈ సందర్భంలో నా అంచనా ఏమిటంటే, సాహిత్యభావం గాయకుణ్ణి ప్రేరేపిస్తుంది. గాయకుడి గానం శ్రోతలను ఉత్తేజపరుస్తుంది. అందుచేత సాహిత్యం తెలియని శ్రోతలు కూడా బాలమురళి సంగీత భావ ప్రకటనను ఆస్వాదించగలుగుతారు. ''ఎంత ముద్దూ, ఎంత సొగసూ'' అన్న పాటను ఇతరులు పాడగా విన్నవారు తెలుగు ఏమీ రాకపోయినా బాలమురళి పాడితే వినగానే అందులో ఎక్కువ రసస్ఫూర్తి పొందుతారు

ఇటీవల ఒక కొత్తసమస్య వచ్చింది గాయకులు పాతపాటలే పాడాలా? కొత్తవి పాడవచ్చునా? ఇది చొప్పదంటు ప్రశ్న గాయకులు కొత్తపాటలు పాడుతూనే వస్తున్నారు ప్రతిభావంతులైన వాగ్గేయకారులు కొత్త కృతులు చెయ్యకుండా మానరు. ప్రతిభ గల గాయకులు వాటిని పాడకుండా మానరు గొప్ప గాయకులుగా పేరుపొందిన వాళ్ళు కొందరు కృతులు రాయటం చేతగాని వారైతే, అంతమాత్రాన కొత్త కృతులు పాడరాదని ఎక్కడా లేదు ఆమధ్య వివాది మేళకర్తలను బహిష్కరించాలని ఒక ఆందోళన లేవదీస్తే, ''పాడటం చేతగాని వాళ్ళు బహిష్కరిస్తూనే వున్నారు'' అని ఎవరో హాస్యం కూడా చేశారు.

''కొత్తకృతులు పాడవచ్చు గాని, వాటిలో సంగీతబలంతో పాటు సాహిత్యబలం కూడా వుండలి. సహస్ర నామాల నుంచి కొన్ని తీసుకుని 'స్మరామి' అని తగిలించగానే అది గొప్పకృతి అవుతుందా?'' అని కొందరు అడుగుతున్నారు. ''వెర్రి కుదిరింది. రోకలి తలకు చుట్టు'' అన్నట్టుంది ఈ అభిప్రాయం సంగీతపరంగా గొప్పకృతులు అనిపించుకున్నవి అలాటివి చాలా వున్నాయి. కృతులను ఇప్పుడు సాహిత్యచర్చకు పెట్టబోతారా?

సాహిత్యాన్నీ, సంగీతాన్నీ, పృథులంగా బంధించిన విధానంలో గొప్పగా చెప్పుకోదగినది తెలుగు 'అధ్యాత్మ రామాయణాలు' గేయకావ్యం. ఆ పాటలు పారాయణంలో ఎంతటి పేరుపొందాయో

సంగీత త్రయ వార్షికోత్సవ సంచిక, 1975

# 7. దివి నుంచి భువికి దిగిరావలసిన కర్నాటక సంగీతం

కర్నాటక సంగీతం గురించి విజ్ఞులు ఆందోళన పడుతున్నట్టు కనిపిస్తుంది. ఈ ఆందోళన ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ తెలుస్తున్నది. రామానుజయ్యంగారి తరువాత కర్నాటకసంగీతం క్షీణించినట్టు మృదంగవిద్వాంసుడు పాలక్కాడు మణి అయ్యర్ గారే స్వయంగా ఉద్ఘాటించారు. మద్రాసులో వున్న సభలలో పాటకచేరీల మోతాదు నానాటికీ స్పష్టంగా క్షీణిస్తున్నది. ఈ యేడు మద్రాసు సంగీత అకాడమీకి అధ్యక్షత వహించిన డాక్టర్ మంగళంపల్లి బాలమురళీ కృష్ణ, కర్నాటక సంగీతం వృద్ధికి రావాలంటే మార్పులూ, కొత్తదనమూ అవసరమన్నారు. ఇలాటి అభిప్రాయాలు ప్రకటించే వారు సంగీతరంగంలో సుప్రసిద్ధులు.

పోతే, శ్రోతలు ఏమనుకుంటున్నదీ స్పష్టంగా తెలీదు. సంగీత శ్రోతలు చాలా వరకు మూగివాళ్ళలాగా కనిపిస్తారు. అయినా, రోగం అంటూ కర్నాటక సంగీతానికి వుంటే, దాని నిదానం సంగీతవిద్వాంసులే చెయ్యాలి. నా బోటి సంగీతపామరులు వ్యక్తిగతమైన అభిప్రాయాలనే బయటపెట్టగలరు. ఈ ప్రయత్నం ఆ పాటిదే.

కర్నాటక సంప్రదాయం అనే దానిలో రెండు విభాగాలున్నాయి. ఒకటి శాస్త్రవిభాగం, రెండోది సంప్రదాయం.

మొదటిది చాలా విస్తృతమైనది. బాలమురళీ గారు ఏదో సందర్భంలో అన్నట్టు, ప్రపంచంలో వున్న అన్ని సంగీతాలూ అందులో ఇముడుతాయి. అది అన్ని భాషలకు పనికివచ్చే వ్యాకరణం లాంటిది. ఇందులో సంస్కరణ అంటూ జరగడానికి ఈషణ్మాత్రం కూడా అవకాశం లేదని ఒప్పేసుకోవచ్చు.

అయితే, ''పాండిత్యం వచ్చింది, కవిత్వం పోయింది'' అని ఎవరో వెనకటికి ఆవేదన పడుతూ, ఆ ఆవేదనలోనే శ్లోకం చెప్పగలిగాడట. ఆ విధంగా అతి సమర్థమైన కర్ణాటక సంగీత 'వ్యాకరణం' గాన సంప్రదాయాన్ని దెబ్బతీస్తున్నదా? అని సంగీత పండితులు ఆలోచించాలి (పాణిని తన వ్యాకరణంతో సంస్కృతభాషను ఖూనీ చేసాడన్న అభిప్రాయం పండితలోకంలో వున్నది, మరి).

రః యేడు సంగీత సదస్సుకు అధ్యక్షత వహించిన డాక్టర్ బాలమురళి కర్ణాటక సంగీతంలో 'మార్పు', 'కొత్తదనము' రావాలన్నది సంగీత 'వ్యాకరణం'లో కాపడానికి వీల్లేదు. [illegible] గానసంప్రదాయంలోనే నవ్యత, మార్పులూ రావాలన్నమాట.

## కొన్ని కారణాలు

ఇది అక్షరాలా నిజం అని తోస్తుంది. నాకు తోచిన కొన్ని కారణాలు చెబుతాను.

1. కర్ణాటక సంగీత విద్వాంసులు సంగీత లక్ష్యాల నుంచి మతదృష్టిని మళ్ళించడం లేదు. త్యాగరాజ 'సద్గురు'వు. సంగీతం 'మోక్షం' ఇస్తుంది. గాయకులు పాడేవన్నీ దేవుళ్ళమీద సం'కీర్తన'లే. దేవుడికి అంకితమైన 'కృతులు'

   ఉన్న పాటలను వదులుకోనవసరం లేదు. కాని, వాటి నుంచి 'మత' దృష్టిని పూర్తిగా వేరుచెయ్యాలి. పాటకచేరిని భజన పార్టీగా శ్రోతలు ఎన్నడూ పరిగణించరు. అలాంటప్పుడు, సంగీతం గురించి మాట్లాడినప్పుడల్లా కర్ణాటక విద్వాంసులు మత వైఖరి ప్రదర్శించవలసిన అవసరం ఏమున్నది?

   కాదు, కూడదు సంగీతానికి మతదృష్టే ప్రాణం అనేటట్టుంటే హిందువులు కానివాళ్ళు కర్ణాటక సంగీతాన్ని బహిష్కరించవచ్చునని ఒప్పుకోవలసి వస్తుంది. కర్ణాటక సంగీతాన్ని పాశ్చాత్యులు కూడా నేర్చుకుంటున్నారని చంకలు గుద్దుకోవడం వాళ్ళు హిందువులైపోతున్నారని సంతోషించటమైతే అంతకన్నా అపోహ వుండదు. ''రామ, నీ సమానమెవరు?'' పాడిన అబ్దుల్ కరీమ్ ఖాన్ గాని, జాన్ హిగెన్స్ గాని హిందూ మతం పుచ్చుకోలేదు.

## సెక్యులర్ సంగీతం

2. ఈ విషయంలో కర్ణాటక గానసంప్రదాయం హిందూస్థానీ సంప్రదాయం నుంచి నేర్చుకోవలసింది వున్నట్టు స్పష్టమవుతుంది. హిందూస్థానీ సంగీతంలో కూడా అనేక పాటలలో హిందూసంస్కృతీ సంప్రదాయం వుంది. కాని, వాటిలో హిందూమతం లేదు. బడే గులామలీఖాన్ లాంటి పాటగాళ్ళు కృష్ణుడి మీద పాటలు పాడటమే గాక, రాసారు కూడా. ఖాన్‌సాహెబ్ గారు మద్రాసులో ఒక కచేరీలో మాట్లాడుతూ, ''నాకు రాజకీయాలు తెలీవు. నేను హిందువుణ్ణి!'' అన్నారు. ఆయన ఉద్దేశం హిందూ సంస్కారం గల వాణ్ణి అనే తప్ప, హిందూ మతం పుచ్చుకున్న వాణ్ణి అని కాదు.

   హిందూస్థానీ సంగీతసంప్రదాయం నిత్యనూతనంగా వుండటానికి కారణం వాళ్ళు మతం 'మడి'కి కట్టుబడక అన్నిరకాల గానరీతులకు పెద్దపీట వేసారు. బరకతలీఖాన్, బేగమ్ అఖ్తార్ లాటివాళ్ళు ఠుమ్రీ గాయకులుగా గొప్ప గాయకులనిపించుకున్నారు. మెహిదీ హసన్ ఘజల్ గాయకుడుగా ప్రపంచఖ్యాతి సంపాదించుకుంటున్నాడు. మన కర్ణాటక విద్వాంసులు అచ్చగా పదాలు గాని,

జావళీలు గాని పాడి గొప్ప గాయకుల శ్రేణిలోకి రాగలరా? అటువంటి సృష్టి వైశాల్యం ప్రస్తుతం బాలమురళీ ఒక్కరే కనిపిస్తున్నారు (ఆయన సంగీత ప్రస్థానం [illegible] ఈ మాసం [illegible])

**పాండిత్య ప్రకర్ష**

3. కర్ణాటక సంగీత విద్వాంసులకు ప్రేక్షకులతో తాదాత్మ్యం లేదు ఎక్కడైనా ఒక చెంబైని మినహాయిస్తే, దాదాపు అందరూ చాలా 'ఎలీటిస్ట్'గా తమ గానాన్ని విని ఆనందించే బాధ్యత శ్రోతలదేనన్నట్లుగా పాడతారు. తాము పాడే పాటల రాగాలు చెప్పరు శ్రోతల్లో రాగాల పేర్లు అవీ తెలీని వాళ్ళుంటే వాళ్ళ కర్మ! పాటకచేరీ వాళ్ళ కోసం కాదు. ఎవరి కోసం? 'రసికులు' అంటే గాన నైపుణ్యం పూర్తిగా అవగాహన చేసుకోగల వాళ్ళే అయితే వాళ్ళ సంఖ్య తగ్గకుండా వుండటానికి ఏం కృషి జరుగుతున్నట్టు? గురువుల దగ్గిర నేర్చుకుని కొత్త గాయకులు తయారవుతున్నారు. మరి కొత్త 'రసికులు' ఎవరి ద్వారా తయారయేటట్టు?

కర్ణాటక సంగీతం క్షీణిస్తున్నదంటే అందులో ఆశ్చర్యం ఏమున్నది?

4. 'కమ్యూనికేషన్' తక్కువైతే 'కసరత్తులు' జాస్తి అవుతాయన్నది సాహిత్యంలో ఎంత నిజమో, సంగీతంలోనూ అంత నిజం ప్రబంధయుగపు కవులు రాజుల్ని రంజింపజేసి సన్మానాలూ, సంభావనయూ పొందటం తప్ప పాఠకులకు చెప్పేది ఏమీ లేక మాటల గారడీలతో చిత్రబంధ కవిత్వాలూ, ద్వ్యర్థి త్ర్యర్థి రచనలూ, శ్లేషలూ పెట్టి సారస్వత గారడీలు చేసారు. పాఠకులను సాహిత్య విముఖుల్ని చేయటానికి ఇంతకన్న మంచి పద్ధతి వుండదు. అలా విముఖులైన వారిని శతక కవులూ, పోతనలాటి పురాణకవులూ మళ్ళించవలసి వచ్చింది

**సంగీత పరమావధి**

మంచి పాటకచేరీ, సంగీతమంటే ఏమీ తెలీనివాణ్ణి కూడా సంగీత ప్రియుణ్ణిగా మార్చెయ్యాలి. శ్రోత సంగీతం విన్నప్పుడల్లా అందులో నానిపోయినట్టు అనుభూతి పొందాలి. సంగీతం నీతులు బోధించదు రాజకీయ సిద్ధాంతాలు ప్రచారం చెయ్యదు విప్లవాలు తెచ్చిపెట్టదు. ఏ ప్రచారమూ చెయ్యదు. శ్రోతలను దోచుకోనైనా దోచుకోదు. అది విన్నప్పుడల్లా ఒక అపూర్వమైన అనుభూతి కాకపోతే దాని ప్రయోజనం ఏమిటనుకోవాలి ?

5 కర్ణాటక సంగీతం లోకి 'కొత్తదనం' బొత్తిగా రాదని చెప్పటానికి లేదు కొంతకాలం క్రితం తెలుగుపాటలు పాడరాదని, తమిళంలోనే కృతులు పాడాలని ఒక ఉద్యమం వచ్చింది. తెలుగులో వున్నపాటలకే తమిళ సాహిత్యం తగిలించి పాడారు. దీని వెనక 'భాషా దురభిమానం' వుంటే వుండవచ్చు. కాని దీన్ని పెద్ద

ఉద్యమం అనటానికి లేదు ఎందుకంటే, కర్ణాటక సంగీతానికి అన్ని స్తంభాలలాగా వుండిన తమిళ విద్వాంసులు తెలుగుపాటలు అర్థం కాక, తెలుగు మాటలు నోటబట్టక, మనోభావపరిహితంగా పాడటం ఆనవాయితీగా వుంటూ వచ్చింది అయితే, చిక్కేమిటంటే కృతుల భాష మారినా పాడే పద్ధతి కృతకంగానే వుండిపోయింది ఇన్ని పాటలను భాషాంతరీకరించడం సరికాదు తమిళంలో పాటలు రాసుకుని పాడాలి. అప్పుడు మనోధర్మానికి మంచి ఆస్కారం వుంటుంది.

''ఇదెన్నా?''

శ్రమపడి తమిళంలో కూడా పాటలు రాసి పాడిన వాడు డాక్టరు బాలమురళీ. కాని, తమిళులు హర్షించారా? బాలమురళీ రాగాలాపన చేస్తున్నంతసేపూ తల ఆడించిన ఒకపెద్దమనిషి, ఆయన సొంతకృతి ఆరంభించగానే ''ఇదెన్నా?'' అని చాలా ఖేదించాడు

కర్నాటక సంగీతాన్ని విద్వాంసులే ఖూనీ చేస్తున్నారనుకోనవసరం లేదు ''రసిగోర్‌హళ్'' కూడా ఖూనీ చేస్తూనే వున్నారు. ఒక పాటకచేరీ 'విరామం'లో బాలమురళీ ఎవరో కుర్రాళ్ళతో 'విన్నదే విన్నదే ఎంతకాలం వింటారు? నన్ను కొత్తవి పాడవద్దంటే పాడటమే మానేస్తాను'' అంటూ వుండటం నేను విన్నాను

బాలమురళిగారికి తెలీదేమో, కర్నాటక సంగీత రసికత్వం 'కొత్త' రాగాలను సహించదు. అవి రెండువందల ఏళ్ళుగా వున్నవైనా సరే! కొత్త సంగతులూ, కొత్త రచనలూ వినపడరాదు. రాగభావాలలో ఎవరూ ఊహించని రీతులు ప్రదర్శించే విద్వాంసులు ఎప్పుడూ బహుకొద్దిమందే వుంటారు వారికి ప్రత్యేక గౌరవమూ, గుర్తింపూ వుండాలి. అది కర్ణాటకగాన సంప్రదాయంలో దాదాపు మృగ్యంగా కనబడుతుంది.

### కళల పారస్పర్యం

6 ఆధునిక కళలు ఆ ప్రత్యేక కళాశిల్పానికే పరిమితమై వుండిపోవు. కృష్ణశాస్త్రి గారి కవిత్వంలో సంగీతఛాయలుంటాయి. శ్రీశ్రీ కవిత్వం భేరీలాగా చిత్రలేఖనంలో కవిత్వ లక్షణాలుండవచ్చు. సంగీతంలో అనేక కళలను ప్రతిబింబించవచ్చునని బాలమురళీకృష్ణ ప్రతికచేరీలోనూ ఋజువుచేస్తూనే వున్నారు. నటుడికి అవసరమైన అభినయాలలో వాచికాభినయమూ, చిత్రకారుడు పాటించే 'పాటర్న్', 'బాలెన్స్' వగైరాలూ, కవికి మాత్రమే ప్రత్యేకంగా కనిపించే భావకల్పన బాలమురళీగానంలో పుష్కలంగా కనిపిస్తాయి ఎంతసేపూ ఆయన జనకరాగాలన్నిటిలోను కృతులు రాసినందుకు మెచ్చుకుంటారే గాని, ఒక రాయరాగమాలికలో ఎంత అరుదైన స్వరకల్పన, లయ విన్యాసమూ వున్నదో, అచ్చుగా స్వరాక్షరాలతో గేయం రాయడం ఎంత అపూర్వమో 'గూడు చినబోయెరా' అన్న జానపద గీతాన్ని పాడీ, 'సీతాకళ్యాణవైభోగమే' అన్న త్యాగరాజు గారి రచన పాడీ ప్రేక్షకులను తన్మయులను చెయ్యగలగడం కూడా అంత అపూర్వమే కొత్త రాగాలు కనిపెట్టడం కూడా విశేషం

కాదు అవి ప్రచారంలోకి వస్తేనే చెప్పుకోవాలి. ఏ రాగమైనా, చివరికి మోహనం కూడా ప్రసిద్ధికి రావాలంటే అందులో గొప్ప రచనలు రావాలి. ఇటీవల బాలమురళిగారు సృష్టించిన 'పంచముఖి' అన్న రాగమైనా అంతే. అందులో కృతులు రావాలి.

''బాలమురళీకృష్ణకు తగిన గుర్తింపు వచ్చింది గదా ఇంకేమిటి?'' అనవచ్చు. సంగీత సంప్రదాయం గురించి చెప్పుకొనేటప్పుడు ఒక ప్రత్యేక వ్యక్తికి గుర్తింపు వచ్చిందా, రాలేదా అన్నది ప్రశ్న కాదు. త్యాగరాజుగారికి, శ్యామశాస్త్రి గారికి, తదితర వాగ్గేయకారులకు గుర్తింపు వచ్చింది. వారు కర్ణాటక సంగీతం భవిష్యత్తు నిర్ణయించగలరా? బాలమురళీకృష్ణ గారికి గుర్తింపు వచ్చింది. సమగ్రమైన ఆయన గాన రీతులకు ప్రచారం జరుగుతున్నదా? అవి కర్ణాటక బాణీల సంప్రదాయంలోకి చొచ్చుకుపోయాయా? ''బాలమురళి తరువాత చెప్పుకుందామంటే ఎవరూ కనిపించరేం?'' అని ఇటీవల నాతో అన్న మిత్రుడు బాలమురళీగారి గురించి ఆలోచించటం లేదు. కర్నాటకసంగీతం గురించి ఆలోచిస్తున్నాడు!

*ఆంధ్రజ్యోతి దినపత్రిక, 8-2-79*

# 8. ప్రజాగాయకుడు ఘంటసాల

కిందటి ప్రపంచయుద్ధ కాలంలో ప్రజాకళలు అన్న నినాదం బయలుదేరింది. దాన్ని పురస్కరించుకొని బుర్రకథలూ, వీధి భాగవతాలూ, కొన్ని నాటకాలూ వచ్చాయి. అవి ప్రజలను లక్షల సంఖ్యలో ఆకర్షించినమాట నిజమే. కాని దేశం స్వతంత్రమైనాక ఆ కళారూపాలు వెనక పడడం జరిగింది. కారణం, ప్రజలలో రాజకీయ చైతన్యం చాలా తగ్గిపోయింది. స్వాతంత్ర్యమూ, దానితోబాటు దేశమంతటా ఏర్పడిన కాంగ్రెసు ప్రభుత్వాలూ, వాటి మీద ఇతర పార్టీల పోటీ, ఎన్నికలూ, వాటి వల్ల కలిగిన ఉద్వేగమూ ప్రజలదృష్టిని బలంగా ఆకర్షించాయి. బెంగాలు కరువు బుర్రకథ, హిట్లరు భాగవతాలూ, క్రిప్స్ రాయబారం భాగవతమూ మరోయుగానికి చెందినవి అయిపోయాయి ముందడుగు , మాభూమి నాటకాలు కూడా కాలదోషంపట్టాయి జమీందారులు పాలకవర్గంలో లీనమయారు. నిజాం రాజ్యం యావద్భారతంలో అంతర్భాగమయింది.

ఈ స్థితిలో ప్రజలు తమకు కావలసిన కళల కోసం సినిమాల మీద ఆధారపడసాగారు నిజానికి ప్రజాకళలు అన్న మాటలో అభ్యుదయ రాజకీయచైతన్యం ఇమిడి వున్నది. సినిమా కళలలో ఇది లేదు కాని రాజకీయంగా తాటస్థ్యం అవలంబించిన ప్రజాబాహుళ్యం సినిమా కళలను ఆరాధించసాగింది. సినిమా అన్నది రాజకీయాలు లేని కళోద్యమమయింది. రాజకీయ నాయకులకన్నా సినిమా తారలు

జనాన్ని హెచ్చుగా ఆకర్షించారు నటనా, నాట్యమూ, చిత్రకళా, సాహిత్యమూ, వాగ్గేయరచన, గానమూ మొదలైన కళలు ప్రజల దృష్టిలో సినిమాలలోనే మహోన్నత ప్రమాణాలు అందుకున్నాయి

ఈ వివిధ కళలను సినిమాలకు సమకూర్చిన కళాకారులలో కొందరు వెనక్కు తగ్గారు. కొందరికి పోటీ వచ్చింది కాని పాతికేళ్ళుగా ప్లేబాక్ గాయకుడుగా ఘంటసాల స్థానాన్ని కదిలించిన వారెవరూ లేరు.

ఆంధ్ర దేశంలో ప్రజాసంగీతం అన్నది నాటకాలలో ఆరంభమయింది తెలుగు నాటకం పుట్టిన నాటి నుంచీ ప్రతీ నాటక సమాజానికీ కనీసం ఒక ప్రసిద్ధ గాయకుడు వుంటూ వుండేవాడు, ఈ ప్రసిద్ధ గాయకుడు గొప్ప గాయకుడు, సంప్రదాయ సంగీతం తెలిసినవాడూ కానవసరం లేదు ఉదాహరణకు అద్దంకి శ్రీరామమూర్తి, జొన్నవిత్తుల శేషగిరి రావు, తుంగల చలపతిరావు లాటి వాళ్ళు స్టేజి మీద నటిస్తున్న కాలంలోనే, సంగీత జ్ఞానంలో వీరెవరినీ పోలలేని కపిలవాయి రామనాథశాస్త్రి తన సంగీతంతో జనాన్ని వెర్రెత్తించేశాడు. అతని రికార్డులు వినటానికి గ్రామఫోనులు కొన్న వాళ్ళు ఆంధ్రలో కొన్ని వేలమంది వుండివుండాలి

ఇలాటి పరిస్థితే దేశం అన్ని ప్రాంతాలలోను ఏర్పడి వుండాలి మహారాష్ట్రలో బాలగంధర్వ నాటకరంగం మీద ప్రజాసంగీతం సృష్టించి, ప్రతి బండివాడిచేత పాడించాడన్న కీర్తి తెచ్చుకున్నాడు. అతనితో పాటు మరో డజను మంది స్టేజి గాయకులు జనాన్ని ఆకర్షించినా అతని స్థానాన్ని ఆక్రమించలేక పోయారు. మాస్టర్ కృష్ణారావు ఫలంబ్రీకర్, దీనానాథ్ మంగేష్కర్, హీరాబాయి లాంటి మేటి విద్వాంసులు కూడా బాలగంధర్వ స్థానాన్ని చలింపజేయలేకపోయారు. సినిమాలకు ప్లేబాక్ పాటలు పాడి ప్రజాసంగీతాన్ని సృష్టించే అవకాశం దీనానాథ్ కుమార్తెలు లతా, ఆశాలకు దక్కింది.

సినిమా గాయకుడుగా ఘంటసాలకూ, స్టేజి గాయకుడుగా బాలగంధర్వకు కొన్ని పోలికలు కనబడతాయి. ఇద్దరూ సంగీత విద్వాన్ పట్టా పుచ్చుకున్న వారే. ఇద్దరి శారీరాలు శ్రావ్యమైనవి ఇద్దరికీ రాగ భావం తో బాటు, గేయభావం వ్యక్తం చేసే గొప్ప నేర్పుంది సినిమాలకు ఇది చాలా ప్రధానం. ఎందుకంటే, పాటలో ప్లేబాక్ గాయకుడు సంపూర్ణంగా అభినయించక పోతే, నటుడు ఖూని అయి ఊరుకుంటాడు. ఘంటసాల ప్లేబాకు పాడితే నటుడి పని చాలా తేలిక. ఈ సౌకర్యాన్ని సినిమా తారలు ఒక్కనాటికి వదులుకోరు.

ఘంటసాలలో ఇంకొక విశేషం, అతను అన్ని రసాలను పాటలో ఒప్పించగలడు. సినిమాలలో మనకు ముఖ్యంగా హాస్య, శృంగార రసాలన్నింటినీ ఘంటసాల ఒప్పించిన సంగతి అందరికీ తెలుసు ఈ విషయంలో, నాకు తెలిసినంత

పరికూ భారతీయ సినిమా ప్రపంచంలో రఫీ ఒక్కడే వున్నాడు ఇతర భారతదేశం లోనూ ఘంటసాలతో పోల్చదగిన ప్లేబాక్ గాయకుడు మరొక్కడే వున్న మాట నిజమైతే, ఆంధ్రులు ఘంటసాలను చూసి గర్వించటానికి వేరే కారణం అవసరం లేదు

ఘంటసాల సినిమాలలోకి రాగానే సినిమా సంగీతంలో ఒక కొత్త అధ్యాయం ప్రారంభమయింది సినిమా సంగీతానికి ఒక విశిష్టత వచ్చింది దీనికి నిదర్శనమేమంటే రేడియోలలో అనేక పిల్ల ఘంటసాలలు పాడటం వినిపించింది అనుకరణ ఎంత బాగున్నా అనుకరణే వీరెవరూ ప్రజాగాయకులు కాలేక పోయారు గాయకుడుగానే కాక, సంగీత దర్శకుడుగా కూడా ఘంటసాల ఒక కొత్త వరదా ఏర్పాటు చేశాడు తెలుగు సినిమాలలో చాలా కాలం పాటు స్టేజీపాటల భావాలే ఉండేవి ముఖ్యంగా మరారి, స్టేజి పాటల అనుకరణలు జాస్తిగా ఉండేవి.

ఘంటసాల మ్యూజిక్ డైరక్షన్‌లో సినిమా ట్యూనులకు ఒక విశిష్టత వచ్చింది సినిమా పాట యొక్క వరసా, లయా పాట వచ్చే సందర్భానికి తగినట్టుగా వుండాలన్నది అందరికీ తెలిసిన సంగతే కాని ఆ సన్నివేశానికి ముందు నడిచిన సన్నివేశం ప్రభావం కూడా దాని మీద ఉండవచ్చునన్నది అందరూ గమనించారు. ఘంటసాల సృష్టించిన అనేకానేక పాటల నుంచి ఉదాహరణలు ఇవ్వటం సాధ్యం కాదు. నన్ను బాగా మెచ్చు చేసిన ఒక్క ఉదాహరణ ఇస్తాను. ' పెళ్ళి చేసి చూడు' లో ఏడు కొండల వాడా, వెంకటరమణా అన్న పాటకు చక్రవాకం వాడటంలో నాకు ఘంటసాల జీనియస్ అంతా కనిపించింది. ఆ పాటలో లేని జాలి ఒకటి ఆ సన్నివేశంలో ఉన్నది. దానికి ముందు నడిచిన సన్నివేశం చాలా తోడ్పడింది ఆపాటే ఇంకో రాగంలో ఉన్నట్టయితే ఆ పాటకున్న విలువ 90 శాతం ఎగిరిపోయి ఉండేది

తనకు పూర్వం సినిమా పాటలలో ఎవరూ ప్రవేశ పెట్టని చారుకేసి వగైరా రాగాలను ఘంటసాల విజయవంతంగా ప్రవేశ పెట్టాడు.

అన్ని రంగాలలోనూ అనేక మంది గొప్ప వాళ్ళు పనిచేస్తారు. కాని తాను పనిచేసే రంగానికి ప్రతీకగా నిలబడే అదృష్టం అందరికీ లభించదు. ఘంటసాల సినిమా సంగీతానికి నిశ్చయంగా ప్రతీక.

*పాలికేక, వారపత్రిక, 30-1-70*

# 9. గానమూ - సంగీతమూ

కళాస్వాదన ఎల్లప్పుడూ విచక్షణా సహితంగానే వుంటుంది కళలు పరిణితి చెందిన కొద్దీ విచక్షణ మరింత సూక్ష్మంగా వుంటుంది ఉదాహరణకు - యాభై ఏళ్ళ క్రితం టాకీలయుగం ఆరంభమైనప్పుడు అన్ని సినిమాలూ ఒకే రకమైనవిగా వుండేవి. వాటి యితివృత్తాలు పౌరాణికాలు ప్రేక్షకులకు పాత్రల పరిచయం అవసరం లేదు. వాటిని దేశంలో ఏ ప్రాంతంలోనైనా తీయవచ్చు ఏ భాషకు చెందినవాడైనా డైరెక్టు చెయ్యవచ్చు టాకీలు గనక నటులకు భాష తెలిసి వుండాలి. ఈ విధంగా తొలి టాకీల శిల్పమూ, సాంకేతిక విలువలూ దేశమంతటా ఒకటిగానే వుండేవి అప్పటికీ మూకీల మీద టాకీలు కొంత పరిణామం చెందినవే. ఎందుకంటే మూకీ 'హరిశ్చంద్ర' చిత్రాన్ని దేశమంతటా ప్రదర్శించే అవకాశం వుండేది. కాని టాకీ 'హరిశ్చంద్ర' ఒక భాష తెలిసినవారికే పరిమితం

అయితే సినిమా కళ పౌరాణికాల దగ్గర ఆగిపోలేదు. స్టంటు సినిమాలు (మాస్టర్ విఠల్), సాంఘిక చిత్రాలు వచ్చాయి. స్క్రిప్టు రాసుకునే పద్ధతి దాకా అనేక మార్పులు వచ్చాయి. ప్రేక్షకుల అభిరుచులలో వైవిధ్యం ఏర్పడింది. సినిమా కళకు సంబంధించిన సాంఘిక విలువలు అనేకంగా ఏర్పడ్డాయి. ఇవాళ సినిమాలలో వున్న వైవిధ్యం సాహిత్యంలో వున్న దానికి తీసిపోదు.

సినిమాలను ఉదాహరణకు తీసుకున్నాను. అలాగే నాటకాల ఉదాహరణ కూడా తీసుకోవచ్చు. తొలి తెలుగు నాటకాలలో 'పీష్వా నారాయణరావు వధ' లాటి కొద్ది నాటకాలను మినహాయిస్తే, ఇతివృత్తం ప్రధానంగా లేని పౌరాణిక నాటకాలు కావటం చేత నటనకు ప్రాముఖ్యం వచ్చింది. తెలుగు స్టేజి మీద 'మహానటులు' అవతరించారు. హరిప్రసాదరావు గారి హరిశ్చంద్రుడి పాత్రలో హరిప్రసాదరావు గారే వుండేవాడు. ఆయన 'అవుటాఫ్ ప్లేస్' అని హెచ్చరించి అవసరమైతే ప్రేక్షకులతో మాట్లాడేవాడు!

అదే సాంఘిక నాటకాలు వచ్చేసరికి పాత్రలు ముఖ్యమయ్యాయి. గోవిందరాజు సుబ్బారావు గారికన్న గిరీశం పాత్రకు ప్రాముఖ్యం ఎక్కువ. యుగంధరుడి పాత్రకన్న గోవిందరాజు సుబ్బారావు హెచ్చు. అలాగే స్థానం వారు మధురవాణి పాత్ర ధరిస్తే ఆ పాత్ర స్థానాన్ని వెనక్కు తోసింది. అదే స్థానం తులాభారం నాటకంలో సత్యభామ వేస్తే స్థానం తప్ప సత్యభామ కనిపించలేదు.

ఇలాటి విచక్షణలు అప్పటి నాట్య కళాభిమానులు పరిగణించారని కాదు, బొత్తిగా ఎవరికీ తెలియదనీ కాదు. మాధవపెద్ది వెంకటరామయ్యను రామప్పంతులు

వేషం వెయ్యమని అడిగాను. మాధవపెద్ది 'రామదాసు' వేషమైనా వేశాడు గాని, రామప్పంతులు వేషం వేసే ప్రయత్నం చెయ్యలేదు. రాఘవాచారిగారు పురాతన సెట్టింగుల నాటకాలలో రాణించినంతగా సాంఘిక నాటకాలలో రాణించలేరేమో.

నాటకాలను గురించి ఇంకోరకం ఎపెక్షిణా కూడా చూపుతారు, 'థియేటర్' 'డ్రామా' ప్రదర్శన ఆకర్షవంతంగా వుండి నాటకంలో వస లేకపోయినా నాటకం రక్తి కడుతుంది 'సక్కుబాయి' వంటి చెత్త నాటకం అమితంగా ప్రేక్షకుల ఆదరణ పొందింది. కారణం? దైతా గోపాలం గారి అమోఘమైన పాటలూ, జొన్నవిత్తుల శేషగిరి (ఆంధ్ర గంధర్వ), తుంగల చలపతి గార్ల గానమూ, హాస్యబ్రహ్మ యాలం గంగయ్య గారి సాటిలేని నాలుగు పాత్రల ధారణా! అప్పటికి అదే 'గుడ్ స్టేజ్'

ఇటీవల తమిళ దేశంలో నాటకాలు చాలా అభివృద్ధికి వచ్చాయంటే - దానికి కారణం 'గుడ్ థియేటర్', 'గుడ్ డ్రామా' అంతగా కాదు. ఆర్థికంగా 'గుడ్ థియేటర్' ప్రాముఖ్యం వుంటుంది. కళాదృష్టిలో (సంస్కృతి పరంగా) 'గుడ్ డ్రామా'కు ప్రాముఖ్యం వుంటుంది

సంగీతంలో కూడా రసజ్ఞులమని చెప్పుకునేవారు అనేకరకాల వివక్షణలు చూపించాలని వుంటుంది కొద్దిరోజుల క్రితం హిందూ సంగీత విమర్శకుడు నారాయణన్(ఎన్.ఎమ్.ఎన్.) గారు ఒక విషయం చెప్పారు. ప్రసిద్ధ వేణు విద్వాంసుడు టి. ఆర్. మహాలింగం గారు పాటకచ్చేరి చేసి మిత్రులను, ''ఫ్లాట్ మరీ జాస్తిగా లేదు గదా?'' అని అడిగారుట. సంగీత కళాకారుడికి ఇది చాలా ముఖ్యమైన ప్రశ్న. దీని ప్రాముఖ్యం నాకు చేతనైనట్టుగా స్పష్టం చేయ ప్రయత్నిస్తాను.

సంగీతంలో రెండు అంశాలున్నాయి. గానమూ, సంగీతమూ. గానం అన్నది పాటగాడి, లేక వాద్యగాడి ప్రావీణ్యం. సంగీతం అచ్చుగా కళ-గానం-శిల్పం, సంగీతం కళావికాసన.

ఈ తేడాను మాటలలో వ్యక్తం చెయ్యడంకన్నా అనుభవంతోనూ, ఉదాహరణలతోనూ స్పష్టం చెయ్యడం తేలిక.

ముందు చెప్పిన నాటకాల ఉదాహరణలలో ఇతివృత్తం ప్రధానం కాదని. నాటకాలలో నటులు పైకి వచ్చినట్టుగా సుప్రసిద్ధ కర్నాటక వాగ్గేయకారులు తెలుగులోనూ సంస్కృతంలోనూ రచించిన కీర్తనల ఆధారంగా గొప్ప గాయకులు పైకి వచ్చే అవకాశం ఏర్పడింది. కాని ఇందువల్ల సంగీతానికి నష్టం జరగలేదు. ఎందుకంటే గానం గాని, సంగీతం గాని శబ్దప్రధానం కాదు. అదీగాక పాటకచేరీలో కీర్తన పాడటం ఒక ప్రక్రియ మాత్రమే రాగాలాపనా, స్వరకల్పనా, తానమూ, పల్లవీ లాటివి పాటకచ్చేరీలో ఎక్కువ ప్రాముఖ్యం కలిగి వుంటాయి.

అయినా సంగీతంలో కూడా గానానికీ, సంగీతానికీ స్పష్టంగా ఏర్పడింది. గాన శిల్పానికి ప్రాముఖ్యం ఇచ్చినవాళ్లు కొందరు, సంగీతంలో రచనకు ప్రాముఖ్యం ఇచ్చినవాళ్లు మరికొందరు. శిల్పంతోపాటు సంగీత సమప్రాముఖ్యం ఇచ్చినవారిలో డి.కె. పట్టమ్మాళ్, పినాకపాణి, గోటు వాద్యం నారాయణయ్యంగార్ లాంటి వారిని చేర్చితే నేను పొరపడనేమో అనుకుంటాను. వాళ్ళ సంగీతాన్ని నిర్గుణోపాసన అని నా నమ్మకం.

''శాస్త్రీయ సంగీతానికీ, లలిత సంగీతానికీ తేడా ఏమిటంటే శాస్త్రీయ సంగీతంలో శబ్దాలు ప్రధానం కాదు. లలితసంగీతంలో శబ్దాలే ప్రధానం'' అన్నారు ఒకరు. ఇది ఒక రకం విచక్షణ. కాని, డాక్టర్ బాలమురళీకృష్ణ గానంలో శబ్దాలకు ప్రాముఖ్యం వుండటమూ, గానానికి వున్నంత ప్రాముఖ్యమూ సంగీతానికీ వుండటమూ చూస్తే గొప్ప కళాకారులు కొన్నిరకాల విచక్షణలను చెరిపెయ్యగలరని తోస్తుంది.

కొద్దిరోజుల క్రితం పాకిస్తాన్ నుంచి ఉస్తాద్ సలామత్ అలీఖాన్ తన కొడుకుతో వచ్చి మద్రాసులో పాటకచేరీ చేసాడు. గానంలో ఇవాళ అతన్ని అందుకోగలవాళ్ళు హిందూస్తానీ గాయకులలో ఎవరూ లేనిమాట నిజమే కావచ్చు. కాని సంగీతంలో అతను అబ్దుల్ కరీమ్ ఖాన్, బడే గులామలీఖాన్, అమీర్‌ఖాన్‌ల స్థాయికి రాలేదని నా అనుమానం. అచ్చుగా గానశిల్పంలో చెప్పుకోదగిన గాయని పర్వీన్ సుల్తానా వున్నది. కాని ఆమెతో పోల్చితే సలామత్ అలీఖాన్‌ది నిస్సందేహంగా గొప్ప సంగీతమే!

సినిమాలలో మనం వినే గొప్ప గొంతులలో లతామంగేశ్కర్, ఆశాభోంస్లేలవి వున్నాయి. నా ఉద్దేశం లత సంగీతంలోనూ, ఆశా గానంలోనూ ఒకరినొకరు మించుతారని. అయినా సినిమా సంగీతం అధికంగా గానాన్నీ, శబ్దాన్నీ ఆశ్రయించు కున్నది. అందులో సంగీతం పాలు- శంకరాభరణం చిత్రంలోనైనా సరే- చాలా స్వల్పం.

నేను చెప్పిన ఉదాహరణలను ఎవరూ ప్రమాణంగా తీసుకోనవసరం లేదు. కాని నేను సూచించిన విధంగా విచక్షణ చేస్తూ పోతే సంగీతాభిమానుల రసాస్వాదన శక్తి హెచ్చుతుందని నా నమ్మకం.

ఇలాటి విచక్షణలు లేకపోవడం కళల పతనానికి కారణం అయే అవకాశం వున్నది. ఈనాడు కర్ణాటక సంగీత రంగాన బాలమురళీకృష్ణ వంటి వాడి ప్రాముఖ్యం గురించి చెబితే చాలామందికి క్లేశం కలిగింది. గానానికీ, సంగీతానికీ విచక్షణ పాటించేవారు లేక ఎస్. బాలచందర్ వంటి వాళ్ళు బాలమురళీతో సరిసమానంగానూ, మరి రెండాకులు హెచ్చుచదివినట్లుగానూ మాట్లాడి సాగించుకున్నారు. మరొకసారి బాలమురళి ఏదో కొత్తరాగం పాడుతున్నాడు. పూర్ణచందర్ ఫిడేలు వాయిస్తున్నాడు. రాగం చాలా కొత్తగా వున్నది. నా పక్కన టన్నుల కొద్దీ పేరుమోసిన విద్వాంసుడు కూర్చుని వున్నాడు. ఎవరో ఆయనని, ''ఇదేం రాగం?'' అని అడిగారు. ''ఎబ్బే, ఇది రాగం కాదు, దీన్ని రాగమని

మం గుర్తింపం''' అన్నాడా విద్వాంసుడు రాగం కాకపోతే పూర్ణిపందిరి ఎలా పాడుతున్నాడు! తరవాత తెలిసింది అది ఒక మేళకర్త! మేళకర్తను రాగంగా గుర్తించని విద్వాంసుడు ఏ క్లాస్ పాడగాడు - ఈ మాట తరవాత ఆశ్చర్యార్థకమే పెడతారో, ప్రశ్నార్థకమే పెడతారో మీరే నిర్ణయించుకోండి

ఆంధ్రజ్యోతి వారపత్రిక, 21-4-8''

# 1. ఆంధ్ర అభ్యుదయ రచయితల సమావేశం

ఆంధ్ర - అభ్యుదయ - రచయితల - సంఘం అంటే ఆంధ్ర అభ్యుదయం కోసం పాటుపడుతుందా పడుతున్నారా

ఇందులో అభ్యుదయ రచయితలే ఉంటారా ఉన్నారా? ఇందులో లేనివారూ, చేరినవారూ అభ్యుదయ రచయితలుకారా? ఎవరు అభ్యుదయ రచయితలు, ఎవరుకారు?

రచయితల సంఘాలెన్నిలేవు? అవి చెయ్యనిపని అదేంచేస్తుంది?

''దేశ మంటే మట్టికాదోయ్

దేశమంటే మనుషులోయ్''

గురజాడవారు ఆ మాటలెందుకన్నారో అప్పుడు? ఇప్పుడు వీళ్లెందుకది తవ్వి తీసుకురావటం? ఇదేదో ఆర్థిక ప్రచారం, రాజకీయ ప్రచారం.

చేస్తే, బహిరంగంగా, ఫలాని పార్టీ తరపున ప్రచారం చేస్తున్నామని చెప్పాలి, లేదా, రాజకీయాల్ని వొదిలేసి అచ్చమైన సాహిత్యకళ నారాధించాలి. అంతేగాని, సాహిత్యానికి రాజకీయాలతో సంబంధం ఉంటుందంటూ, ఆర్థికాలతో సంబంధం ఉంటుందంటూ ఒక రాజకీయపార్టీకి గాని, ఒక ఆర్థికవ్యవస్థకోసం గాని సాహిత్యం ప్రచారం చెయ్యదంటే ఎవడి కర్థమవుతుంది? అయితే నలుపు కావాలి. లేకపోతే తెలుపు కావాలి, మధ్యలో మనకేమిటి? వైరుధ్యాలను సమన్వయించకూడదు. సమన్వయంకానీ కూడదు. అదే సైన్సు

నిజమైన సాహిత్యం ఏ మానవ సమస్యల్నీ తర్కించకూడదు. ఎంచేత అవి ఇవాళుంటే, రేపు పోతై, ఆర్థికాలూ, రాజకీయాలూ అన్నీ విసర్జించి, తాత్కాలిక సమస్యల్నన్నిటినీ త్యజించి ఆ యొక్క నిర్గుణమైన, నిర్వికల్పమైన, శాశ్వతమైన, ఎవరికీ అందని, అర్థంగాని, అనలేలేని సత్యాన్ని ప్రపంచానికి ఘాటుగా, బిగ్గరగా, ఎలుగెత్తి అరిచి చాటాలి ఆ పుస్తకాలిక చావవు. ఎపుడూ అట్లానే ఉంటై.

వెనకటివాళ్ళంతా ఈ దృష్టితోటే రాశారు. అని అనుకోవటాన్ని చారిత్రక పరిశోధన అంటారు.

అన్నీ అనుమానాలే, అందరికీ సందేహాలే, మల్లవరపు విశ్వేశ్వరరావేదో చెప్పాడు. శ్రీశ్రీ ఏమిటో అన్నాడు చదలవాడ పిచ్చయ్య గొంతుచించుకు అరిచి మరీ చెప్పాడు. తుమ్మల వెంకట్రామయ్య పిచ్చికల్లే వేదికమీద వాలి బలహీనమైన గొంతుతో అభ్యుదయ రచయితల సంఘం చేసిన పనుల గురించి చెప్పాడు.

కాని మాట్లాడే మనిషి మాటలా వినేది? ఆ మాటల వెనుక వాళ్ళు చెప్తున్నదేమిటో అది వినాలి గ్రహించాలి మాట్లాడే మనిషి అమాయకుడై నిష్కల్మషుడై మాటల వెనక ఏమీ దాచకపోతే, ఆ మనిషి ఏమన్నాడో వినవలసిన అవసరంలేదు గనక వినని నష్టం ఉండదు ముందు మాట్లాడిన వాళ్ళు సమాధానాలు చెప్పిన సమస్యలన్నింటినీ మళ్ళీ మనం ముద్దగా చెయ్యొచ్చు! ఏమీలేనిందో ఒక సహృదయుడు కరతాళధ్వని చెయ్యకపోడు

''ముందడుగు'' నాటకం హాలు ఏదోవిధంగా నిండిందిగాని రావలసిన వాళ్ళు రాలేదు ఎంతో ఆపేక్షతో విరాళాలిచ్చినవారు రాలేదు రావటానికి ఉత్సాహం గల కొందరికి ఆహ్వానాలు చేరలేదు! .

నాటకాల్లో వేషాలువేసి కీర్తిగడించినవాళ్లు, నాటకాలంటే గిట్టనివాళ్ళు, నాటకాలమీద ఆపేక్ష ఉండి ఆడేనాటకాల్తో మొహంమొత్తినవాళ్లు - అందరూ నాటకం ఆసాంతం చూశారు. పద్నాలుగుసార్లు తెరపడిలేస్తే సహించారు. మొగబ్బాయిలు ఆడవేషాలేస్తే పోనివ్వమన్నారు పద్యాలు పాడినా ఇష్టంలేని వాళ్ళు క్షమించారు. నటనాశిల్పంలోనూ, నాటకశిల్పంలోనూ కలిగిన లోపాలు ఒక్కరూ పట్టించుకోలేదు పల్లెటూరి జీవితం ప్రత్యక్ష మయిందన్నారు రైతుజాతితో పరిచయం చేసుకుని అ జాతియొక్క అమాయకత్వం లోనూ, అజ్ఞానం లోనూ కూడా లీనమై సానుభూతి పొందారు. ''ముందడుగు'' కన్న మంచి నాటకం చూసినట్టు ఒక్కరికీ జ్ఞాపకం రాలేదు. బిరుదాంకితులైన నటులులేని లోపం ఎవరినీ బాధించలేదు కిరాయినటులుకాని కారణంచేత, కళలు జీవిత సమస్యల్ని ఆరాధించటం చేత, అభ్యుదయ నాటకం రంగంమీది కెక్కటంచేత కలిగిన లాభాన్ని అందరూ గ్రహించారు.

కోడూరు అచ్చయ్య రంగస్థలంమీద కొచ్చినప్పుడల్లా రాఘవాచారిని స్మరించినవాళ్ళున్నారు. ఆయన చూపు ఏక్షణం ఎటు పోయ్యేది శ్రద్ధగా గమనించిన వాళ్లున్నారు. రాఘవాచారి గొప్ప నటుడా, కోడూరు అచ్చయ్య గొప్ప నటుడా - అనే సందేహం ఎవరికీ కలగలేదు. అయితేనేం? రాఘవాచారి ఏచెత్త నాటకంలోనైనాసరే పాత్రధరించి ప్రేక్షకుల్ని మెప్పించగలడు, కోడూరు అచ్చయ్య - వెనకట్లో ఏవేషాలు వేసినా - ప్రజానాట్యమండలికి కైంకర్యం అయిపోయినాడు. పూర్ణేందు చంద్రికాస్ఫురిత చకోరకం....

మళ్ళీసభ, ఇవాళ ఎవరికీ సందేహాలులేవు, ఇవాళ నిజం వెల్లిగా బయటపడుతున్నది. కేవల ఆంధ్ర అభ్యుదయంకాదు. అభ్యుదయ రచయితలు కాదు, రచయితల సంఘంకాదు - అభ్యుదయ సాహిత్యం, దాన్ని రాయటానికి ఉత్సాహంగల రచయితలు, దాని యందు విశ్వాసంగలపెద్దలూ, సానుభూతిపరులూ, సంస్కార్లూనూ, సాహిత్యకళ నిర్బంధాల నతిక్రమించి ప్రజాబాహుళ్యానికి అంది, వారి

సమస్యల తాలూకు సత్యాన్ని వారి హృదయాలకెక్కించి అభ్యుదయం చేకూర్చటం - ఈ భావాలు పైకొచ్చినై

నిన్నటి సందేహాలింకా తీరలేదు, ప్రజాసేవ చేసేవాళ్లు ఏ రాజకీయ పక్షంవారైనా అరాధ్యులే, సాహిత్య పిపాసువులకు కావలసింది రాజకీయ కీచులాటలు కావు, సాహిత్యకళా పురోభివృద్ధీ, ప్రజా సేవానూ!

తిరిగి ప్రదర్శనాయి, ఈ సారి ప్రజాసాహిత్యం - నిరక్షరులైన ప్రజలు గుర్తించే శిల్పాలు - బుర్రకథలూ, భాగోతాలూ, నాట్యాలూనూ. కాని ఆ శిల్పంలో అంతర్భూతమై ఉన్నది అభ్యుదయ సాహిత్యమే.

ప్రేక్షకులలో ఉన్నవారు నిరక్షరులైన ప్రజకాదు మద్రాసులో ఉండే ఆంధ్ర పౌరులలో అత్యున్నతోద్యోగులూ, డాక్టర్లూ, ప్లీడర్లూ, సినిమా నటీనటకులూ, చదువుకున్న విద్యలవారూ ఉన్నారు

నాజరు బెంగాలు కరువును గురించి బుర్రకథ చెబుతుంటే ప్రేక్షకుల గొంతులకేదో అడ్డుపడింది వాళ్ళదృష్టి మసకలు కమ్మినట్టయింది.

భరింపలేక మధ్యలో ఎవరో అరిచారు - నాజరును నిరోధించమని! .. కాని నాజరు కడ్డులేదు, నాజరు మనుష్యుల్ని తినేస్తాడు శ్రీశ్రీ పద్యాలతో మనుష్యుల గుండెల మీద జగన్నాధ రథాన్ని నడిపిస్తే, నాజరు తన బుర్రకథతో మనుష్యుల మీదుగా స్టీమ్‌రోలరు నడిపిస్తాడు.. అయితే ఈ కళాకారుల వాతపడ్డ మనిషి నూతన జీవంతో బయట పడతాడు.

డాక్టరు గోవిందరాజు సుబ్బారావు చెప్పాడు - నాజరు గొప్పనటుడు! వెనక హరిప్రసాదరావు హరిశ్చంద్ర పాత్రధరించి ఇట్లాగే ఏడిపించుకు తినేశాట్ట! . . అదేమోకాని, నాజరు ఒక అభ్యుదయ రచయిత! .

చదలవాడ పిచ్చయ్య ఎన్నడో క్షయతో చావవలసినవాడు, ఇటువంటి మహత్తరకార్యం సాధించటానికి బతికాడు? ఈ పుణ్యం కట్టుకున్నవాడు డాక్టరు శంకరశాస్త్రి? . తను ఆంధ్రులకి మహోపకారం చేసినట్టు చెబుతున్నాడు డాక్టరు! పేరుకు కమ్యూనిష్టు పార్టీలో ఉండి అభ్యుదయ సాహిత్యమో అని అల్లాడే చదలవాడ పిచ్చయ్యకు క్షయవ్యాధి నయం చేసుకోవటానికి డాక్టరు శంకరశాస్త్రికి తెలీని చికిత్స ఏమైనా తెలుసునా ఏం, కొంపతీసి?.....

పాపం, నారాయణరావు - మన సినిమానటకుల్లో కల్లా అందగాడు - పెట్టుబడిదారీ బావిసత్వం నుంచి ప్రజల్లో పడితేగాని కళలు అభ్యుదయం పొందవని ఎవరో అన్న ముక్కలు మాత్రమే చెప్పి కూచున్నాడు. అతనిని ''స్వర్గసీమ'' ఏమైన స్ఫురణకు వచ్చి ఆమాటలనిపించిందా? . .

[illegible] ప్రదర్శన ఉదయాల హాలులో ఇంతమంది ప్రేక్షకులుచేరటం ఇది రెండోసారటు! [illegible] జమీందార్లు అధ్యక్షత వహించినప్పుడుకూడా ఇందుమంది ప్రేక్షకులైనా లేరు! [illegible] హాలు మొదటి సారి నిండినప్పు డెక్కడ జరిగిన తంతెరుగదో అది ఎప్పుడు జరిగిందో [illegible] ఈనాటి ప్రదర్శనం పూర్తిగా [illegible] పట్టింది!

తెలుగు తల్లి మాసపత్రిక, *1946* జనవరి

# 2. నాటకాలాడించే పద్ధతి

మాస్తుండగానే జీవితం ఇంత మారిపోయింది కాని నాటకాలాడే పద్ధతిలో కోరదగిన సంస్కారణ ఒక్కటీ జరిగినట్టు కనపడదు. సినిమాలొచ్చి దృశ్యకావ్య ప్రదర్శనా శిల్పంలో పెద్ద విప్లవం తెచ్చాయి. రేడియోవచ్చి దృశ్యకావ్యాలను అదృశ్యంగాకూడా రక్తికట్టించే పద్ధతులు అమలులోకి తెచ్చింది. కాని ఈకొత్త కొత్త టెక్నిక్కులు నాటకరంగాన్ని సంస్కరింప లేకపోవటంచాలా విషాదకరం ఈ విషయమై కొంత సక్రమాందోళన జరిగితీరాలల్లే కనిపిస్తుంది.

### కొత్తనాటకాలు

కొత్తనాటకాలు లేవనే సణుగుడు నాటక ప్రపంచంలోనే కనిపిస్తుంది. ఈ సమస్యని రేడియోవారూ, సినిమా వారూ ఎంత తేలిగ్గా పరిష్కరించేశారో చూడండి, రేడియోవారు వారానికి కనీసం రెండు కొత్త తెలుగు నాటకాలు చులాగ్గా ఆడేస్తారు. ఇవిగాక పద్యనాటికలుకూడా ఆడతారు. కవిత్వం రాయడమే చాతనయి నాటకం సంగతి తెలీనివాళ్ళు సహితం పద్యనాటిక రాయవచ్చు. ఇక ఏకాంకికలంటే, వాటిని ఏమీ చాతకానివారు కూడా సులభంగా రాయొచ్చు రేడియోమీద సాధ్యమైనపని నాటక రంగం మీద ఎందుకు సాధ్యంకాదో ఊహించరాకుండా ఉంది. నాటక రంగంమీద ఒక్క ఏకాంకిక ప్రదర్శించటం సాధ్యం కాకపోతే రెండు పద్య కావ్యాలూ, రెండు ఏకాంకికలూ కలిపి ఆడెయొచ్చును. రేడియో నాటకాలల్లే ఇవి అదృశ్యంగా ఉండవు కనక స్టేజినాటకాలు రేడియోతో తీవ్రంగా పోటీచేసి రేడియో శ్రోతల నందరిని రంగస్థలం పైకి లాక్కోవచ్చు ఈ విధంగా రాయించేనాటకాలు రంగస్థలాన రక్తి కడతాయా అని సందేహిస్తూ కూచోవటం చాదస్తం రేడియో వారికి లేని దిగుళ్ళు నాటక కంపెనీల వారికెందుకుండాలో బోధపడదు. ఓ పక్షాన నాటకం బాగుండక పోవటమే జరిగినచో ప్రేక్షకులుపాత చెప్పులూ, కుళ్ళువంకాయలూ, ఎంగిలి బీడీలూ,

[illegible] కొన్ని [illegible] వస్తే [illegible]
సంతోషిస్తారు. ఇక చర్చించవలసిన విషయం [illegible] ఉన్న [illegible]
[illegible]
[illegible]లో ఉండవలసిన విస్తృత జ్ఞా[illegible]

సినిమాలనుండి నేర్చుకోదగిన సంగతులు.

ఇక సినిమా కంపెనీల ద్వారా ఇతివృత్తం సంబంధి నేర్చుకో వలసిన విషయం చాలా ఉంది. సినిమా కంపెనీల వారు ప్రఖ్యాత మైన కథ తీసుకోదలచినప్పుడు ఫలానివారు రాసిందే తీసుకోవాలని పట్టుపట్టరు. వాళ్ళవాళ్ళ పద్ధతులు తెచ్చుకొని నిక్షేపంగా తమ యిష్టం వచ్చినట్టు రాయించుకుంటారు. ఈ కారణం చేత ఒకే కథను పది కంపెనీలవారు చిత్రంగా తీసినా అన్నీ తలా ఒక విధంగానూ అనహ్యంగా ఉంటాయి. ఈ పని నాటక కంపెనీలు కూడా సుళభంగా చెయ్యొచ్చు. ఒకే నాటకం పట్టుకుని నాలుగు కంపెనీల వారూ ఆడేసరికి నాటక కంపెనీకి ప్రత్యేకత లేకుండా పోవటమే కాక, ఒకరి ప్రదర్శనాన్ని మరొకరి ప్రదర్శనంతో పోల్చటం జరిగి ఒకదానికన్న ఒకటి బాగున్నట్టూ, ఒకనటుడుకన్న మరొక నటుడు బాగా చేసినట్టూ భ్రమకలగటాని కాస్కారం ఏర్పడుతున్నది. నాటకకంపెనీలు ఇటువంటి ఊహాలకి అవకాశం ఇవ్వకుండా ఉండటం ఉమ్మడిమీద దేశానికంతటికి క్షేమకరం.

సినిమాలదగ్గిర్నుంచి మనం నేర్చుకోదగిన మరో గొప్ప సంగతేమిటంటే, ఏ ఇతివృత్తంగానీ లక్షికట్టు అనేది పాటిపాటున జరిగినట్టయితే పేర్లు మార్చి, సంభాషణాలు మార్చి, సన్నివేశాలు కూడా కొద్దిగా మార్చి ఆ యితివృత్తంతోటే అరడజను ప్రత్యేక ప్రదర్శనాలు సులువుగా తయారుచేసుకోవచ్చు. ఈ పని నాటక కంపెనీల వారికింకా తెలిసిరాలేదు. చాలా శోచనీయం.

దేవుడు చాలా మేలు చేస్తే సినిమా పరిశ్రమనుంచి మనం నేర్చుకోదగ్గ మరో విషయ మేమంటే ప్రఖ్యాతతారలను పోగుచేసి వారికి పోటీకొద్ది డబ్బిచ్చుకుని అంత కంత డబ్బు ప్రేక్షకుల దగ్గిర్నుంచి గుంజటం. ఖర్మం జాలక ఈ విధానంలో నాటక కంపెనీ దివాలా తీయటమే తటస్థించితే మరేమీ ఫర్వాలేదు, ఇతర కంపెనీలు బోలెడన్ని రాగలవు. ఈ పద్ధతుల మీద నాటక పరిశ్రమ కొన్నాళ్ళు సాగగా సాగగా ప్రఖ్యాతనటులు తారలనిపించుకునే వాళ్ళు - ఎవరూ మిగలరు గనక పరిశ్రమ గొప్పగా ముందుకు సాగిపోతుంది. ఆపైన స్టేజి నాటకాలు కూడా రేడియో నాటకాల్లాగా నటుల ఖ్యాతితో నిమిత్తం లేకుండా హాయిగా జరిగిపోగలవు.

ఈ విధంగా ఇతి వృత్తం వగైరాలు తేలిపోయిన తరవాత, నాటకాలాడించే విధానంలో కూడా చాలా సంస్కరణ కవకాశం ఉందనేది తెలుసుకోవాలి.

సంస్కరణ కవకాశం

నాటకాలకన్నా డా ప్రొడ్యూసరూ, డైరెక్టరూ, అసిస్టెంటు డైరెక్టర్లూ పైగా ఉండరు పెట్టుబడికి గొంతువేసేవాడు ప్రొడ్యూసరు కీర్తికి గొంతువేసేవాడు డైరెక్టరు మిగతా వ్యక్తులు సాధనాలు

పాత్రధారుల్ని - ముఖ్యంగా స్త్రీపాత్రలు ధరించే వారిని - ఎన్నుకోవటంలో మన కిష్టం ఉన్న వారికి ప్రత్యేకాదరం చూపించే అవకాశం ప్రొడ్యూసరు డైరెక్టర్లు పోగొట్టుకోరాదు స్టేజినాటకాలు ఒక్కరోజు భాగ్యమే గనక నెలజీతాలిచ్చి నటుల్ని ఆదరింపటం దండుగ, నటులు నాటక కంపెనీలో మెంబర్లుగా ఉండటం అనవసరం ప్రొడ్యూసరూ డైరెక్టర్లే కంపెనీగా ఉండి ఎటీనటులు వారిచుట్టు పరిభ్రమిస్తూ ఉండటమూ, నాటక కర్తలు కూడా నిత్యమూ తమ రచనలు శ్రీవార్లకు పంపుకుంటూ తమ నాటకాలాడి ప్రోత్సహించమని కోరుతూ ఉండటమూ జరగాలి ఆడబోయే నాటకం తాలూకు పబ్లిసిటీ కొద్దిగా ముందుగానే జరగాలి గనుక కొన్ని సమయాలలో ఇబ్బంది కలగొచ్చు. అనుకున్న నాటకం అనుకున్న సమయానికి రాకపోవచ్చు, అటువంటి సమయంలో నాటక రచయితను నేపథ్యంలో కూచోబెట్టి ఓచెంప నాటకం రాయిస్తూ పాత్రలను మాత్రం ఒట్టి బుర్రలతో రంగంమీదికి పంపించి ప్రాంప్టర్లద్వారా సంభాషణలు వేడి వేడిగా అందింప చేస్తూ నాటకం ఆడించవచ్చు, ఇది సినిమాలో అసాధ్య మైన స్టేజీ మీద సాధ్యమనుకోటానికి ప్రబల కారణాలున్నాయి

ఓ వేళనాటకం ముందుగానే చేతికి వచ్చినా అనవసరంగా రిహార్సల్సు వేసి, నటుల కాలాన్ని వ్యర్థం పుచ్చుకోక నాటకం ఆడబోయే ముందు పదినిమిషాలు రిహార్సు చేసినట్టు నటించి నటుల్ని స్టేజి మీదికి పంపిస్తే నాటక కర్త ఊహించని అనేక నవనవరసాలు రంగస్థలాన ఉత్పన్న మయే అవకాశం ఉంటుంది.

ఇటువంటి నాటక కంపెనీలలో ప్రొడ్యూసరుకు నటులమీద ఆట్టే అధికారం ఉండదు గనక ఏ తారామణి గాని గైరుహాజరయే సందర్భంలో ఆవిడ ధరించదగిన స్త్రీ పాత్ర తాలూకు నామధేయం కించిత్తు మార్చి మగ పాత్ర చేసేసి ఎవరన్నా చేతి కందిన మగ పురుక్కిచ్చేస్తే బ్రహ్మదేముడు కూడా తేడా కనుక్కోలేడు. మనం ఆడే నాటకాల్లో ఆడ సంభాషణకు మగ సంభాషణకూ తేడా ఏమీ ఉండదు గనక ఇది సులభంగా సాధ్యమవుతుంది.

ఈ సూచనల ననుసరించి సందర్భానుసారంగా ఇంతకు మించిన సంస్కారం కూడా చేసుకుంటూ, రేడియో సినిమాలు వేసిన రాజ బాటల ననుసరించి మన తెలుగు నాటక పరిశ్రమ ఎంతయినా పైకి రాగలదని ఆశిస్తున్నాను

*నవోదయ వారపత్రిక, 10-2-1946*

# 3. ఆంధ్ర నాటక పరిణామం

తెలుగుదేశంలో నాటకరంగం ఒక్క శతాబ్దం నుంచీ పరిణామం పొందుతూ ఉన్నది. ఈ కాలంలో ఇది చాలా దశలు గడిచింది

ఆదిలో నాటకమన్నది మనకు పార్సీ కంపెనీలు పెట్టిన బిక్ష. దాని ఫలితంగా చాలా ఏళ్లపాటు మన నాటకాలలో పార్సీమట్లుండేవి ఈ పార్సీమట్ల ప్రభావం పావల్ల లక్ష్మీకాంతయ్య పాటల మీద కూడా ఉంటూ వచ్చింది.

తొలి నాటక రచయితలు, తొలి నటకుల్లాగే ఉత్సాహవంతులు మాత్రమే, ప్రతిభావంతులు కారు. కానీ త్వరలోనే ప్రతిభావంతులు నాటక రచన చెయ్యడానికి ముందుకు వచ్చారు. వీరిలో ధర్మవరం కృష్ణమాచార్యులు, పానుగంటి లక్ష్మీ నరసింహారావు, కందుకూరి వీరేశలింగం, చిలకమర్తిలక్ష్మీ నరసింహం, బలిజేపల్లి లక్ష్మీకాంత కవి, వేదం వెంకటరాయశాస్త్రి, తిరుపతి వెంకటేశ్వర కవులు చెప్పుకోదగినవారు ఈ నాటక కర్తలలో చాలామందిపై పాశ్చాత్య నాటక సాహిత్య ప్రభావం కూడా ఉన్నది. పానుగంటి వారికి ఆంధ్ర షేక్స్పియర్ అన్న బిరుదు కూడా లభించింది కృష్ణమాచార్యులు గారు ''సారంగధర''లో ట్రాజెడీ లక్షణాలు ప్రవేశపెట్టారు. గురజాడ అప్పారావు కూడా తొలి నాటక కర్తలలో ఒకడైనప్పటికీ ఆయన రాసిన ''కన్యాశుల్కం'' గాని ''కొండిభట్టీయం'' గాని విరివిగా ప్రజలలో పడలేదు.

''కన్యాశుల్కం'' లాగే, పానుగంటి వారి ''కంఠాభరణం'' మొదలైన కొద్ది నాటకాలు మినహాయిస్తే తొలి దశలో వచ్చిన నాటకాలన్నీ పురాణాలకు సంబంధించిన ఇతివృత్తాలు గలవి. ఆ తరగతికి చెందినవి సంస్కృత నాటకాలకు తర్జుమాలు, లేదా అనుకరణలు, ''ప్రతాప రుద్రీయం'' అటువంటిది. కృష్ణ మూర్తి శాస్త్రుల వారి ''బొబ్బిలి'' చారిత్రక నాటకం.

స్థూలంగా చెప్పుకోవాలంటే తొలి నాటకాలన్నీ ఆనాటి సాహిత్యంలో ఉత్తమ స్థానం అలంకరించుకున్నవే. ఆ నాటకాలలో పాత్రలు ధరించినవారు కొందరు తమ స్వస్థలాలు విడిచి ఎంతో దూరం వెళ్ళకుండానే, గొప్ప నటులనే కీర్తి దశదిశలా వ్యాపింపజేశారు. హరిప్రసాదరావు, రాజు ప్రభృతులు ఇటువంటి వారు.

నాటకాలు మంచి సాహిత్యమనిపించటమూ, నటులు ప్రసిద్ధులు కావటమూ, ప్రజలకు ఆనాటి నాటకాల మీద ఆదరణ కలగటమూ వల్ల ఊరూరా నాటక సమాజాలు వెలిశాయి. కొన్నికొన్ని ఊళ్ళలో రెండు,మూడేసి వెలిశాయి.

ఈ పరిణామం వల్ల నాటక సమాజాలలో తారతమ్య పోటీలూ, నటులలో పోటీలు ప్రారంభమయ్యాయి ప్రతి పెద్ద పట్నంలో నాటక సమాజాలున్నప్పటికీ,

పెట్టుకున్నాయంటే కొన్ని నాటక సమాజాలు అఖిలాంధ్ర ఖ్యాతి సంపాదించుకో
సాగాయి. [illegible] కంపెనీ, మైలవరం ఏయేయన్ మొదలైన కంపెనీలు [illegible]
[illegible] నాటకాలలో [illegible] ప్రముఖులైన [illegible]
గాయకులను ఎక్కువగా [illegible] పారుపల్లి సూర్యనారాయణ, ఉప్పులూరి
సంజీవరావు, [illegible] జొన్నవిత్తుల శేషగిరి రావు, పారుపల్లి సుబ్బారావు
మొదలైనవారు తారాపథం అలంకరించారు. ఈ పరిణామం నాటకాల యెడ ప్రజల
కుండిన అభిమానం పెంపొందింపచేసింది. ఈ దశలో నాటకాలలో గల
ప్రాముఖ్యమూ, నాయకకర్తలకు గల ప్రతిభనుకబడి కేవలం నటుల ప్రతిభే రాసాగింది

ప్రతిభావంతులైన నటులు గొప్పగొప్ప సమాజాలపై ఆధారపడటం మానివేసి కీర్తిని స్వతంత్రంగా విస్తరింపజేయసాగారు. నాటకరంగాన ఈ విధంగా సంస్థలై వెలిశారు. బళ్ళారి రాఘవాచారి, స్థానం, మాధవపెద్ది, వెల్లూరు నాగరాజారావు, యడవల్లి సూర్యనారాయణ, డి. వి. సుబ్బారావు మొదలైనవారు

నటులలో ఇటువంటి పరిణామం కలుగుతున్న కాలమందే నాటకాలలో మరొక పరిణామం కలగసాగింది. నాటకాలు సాహిత్యపు అంశాల నుంచి కొంత వెడగా వచ్చి ప్రజలకు దగ్గరగా వున్న జీవితాన్ని స్పృశించసాగాయి. ఈ విధమైన నాటకాలు రాసినవారిలో అగ్రగణ్యుడు కాళ్ళకూరి నారాయణరావు, ఆయన రచించిన ''చింతామణి'', ''వరవిక్రయం'', ''నిరుపేద'' ఆంధ్రదేశంలో అసంఖ్యాకములైన నాటక కంపెనీల చేత ఆడబడి నటుల ప్రతిభతో ఎట్టిసంబంధమూ లేకుండా అపారమైన ప్రజాదరణ సంపాదించాయి. ఈయనే రాసిన ''పద్మవ్యూహం'' ఎక్కడా పైకి రాకపోవటం గమనించదగినది.

కాళ్ళకూరి నారాయణరావు గొప్ప రచయిత కాదు కాని ఆయన నాటకాలు ప్రజలూ, వారి భావాలకూ చాలా దగ్గరగా ఉంచాయి. రకరకాల పాత్రలను రంజకంగా సృష్టించి సంభాషణలను చాకచక్యంతో నడపటం ఆయనకు చాతనవును, ఆయన తన నాటకాలను ప్రయోజనకరంగా మల్చటమే గాక, చెప్పదలచినది చాలా సూటిగా, ప్రజలకు హత్తుకునేటట్లు చెప్పగలిగేవారు. గొప్ప నటులు, నాటకాలనూ, నాటక ప్రయోజనాన్నీ, రంగస్థల క్రమశిక్షణను కూడా తోసి రాజని ఆంధ్రనాటక చరిత్రలో ఒక కాళ్ళకూరి వారి నాటకాలు అనేకమంది రంగ నటులు నాటక కళ నారాధించేటందుకు అవకాశం ఇచ్చాయనక తప్పదు.

రంగస్థలాన్ని ఉత్తమ నటులు జయిస్తున్న కాలములో మరొకవైపు నుంచి పాడగలవారు కూడా ముందుకు రాసాగారు. వీరికీ వారికీ ఒకే సమయంలో ఒకే రంగస్థలాన సమమైన స్థానం రావటం గమనించతగిన విషయం. ఈ కాలంలో రంగస్థలాన్ని జయించిన గాయకులలో జొన్నవిత్తుల శేషగిరిరావు( ఆంధ్ర గంధర్వ)

'అప్పటికే శ్రీ సి.ఎస్.ఆర్., కపిలవాయి రామనాథ శాస్త్రి, [illegible] పంతులు, రామానుజాచార్యులు, రఘురామయ్య, ఎ.ఎస్. ఆర్. ఆంజనేయులు మొదలైనవారు మంచి పేరు గడించారు

గొప్ప గాయకుల, నటకుల విజృంభణతో ప్రయోజనం గల నాటకం పూర్తిగా అణగారిపోయింది. నాటక ప్రదర్శనాలు కేవలం విక్రయ వస్తువులయ్యాయి. వాటిని పురస్కరించుకుని వ్యాపారమూ, అడ్వాన్సులూ, కాంట్రాక్టులూ పెరిగాయి. కిరాయి నాటకాలూ, ఉత్తమ నట గాయక సమ్మేళనాలూ జాస్తి అయ్యాయి. ఒక్కొక్క నటుడు ఒక్కొక్క పాత్రను ఆక్రమించి కూర్చున్నారు. పాడగలవారు నటించదగిన పాత్రలను తమ సొంతం చేసుకున్నారు. ఈ దశలోనే పాటలు వెనుకబడి పద్యాలకు రంగస్థలాన ప్రాముఖ్యం వచ్చేసింది. పద్యం చదవటం ఒక ప్రత్యేక కళగా తెలుగు రంగస్థలాన అభివృద్ధి చెందింది.

ఈ పరిస్థితులలో ఎక్కువగా ఆడిన నాటకాలన్నిటినీ వరుసగా చూస్తే వాటిలో సామ్యం ఏమీ కనపడదు. పాడటానికి అనువైన పద్యాలు తప్పిస్తే. ఇందులో కొన్ని ''సారంగధర'' లాటి మంచి నాటకాలు, మరికొన్ని సక్కుబాయి'' లాంటి టుక్కు నాటకాలు. 'సక్కుబాయి' నాటకం ఆడినంత విజయవంతంగా మరే నాటకమూ ఆడలేదేమో. దాన్ని చూడటానికి తెలుగువాళ్ళు చాలా లక్షలు ఇచ్చుకున్నట్లు ప్రతీతి

యుద్ధ సమయంలో తెలుగు నాటకం లోనూ నాటక రంగంలోనూ ఒక నూతన పరిణామం ఆరంభమయ్యింది. అక్కడక్కడ సాంఘిక ప్రయోజనం గల నాటకాలు, ముఖ్యంగా అభ్యుదయ భావాలతో కూడుకొన్నవి బయలు దేరాయి. యువకులు నాటక సమాజాలుగా చేరి మంచి క్రమశిక్షణతో వాటిని ప్రదర్శించసాగారు. కమ్యూనిస్టుపార్టీ ప్రోత్సాహంతో నాటక ప్రదర్శనాలు ఇవ్వసాగిన ప్రజానాట్యమండలి బృందాలు అభ్యుదయ నాటకాలను చాలా విజయవంతంగా ఆడసాగాయి. పూర్వం నాటక స్థలం మీద ఎన్నడూ లేని విశేషమేమంటే ఈ నాటకాలూ ప్రజలకూ, ప్రజాజీవితానికీ దగ్గిరగా రావటం అల్లా ఉండగా నాటకకర్తలూ, నటులు కూడా నాటకాలలోని పాత్రలకు చాలా సన్నిహితులైనారు. ఇందువల్ల అభ్యుదయ నాటకాలలోకి పూర్వం ఎన్నడూ లేని కొత్త జీవం వచ్చింది. ఇటువంటి నాటకాలను రచించినవారు సుంకర సత్యనారాయణ, వాసిరెడ్డి భాస్కరరావు, ఆత్రేయ, అనిశెట్టి సుబ్బారావు మొదలైనవారు. ఈ అభ్యుదయ నాటకాలను ప్రజా నాట్యమండలి గాక ఇతర నాటక బృందాలు కూడా ప్రదర్శించాయి

అభ్యుదయ నాటకాలు ఆంధ్రనాటక రంగానికి చేస్తున్న సేవను ప్రజలు గుర్తించినంతగా ప్రభుత్వం గుర్తించలేదు. ప్రజా నాట్యమండలులు కమ్యూనిస్టు పార్టీ ప్రోత్సాహం కలిగి ఆ పార్టీకి సన్నిహితంగా ఉండటం సాకుగా పెట్టుకుని ప్రభుత్వం ''ముందడుగు'', ''మాభూమి' నాటకాలను నిషేధించింది ప్రజా నాట్యమండలులు

విచ్ఛిన్నమయ్యాయి అయినప్పటికీ అభ్యుదయ నాటకం తెలుగు రంగస్థలాన స్థానం సంపాదించుకున్నది అది ఇంకా బాగా వృద్ధిపొందలేదు ఇంతవరకు వచ్చిన అభ్యుదయ నాటకాలలో నిషేధానికి గురి అయినవి రెండూ తప్పిస్తే మిగిలినవి అన్నీ ప్రచార నిర్దుష్టమైనవనిగాని, ఉత్కృష్ట సాహిత్యం కింద జమకట్టదగినవని కాని చెప్పటానికి లేదు కాని ఆ శ్రేణిలో ఎన్నించేవాడు వీటికి పూర్వం ప్రసిద్ధిలో ఉండిన ''సక్కుబాయి'' లాంటి నాటకాలను చూడాలి తెలుగు దేశంలో నాటకం పతనం కావటం ప్రారంభించి చాలా కాలమయింది అది ఏనాటికైనా అభ్యుదయ నాటకాల ద్వారానే తిరిగి ఉన్నతికి రావాలి ప్రస్తుతం తెనాలిలో జరుగుతున్న నాటక కళా పరిషత్తు లాటి సంస్థలు అభ్యుదయ నాటకాలను ప్రోత్సహించటానికి తగిన కృషి చెయ్యాలి ఈపరిస్థితిలో నాటక కర్తలకూ, నటులకూ సరి అయిన స్థానం ఇచ్చి విమర్శలతో కూడా వివిధ శాఖలు ఏర్పాటుకు కృషి చేసినట్టయితే అతి త్వరలోనే తెలుగు నాటకాలూ, నాటక ప్రదర్శనాలూకూడా ఉత్తమ సాంఘిక ప్రయోజనాలను తప్పక సాధించగలవు.

*తెన్సాలు, 18-5-51*

# 4. నాటక సాహిత్యం

నాటకసాహిత్యానికి నాటకరంగానికి పరస్పరాధారం ఉన్న సంగతి అందరికీ తెలుసు, కాని ఈ రెంటికీ మధ్య కొంత వైరుధ్యమూ పోటీ, సంఘర్షణా ఉన్నదన్న సంగతి చాలా కొద్దిమందికే తెలిసి ఉండవచ్చు

నాటకసాహిత్యమూ, నాటకరంగమూ, ఒకదానిపైన ఒకటి ఏవిధంగా ఆధారపడి ఉన్నదీ మొదట ఆలోచించి తరువాత వాటిమధ్య గల వైరుధ్యాన్ని గురించి చర్చించుకుందాం.

నాటకం ఒక విశిష్టమైన సాహిత్యరూపం కావటంచేత అది సాహిత్యంగాకూడా ఆస్వాదనీయమైనది. ప్రతి మంచి నాటకమూ చదివే వాడికి కావ్యానందం చేకూర్చుతుంది షేక్స్పియర్ నాటకాలనూ, ప్రసిద్ధ సంస్కృత నాటకాలనూ, కన్యాశుల్కం, ప్రతాపరుద్రీయం మొదలైన నాటకాలను చూసి ఆనందించిన వారికంటే చదివి ఆనందించిన వారే ఎక్కువమంది.

ఆధునిక పాశ్చాత్య నాటకాలలో కొన్ని ప్రదర్శించినప్పుడు కలిగే ఆనందంకంటె చదివితే కలిగే ఆనందమే ఎక్కువ అని ఒక బ్రిటిష్ విమర్శకుడు చెప్పాడు

అయినప్పటికీ నాటక రచనా శిల్పం ఎటువంటిదంటే నాటకం రంగస్థలాన ప్రదర్శించినప్పుడే ఆ శిల్పానికి పూర్తి సార్థక్యం వస్తుంది. ఎందుకంటే, కావ్యాలు,

నవలలు, కథలూ, మొదలైనవి చదివే వారికి ఉండే కొన్ని సౌకర్యాలను నాటక కర్త వదిలేసుకుంటున్నాడు. అతను పాత్రల సంభాషణలనూ, కదలికలనూ మాత్రమే సూచిస్తాడు. రంగస్థలం మీద నటులు ఆహార్య, ఆంగిక వాచికాభినయాల ద్వారా నాటక రచనకు జీవం పోస్తారు. నాటకం చదివిన వారికి కావ్యానందం కలిగినప్పటికీ ప్రదర్శన ద్వారా మరింత రసస్ఫూర్తి కలగటమే గాక నాటక సాహిత్యం సమస్తమైన వారికి ప్రత్యక్షమూ, సన్నిహితమూ అవుతుంది.

ఈ విధంగా, ఈపైన చెప్పినట్లుకు, నాటకసాహిత్యం రంగస్థలంమీద ఆధారపడి ఉన్నది. ఇందుకు సందేహం ఏమీలేదు. కొన్ని నాటకాలు ఆడటానికి కొన్ని చదవటానికి ఎక్కువ బాగుంటాయంటే అందుకు కారణం వాటిలో ''నాటకీయత'' లేకపోవటమే. కథగా చెప్పితే సరిపోయేదాన్ని నాటకరూపంలో రచించి నప్పుడు ప్రదర్శనంవల్ల అది మరింత రక్తికట్టే అవకాశం వుండదు. అట్లాకాకుండా నిజమైన నాటకం తీసుకున్నట్లయితే అది రెండురకాల ఆనందాన్ని ఇస్తుంది. చదివినప్పుడు కావ్యానందాన్ని ఇస్తుంది. ప్రదర్శించినప్పుడు దృశ్య కావ్యానందాన్ని ఇస్తుంది.

ఇక నాటకరంగం నాటక సాహిత్యంపై ఎంతవరకు ఆధారపడి ఉన్నదన్న ప్రశ్నలేదు. అది పూర్తిగా నాటక సాహిత్యంపై ఆధారపడి ఉన్నది. నాటకశాలా, నటులూ, రంగాలంకరణ చేసేవాళ్లూ, అవసరమైన జంత్రవాద్యగాళ్ళూ, దుస్తులూ, విగ్గులూ, నిర్మించేవాళ్లూ, ఇంకా ఇతరులూ నాటక సాహిత్యం లేకపోతే ఏమీ చెయ్యలేరు, నాటకసాహిత్యం లేకపోతేవారికి ఉనికిలేదు.

దీన్ని బట్టి మనం నాటకసాహిత్యానికి నాటకరంగం తీసికట్టు అనుకున్నట్టయితే అది పొరపాటవుతుంది. గొప్ప నాటకసాహిత్యం సృష్టించి నాటకరంగం అసలే లేకుండాపోయిన జాతిని మనం ఊహించలేం. నాటకరంగం అంటూ ఒకటి ఏదో ఒక రూపంలో ఏర్పడకపోతే నాటక సాహిత్యం సృష్టికాదని మన తెలుగు నాటక సాహిత్య చరిత్రే స్పష్టం చేస్తున్నది.

ఎన్నో శతాబ్దాల క్రితమే భాణుడూ, కాళిదాసూ, భవభూతీ, శ్రీహర్షుడూ, విశాఖదత్తుడూ, శూద్రకుడూ మొదలైన మహనీయులు ఉత్తమ కావ్యాల శ్రేణికి చెందిన నాటకాలను, రంగస్థలంమీద ప్రదర్శించబడిన వాటిని రచించారు. వాటిని తెలుగుపండితులు ఎరుగుదురు. అయినా ఎనభై ఏళ్ళ క్రితం వరకూ తెలుగు సాహిత్యంలో నాటకం అవతరించలేదు. యక్షగానాలు, వీధినాటకాలూ, తోలుబొమ్మలూ, ఇవేమనకు దృశ్యకావ్యాలుగా ఉంటూవచ్చాయి. కారణమేమిటి? మనకు రంగస్థలం ఉత్త స్టేజీ మాత్రమేకాదు, నటులూ, వేషధారణకు తోడ్పడేవాళ్ళూ వగైరా లేకపోవటమే.

రాజమహేంద్రవరంలో 1881 లో ధార్వాడ కంపెనీవచ్చి ఒకస్టేజీ ఏర్పాటుచేసి మహారాష్ట్ర భాషలో నాటకాలు ఆడేసరికి, వారు తాత్కాలికంగా ఏర్పాటుచేసిన రంగస్థలం ఆధారంతో మొదటి తెలుగునాటకం - కందుకూరివారి 'అభిజ్ఞాన శాకుంతలం'

అనువాదం - ప్రదర్శించింది ఆయన శుక్రలే పాత్రధారణచేశారు ధార్వాడ కంపెనీవారి స్ఫూర్తితో

ఉత్తమ నాటక సాహిత్యం

ఒక విధంగా తెలుగులో మొట్టమొదట నాటక సాహిత్యం సాహిత్య గౌరవమే ప్రధానంగా ఉన్నట్టు కనిపిస్తుంది రంగస్థలం శైశవంలో ఉండగా ఇలా జరగటం స్వాభావికమే నాటక ప్రదర్శనకు ఆదరణ లభించాలంటే నాటకంలో పస ఉండాలి నటులు అనుభవమూ, సామర్థ్యమూ లేనివారుగా ఉంటారు వారి కృషి ఫలించాలంటే నాటకం యొక్క కావ్యతే శరణ్యం

తొలిదశలో మంచి నాటకాలు రాలేదా అంటే వచ్చాయి ఉత్సాహం మాత్రమే ఉండి శక్తిచాలనివాళ్లు నాటకాలురాస్తే అవి చప్పగా ఉండటం వింతకాదు కాని ఆనాటి రంగస్థలం అటువంటి నాటకాలపై ఆధారపడలేదు వాటి సహాయంతో ముందుకు రాలేదుకూడా.

అందుచేత మనం గణనలోకి తీసుకోవలసినది ఆనాటి సాహితీపరులు సృష్టించి, ప్రశస్తంగా ఆడిన నాటకాలు మాత్రమే తొలి తెలుగు నాటకాలలో ముఖ్యమైనవి సంస్కృత నాటకానువాదాలు - 'అభిజ్ఞాన శాకుంతలం', 'వేణీసంహారం' షేక్స్‌పియర్ నాటకానుసరణలు లాటివి. ఇందులో వింత ఏమీలేదు తెలుగు సాహిత్యంలో ప్రతి ఒక రూపమూ సంస్కృతానువాదాలతోనే ప్రారంభమయింది సంస్కృత సాహిత్యంలో ఆ రూపాలు ఉన్నపుడు

అయితే త్వరలోనే స్వతంత్ర రచనలైన తెలుగు నాటకాలు బయలుదేరి ఎక్కువ జనాదరణ పొందాయి. వీటిలో కొన్ని పురాణ కథలకు చెందినవి - ''చిత్రనళీయం'' 'ప్రసన్నయాదవం', 'సంపూర్ణరామాయణం', 'పాండవోద్యోగం', 'పాండవవిజయం', ''సత్యహరిశ్చంద్రీయం' మొదలైనవి కొన్ని పుక్కిటి పురాణాలు - 'గయోపాఖ్యానం', 'శ్రీకృష్ణ తులాభారం' వంటివి.

ఈ నాటకాలు ఈనాడు మనకు ఎట్లాకనిపించినా ఆనాడవి ఉత్తమ సాహిత్యం, ఆనాటి ఉత్తమ సాహితీపరులు రచించినవి. ఆనాటి నాటకరంగం ఈ నాటకాలను ప్రదర్శించి కీర్తిప్రతిష్ఠలు ఆర్జించుకున్నది. ఆ నాటకాలలోని పాత్రలకు జీవంపోసిన నటులు ఆనాటి మహానటులు - హరిప్రసాదరావు ముప్పిడి జగ్గరాజు మొదలైనవారు. ఆ దశలో నాటక సాహిత్యానికీ రంగస్థలానికీ మధ్య హెచ్చు సామరస్యం ఉన్నదనే చెప్పాలి.

నటుల విజృంభణ

అటు తరువాత అంతకంటే ఆకర్షణీయమైన నాటక ప్రదర్శనలు రాలేదనికాదు అంతకంటె చాలరెట్లు జన ప్రియమైన నాటక ప్రదర్శనలే వచ్చాయి. కాని నాటక సాహిత్యానికీ, నాటక రంగానికి ఉండే సామరస్యం క్రమంగా క్షీణించ సాగింది.

నాటకరంగం నాటక సాహిత్యంపైన ఎటువంటి విజయం సాధించింది. ఈ విజయానికి తోడ్పడినవారు గొప్ప నటులు. ... గొప్ప నాటకాలలోని పాత్రలకు ప్రాణంపోసి కీర్తిగడించారు ... అయితే అవి రచనా ప్రాధాన్యంతో కాదు. ధరించిన పాత్రలకు - కనీసం కొన్నింటికి - ప్రజాదరణ సంపాదించిపెట్టి, తమ నాటకాలకు ... వ్యాప్తి సాధించిపెట్టారు. బళ్ళారి రాఘవాచారిగారు 'రామదాసు', 'రామరాజు', 'పద్మిని', ... నాటకాలలో రామదాసు, పఠాన్, హిరణ్యకశిపుడు, చాణక్యుడు పాత్రలు ధరించి ఆ నాటకాలకు పూర్వం ఉన్నదానికంటె అధికంగా కీర్తి ప్రచారాలు తెచ్చారు. అట్లాగే యడవల్లి సూర్యనారాయణగారు 'శకుంతల', 'రత్నావళి', 'ద్రౌపది' నాటకాలకూ స్థానం వారు 'రోషనార', 'చిత్రాంగి', 'కన్యాశుల్కం', 'తులాభారం' నాటకాలకూ, పారుపల్లి సుబ్బారావుగారు 'రాధాకృష్ణ' నాటకానికి, అద్దంకివారు 'పాదుక'కూ, ముంజులూరివారు 'వరవిక్రయం'కూ ఈ విధంగా అనేక మంది గొప్ప నటులు ఆయా నాటకాలకు ప్రఖ్యాతి, ప్రచారము సాధించారు. ఈ జాబితా చాలా పెద్దది. గొప్ప నటులలో ఎంతో ప్రాంతీయులున్నారు.

గొప్పనటుల ద్వారా ప్రజాదరణపొందిన నాటకాలు సాహిత్యం దృష్ట్యా ఒకస్థాయికి చెందినవి కావు. అవి సంపాదించుకున్న ప్రచారానికీ, వాటికి గల సాహిత్య గౌరవానికి ఆట్టే సంబంధంలేదు.

అందుచేతనే ఇది నాటక సాహిత్యానికి కాకనాటక రంగానికి దక్కిన విజయమనాలి. ఈ విజయం అతి విచిత్రమైన పరిణామాలకు దారితీసింది. నటుల పేరు ముందు నాటకకర్తలపేరు చిన్నదైపోయింది. కందుకూరి, ధర్మవరం, చిలకమర్తి, వేదం, పద్మరాజు, పానుగంటి మొదలైన పేర్లకు వచ్చిన ఘనత శ్రీరాముల సచ్చిదానంద శాస్త్రి, వారణాసి సీతారామశాస్త్రి, కొప్పరపు సుబ్బారావు ప్రభృతులకు ప్రేక్షకలోకంలో రాలేదు. అయినా వీరినాటకాలే ఎక్కువమంది చూశారు.

ఈ పరిణామాన్ని అడ్డగించినవారు లేరని కాదు. గొప్పనటుల సహాయం లేకుండా తమ రచనతోనే ప్రజాదరణ సంపాదించుకున్న నాటకకర్తలలో అగ్రగణ్యుడుగా చెప్పదగిన వాడు కాళ్లకూరి నారాయణరావు. ఆయన దాదాపు ఏ నటబృందమైనా రక్తి గట్టించగల 'చింతామణి' 'మధుసేవ' 'వరవిక్రయం' నాటకాలు రాసి వాటిని జయప్రదం చేశారు.

అయినా గొప్పనటుల ద్వారా నాటకరంగం నాటక సాహిత్యంపైన సంపాదించుకున్న విజయందక్కింది. దక్కటమేగాక అది విచిత్ర పరిణామాలకు కూడా దారితీసింది. నటులు కీర్తి ప్రతిష్టలు సంపాదించు కోవటంతో నాటకసమాజాల పేరు వెనకపడింది. ఒక్కొక్క ప్రముఖ నటుడూ ఒక్కొక్క నాటక సమాజం ఏర్పాటు చేసుకున్నాడు. నాటకాలకు కంట్రాక్టర్లు బయలు దేరారు. కిరాయినాటకాలు అమలులోకి వచ్చాయి. ''అపూర్వ నటసమ్మేళనాయి'' కంట్రాక్టర్ల సహాయం లేకుండా సాధ్యంకావు

కంట్రాక్టర్లు తమకన్నా నటులకూ ఆర్థికంగా ఉపయోగకారి అని రుజువు చేశారు. (ఇక్కడ చేతులు కాల్చుకొన్న కంట్రాక్టర్లనూ, గల్లా పెట్టెలతో పారిపోయిన వారిని ఏమనేద్దాం) ప్రజల దృష్ట్యా నలుగురు పెద్దనటులు ఒక్కసారి స్టేజీమీదికి రావటం అపూర్వమూ, ఆకర్షణీయమూ అనిపించింది ట్రూపులను వెంటవేసుకుని, లాడ్జీలనడిపి, ప్రయాణాలుచేసి, హాల్సుమాట్లాడి, టిక్కెట్లు అమ్మి, గేట్లలో తమ మనుష్యులను పెట్టి, పోస్టర్లు హాండ్ బిల్లులూ పంచిపెట్టించి హైరానపడి ఊరూరూ తిరగకుండా ఆంధ్రదేశంలో ప్రతిమూలకూ పైబట్టతో వెళ్ళి, కోటావేసుకుని, నిష్పూచీగా అడంగుకు చేరటం గొప్పనటులకు సుఖప్రదమూ, లాభదాయకమూ, కీర్తివంతమూ అయింది నాటక సమాజాలు నిర్వహించి ఏడాదిలో సంపాదించే మొత్తాలు గొప్పనటులకు ఒకటి రెండు నెలల్లో ముట్టేపరిస్థితి కూడా వచ్చింది

అయినప్పటికీ కొందరు నటులు సమాజాలను పూర్తిగా వదిలిపెట్టలేదు అంటే స్టార్ వాల్యూలేని అప్రెంటిస్ నటులను తరిఫీదు చేస్తూ, చవుకగా సమాజాలను నిర్వహించి, ఖాళీగా ఉన్నప్పుడు ప్రదర్శనలు ఇస్తూ అచ్చుగా తమ పేరుతోనే ప్రేక్షకులను ఆకర్షించి, రంజింపజేసి కాలక్షేపం చేశారు.

అవి నాటక రంగానికి స్వర్గదినాలు, ఆరోజులలోనే దాదాపు కొత్తనాటకాలంటూ రాకుండా పోయాయి. దారితప్పి ఒకటీ అరా వచ్చినా అవి ''ప్రయోగార్థం'' నటులు రాయించుకున్నవే అవి సాహిత్యం కిందికి వస్తాయని నటులుగాని ప్రేక్షకులుగాని, విమర్శకులుగాని, అనుకోలేదు

## సంగీతం విజృంభణ

గొప్ప తెలుగునటుల కీర్తిదిక్కులు ఒరుసుకుంటూ ఉండగా ఇంకొక పక్కనుంచి గాయకనటులు రంగస్థలానికి మరొక అఖండ విజయం సాధించిపెట్టారు

తెలుగులో నాటకాలు పుట్టిన కొత్తలోనే రచించబడిన ''కన్యాశుల్కం'' మినహాయిస్తే ప్రతి నాటకంలోనూ పద్యాలుండేవి. వాటిని ఆనాటి స్టేజీనటులు తమకు చాతనయినంత శ్రావ్యంగానూ, భావయుక్తంగానూ పాడుతూ వచ్చారు. నాటకాలలోని సంభాషణలు కృత్రిమంగా ఉండటంచేత పద్యాలు పాడుకుంటే అంత పట్టిచ్చేదికాదు. కాకపోయినా ఆ పద్య పఠనం ''గానం'' అనిపించుకునే దశకు వచ్చేదికాదు.

అటువంటిదల్లా క్రమంగా స్టేజిమీద పాట ప్రాముఖ్యం సంపాదించుకో సాగింది. బాగా నటించగల నటులకన్న బాగా పాడగలనటులు అధికంగా జనాన్ని ఆకర్షించసాగారు. రంగస్థలంమీద సంగీతానికి ప్రాముఖ్యం రావటం నాటక సాహిత్యంపైన నాటకరంగం సాధించుకున్న రెండవ ఘనవిజయం. ఈ పరిణామానికి దోహదం చేసినవారిలో అగ్రగణ్యుడు పావట్ల లక్ష్మీకాంతయ్యగారు. ఆయన చెప్పుకోదగినంత గొప్ప కవి కాకపోయినా పండితుడూ, సంగీత విద్వాంసుడూనూ,

ఎన్నో నాటకాలలో ఆయన హిందుస్థానీ సంగీత బాణీలో రచించిన పాటలు ఆంధ్రదేశమంతటా అందరినోళ్ళా పలకటమే గాక నాటకాల ప్రచారానికి అద్భుతంగా తోడ్పడ్డాయి. వారి తరువాత దైతా గోపాలంగారిని కూడా చెప్పుకోవాలి. ఆయన రచించిన 'సక్కుబాయి' పాటలువిని ఆనందించని నాటక ప్రేక్షకులు ఆ రోజులలో లేరు.

రంగస్థలాన పాటకు ప్రాముఖ్యం బలపడుతున్నకొద్దీ గాయకులకు కూడా ఉన్నతస్థానం లభించింది. అటువంటి స్టేజి గాయకులలో కపిలవాయి రామనాథశాస్త్రి ఒకరు. సినిమారంగం శ్రావ్యమైన గాత్రాలను గాక అందమైన ముఖాలను ఆదరించింది. అందుచేత సినిమా సంగీతం స్టేజి సంగీతంతో పోటీ చెయ్యలేక పోయింది. ప్లేబాక్ పద్ధతి వచ్చినదాకా! ఆ తరువాత నాటక రంగం తనకున్న ఒక్క విశిష్టతనూ కోల్పోయి పతనమైపోయింది - తాత్కాలికంగానే అనుకోండి.

ఈ విధంగా నాటకరంగం నాటక సాహిత్యం పైన సాధించిన విజయ పరంపర నాటక సాహిత్యాన్ని దెబ్బతియ్యటమే గాక, నాటకరంగం యొక్క పతనానికే దారితీసింది.

**నాటక సాహిత్య పునరుజ్జీవనం**

సినిమా మూలంగా నాటకాలూ, నాటక రంగమూకూడా అడుగంటిన దశలో, గత యుద్ధ కాలంలో, ప్రజలలో ఒక భావచైతన్యం వచ్చింది. యుద్ధకాల పరిస్థితుల ఫలితంగా కొత్తసాంఘిక, ఆర్థిక, రాజకీయ భావాలు ప్రజలలో వ్యాప్తిచెందాయి. వీటివల్ల ప్రజలలో కలిగిన ఉత్తేజం ఫలితంగానూ, ఉత్తేజాన్ని కలిగించే సాధనాలుగా కూడానూ కొత్తకళలు వ్యాప్తిలోకి వచ్చాయి. బుర్రకథలూ, వీధిభాగోతాలూ, జానపద నృత్యాలూ, నాటకాలూ వగైరా మూసలు పాతవే అయినా అందులో కలిగిన భావాలు కొత్తవి. వర్తమానానికీ, విశాల జీవితానికీ సంబంధించినవి. వీటిని ప్రజానాట్యమండలి ప్రచారం చేసింది.

ప్రజా నాట్యమండలి ప్రోత్సహించిన కళలలో మనకిక్కడ ముఖ్యమైనవి నాటకాలు, వాటిలోనూ మొదట వచ్చినవి రెండే, 'ముందడుగూ', 'మాభూమీ'.

ఇవిరెండూ వాస్తవ జీవిత సంఘర్షణను చిత్రించిన నాటకాలు, వీటిని అసంఖ్యాకులైన ప్రజలు ఎగబడి చూశారు. ఎంతో కాలానికి మళ్ళీ నాటక సాహిత్యం నాటకరంగం పైన ఘనవిజయం సాధించింది. ఈ నాటకాలను ప్రజల హృదయాలకు హత్తుకునేటట్టు చేసినది ''తారత్వం'' సాధించిన ఖ్యాతిగల నటులు కాదు, సంగీతంతో గానమాధుర్యంలో ఓలలాడించిన గాయకులూ కాదు. ఆ నాటకాలే - వాటిలో వ్యక్తమైన వాస్తవిక, సాంఘిక చిత్రణమే - విజయం సాధించటం జరిగింది. సాహిత్యచరిత్ర దృష్ట్యా ఇదిచాలా గొప్ప విషయం. ఎందుకంటే ఈ నాటకాలు వచ్చేనాటికి నాటక సాహిత్యం పతనం కావటం ఆరంభమై చాలాకాలమయింది. సుంకర వాసిరెడ్డి ద్వయం నాటకసాహిత్య చరిత్రలో ఒక కొత్త అధ్యాయం ప్రారంభించారు.

ఈ సాహిత్యప్రక్రియ శీఘ్రంగా విస్తరించింది. ఆత్రేయ, అనిశెట్టి మొదలైనవారు అభ్యుదయ పంథాలో నాటకాలు రాశారు, ఆడించారు. అపకారాద [illegible] రాజకీయ కారణాలవల్ల ప్రజానాట్యమండలి ప్రవృత్తివల్ల ఈ ఉద్యమం [illegible]

కాని అభ్యుదయ నాటకసాహిత్యం ఆగిపోలేదు. అనేకమంది యువనాటకకర్తలు సాంఘిక సమస్యలను చిత్రిస్తూ, నాటకాలూ, నాటికలూ, రాస్తున్నారు. వీటిని ఔత్సాహికులు జయప్రదంగా ఆడుతున్నారు. అయితే ఈసారి క్షామం రంగస్థలానికి వచ్చింది. ఇలాంటినాటక సాహిత్యం విరివిగా అభివృద్ధి చెందటానికి తగినంతగా దేశంలో రంగస్థలాలు లేవు. ప్రతిబస్తీలోనూ ఒక మంచి హాలు నాటకాలకోసం ప్రత్యేకించి ఉంచినట్టయితే వందలకొద్దీ మంచి నటులు దేశంలో ఉన్నారు. వందల సంఖ్యలో ఉత్తమ నాటకాలుకూడా రాగలవు. ప్రభుత్వమో, మునిసిపాలిటీలో, నాటక పరిషత్తులో ఇలువంటి ఏర్పాటు చేసిననాడు తెలుగు నాటక సాహిత్యానికి మంచి భవిష్యత్తున్నది.

*జ్వాల వారపత్రిక 31-7-1961*

# 5. నేటి నాటక కళ స్థితిగతులు

ఈనాటి సమాజంలో పూర్వశిలాయుగం మొదలుకొని అంతరిక్షయాన యుగం వరకూ గల అన్ని రకాల మనస్తత్వాలూ ఉండటం నేను గమనిస్తున్నాను. ఎవరెంత విడ్డూరమైన తిరోగమన సిద్ధాంతాలు రియాక్షనరీ భావాలు బయట పెట్టినా నేను ఒకంతట విస్మయం చెందను. కాని డిసెంబరు 'ఆంధ్రప్రదేశ్' సంచికలో శ్రీ శిష్ట్లా రామకృష్ణశాస్త్రిగారి ''నేటి ఆంధ్రనాటకరంగ సమస్య'' అన్నవ్యాసం చూసి నేను ఆశ్చర్యంతో దిగ్భ్రాంతి పొందానని చెప్పక తప్పదు. తెలుగు నాటకరంగం దీనస్థితిలో ఉన్నప్పటికీ, నాటక కళా విమర్శ అంతకంటే అధ్వాన్నపు స్థితిలో ఉన్నదనటానికి శ్రీ శాస్త్రిగారి ఈ 14 పేజీల వ్యాసం చక్కని ఉదాహరణ. నేను ఆశించేదల్లా ఈ వ్యాసాన్ని ఎవరూ సీరియస్‌గా తీసుకోరనే!

మొక్కలు ఆకాశంకేసి పెరగటం ఎంత స్వాభావికమో కళలు వాస్తవికత కేసి పురోగమించటం అంత స్వాభావికం. ఇది నాటక కళకు కూడా వర్తిస్తుంది. ఇంచుమించు 45 ఏళ్లక్రితం మా అన్నా, ఆయన మిత్రులూ వాస్తవికత వల్ల ఏర్పడే సమస్యలను చర్చించటం నాకింకా జ్ఞాపకం, వాళ్ళు 'బొబ్బిలి' నాటకంలో హైదర్‌జంగ్ భాషగురించి మాట్లాడుకున్నారు. హైదర్‌జంగ్ ఉర్దూ తెలుగు మిశ్రమం మాట్లాడుతాడు. తెలుగు

ప్రేక్షకులకు ఎన్నెన్ని అభిప్రాయాలు తెలుస్తాయి. [illegible] తెలుగు ప్రేక్షకులకు అర్థం కావటంలేదనే హైదర్‌జంగ్ కఠినమైన మాటలు తెలుగులో [illegible] మాటలు ఉర్దూలో [illegible] ఇది పూర్తిగా [illegible] హైదర్ [illegible] మాటలకే తెలుగు [illegible] మాటిమాటికీ [illegible] హైదర్‌జంగ్ వాడే [illegible] గా [illegible] ప్రేక్షకులు [illegible] ఇదే సమస్య

కాని (శ్రీ) శాస్త్రిగారు ఏకంగా వాస్తవికతకే ఎసరుపెట్టేశారు. ''స్వాభావికం' అతిగా పెంచుకోవటం నాటకకళకు చేటు పుట్టించిందన్నారు. ఎలాగో నాటకాలలో సంగీతమూ, కవిత్వమూ, లేకుండా చేశారు ముఖ్యపాత్రలకు కూడా 'పప్పు'(?) వ్యావహారిక భాష వాడారు. నీచపాత్ర, నాయకపాత్ర ఒకే భాష మాట్లాడాయి. శాస్త్రిగారు స్వభావ వాదాన్ని పూర్తిగా కొట్టెయ్యలేరు నీచ పాత్ర గ్రాంథిక భాష మాట్లాడితే అసహజంగా ఉండేదని ఒప్పుకున్నారు, నాయక పాత్ర, నీచపాత్రవ్యవహారికమే మాట్లాడటం కూడా అసహజంగానే ఉందంటున్నారు గ్రాంథిక భాష ఏ పాత్రకైనా ఉచితంగా ఉండదనీ, నిత్య వ్యవహారంలో ఉండే భాషలో అన్ని పాత్రలకూ ఉచితమైన భాష ఉన్నదనీ, నాటకం రాయటం అంతో ఇంతో చాతనయిన వారందరూ పాత్రోచితభాష వాడుతున్నారనీ శాస్త్రిగారికి తెలిసినట్టు కనబడదు

అదే విధంగా ఆయనకు పద్యాలుండటం అభినయానికి అంతరాయంగా కనిపించలేదు. సంగీతంతో రాగాలాపనచేసి, పాటకచేరీ చెయ్యటం అభినయానికి అంతరాయంగా తోచింది కొందరు స్టేజిమీద అతిగా పాడటం చేతనే అసలు పద్యాలే ఉండరాదన్న వాదం బయలుదేరిందని శాస్త్రిగారి ఊహ! నాటక కళాపరిణామం అన్ని దేశాలలోనూ 'కవిత్వాన్ని' విసర్జించిందని ఆయనకు తెలియదు, అసలు ఆనాటకకళ పరిణామం చెందుతున్నదనే విషయాన్ని కూడా ఆయన పాటించటంలేదు. అందుకే ఆయన, ''క్రౌంచ మిథునాన్ని చూసి వాల్మీకి పొందిన జాలే శ్లోకంగా వెలువడి దాని మూలంగా రామాయణం పుట్టింది కనుక నాటకాలలో పద్యాలుండాలం'' టున్నారు. ఏనాడో షేక్స్పియర్ తన నాటకాలలో పద్యాలు రాశాడు గనుక మనం పద్యాలు రాయాలంటున్నారు పద్యాలు పాడే వృత్తాలలో ఉండరాదన్న పానుగంటివారి సిద్ధాంతాన్ని కూడా ఆయన కొట్టేశారు

నటుల దుష్ప్రవర్తన, నాటక కళను 'బజారుకళ' గా చేసి పామరుల అభిరుచులను గౌరవించి, ఉదాత్తమైన అభిరుచులను జారవిడవటమే నాటకకళ క్షీణించటానికి కారణమని వారు తేల్చేశారు.

నాటకకళకు సంబంధించిన అసలు సమస్య చాలా జటిలమైనది. నాటక తత్వమూ, నాటకకళా పరిణామమూ, అర్థమై, అపారమైన నాటకానుభవం గలవారికి కూడా ఇది గడ్డు సమస్యగానే వున్నప్పుడు క్రీస్తు పూర్వపు అభిప్రాయాలు గలవారికి ఇవి

కొరుకుడు పడటం అసంభవం నాటకాలు రాసేవాళ్ళకు పేరుపురుగులూ, ఆడేవాళ్ళకు ముప్పుపర్తనా, చూసేవాళ్ళకు పామరత్వమూ అంటగట్టిన మాత్రాన నాటకరంగ స్థల సమస్య పరిష్కారమవుతుందా ప్రశ్న!

నాటకకళ జనసామాన్యాన్ని చేరలేకనే దెబ్బతిన్నది ఎక్కువ, తక్కువ అభిరుచుల సమస్య మౌలిక సమస్యకాదు, వ్యక్తులకు సంబంధించినది తక్కువ అభిరుచులు గల పుస్తకాలున్నాయి సినిమాలున్నాయి వాటి మూలంగా సాహిత్యకళా, సినిమాకళా పురుగుముట్టి పోవటంలేదు

నాటక రచనా, ఇతివృత్తమూ, పాత్రలూ, సన్నివేశాలూ, సమస్యలూ ప్రజలకు సన్నిహితమైనవిగా వుండి వాస్తవికత గలవై, ప్రజలలో చైతన్యం పొందించ గలిగితే నాటక కళ రాణిస్తుంది.

ఈనాడు తెలుగు నాటక కళ యొక్క అభ్యుదయానికి అడ్డుగా ఉన్నది నాటక కళ యొక్క ''అంతరంగిక'' సమస్యలు కావు. మనకు మంచి నాటకకర్తలున్నారు, నటులున్నారు. ముఖ్యంగా ఔత్సాహికులలో ఎంతో ప్రతిభ ఇమిడి ఉన్నది కాని 'బాహ్య' పరిస్థితులు అనుకూలించని కారణంచేత వీరి ఉత్సాహశక్తులు అడవిగాచిన వెన్నెల అయిపోతున్నాయి నాటకాల పోటీలు జరిగినప్పుడు వెళ్ళి వాటిలో పాల్గొనటానికి కూడా వారికి స్తోమత చాలదు

ఇది ప్రప్రథమంగా ఆర్థిక సమస్య. మనదేశంలో అన్ని కళలను ఔత్సాహికులే ముందుకు తోసుకు పోతున్నారు ఒక్క కళ గట్టిగా పదిమందికి కూడా పెట్టటం లేదు సినిమాలు వచ్చి కొద్ది మంది కళాకారులకు రచయితలకు, నటులకు, గాయకులకు, చిత్రకారులకు, నాట్యంచేసే వారికి – జీవనోపాధి కల్పించాయి అదే విధంగా రేడియో కూడా కొద్దిమందికి ఆర్థికసహాయం చేయగలుగుతున్నది. కాని దేశంలో అధిక సంఖ్యాకులైన రచయితలు, కవులు, చిత్రకారులు, తదితరులు భుక్తికోసం మరేవో వృత్తులలో కాలక్షేపం చేస్తున్నారు. అందువల్ల పెద్దగా కళలునష్ట పోటంలేదు

దురదృష్టవశాత్తూ నాటకకళ అలాటిదికాదు. నాటక సమాజాలను అంటిపెట్టుకున్న నాటకకర్తలు మంచి నాటకాలు రాస్తారు నటన వృత్తిగా పెట్టుకో గలిగినవారు బాగానటిస్తారు. చెర్కాసవ్‌లాంటి అసాధారణ నటుడు ఒకే పాత్రను నూరు ప్రదర్శనాలలో నటిస్తే ప్రతిసారీ తన నటన మరింత పటిష్టమవుతూ వచ్చిందన్నాడు. నాటక కళ అభివృద్ధి కావాలంటే అది ఔత్సాహికుల ద్వారా అయేకాలం పోయింది (ఇది పోవటం 1920 నాటికే ఆరంభమయింది.) నాటక ప్రదర్శనల విజయానికి ఈనాడు ప్రధానమైన వాటిలో పెట్టుబడి అత్యంత ప్రధానమైనది సినిమాలకు లాగే నాటకాలకు కూడా ప్రొడ్యూసర్లు అవసరం.

పెట్టుబడి విధానం మంచిదని నేననను – ప్రస్తుతం అనివార్యం ఇందువల్ల చాలా కశ్మలం తయారవుతోంది నీచమైన అభిరుచుల పేట సాగుతుంది. వ్యాపారపు

పోటీ ఉంటుంది సరియైన, నాటకకర్తల శ్రమశక్తిని లేక కళాశక్తిని - దోచుకోవటం ఉంటుంది ఇదంతా లేకుండా జరిగిపోవాలంటే ప్రభుత్వం నాటక ప్రదర్శనలను జాతీయం చెయ్యాలి అప్పుడు బ్యూరోక్రాట్ల అజమాయిషీ ఉంటుంది

ఇది చాలా పెద్ద సంఘర్షణతో కూడిన సమస్య ఈ సంఘర్షణలను ఎదుర్కోవటానికి సిద్ధపడి ఏదో ఒక వేపు ముందడుగు వెయ్యాలి నామటుకు నేను ఇప్పటి పరిస్థితిలో నాటకకళ పెట్టుబడిదార్ల కిందికి వెళ్ళటం మంచిదని భావిస్తాను. పెట్టుబడి దారీ కింద నాటకకళ గొప్ప సాంఘిక విజయం సాధించలేక పోయినా కొంత వాస్తవికతనూ, ప్రజాదరణనూ సంపాదించుకుంటుంది అటునుంచి అభ్యుదయ నాటక కళ కోసం సంఘర్షణ ప్రారంభించటం కొంత తేలిక కావచ్చు.

*విశాలాంధ్ర దినపత్రిక, 24-12-1996*

## 6. నాటకాల అవసరం

ఇటీవల నాట్యకళా పరిషత్తు వారి నాటకాలపోటీ జరిగింది. ప్రదర్శనలపై సమీక్షలుకూడా వెలువడ్డాయి. పోటీలలో మూడు బహుమానాలు తెచ్చుకున్న ఆంధ్ర ఆర్ట్స్ వారికి మద్రాసు ' ఇప్టా' వారు చక్కని సన్మానం చెయ్యటం కూడా జరిగిపోయింది.

సినిమాలు వచ్చి నాటకాలను వెనక్కు తోసినప్పటికీ నాటకానికి వుండే ప్రముఖ స్థానాన్ని సినిమా కాజెయ్యలేక పోయిందన్నది నాటక ప్రదర్శనలు చూస్తుంటే స్పష్టమవుతున్నది. అటువంటి సందర్భంలో పోటీలకు చచ్చు నాటకాలు వస్తూ ఉండటం శోచనీయం. సినిమాలకు ఓడిపోయినంత మాత్రాన నాటకకళ ఆత్మహత్య చేసుకోవాలా? అలాటి అవసరం లేదు సరేకాదా, సినిమాలు సాధించలేని అంశాలను మరింత బలంగా ప్రదర్శించి నాటకాలు ఆత్మరక్షణకు పూనుకోవలసి ఉన్నది. దేశంలో నాటకకళను అభిమానించి ఆదరించే అసంఖ్యాకులైన వ్యక్తులు, సంస్థలూ ఈ అంశాలను ప్రోత్సహించటం ఎంతైనా అవసరమనితోస్తుంది. అందుచేత సినిమాలకన్న ఏయే అంశాలలో నాటకం బలిష్టమైనదో ఒక్కసారి గుర్తుకు తెస్తాను.

ముందు సినిమా అధినేతలను బేరీజువేద్దాం. ప్రేక్షకుణ్ణి సినిమా వివిధ ప్రదేశాలకు తీసుకు పోతుంది, కార్లమీద, రైళ్ళలోనూ మోసుకుని కూడా పోతుంది. సినిమా ప్రేక్షకుడు చూసే కొన్ని స్థలాలు నిజమైనవి కూడా కావచ్చు. నాటకం ఈ పని చెయ్యలేదు. చెయ్యదు, చెయ్యటానికి యత్నించదుకూడా. అయితే, ఇది కెమెరా అనే ప్రత్యేక పరికరంతో సాధ్యమవుతున్నటు వంటిది. దానికి నాటక ''కళతో ఏమీసంబంధం లేదు. సినిమా లోకేషన్ల సంఖ్య ఎంత హెచ్చుగా వుంటే సినిమా

ఎంతక్లిష్టమయినవయినా ఎటువంటి అంశాలు సినిమాలో ట్రాలీషాట్లు, క్రేన్ షాట్లు, క్లోజప్‌లు మొదలైనవన్నీ ఇదే బలగాలి కంటికి వస్తాయి

ఎన్నిసార్లయినా రెండు, మూడు మేకప్ లోటూ మార్పులు చెయ్యటానికి సినిమాలో ఉండే అవకాశాలు సినిమా నాటకంలో వుండవు. సినిమాలో ట్రిక్‌ఫోటో గ్రఫీ చూపించి వెంగ్యానికి లేదు (విఠలాచార్య స్టేజి, పైర్ విఠలాచార్య సినిమాలకు పేరుంది!)

ఒకే నటుడు కథయొక్క అవసరాన్ని బట్టి రెండు పాత్రలు ధరించవలసివస్తే, నాటక రంగం మీద రెండు పాత్రలు ఒకేసారి రావటానికి వీలులేదు సరికదా, ఒక పాత్ర నిష్క్రమించి మేకప్ మార్చుకునేదాకా రెండో పాత్రను రంగస్థలం మీద రానివ్వటానికి వీలులేదు (మామా వరేర్కార్ రాసిన ''జైభవానీ'' నాటకంలో ఒకే నటుడు హీరోజీ శివాజీ పాత్రల ధరించగలందుకు ఇలాంటి అవకాశాన్ని కల్పించాడు ) కాని సినిమాల్లో ఒకే వ్యక్తి రెండు పాత్రలు ధరించి ఒకే సారి తెరమీద కనిపించటమేగాక ఒకరి నొకరు తన్నుకోవటం కూడా చూపించవచ్చు. (ఉదా జెమినీ వారి అపూర్వ సహోదరులు) ఈ సౌకర్యం సినిమా చిత్ర నిర్మాణ విధానం వల్ల ఏర్పడుతున్నది. ముఖ్యంగా షాట్ టేకింగ్, ఎడిటింగ్ నాటకం ఎంతసేపు చూస్తామో అంతసేపట్లోనే జరగాలి మూడుగంటల సినిమా చిత్రాన్ని సంవత్సరం పాటు సినిమా తీయవచ్చు. ఇది కూడా నాటకకళకు సంబంధించిన అంశంకాదు, ఒక విధానానికి సంబంధించినది ఒక చిత్రంలో వుండే షాట్‌ల సంఖ్యకు, చిత్రం రక్తికట్టటానికీ సంబంధంలేదు. అంతమాత్రంచేతపైన చెప్పిన అంశాలు పరోక్షంగా ''కళ''కు తోడ్పడవనుకోరాదు. వాటి ద్వారా వాస్తవికత సినిమాలలో హెచ్చుగా సాధ్యమవుతున్నది. రాత్రీ, పగలూ, కొండలూ, నీరూ, దారిలో జరిగే సంభాషణలూ మొదలైన అసంఖ్యాక విషయాలు స్టేజిమీద వాస్తవంగా చూడటం సాధ్యం కాదు. సినిమాలలో సాధ్యం సాధారణంగా మనం చూసే సినిమాలలోని కథలలోనూ, పాత్ర పోషణలోనూ, పాత్రల ప్రవర్తనలోనూ వాస్తవికత లోపించటంవల్ల పైన చెప్పిన వాస్తవికత రాణించకుండా ఉన్నదిగాని, వాస్తవికతలే పునాదిగా సినిమాలు తీసినట్టయితే నాటకాలు ఏమాత్రమూ పోటీ చేయ్యలేక పోను, పెద్ద పెద్ద ఆర్కెస్ట్రాలతో కూడిన పాటలూ, యుగళగానాలూ, డాన్సులూ, సినిమాలలో ఉండవలసిన వాస్తవికతను తినేస్తున్నాయి. అందుచేత నాటకాలలో అముఖ్యమైన వాస్తవికత లోపిస్తే అది అంతగా పట్టివ్వదు.

ఇంకొక్క విషయంలో కూడా సినిమాదే పై చెయ్యి. కదనం యొక్క వేగంలో అందుచే తనే మూడు గంటల సినిమాలో ప్రదర్శించినంత కథ మూడుగంటల నాటకంలో ప్రదర్శించడం సాధ్యంకాదు, (ఈ సౌకర్యాన్నికూడా పాటలూ, డాన్సులూ మొదలైన వాటితో సినిమాలు కోల్పోతున్నాయి.)

ఇవి తప్పిస్తే మిగిలిన అన్ని విషయాలలోనూ నాటకం కంటే సినిమాదే కింది చెయ్యి నా ఉద్దేశంలో నాటకంగాని, సినిమాగాని చూసేవారు ''కథ'' కోసం ఆశించరు.

కనుక కావలసినవాళ్ళు కథలూ, నవలలూ చదువుకుంటారు, నాటకాల లోనూ, సినిమాలలోనూ కథ ఉండవలసిందేగాని దాని కన్నా ముఖ్యమైనది కథాంశాలకూ, సన్నివేశాల ప్రదర్శనా, పాత్రల ప్రవర్తనా మొదలైనవి చెప్పే నాటకీయత ఎటువంటిది ఈ నాటకీయతలను పెంచేది, కలిసి పోయేది స్టేజీమీద, సినిమాలోనూ కూడా దర్శకులకూ, నటులకూ ముఖ్య ధైర్యంగా చేయగల సామర్థ్యం చూపిస్తారు

ఈ నాటకీయతను సాధించటంలో రంగస్థల నటుడికి గల అవకాశాలలో సినిమా నటుడికి ఎంతో ఉండదు. పాత్ర యొక్క స్వభావాన్ని చిత్రించటంలో స్టేజినటుడికుండే సామర్థ్యంలో అధికభాగం తెరమీదికి రాగానే హరించి పోయినట్లవుతుంది. ఇందుకు గల కారణాలన్నీ నాకు స్పష్టంగా తెలియవు. ఒకటి, రెండు కారణాలు శంకించవచ్చు. సినిమా నటులు కొన్ని రకాల ముఖభంగిమలకు తమ నటనను పరిమితం చేసుకుంటారు. కారణం అవి బాగా ఫోటోగ్రాఫ్ కావటమో, జనాన్ని ఆకర్షించటమో కావచ్చు. లేక, సినిమా నటులు తమ నటనను తాము చూసుకోగలరు గనక కొన్ని రకాల ముఖభంగిమలు మాత్రమే తమ ముఖానికి నప్పుతాయని నిర్ణయించుకోవటం జరగవచ్చు. ఇది అటుంచి, సినీనటుడు ఒకోసారి క్లోజప్‌లో నటిస్తాడు. మరోసారి మిడ్‌షాట్‌లోనూ, ఒక్కోసారి లాంగ్‌షాట్‌లోనూ నటిస్తాడు. ఈ నటనలలో కొన్ని తేడాలు తప్పని సరిగా ఉంటాయి. స్టేజి నటుడికి ఈ బెడదలు లేవు. స్టేజి నటుడు తన భంగిమలను సందర్భానుసారంగా మార్చి, ప్రతి ఇమోషన్‌లోనూ అనేకరకాల ఛాయలు ప్రదర్శించటానికి కృషిచేయవచ్చు. ఇదే కాక స్టేజినటుడు ఒక ఇమోషన్‌ను ప్రేక్షకుల ఎదుట ''బిల్డప్'' చేయవచ్చు. రాజబాబులాటి నటుడు రెండు మూడు నిమిషాల టైం తీసుకుని ఆందోళనతో ప్రారంభించి ఒక్కొక్క మెట్టే పైకి వెళ్ళి అశ్రువులను అందుకోగలడు. ఇలాటి నట ప్రదర్శన సినిమాలలో సాధ్యంకాదు.

నటనలో ''టైమింగ్'' అన్నది ఎంతో అర్థవంతమైనది. ఈ 'టైమింగ్' సరిగా లేకపోతే సంభాషణల పదును చచ్చి ఊరుకుంటుంది. ''రియాక్షన్''లు అపకతవకగా తయారవుతాయి. నాటకరంగం మీద తెరలేచి మళ్ళీ దిగినదాకా టైమింగ్ కేవలమూ నటుల అధీనంలో ఉంటుంది. రిహార్సల్స్‌లో దీన్ని నిర్ణయించేది డైరెక్టరే అయినప్పటికిన్నీ, తెరమీద కూడా షాట్ ప్రారంభమై ముగిసే మధ్య కాలంలో టైమింగ్‌కు నటులే బాధ్యులు. కాని షాట్‌లు మారుతూ వెళ్ళేటప్పుడు ఈ విషయంలో నటుల ప్రతిభ ఏమీగోచరించదు. మామూలు నడకలాటిది సినిమాలలో కన్న స్టేజి మీద ఎన్నో రెట్లు భావగర్భితంగా ఉంటుంది. (నా చిన్నతనంలో ముష్టిడి జగ్గరాజు గారు చంద్రమతి పాత్ర ధరించి లోహితుణ్ణి ఎత్తుకుని రంగస్థలం మీదికి నడచివచ్చే తీరు చూస్తే ప్రేక్షకులు హర్షధ్వానాలు చేశారు. ఆంధ్ర ఆర్ట్స్ వారి ''నాలుగిళ్ల చావిడి''లో రాధాకుమారి స్టేజికి ఇటునుంచి అటునడిచి వెళితే, నేను ఆ ప్రదర్శనాన్ని చూసిన రెండుసార్లు ప్రేక్షకులు హర్షధ్వానాలు చేశారు.) ఇది సినిమాలలో సాధ్యంకాదు. నటనాశక్తి అన్నది

స్టేజినటుడి చేతిలో చాలా పదునైన ఆయుధమనటానికి సందేహం ఏమీలేదు సినిమానటులు తక్కువ నటులని ఎవరూ అనరు 11 ఏళ్ళ క్రితం వాహినీ స్టూడియోలో సినిమానటులే ఒక చిన్న నాటకం ప్రదర్శిస్తే చూసి కె వి రెడ్డి గారి వంటి నిర్మాత - దర్శకుడు, ''మనం రోజూ చూసే నటులలోనే ఎంత శక్తి వున్నదీ మనకు తెలియక పోయెనే'' అని ఆశ్చర్యపడ్డారు ఆ శక్తి నాటకరంగం వల్ల వ్యక్తమైనటువంటిది

నాటకరంగం మీద ఇంకొక్క విషయం కొట్టవచ్చినట్టు కనిపిస్తుంది నటులలో పెద్ద, చిన్న తారతమ్యం సినిమాలలో ఉన్నంతగా స్టేజీమీద లేదు స్టేజీమీద ' ఎక్స్ట్రాలు'' లేకపోవటం ఇందుకు ఒక అల్ప నిదర్శనం బళ్ళారి రాఘవాచారి గారూ, గోవిందరాజు సుబ్బారావు గారి లాంటి నటులు సయితం స్టేజీమీద చిన్నవేషాలు వేసి ప్రేక్షకులను చైతన్య వంతులను చేయటం నాకు తెలుసు ఇటీవల మద్రాసులో జరిగిన ''జైభవాని'' ప్రదర్శనంలో డాక్టరు రాజారావు మాటావలుకులేని అన్నాజీ పాత్ర ధరించి అతి ఉన్నతమైన నటనతో ప్రేక్షకులతో ఆశ్చర్యం రేకెత్తించారు ఇది సినిమాలలో సాధ్యంకాదు.

నాటకాలు రాసేవారికీ, నటులకూ కూడా రంగస్థలనటనలో ఉండే లగువు బిగువులు తెలిసే వుంటాయి. వాటిని మనసులో పెట్టుకుని మంచినాటకాలు రాస్తే అనేక మంది యువనటీనటులకు తమ సామర్థ్యం చూపే అవకాశం దొరకటమే గాక, ఆంధ్రలో నాటక రంగం ఎంతైనా అభివృద్ధి అవుతుంది. నాట్యకళాపరిషత్తు లాటి సంస్థలు పడేశ్రమ నిజంగా ఫలిస్తుంది

*విశాలాంధ్ర దినపత్రిక 10-3-63*

# 7. నాటకరచన

నాటక రచనా విధానానికీ, నటనా విధానానికీ, ప్రదర్శనా విధానానికీ ఎంతో సంబంధం ఉన్నది 'ఢిల్లీ రాజ్యపతనం', 'పీష్వా నారాయణరావు వధ', 'సత్యహరిశ్చంద్రీయం', 'గయోపాఖ్యానం' ఆడినట్టుగా 'ఎన్. జీ. ఓ', 'పల్లెపడుచు' ఆడరు. నటులు వాటిలో నటించినట్లు వీటిలో నటించటం సాధ్యం కాదు. 'బొబ్బిలి యుద్ధం' నాటకంలో పాత్రలు మాట్లాడినట్లు 'కన్యాశుల్కం' లో పాత్రలు మాట్లాడవు. ఈ సంభాషణలు చదివినట్టు ఆ సంభాషణలు చదవడానికి లేదు.

ఇది కళా పరిణామానికి సంబంధించిన సమస్య, స్టేజికీ, ప్రేక్షకులకూ ఉండే సంబంధం మార్పు చెందుతూరాగా ఈ తారతమ్యాలు ఏర్పడ్డాయి. అయితే మన నాటకకర్తలు ఈ పరిణామాన్ని సరిగా అందుకోక ''వెనకటి'' నాటకాలు రాశారు రచనల లోనూ, పాత్ర పోషణలోనూ, సంభాషణలలోనూ అతినవీనమైన

'కన్యాశుల్కం' తరువాత 'పురాతన' నాటకాలు ఎన్నో వచ్చాయి. వాటిని ఆదరించి జనం చూశారు, చూస్తున్నారు

కొన్ని అంశాలలో ఆధునికత్వం గల నాటకాలు కొన్ని వచ్చాయి వేదం వారి 'ప్రతాపరుద్రీయం', తిరుపతి వేంకటకవుల భారత నాటకాలూ, కాళ్ళకూరి వారి సాంఘిక నాటకాలూ ఈ రకానికి చెందినవి. వీటిలో పద్యాలూ, గ్రాందికభాషతో కూడిన సంభాషణలు లేకుండా ఉంటే ఆధునిక రచనలతో కూడినవి అనుకోవచ్చు

టాకీలు రావడానికి 30 ఏళ్ళు ముందుగానే వచ్చిన 'కన్యాశుల్కం' లోని ఆధునికత గురజాడ వారి అనంతరం వచ్చిన నాటక రచయితలకు అందలేదు. అర్థంకూడా కాలేదేమో 'కన్యాశుల్కం' నాటకమే కాదనీ, ఎవరో స్కూలుపిల్లాడు'' ఔచిత్యం'' తెలియకుండా అల్లరికి రాసిన సంభాషణలే దానినిండా ఉన్నాయనీ, పరువుగల నటులెవరూ వేషం కట్టి అటువంటి సంభాషణలు చెప్పరనీ అన్నవాళ్ళను కూడా నేను ఒకప్పుడు ఎరుగుదును.

అయితే టాకీలు వచ్చిన కొద్ది సంవత్సరాలకల్లా 'కన్యాశుల్కం' రచనా విధానాన్ని సినిమా స్క్రిప్టులు అందుకున్నాయి. అంతదాకా వచ్చిన నాటకాలలో హెచ్చుభాగం ''ప్రాచీన'' నాటకాలే సంభాషణల నిండా గడ్డు సమాసాలూ, భావాన్ని కప్పిపుచ్చే యమకాలూ, పాత్ర యొక్క స్థితీ, మనస్థితికీ, స్వభావానికీ, సందర్భానికీ సంబంధించకుండా రచయిత యొక్క పాండిత్యాన్ని ప్రదర్శించడమూ మొదలైన వికారాలు పుష్కలంగా ఉండేవి. ఈ జాడ్యాలు సినిమా సంభాషణలలో అప్పుడప్పుడూ తొంగి చూస్తున్నప్పటికీ మొత్తం మీద సినిమారచనలో ఆధునిక విధానం వచ్చేసిందనే చెప్పాలి. దాని కనుగుణంగానే సినిమానటన కూడా మారింది.

నాటక రచనలో ఆధునికత్వానికి అవకాశం కలిగించిన మరొక శాఖరేడియో. రేడియో నాటకాలు కూడా ఆధునికతను సాధించటానికి హెచ్చుగా ప్రయత్నిస్తున్నాయి. వాస్తవిక మనస్తత్వాలు గల పాత్రలూ, స్వాభావికమైన సంభాషణలూ, సహజమైన భావప్రకటనా ఆధునిక రచనకు ఆయువుపట్లు ఇవి 'కన్యాశుల్కం'లో మనకు సమగ్రంగా కనిపిస్తాయి. ఈ సమగ్రత మనకు సినిమాలలోనూ, రేడియోలోనూ కూడా లభ్యంకావటం లేదు. ఇందుకొక కారణం కనిపిస్తుంది. సినిమారచయితలూ, రేడియో నాటక రచయితలూ కూడా మామూలు ఘట్టాలన్నిటినీ కూడా, వాస్తవికతతో పట్టుకురాగలుగుతున్నారు గాని ''రసవద్ఘట్టాలు'' వచ్చే సరికి జారిపోయి సనాతన పద్ధతులు అవలంబిస్తున్నారు ఇలా చేసే వారికి ఆధునిక రచనావిధానంలో నిజంగా విశ్వాసం లేదేమో ననిపిస్తుంది. కొందరు వ్యావహారిక భాషావాదాన్ని ఒప్పుకున్నామని చెప్పి రచన అంతటా సమాసాలు గుప్పించి చిట్ట చివర ఉండే ప్రత్యయాలనూ, క్రియలనూ మాత్రం వ్యావహారికంగా మార్చేవారు. అటువంటి వారికి వ్యవహారిక

భాషలో నిజమైన విశ్వాసం లేదనుకునే వాళ్ళం సన్నివేశంలో ''బిగువు'' కావలసినప్పుడల్లా క్షాత్రీయ సంభాషణలనూ, మనస్తత్వాన్నీ, భావప్రకటననూ అవలంబించవలసిన వారికి వ్యక్తులకది ఒక కళాప్రక్రియ అన్న విశ్వాసం లేదనే అనుకోవాలి

ఈ సందర్భంలో సినిమా రచయితలను విమర్శించటం కొంచెం కష్టం ఎందుకంటే వాళ్ళు అనేక లక్షల ప్రేక్షకుల అభిరుచులను పాటించాల కేకలూ, పెద్ద పెద్దైన శోకాలు, లేకపోతే ఈ లక్షలాది జనానికి రసస్ఫూర్తి కలగదని నిర్మాతలూ, డైరెక్టరులూ, తదితరులు భయపడవచ్చు సినిమా రచయిత అస్వతంత్రుడు, నాటక రచయితకూ, రేడియో నాటక రచయితకూ ఉండేటంత స్వేచ్ఛ అతనికి లేదు కాని ఈ వాదం సినిమా ప్రేక్షకులకు న్యాయం చెయ్యదు నాటకాలలో లేని ఆధునికత్వం సినిమా రచనలో ప్రవేశించినప్పుడు అసంఖ్యాకులైన సినిమా ప్రేక్షకులు దానిని ఆమోదించి, ప్రోత్సహించారు. శోకాలూ, కేకలూ సినిమా ప్రేక్షకులు కోరటం లేదని విజయావారి ''గుండమ్మకథ'' నిరూపించింది, ఇంకా నిరూపిస్తున్నది నాలుగో తరగతి స్టేషన్లలో కూడా అదిపాత రికార్డులు భగ్నం చేస్తున్నది దీని నుంచి ఇతర చిత్ర నిర్మాతలు ఏ గుణపాఠం నేర్చుకుంటారో తెలియదు

ఇంతకూ నేను చెప్పదలచినదేమంటే నాటక రచనలో సరిఅయిన పరిణామం రందే నటనలోనూ, ప్రదర్శనలోనూ అవసరమైన పరిణామం రాదు ఈ పరిణామాలు అసలురానే రాలేదని కాదు ఆధునిక రచనలతో బాటు ప్రాచీన రచనా విధానాలు కూడా సహజీవనం చేస్తూ ప్రజల అభిరుచులను తలా ఒక వైపుకూ లాగుతున్నాయి

ఇటీవల నేను చూసిన ప్రదర్శనలలో ''నాలుగిళ్ళ చావడి'' రచనలోనూ, ప్రదర్శనలోనూ కూడా చాలా ఆధునికమైనది. ఇది ఆదర్శప్రాయమైన నాటకమని కాదు. నాటక కర్తనాటకరచనతో తృప్తి పడక కథకుడి పాత్ర, ప్రబోధకుడి పాత్రా, ఉపన్యాసకుడి పాత్రా కూడా నిర్వహిస్తాడు నాటక కర్త యొక్క ప్రేరేపణతో పాత్రలు దేశభక్తీ, ప్రాణత్యాగమూ మొదలైన వాటి చుట్టూ దీర్ఘ ప్రసంగాలు చేస్తాయి వాటి ని''రేషనలైజు'' చెయ్యయత్నిస్తాయి. ఇది పావ్లోవ్ మనస్తత్వ సిద్ధాంతాలన్నిటికీ విరుద్ధం ''వైభవానీ'' లో హీరోజీ పాత్ర శివాజీ వేషం ధరించి శత్రువుల మధ్యకు వెళ్ళి చావటానికి నిర్ణయించుకున్నాకదానిలో గల కష్ట నష్టాలను గురించి వితర్కించటం అసంభవం. అటువంటి వ్యక్తి తానుచేయబోయే త్యాగం మీద తన మనశ్శక్తిని కేంద్రీకరించి ఒక విధమైన మానసిక సమాధి పొందుతాడు.

నాటక రచనకు పావ్లోవ్ మనస్తత్వ శాస్త్రంతో ఏమిటి సంబంధమంటే చెప్పేదిలేదు. నాటక రచన అత్యుత్తమ సాహిత్య కృషి రచయితకు జీవితంగురించీ, మనస్తత్వం గురిచీ ఎంత సమగ్రమైన జ్ఞానం ఉంటే నాటకం అంత వాస్తవికంగా ఉంటుంది అదే నవీనత.

ఈ నవీనతను ''నాయగరా దాపడి'' వంటి మోడర్న్ నాటకం సాధించిన మెచ్చుకోవలసిందే. నిజానికి ఈ నవీనత నాటకాలన్నిటిలోనూ వచ్చేనాడు దేశంలో 19వ శతాబ్దపు పద్ధతుల్లో రాసిన నాటకాలు అడుగంటి పోతాయి. ఈ మార్పు తీసుకురావటానికి సినిమాలకున్న శక్తి రేడియో నాటకాలకు కూడా లేదు. సినిమాలు రాసేవాళ్ళు అల్ప సంఖ్యాకులు. స్టేజి నాటకాలు రాసేవాళ్ళూ ఇంచుమించు అంతే. కానీ రేడియోలకు రాసేవారి సంఖ్య హెచ్చు. రాసిన నాటకాలను చదవటానికి రేడియోలో అన్ని హంగులూ ఉన్నాయి. అందుచేత స్టేజినాటకాలు రాయటానికి, సినిమాలలో రాయటానికీ అవకాశం లేని వాళ్ళు చాలా మంది రేడియోకు రాస్తారు. వీరిపై సినిమా ప్రభావం చాలా బలంగా ఉంటుంది. అందుచేత సినిమాలు తీసేవాళ్ళు సినిమా రచనలో ఇదివరకే ప్రారంభమైన విప్లవపరిణామాన్ని పూర్తి చేసినట్లయితే దాని సత్ఫలితాలు నాటకాలలోనూ, రేడియో నాటకాలలోనూ తప్పక కనిపిస్తాయి

*విశాలాంధ్ర, దినపత్రిక, 17-3-63*

# 8. ఔత్సాహిక నాటకాలు, నటులూ

గడిచిన వారం నేను కొన్ని ఔత్సాహిక నాటక ప్రదర్శనలు నాటకాల పోటీ సందర్భంలో, చూడటం తటస్థించింది. మద్రాసులో ఉండే ఆంధ్రులకు తెలుగు నాటకాలు చూసే అవకాశాలే తక్కువ. ఔత్సాహిక నాటక ప్రదర్శనలు మరింత అరుదు.

ఇలాటి నాటకాల ప్రయోజనం ఈనాడు అందరికీ తెలిసిందే. నాటక రచనలు, కొత్త ప్రయోగాలూ, కొత్త ధోరణులు, కొత్త రకం పాత్రల సృష్టీ, సంభాషణా విధానం ఈ నాటకాలలో ఆరంభమవుతాయి. ఈ నాటకాలకు అర్థబలం ఏమంత ఉండదు గనక ఈ నాటకాలు రాసేవారూ, ఆడేవారు బుద్ధిబలం మీద హెచ్చుగా ఆధారపడి నాటకాలురక్తి కట్టేటందుకు ప్రయత్నం చేస్తారు. ధనాపేక్ష లేకుండా, నటించాలన్న ఆసక్తితో నటులు ఇందులో పాల్గొంటారు. వారిలో కొందరికి సహజనటనాశక్తి ఉంటుంది. వీరి శక్తి సామర్థ్యాలకు తగిన గుర్తింపు వచ్చినప్పుడు వీరికి ఏ సినిమాల లోనో అవకాశాలు లభించి, వాటినే వృత్తిగా పెట్టుకునే మార్గం ఏర్పడవచ్చు. దురదృష్టవశాత్తూ మన పత్రికలలో, పాతికసంవత్సరాలుగా ప్రసిద్ధులై ఉన్న సినీనటులకు నయితం ప్రచారం జరుగుతున్నది గాని, మంచి భవిష్యత్తు గల నాటక రచయితలకూ, ఔత్సాహిక నటులకూ ప్రచారం ఏమీ లేకుండా ఉంటున్నది. ఇది ఎంతైనా శోచనీయం.

నేను గతవారం చూసిన పదినాటికలలో రెండు మూడు మాత్రమే బొత్తిగా పనికి మాలినవి. వాటిని రచించినవారికి నాటకరచయితలుగా భవిష్యత్తు ఏమీలేదని

చెప్పవచ్చు. 'తిరుపతి', 'కాంతి పథం', 'ఆశయాలకు సంకెళ్ళు', 'ఎవరినీ నమ్మకు' అన్న నాటికలు బాగున్నాయి వీటిలో మొదటి రెండు నాటికలనూ ప్రదర్శించిన సమాజాలకు బహుమతులు కూడా లభించాయి

## ఔత్సాహిక నాటకాల్లోని లోపాలు

ఔత్సాహిక నాటక రచనలో నేను గమనించిన కొన్ని తప్పులు, లేక తప్పుడు ధోరణులు బయటపెట్టటం అవసరం నాటక రచయిత తన నాటకం తాలూకు వాతావరణంలోకి వెళ్ళిపోయి, తన చుట్టూ గూడు కట్టుకుని వాస్తవజీవితాన్ని పూర్తిగా విస్మరించటం ఒక తప్పు నాటకకర్త చేసే ఈ పొరపాటు చేత పాత్రలు తమ సామాజిక ధర్మాన్ని కోల్పోయి రచయితచేతి కీలుబొమ్మలై, అతను గీసిన గిరులు దాటే ధైర్యసాహసాలు లేక, ఒక్కొక్కప్పుడు భావజీవులైమాటలు తింటూ, మాటలు కక్కుతూ యంత్రాలలాగా మసులు కుంటాయి. వీటిలో కలిగే పరివర్తనలూ, పరిణామాలూ వింతగానూ, యాంత్రికంగానూ, ప్రకృతి నియమాలకూ, సాంఘిక నియమాలకూ అతీతంగానూ ఉంటాయి. అసలు నాటికలలో పాత్రలమనః ప్రవృత్తిలో కలిగే పరిణామాలను చిత్రించకుండా ఉండటం మంచిది, అటువంటిది పెద్ద నాటకాలకే తగును. పాత్రల మనః ప్రవృత్తులలో అత్యద్భుతమైన పరిణామాలు తెచ్చి పెట్టే నాటికలు రాస్తే వాటిని చూసేవారికి పెద్ద నాటకాన్ని ఫాస్ట్ మోషన్‌లో చూస్తున్నట్టు అనిపిస్తుంది. అలా రచించినది మంచి నాటిక అనిపించుకోలేదు మంచి నాటకం కానూలేదు.

నాటకాలలో సినిమా పద్ధతులు గుడ్డిగా ప్రవేశపెట్టటం రెండవ పొరపాటు. లోగడ నేను ఈ శీర్షికలో నాటకరచన గురించి రాసిన విషయాలను బట్టి నాటకం సినిమాకు భిన్నమైన వ్యక్తిత్వంకలది. ఆ వ్యక్తిత్వాన్ని అది కోల్పోయి లాభంలేదు. సినిమాల ప్రభావం నాటకాలపైనా నాటకాల ప్రభావం సినిమాలపైనా ఉండరాదని ఉద్దేశ్యంకాదు. జీవితపు అన్నిశాఖల తాలూకు ప్రభావమూ, నాటకాలపై ఉండవలసిందే, కాని నాటకం ఒక కళారూపంపై ఉండిన తన వ్యక్తిత్వాన్ని కోల్పోరాదు. సినిమాలు నాటకాల ధోరణి అవలంబించి నప్పుడు అవి "సినిమాత్వం" కోల్పోతూనే ఉన్నాయి. నాటకాలలోనే పద్యసంభాషణలూ, ఆత్మ ప్రబోధలూ జరుగుతూ నటుడు స్టేజిమీద నిలబడి మూకాభినయం చేస్తూ, ఉన్న అరగంట కాలంలో రెండు మూడు నిమిషాలు వ్యర్థం చేస్తే నాటిక దెబ్బతింటున్నది. నేపథ్యగానం కూడా ఇంతే. నేపథ్యసంగీతం సముచితంగానూ, పరిమితంగానూ ఉన్నప్పుడు నాటికకు సహాయకారిగానే ఉంటున్నది. అందుచేత దీనివిషయమై నాకేమీ అక్షేపణలేదు.

సినిమాలలో ఒకరకం చచ్చు సంభాషణలు సస్పెన్స్ కోసం ప్రవేశపెడుతున్నారు. ఈ సంభాషణలు సినిమాలలోనే ఒక దురలవాటుగా పరిణమించాయి. అవి పాత్రల యొక్క మనస్తత్వాన్ని ఏమీ వ్యక్తం చేయ్యవు కొన్ని రకాల సన్నివేశాలను కన్వెన్షనల్‌గా దాట వెయ్యటానికి అవి సాధనాలు మాత్రమే. ఈ రకం దౌర్భాగ్యపు సంభాషణలు

నాటికలలోకి ప్రవేశించాయి. ఇది సమర్థనీయం కాదు. నాటకాలలో - మరీ మిక్కిలి నాటికలలో - ప్రతి మాటా పాత్రోచితంగా, సందర్భోచితంగా ఉండాలి.

నటులు స్టేజీమీద ఇమోషన్ చూపవలసినప్పుడెల్లా ఏడుపు ముఖాలు పెట్టటమూ, జీరగొంతులు, ఎగరలాగటమూ, నెత్తికి చేతులు పెట్టుకుని విల్లంబులా వెనక్కు విరిగిపోయి ఒకోసారి సంభాషణలు చెప్పటమూ, ఆకాశం విరిగి మీదపడినంతగా ఊగిపోవటమూ - ఇదంతా వికారమైన నటన. ఇది సినిమాల నుంచి ఎరువుతెచ్చుకున్నది.

ఇలాటి లోపాలు రాకుండా చూసుకుంటే ఔత్సాహిక నాటికలు ఇంకా బాగా రాణిస్తాయి. ప్రసిద్ధమైన సినిమా చిత్రాలలోని ప్రధాన సన్నివేశాలను తీసుకుని నాటికలు రాయటం, ప్రదర్శనలు ఎంతచక్కికట్టినా, మెచ్చదగినది కాదు.

**తెలుగు వాతావరణం అవసరం**

ఇటువంటి దురలవాటు కారణంగా అనేక నాటికలలో తెలుగుదనము, తెలుగు వాతావరణమూ కూడా లేకుండా పోతున్నాయి.

ఔత్సాహిక నటులలో నటనాసామర్థ్యం గలవారిని కొందరిని చూడటం నాకు చాలా ఆనందం కలిగించింది. ''తిరుపతి' నాటకంలోని పాత్రలు ధరించిన వారంతా ఆఫీసుబాయిలని విన్నాను. ఇందులో స్త్రీ పాత్ర ధారిణి మొదలుకొని ప్రతి ఒక్కరూ అత్యంత సామర్థ్యంతో నటించటం గొప్ప విషయం ''కాంతి పథం'' అన్న నాటకంలో నటించిన నలుగురు నటులూ చాలా సమర్థులు '' ఆశయాలకు సంకెళ్ళు'' అన్న నాటకంలో బెనర్జీ పాత్రధారి అసాధారణ నటనాసామర్థ్యం కనబరిచాడు ( ఇతనికి ఉత్తమ నటుడి బహుమతి లభించింది.) ఇలాగే దాదాపు ప్రతి నాటికలోనూ బాగాలేని నాటికలలో సయితం ఒకరూ, ఇద్దరూ మంచి నటులనదగిన వారున్నారు.

వీరందరూ నటులుగా వృద్ధిలోకి వచ్చి తమ శక్తి సామర్థ్యాలతో కీర్తి గణించగలుగుతారా అని అనుమానం కలిగి గుండె గుబుక్కుమంటుంది.

*విశాలాంధ్ర, దినపత్రిక 26-3-63*

# 9. నాటకంలో కథావస్తువు

నాటకానికి కథావస్తువంటూ ఒకటి ఉండాలన్న మాట నిజమేగాని, ప్రేక్షకుడి దృష్టిలో దానికి ప్రత్యక్ష ప్రాముఖ్యం చాలా తక్కువ. అయితే చివరకు సమాజంలో నాటకకళకుగల స్థాయిని నిర్ణయించేది కథ వస్తువే.

నాటకకళ ఉచ్ఛస్థాయిలో ఉన్నదని ఎప్పుడంటాం? జనానికి నాటకాల ''వేలంవెర్రి'' బాగాపట్టి, పోటీల మీద నాటక ప్రదర్శనలుపడి, నాటకరంగంమీద కొంత మంది నటులకు సింహాసనాలు ఏర్పడి, వాళ్లు చేసిన దంతా నటనగానే చలామణిఅయి, ఆ నాటకరంగం గురించిన కథలను జనం ఉత్తప్పుడుకూడా చెప్పుకునే

దశలో నాటకకళ ఉచ్ఛదశలో ఉన్నప్పుడు, మన ఆంధ్రదేశంలో నాటకాలకు ఇలువంటిదశ ఉండింది. అప్పటి నాటకాల ఇతివృత్తాలు దాదాపు అన్నీ పౌరాణికాలే.

ఆనాటి పేరుపొందిన నటుల్లో హరిప్రసాదరావూ, యడవల్లి సూర్యనారాయణా, డి.వి. సుబ్బారావు, పాటిపల్లి సుబ్బారావు, రామనాథశాస్త్రి, తుంగల చలపతి మొదలైన వారిని సాంఘిక నాటకాల్లో ఊహించటం కష్టం.

ఈ సాంఘుక నాటకాలలో కూడా రాణించిన నటులు స్థానం, గోవిందరాజుల సుబ్బారావు లాంటివారు చాలా అరుదు.

దీన్ని బట్టి కథావస్తువుకూ, నటుడికీ ఎంత సన్నిహిత సంబంధం ఉన్నదీ స్పష్టంగా తెలుస్తుంది.

ప్రజల అభిరుచికీ ఇతివృత్తానికీగల సంబంధం కూడా ఇక్కడే మనం చూడవచ్చు. శకుంతల, కృష్ణతులాభారం, సారంగధర, రామదాసూ, సక్కుబాయి వగైరా నాటకాలు ఆడుతున్న కాలంలోనే సాంఘిక నాటకాలు చింతామణి, వరవిక్రయం, కన్యాశుల్కంలాటివి ఆడాయి, కాని వాటికి అంత ప్రజాదరం లభించలేదు. ఈ నాటకాలలో పాత్రధారణ చేసి నందువల్ల అఖండఖ్యాతి లభించిన ఆ కాలపు నటుడుకూడా లేడనే చెప్పవచ్చు.

రెండు మూడు వేషాలు కట్టడంలో గొప్ప కీర్తి గడించుకున్న వ్యక్తులు ఆయా నాటకాలు చావకుండా నిలబెట్టి ఉంచగలిగారు. ఇందువల్ల నాటకానికి లేని ప్రాముఖ్యం నటుడిదయింది. అదే తెలుగు నాటక రంగం పతనం కావటానికి కారణంకూడా అయింది. ఇది గుర్తించేనేమో బళ్ళారి రాఘవగారు పాతనాటకాలు విడిచిపెట్టి సాంఘిక నాటకాలు రాయించి, రాసి ఆడారు, కాని అవి జనానికి అంతగా పట్టలేదు.

పాతకాలపు నాటకాలలోని కథావస్తువుకు తగిన నాటకీయత ఆ నాటకాలలో ఉండినట్టుగా, కొత్తరకం నాటకాలకు అవసరమైన నాటకీయత కొత్తవాటిలో లోపించిందనాలి.

పైకివచ్చే సినిమాలూ, రెండో ప్రపంచయుద్ధమూ కూడా తెలుగు నాటకరంగంమీద పెద్దదెబ్బ తీశాయి. అయితే యుద్ధానంతరకాలంలో తెలుగు నాటకరంగం ఒక విధమైన పునర్జన్మ ఎత్తింది.

కొత్త నాటక కర్తలు వచ్చారు. కొత్తరకం నాటకాలు రాస్తున్నారు. ఆత్రేయ, నరసరాజు, సోమంచి యజ్ఞన్న శాస్త్రీ, భమిడిపాటి రాధాకృష్ణ, గొల్లపూడి మారుతీరావు, కొడాలి గోపాలరావు, పినిశెట్టి, రావికొండలరావు మొదలుగాగల అసంఖ్యాకులు నాటకాలు రాశారు ఆడించారు. కాని ఈ నాటక కర్తలందరూ ఔత్సాహికులే. వీరిలో చాలా మందికి సముచిత గమ్యం సినిమా రంగం, అది గిట్టుబాటుగా ఉండే వృత్తిగా ఉండేమాట అటుంచి, వారి రచనలకు ప్రజాదరం పుష్కలంగా లభించి, నిజమైన

కీర్తినిచ్చేది అక్కడే. ఆత్రేయ, నరసరాజు, పినిశెట్టి వగైరాల నాటకాలకు ఆకర్షణలో విధిగా వారి సినిమా కీర్తి కొంత ఉండి తీరుతుంది

సినిమాలవల్ల జనం యొక్క అభిరుచులలో ప్రాథమికమైన మార్పులు కొన్ని వచ్చాయి అవి ఈనాటి నాటకరంగం మీద స్పష్టంగా కనిపిస్తున్నాయి సినిమా రంగంలో ప్రముఖులుగా ఉన్నవారు నాటకం ఆడితే జనం వేలంవెర్రిగా చూస్తారు ప్రదర్శనానికీ, కథా వస్తువుకూ ఏ ప్రాముఖ్యమూ లేదు ఇది నాటకరంగం పైన స్టార్ వాల్యూకుగల ప్రభావం

ఔత్సాహిక నాటకాలలోకూడా ''డ్రామా''కు కన్న ''థియేటర్''కు ఎక్కువ ప్రాముఖ్యం ఉంటున్నది. ప్రదర్శనం ప్రేక్షకులను బలంగా ఆకర్షించాలి విషయం అంత ప్రధానంకాదు అందుచేతనే, ఈ కాలపు నాటకాలలో చాలవరకు పాశ్చాత్య నాటకాల అనుసరణలున్నప్పటికీ, ప్రదర్శనం ఆకర్షవంతంగా ఉంటే జనం హర్షిస్తున్నారు సినిమాల ప్రభావం నాటకంలోని వాస్తవికతకు అంతరాయంగా ఉన్నా ప్రేక్షకుడు అభ్యంతరం చెప్పటం లేదు పద్యాలు పోయి పాటలు వచ్చాయి ప్లే బాక్ గూడా స్టేజిమీద చూస్తున్నాం.

ఇవన్నీ, నాటకరంగం పరాధీనమై ఉన్నలక్షణాలు. ఈ దశలో నాటకంలోని కథావస్తువు ఏదైనాకావచ్చు ఒక డిటెక్టివుకథో, ఒక హిందీ సినిమా చిత్రానికి నకలో, ఒక బెంగాలీ నాటకానికి నకలో – ఏదైనా ప్రేక్షకులకు ఒకటే

ఈ పరిస్థితిలో సైతం విజయవంతంగా ఆడుతున్న నాటకాలు పాతకాలానికే – చింతామణి, ఉద్యోగవిజయాలూ వగైరా వాటికి జనం ఎగబడుతున్నారు. నాటకరంగంపైనకూడా సినిమా ఖ్యాతికే అగ్రాసనంగా ఉంటున్నది.

19వ శతాబ్ది అఖరున బ్రిటనులో నాటకరంగం ఇంచుమించు ఇదేస్థితిలో ఉన్న తరుణంలో బ్రిటీషు నాటకరంగాన్ని ఉద్ధరించబూనుకున్న ఔత్సాహికులు ఇబ్సెన్, చెఖోవ్ ప్రభృతుల నాటకానువాదాలతో ప్రదర్శనలు జరిపారు. నూతన నాటకరంగానికి పునాదిగా ఉండగల ఇతివృత్తాలతో నాటకాలు రాసి ఇచ్చినవాడు జార్జి బెర్నార్డుషా. తరవాత బారీ, గాల్స్‌వర్దీ మొదలైన నాటక కర్తలు బయలుదేరారు. ఆ ఉద్యమంలో బ్రిటిషు నాటకరంగం కొత్త ప్రాణాన్ని పోసుకున్నది.

ఇంచుమించు ఇలువంటి ఉద్యమమే ఆంధ్రలో కూడా యుద్ధకాలంలో ప్రారంభమయింది. అది అభ్యుదయ నాటకోద్యమం. నిజాని కానాడు ఆ ఉద్యమం నాటకరంగాన్ని పునరుజ్జీవింపజేయగలిగినదే, అభ్యుదయ నాటకాలు బాగా ఆడాయి. జనం ఎగబడి వాటిని చూశారు వాటిలో కొందరు నటులు కీర్తికూడా సంపాదించుకున్నారు. కాని ఆ ఉద్యమం అనేక కారణాల చేత కొనసాగలేదు. ఆనాటి అభ్యుదయ నాటకాలలో విషయం సంకుచితమైపోయింది. వర్గశత్రువును అన్ని విధాలా హీనుడుగా చిత్రించటంలాంటి మార్మికలోపాలు ఆనాటకాలలో ప్రవేశించాయి.

అయినప్పటికీ ఈ కాలపు నాటక రచయితలు అభ్యుదయ దృక్పథాన్ని పూర్తిగా వదిలి పెట్టారని చెప్పటానికిలేదు. ఇప్పటికీ దానికి నాటక రంగస్థలాన భవిష్యత్తున్నది. అయితే అది ఫలించటానికి కనీసం రెండు షరతులున్నాయి. ఒకటి నాటకీయత స్వతంత్రంగా అభివృద్ధి చెంది, నాటకాలు సినిమాలకు ప్రత్యామ్నాయాలు కావని ప్రేక్షకులకు బోధగా అనిపించాలి. సరయిన పెట్టుబడిదారీ పద్ధతిలో నాటకరంగం తన కాళ్ళపై తాను నిలబడాలి. సినిమాలు తీయటానికి డబ్బు పెట్టుబడిచేసినట్టే నాటకాలకుకూడా డబ్బు పెట్టుబడి చెయ్యగలవాళ్ళు ముందుకువచ్చి, ఆర్థిక దృష్టితో నాటకాలాడించాలి.

ఇప్పుడున్న పరిస్థితిలో నాటకపుపోటీలు నాటక రంగానికి ఏమంత మేలుచెయ్యటం లేదేమోనని నా అనుమానం. పది నాటకాలాడినప్పుడు ఏదో ఒకనాటకానికీ, ఒక ప్రదర్శనకూ, ఒక నటుడికీ, ఒక నటికీ ఉత్తమ బహుమానం వస్తుంది. దాన్నిబట్టి ఏమీ రుజువుకాదు. ఆ నాటకానికీ, నటులకూ అనుమానాస్పదమైన కీర్తితప్ప ఇంకేమీ దక్కకపోవచ్చు. ఆ నటులకు నటనవృత్తిగా పెట్టుకునే అవకాశం కనుచూపుమేరలో ఎక్కడా లేకపోవచ్చు. ఈ పోటీలవల్ల కనీసం సినిమా చాన్సులకైనా దోహదం కలుగుతుందని గట్టిగా చెప్పలేం. ఒకవేళ కలిగినా అందుచేత నాటకరంగానికి ఒరిగేదేమీలేదు.

*కళాపని, ప్రత్యేక నాటక సంచిక 1965*

## 10. నటుడిగా రాఘవాచారి

నాటకం సాహిత్య ప్రక్రియలలో కెల్లా అత్యుత్తమమైనదంటారు. సాహిత్యాన్ని ప్రజలలో అన్ని వర్గాలవారికీ అందజేసి, మాటలనుంచి రసాలను పిండి, నాటకం యొక్క పరమ ప్రయోజనాన్ని గ్రాహ్యంగా చేసేవాడు నటుడు. ఈ పనిని విజయవంతంగా చేయగలవాడు ప్రేక్షకుడి వ్యక్తిత్వాన్ని పక్కకు నెట్టేసి, జంత్రవాద్యగాడు నిర్జీవమైన వాద్యంమీద తన యిష్టంచ్చిన రాగాన్ని పలికించినట్టుగా, తాను ప్రదర్శించే భావాల ప్రభావానికి ప్రేక్షకుణ్ణి గురిచెయ్యగలవాడు అతను మహానటుడు

రాఘవాచారి మహానటుల తరగతికి చెందిన వాడు. ఆయన రంగస్థలంమీదికి వచ్చినతరవాత ఎదురుగా కూర్చున్న వాడు ఆయన పట్టునుంచి తప్పించుకోవటం సాధ్యం అయ్యేదికాదు. (అలా నటుణ్ణి నిర్లిప్తంగా చూడగలవాడు విమర్శకుడు అనిపించుకుంటాడు. కాని నాకు తెలిసినంతవరకు విమర్శకులుసైతం రాఘవాచారికి వశులుగాక తప్పలేదు.)

మహానటునికి ఉండదగిన అతి అరుదైన గుణం ఒకటి రాఘవాచారిలో ఉండేది. ఆయన తాను అనేకమార్లు ధరించిన పాత్రలను సైతం, ఎప్పటికప్పుడు

కొత్తగా రంగస్థలాన మనకళ్ళ ఎదుట సృష్టించేవాడు. యాదృచ్ఛికంగా రంగస్థలాన అనుకోని సంఘటనలు జరుగుతాయి. ఇతర నటులు ఒకసారి ఉన్నవారు మరొకసారి ఉండకపోవచ్చు. అన్నిటికన్నా ముఖ్యం, ప్రేక్షకుల స్థాయి ఒకసారి ఉన్నట్టు మరొకసారి ఉండదు. ఇలాంటివాటి అన్నిటి ప్రభావమూ రాఘవాచారి నటనలో స్పష్టంగా కనిపించేది. అందుచేత స్టేజిమీద ఆయన చేసే పాత్రపోషణ నిత్యనూతనంగా ఉండటమేగాక [illegible]ంగా ఉండేది (రామబ్రహ్మంగారి ''రైతుబిడ్డ'' లో ఆయన షాట్ రిహార్సు చేసేటప్పుడు నాలుగుసార్లు నాలుగు రకాలుగా చెయ్యటం నేను చూశాను ) నటన కూడా ''సెట్'' చేసుకుని, కొందరు కర్నాటక గాయకులు పాడిందే మళ్ళీమళ్ళీ పాడినట్టుగా, ఒక పాత్రను ఎన్నిసార్లు నటించినా ఒకేరకంగా నటించేవారు లేకపోలేదు. అలాంటిది రాఘవాచారి మనస్తత్వానికే వ్యతిరేకంగా ఉండేది. సజీవమైన నటన ఎప్పుడూ సద్యస్స్ఫూర్తిగానే ఉంటుందిగదా. ఆయన సినిమాలలో అంతగా రాణించకపోవటానికి అదే కారణమేమో!

దీనికి విరుద్ధమనిపించేలాగా ఆయనకు క్రమశిక్షణలో అంతులేని విశ్వాసం ఉండేది. నటుడినటనా స్వేచ్ఛకూ, క్రమశిక్షణకూ నిజంగా వైరుధ్యం లేదు. ఆ సంగతి గ్రహించని వాళ్ళు క్రమశిక్షణారాహిత్యమే స్వేచ్ఛానటన అనుకోవచ్చు. కాని అది పొరపాటు. సృజనాత్మకమైన నటనలో నటుడికి స్వేచ్ఛ కావాలి. కాని ఆ స్వేచ్ఛకు అన్ని పక్కలా సరిహద్దులున్నాయి. నాటకంలో లేని మాటలేవో అని నటుడు ప్రేక్షకులకు ఆశ్చర్యమో, హాస్యమో అందించవచ్చు. రంగస్థలం మీద ఒక ప్రత్యేక పాత్రకు ప్రాధాన్యం ఉన్న ఘట్టంలో మరొక పాత్ర ఏవో వెకిలి చేష్టలు చేసి, ప్రేక్షకుల దృష్టిని తాత్కాలిక ప్రధాన పాత్రనుంచి తప్పించవచ్చు. ఇలాంటి చర్యలు క్రమశిక్షణా రాహిత్యంతో కూడుకున్నవి. సృజనాత్మకమైన నటనకు ఆధారభూతమైన స్వేచ్ఛ అని పించుకోవు.

తాను ధరించే పాత్రకు రంగస్థలం మీద ప్రాధాన్యం లేని క్షణాలలో తాను వెనక్కు తగ్గటం రాఘవాచారికి బాగా తెలుసును. (ఆయన స్టేజిమీద ఒక చివర దాదాపు అయిదు నిముషాలపాటు చేతులు కట్టుకుని కదలకుండా నిలబడి, ప్రేక్షకుల దృష్టిని తనపై ఆకర్షించటానికి ఏమీ ప్రయత్నించక పోవటం నేను చూశాను. మా దృష్టి ఆయనమీదే ఉండిన మాట నిజమేగాని, అది ఆయన తప్పుకాదు!)

మిగిలిన కళారంగాలలోలాగే ఒక్కొక్క నటుడు రంగస్థలానికి ఒక కొత్త జీవంపోసి, నాటకరంగ చరిత్రలో ఒక కొత్త అధ్యాయం ప్రారంభిస్తాడు. అలా చేసినవాడు రాఘవాచారి. ఆయనను చూసిన మీదట నటన ఒక ఉత్తమ కళ అన్న విశ్వాసం కుదిరి నటులైనవారు చాలామంది ఉన్నారు. ప్రతి గొప్ప కళాకారుడిలాగే రాఘవాచారి కూడా తన 'సంతతి' ని పెంపొందించి, తెలుగు నాటక చరిత్రలో చిరంజీవి అయాడు.

రాఘవాచారి కేవలం నటుడేకాదు, నాటక ప్రయోక్తా, నటశిక్షకుడూనూ, పుట్టు నటులు కాని అనేకమందిని ఆయన నటులుగా తయారు చేసి, స్టేజిమీద ఎక్కించి

రుచింపజేశాడు ఇందులో తప్పేమీలేదు నాటకంలో నాయకపాత్రధారి నుంచి దౌవారిక పాత్రధారిదాకా అందరూ మహానటులు కానవసరం లేదు తగిన శిక్షణ ఉంటే ప్రతి ఒక్కరూ ఏదో ఒక స్థాయి మేరకు పాత్రలు విజయవంతంగా ధరించవచ్చు (అలాంటి శిక్షణ లేకుండా, ఇతర పాత్రలను ధరించటానికి ఏ దర్జీనో, కుమ్మరినో అడ్డం పెట్టుకుని నాటకమంతా తమ భుజబలంతోనే మోసేసేవిధంగా నటులను సమర్థించటం కాదు ) రాఘవాచారి ఏదో పాత్రలకు ఎవరినో అడ్డం పెట్టుకుని, తన స్వశక్తితో నాటకం రక్తి కట్టించటానికి ప్రయత్నించినట్టు నేనెన్నడూ వినలేదు ఎంత చిన్న పాత్ర అయినాసరే దానికి రంగస్థలం మీద ప్రాముఖ్యం వచ్చిన సమయంలో అది రాణించవలసిందే. రాఘవాచారి ' ఒథెల్లో' పక్కన ' ఎమీలియా' పాత్ర ధరించిన కపిల కాశీపతికి ఈ సంగతి ఇంకా గుర్తు ఉంటుందనుకుంటాను

రాఘవాచారి నటనను ఇవాళ అంచనా కట్టవలసివస్తే ఆయనది పాతకాలపు నటనే అనాలి. ఆయనకు పేరు తెచ్చిన రామదాసు, వరాన్, హిరణ్యకశిపుడు, చాణక్యుడులాంటి పాత్రలు ఈ కాలపు జీవితానికి విలక్షణమైనవి ఇంకోకవిధంగా చెప్పాలంటే ఆ పాత్రలను పోషించటంలో ''వాస్తవికత'' అన్నది ఎలా ఉండాలో స్పష్టంగా చెప్పడం కష్టం. రాఘవాచారి ''తప్పెవరిది?'', ''సరిపడని సంగతులు'' లాంటి సాంఘిక నాటకాలను చివరికాలంలో ఆడినా నేను వాటిని చూడటంపడలేదు అందుచేత ఆయన నటనలో ''వాస్తవికత'' ఎలా ఉండేదో నేను చెప్పలేను.

ఇవాళ సాంఘిక నాటకాల ప్రభావం వల్లనైతేనేమీ, సినిమాల ప్రభావం వల్లనైతేనేమి నటన యొక్క స్వభావం పూర్తిగా మారింది. నటుడు ధరించే పాత్రలు జీవితానికి చాలా దగ్గరిగా వస్తున్నాయి. తన వ్యక్తిత్వానికి తగిన పాత్ర ఇస్తే నటుడు నటించే అవసరం కూడా ఇంచుమించు లేకుండా పోతున్నది పాత్ర సహజంగానూ, స్వాభావికంగానూ ఉండటం ముఖ్యం. (సినిమాలలో తారలకింద కొందరు చలామణి అవుతున్నారంటే దానికి కారణం సినిమా వ్యాపార రహస్యం. నటనా సామర్థ్యానికీ, తారత్వానికీ ప్రత్యక్ష సంబంధం ఏమీలేదు. సినిమా నటులలో నేను గొప్ప నటులని భావించేవాళ్లు కొందరు ఉన్నతిలో లేరు.)

నటుడుగా రాఘవాచారిగారి శకంకూడా చాలాకాలం క్రితమే అయిపోయింది కాని ఆయనకూ నాటకరంగానికీ, నాట్యకళకూ ఉండిన పారస్పర్యం ఎన్నికాలాల పాటయినా నటులు పాటించదగినది. ఈ విషయంలో ఆయన తరవాత ఆదర్శంగా చెప్పుకోదగ్గ నటుడు వచ్చినట్టు కనిపించదు.

*నాట్యకళ (జూలై – ఆగస్టు 1971) బళ్ళారి రాఘవ సంస్మరణ సంచిక*

# 11. 'పద్మశ్రీ' స్థానం నరసింహారావుగారు.

శ్రీ స్థానం నరసింహారావుగారి వేషాలు వచ్చినాటి నుండీ ఆయన రంగస్థలం మీద ఆయన వేసే భాగ్యం నాకు కలిగింది మనుష్యులయేమిటి ఆయన పేరు భాగ్యంకాదా నాకు దండుల్లాడు అందుచేతనేను స్థానం పక్షపాతినని ఒప్పుకోక తప్పదు అయినప్పటికీ నాకు కళావిమర్శ చేసే సందర్భాలలో పక్షపాతాలు లేవు. స్థానం వారు ధరించిన పాత్రలు చాలావరకు అన్నీ నేను చూశాను ఎందరో పురుషులు స్త్రీ పాత్రలు ధరించగా కూడా చూశాను స్థానం వారి స్త్రీ పాత్రధారణకు సాటివచ్చేది తెలుగు నాటక రంగం మీద నాకు కనిపించలేదు ఆయన నటించిన 'రోషనార' 'మధురవాణి' పాత్రలు ఈనాటికిన్నీ నాకు నిష్కృష్టంగాను, అద్వితీయంగానూ మనసులో మెదులుతున్నాయి.

స్థానం వారు నాటక రంగంమీద సాధించిన ఘనవిజయానికి ఒకరు సర్టిఫికెట్ ఇవ్వనవసరంలేదు కాని ఆ విజయం వెనక ఉండిన సహజ ప్రతిభకు తోడు అనుపమైన కృషీ, తపస్సూ నేను కొంతవరకైనా ఊహించగలననుకుంటాను నిత్యమూ సన్మానాలు పొందటానికి అర్హులైన ఆంధ్రకళాకారులలో స్థానంవారు ఒకరన్నది నిర్వివాదాంశం.

*'సూత్రధారి' స్థానం షష్టిపూర్తి ప్రత్యేక సంచిక, అక్టోబరు 1962*

# 12. నటకావతంసుడు

ఆంధ్రనాటక రంగంలో స్థానం శకం అయిపోయి చాలా కాలం అయింది ఈ తరం వాళ్ళు నటుడిగా ఆయనను ఎరుగరు. స్త్రీ పాత్రధారిగా స్థానం ఇంకా ఒకటి రెండు దశాబ్దాలు వెలిగి ఉండును, కాని, రంగస్థలం మీదికి స్త్రీలు ప్రవేశించటమూ, సినిమాల ద్వారా సెక్సు ఆకర్షణలకు క్లోజప్పుల ద్వారా ప్రాముఖ్యం రావటమూ, స్థానం శకాన్ని అకాలంగా అంతరింపజేశాయి

తెలుగు నాటకాలు పుట్టినాక స్త్రీ ప్రాత్ర ధారణలో స్ఫుటమైన కీర్తి తెచ్చుకున్నవారు ఎంతో మంది లేరు, ముప్పిడి జగ్గరాజుగారూ, ఉప్పులూరి సంజీవరావూ, పారుపల్లి సుబ్బారావుగారూ, స్థానం – ఈ నలుగురే కనిపిస్తారు. వీరిలో నిస్సందేహంగా స్థానం అగ్రగణ్యుడు

వృత్తి నటుడుగా స్థానం నాటరంగం మీదికి రాగానే నేను ఆయనను స్టేజిమీద చూడటం తటస్థించింది. ఆ కారణంగా నటుడుగా స్థానం పొందిన పరిణామ దశలన్నీ

నేను చూడగలగాను తెనాలి ఫస్టు కంపెనీలో మల్లాది గోవిందశాస్త్రి గారి పక్కన స్త్రీ పాత్రలు ధరించటానికి స్థానాన్ని తెచ్చారు స్థానానికి నెలకు 25 రూపాయల జీతం ఇచ్చేవారని జ్ఞాపకం అప్పటికి ఆయన వయసు 19 ఏళ్ళు జుట్టుసగం నెరిసింది

ఫస్టుకంపెనీలో స్థానం వేసిన పాత్రలు నాకు గుర్తున్నంతవరకు ''కృష్ణలీలలు''లో యశోద (గోవింద శాస్త్రి కంసుడు), ''రుక్మాంగద''లో మోహిని (గోవింద శాస్త్రి రుక్మాంగదుడు) అప్పటికి నా వయసు 12 మాత్రమే కావటం చేత ఆనాటి స్థానం నటనాసామర్థ్యం గురించి చెప్పలేనుగాని, కళాకారుడికి ఉండదగిన సమ్మోహనశక్తి - అంటే ప్రేక్షకుడి వ్యక్తిత్వాన్ని తన అధీనంలోకి తీసుకునే నేర్పు - స్థానంలో పుష్కలంగా ఉండేదని రూఢిగా చెప్పగలను అందుకు నిదర్శనం ప్రేక్షకుల సమష్టి స్తంభన ఈ శక్తి రాఘవాచారి గారిలో కూడా పుష్కలంగా ఉండేది ఆ మాటకు వస్తే ప్రతి గొప్ప నటుడిలోనూ అంతో ఇంతో ఉండేది.

నటుడుగా స్థానం జీవితం ఒక మెట్టు ఎక్కింది. రామవిలాస సభలోకి రావటంతో ఆ మొదటి సత్యాగ్రహం రోజుల్లో రామవిలాస సభ చరిత్రాత్మకంగా ఉండేది. అందులో 75 మంది నటులుండేవారు అందరూ విద్యాధికులు, ఉద్యోగాలు చేసుకునేవారు ''మూడు నాయక పాత్రలూ, మూడు నాయికా పాత్రలూ గల ఏ నాటకాన్నయినా ఆడగలం'' అని గర్వంగా చెప్పుకునేవారు అందులో పిల్లలమర్రి సుందర రామయ్య, మాధవపెద్ది వెంకట రామయ్య డా. గోవిందరాజు సుబ్బారావు, పెద్దిభొట్ల చలపతిరావు, మ్యాస్టరు అంజి, ఏలేశ్వరపు కుటుంబశాస్త్రి లాంటి ప్రసిద్ధ నటులు సభ్యులు. స్థానం వీరి మధ్య వచ్చి పడ్డాడు దాంతో ఆయన శక్తులు వికసించటమే గాక, వాటికి వ్యాప్తి కూడా వచ్చింది. ఆయనకు అంతులేని కీర్తి తెచ్చిన పాత్ర కొప్పరపు సుబ్బారావుగారి ''రోషనార'' నాటకంలో రోషనార పాత్ర. రోషనార ''ట్రాజిక్ హీరోయిన్'' ఆ పాత్రను నిర్దుష్టంగా గాక, అద్భుతంగా నటించిన స్థానానికి ''చిత్రాంగి'' పాత్ర (మరొక ట్రాజిక్ హీరోయిన్) నల్లేరు మీద బండి నడక అయి ఉండాలి ఎందుకంటే రోషనార చిత్రాంగి కన్న చాలా క్లిష్టమైన పాత్ర.

నటుడు ఒంటిరిగాడు కాడు. పక్కన ఉన్న నటుల ప్రతిభ ప్రతినటుడికి సాయం చేస్తుంది. మాధవపెద్ది శివాజీ, స్థానం రోషనార రాణింపుకు అమితంగా తోడ్పడింది. అలాగే, స్థానం మధురవాణి రాణించటానికి మ్యాస్టరు అంజి రామప్పంతులూ, గోవిందరాజు సుబ్బారావు గిరీశమూ చాలా సహాయపడ్డాయి నా ఉద్దేశంలో స్థానం నిర్వహించిన అన్ని పాత్రల లోకీ అత్యుత్తమమైనది మధురవాణి. ఆ పాత్రను గురజాడవారు కూడా మెచ్చుకోదగినంతగా మరొకరు చేయగా నేను చూడలేదు.

తరువాత కిరాయి నాటకాల యుగం వచ్చింది నటులకు వ్యష్టి ప్రాముఖ్యం వచ్చింది. సమష్టి కృషికి విలువ పోయింది. పెద్దనటులందరికీ ''స్టార్ డమ్''

సంప్రాప్తమయింది ఈ ప్రాముఖ్యం స్థానానికి కూడా సంక్రమించింది బందరులో డి.వి. సుబ్బారావు గారి లాగానే తెనాలిలో స్థానం కూడా ఇంచు మించు అనామకులతో ప్రాక్టీసు చేసుకుని 'తులాభారం' లాటివి పరిమితంగా 'విప్రనారాయణ' కూడా ఆడాడు సత్యభామ, చిత్రాంగి పాత్రలు కూడా ఆడాడు. అది నాటకరంగం, పతనమవుతూ వుండిన కాలమే అయినా స్థానం పతనం కాలేదు

ఆ పాటలకు వస్తే, నాటకాల పతనం స్థానం మరింత పైకి రావటానికి దోహదమయింది స్టేజి మీద పాటగాళ్లకు ప్రాముఖ్యం పెరగసాగింది రామనాధశాస్త్రి, జొన్నవిత్తుల శేషగిరి, తుంగల చలపతి, పారుపల్లి సత్యనారాయణ, అద్దంకి, రఘురామయ్య మొదలైన స్టేజి గాయకులు పైకి వచ్చారు చాలాకాలం సంగీతంతో కొట్టుకువచ్చిన సి. యస్ ఆర్ ''ఇక మన పాట ఎక్కడయ్యా! నటనలో పైకి రావలసిందే! '' అనేశాడు. ఈ గాయక తారల మధ్య స్థానం ఎంతటి ప్రతిభావంతుడైన నటుడో మరింత స్పష్టం కాసాగింది

నాటక రంగంలో జరుగుతున్న ఈ పరిణామాలు స్థానాన్ని ప్రభావితుణ్ణి చెయ్యక పోలేదు. ఆయన నటన గురించీ, నాటకరంగం మీద సంగీతానికి ఉండదగిన స్థానం గురించీ చాలా దీర్ఘంగా ఆలోచించి, తన అభిప్రాయాలను వ్యక్తం చెయ్యసాగాడు కాని అవి నాటకరంగ పతనాన్ని అరికట్టలేకపోయాయి. పాటగాళ్ళు చెయ్యలేని పని స్త్రీ నటులు చేసారు – స్థానం వెనకబడసాగాడు. 1941 ఆఖరులో నాట్యకళా పరిషత్తు మద్రాసులో జరిగినప్పుడు ''నర్తనశాల'' లో స్థానం సైరంధ్రి వేసి విశ్వేశ్వరమ్మ (సుధేష్ణ) టి జి. కమల (ఉత్తర) తో బాటు స్టేజి మీదికి వస్తే, ఆయన రాకుండా ఉంటే బాగుండే దనిపించింది మర్నాడు స్థానం నన్ను నాటకం ఎట్లా ఉందని అడిగితే ఆ మాటే అనవలసి వచ్చింది

వ్యక్తిగా స్థానం నిరాడంబరుడు. అతిశయం లేనివాడు. స్నేహపాత్రుడు. కాని నటుడుగా ఆయనకు చాలా మంది శత్రువులేర్పడ్డారు. మాధవపెద్దీ, హార్మోనిస్టు సత్యనారయణా స్థానంతో మాట్లాడని రోజులు నాకు తెలుసు. తోటి నటులు స్థానంతో సహకరించకపోవడం జరిగినట్టు విన్నాను. కీర్తి అన్నది చాలా చిక్కులు తెచ్చిపెడుతుంది.

నాటక ప్రయోక్తగా స్థానం గొప్ప విజయాలు సాధించినట్టు నేను ఫీలయాను. ఆయన ప్రొడ్యూస్ చేసిన రేడియో నాటకాలలో అనామకులు కూడా ఎంతో చక్కగా నటించారు నిజానికి నాటకాలు డైరెక్టు చెయ్యటంలో స్థానానికి అపారమైన అనుభవం ఉన్నది. ఆయన స్వయంగా తన నాటక సమాజాన్ని నిర్వహించిన కాలంలో ఇతర నటులను తానే డైరెక్టు చెయ్యటం జరిగింది

స్థానం సినిమాల లోకి ఆరంభదశ లోనే డైరెక్టుగా వచ్చి ఉండవచ్చు. అప్పట్లో సినిమారంగంలో సాంకేతిక ప్రావీణ్యం ఏమంత లేదు. సినిమా చిత్రాలు స్టేజి నాటకాల

లాగే ఉండేవి. అయితే, ఇప్పట్లో సినిమాలు స్టేజి నాటకాలకన్న చాలా హీనదశలో ఉండేవి. నాటకరంగంపై అంతస్తులో ఉన్న స్థానానికి సినిమా ఒక గొయ్యిలాగా కనిపించేది. కాని ఇప్పుడు ఆయన సినిమా డైరెక్టరుగా పెట్టి ఉంటే ఆ కాలపు డైరెక్టర్లెవరికీ తీసిపోని పేరు గడించి ఉండును. అయితే ఇటీవల సినిమారంగంలో కలిగిన పరిణామాల మూలంగా స్థానం స్థానభ్రష్టుడై ఉండేవాడే!

స్థానం చాలా బాగా చీర కట్టేవాడన్నది జగత్ప్రసిద్ధం అయితే ఆ చీరకట్టు ఆ కాలపు యువతులు అనుకరించ యత్నించలేదు. మహారాష్ట్రలో బాలగంధర్వ ఆ పని సాధించాడు. మహారాష్ట్రులు సాంప్రదాయికంగా గోచిపెట్టి కడతారు. అందులో ఒక అందం చూశాడు బాలగంధర్వ. ఆ పద్ధతి కొత్త తరం మరాఠీ స్త్రీలు పూర్తిగా అనుకరించారు.

చెప్పవచ్చిందేమంటే, ఈనాడు మనకు స్థానం పేరూ, ప్రతిష్ఠా తప్ప సంచితంగా ఆయన తాలూకు ఏమీ మిగలలేదు. ఇది శోచనీయం.

*వసుధ మాసపత్రిక, ఏప్రిల్, 1971*

# 13. తెలుగులో నాటకకళ

ప్రపంచంలో నాటక కళ చాలా ప్రాచీన మైనదీ, పరిణతి పొందినదీనూ మన దేశంలో సంస్కృతనాటకాలు ఉచ్ఛదశలో ఉన్నకాలంలో ప్రపంచంలో ఎక్కడా నాటకకళ అంత అభివృద్ధి చెందలేదని చెబుతారు. భాసుడి ''ప్రతిమ'' లో నాటకాలాడటం గురించి ప్రస్తావన ఉన్నది భాసుడు చాణుక్యుడి కాలం వాడని కనీసం వాదిస్తున్నారు. అంటే క్రీస్తుపూర్వం మూడున్నర దశాబ్దాల క్రితం భాసనాటకాలవంటి ఉత్తమ నాటకాలు ఉండటమే గాక, అప్పటికే నాటక ప్రయోగం ఒక కళగా అమలులో ఉండి ఉన్నదన్నమాట.

మన తెలుగువాళ్లు ఏ నూరేళ్ల క్రితమో ప్రదర్శితనాటకాల పరిచయం ఆరంభించారు. ఎందుచేత? నాటకాలున్నాయి. తెలుగునాటకాలు కాకపోతే సంస్కృత నాటకాలు, కాని మనవాళ్లు వీధినాటకాలే చూశారు. కారణం రంగస్థలం లేకపోవడం. అది ఏర్పడగానే సంస్కృత నాటకాలు తెలుగులోకి తర్జుమా అయాయి. కొత్త నాటకాలు కూడా పుట్టుకొచ్చాయి.

దీనిని బట్టి ఒక విషయం స్పష్టమవుతున్నది. నాటక కళకు నాటక రచన కన్న కూడా రంగస్థలం చాలా ముఖ్యం.

రంగస్థలం యొక్క ప్రాముఖ్యం మరొక విధంగా కూడా స్పష్టమయింది. దానిలో కలిగే పరిణామాలు నాటకరచనలో పరిణామాలకు దారితీశాయి. తీస్తున్నాయి.

తెరలూ, సైడ్‌వింగ్‌లూ పోయి సెట్టింగులు వచ్చాయి మధ్యలో రివాల్వింగ్ స్టేజి ప్రెస్‌పెర్కు వచ్చాయి - పోయాయి

'అనుకోవటానికి పనికిరాపోయ్. బావ'' అని గిరీశం అన్నాడేగాని, తెలుగు నాటక రంగం ఇప్పటి దాకా అంతో ఇంతో అనుకోవటం మీదే నడుస్తూ వస్తున్నది

పాత్రలు గ్రాంధికం మాట్లాడితే అది వాళ్ళ సహజభాషే అనుకొన్నాం

పురుషులు స్త్రీ పాత్రలు ధరిస్తే ఆడ అనుకున్నాం.

పాత్రలు పద్యాలూ, పాటలూ పాడితే అదంతా వాచికమే అనుకున్నాం

వీధికర్టెను చూసి వీధి అనీ, చెట్ల కర్టెన్లను చూసి అడవి అనీ, దర్బారు సీనుల్లో కొయ్యకుర్చీలను, సింహాసనం అనీ అనుకున్నాం

ఇంకా ఎన్నో అనుకుంటేనేగాని మనం నాటకాలను చూసి కొంత అయినా ఆనందం పొందడం సాధ్యమై ఉండేది కాదు.

అనుకోవటాలు అంతకంతకూ తగ్గాయని కొందరు పొరపాటు పడగలరు. అలాటి దేమీ లేదు. ఒకేనాటకంలో అయిదుగురు కృష్ణపాత్ర నిర్వహిస్తు ఉంటే మనం అదంతా ఒకే కృష్ణ పాత్ర అనుకోగలుగుతున్నాం

అయితే ధార్వాడ కంపెనీ నాటినుంచి నాటక కళలో అభివృద్ధి రాలేదనుకోవటం కూడా భావ్యం కాదు. అభివృద్ధి వచ్చింది. నాటకం మధ్యలో హరిప్రసాదరావుగారు '' ఔటాఫ్ పార్ట్'' అంటూ ప్రేక్షకులతో ఏదో చెప్పుకుని మరుక్షణమే హరిశ్చంద్రుడు అయిపోవటం గత చరిత్రే. అది మరి తిరిగిరాదు స్థానం లాగ నాటకంలో లేని అభినయమూ, సంభాషణలూ చేసి ప్రేక్షకులను రంజింప చేయటం కూడా గత చరిత్రే అనుకోవచ్చు.

నాటక కళ అభివృద్ధి అవుతూనే వస్తున్నదిగాని, రసజ్ఞులు అనేక ఘట్టాలలో దాని మందకొడి తనాన్ని తీవ్రంగా విమర్శించారు. స్టేజి మీదపద్యాలు పాడరాదని భమిడిపాటి కామేశ్వరరావు గారు ఉపన్యాసాలిచ్చారు. రాఘవాచారిగారు పద్యాలను పాడినట్లు అనిపించకుండా పాడేవారు. పద్యంలో పెద్ద సంగతులు వెయ్యటం గురించి స్థానం వారుకూడా ఆక్షేపించారు.

అలాగే స్త్రీ పాత్రలను స్త్రీలే ధరించాలన్న వాదం కూడా చలంగారే (తెచ్చింది) వచ్చింది.

అయితే-

ఈ సంస్కరణలు విధిగా అమలు జరగలేదు.

జరగలేదు సరిగదా, పరిస్థితి ఎదురు తిరిగింది. నాటక రంగస్థలం పైన గాయకులు ''స్టార్ డమ్'' సంపాదించారు. కపిలవాయి రామనాథశాస్త్రి, జొన్నవిత్తుల

శేషగిరి, తుంగల చలపతి రఘురామయ్య, అద్దంకి శ్రీరామమూర్తి ఇంకా అసంఖ్యాకులైన పిల్లరగాయకులూ స్టేజి మీద తమపాటతో ప్రేక్షకులను అసంఖ్యాకంగా ఆకర్షించసాగారు 'సక్కుబాయి' నాటకం పెద్దహిట్ అయి, అందులో పాత్రధారణ చేసిన వారికి ఆర్థిక బాధలు లేకుండా చేసింది గొప్ప నటుడైన స్థానం ధరించిన స్త్రీపాత్రంతో తుంగల చలపతి నటుడు కాకుండానే పోటీ చేశాడు

నాటకాల కన్న రంగస్థలం ముఖ్యమని అది వరకు రుజువైతే, రంగస్థలంకన్న ప్రేక్షకులు ముఖ్యమని ఇప్పుడు రుజువయింది ఇది నాటకానికి దీనదశ ఈ దశలోనే సినిమాలు నాటకాలను చావబాదేశాయి.

ఈ పతనావస్థనుంచి నాటకాన్ని అంతో ఇంతో ఉద్ధరించినది ఔత్సాహికులు - ఔత్సాహిక నాటకకర్తలూ, నటులూనూ, వీరికి రంగస్థలం అప్రధానం ప్రేక్షకులలో అభిరుచిగల వారికోసం క్రొత్త రకం నాటకాలూ, నాటికలూ వచ్చాయి. ఈ కొత్త దశకు ప్రోత్సాహం లభించింది, ప్రజానాట్య మండలి ద్వారా ఆశయంలో ఇవి అభ్యుదయ నాటకాలు. సామాజిక జీవితాన్ని ప్రతిబింబించటమూ, విమర్శించటమూ వీటి ప్రధాన ఆశయం. సమాజాన్ని సంస్కరించడానికి బయలుదేరిన ''చింతామణి'' ''వరవిక్రయం'' లాటి నాటకాలకన్న ఇవి ఒకమెట్టుపైకి వెళ్లాయి. సామాజిక లోపాలను వ్యక్తులకు అంటగట్టక, ఈ నాటకాలు వ్యవస్థను తూర్పార పట్టయత్నించాయి

ఈ నూతన నాటక తత్వాన్ని అవగాహన చేసుకున్న నటులే వాటిలో పాత్ర ధారణ చేశారు

కాని నాటక కళ అచ్చగా నాటకాలతోనే ముందుకు పోలేదని మరొకసారి రుజువయింది. నాటకాలు ముందుకు రావాలంటే ఆ నాటకాలకు తగిన రంగస్థలమూ, ప్రేక్షకులూ కూడా ఉండాలి. మూడు అంశాలూ కలిసి పెరగాలి. అదే జరగలేదు.

నాకు తమిళనాటకాలతో గల కొద్ది పరిచయంతో గొప్ప సత్యాన్ని గ్రహించాను పాతికేళ్ల క్రితం - 1947లో అతి విజయవంతమైన తమిళ నాటకం చూశాను. అది ఎంత విజయవంతమైన నాటకమంటే మాకు పదిరూపాయలకు తక్కువ టికెట్టు ఆఖరుక్షణంలో దొరకలేదు.

ఆనాటకం గురించి నా అభిప్రాయం అడిగితే అది భయంకరమైన నాటకం. అంతకన్న పాడు నాటకం నా జన్మలో ఎన్నడూ చూశానని నాకుతోచలేదు. 'మాభూమి', 'ముందడుగు' నాటకాలు చూసిన కళ్లతో ఆ నాటకం చూడటం నాకు దాదాపు అసంభవమనిపించింది.

''తమిళనాటకం ఇంత హీనస్థితిలో ఉన్నదా?'' అనుకున్నాను అది నా అజ్ఞానమని ఇప్పుడు తెలుసుకుంటున్నాను నా అజ్ఞానమేమిటో కొద్దిక్షణాలలో వివరిస్తాను.

అసలు రహస్యం ఏమిటంటే ఆనాడు తమిళనాటక కళ ఉచ్ఛస్థితిలోనే ఉన్నది ఆనాడే కాదు, ఈనాడు అది మరింత ఉచ్ఛస్థితిలో ఉన్నది. ఇటీవల ఒక తమిళ నాటక సమాజంవారు నన్ను తమ నాటక ప్రదర్శనలు రెండింటికి ఆహ్వానించారు రెండు నాటకాలకూ హాళ్ళు నిండాయి బయటి ఆవరణలో కార్లు నిండాయి.

నాటక ప్రదర్శనంలో ఎక్కడా వేలెత్తి చూపటానికి లేదు. నటులూ, వాద్యగాళ్లూ మిలిటరీ డిసిప్లిన్ ప్రదర్శించారు పాఠ్లలకోసం తడుముకోవడం గాని, ఒకరికొకరు అనుకోకుండా అడ్డురావటం కాని మచ్చుకైనా లేదు నాటకం లంచన్‌గా అనుకున్న టైముకి ప్రారంభించి ఏనిమిషానికి అయిపోతుందో ముందే చెప్పేశారు – అలాగే ముగించారు ప్రతి చిన్నవేలి కదలికా క్షుణ్ణంగా రిహార్సల్స్ చేసినట్టే ఉన్నది. రంగం మారి మరొక రంగం వచ్చే వ్యవధిలో పక్కవాళ్ళతో మాట్లాడు కోవటానికి లేదు.

చిత్రమేమిటంటే ప్రేక్షకుల రియాక్షన్ కూడా ముందే క్షుణ్ణంగా రిహార్సల్స్ చేసినట్టుగా ఉన్నది. ఎవరో ఏమూల నుంచో నవ్వటం గాని, చప్పట్లు కొట్టటంగాని లేదు నవ్వితే ప్రేక్షకులందరూ నవ్వుతారు చప్పట్లు కొడితే హాలంతా మార్మోగుతుంది.

నేను చూసిన నాటకాలను గురించి నాఅభిప్రాయం అడుగుతారా! అవి అంతమంచివికావు. ఒక పాత్రలోని ప్రధాన పాత్రలు ఉదాత్తత ఉన్నట్టు భ్రమ కలుగుతుంది గాని, నిజంగాలేదు రెండోనాటకంలో మొదట జాతీయతే లేదు కాని పాతికేళ్ళ క్రితం నేను చూసిన నాటకంతో పోలిస్తే ఇవి చాలా మెరుగు ప్రేక్షకుల రియాక్షన్‌కూడా చాలా రెట్లు మెరుగు. పాతికేళ్ళ క్రితం ప్రేక్షకులు ఆటవికులని పించారు. ఈనాటి ప్రేక్షకులు గొప్ప కళావేత్తలు కాకపోవచ్చుగాని వీళ్ళు నాగరికులు.

తమిళనాటకం ప్రేక్షకులకు ఎడంగా ఏనాడూ పోలేదు వాళ్లను ఆకట్టుకునే అంశాలు ఏవో వాటికి పెద్ద పీటవేసింది. జనం యొక్క నాటకాభిరుచిని అంటిపెట్టుకుని ఉండటంతో పాటు ఆ అభిరుచిని క్రమంగా అభివృద్ధికి తెస్తూ వస్తున్నది. నాటకం మంచిదా, చెడ్డదా అన్నది ఆఖరు ప్రశ్న. మొదటి ప్రశ్న ప్రేక్షకులు ఏమి కోరుతారు అన్నది. అది నిర్ణయమైనాక ప్రదర్శనా సామర్థ్యం. ఈ రెండూ సాధించాక నాటకం.

ఈ ఫార్ములాను తమిళ నాటకకళ ఏనాడూ విడిచి పుచ్చునట్టు నాకు తోస్తుంది. ప్రేక్షకుల అభిరుచులలోనూ, ప్రదర్శనా ప్రమాణములోనూ, నాటకాలలోనూ ఈ పాతిక ఏళ్లలోనూ ఎంతో అభివృద్ధి కనుపిస్తున్నది.

కాని తమిళనాటకాలు ఇంకా నా ప్రశంసలను ఎందుకు పొందలేకపోతున్నాయి? తెలుగు వాణ్ణిగా నేను ముందే నాటకానికి కనీస ప్రమాణాలు నిర్ణయించుకున్నాను కనక! ఇది తెలుగుదనం, తెలుగు నాటక కళను పైకితెచ్చే మనస్తత్వం కాదిది.

ఇవాళ మన తమిళ సోదరులు తోలు బొమ్మల స్థాయి నాటకాలతో ప్రారంభించినా, ఎంతో కొంతకాలానికి వారు నాటకకళను పైకి తీసుకురాగలరు ఏనాటి పద్యాల, నిజంగా మంచి నాటకాలు మనకుండి కూడా మనం నాటకకళను అధోగతి పాలు కాకుండా ఆపలేక పోయాం మన ప్రేక్షక సామాన్యం ''చింతామణి'', ''కురుక్షేత్రం'' లాంటి నాటకాలకు ఎగబడుతున్నారు! మన నాటక కళకు ఆర్థిక విజయమంటూ లభిస్తే ఈ ఉప్పుగుంటలోనే లభిస్తున్నట్టు కనిపిస్తుంది

మనకూ మహానటులుండేవారు గొప్పనాటకాలుండేవి కాని గొప్ప ప్రేక్షకులు ఎక్కడ? ప్రేక్షకులకు నాటక కళ ఇచ్చిందేమిటి? ఏమీలేదు మన నాటక కళను ఉద్ధరించే వారు నాటకాల పోటీలు పెట్టి ఎవరూ చూడగోరని నాటకాలకు బహుకృతులిచ్చేకన్నా ప్రేక్షకులనుగురించి ఆలోచించడం మొదలు పెట్టిన నాడు తెలుగునాటకకళ ముందుకు పోవటం మొదలు పెడుతుంది

ఇది ఏ తమిళ ప్రేక్షకులనూ అనుకరించడం ద్వారా సాధ్యంకాదు తెలుగు ప్రేక్షకులను నిద్రలేపే శక్తి గల తెలుగు నాటకాలు రావాలి. అటు తరవాత వారి అభిరుచులను పెంచుకుంటూ పోయే నాటకోద్యమం నడవాలి. ముఖ్యంగా నాటకరంగంలో పనిచేసే వారికి మిలిటరీ డిసిప్లిన్ అవసరం తమిళ నటులలో ఏ కోశానా గర్వం గాని, అతిశయం గాని వున్నట్లు నాకు తోచలేదు. 175 ప్రదర్శనలిచ్చిన నాటకాన్ని చూసి ప్రదర్శన చాలా బాగున్నదంటే నటులు థాంక్స్ చెప్పారు. తన గొప్పదనం గురించి మాత్రమే ఆలోచించే నటులు వారిలో ఉన్నట్టు నాకెక్కడా తోచలేదు.

మనం తమిళ నాటకాల వాళ్ళను అనుకరించే అవసరం లేదుగాని వారినుంచి నేర్చుకోదగినది చాలా ఉన్నది.

*గోపీచంద్ ఆర్ట్స్ సావనీర్, 1972*

# 14. నాటక పరిశ్రమ

భారత దేశంలో భాసకాళిదాస భవ భూత్యాదులు నాటకాలు రచించేకాలానికి ప్రపంచంలో ఎక్కడా నాటకం అంత ఉన్నతికి వచ్చి ఉండలేదని బ్రిటిష్ ఎన్‌సైక్లోపీడియాలో చదివాను. అయితే, కిందటి శతాబ్దంలో మాత్రమే పుట్టిన తెలుగునాటకం అనుకరణ, అభాస, ప్రయోగాన్వేషణ దశలను దాటి సమాజంలో ఊడలు దించినట్టుకనబడదు. దీనికి కారణం నాటక లక్ష్యం ఒకటి స్పష్టంగా లేకపోవటం కావచ్చు.

ఆరంభంలో ప్రజలను ఆకర్షించిన నాటకాలు అనువాదాలు (శాకుంతలం, వేణీ సంహారం, రత్నావళి లాటివి) లేదా పౌరాణికాలు (గయోపాఖ్యానం, సత్యహరిశ్చంద్రీయం,

పాదుకా పట్టాభిషేకం, సతీసావిత్రి, ప్రహ్లాద లాంటివి) కాని అప్పటికి ప్రజలలో పురాణ సంస్కృతి ఏమీలేదు. ఇలాంటి నాటకాల ప్రదర్శనల ఘనవిజయం ఏమిటంటే 'రక్తి' కట్టటం

వీటికన్న చరిత్రతో సంబంధం ఉన్నట్టుగా రాసిన నాటకాలు (ప్రతాపరుద్రీయం, పీష్వా నారాయణరావు, రోషనార లాంటివి) అచ్చంగా రక్తికట్టడంలో సరిపుచ్చుకోక ప్రజల జాతీయభావాలను కొంతవరకు స్పృశించాయి.

ఈ అన్నిరకాల నాటకాలకన్న సమాజానికి దగ్గరగావచ్చినవి సాంఘిక నాటకాలు (కన్యాశుల్కం చింతామణి, వరవిక్రయం లాంటివి) ఇవి అయినా సమాజంలో వేళ్ళు తన్నటానికి అవకాశం లేకుండా అనేక ఇతర విషయాలు అడ్డుతగిలాయి.

వీటిలో ఒకటి సంగీతం. రెండవది నటుల ఆరాధన. పేరువడినస్టేజిగాయకులు నటులు తెలుగు నాటకరంగాన్ని ఏలటమేగాక, కిరాయి నాటకాలకు మంచి ఉపాధి కలిగించారు. ఎవరన్నా కిరాయి నాటకాల చరిత్రరాస్తే అది వెయ్యిపేజీల గ్రంథం అవుతుంది. కంట్రాక్టర్లు నటులకు డబ్బు ఎగగొట్టటాలూ, నటులు హాజరు కాకపోవటం, ఒకేనటుడు ఒకేరాత్రి రెండు ఊళ్ళల్లో నటించటం, ప్రేక్షకులు రెచ్చిపోయి కుర్చీలు విరగగొట్టటాలూ, నటులు వేషధారణతోనే గోడలుదూకి ప్రాణాలు రక్షించుకోవటాలూ, పాయిఖానాలలో దూరికిపోయి బడితపూజలు చేయించుకోవటం మొదలైన రసవత్తర ఘట్టాలు అందులో వుంటాయి.

ఆంధ్రలో ప్రజానాట్య మండలి వెలిశాకనే తెలుగునాటకం ఒకమంచి దారినపడింది నటులదృష్టి ప్రతిభకూ సంగీతానికన్న హెచ్చువిలువ నాటకానికి రావటం ప్రజానాట్యమండలి ద్వారానే జరిగింది. అదీగాక నాటకం పూర్వం ఎన్నడూ లేనంతగా ప్రజలకు అంకితమయింది. వాటి రక్తి అంతా ఇతివృత్తంలోనూ, రచనలోనూ ఉన్నది. అందుకే ఆ నాటకాలను ఎన్ని ట్రూపులు ఆడినా ప్రతిచోటా ప్రజలు ఎగబడి చూశారు. నాటక ప్రదర్శనలో వుండే క్రమశిక్షణ ప్రేక్షకులలో కూడా కనబడటం ఈ నాటకాలలో స్పష్టంగా కనబడింది.

ప్రజానాట్యమండలి అంతరించినా, దాని ప్రదర్శనలలో పాల్గొన్ననటులు సినిమా రంగంలో కిరాయి నటులు అయిపోయినా దాని ప్రభావం నాటక రంగం మీద ఇంకా అంతో ఇంతో నిలిచి ఉన్నది. సామాజిక లక్ష్యంగల నాటికలూ, నాటకాలూ కొల్లలుగావచ్చాయి. రా వి శాస్త్రిగారి నిజం, తిరస్కృతి లాంటి నాటకాలు ప్రజానాట్యమండలి లక్ష్యాలను బాగా ప్రతిబింబిస్తాయి. అయితే ఈ నాటి సమస్య ప్రదర్శనకు సంబంధించినది. ఇది ''పెళ్లి - పిచ్చి'' సమస్య. నటులు నటులుగా బతికే ఆస్కారం ఉండే దాకా నాటకం బలపడదు. అది బలపడినదాకా నటులు ఔత్సాహికులుగానే ఉండి పోకతప్పదు. ఈ సమస్యను తమిళనాటకాల వారూ, ప్రేక్షకులూ పరిష్కరించేశారు. మద్రాసులో తమిళనాటకం ఆడితే హాలులో ఖాళీసీట్లుండవు. ఆంధ్రలో అయిదుగురు కృష్ణులుంటేగాని హాలు నిండదట

ఇతి వృత్తాలకు సంబంధించిన సమస్య కూడా ఉన్నది జీవితం రోజురోజుకు మారుతున్నది ఇది సామాజిక విప్లవదశ ఈ పోకడను గుర్తిస్తే తప్ప ప్రజా జీవితానికి సన్నిహితమైన నాటకాలు రావు (ఈవిషయంలో తమిళ నాటకాలకు ఏమీ పేలువ లేదు) తెలుగుదేశంలో విప్లవ సాహిత్యోద్యమం బాగా వ్యాప్తి చెందుతున్నది దానికి అనుగుణంగా విప్లవ నాటకాలు రావాలి అప్పుడు తెలుగు నాటకం ఊడలు దించటం ప్రారంభిస్తుంది.

*తృతీయ నాటకోత్సవ సంచిక, రైల్వే ఇన్స్టిట్యూట్, విజయవాడ, 1973-1974*

# 15. నాటకాలలో సామాజిక దృక్పథం

సినిమాలలాగే నాటకాలు కూడా కళల మిశ్రణాలు. సాధారణంగా నాటక కళయొక్క సమగ్రరూపం గురించి ఎవరూ ఆలోచించరు, పట్టించుకోరు కూడా.

సామాన్య ప్రజలకు నాటకం అంటే తాము రంగస్థలంమీద చూసే ప్రదర్శనా, అందులో పాత్రలు ధరించినవారూ, రంగాలంకరణా, సంభాషణలూ, అభినయమూ, రక్తికట్టడమూనూ. ప్రతి నాటకం వెనకా ఒక నాటకకర్త ఉంటాడని అందరికీ తెలుసు. కాని ఆ నాటకానికీ, నాటకకర్తకూ ఉండే సంబంధంగాని, ప్రదర్శనకూ, దాన్ని డైరెక్టు చేసినవాడికీ ఉండే సంబంధంగాని ఊహించటం తేలికకాదు

ఒకప్పుడు ఈ సంబంధం ఎంత గోప్యంగాను, అనవసరంగానూ' ఉండేదంటే, సత్యహరిశ్చంద్రీయం, చిత్రనళీయం, సావిత్రి, పాదుకా పట్టాభిషేకం, కన్యాశుల్కం లాంటి నాటకాలను చూసిన లక్షలాది ప్రేక్షకులలో నూటికి తొంభైతొమ్మిది మందికి ఆనాటకాలలో ముఖ్యపాత్రలను ప్రసిద్ధంగా నటించినవారి పేర్లు తెలుసుగాని, నాటకకర్తలు ఎవరో తెలీదు. తెలియనవసరం లేదు కూడా. ఇక స్టేజి డైరెక్టర్ల మాట చెప్పనే అక్కర్లేదు - డైరెక్టర్లు ఉండేవారే కాదు బెజవాడ నుంచి ఒక నటుడూ, తెనాలినుంచి ఇంకోనటుడూ, ఏలూరునుంచి ఒక నటుడూ వచ్చి, ఒకరినొకరు పలకరించుకొనైనా పలకరించుకోకుండా తమ పాత్రలు ధరించి, నాటకం ఆడి, తమ తమ కిరాయిలు తీసుకొని వెళ్ళిపోయేవారు. ఈ నాటి సినిమా నటులను డైరెక్టు చెయ్యటం ఎంత దుస్సాహసమో ఆనాటి స్టేజి నటులను డైరెక్టు చెయ్యటం అంత అనవసరం.

నటుడు ఎవరు? నాటకం ఏమిటి? రెంటికీ మధ్య సంబంధం ఏమిటి? అన్న ప్రశ్నలు ఆనాడు తల ఎత్తలేదు నాటకాల ఇతివృత్తాలు సమకాలీనమైనవి కావు. వాటిని వాస్తవంగా చిత్రించే అనుభవం నాటక కర్తకు ఉన్నదా అని ఎవరూ అడిగేపని లేదు.

గయోపాఖ్యానం లోనూ, సత్యహరిశ్చంద్రీయం లోనూ విరోధంలో కొన్ని పాత్రలు వీధి మనుషులకన్న ఘోరంగా ఒకదాన్ని ఒకటి తిట్టుకుంటే, ''ఇందులో పాత్రల ఔచితి లేదేమో'' అనటానికి లేదు పాత్రోచిత భాషకు మొదలు అవకాశమే లేదనుకోండి

* * *

ఆనాడైనా, ఈనాడైనా నాటకాలు రక్తి కట్టటానికీ, ప్రయోజనాత్మకంగా ఉండటానికీ ఎలాటి సంబంధమూ లేదు ఒకప్పుడు నాటకరంగం మీద రికార్డులు నెలకొల్పిన 'సక్కుబాయి' చాలా చెత్తనాటకం కాని దైతా గోపాలంగారి దివ్యమైన పాటలూ, జొన్నవిత్తుల శేషగిరీ, తుంగల చలపతీ పాడిన దివ్యమైన సంగీతాలూ, యాలం గంగయ్య (హాస్య చక్రవర్తి) ఒకదాని కొకటి సంబంధం లేకుండ ధరించిన నాలుగు పాత్రలూ సక్కుబాయి ప్రదర్శనలకు అంతులేని ప్రజాదరణ సాధించాయి ''Good theatre, good drama'' అన్న విచక్షణ ప్రపంచమంతటా ఉన్నది.

రంగస్థలంమీద సామాజిక స్పృహకు చోటు దొరకటానికి మొట్టమొదటి బీజం ప్రజానాట్యమండలి వేసింది. వాళ్ల నాటకాలుకూడా రక్తికట్టాయి. కాని అచ్చుగా ప్రదర్శన చాతుర్యం వల్ల కాదు అవి సామాజిక దృక్పథాన్ని రంగస్థలంమీద ప్రతిబింబించాయి.

ప్రజానాట్యమండలి రాకముందు కాళ్లకూరి నారాయణరావుగారు రాసిన ''చింతామణి'', ''వరవిక్రయం'' లాటి నాటకాలు కొన్ని సామాజిక దురాచారాలను తూర్పారబట్టినమాట నిజమే. కాని నాటకం రక్తికట్టటానికి వినియోగించిన సూత్రాలచాటున నాటకం చేసిన ప్రచారం కనబడకుండా పోయింది. ఉదాహరణకు చింతామణి మామూలు వేశ్యలకు ప్రతినిధి కాదు, అలాగే కట్నాలు పుచ్చుకునే వాళ్ళందరూ సింగరాజు లింగరాజు లాంటి పిసినిగొట్టులు కారు అలాంటి అసాధారణ పాత్రలద్వారానూ, చమత్కార సంభాషణల ద్వారానూ రక్తికట్టే నాటకం సామాజిక స్పృహను పెంచటం జరగదు.

* * *

యుద్ధకాలం తరవాత, ప్రజానాట్యమండలి సృష్టించిన వాతావరణంలో, కొత్తరకం నాటకాలు వచ్చిన మాట నిజం. వీటిలో విజయవంతమైనవన్నీ దాదాపు ప్రదర్శనలో సామర్థ్యం ఉండటంవల్లనే పేరుతెచ్చుకో గలిగాయి. వాస్తవమైన సమస్యలు తీసుకున్నప్పుడు కూడా, రచయితకు ఆ సమస్యగురించి సన్నిహితమైన అనుభవం లేకనో, లేక రక్తికోసం దాని స్వరూపాన్ని మార్చటంవల్లనో, సమస్యకన్న పాత్రలకు మితిమీరిన ప్రాముఖ్యం ఇయ్యడంవల్లనో నాటకరంగంమీద సామాజిక దృక్పథం దెబ్బతింటుంది.

కొత్తగా వచ్చే నాటకాలను అంచనా వెయ్యటానికి మనం కన్యాశుల్కం గీటురాయిగా ఉపయోగించవచ్చు. నాటకానికి సంబంధించిన అనేక విలువలు అందులో

నిర్దిష్టంగా ఉన్నాయని నేను అనుకుంటున్నాను ఉదాహరణకి, అందులో ''నాటకీయత'' కోసం ఎగదోసిన పాత్ర లేదు ఏ పాత్రకు ఉండే ప్రాముఖ్యం దాని కున్నది పాత్రచిత్రణలోనూ, సంభాషణలలోనూ వాస్తవికత గురించి చెప్పనే అక్కర్లేదు కన్యాశుల్కం ఈనాటి జీవితాన్నిగాని, వ్యక్తులనుగాని ప్రతిబింబించదు అయినా రచనరీత్యా అది ప్రమాణంగా ఎంచదగిన నాటకం అప్పారావు గారు తన కలంపాళీలో ఇమడని పాత్రలను తీసుకోలేదు. కన్యాశుల్కం కూడా దాన్ని ప్రచారం చెయ్యటానికి అప్పారావుగారు సుబ్బిని నూతిలో పడెయ్యలేదు. ఎవరినీ చంపలేదు. కాని ఆడపిల్లల్ని అమ్మటంలో ఉన్న హైన్యం చాలా చక్కగా చిత్రించాడు నూతిలో పడిన సుబ్బి తల్లిని కాపాడిన గిరీశానికి కన్యాశుల్కం గురించి ఏమీ పట్టలేదు! వాడి గొడవ ఎంతసేపూ ''యంగ్ విడోజ్''.

ఎన్ని చెప్పుకున్నా, సినిమాలలాగే నాటకాలుకూడా బతికి బట్టకట్టాలంటే రంగస్థలంమీద రక్తికట్టటమూ, విజయం సాధించటమూ చాలా అవసరం అలా రక్తికట్టిన పది నాటకాలలో ఒకటి రంగస్థలాన సామాజిక విలువను గట్టిగా సంస్కరించగలిగినా మిగిలిన తొమ్మిది నాటకాలూ వృధాకావు ఇరవై తరాల అనామకులకు ఒకడు లోకోత్తరుడు కాగలిగితే, ఆ అనామకులందరూ తరించినట్టే ఈ పాతకాలపు విశ్వాసం ఈనాడు కళలకూ వర్తిస్తుంది. మరి!

*శ్రీకళా నికేతన్ హైదరాబాద్, నూరేళ్ళ తెలుగు నాటకరంగం*
*జూలూరి వీరేశలింగం స్మారక సంచిక 1980*

# 16. అభివృద్ధా? మార్పా?

లోకంయొక్క మేలుకోరేవారు లోకానికి సంబంధించిన అనేక విషయాలను గురించి ఈ ప్రశ్న వేసుకుంటూ ఉండాలి. అటువంటి ప్రశ్నలు వేసుకోటం ఏ సంఘంలో ఆచారంగా ఉండదో ఆ సంఘం మధ్యమధ్య తీవ్రమైన సంస్కరణలపాలవుతూ ఉంటుంది. అప్పుడప్పుడు వృధాధనవ్యయమూ తప్పుతుంది.

ఇతరవిషయాలతో ఇప్పుడు నాకు జోక్యంలేదు. నేనీవ్యాసంలో కేవలం రంగస్థలానికి సంబంధించిన విషయాలే తీసుకుంటాను.

మనకిప్పుడు కావలసింది అభివృద్ధికాదు, మార్పు. ఒకవిధంగా ఆలోచిస్తే మార్పే అభివృద్ధి, ఇప్పటి మనస్థితికి.

**నాటకాలు**

ఇప్పుడున్న నాటకాలకన్న మంచివి కాదు మనకు కావలసింది భిన్నమైన నాటకాలు కావాలి. అసలు నాటకాలకూ కూచిపూడి భాగోతానికీ భేదాలు ఆలోచిస్తే

ముఖ్యమైన అంశమేమిటంటే, కూచిపూడి భాగోతులు నాటకం ఆడేటప్పుడు ప్రేక్షకుల భావనాశక్తిమీద ఆధారపడతారు ప్రేక్షకుడు ప్రతిక్షణమూ విమర్శిస్తూ ఉండరాదు. ప్రహ్లాదుడు హింసించబడుతున్నట్టు భావించాలి హిరణ్యకశిపుడు సింహాసనం మీద కూర్చున్నట్టు భావించాలి అంతా అదేపనిగ ఆ భాగోతం జీవితాన్ని ప్రతిఫలిస్తున్నట్టు నటించదు హిరణ్యకశిపుడి పాత్ర ధారి రంగంమీద ప్రవర్తించటానికి హిరణ్యకశిపుడి ప్రవర్తనతో ఏలాటి సంబంధం లేదు. హిరణ్యకశిపుడు మనయెదట సాక్షాత్కరిస్తే మనలో ఎటువంటి వికారాలు కలుగుతవో ఆ వికారాలను మనలో కలిగించటమే అతడిపని అది తక్కువకళ అని చెప్పను కాని ఇవాళ మనకున్న నాటకాలు కూచిపూడి భాగోతం యొక్క అభివృద్ధియొక్క ఫలితాలా? కావు. భాగోతాన్ని పూర్తిగా వదిలేసి మార్పు తెచ్చి పెట్టుకున్నాం. మన మొదటి నాటకాల్లో భాగోతంలో వున్న నేర్పులేదు.

నేటి నాటకం చాలా దుస్థితిలో ఉంది. నేటి నాటకం సగంప్రేక్షకుల భావనాశక్తి మీద ఆధారపడి ఉండి మిగిలినభాగంలో స్వతంత్రిస్తున్నది. నే నీరోజు నాటకం చూడబోతే ఆ ఊగిసలాడే తెరరాజుగారి దర్బారు భవనమని భావించాలి. ఆ గుడ్డకప్పిన బల్ల హంసతూలికా తల్పం అనుకోవాలి అచంకీబంగారం, ఆ ఆడవేషం వేసిన లావాటతను అడివితీగను పోలే శకుంతల అనుకోవాలి. అదుష్యంతుడు పాడే పద్యం దుఃఖరసంతో ఒప్పుతున్న దనుకోవాలి (వెనకటి భాగోతం కాదిది, ఉత్త రాగంతో దుఃఖం ఒప్పించటానికి! ఆ నాయకుడి మొహానభావం ఉంది చూడండి, కాని ఆ నాయకుడు అంత ఆలాపన ఎందుకు చేస్తున్నాడో మాత్రం తెలీటంలేదు.) మరిన్నీ ఆ నాయకుడు కొడుకు తాయెత్తుకోసరం పిల్లవాడల్లే పాకుతూ చాలా సహజంగా ''తాయెత్తు కనపడలేదూ!'' అంటూ పాడుతూ ఉన్నాడు కూడాను.

ఈ సగం సగం నటన ఎవరికన్ను కప్పుతున్నది? ప్రేక్షకుడి కన్నా, నటుడి కన్నా! నాకు తెలీటంలేదు.

పోతే కూచిపూడి భాగోతానికి పోవాలి. లేదా అనుకోటాలులేకుండా ప్రతినలుసూ సహజంగా ఉండేటట్టు రాయండి.

నాటకాలు సహజంగా ఆడబడటానికని రాయాలి. ఏవైతే రంగస్థలంమీద చూపించటానికి వీల్లేదో అవి నాటకాల్లో పెట్టకుండా వుండటం చాలామంచిది. స్టేజిమీద వానకురింపిచటం ఎట్లా? లేదా ఏ నాటకమైనా ఆడేటందుకు వీలైన రంగం నిర్మించాలి. మామూలుగా స్టేజిమీద ఒక గదీ, మూడు గోడలూ, కిటికీలూ, వాకిళ్లూ చూపటం అసంభవంకాదు. తెలుగు నాటకరంగంమీద అదేది? స్టేజిమీద భజనలోనూ, మిగతపాత్రల కోరికమీదా (సందర్భానుసారంగా - జీవితంలో మాదిరిగానే) - మిగతా నాటకాని కడ్డం రాకుండా - సంగీతం సహజంగా ఉంటుంది. కాని

ఎక్కడబడితే అక్కడ సంగీతం చాలా అసహ్యం దాన్ని గురించి నా తల్లో వెంట్రుకలంత మంది రాశారు అంతకన్న ఎక్కువమంది ప్రతిఘటించారు!

జీవితం కళతో కూడుకున్నది కాదు దాన్ని కళ చెయ్యాలంటే వేలో కలుపు తీసినట్టు కొన్ని భాగాలెత్తేసి తిరిగిరాయాలి. అదే నాటకాలు రాసేవారి పని, బజారు చిత్రించేవాడు సహజంగా ఉంటుందని బజారులో పెంటకుప్పలూ, గడ్డిపరకలూ, రాళ్లూ చిత్రిస్తాడా? నాటకం సహజంగా ఉండటంలో ఆ కండిషను కూడా ఉంది సహజమైనవిషయాలు కొన్ని తీసేస్తున్నాంకదా అని సహజంగా లేనివికొన్ని కలపటం పొరపాటు. నాటకాలు రచించేవారింకోవిషయంకూడా గమనించాలి జీవితంలో కనపడే తుమ్మాయి జగ్గాయిగాళ్ళను రంగస్థలం మీద చూడటానికెవరూ రారు. లోకంలో Dramatic personalities కొన్ని ఉన్నై వాళ్ళనే రంగంమీద చూపించాలి. ఆ విధంగానే జీవితంలో జరగదగిన dramatic incidents, situations మొదలయినవి కూడా ఉండాలి ఇతర కళాభ్యాసి కెన్నినియమాలున్నవో నాటక రచయితకుకూడా అన్నీ ఉన్నై. ఒక కాన్వాస్ మీద రెండు మంచి బొమ్మలకు తావులేదు. నాటకాలు, అంతర్నాటకాలూ ఈ కాలానికి పనికిరావు. ఏకత్వమనేది ఎప్పుడూ ఉండి తీరాలిసిందే. నాటకరంగం మీదికి వ్యర్థపాత్ర రావటం ఎంతతప్పో పాత్ర తన పనిని వెల్లడించకుంటూ, లేక మొహం మీద రాసుకుని రావటం అంతే తప్పు. ఒక దుర్మార్గుడి పక్కన ఒక సన్మార్గుణ్ణి ప్రవేశపెట్టడం మొదలైన పద్ధతులు అంత ఉత్తమమైనవి కావు.

నాటకానికి నిబంధనలివ్వటం చాలా పొరపాటు, ఆత్మగౌరవంకలవాడు (సరుకు లేని అహంకారానికి నేనేమీ గౌరవం ఇవ్వటంలేదు.) నిబంధనల కొప్పుకుని ఎన్నడూ పని చెయ్యడు. కనక నేనైనా ఇవి. ఉండకూడదని చెప్పగల నేకాని ఇవి ఉండాలి అని ఎప్పుడూ చెప్పలేను.

**పాత్రధారణ**

ఇంద్రుడు, యముడు, కృష్ణుడు, రాముడు మొదలైన పురాణపాత్రలతో పెద్దచిక్కేమిటంటే వాళ్ళిట్లా ఉంటారని ఎవరూ నిర్ధారణ చెయ్యలేరు నిజంగా చెయ్యబడి ఉన్నచోట ఆజానుబాహులూ, దీర్ఘకాయులూ మనకు దొరకటం దుర్లభం. అందుచేత అటువంటి పాత్రలు ధరించేటప్పుడు ''కృష్ణుడికి మీసాలున్నాయా?'' అన్నటువంటి ప్రశ్నలు రాకతప్పదు. దాని మీద పెద్ద వాద ప్రతివాదాలు మరీ అసహ్యం. మీసాలతో ఉన్న కృష్ణుడు ప్రేక్షకులకు కృష్ణుడల్లే ఉండడు, ఎనభై భారతాల్లో కృష్ణుడికి మీసాలున్నవని చెప్పబడి వున్నా లేకుండానే పాత్రధారణ చెయ్యటం యోగ్యం. బహుశా ధర్మరాజు మొదలయిన వాళ్ళకు గడ్డాలుండే ఉంటైకాని నేను గడ్డాలతో పంచపాండవులను సహించలేను. ప్రేక్షకులంతా నా వంటి వాళ్ళే అయితే గడ్డాలు పెట్టి ఏం లాభం?

ఆడవాళ్ళు ఆడవేషాలువెయ్యటం గురించి కూడా అంతే మగవాడిచేత ఆడవేషంవేయించి ఆడదే ననుకోమంటే నేననుకునేదిలేదు- అందువల్ల నే నాంధ్రుల నీతి కాపాడి వీరస్వర్గానికి పోయినాసరే - నాటకం అసలు కృత్రిమంగానే ఉండాలని వాదించి ఏం లాభం? కృత్రిమంగా ఉండాలంటే, గుడ్డముప్పంతో సహా జైలుసీను లెందుకు? అసంభవంగా ఉండదగిన నాటకాలు కొన్ని ఉన్నై, సరదాకాదే ప్రహసనాలు వాటిల్లో ఎంతసంగీతమన్నా పాడవచ్చు (సరదాకని స్పష్టంగా తెలియచేస్తూ), ఆడవాళ్లు మగవేషాలు వెయ్యవచ్చు (అసలు మగవాడేనని తెలియచేస్తూ), ఇంకా ఎంత అభాసైనా చేసి జనాన్ని నవ్వించవచ్చు కాని ఎవడు బిగ్గరంగా నవ్వినా ''కామోష్'' అని కేకలేస్తూ ఈ పాత్ర ధారణేమిటి? ఇప్పుడాడవేషం వేస్తున్న నరసింహారావుగారు మొదలైన వాళ్ళల్లే నటించే ఆడవాళ్ళు లేరనేది నేను వాదనగా తీసుకోను నాకు కావలిసింది అభివృద్ధి కాదు, మార్పని స్పష్టంగా చెప్పాను. ఈ బాధ కొత్తరకం పాత్రధారణలోనే కాక కొత్తరకం నాటకాలలోనూ ఉంది. కొత్త టెక్నిక్ కావటంవల్ల పాతనాటకాలంత కొత్త నాటకాలుండవు ఆ నాటకాలకు మొదట్లో సక్కుబాయికి లభించిన విజయం లభించకపోవచ్చును. కన్యాశుల్కం వంక చూసినవాడు లేడు చాలాకాలం ఈ రోజున కన్యాశుల్కంకన్న మంచి నాటకం లేదు తెలుగులో. నాటకంగా చూస్తే అంతకన్న మంచినాటకాలు రాయటాని కవకాశం ఉంది, దాని ఇతర గుణాలు ఎన్ని వున్నప్పటికీ

భావప్రకటన

నేనొకసారి జరిగిపోయిన కుంభమేళ సమయంలో ఆలహాబాదులో ''పంజాబ్ మెయిల్'' అనే హిందీ నాటకం చూశాను. నాకు పాత్రలసంభాషణ ఏమీ అర్థంకాలేదు. వాళ్లు పాడే పాటలు గ్రామఫోనురికార్డుల్లో వినే తురక లల్లాయిపదాలు - కచ్చాగానా - మాదిరిగానే ఉన్నై నేను సహజంగా చూడగలిగింది వాళ్ల భావప్రకటనమాత్రమే. ఆనాటినించీ ఈనాటివరకూ నాకు హిందీవాళ్ళ నాగరికతలో నమ్మకం లేదు. నేను పొరపాటుపడి ఉండవచ్చును. ఆ నటులు హిందీ నాగరికతను దాచి వుండవచ్చును. కాని వాళ్లు బిగ్గరగా అరవటం చేతులూపటం, శపథాలు చేస్తున్నట్టు క్షణానికోసారి నటించటం, కోపం, సంతోషం మొదలైన భావాలు అడవిమనుష్యులల్లే ఉద్రేకంతో ప్రకటించడం చూస్తే వాళ్ళకే కోశానా నాగరికత అనేది ఉన్నట్టు కనిపించలేదు.

తరువాత నాకు కీర్తి శేషులయిన పిల్లలమర్రి సుందరరామయ్యగారు జ్ఞప్తికివచ్చారు. వెంకట్రామయ్యగారి శివాజీ, సుందరరామయ్యగారి రామసింహుడూ ఎప్పుడూ జ్ఞాపకం వస్తాయి. వెంకట్రామయ్యగారి శివాజీని నేను విమర్శకుడల్లే చూడగలను. సుందరరామయ్యగారి రామసింహుడు నన్ను సరిగా కూర్చోనివ్వడు ఆ శివాజీని కావాలంటే పరిచయం చేసుకోగలను, లేకపోతే మానగలను, ఈ రామసింహుడు! .. ఆరామసింహుణ్ణి పరిచయం చేసుకోటానికి నాబోటివాడి కభ్యంతరం ఉండవచ్చునని సుందరరామయ్యగారు గమనించి ఉండవలిసింది!

పాత్రను లోపల ఇముడ్చుకోటం ఒకపద్ధతి, దాన్నే మీద ధరించటం ఇంకోపద్ధతి నాకెందుచేతో రెండోది నచ్చదు చంద్రమతి దుఃఖిస్తే నాకభ్యంతరంలేదు ఆ దుఃఖం సౌఖ్యమసలంత పెరిగి నానింపి దాస్తే చాలా నాగరికత తెలుసునిపనుకుంటాను నన్ను కూడా ఏడుపులో ముంచెయ్యాలని ప్రయత్నం చేస్తే పై బట్ట దులిపి లేచి చక్కాపోతాను నేను గ్రహించగల మనిషినే మొహానికి కొంగడ్డం పెట్టుకున్నా భుజాలు ఎగరటం చూసి దుఃఖిస్తున్న సంగతి కనుక్కోగలను. నిశ్శబ్దంగా ఏడుస్తున్న మనిషిని చూస్తే నాగుండె తరుక్కుపోతుంది ఏడుపు తెప్పించాలని ప్రయత్నంచేసి కోపం, అసహ్యం, (ఉన్నసంగతి చెప్పొద్దూ) భయం కలిగించడం ఎందుకు?

అప్పుడప్పుడు రంగస్థలంమీద స్వేచ్ఛ, పద్యాలు విరిచి చదవగలగటం నటనాసామర్థ్యంగా భావించబడుతూంటై ప్రేక్షకుల అజ్ఞానాన్ననుసరించి ప్రేక్షకులు అజ్ఞానులుగా అన్నారనేది పెద్దవాదనగా పెట్టటంకూడా నాకు బాగాకనపడదు. అజ్ఞానంలో ఉన్నవాళ్లను అజ్ఞానంలోనే ఉంచటం నటులపాలసీ కాదని నమ్ముతాను వాళ్ళ అజ్ఞానాన్ని పురస్కరించుకుని వీళ్ళు గొప్పవాళ్ళనిపించుకోవటం కన్న అనిపించుకోకుండా ఉండటం అందరికీ మంచిది నేను గొప్పనటుణ్ణి అని ధీమాకలవాడు బలవంతాన ఎవడి చేతనో ఉత్తరాలు రాయించుకోవటం గాని, పతకాలిప్పించుకోవటం కాని, పత్రికల్లో వ్యాసాలు రాయించుకోవటం కాని ఎందుకు జరుగుతుంది? ఎవడి కాళ్ళన్నా పట్టుకుని నాకథలను గురించి అనుకూలవిమర్శన చేయించుకున్న మర్నాడు నేనమాంతంగా గొప్పకథకుణ్ణయిపోతానా? అట్లా రాయించుకోవటమైనా సహించగలనుకాని ఆ సంగతి అందరికీ తెలిసిపోయిందని తెలిసినా సిగ్గుతో తలవంచుకోకుండా వెనకటి మోస్తరుగానే తిరుగుతున్న వాణ్ణి ఎన్నటికీ సహించలేను, క్షమించలేను గొప్పనటులు, గొప్పనటులంటే ఇదీ మనం రోజూ చూస్తున్న గొప్పనటుల గొప్పతనం నాటకాలకు మల్లేనే గొప్పతనానిక్కూడా స్టేజిక్ ఎఫెక్ట్, లేక హంగు కావాలేమో?

మిగిలిన అన్ని విషయాలతోపాటు నటులు అభివృద్ధి చెందటంకన్న మారిపోవటమే బాగుంటుందని తోస్తుంది!

*నాట్యకళ, ప్రథమ సంపుటం, తృతీయ సంచిక - 1934*

## 17. టెక్నిక్

మనం చేసే ప్రతిపని లోనూ టెక్నిక్ - ఒక విధానం ఉండాలి. తరతరాల నుంచి అనేక విషయాలు రక్తంలో వస్తుండటం వల్లా, ఇతరులననుకరిస్తుండడం వల్లా మనమనేక పనులు జయప్రదంగా చెయ్యగలుగుతున్నాం. ఆదిలో నాలుగుకాళ్ళ మీద నడిచిన మృగం వెనక కాళ్ళ మీద నిలబడి నడవాలని ప్రయత్నంచేసింది అప్పుడానడక

చాలా అసహ్యంగా వుండి వుండాల. కాని కాలక్రమాన అవసరమైన టెక్నిక్ సంపాదించి ఈనాడు రెండు కాళ్ళమీద నడవటం అప్రయత్నంగా జరిగిపోతున్నది. తప్పటడుగులు వేసే పిల్లలు మధ్య మధ్య పడుతుండటం నడక కవసరమైన కండరాలు మొదలైనవి లేకకాదు ఆ టెక్నిక్ అనేది బాగా అలవడకపోవటంగానే. చాల మంది పెద్ద వాళ్ళయి కూడా ఒంటినిండా, మూతినిండా, ఎంగిలి కాకుండా భోంచెయ్యలేరు

ఈ టెక్నిక్, పనులు చేసే విధానం - కాలక్రమాన మార్పుచెందుతుంది. అది సామాన్యంగా నాగరికతతో కలిగే మార్పుల ననుసరించీ, అభిరుచుల్లో మార్పుల ననుసరించీ ఉంటుంది

భోంచెయ్యటమే తీసుకుందాం ఈనాటికింకా ఈ పని బహిరంగంగా చెయ్యబడటం లేదు జనసామాన్యం చేత. అందుచేత భోజనం చేసే విధానం ఒంటి మీద ఎంగిలి పడకుండా చూసుకునే వరకే ఉపకరిస్తుంది. కొంతకాలానికి నాగరికత ప్రబలి భోజనం బహిరంగంగా చెయ్యటం అలవాటవుతుంది (అనేక కారణాలవల్ల అది చాలా అవసరం. ఇప్పటి నాగరికత లోనే వనసమారాధనల్లోనూ, పంక్తి భోజనాల్లోనూ, ప్రతిరోజూ కాఫీహోటళ్ళు, పూటకూళ్ళ ఇళ్ళల్లోనూ బహిరంగంగా భోజనం చెయ్యటం జరుగుతూనే ఉంది) అప్పుడు మీద ఎంగిలి పడకుండా చూసుకుంటే చాలదు చూసే వాళ్ళకు అసహ్యం కలుగరాదు. ఇప్పుడు పాశ్చాత్యులేదైనా తాగేటప్పుడు అసహ్యంగా చప్పుడు కారాదు, అంతా ఒక్కగుక్కను తాగరాదు, తినేదాని మీదే దృష్టి ఉన్నట్టు కనబడకుండా ఉండటానికి తింటున్నంతసేపూ, ఏవో స్వల్ప విషయాలు గురించి మాట్లాడుతూ వుండాలి ఇంకా ఇటువంటివి ప్రతిదానిలోనూ, ఉంటూ ఉంటై. వాటిలో ఏది చేతకాకపోయినా ఆ మనిషిలో అంతవరకది తీరనిలోటే సందర్భాను సారంగా ఒకే నాగరికతలో ఒకే పనిచేయ్యటానికి భిన్నమైన టెక్నిక్ కావలసి వస్తుంది. మనం మామూలుగా మాట్లాడే టప్పుడు వినేవాళ్లర్థం చేసుకోవటమే పరమావధి. అదే నాటకరంగం మీద మాట్లాడటానికి పరిశుద్ధమైన ఉచ్చారణా దూరానికి స్పష్టంగా వినపడే శృతీ అవసరం. రైలందుకోటానికి పరిగెత్తే వాడెట్లా పరిగెత్తినా తొందరలేదు రైలందితేసరి. అదే మైల్‌రేస్ చేసేవాడు చాలా మెళుకువలు తెలుసుకుని మరీ పరిగెత్తాలి.

ఈ టెక్నిక్ కళలోకి వచ్చేటప్పటికి ప్రాణం తోడేస్తుంది. నృత్యం తీసుకోండి. దానికి ప్రాణంలయ. దాని శరీరం టెక్నిక్ అభివృద్ధిని బట్టి వుంటుంది. జాజ్ శ్రవణగోచరం కాగానే సగం దొరా దొరసాన్లు మెల్లిగా అటూ ఇటూ వూగుతూ లయను సూచిస్తారు కూర్చున్న చోటునుంచి కదలకుండానే అదే నృత్యంచెయ్యగల వాళ్లు తేల్తారు. లేచి కదలవలసి రాగానే కొంత మంది వెనకపడతారు. ఈ నృత్యంలోకి నవరసాలు లాక్కొచ్చి వాటి కనుగుణ్యమైన అభినయం చెయ్యమనేటప్పటికి ఎంతో టెక్నిక్ అవసరం కావటమేకాక, ముందుగా ఆ టెక్నిక్ ఇట్లా వుండాలి అని తేల్చటానికే చాలా శాస్త్రయుక్తమైన శోధనా, నియమాలూ, అభ్యాసమూ, తప్పని సరవుతై,

ఇంతటితో ఆగక నవరసాలను మళ్ళీ విభజనచేసి మనిషి ఒప్పించగలిగిన రసాలు కొన్నివందలయ్యే టప్పటికి అక్కడక్కాడ ఒక్కొక్కాడు తేల్తాడు. ఈ రసాల విభజనకు కాని భరత శాస్త్రానికి కాని అంతూ, పరిపూర్ణత్వమూ లేవు శాస్త్రానికి తాత్కాలికంగా పరిపూర్ణత్వం మనమే ఇచ్చి తృప్తి పడవచ్చును. కాని నాగరికత ఆగేది కాదు క్రమంగా, ఒంటి మీదపడకుండా భోంచెయ్యటంతో మనుష్యులు తృప్తిపడనట్టే నవరసాలతో తృప్తిపడక ఇంకా నాజూకైన రసాలు కోరతారు దేంతోనో దాంతో తృప్తి పడటమే పరమావధయితే ఎక్కడి వాళ్ళక్కడ కూర్చుని ఊగి ఇదే నృత్యం అనవచ్చును డెబ్బైరెండు మేళకర్తలతోనే తృప్తి పడి జన్యరాగాలకు ఉద్వాసన చెప్పవచ్చును

అంతమాత్రానికే సంభవాలైన రసాలన్నింటికీ ప్రాముఖ్యత ఇవ్వాలనిగాని, జన్యరాగాలన్నిటికి, స్థానం ఇవ్వాలని గాని నాఅభిప్రాయం కాదు. ఎన్నిరకాల ఇళ్లు కట్టవచ్చునో అన్ని రకాల ఇళ్ళూ కట్టుకుంటున్నామా, కళాదృష్టిలో వాటికి స్థానం ఉండటం చాలా అవసరం అందుచేత ఇదిగుడ్డెద్దు చేలో పడ్డట్టు తర్కించే విషయం కాదు. నేను చెప్పిన శాస్త్ర యుతమైన శోధన వల్లగాని ఏదీ తేలదు. సమర్థుడైనవాడు ప్రసవవేదన అభినయించి చూపేదాకా, కళాదృష్టిలో ఆవేదన యొక్క అభినయానికి స్థానం ఉందని మనం కలలోనైనా భావించలేక పోవచ్చును.

ఇక నాటకం ప్రదర్శనానికి వచ్చేటప్పటికి ఎంతటెక్నిక్ వినియోగింప బడుతూందో చూచేవాడూహించుకోవడం అసంభవం ఒక్కరోజులో నాటకం గీకేసి ఒక్క రిహార్సలైనా లేకుండా నాటకం ఆడి ఆ నాటకం జయప్రదం చేద్దామని కాని ప్రదర్శన సఫలం చేద్దామని కాని అనుకోవటం భ్రమ ''వేనరాజు''కు మద్రాసులో జరిగిన సత్కారాన్ని గురించి విన్నాం కదా!

టెక్నిక్ అనేమాట చాలామందికి ఏవగింపుగా ఉండటం నేను స్వయంగా గమనించాను. వాళ్ళ ఉద్దేశంలో ఆ మాట నాటకాలను గురించీ అభినయ శాస్త్రాన్ని గురించి ఏమీ తెలీనివాడు చాలాతెలిసినట్టు కనపడటానికి ఊతగా వుండే నిరర్ధకమైన పదం నిజమే మాటలను దుర్వినియోగం చెయ్యటం అంతటా జరుగుతూనే ఉంది. ఈ మధ్య మా ఊళ్ళో బిచ్చగాడు ''మీ హరిజనుణ్ణి''! అంటూ వెంటపడుతున్నాడు కాంగ్రెస్ వాళ్ళకే చాలా తలనెప్పిగా! రచనలోనూ, ప్రదర్శనలోనూ విధాన మంటూ లేదనే వాళ్ళకు చెప్పేదేముంది?

నాటకం రాసేవాడు ముందు టెక్నికల్‌గా నాటకం లోపాలు లేకుండా చూసుకోవాలి దానికి నాటకం బాగోగులతో ఏమీ సంబంధంలేదు. కన్యాశుల్కం మంచినాటకం కాదని ఎవరూ అనరనుకుంటా దృశ్యం మధురవాణి ఇంటి నుంచి చప్పున చెరువుగట్టుకు మారుతుంది. రివాల్వింగ్ స్టేజీ మొహం ఎరుగని ఆంధ్రులు ఇక్కడ ఏం చెయ్యాలి మావూరు వారు చెరువుగట్టు లేకుండా పని గడిపేస్తున్నారు. సహజంగా ఉంటుంది కదా అని ప్రతి అయిదు నిమిషాలకు ఇద్దరు ముగ్గురు

పాత్రచేత ఒక్కసారిగా మాట్లాడిస్తే చదవటానికి బాగున్నా చూడటానికి దుర్భరంగా వుంటుంది ఈ విధంగా టెక్నిక్ లోపాలు వేనకువేలుగ ఊహించవచ్చును. రచనా విధానంలో బ్రహ్మాండమైన లోపాలు గల నాటకాలు నిరాఘాటంగా ప్రదర్శింప బడుతున్నై మల్లాది అవధాని వంటి కుర్రవాడు అసంపూర్ణ రామాయణం వ్రాస మానేస్తేనూ చింతా దీక్షితులు ప్రభృతులు నాటిక ప్రహసనం రాసి మానేస్తేనూ ఆంధ్రులు లోపాలున్నవని గమనించేటట్టూ లేకపోతే లేనట్టూ, వారైనా ప్రదర్శనా విధానంలో కల లోపాలు బహిరంగ పరిచారు. రచన!

నాటకం రాసేవారూ, ప్రదర్శించేవారూ, నటులూ – ఈ ముగ్గురు ఏకమైతే కాని నాటకం రక్తికీ, రంగానికీ, రాదని ''ప్రబుద్ధాంధ్ర'' గత సంచికల్లో ఒకదాన్లో సూచింపబడ్డది అట్లా జరగని పక్షంలో ఎంత భయంకరమైన పొరపాట్లు జరిగేదీ ఊహించవచ్చును బెర్నార్డుషా రాసిన ''డెవిల్స్‌డిసైపుల్'' అనే నాటకం కొత్తలో ప్రదర్శించేటప్పుడు ముఖ్య పాత్రధారి విమర్శకుల సూచన ఒకటి ఆధారం చేసుకుని షా అభిప్రాయానికి విరుద్ధంగా నటించాడు. ముఖ్యపాత్ర యొక్క శీలానికే భంగం కలిగింది! ఆ విధంగానే భమిడిపాటి కామేశ్వరరావు గారి నాటికలు ప్రదర్శించేటప్పుడు ఎక్కడ నాటకకర్త సహజంగా వుండాలని ఉద్దేశించాడో, ఎక్కడ విపరీతంగా చేయాలని ఉద్దేశించాడో కనుక్కోకుండా చేస్తే రసం లోపిస్తుంది. నాటకం అభివృద్ధవుతున్న కొద్దీ దాన్ని పాడుచెయ్యటానికి, బాగుచెయ్యటానికీ సూక్ష్మమైన లోపాలే పనిచేస్తై. ఆరోజు కారోజు నాటకరచయిత, నటుడూ ఈ సూక్ష్మదృష్టి అలవాటు చేసుకోకపోతే నాటకకళ అభివృద్ధి చెందేది ఉత్తది. ఎంతో దూరం పోనక్కర్లేదు. కన్యాశుల్కాం మినహాయిస్తే మిగతా నాటకాల్లో బంతులను నటుడు కొద్ది స్థూల నియమాల ననుసరించి దాదాపు ఏ విధంగానైనా చెప్పవచ్చును – చెప్పుతున్నాడు.

''ప్రతి గాడిద కొడుకూ నాయింట్లో తిని నన్నునే వాడే! తాంబూలాలిచ్చేశాను. తన్నుకు చావండి !''....

ఇటువంటి వాక్యాలు రెండు విధాలుగా చదవటం ఎట్లాగో నాకు భోధపడలేదు. సమర్థుడైన నటుడికి సహితం '' ఈ వాక్యం ఎట్లాచెపితే బాగుంటుందా''! అనే సమస్య వచ్చినప్పుడా వాక్యాలు నాటకంలోంచి ఎత్తివెయ్యటం చాలా మంచిది. ఆ లెక్క ప్రకారం చాలా నాటకాలు లేస్తై.

అసలు మన తెలుగులో చాలా డ్రామాలు డ్రామెటిక్‌గానే ఉండవవదేం ఖర్మమో! నాటకం రాసేవాడూ, నటించేవాడూ, ప్రదర్శించేవాడూ పోగా వారి టెక్నిక్‌ని నిర్ణయించేది కనీసం రొండున్నై ఒకటి భాషా, రొండోది ప్రేక్షకవర్గము.

లక్షణబద్ధంగా పద్యాలు రాసేవాడికైనా అక్కర్లేని భాషా వ్యాజ్ఞయాలు నాటకం రాసేవాడి చేతులో ఉండాలి. కవికి పది మాటలు దొరికే చోట నాటకం రాసేవాడికి ఒక

మాచే పొడుకుతుంది కవిత్వం కన్న పెద్ద కళ నాటకం రాయటం ప్రతాపరుద్రీయంలో మంగళ్ళకూ, చాకళ్ళకూ, సాయిబులకూ తడుముకోకుండా భాష సంపాదించిన మహా మహోపాధ్యాయుడికి, రాజుకూ, మంత్రులకు భాష దొరకలేదు వాళ్లకు గ్రాంధికం ఉపయోగించటం వల్ల ఏమీ ఉపయోగం కాలేదు. ఆయన భాష దొరక్క గ్రాంధికం ఉపయోగించాడని కాదు గ్రాంధికం తప్పని ఆయనకు తెలిసి ఉన్నట్టయితే తగిన వాడుక భాష దొరకటంతో కొంత కష్టమై ఉండేదని. ప్రతాపరుద్రుడు ఏ భాష మాట్లాడాడన్న సమస్యేలేదు. ఉంటే ఆ రోజుల్లో తురకలూ, మంగళ్ళు , చాకళ్ళూ ఏం మాట్లారన్న సమస్యా ఉంటుంది (హైదరుజంగు హిందీ ఉపయోగించి గడుపుకుంటున్నప్పటికీ, వినేవాళ్లని గౌరవించే నాటకకర్త సమస్త జాతులకు, ప్రేక్షకులకు తెలిసిన భాష ఉపయోగిస్తాడు. బుస్సీ ఫ్రెంచి ( తప్ప) మాట్లాడటం అసంభవం, అప్పుడు పాశ్చాత్యుడు తెలుగు మాట్లాడినట్లు రాయటం తప్పదు అట్లాగే హైదరుజంగు తురక తెలుగు మాట్లాడాలి. కానీ ఏదీ కాకుండా హిందీ ఏమిటి?) మరి ప్రతాపరుద్రుడు మొదలైన వాళ్ళు స్వేచ్ఛగా గ్రాంధికం ఉపయోగించారు.

కళను ప్రదర్శించే విధానానికి ప్రేక్షకుడికీ, చాలా సంబంధం ఉంది. నవ్వటం ఏడవటం మొదలైన పెద్దరసాలను ప్రకటించడంలో తప్ప మిగతా వాటిల్లో దేశదేశానికి మార్పుంది అనుకరణ శబ్దాలకే చాలా తేడా వుంటున్నది. భాషకూ భాషకూ అందువల్ల రసవిభాగాలను ప్రకటించేటప్పుడు మరో దేశస్తుడు నటుడేం చూపుతున్నదీ కనుక్కోలేక పోవచ్చు మన నృత్యం పాశ్చాత్యులకు ఎగతాళిగా వుంటుంది వాళ్ళ నృత్యం మనకు బూతుగా వుంటుంది. ఒకరిసంగీతం ఒకరికి కర్ణకఠోరంగా వుంటుంది.

నేను భిన్నదేశాలను తీసుకుంటున్నాను. ఒక ఇంగ్లీషు నటుడీ మధ్య ఈవిధంగా చెప్పాడు ''నేను భావ ప్రకటనావిధానం ప్రేక్షకులను బట్టి మారుస్తాను. శనివారం మాటినీనాడు హాలంతా పనిచేసుకునే వాళ్లతో నిండి ఉన్నప్పుడూ, కుర్చీలన్నీ ఉద్యోగస్తులతో నిండి ఉన్నప్పుడూ ఒకటే రకంగా చెయ్యటం అసంభవం''। ఒకటే భాష, ప్రేక్షకులు ఒక సంఘంలో వాళ్ళే । స్థానం నరసింహారావుగారు. సికింద్రాబాదు ప్రేక్షకులకు ''మేం కన్యాశుల్కం ఆడితే మీరు దాన్లో రసం గ్రహించలేరు'' అన్నప్పుడు కొంత మందికి కోపం వచ్చింది.

నేను వింటుండగా కొందరు పెద్దలీ విషయం తెచ్చి ఆగ్రహం సూచించినపుడు నరసింహారావు గారిది తప్పేనని నేను ఒప్పుకోవలసి వచ్చింది. వారు మొహాన పట్టుకుని అన్నట్టు వారు అడివి మనుష్యులే అనుకున్నా, వాళ్ళకర్థమయ్యేటట్టు నటించగల నేర్పు నరసింహారావు గారిలో ఉంటే ఆ ముక్క అనక్కర్లేక పోయ్యేది ।

*ప్రబుద్ధాంధ్ర 1935 మార్చి*

# 18. నటుడి బాధ్యతలు

నిన్న (శ్రీరామనవమినాడు) మా ఊళ్లో ఒక నాటకం ఆడబడ్డది. నేను నాటకానికి పోకపోవటం వల్ల ఏం జరిగిందో చెప్పలేను కాని రొండున్నర ఖర్చుపెట్టి నాటకం చూసి వచ్చిన పెద్దమనిషి ప్రదర్శనాన్నీ, నటుల్నీ (అందర్నీ, కొందర్నీ తెలియనీకుండా ఉన్నాడు) తిట్టేస్తున్నాడు ఆ పెద్దమనిషికి నటుల్ని చూస్తే ఇదివరకే కోపంగాని, ఈర్ష్యగాని ఉంటే అర్థం చేసుకోగలను పైకొచ్చేవాడికి కొందరు సహజవైరులుండటం వింతకాదు కాని అటువంటిదేమీ కనిపించదు, ఆయన పేర్లుకూడా ఎత్తకపోవటం చేత ఇంతకూ ఆయన కోపకారణాలు రొండు - ఒకటి, నాటకం ఆడేవాళ్లు తన్నొక మూఢుడి కింద జమ కట్టేసి నట్టుగా ఆడారని, రొండు, పానుగంటి లక్ష్మీనరసింహారావుగారి మీదనే సొంత కవిత్వం చేస్తున్నారనీ. ఇటువంటి అభ్యంతరాలతో నేను తప్పక ఏకీభవిస్తాను. బహుశా మొదటి అభ్యంతరం లెక్కలోకి రాదేమో! శ్రీరామనవమి కేవలం డబ్బు కోసం పెట్టుకున్న నాటకం. వచ్చేది అలగా జనం వాళ్ళకు సంతృప్తి చెయ్యాలని ప్రయత్నం చేసినప్పుడు కొంత నాగరికతగల పెద్ద మనిషికి ఏవగింపు కలగవచ్చును. అని సమర్థించటానికీ నాకు ఇష్టం లేకుండా ఉంది ఎందుకంటే, తిరణాల కానప్పుడు నాటకాలు నేల్లోవాళ్ళకే ఆడబడుతున్నై.

ఇది సముద్రంలో కాకిరెట్ట. నాటకం ఆడినప్పుడల్లా ఇటువంటి ఫిర్యాదులు వినపడుతూనే ఉంటున్నై - పేపర్లలో తరుచు కనిపించకపోయినా, నామనస్సుకు నటులు తమమీద ఏ బాధ్యతా లేనట్టు, రంగుమెత్తుకుని కాస్సేపు రంగం మీద కోతిపనులు కొన్ని చేసి ఇవతల పడి డబ్బు జేబులో వేసుకోవటంతో తమ బాధ్యత అయిపోయినట్టు ప్రవర్తిస్తున్నారని తోస్తున్నది. ఆరకం నటులకు స్థానం లేదనటం లేదు. వాళ్ళను దయచేసి కళోపాసన మీద ఎవరికీ (తమనుకూడా కలుపుకుని) అర్థం గాని చెత్త రాయవద్దని చెప్పండి.

నటులు చదివి నేర్చుకునేటందుకు కాదు. నాకంత ఆశ ఉన్నా. అటువంటిది జరుగదు - కేవలం శాస్త్రీయంగా నటుల బాధ్యతలను గురించి జరగవలసిన చర్చకు ఉపోద్ఘాతంగా ఈ వ్యాసం రాస్తున్నాను. ఒక వంద మంది వ్యాసకారులు తమశక్తి జ్ఞానాలు పరిపూర్ణమైన వనే నమ్మకంతో ఎవరికి తోచినట్టు వారు ఒకేవిషయాన్ని గురించి రాసి పారెయ్యటం కాగితం దండగ ఆ దురలవాటు చాలా మంది మానవలసి వుంది. అందుచేత ఈ వ్యాసమే కాక నేనురాసే ఇతర వ్యాసాలు కూడా ఎప్పటికైనా జరగబొయ్యే శాస్త్రీయమైన చర్చకు ఉపోద్ఘాతాలుగానే తీసుకోవాలి. డిక్టేటరు మాదిరిగా ''ఇది ఇట్లా ఇంతకన్నా దీన్ని గురించి తెలుసుకోవలసింది లేదు!'' అని చెప్పటానికి ఎవరికీ శక్తిలేదు. ఉన్నా ఒక్క వ్యాసంలో ఒక్క వ్యూహాయింటు కన్న ఎక్కువ వుండటం వ్యాసానికిహాని,

సాధ్యమయిన పూర్వాపరాలన్నింటిని ఎంచి విషయాన్ని వీక్షించిన తరువాత ఆ విషయాన్ని గురించి కొన్ని సశాస్త్ర మీమాంసలు సులభంగా చెయ్యవచ్చును

మరో విషయం. వెనకటి వ్యాసములో సిద్ధాంతం చేసి శాస్త్రయుతంగా చెప్పినట్లు దానికన్నా ఇటువంటి వ్యాసాలకిచ్చిన ప్రాముఖ్యతే ఇవ్వాళ కాల ప్రవాహం కలిగించే మార్పులకు. వెనకటి మీమాంసలిప్పుడు చెల్లవు అనే సంశయం ఉండనే ఉంటుంది కనక అటువంటి శంకే లేకపోతే ఈ రంగస్థలానికీ, తదితర విషయాలకూ చెందిన వ్యాసాలు సంపాదకులు కోరటమూ జరుగదూ, రచయితలు రాయటమూ జరుగదు.

నాట్యకళకూ ఇతర కళలకూ ఒక భేదం ఉంది ఇతరకళలభ్యసించే వాడు బాధ్యత ఎరక్కుండా నడుచుకుని తన్నుతాను మాత్రమే పాడుచేసుకున్నా, బాగుచేసుకున్నా, నటుడు తన్నుతాను బాగుచేసుకుని నాటక కర్తను బాగు చెయ్యగలడు.

నాటకం రాయటం శ్రమతక్కువ పనికాదు. మొదట నాటకానికొక కద వుండాలి కళా దృష్టిలో అది సరిగా ఉండాలంటే, ఇతర చిన్న కథలను బంధించే నిబంధనలే దానికీ ఉంటై - అనవసర పాత్రలు లేకుండా ఉండటం, ఉన్నవాటిని కళాదృష్టిలో ఆమోదకరంగా వుండేటట్టు ఉపయోగించుకోటం, అసలు విషయాన్ని వదలి పెడదార్లుతొక్కకుండా ఏకత్వం నిలుపుకోవటం మొదలైనవి. తరవాత రచన ''దృశ్యం''గా వుండటం, ఈ రెండూ నాటకం రాసే ఆయనే చూసుకుంటాడు

నటుడి బాధ్యత ఎక్కడ వస్తుందంటే? ఆయన పడ్డ శ్రమ వ్యర్థం చెయ్యకుండా - అనగా, ఉన్నదానికి కలపకుండా, ఉన్నది ఎత్తివెయ్యకుండా, లేక మార్చకుండా - ఉండటంలో ఉన్నదానికి కలిపితే ఏకత్వం పోతుంది కొంత ఎత్తివేస్తే పరిపూర్ణత్వం పోతుంది. కొంత మారిస్తే నాటకం యొక్క దృశ్య గుణానికే భంగం వస్తుంది ఈ మాట అనేటప్పుడు నాటకం కళాజీవంతో ఒప్పుతున్నదని భావించుకుంటున్నాను. ఇటువంటి నాటకాలు లేవు. అందుచేతనే మార్పులు చేస్తున్నామని నటులనటాని కవకాశం లేదు ఏకత్వం చెడకుండానూ, పరిపూర్ణత్వం పోకుండానూ, దృశ్యగుణం జాస్తయేటట్టు నాటకాలు మార్చగలమని ఎవరైనా వాగ్దానాలు చెయ్యగలరా? నాటకాలను చిత్తం వచ్చినట్టు మార్చే నటులీ అధికారం పొందారా? వీరు సొంత నాటకాలు రాసుకోక ఉన్ననాటకాలే ఆడుతున్నారు. కనక నాటకాలు రాసే కళను గురించి రాస్తున్న వారికన్న వీరికెక్కువ తెలీదని తేలిపోతున్నది. అటువంటప్పుడు అవసరమైన మార్పులు వీరికి నాటకకర్తకంటే ఎక్కువ తెలియటానికవకాశం లేదు. రాయటం చేతకాక, మార్పు చెయ్యగలగటం మాత్రం వీరికి పుటకతో వచ్చి వుంటే చెప్పలేం కాని!

జరుగుతున్న ప్రకారం నాటకాలను మార్చటానికీ, కళకూ ఏమీ సంబంధం లేదు కావలిస్తే, కంట్రాక్టుల్లో ఉన్న కష్టసుఖాలకు దానికెక్కువ సంబంధం వుంది.

కొందరు పాత్రలెత్తేస్తే ఇద్దరి రైలుఛార్జీ, కిరాయి మిగులుతో కలపటం ఎందుకంటే నాటకం రాసేవాడికి ఏ వేషం 125 రూపాయల కిరాయి వాడు వేసేదీ, ఏది 25 రూపాయల కిరాయి వాడు వేసేదీ తెలీక అన్నిటినీ ఒకే స్థాయిలో పక్షపాతం లేకుండా సృష్టిస్తాడు. ప్రదర్శనమెప్పుడు మొదటి వాడు రెండో వాడికన్న నీరసంగా అయినట్లు ఎక్కువని అని ప్రేక్షకుడు విశ్వసించాలంటే తన పాత్రను కొంత తగ్గించి, ఏ బాల్య వివాహం మీదనో గంభీరోపన్యాసం రాయటం, లేక తప్పులతో రాసుకుని, తన ఉపన్యాసం భావయుక్తంగా చెపుతున్నంత సేపూ తనలో అయిపో పంతులు పెదవల్లే నిలబెట్టి, చివరకు ''భేష్''! అనిపించుకుని చప్పట్లు కొట్టించుకుని ఇవతల పడితేనే పరువు ప్రతిష్ఠ సంభాషణలనుకునే పుస్తకములో లేని పాళ్ళు తగిలించటం, అప్పటికప్పుడేమనాలో తెలీక రెండో వాడు నోటమాట లేక పోవటం (అనుభవం మీద వాడు కొత్త రాయి సమాధానాలు సిద్ధం చేసుకుంటే, వాడికి భయపడి అటువంటివి తప్పని బోధించటం) కూడా ఇందుకే, అదీకాక యాక్టర్లు ఒకరినొకరు ''ఏడిపించుకోవటం చాలా అమల్లో వుంది చిత్రాంగి రహస్యం బయటపడ్డది. రాజరాజు మండి పడుతూ వచ్చి ''చిత్రాంగి''! అంటాడు ఎన్నిసార్లు గొంతుచించుకున్నా చిత్రాంగి పలుకదు రాజరాజు పాత్రధారి అప్పుడర్థం చేసుకుంటాడు. చిత్రాంగి పాత్రధారి తన్ను ఏడిపించటం ఇది అని. ఆ పాట్న చిత్రాంగి జుట్టు పట్టి ఈడ్చుకొస్తాడు (రంగంమీద రాజరాజు హోదా నిలబెట్టటానికీ, ప్రైవేటుగా తన హోదా నిలబెట్టుకోవటానికి!) విగ్ వూడి రాజరాజు చేతులోకి వస్తుంది! ..

నిత్యమూ ఇటువంటి అనుభవాల పాలయ్యేవాడికి కళోపాసన్ను గురించి ఉపన్యసించటానికి నోరెట్లా వస్తుంది

ఇంతవరకూ నాటకాల్ని పాడుచెయ్యటం విషయం మాట్లాడాం ఇక ప్రదర్శనాన్ని బాగు చెయ్యటాన్ని గురించి. ఇందు విషయమై నటుడు వహించవలసిన, బాధ్యతలు అనేకం వున్నై తనకు సరిపడని వేషం తీసుకోకపోవటమూ, తనుధరించే పాత్రను గురించి కొంత శోధన చెయ్యటమూ, పైన చెప్పిన ఉదాహరణము మాదిరిగా రసాభాసం కానివ్వకుండా ఉండటమూ మొదలైనవి. ఇటువంటి లోపాలను ప్రేక్షకులు చప్పున పట్టేస్తారు. కాని నేను చాలా ముఖ్యంగా భావించే విషయం ఒకటి ఉంది. అదేంటంటే! నటుడు రంగ స్థలాన తన జాతియొక్క నాగరికతను కాపాడటం దీన్ని గురించి ఎంత వ్రాసినా నాకు తృప్తి లేదు.

విపరీతమైన పరిస్థితులట్లావుంచి అవి నాటకంలోను. జీవితంలోనూ ఉంటై - సామాన్యంగా తెలుగు నౌకరు యజమానితో పొగరు బోతల్లే మాట్లాడతాడా? తెలుగు ఆడది మగవాడితో మాట్లాడే టప్పుడు ఎట్లా సంచరిస్తుంది? తెలుగు వాడుతన ఉద్రేకాన్ని బహిరంగంగా ఎంతవరకు ప్రకటిస్తాడు? ఇవన్నీ ప్రతినటుడూ యోచించవలసిన విషయాలు.

మనం ఆడేనాటకాలు తెలుగు జాతికి చెందినవి కావనే అవమానకరమైన విషయం కూడా మనల్నిక్కడ బాధించదు చంద్రమతి కొడుకు చావువిని ఏడుస్తుంది చంద్రమతి వేషగాడు - లేక వేషగత్తె - ఎట్లా ఏడవాలో హోరుమని ఎక్కెక్కి ఏడిస్తే నేను సహించలేను అసలు చంద్రమతి ఎట్లా ఏడిచిందో నాకుపట్టలేదు. చంద్రమతి స్టేజీ మీద తన దుఃఖం నాకు కనపడకుండా చెయ్యాలని సాధ్యమైనంత వరకు ప్రయత్నం చెయ్యక పోతే నేన్నాటకం చూడను నాకు భావనాశక్తి వుంది. మొహానికి కొంగు అడ్డం పెట్టుకున్నా భుజాలయొక్క కదలికను బట్టి దుఃఖం గ్రహించగలను ఆకదలిక కూడా ఎంత తగ్గిస్తే అంత మంచిది లేకపోతే నానాగరికతకు అపచారం జరిగినట్టు భావిస్తాను ఒక్క ఏడుపే కాదు బిగ్గరగా తగినంత కారణం లేకుండా, మాటిమాటికీ నవ్వినా నేనుసహించను నా డబ్బు నాటకాలాడే వాళ్ళ జేబులో పడాలంటే నానాగరికతకు హాని చెయ్యటం సరయిన మార్గం కాదు

నేను మొదటచెప్పిన పెద్ద మనిషి మాదిరిగా అనేక మంది నాటక ప్రదర్శనానంతరం మొహాలు ముడుచుకుని వస్తూ కనిపిస్తారు ఎప్పుడో తుపాను మాదిరిగా ఈ విషయం పబ్లిక్ ఒపినియన్‌వచ్చి పడుతుంది. కనక నటులు మేలుకోవలసి వుంటుంది. మన విషయం అట్లా వుంచి ఇంకో దేశం వారు మననాగరికత గ్రహించాలంటే ఏకంగా నాటకం చూడటానికే వస్తారు. వారికి కథ అర్థం కాదు, సంగీతం అర్థం కాదు, వారికర్థమయ్యేది మననాగరికత. నాకటువంటి అనుభవమే అయింది. నేను చూచిన ఒకటి రొండు హిందీ నాటకాల్లోనూ నటులు స్వేచ్ఛగా తమ ఉద్రేకాలను బహిరంగ పరచటమూ, జాస్తిగా అవయవాలు కదిలించటమూ చూసి హిందీ నాగరికతను అసహ్యించుకున్నాను. నేను పొరపాటు పడి వుండవచ్చును హిందీ నటులు తమ నాగరికతను రంగం మీద ధ్వంసం చేసి ఉండవచ్చును. దానికి నేను కాదు బాధ్యుణ్ణి

నాటక ప్రదర్శనం నాగరికతా ప్రదర్శనం.

*ప్రబుద్ధాంధ్ర మాసపత్రిక మే 1935*

# 19. స్టేజి మీద వేషధారి

''సహజంగా నటించండి - కాని నటించవద్దు'' అని ఒకానొక ఫిలిం డైరెక్టరుగారు అమెరికాలో ఇంగ్లీషు భాషలో అన్నారట. యూరపులో మరో ఫిలిం డైరెక్టరుగారు వారిభాషలో ఒకసలహా ఇచ్చారట నటులకు, ఆ సలహాను మన భాషలోకి తర్జుమా చేస్తే అది కూడా ''సహజంగా నటించండి - కాని నటించవద్దు'' అని అవుతుందట. ఆ డైరెక్టరుగార్లు ఒకరితొనొకరు సంప్రదించుకుని అన్నముక్కకాదిది. ఇద్దరూ అనుభవం మీద అన్నముక్కే అటువంటప్పుడా ముక్కను ఈ కాలానికి

నటులు మననం చేసుకోదగ్గ సూత్రంగా ప్రపంచం ఆమోదించవచ్చును మన కాలానికది మంచి సలహా క్రింద అనేక మంది ఆమోదించారుకూడాను ఇక మనదేశానికి మాత్రం ఎందుకు పనికిరాకూడదు

ఈ సూత్రమే చాలా క్లుప్తంగాను, సులభంగా జ్ఞాపకం పెట్టుకోదగినదిగాను ఉంది కానీ దీన్ని పూర్తిగా అర్థం చేసుకోటానికీ ఆచరణలో పెట్టటానికీ చాలా ప్రయత్నం అవసరం

ఒకనటుడు ఒక ప్రదర్శనంలో ఒక ఘట్టంలో నవ్వవలసి వచ్చిందనుకుందాం. ఈ ప్రదర్శనం రిహార్సల్సు నేనుకండక్టు చేస్తుంటే ఈ ఘట్టం వచ్చినపుడానటుణ్ణి ''సహజంగా నవ్వు- కాని నవ్వు నటించవద్దు అంటాను అప్పుడు నటుడేం చెయ్యాలి? నవ్వునటించకుండా ఎట్లా? సహజంగా నవ్వటం మాత్రం ఎట్లా? అసమయానికి దైవానుగ్రహం వల్ల కడుపు చెక్కలయ్యే నవ్వు వస్తుందా ఏమిటి? రాదు ఇది చిక్కుగానే కనిపిస్తుంది కాని నిజంగా ఇందులో చిక్కేమీ లేదు. నాకు కావలసిందల్లా నటుడు నవ్వు తెచ్చుకుంటున్నట్లు కనపడకుండా సహజంగా నవ్వినట్టు కనపడటమే చూచేవాడికి ఏమాత్రము పట్టివ్వకూడదు ప్రేక్షకుడిలో విమర్శనా బుద్ధి పుట్టనిచ్చాడో, ఆ నాటకం పాడే నటుడు ప్రదర్శించే ఉద్రేకాలకు అతీతులైన ఆ జాతి వేరే వుంటుంది. వాళ్లు ముందు కుర్చీల్లో కూర్చుని ఎక్కడా ''ఓహో!'' ''భేష్''! అనకుండా కలాలు చేత పట్టుకుని స్తనశల్య పరిక్షచేస్తుంటారు. ప్రేక్షకుడికి వాళ్ళనుకరిద్దామనే బుద్ధి పుట్టనివ్వకూడదు స్టేజి మీద నటుడు. నాటకం బూటకమైతే అవునేమోకాని బూటకంగా కనబడకుండా ఉన్నంత వరకు దానివిధి అది నెరవేరుస్తున్నట్టే.

ఉద్రేకాలను సహజంగా ప్రదర్శించటమేకదా, అదెంతపని అనుకోరాదు. ఎందుకంటే, సహజంగా నవ్వటమంటూ ఒకటి లేదు. నవ్వువచ్చి నవ్వే వాళ్లే కొందరు ఏడిచినట్టు నవ్వుతారు. కొందరు సహజంగా ఏడుస్తుంటే చూసే వాళ్ళకు నవ్వు రావటమూ కద్దు. కాని ఎవరెన్ని రకాలు ఏడిచినా నవ్వినా నవ్వు ఇట్లావుంటే సహజంగా వుంటుందీ, ఏడుపిట్లావుంటే సహజంగా వుంటుందీ అని ఊహించే మాత్రం కళ చాలా మందిలో వుంది. దాన్ని ప్రదర్శించగల కళ నటుడిలో ఉంటుందని! ఆ నటుడు కొన్నికృత్రిమోపాయాల వల్ల సహజమైన ఉద్రేకాన్ని ప్రకటించగలుగుతాడు.

కృత్రిమోపాయాలవల్ల ప్రకటించేది సహజమెట్లా అవుతుందని అనుమానం రావచ్చు. మనిషి జీవితమే కృత్రిమం అయిపోయింది. శ్రుతిలో చక్కగా మేళవించి ''అయ్యో: నాయనా! ఇక పప్పుండలు తినవంట్రా!'' అని ఏడిచే ఏడుపు సహజమైనదని ఎవరూ అనరాదు. కాని ఆ మనిషి కది సహజమే అయిపోయింది. వన్యమృగాల ఉద్రేకాలనూ వాటి ప్రకృతిని సహజమైన వాటినిగా మనం పరిగణించటానికి వప్పుకుంటున్నాం. కానీ అదీ అనుమానించవలసిన సంగతే.

అటెంతా ఎట్లా వున్నా కల్తీ లేని సహజమైన ఉద్రేకం ఎట్లా వుంటుందనే సమస్యకూడా మనకు రాదు ఎందుకంటే నటుడి చేత ప్రకటింపబడే ఉద్రేకం పాత్రకు సహజంగా ఉండటమే మనకు కావలసింది

అట్లా అయితే జీవితంలో అనేక మంది అసహజంగా ఉద్రేకాలను ప్రకటిస్తున్నట్టే ఆ పాత్రకూడా ప్రకటిస్తున్నట్టు భావించి నటుణ్ణే వాతయినట్టు నటించనివ్వరాదా అని అడగవచ్చును దీనికి సమాధానమేమిటంటే? అటువంటి పాత్రల ఉద్రేకాలతో ప్రేక్షకుడికి పనిలేదు ఎవడు ఆగ్రహిస్తే తనకు నవ్వువస్తుందో వాణ్ణి స్టేజీమీద చూడటానికి ప్రేక్షకుడు అంగీకరించడు. అటువంటి పాత్ర డ్రమెటిక్ పర్పస్‌కి విరుద్ధంగా వుంటుంది.

ఒక్కొక్కనటుడి మొహాన వివిధ రసాలూ ఉపరసాలు సులభంగా ఒప్పుతై మరి కొందరికి అద్దం ముందుంచుకుని ఎడతెగని ప్రాక్టీసు చెయ్యటం తప్పనిసరి

నటులలో నేడు చాలా గౌరవస్థానం పొందిన శ్రీ నెల్లూరు నాగరాజరావుగారు 'రంగభూమి' లో కొన్ని కృత్రిమోపాయాలు సూచించారు వివిధములైన రసాలను ప్రకటించటానికి. ఆ సూచనల ఉపయోగాన్ని నేను సంశయిస్తున్నాను. ఏ చారిత్రాత్మక ప్రదర్శనమో జరిగి అందులో ప్రతిపాత్ర క్రోధరసం చూపవలసి వచ్చి, ఒకరి వెంట ఒకరు నటులు కనుబొమలు ముడిచి నోరు కొద్దిగా తెరచి కిందిపెదవి కొద్దిగా లోపలికి లాగటం మొదలు పెడితే ఒకరి తరువాత ఒకరు నటులు మధ్యమావతిరాగం పాడుకొచ్చినట్టుంటుంది. నాగరాజారావుగారు నాట్యకళను నాట్య శాస్త్రం చెయ్యాలని ప్రయత్నిస్తున్నట్టు తోస్తుంది. నాలో కళ అనేదే ఉండి అద్దం ముందు కూచుంటే నామొహానికి ఈ రసం ఒప్పుతుంది. ఈ రసం ఒప్పదని కనుక్కోలేనా? ముక్కుపుటాలెగరెయ్యకుండా కోపం చూపించగలనని నేను ''తెలిసి'' తృప్తిపడ్డ తరవాత నాకు ముక్కు పుటాలతో ఏంపని? క్రోధం ఒప్పని మొహానికి ఆకాస్త పనీ చెయ్యగానే పని జరిగిపోవచ్చునేమో? పవరు తక్కువ టెలిస్కోపు లోంచి చూస్తే ఒకటిగా కనపడే గోళం ఎక్కువ పవరు దాంతో చూడగానే రెండుగా కనబడ్డట్టు దూరాన్నించి ఒకగీతల్లే కనబడి దగ్గిరికి ఆనుకానుకుని వున్న రెండు గీతలల్లే కనపడ్డట్టు, ప్రేక్షకుడి దృష్టికన్న నటుడి దృష్టిసూక్ష్మంగా చూడ గలిగినప్పుడు, నటుడు తన భావ ప్రకటన సహజంగా వున్నదని తోచినప్పుడు ప్రేక్షకుడింకో విధంగా భావించటానికి వీల్లేదు.

ఇక నటుడు తీసుకున్న పాత్ర యొక్క ప్రకృతికి (ఆ ప్రకృతిని అస్పష్టంగా గాని అసంపూర్ణంగాగాని సూచించటం నాటక రచయిత యొక్క లోపమై వుంటుంది.) సహజంగా నటుడు భావప్రకటన చేస్తున్నాడో లేదో విమర్శకుడు నిర్ధారణ చేస్తాడు. అందుచేతనే అతను నటుడు ప్రకటిస్తున్న ఉద్రేక ప్రవాహంలో పడి కొట్టుకొని పోడు ప్రవాహంలోపడి కొట్టుకుపోయ్యే కొలత బద్దతో లోతు కొలవటం అసంభవం కాదూ?

తెలుగుదేశంలో రాఘవాచార్యులుగారి భావప్రకటనలో ఏది కొన్నికి పోని కొలతబద్ద లేకపోయిందిగదా అని ఆశ్చర్యపడతాను ఆచార్యులు గారి ''రామదాసు'' నేను చూసి చాలా రోజులయింది రామదాసు పాత్ర ప్రస్తుతం స్టేజీమీద ఎవరు వేస్తున్నారో తెలీదు కాని నాటకంలో ఈయన ''జైలు సీనులో'' రకరకాల భావాలను మొహాన తిప్పేస్తుంటే ఏమిటబ్బా పాత్రోచిత బుద్ధి వారు ఆవేశాల నేత్రాలు ఒకింత పెట్టివి చేసి, తల విదిలించి ''ఇది నా కవిత కాదు ఏమ్యేము'' అంటుంటే నాగుండె దడదడలాడేది నాటకంలో రామదాసు యొక్క ప్రకృతి చాలా విపరీతంగా ఉంది ''భద్రాద్రి రఘురామభజనకు'' అనే పద్యం మొదలునే (కబీరు సంపర్కం లేకపూర్వం) పదివిన గోపన్న, రామదాసై ''మిమ్మని నిర్మించిన మేటి దేవుడు'' అనే పద్యం చదువుతాడు, ఆ తరువాత ''సీతాధరాజాత'' అనే పద్యం చదువుతాడు. ఆ తరువాత జైలులో - ఏం చేస్తాడో రాఘవాచార్యులు గారు స్పష్టంగా చూపారు ఆచార్యులుగారు ధరించవగ్గ పాత్ర కాదది, కాని ధరించారు ధరించిన వారు జైలు సీనులో అంతగర్జంతు చేయవలసిన అవసరం లేదనుకుంటాను సామాన్యమానవులు మరణదండన విధించబడి అట్లాచెయ్యటం లేదు. రామదాసువంటి భక్తులు కాకపోయినా ఆజాతికి చెందినవారు భగవత్ప్రసాదం కోసం ఎంతో ఓర్పుతో ఎదురుచూస్తున్నారు. తాత్కాలికంగానే కానివ్వండి, ఉన్మత్తులల్లే ప్రవర్తించకుండా. నాటకంలో అట్లా రాశారే అనేది సమాధానం కాదు, ఆ చార్యులు గారు కొన్ని కొన్నిరంగాలు సృష్టించగలరు తమ అవసరం కొద్దీ. నిజమేమిటంటే ఆచార్యులుగారు విమర్శకులను గడ్డి పరకల కింద కట్టేశారు. (అవి అట్లాగే తేలిపోయినై చూడండి చిత్రం!) వారికి అసామాన్యమైన భావ ప్రకటనా దక్షత వుంది. ప్రేక్షకులకు '' ఇది కృత్రిమంగా ఉందిరా'' అనిపించకుండా వారు చాలాదూరం వెళ్లగలరు. వారి శక్తికి మంచి అవకాశం ఇచ్చే జైలుసీనుకల నాటకం కనపడ్డది ఆడేశారు అంతే!

మార్లిన్ డీట్రిక్ అనే ఆవిడ నటించిన ''డిజానర్డ్'' అనేఫిలిం చూశాను. అందులో ఆవిడ ధరించిన పాత్ర వేగుల్ది తన వృత్తిలో ఏదో కార్యం చేస్తుంది. ఉరిశిక్ష విధిస్తారు. మర్నాడు ఉరి తియ్యబోతారు నీకేం కావాలని అడుగుతారు ఒక పియానో అడుగుతుంది. ఆ రాత్రంతా ఆ వాద్యం మహా ఉద్రేకంగా వాయించేస్తుంది. బహుశా ఆవాయింపు ద్వారా ఆ మనిషి మనస్సేం చేస్తున్నది ప్రేక్షకులు గ్రహించవచ్చుననే భావం కూడా ఉంటుందేమో! మొహాన ఏ భావమూ లేదు. మరుసటి ఉదయం కాల్చెయ్యటానికి బయటికి తీసుకొస్తారు ఒక యువకుడు ఆవిడను ఒకచోట నిలబెడతాడు. ఎదురుగా తుపాకులు తీసుకుని సిపాయిలు నిలుచుంటారు. ఆయువకుడు జేబురుమాలు ఎత్తగానే కాల్చెయ్యాలి. వాడు అదిక్రిందపడేసి కన్నీరుకారుస్తాడు. ఈ మనిషి వాడివంక చూసి క్రిందపడ్డజేబు రుమాలుతో వాడికళ్లు తుడిచి ఆరుమాలు వాడి చేతికిస్తుంది. మొహాన ఏభావమూ

ఈ కథ మార్లిన్ డీట్రిక్ స్వతంత్రించి తీసుకున్నదికాదు ఆ పాత్ర యొక్క ప్రకృతిని ఆవిడ మార్పుచేసేటందుకు వీలులేదు అటువంటి పిచ్చివేషాలు చెయ్యనీకుండా డైరెక్టరు సెనేరియో రాసేవాళ్లు కాపలసినంత మంది వుంటారు ఆ పాత్ర ఆమె పోషింపగలదని ఇచ్చారు ఆమె పోషించి తీరాల మనవాళ్లు నాటకం ఆడితే ఆ పాత్ర యొక్క ప్రకృతి ననుసరించి నటించాదానికడని విచారిస్తాం. ఇక్కడ అదికాదు నటుడు నటనను బట్టి ప్రకృతిని ఊహించాలి మన ముఖ్యమైన నాటకాలన్నీ అందరిచేత ఆడబడుతూండటం వల్ల ఆ పాత్రలను గురించీ నాటకాలను గురించీ రకరకాలుగా భావించటం జరుగుతున్నది. మనదేశానికి కాపీరైట్లు లేవు, మంచి నాటకాలెక్కడనుంచి వస్తవి? నటనలో డబ్బుంది కాని నాటకాల్లో లేదు.

కొందరు నటులు స్టేజీ మీద ప్రవర్తించడంచూస్తే కూచిపూడి భాగోతానికీ నాటకాలకూ తెరలూ టిక్కట్లూ మాత్రమే తేడా అనుకుంటున్నట్లు తోస్తుంది. ఈ రొంటి టెక్నిక్‌ల తోను నటుడికి కొంత సంబంధం వుంది. కూచిపూడి భాగవతుడు తన రంగస్థలం మీద ఉన్నంత సేపూ ప్రేక్షకుడే నటిస్తాడు. తను ధరించిన పాత్రయొక్క వ్యక్తిత్వాన్ని చూచేవాడి మీద పామటానికి వెనకాడడు నాటకాల్లో అట్లా వీలులేదు. స్థానం నరసింహారావుగారు ప్రేక్షకుల కోసం ఆడవచ్చుగాక, చిత్రాంగి ప్రేక్షకులను గుర్తించదు. చిత్రాంగి తన ప్రకృత్యనుసారం సంచరిస్తున్నపుడు నరసింహారావు గారు చెయ్యవలసిందేమిటి? ప్రేక్షకుల నాగరికతను గౌరవించి నటుడు తనుధరించిన పాత్రను ప్రేక్షకులకెంత దూరంలో ఉంచాలో ఎరిగి మసులుకుంటాడు. ఏ చాకలివాడో మంగలివాడో జీవితంలో మనతో హద్దు మీరిన సంభాషణకు ఉపక్రమిస్తే ఎంత కోపం వస్తుందో స్టేజిమీద చాకలి, మంగలి పాత్రలు ప్రేక్షకులతో అధిక ప్రసంగం చేస్తే అంతకోపమూ వస్తుంది. మనస్టేజి మీద నీచపాత్రలు ఇటువంటి పనులు చెయ్యటం తగ్గినా నశించలేదు.

మరికొందరు నటులు కేవలం ప్రేక్షకులతో సంభాషణ చెయ్యక పోయినప్పటికీ తమ పాత్రలను ప్రేక్షకుల అభిరుచులకు విరుద్ధంగా ప్రవర్తించనిస్తారు. రామసింహుడు ఎంత దేశభక్తి కలవాడైనా చూసేవాళ్ళకు అభ్యంతరం వుండదు. సిగ్గు బిడియాలు లేకుండా తన దేశభక్తి ప్రేక్షకుల ఎదుట పరచి పెట్టితే అభ్యంతరం ఉండటానికవకాశం వుంది చూచేవాడి నాగరికతను గౌరవించినట్టే అతడి భావనాశక్తిని గౌరవించాలి కథ చెప్పేటప్పుడు వినేవాణ్ణి పిల్లవాడికన్న అన్యాయంగా చూసిచెప్పటానికి వీలయిందంతా చెబుతూ కూర్చుంటే ఎంత ''ఆమదం''గా వుంటుందో నటుడు తననటనలో చూచే వాడికి కొంత కొంత సూచించి వదిలిపెట్టకపోతే అంత జిడ్డు క్రింద పరిణమిస్తుంది నాటక ప్రదర్శనం. అది కూచిపూడి భాగోతులు లెక్కచెయ్యరు. నటుడు లెక్కచెయ్యక వీలులేదు.

ఇటువంటివి స్వల్ప విషయాలేకాని ఎవరో ఒకరు గమనించే వరకూ వాటిని గమనించని కొరత ఉండి తీరుతుంది.

*ప్రబుద్ధాంధ్ర 1935 జూలై*

# 20. కళయొక్క అభివృద్ధి

పీథ నాటకాలు వెనకబడి, నాటకాలూ, లేపేకూడా కొంచెం వెనక్కి వెళ్ళి టాకీలు వచ్చినవనుకునున్నా, తాళపత్రాలూ ఘంటాలూ మొదలయినవాటిని అతిక్రమించి అచ్చుకాలముంటున్నా, బ్రష్షులూ, కెన్వాసులూ, నూనెరంగులూ మొదలైన సాధనాలను మించి కామెరాలూ రావటం మూలాన కళ ప్రపంచమందంతటా వాయువేగంతో అభివృద్ధి పొందుతున్నదనే అభిప్రాయం ఒకటి ప్రబలంగా ఉంది. నిజమైన కళయందు ఎక్కువ అభిరుచి లేక, అదేమిటో తెలుసుకోవాలనే యావ కూడా లేని ఆంధ్రులు కాని ఆంధ్రేతరులు కాని, వారికా విశ్వాసంవల్ల ఏ మాత్రమైనా సంతుష్టికలిగేయెడల, కళ అభివృద్ధి గాంచుతున్నదని అభిప్రాయపడవచ్చును. ''కళలు పూర్తిగా నశించిపోతున్నవి'' అని మొరపెట్టే వయోవృద్ధులను కళా సనాతనుల కింద కట్టి పెయ్యవచ్చును. అందుకు ఎవరి అభ్యంతరమూ ఉండబోదు.

అయితే అటువంటివారు, కళలకూ వాటి ప్రదర్శనములకు సంబంధించిన శాస్త్రములకూ విచక్షణ తెలియక, ఎవడైనా తెలిసినవాడు చెబుతుంటే అర్థంచేసుకోలేక, ప్రతివిమర్శనలు చెయ్యటం అసహ్యంగా ఉంటుంది.

కళలనుగురించి ఆంధ్రుల అభిప్రాయాలు, ఇంకా అయోమయంగా ఉన్నట్లు కనిపిస్తూండటం వల్లనూ, ఆంధ్రులుకూడా ఇతరులతో పాటు పైకి రావాలంటే ఈ విషయాలను గురించి స్పష్టంగా తెలుసుకున్న విమర్శకులు కొందరు తయారుకావాలికనుకనూ, కొన్ని చిన్న చిన్న విషయాలనుగురించి నాకు తెలిసినది తెలియనివారికి తెలియజేసే అభిప్రాయంతో ఈ నాలుగు ముక్కలూ రాస్తున్నాను.

కళ అభివృద్ధికాదు, క్షీణించదు. ఆ సద్గతీ దుర్గతీ కళా ప్రదర్శనములకు మాత్రమే కలుగుతూ ఉంటుంది. కళా ప్రదర్శనముల యొక్క ఉద్దేశం కళను ప్రకటించటం అది జయప్రదంగా కొనసాగాలంటే ప్రదర్శనా విధానం కొన్ని అవసరమైన కట్టుబాట్లకు లోనుకావాలి. భావం ఎటువంటిదో కళ అటువంటిది. భాషవంటిది టెక్నిక్. కళా పిపాసకు ఎటువంటి టెక్నిక్‌తోనూ ఏమీ సంబంధం లేదు. అది నేర్చుకోవటం ప్రదర్శకుడిపని. గానకళ తీసుకున్నట్టయితే, సంగీత శాస్త్రవేత్త కళాప్రదర్శనాలకు అర్హుడవుతాడని భావించనక్కర్లేదు. కాని గానకళా ప్రదర్శకుడికి సంగీత శాస్త్రం కూడా రాక తప్పదు గానకళయందు అభిరుచిగల వాడికి సంగీత శాస్త్రం రాకుండానే గానకళా ప్రదర్శనం (సంగీత శాస్త్రప్రదర్శనం కాదు!) సులభంగా అనుభవనీయమవుతుంది. సంగీత శాస్త్రమందే అభిరుచి కలవాడు గానకళనుగురించి ప్రసంగించటం నిరర్థకం. గానకళయందూ సంగీతశాస్త్రమందూ కూడా అభిరుచి కలిగినవాణ్ణి గురించి నేనేమీ చెప్పను. ఈ

స్వల్ప విషయాలు అర్థంచేసుకుంటే వివిధ పత్రికల్లో ప్రచురించబడే పొరపాటు అభిప్రాయాలకు తావు ఉండదని నేను నమ్ముతున్నాను

''అభివృద్ధి మార్పు'' అనే తల పేరుతో నేను చాలాకాలం క్రితం రాసినవ్యాసం ఒకటి నాట్యకళతృతీయ సంచికలో ప్రకటితమయింది అదిచూచి డాక్టరు బుర్రా శేషగిరిరావు గారు, నా గురువులు, నన్ను రివల్యూషనరీ వాది కింద కట్టేశారు 'ఆంధ్రవార్త' వారికి అందులో ఉండిన అభిప్రాయాలు సంకుచితబుద్ధితో కూడినవిగా కనిపించినవి ఇంకా ఎందరెన్నెన్ని విధములుగా భావించారో నాకు తెలియదు నావల్ల జరిగిన పాపం పేరే ఏమీలేదు, ''మనకు కావలసింది అభివృద్ధికాదు, మార్పు'' అన్నాను

'' అభివృద్ధి'' కింద పరిగణించబడే వస్తువును ఒక్క సారి తరిచిచూస్తే నేనా ముక్క ఎందుకన్నానో సులభంగా బోధపడుతుంది.

కళకు సంబంధించినంతవరకూ మార్పయినా అభివృద్ధి అయినా కళా ప్రదర్శనములతాలూకు టెక్నిక్కుదేనని మొదటనే మనవిచేశాను ఈ అభివృద్ధి రెండురకాలుగా ఉండవచ్చును (1) కళను బాగా ప్రకటించటానికి, (2) కళను విరివిగా ప్రకటించటానికి మొదటిరకం అభివృద్ధికి ఎవరూ అభ్యంతరం చెప్పరు. రెండవ రకమైన అభివృద్ధి కూడా చాలాయోగ్యమైనదేకాని, దాన్నిహద్దుమీరి పోనివ్వరాదు అయితే మొదటిరకం అభివృద్ధి చాలా మందంగా జరుగుతుంది. భరతాచార్యుం వారు కొన్ని సూత్రాలు చెప్పారు. ఆచంద్రార్కమూ వాటికి చలనం లేదనీ, వాటికిక మెరుగుపట్టడం అసంభవమనీ ఎవరూ భావించరాదు. దానికి తగిన సమర్థుడు అనుకున్నప్పుడల్లా జతపడడం అసంభవం

ఇక రెండవరకం అభివృద్ధి చూడండి. మా తాత గారికాలంలో కూడా తాటాకులు రాయటానికి ఉపయోగించారు. ఈనాడు ఘంటాలు చూడనివారు కూడా అనేకమంది ఉండవచ్చును. కాగితాలూ, కలాలూ, ఇంకామంచికలాలూ, కాళ్లతో తొక్కే అచ్చుయంత్రాలూ, పవర్ మీద నడిచేయంత్రాలూ వాటంతటఅవే అచ్చుకూర్చే యంత్రాలూ, గంటకు ఎన్నో వేల ప్రతులు ముద్రించే రోటరీలూ అన్నీ దేశంలోకి వచ్చిపడినై, సముద్రందాటి మరికొన్ని రానున్నవి. ఈ అభివృద్ధివల్ల కళాప్రచారం జరగటానికి అవకాశం లేకపోలేదు. ఈ నాడు ఇంటింటా ఒక భారతం ఉండటానికి అవకాశాలు ఏర్పడినై. పైగా, భారతంవంటి ఉత్తమకావ్యం ముచ్చటయిన అచ్చుతో!

అయినప్పటికీ కాస్త విచారిస్తే ఆ అభివృద్ధికి దుఃఖించాలో, సంతోషించాలో కూడా తెలియదు. ఈ అభివృద్ధి మనచేత ఏం చేయించింది ! రైలు వున్నంత మాత్రం చేత కాశీక్షేత్రంయొక్క పవిత్రత క్షీణించిందా అని తెలివిగా అడగవచ్చును ఆ పవిత్రత కాశీ క్షేత్రంలో లేదు. కాలినడకను కాశీకివెళ్లి గంగ ఒడ్డున సాష్టాంగంపడ్డవారి హృదయాల్లో ఉంటూ ఉండేది! అచ్చుకూటాలే అయినా నేను

రాకపోయినట్టయితే భారతం యొక్క ప్రతులలో 'న'' లకు ''స''లు ఉండేవికావు భారతం పఠనం మానేసి యువకులు (ముందు పీఠమే దేశంలో లూకు బాధలు పడుతూ ఉన్నవి) మానవ ప్రతిభ ఎదుకపోయి ఉండును. అనేకవిధములైన వస్తు గ్రంథాలు లభ్యంకావటంద్వారా శాస్త్రాలు పెరుగుటకపోయి ఉండేవి

నాట్యానికి చక్కంద్యాల శాస్త్రం పెరుగుటడి దేశం యొక్క ఒకదిశల పరిపిగా ప్రకటించబడటమనేది సంభవమయినప్పటికీ ఎంత అనుమానాస్పదమో మాడండి ఏది నాటకం తీసుకుంటే అందులో ప్రేక్షకుల దృష్టి యావత్తూ నాట్యకళ మీదే ఉండటానికి చాలా అవకాశాలున్నవి తెరలులేవు చెప్పుకోదగిన వేషధారణ లేదు ఒక కొబ్బరిమట్టల పందిరీ, ఒకటి రెండు దివ్వట్లూ అంతే. ప్రదర్శనకు సంబంధించిన టెక్నిక్ యావత్తూ భరతశాస్త్రంలో చెప్పబడినదే శాస్త్రంలో ప్రవేశంగలవారు విమర్శనాదృష్టితో చూస్తారు స్త్రీలూ పిల్లలూ ప్రదర్శనంలో ఉన్న రసంమాత్రం గ్రహిస్తారు. లేకపోతే నిద్రపోతారు

ఒక టాకీ తీసుకోండి వేషధారణ ఒకకళ, ఆ రంగులూ అవీ తయారు చేసేటందుకు ఒక శాస్త్రమూ, ఒక పెద్దపరిశ్రమా, అవి వెయ్యటానికి ఒక ఎక్స్పర్టు. ఒక నాటకం. ఆ నాటకరచనకు సంబంధించిన టెక్నిక్. నాటకం ఒకకళావస్తువు అభినయం ఒకకళ, దానికి సంబంధించిన కొంత శాస్త్రం ఫోటోగ్రఫీ ఒకకళ దాని తాలూకు శాస్త్రమూ పరిశ్రమా, శబ్దగ్రహణం, ఒకశాస్త్రం – ఇన్ని శాస్త్రాలూ, కళలూ వాటితాలూకు లోటుపాట్లూ ఒకముద్దచేసి మనని నెత్తిన ఒక టాకీ రూపంతో రుద్దుతున్నారు. ఇందులో నాట్యకళను వెతకటానికి ఎవరికిపట్టింది? ''ముందుబొమ్మలు తేటగా కనపడటం లేదూ!'' ''మాటలు స్పుటంగా వినిపించటం లేదూ !'' '' Bad photography Absurd sound recording!'' ''డైరెక్టరెవరో వట్టిపెధవ!'' ''అసలు డైరెక్టరు దొరటు'' అందుకని పనియావత్తూ మనవాళ్ళే చేసేశారు. ఈ విధంగా పోతై వ్యాఖ్యానాలు.

ఈ పరిస్థితుల్లో టాకీలురావటం ఏకళ యొక్క అభివృద్ధికి? ఆ ఒక్కకళకోసం ఇన్ని ఉపకళలూ, ఉపశాస్త్రాలూ వినియోగించటం ఏమిటి? అసలు కళనుంచి ప్రజల దృష్టి ఈ ఉపకరణాల మీదికి పోవటం యేమిటి? ఒక్క ప్రదర్శనం కోసరం ఇంతమంది డైరెక్టర్లూ, టెక్నిషియన్లూ, నటులూ ఆరోగ్యాలు పాడుచేసుకొని చెప్పరాని హైరానపడి, అమాంబాపతు నౌకర్లూ వాళ్ళూ పొట్టనింప లేని జీతాల మీద బతుకుతూ తమ జీవితాలను ఈ కళ యొక్క సేవలో వినియోగిస్తుంటే కళకు గాని ప్రజలకు గాని కళా దృష్టిలో కించిత్తయినా ఉపకారం జరిగిందా? టాల్స్టాయి ఇంత మంది ప్రాణాలు తోడుతున్న కళను తక్షణం తగలవెయ్యమన్నాడు. ఆయన ఆముక్క తన దేశం యొక్క ఆర్థిక పరిస్థితులు గమనించి చెప్పాడు. మనదేశంలో కళ యొక్క దుర్గతి చూచికూడా ఆముక్కే చెప్పవచ్చును.

టాకీలూ అమ్ముకూటాలూ మొదలైనవి తీసిపారేసి కళను ఉద్ధరించమని ఆంధ్రులను వేడుకోవటం లేదు అది వట్టి అరణ్యరోదనం అవుతుంది కాని ఈ అభివృద్ధి యావత్తూ కళయొక్క అభివృద్ధిఅని గాని, దీనికి కళతో ఏవిధమైన సంబంధమయినా ఉందనిగాని అనుకోవద్దని ఆంధ్రులను ప్రార్థిస్తున్నాను ఇదీ అరణ్యరోదనమే అవుతుందా?

*భారతి, మే 1936*

# 21. నేడు నాటకకర్తలేస్థితిలో ఉన్నారు.

స్వతహాగా నాట్యకళకు ప్రత్యేకత లేదు దాని తొలిఆశయం నాటకానికి జీవం పోసి ప్రచారం ఇవ్వటం నటుడి ధర్మం నాటకకర్త చేసిన రచనకు ప్రదర్శనం ద్వారా పరిపూర్ణత్వం ఇవ్వటం

నాటకాన్ని చదివినదానికన్న చూడటం వల్ల నాటక కర్త యొక్క అభిప్రాయాలు ప్రేక్షకులకు బాగా అంటినప్పుడే ప్రదర్శనం సాఫల్యం పొందుతుంది. దీన్నే పరిభాషలో చెప్పాలంటే, ప్రదర్శనంద్వారా ప్రేక్షకుడికి పఠనం ద్వారా పఠితకు కలిగేదానికన్నా అధికమైన రసానుభూతి కలుగుతుంది.

పైన చెప్పినట్టు ఇది నాట్యకళయొక్క ప్రాచీనాశయం. అయితే ఈనాడు దీని కాట్టే చలామణి లేదు. నాగరికత కళల యొక్క ఆశయాలను సంస్కరించటం అందరికీ తెలిసిన విషయమే. నాగరికతయొక్క ముఖ్యలక్షణం సాధనాలను పరమార్థాలు చెయ్యటమే. ఒకప్పుడు సాధనంగా ఉండిన నాట్యకళ రాను రాను పరమార్థంగా పరిణమించింది. ప్రేక్షకుడికి నాటకం ఏమిటనే జిజ్ఞాస పోయిదాన్ని ఎట్లా ఆడతారో చూతామనే వాంఛ జాస్తి అయింది. నాటకకర్త యొక్క ఆశయాలకు ప్రాముఖ్యత పోయి నటుడికళకు ప్రాముఖ్యత హెచ్చింది. నాట్యశిల్పం పరమార్థాలలో చేరిపోయింది. దేశ మంతటా ప్రఖ్యాతి సంపాదించి అసంఖ్యాకులైన ప్రేక్షకుల అభినందనాన్ని, ధనాన్నీ సంపాదించిన నాటకం తాలూకు కర్త ఎవరో ఎవరికీ తెలియక పోయినప్పటికీ ఈనాడు ఆశ్చర్యకరమైన సంగతి కాదు.

వెనకటి కాలంలో ధర్మవరం కృష్ణమాచార్యులూ, బలిజేపల్లి లక్ష్మీకాంతకవీ, చిలకమర్తి లక్ష్మీనరసింహకవీ, పానుగంటికవీ మొదలైన నాటకకర్తల కీర్తి హరిప్రసాదరావు, జగ్గరాజు వగైరా గార్ల ప్రతిభతో కనీసం తులతూగ గలిగి ఉండేది. అంతకు మించి వుండకపోతే మైలవరం కంపెనీ, మోతేవారి కంపెనీలు పైకి వచ్చిన తరవాత శ్రీరాముల సచ్చిదానంద శాస్త్రి, వారణాసి సీతారామశాస్త్రి వగైరాగార్ల కీర్తి యడవల్లి సూర్యనారాయణ, ఉప్పులూరి సంజీవరావు, గురజనాయుడు, పారువల్లి సుబ్బారావుమొదలైనవారి ప్రతిభకు

వెనకపడి పోయింది బళ్ళారి రాఘవాచార్యులు, స్థానం నరసింహారావు ప్రభృతులు నాటకకర్తలను ఆరాధితుల లిస్టులో నుంచి పూర్తిగా కొట్టేశారు.

ఈనాడు స్టేజినటుడు స్వయం ప్రకాశకుడు. రంగస్థలమనే ఆలయంలో పెద్దపూజారి, జనసామాన్యం యొక్క అభిరుచులకు నియంత, ఇతని ప్రతిభనుగురించి సంగ్రహంగా విమర్శింతాం

## స్టేజి నటుడి ప్రతిబ

ఈ నటుడి ప్రతిభను అరికట్టేవి మూడు (1) నాటకం, (2) రంగస్థలం (3) ప్రేక్షకులు ఇతను తన శిల్పాన్ని దేనిమీద చూపేదీ నాటకం నిర్ణయిస్తుంది అది గీసిన గిరులు దాటి పోవటానికి లేదు నటుడికి, (అప్పటికీ ఈ కాలపు నటులు నాటకంలో లేని మాటలను కొన్ని అని, నిర్దేశించని నటన కొంత చేసి , తమ స్వేచ్ఛను ప్రకటించుకుంటూనే ఉన్నారు )

## నాటకాలు - నాట్యకళ

నాటకం తరవాత అతని స్వేచ్ఛను అరికట్టేది రంగస్థలం ఆ రంగ స్థలానికి క్రియకు రెండే కొలతలు కుడివైపునుంచి ఎడమవైపుకూ, ఎడమవైపునుంచి కుడివైపుకూ అయిదారు గజాల స్థలంలో అతను ఎంత స్వేచ్ఛగానైనా కదలగలడు కాని ముందుకూ వెనక్కూ కదిలేటందుకు అతనికి విశేష అవకాశం లేదు (రంగస్థలం మీద ఒక అడుగు ముందుకు రావడం గాని, ఒక అడుగు వెనక్కు పోవటం గాని కదలికలో జమకాదు)

ఈ రెంటి తరువాతా అతని స్వేచ్ఛను అరికట్టేది ప్రేక్షకులు. నటుడు రంగస్థలం మీద ఉన్నంతసేపూ ఇంచుమించు ప్రతిక్షణమూ ప్రేక్షకుల వేపే తిరిగి ఉండాలనేది కూడా ముఖ్యమైన విషయం కాదు - న్యాయంగా అది స్థలం తాలూకు ' అరికట్టు' కిందికి వస్తుంది ప్రేక్షకులు నటుణ్ణి అరికట్టేది తమ సంస్కారం ద్వారా

ఇతర రచనలకూ నాటకానికీ ఉన్న ముఖ్య భేదం ఏమంటే ఇతర రచనలు ఏదో ఒక సంస్కారం ఉన్నవారి కోసమే రాయటానికి వీలవుతుంది. నాటకం కూడా రచనలో అంతేకాని ప్రదర్శనంలో నటుడు రకరకాల ప్రేక్షక వర్గాలకు వివిధ విధాల రసానుభూతి నివ్వాలి నాటకకర్త తన విమర్శనా జ్ఞానం మాత్రమే ఆధారం చేసుకుని ఒకేసారి నాటకరచన చేస్తాడు నటుడు ప్రేక్షకుల సంస్కారాభిరుచులను ప్రత్యక్షంగా గమనించి విమర్శించుకుని తన నటనలో నిగ్రహం(restraint) మొదలైనవి ఎంతవరకు అవలంబించాలో చూసుకుంటు ప్రదర్శనాన్ని జయప్రదం చేస్తాడు.

ఈ విధంగా రంగస్థలాన నటుడు మనోవాక్కాయలా నిర్బంధితుడై ప్రేక్షకులవల్ల మనస్సూ, రంగస్థలం వల్ల కాయమూ, నాటకం వల్ల వాక్కూ అరికట్టబడినవాడై తన ప్రతిభను ప్రకటించాలి.

## స్టేజి శిల్పం: సహజత్వమూ, యాథార్థ్యమూ

స్టేజినటుడు వినియోగపరుచుకునే శిల్పం గురించి సంగ్రహంగా విచారింతాం

ఏ కళకుగాని ప్రధానాశయం ''నమ్మింపటం'' ఈ మాటను కళకు సంబంధించిన మేరకు సరిగ్గా అర్థం చేసుకోవలసి ఉంటుంది. సమగ్రంగా నమ్మింపటమనేది కళలో ఎప్పుడూ ఉండదు. ఒక చిత్రంలో సముద్రం చూసి మన ''ఇది సముద్రం కాదు'' అనుమానమును ముట్టుకుంటే చేతికి తడి అంటదు కనక. ( చేతికి తడి అంటితే అది మంచి కళగల చిత్రమని ఒప్పుకోవాలని ఎక్కడా లేదు!) అయితే ఆ మాట అన్నంతమాత్రం చేత అది మంచి చిత్రం కాదని నిరూపించటం లేదు కాని, '' ఇది సముద్రమల్లే కనిపించటం లేదు! ఈ చిత్రం మంచిదికాదు!'' అనటానికి మనకందరికీ అధికారం ఉంది. ఈ ద్వంద్వాన్ని పరిష్కరించగలిగితే కళ నమ్మించటమంటే ఏమిటో తెలుతుంది

రహస్యమేమిటంటే నమ్మించటమనేది కళలో జీవితానికి విరుద్ధంగా, తల్లకిందులుగా వుంటుంది ఒక ఉదాహరణ తీసుకుందాం ఎవరో పోయినారు బంధువర్గం ఏడుస్తున్నది మనం చూసి జాలిపడ్డాం. ఇక్కడ మనకు నమ్మకం వాళ్ల దుఃఖంలో కాదు, దానికి కారణభూతమైన చావులో ఇదే స్టేజిమీదనయితే సరిగా తల్లకిందులుగా ఉంటుంది మన విశ్వాసం. లోహితాస్యుడి శవం పడి ఉంది. చంద్రమతి ఏడుస్తున్నది. ఇంతవరకూ మనని నమ్మించే విషయం ఏమీలేదు. లోహితుడు లోహితుడు కాడనీ, చంద్రమతి పాత్రధారి కనీసం స్త్రీ అయినా కాదనీ, లోహితుడి వేషగాడు బతికే ఉన్నాడనీ, అది వల్లకాడు కాదు నాటక రంగమనీ మనకు నమ్మకంగా తెలుసును. ఇక మనం విశ్వసించేదేమిటి? చంద్రమతి పాత్రధారి భావప్రకటన! దాని ద్వారా మనకు లోహితుడి చావు విషయం విశ్వాసం కుదరాలి ఆ భావ ప్రకటన సరిగా ఉన్నంత కాలమూ మనం లోహితుడి పాత్రధారిని గురించిగాని, అతను జీవించి ఉండటం గురించి గాని ఆలోచించం. చంద్రమతి పాత్రధారి నటన మనకే మాత్రం నచ్చకపోయినా మనలో విమర్శనా దృష్టి తలయెత్తి చంద్రమతి మగవాడనీ, లోహితుడు కదలకుండా కొయ్యబారినట్టు పడకున్నాడనీ అనిపిస్తుంది.

చంద్రమతి దుఃఖం మనకు నచ్చాలంటే సహజంగా ఉండాలి. ఏమాత్రమూ వట్టివ్వరాదు. పైన చెప్పిన విషయాన్నే మళ్ళీ పరిభాషలో చెప్పాలంటే జీవితంలో మనని నమ్మించేది యాథార్థ్యం, కళలో మనని నమ్మించేది సహజత్వం. మొదటిదాన్ని ''రియాలిటీ'' అంటాం, రెండోది ''రియలిజం''.

ఈ రెంటినీ బొత్తిగా వేరు చెయ్యటానికి లేదు. ప్రేక్షకుడి మానసిక స్థితిని బట్టి ఈ రెండూ దగ్గరికి వచ్చి దూరంగా పోతూ ఉంటై. ఈ విషయం కూడా ఉదాహరణలతో నిరూపిస్తాను.

ముందుగా ఒక సంగతి తెలుసుకోవాలి. మనం ఎప్పుడన్నా విమర్శించగలిగితే సహజత్వాన్ని ( రియలిజం) విమర్శించగలం, యాథార్థ్యాన్ని ( రియాలిటి) విమర్శించేదిలేదు. కనుకనే జీవితంలో కూడా మనకు ఏడుపు వినబడి దానికి కారణం తెలియనప్పుడు చప్పున మన విమర్శనా దృష్టిపైకివచ్చి వినవడే ఏడుపు సహజంగా ఉందో

అసహజంగా ఉందో చూస్తుంది. అది సహజంగా ఉంటే మన హృదయం వెంటనే ఆ మాటల్ని విశ్వసించి ప్రతిధ్వనిస్తుంది. అదే సహజంగా లేని పక్షంలో మనకు వెంటనే నవ్వు వస్తుంది.

లేదా, ముఖకవళికలు మనకు తెలియ చెయ్యలేని కారణంతో సానుభూతి చూపలేని స్థితిలో ప్రస్తుతం మనం చెప్పేది ''ఏమిటి నవ్వు వస్తోందా'' ప్రయత్నిస్తాం!

ఈ ఉదాహరణ నుంచి తేలేదేమంటే - మన విమర్శనాశక్తి పైయెత్తున ఉన్నప్పుడు - అంటే మనం ఉద్రేకపూరితులం కానప్పుడు - జీవితం లోకూడా యాదార్థ్యం మనని వశంవదచెయ్యలేదు, సహజత్వం కావలిసివస్తుంది. యాథార్థ్యం పూర్తిగా మృగ్యమైన నాటకరంగం మీద చెప్పేదేమిటి?

ఈ కారణం వల్ల నాటకరంగం మీద ఉద్రేక పూరితాలు కాని మామూలు ఘట్టాలలో నటుడి శిల్పం యాదార్థ్యాన్ని అనుకరించి సహజత్వాన్ని సాధిస్తుంది. ''అంతా క్షేమమా?'' అనే ముక్క జీవితంలో ఎట్లా అంటామో స్టేజీమీద కూడా అట్లాగే అనాలి గత్యంతరం లేదు ఇదే ఉద్రేకపూరితమైన ఘట్టాలదగ్గిరికి వచ్చేటప్పటి యాథార్థ్యానికీ సహజత్వానికీ ఏవిధమైన సంబంధమూ ఉండదు.

యథార్థమైన ఉద్రేకం ఎప్పుడూ విమర్శకు ఆగదు ఎవరైనా ఉద్రేకం ప్రకటించినప్పుడల్లా మనకు నవ్వు రాదంటే దానికి కారణం ఆ ఉద్రేకానికి యదార్థ కారణం వుండటమే. స్టే మీద యదార్థ కారణం అసలే లేదు కనుక, ఆ కారణమందు ప్రేక్షకుడికి కలిగే విశ్వాసం యావత్తూ నటుడు ప్రకటించే ఉద్రేకం ద్వారానే కలగాలి కనక, నటుడు ఇటువంటి ఘట్టాలు ప్రకటించటంలో సహజత్వం సాధించాలంటే యాదార్థ్యాన్ని పూర్తిగా విసర్జించాలి. ఉద్రేకమంటేనే తూకం( బాలెన్సు) చెడిపోవటం. ఉద్రేకాన్ని నటించేటప్పుడు నటుడికి కావలిసిందే ఆ తూకం. అందుచేత సహజత్వంతో కూడుకున్న ఉద్రేకపు నటనలో ఏమాత్రమూ ఉద్రేకం వుండదు.

అయితే ఈ నటన ప్రేక్షకులను ఎట్లా నమ్మిస్తుంది? ఇక్కడే ఉంది నటుడి శిల్ప ప్రావీణ్యత యావత్తూ . ఒక సారి నటుడు ప్రేక్షకుల విమర్శనా శక్తిని తన నటనకు లోబరుచుకున్నట్టయితే ఇక ప్రేక్షకులు మారుమాట లేకుండా తనని పరిపూర్ణంగా విశ్వసిస్తారు. తను మొహంలో ఏ భావం చూపిస్తే, తనవాక్కులో ఏ భావం ధ్వనిస్తే అదల్లా ప్రేక్షకుల హృదయాలలో ప్రతిధ్వనిస్తుంది. మానవ మనస్తత్వం కొన్ని నియమాలకు బద్ధమై ఉద్రేకానికి వశమవుతుంది. ఆ నియమాలు సమర్థుడైన నటుడు చక్కగా అర్థం చేసుకోవటమేకాక వాటిని ఆచరణలో పెట్టటంలోకూడా సిద్ధహస్తుడై ఉంటాడు.

ప్రఖ్యాత స్టేజి నటులంతా ఈ ప్రతిభను సంపాదించి అనేకసార్లు నాటక రంగస్థలాన ప్రకటించినవారే. వారి గొప్పతనం ఉద్రేక పూరితాలైన ఘట్టాలలో నటించటం వల్లనే పైకి వచ్చింది వీరిలో చాలామంది యాథార్థ్యానికి చాలా సమీపంగా ఉండే సహజత్వాన్ని బొత్తిగా సాధించలేని స్థితిలోకూడా ఉన్నారు. '' అంతా క్షేమమా''

అని సహజంగా అనలేక పోవటం స్టేజినటుడుకు ఉన్నతనం కాదు. బలవంతాన అటువంటి ముక్క అనిపిస్తే నూటికి తొంభై సార్లు అసహజంగా అంటాడు అది సహజంగా అనటంవల్ల అతనికి పేరుప్రతిష్ఠలు రావు రాలేదు.

ఇటువంటి దశలో సినిమాలు వచ్చి ప్రఖ్యాత నటులను నట్టేట ముంచినై!

ఆంధ్రపత్రిక *13-12-1939*

## 22. సినిమాలు.. నాట్యకళ

**సినిమా శిల్పం :**

నాటకాలకి మల్లేనే సినిమాకు కూడా నాట్యకళే ఆధార భూతంగా పైకి కనిపించినప్పటికీ నిజం ఆలోచిస్తే సినిమా కళ స్టేజిమీద చలామణిలో ఉన్న నాట్యకళను నడుముమీద కొట్టింది. దానికి బాహ్య నిదర్శనం ఏమంటే స్టేజి నటులు సినిమా ప్రపంచంలో ఎక్కి రాలేకపోవటమే.

సినిమా నటుడికి స్వేచ్ఛలేదనీ, అతన్ని డెరక్టర్ ప్రొడ్యూసర్ వగైరాలు నిర్బంధిస్తారనీ, అందువల్లనే ప్రఖ్యాత స్టేజీ నటులు సినిమాలో పైకి రాలేక పోతున్నారని అనుకోవటం పొరపాటు. మన నాటకాలకీ ప్రొడ్యూసరూ, డైరెక్టరూ, ఆర్టు డైరెక్టరూ, స్టేజి మేనేజరూ, సెట్టింగ్ మాస్టరూ లేక పోవటం మనలోపమే. వీరందరికన్నా కూడా ఎవరికీ కనిపించని ఎడిటరు నటుడి స్వేచ్ఛను చాలా చంపేస్తాడు.

సినిమా శిల్పంలో ఉన్న కొత్త అంశం ఏమంటే, ఈ శిల్పంలో మొదటి నుంచి చివరి వరకూ సహజత్వం యాధార్ధ్యం యొక్క అనుకరణంగా పరిణమించింది. సినిమాలు వచ్చేవరకూ నాట్యకళలో 'రియలిజం' 'రియాలిటి'కి ఇంత సమీపంగా ఎన్నడూ వచ్చి ఉండలేదు. స్టేజి మీదకన్నా తెర మీద పాత్ర ఔచిత్యం చాలా ప్రాముఖ్యమైంది. సహజమైన నటనా- అతిస్వల్పవిషయాలను అతి సహజంగా ప్రదర్శించటం - తప్పని సరి అయింది ఉద్రేకపూరితమైన ఘట్టాలను తన శక్తి సామార్ధ్యాలు వినియోగ పరిచి నటించే బాధ్యత నటుడి మీది నుంచి పూర్తిగా తొలిగి పోయింది అది ఎడిటరు, సినారిస్టు, డైరెక్టరు మొదలైన వారి మీద పడింది. ఈ ఘట్టాల్లో కూడా నటుడు సహజంగా - యధార్ధ్యాన్ని అనుకరిస్తూ నటించటానికి అవకాశం ఉంది అంతేకాదు, ఆ క్షణాన తాను ప్రకటిస్తున్న ఉద్రేకానికి నటుడు వశుడై, అవశుడై పోయినప్పటికీ ఎడిటరు అతని నటనను ఉపయోగించుకోగలడు అట్లా కాకుండా నటుడు కెమెరా ఎదురుగా నిలబడి స్టేజిమీద లాగే ఉద్రేకాన్ని నటించటానికి ప్రయత్నించినట్లయితే అది తెరమీదికి వచ్చేటప్పటికి హాస్యచిత్రంగా తయారై ఊరుకుంటుంది

పైన చెప్పిన విషయాలే ఆధారంగా తీసుకొని సినిమా కళను ఎన్నో మార్పులు చూస్తున్న పెద్ద నటులకు కొన్ని నియమాలు చెప్పదలిచాను. ఎన్నడూ స్టేజి ఎక్కని, ఎక్కడానికి ఉద్దేశించని కళాకారులు సినిమాలో ప్రవేశించి పెద్ద పేరునూ, అధికమైన కీర్తి ఆర్జించటం మనం పెద్ద నటుల సమాచారంలో చూస్తున్నాము. సినిమా నటులలో కనబడేది ఇప్పుడు కాని వారు కొన్ని విషయాలు తెలుసుకోవాలి

**దృశ్య కావ్యం యొక్క తొలి ఆశయం:**

ఒక విధంగా సినిమా దృశ్య కావ్యం యొక్క తొలి ఆశయాన్ని పైకి తెచ్చింది 'తెరమీద ఏమిటి చూపిస్తున్నారు' అనేది ' ఎట్లా చూపిస్తున్నారు' అనేదానికన్నా ముఖ్యమైంది కాల క్రమాన ఎట్లా చూపిస్తున్నారనేది పైకి వస్తే రావచ్చును, కాని ఏమిటి చూపిస్తున్నారనేది ఇంతట్లో వెనకపడే అవకాశాలు బహుతక్కువ. లక్షలకొద్దీ జనం తెరమీద ఏమి చూస్తున్నద్దీ లక్ష్యం చేయకుండా ఎట్లా చూసేది మాత్రమే పాటించటమనేది ఇప్పటి సంస్కారంలో దురూహ్యమైన విషయం. అదికాక నాటకాలలో నటుడి ప్రతిభా ప్రేక్షకులకు ప్రత్యక్షంగా ఉండేది నటుడికీ, ప్రేక్షకుడికీ మధ్య ఏమీ అడ్డం ఉండేది కాదు సినిమా కళ నటుడి ప్రతిభను ఇతరుల మీద – డైరెక్టరు, ఎడిటరు, సినారియో రైటరు కెమెరామాన్ మొదలైన వారిమీద –పెట్టేసింది వారెవరూ ప్రేక్షకులకు ప్రత్యక్షంగా ఉండరు. వారివారి ప్రతిభలుకూడా స్టేజినటుడి ప్రతిభ మోస్తరుగా సులభగ్రాహ్యాలు కావు. ఈ కారణాల వల్ల తెర మీద ఏం చూస్తున్నామనే ప్రశ్న ఇంకా చాలా కాలం వరకూ వెనకపడే అవకాశాలులేవు. ఈ విషయంలో నా అభిప్రాయం ఏమంటే ఏమిటి చూస్తున్నామనేదీ, ఎట్లా చూస్తున్నామనేదీ క్రమంగా ఒకటే సమస్యగా పరిణమిస్తుందని. సినిమాలో ప్రవేశించి తన వ్యక్తిత్వాన్ని చంపుకుంటున్నట్టు భావించుకునే నటుడు మరొక సంగతికూడా తెలుసుకోవాలి తన గొప్పతనానికి అడ్డంపడిన టెక్నీషియనుల సహాయంతో ఈ నటుడే తను స్టేజిమీద ఎన్నడూ చేసి ఉండని పనులు తెర మీద చెయ్యగలుగుతున్నాడు. తను ప్రేక్షకులకు క్లోజప్‌లో కనిపించి తన కనుబొమల చిన్న కదలికతో భావప్రకటన చెయ్యగలుగుతున్నాడు. కామెరా తనమీదికి వంచి ఫోటో గ్రాఫు చేసినంతమాత్రం చేత ఇతర భావప్రకటన ఏమీ అవసరం లేకుండానే ప్రేక్షకులకు తననిగురించి తక్కువ భావం కలిగించ గలుగుతున్నారడు. ఆ విధంగానే కెమెరా తన మొహానికి ఎత్తి ఫోటో గ్రాఫు చేసినప్పుడు విజయం తన మొహంలో తాండవిస్తున్నది. ఇంతే కాక భావశూన్యమైన మొహంతో కెమెరాకు ఎదురుగుండా ఒక నిమిషం సేపునిలబడి తను ప్రేక్షకులమీద 'సస్పెన్సు' పుట్టించగలుగుతున్నాడు. ఫాస్ట్ ఎడిటింగ్ సహాయంవల్ల తన నటనలో తను కలలోకూడా ఊహించి ఉండని వేగం వస్తున్నది. తనఖ్యాతే ముఖ్యం కాదనీ, దృశ్యకావ్యం యొక్క ఆశయాలను ఫలింపచెయ్యటానికి తననాట్య కౌశలం నిమిత్తమాత్రమనీ భావించే నటుడికి ఇంతకంటే ఏం కావాలి?

ఒకే ప్రదర్శనంలో నాలుగైదురకాల శిల్పాలతో ఏకవ్యకత కలిగినప్పుడు అందులో ఏ ఒకదానికో ప్రాధాన్యమిచ్చి మిగిలినవి దానికి లొంగి ఉండటం తప్పనిసరి ఇది అర్థం చేసుకునే ప్రత్యేక నటులు స్టేజీమీద గానకళను హద్దులో ఉంచటానికి ప్రయత్నించారు ఫలితమే, టాకీల దగ్గరికి వచ్చేటప్పటికి నాట్యకళ గతికాదా అంటే అయిందా టాకీలు రాకపూర్వం సినిమా కళ యావత్తూ ఎడిటింగులోనే ఉండేది టాకీలు వచ్చిన తరువాత సినిమాకళ యావత్తూ డైరెక్షనులో ఇమిడి వుంటున్నది ఇవాళ ఎంతమంచి ఎడిటరు కూడా డైరెక్టరు ముందుగా ఊహించని ఎడిటింగు చెయ్యటానికి విశేషం సావకాశం లేదు అందుచేత చిత్రనిర్మాణ కౌశలం ముఖ్యగా డైరెక్టరు కళాభిజ్ఞత మీద ఆధారపడి వుంటున్నది - టాకీలు వచ్చినప్పటినుంచీ ఇది ఇట్లా ఎందుకు కావాలంటే చెప్పలేం డైరెక్షను తెలివి తేటలు నాట్యకళకు తక్కువచేసి కళాయుతంగా వెలువడిన టాకీ ఇంతవరకూ రాలేదు అటువంటిది జరిగినప్పుడు టాకీ ప్రపంచంలో కూడా నాటక ప్రపంచంలో మాదిరిగానే నటుడి ఖ్యాతికి ప్రాముఖ్యత వస్తుంది అంత వరకూ సినిమా నటుడు టాకీ ప్రపంచంలో తక్కువ స్థానం ఆక్రమించుకోవటానికి సిద్ధపడవలసిందే కాని గత్యంతరంలేదు

( ఈవ్యాసం టాకీలమీద విమర్శకాదు కనక ఇందులో టాకీ అని వాడినప్పుడల్లా ఆదర్శ ప్రాయమైన టాకీ అనే అర్థం చేసుకోవాలి నేను చెప్పిన అనేక విషయాలు తెలుగుటాకీ ప్రపంచానికీ, తెలుగుటాకీలకూ వర్తించవు)

## 23. మా తెనాలి

గుంటూరువారున్నారు, చేబ్రోలు వారున్నారు, ఒంగోలు వారున్నారు. తెనాలివారు లేరు నేనెరిగినంత మట్టుకు లేరు. రామలింగడు తప్ప. రామలింగడి వల్ల తెనాలి ప్రసిద్ధికి వచ్చిందా, తెనాలి వల్ల రామలింగడు ప్రసిద్ధికి వచ్చాడా? చెట్టు ముందా, విత్తు ముందా అన్న ప్రశ్నవంటిది. ఆ విషయం ఎవరూ తేల్చలేరు.

రెండు సికింద్రాబాదులూ, రెండు హైదరాబాదులూ, రెండు అన్నవరాలూ, రెండు పూండ్లలూ - ఒకటే తెనాలి. ప్రపంచానికంతకినీ! అందుకనే రామలింగడా పేరు ఇంటి పేరు చేసుకున్నాడేమో. లేక రామలింగడికి న్యూమరాలొజీ తెలిసి ఆ పేరు తనకి అచ్చి వస్తుందనుకున్నాడో! ( రామలింగడికి చాలా 'లొజీ' లూ, చాలా 'ఇజము' లూ తెలుసునని ఎప్పుడో ఎవరో నిరూపిస్తారు లెండి ) రామలింగడి పేరుకు చేరిన తెనాలి మరోహటేమో అన్నవాళ్ళు పాపాత్ములు. వాళ్ళు తెనాలిని అవమానించటానికి ప్రయత్నిస్తున్నారు కావలిస్తే రామలింగడు కట్టిన శివాలయం ఇప్పటికీ మా తెనాలి పాతపేటలో ఉంది. చూసుకోండి ఆ ఆలయంలో రామలింగడు రాసిన ( లేక రాయించిన) శాసనం కూడా ఉంది ఈ మధ్య ఎవరూ దాన్ని పీక్కెళ్ళి ఇల్లు

పెట్టుకోకుండా ఉంచే (శాస్త్రీయంగా నేను చూడలేను ... చూసిన వాళ్లు పోయారు స్వయంగా వెళ్లి చూడడానికి నాకు ఓపిక లేకపోయింది )

రామలింగడి కాలం నుంచి ఇప్పటిదాకా వస్తే తెనాలి వాళ్ల ... ప్రసిద్ధి కెక్కింది బియ్యానికీ, కాఫీహోటళ్లకీ, పత్రికల అమ్మకానికీ, దోమలకూ, వానాకాలం బురదరోడ్లకూ, పగిరలకూ

తెనాలిబియ్యం ఉడకపెట్టనక్కరలేదు చెప్పుకుంటారు అని నేను నమ్మకంగా విన్నాను తెనాలి కాఫీహోటళ్లు జగత్ప్రఖ్యాతి గలవి తెనాలి చుట్టుపక్కల వారంతా - ఒక్కొక్కప్పుడు 20 మైళ్ళ నించికూడా - ఉదయం పూట రైళ్ళమీదా, జట్కాబళ్ళ మీదా, నడిచీ తెనాలి చేరుకుంటారు తెనాలిలో చెప్పుకోదగ్గ అయ్యరు హోటలు లేదు కాఫీ ఇవ్వటం అయ్యర్లకే చాతనవుననే అనుమానం ఎవరికైనా ఉంటే తెనాలి పోయి కాఫీ తాగి చూడండి మా తెనాలి వాళ్ళు నలుగురు వచ్చి మద్రాసులో కఫీహోటళ్ళు నడపటం ప్రారంభిస్తే అరవ్వాళ్ళు పంజాలు తెంచుకొని పట్నం వదిలి పారిపోతారు ఆ పాట పట్నం కాస్తా ఆంధ్రులదై ఊరుకుంటుంది

తెనాలి వాళ్ళు ప్రతికలు చదవటంలో కూడా నిధులు. ఆంధ్రదేశం మొత్తంమీద అమ్ముడుపొయ్యే పత్రికల సంఖ్యలో ఏ పదోవంతో తెనాలిలో అమ్ముడుపోతుంది అది రామలింగడి ఆశీర్వాదం కావచ్చు సాహితీ సమితి పుట్టిన ప్రభావం కావచ్చు

తెనాలి దోమలు దాదాపు విశాఖపట్టణం దోమలంత ఉంటై ఒక దోమలషో పెట్టి ( బేబీషో పెట్టినట్టు) అందులో విశాఖపట్టణం దోమనీ తెనాలి దోమనీ తూకంవేస్తే విశాఖపట్టణం దోమ గెలుస్తుందని నాకేమీ నమ్మకంలేదు. ( ముఖ్యంగామనింపు వేసవికాలంలో అరుబయటకూడా తెనాలిదోమ మనిషిని వదలదు.)

వేసవికాల మంటే జ్ఞాపకం వచ్చింది. వేసవి కాలంలో మావూరు బెజవాడవారికీ గుంటూరు వారికీ సిమ్లాలాంటిది అంతవేడిగానూ, అంత చల్లగానూ ఉండదు గనక సమశీతోష్ణంగా ఉంటుందనవచ్చు. అదీ గాక మావూళ్లో ప్రతి వేసం కాలమూ ఉత్సవంగా ఉంటుంది. ఆ మూడు నెల్లూ సగటున రోజుకో వంద ఇళ్లకు తక్కువ లేకుండా తగలబడతై, చూడటానికి చాలా వినోదంగా ఉంటుంది. వాటంతట అవి అంటుకోక పోతే మా ఊరికొంపలు తగలబెట్టటానికి పైనించి మనుష్యులు కూడా వచ్చి వేసవి గడిచే వరకూ ఊరు వెలిగించి వానచినుకు పడగానే చక్కాపోతారు.

తెనాలిరోడ్లు వానకాలం బురదగా ఉంటవంటే ఆ తప్పు అందరూ అనుకున్నట్టు మునిసిపాలిటీది కాదు. అసలు పాతికముప్పై ఏళ్ళ క్రితం తెనాలి యావత్తూ తుమ్మలబీడూ, నీళ్ళ గుంటలూనూ, దాన్ని మంచి బస్తీ చేసి తెనాలి వాళ్ళు తమనాగరికతను వ్యక్తపరిచారు. నడి ఎండా కాలంలో కూడా తెనాలి బావుల్లో నీళ్ళు పది అడుగులలో అందుతూ ఉంటై. తెనాలి దురదృష్టం కాని, ఇంకో పది హేనడుగులు పల్లాన ఉంటే తెనాలి బస్తీలో రోడ్లు, వెనిసులో లాగా కాలవలై ఉండేవి మే మంతా రోజూ నీటిగండంనించి తప్పించుకుంటూ ఉండవలసినవాళ్ళం.

తెనాలి నాటకాలకీ నటులకీ ప్రసిద్ధికెక్కినది మొదటి నాట్యకళాపరిషత్తు తెనాల్లో జరిగింది మిగిలిన ఆంధ్రదేశమంతటా కలిసి ఎంతమంది పెద్దాపిన్నా నటులున్నారో తెనాల్లో అంతమంది ఉన్నారు. అసలు ప్రతి తెనాలి వాడూ వేషధారే అంతదాకా ఎందుకు? తెనాలినటుడు లేని టాకీ ఉందా? ఏటాకీలో నింపి అయినా తెనాలివాళ్ళను తీసేసి మిగిలిన టాకీలో ఏముందో చూడండి!

నాట్యకళ మా తెనాలి వారి కంత బాగా తెలుసు కనకనే మా తెనాల్లో పై ఊళ్లవాళ్లు పరాభవం పొందారు పైనించి వచ్చి తెనాలి వారిని మెప్పించి పోయినవాడు గట్టిగా లెక్కవస్తే ఒక బళ్ళారి రాఘవాచారి గారే వారిని రవీంద్రనాదటాగూరు గారే మెచ్చుకున్నారు గనక మా నాట్యకళాభిరుచి టాగూరుగారి నాట్యకళాభిరుచికి ఏమీ తీసిపోదని నేను - బల్లెదురుగా లేదు - గుద్ది చెప్పగలను. ఈ నాటికైనా ఏటాకీ గానీ దివాలా తియ్యటం మొదలు పెట్టింది అంటే తెనాలిలోనే అని వేరే చెప్పక్కర్లేదు.

తెనాలిలో అనిర్వాచ్యమైన ఆకర్షణ ఉంది అది తెనాలివాళ్ళకన్న పై వాళ్ళకు తెలుస్తుంది. తెనాలినించి బదిలీ అయి పోవలిసివస్తే ఉద్యోగానికి నీళ్ళు వదిలినవాళ్ళున్నారు ఏపని మీదో వచ్చి తెనాలిలో వేళ్ళతో సహా పాతుకు పోయినవాళ్ళున్నారు. ఇంకే పనీ లేక తెనాలిలో వుండటమే జీవితాశయంగా పెట్టుకున్న వాళ్ళు కూడా ఉన్నారు ఇందులో అతిశయోక్తి ఏమీ లేదు. ఏ బస్తీలోకన్నా తెనాల్లో నిరుద్యోగులు అధికంగా ఉండటానికి కారణం ఈ ఆకర్షణే. తెనాలి వాళ్ళెవళ్ళన్నా, ''వెధవ తెనాలి'' అంటూంటే నమ్మకండి. గవర్నరుపని చెయ్యటానిక్కూడా తెనాలి వాడు తెనాలి వదలడు

మరికొన్ని బస్తీల మాదిరిగా తెనాలి ఆటే గొప్పవారిని సృష్టించకపోవటానికి కారణం బుద్ధిమంతుడు సులభంగా ఊహించ వచ్చు మా తెనాలి వాళ్ళం ఇతర ఊళ్ళ మాదిరిగా చప్పున ఒక వ్యక్తిని ఆరాధించి పైకెత్తం మా చవిలి నాగేశ్వర్రావుకీ, మా గోవిందరాజు సుబ్బారావుగారికీ, మా స్థానం వారికీ (మా పెంపుడు కొడుకు), మా మాధవపెద్దికీ ఇతరులు బ్రహ్మరథం పట్టొచ్చు గాక, మేం పట్టం. మాకు వాళ్ళు మామూలు మనుష్యులే ఇతరులను ఆరాధిస్తూ కూర్చుంటే, ప్రపంచం ఆరాధించే మనుష్యుల్ని మేమెట్లా సృష్టించగలుగుతామూ? మనుష్యుల్ని తయారుచేసి లోకం మీద వదలటం మాత్రమే మా వంతు. మాస్టర్ అంజినీ, బసవలింగాన్నీ, పిల్లలమర్రి సుందరరామయ్యనూ మేమే తయారుచేశాం. భీమవరపు నరసింహారావునూ, ప్రభల సత్యనారాయణనూ మేమే తయారుచేశాం. ములుగు శివానందం గారు మా వాడు. మా గొప్ప వాళ్ళెవ్వరూ మా ఊళ్ళో వుండరు దేశాలు పట్టి పోతారు. కాంచనమాల మా ఊరిది. ఆవిడా అంతే.

ఒకరి దాకా ఎందుకు? నన్ను చూడరాదూ?

*ఆంధ్రపత్రిక, 12-2-1941*

# 1. పూజ్య 'పండిజ్జీ'

అయినా ప్రపంచమంతా మదన్‌మోహన్ మాలవీయ అంటారు తెలుగువాళ్ళు మాత్రం మదనమోహన మాలవ్య అంటారు యూనివర్సిటీలో మమ్ముకు ''పండిజ్జీ'' అంటారు అక్కడి పంటవాళ్ళంతా ''మహారాజ్'' లయినట్టుగా అక్కడ డొక్కశుద్ధిగల బ్రాహ్మలంతా ''పండిజ్జీ''లే కాని బెనారెస్ హిందూ యూనివర్శిటీ ఆవరణలో ''పండిజ్జీ'' అనే సార్థక నామం గలవాడు ఆయన ఒకడే

బెనారెస్ హిందూ యూనివర్సిటీలో చదువుకోబోయేటప్పుడు. రెండేళ్ళపాటు పండిజ్జీ పక్క పక్కనే వుండటం జరుగుతుందనే ఆలోచనే నాకు పోలేదు రోజుకు అధమం రెండుసార్లు ఆయన ఇంటిముందుగా వెళ్ళటం తప్పనూలేదు

యూనివర్శిటీలో చేరిన ఒకటి రెండు వారాలకల్లా సామాన్యంగా ప్రతి విద్యార్థికీ ఒక అహంభావం వస్తుంది పండిజ్జీని ప్రపంచ మంతా వింతగా చెప్పుకుంటుంది మాకేం ఖర్మం? మేము దాదాపు రోజూ పండిజ్జీని చూస్తాం పండిజ్జీని గురించి బయటివాళ్ళు మమ్మల్ని వింత ప్రశ్నలు వేస్తే మాకు చిరాగ్గా వుంటుంది అది పండిజ్జీ మీద తృణీకారభావం కాదు ఆయనకి దగ్గిరిగా వున్నా మని గర్వం

పండిజ్జీ గొప్పవక్త ఆయనలాగా నిలబడి ఖంగుమని మాయమోగే గొంతుతో గంటల కొద్దీ ధారాళంగా మాట్లాడేవాళ్ళు బహు అరుదు కాని మేమాయన ఉపన్యాసాలెన్నో సార్లు విన్నాం మిగిలినవాళ్ళు, ఆయన బరువైన విషయాలు మాట్లాడుతుంటే వినివుండవచ్చు మేము ఆయన సరదాగాచెప్పే కబుర్లూ, మాట్లాడేప్పుడు ఆయనచేసే అభినయమూ కూడా అనుభవించాం హిందీ ఒక్కముక్క కూడా రాని మాలో కొందరికి ఆయన ఉపన్యాసం పూర్తిగా అర్థమయినట్టే వుండి. అంతా విన్నాక ఆశ్చర్యం కలిగేది

1930 కే ఆయన ముసలివాడు గాంధీ తాతకన్న ఒక ఏడు పెద్దవాడని జ్ఞాపకం కాని ఆయన కళ్ళపక్కనతప్ప ముఖాన ఎక్కడా ఒక ముడత కనిపించేదికాదు నిటారుగా నిలబడి తొణకకుండా నడిచేవాడు నెరిసి పోయిన మీ సాలలో తప్ప వార్ధక్యం కనబడేదే కాదు. తరవాత కొద్దికాలానికే ఆయన కాయకల్ప చికిత్స చేయించుకున్న సంగతి వింటే ఆయనకు కాయకల్పం దేనికా అని ఆశ్చర్యం వేసింది.

బెనారెస్ హిందూ యూనివర్శిటీలో చదివిన నాబోటివాళ్ళకు ఆయన రాజకీయాల కన్న యూనివర్సిటీయే ఆయనకు దగ్గిర విషయంగా తోచేది. ఆయూనివర్సిటీని గురించి ''ప్రపంచంలో ఇటువంటి యూనివర్శిటీ లేదు.'' అన్న పాశ్చాత్యుల అభిప్రాయాలు స్మరించుకుని గర్వపడేవాళ్ళం. ఆ యూనివర్సిటీని ఆయన బిచ్చమెత్తి కట్టించాడు అందుకనే గాంధీతాత పండిజ్జీని ''భిక్షుక చక్రవర్తి'' అన్నాడు.

బిచ్చమెత్తడం గురించి ఓనాడు పండిజ్జీ మాకు చక్కని, రెండు గంటల ఉపన్యాసం ఇచ్చాడు పండిజ్జీ లెక్కలో బిచ్చమెత్తటం ఒకపెద్ద విద్య ఆయన ఎందరో నేర్పరులైన బిచ్చగాళ్ళను మించాట్ట ''నేను బిచ్చానికి బయిల్దేరేటప్పుడు ఎవరెవరి దగ్గిరికి వెళ్ళేదీ ముందుగా జాబితా వేసుకుని వాళ్ళ వాళ్ళ పేర్ల కెదురుగా ఒక అధిక సంఖ్యా ఒక కనీస సంఖ్యా వేసుకుంటాను తీరా వాళ్ళ దగ్గిరికి వెళ్ళిన తరవాత సామాన్యంగా పెద్ద సంఖ్య పుచ్చుకుంటాను, కనీస సంఖ్యకు ఎన్నడూ ఒక దమ్మిడీ దిగను'', అన్నాడు పండిజ్జీ.

పండిజ్జీ దొంగ బిచ్చగాడు కాడు లక్షలు గడించే శక్తి ఉండి బిచ్చం ఎత్తినట్టే అన్ని వందల లక్షలు పెట్టి యూనివర్సిటీ కట్టించి అక్కడ దరిద్రులకు సహితం తావుండేటట్టు చేశాడు సంస్కృతం చదువుకునే విద్యార్థులకు జీతం లేదు. బీద విద్యార్థులకు సహం జీతాలు, స్కాలరు షిప్పులూ సులభంగా దొరికేవి ''నీ ఆర్థిక సమస్యలతో మాకు నిమిత్తం లేదు'' అనే వైఖరి హిందూ యూనివర్సిటీలో ఉన్నట్లే కనిపించేదికాదు

''నేను ఎన్నో యూనివర్సిటీలు చూశాను కాని విద్యార్థులకు ఈ యూనివర్సిటీలో ఉండే స్వేచ్ఛ మరెక్కడా దొరకలేదు నేను చెబుతున్నా వినండి '' అన్నాడు అక్కడికి అతిథిగా వచ్చిన ఒక పెద్దమనిషి ఇందులో అబద్ధం ఏమీలేదు. స్వేచ్ఛ అనేది ఎందులో చేరి ఉంటుందంటే చెప్పడం చాలా కష్టం.

బాహ్యనియమాలు స్వేచ్ఛకు భంగంకలిగించవు. ఎనిమిది గంటలకల్లా విద్యార్థులంతా తమగదుల్లో ఉండాలన్నా, రాత్రి పదకొండుకు లైటు ఆరిపోయినా అందువల్ల స్వేచ్ఛకు కలిగే భంగం ఏమీ ఉండదు యూనివర్సిటీలో అన్ని మతాలవారికి ప్రవేశం ఉండేది ( ఒక్క ముస్లిము సోదరులు మాత్రం నాకెన్నడూ కనిపించలేదు). ఏ విద్యార్థి ఏ విధమైన రాజకీయ భావాలు ప్రకటించటానికైనా సంపూర్ణావకాశం ఉండేది. విద్యార్థులమీద విద్యార్థులు వేగు చెయ్యటంగాని, అధికారులతో రిపోర్టు చెయ్యటంగాని, అధికారులు సంజాయిషీ అడగటం గాని ఉండేదికాదు. జాతీయతా, మతాభిమానము ఉన్నచోట ఇంత స్వేచ్ఛ కూడా ఉండటం అపూర్వమైన విషయం. పండిజ్జీ వంటి స్వాతంత్ర్యప్రియు డుండబోడు. పండిజ్జీ హృదయ వైశాల్యాని కొక ఉదాహరణ విన్నాను. అంతకు పూర్వం యూనివర్సిటీ కాలెండరులో విద్యార్థి నిబంధనలకింద పొగతాగరాదనే నిబంధన ఉండేదట. దాన్ని తర్వాత ఉపసంహరించు కున్నారు. ఇదేమని పండిజ్జీని ఎవరో అడగ్గా, ''నా విద్యార్థులు పొగతాగుతారని భావించటం నాకిష్టం లేదు'' అన్నాట్ట పండిజ్జీ. నిజమేమిటంటే, అప్పట్లో ఇంజనీరింగు కాలేజికి ప్రిన్సిపలుగా ఉండిన కింగ్‌దొర పొగతాగేవాడు విద్యార్థులక్కూడా సిగిరెట్లిచ్చేవాడు ''కష్టపడి పనిచేసిన విద్యార్థులకు

నగిరెట్టుండాలి'' అనేవాడు ఆయన పొగతాగటం గురించి తనకెంత తీవ్రమైన అభిప్రాయాలున్నప్పటికీ, తనమాటకే మాత్రమూ అడ్డులేనప్పటికీ, పండిజ్జీకింగ్ వార న్నిర్ణయానికి తల ఒగ్గాడు.

యూనివర్సిటీలో ఆస్తికులను చూశాను నాస్తికులను చూశాను, బెంగాలు విప్లవ వీరులనూ, మీరట్ కుట్రకేసులో ఎరెస్టయిన వారినీ, స ఐ డీ లనూకూడా చూశాను జమీందార్లను చూశాను కాని పండిజ్జీ మీద భక్తిభావం లేనివాళ్ళని చూడలేదు. యూనివర్సిటీని, పండిజ్జీ విశ్వాసాలనూ తీవ్రంగా విమర్శించేవారు సహితం పండిజ్జీమీద ఎంతో భక్తిభావం ప్రకటించేవారు పండిజ్జీని చూడగానే విద్యార్థులు ఆయన కాళ్ళముందు సాష్టాంగపడటం ఎవరికీ ఆశ్చర్యం కలిగించేదికాదు

హిందూ యూనివర్సిటీలో ఒకసంవత్సరం గడిపి జాతీయ భావాలంటకుండా తప్పించుకోవటం సాధ్యంకాదు పండిజ్జీకి దేశంలో ఉన్నకోటీశ్వరులూ, జమీందార్లూ, మహారాజులూ శిష్యులే అయినప్పటికీ ఆ ఆవరణలో డబ్బుగలవారికీ, పలుకుబడి గలవారికి ప్రత్యేకత ఏమాత్రము ఉండేది కాదు ఒకసారి ఒక ఇంజనీరింగు విద్యార్థి సీటుకోసం చాలా పెద్ద శిఫార్సు తెచ్చాట్ట అతనికి సీటిస్తూ అధికార్లు, ''నీకు సీటిస్తున్నాం కాని, నీ శిఫార్సు చూసి మాత్రం కాదు.'' అని తెలియ జెప్పారట.

హిందూ యూనివర్సిటీలో ఇకముందు చదివే విద్యార్థులు పండిజ్జీని చూడరు. ఆయనతోబాటు అక్కడి వాతావరణం కూడా మారి పోతుంది. ఇకముందు కింగ్‌లాటి పాశ్చాత్యులు యూనివర్సిటీలో ప్రవేశించి, గంగాస్నానం చేసి, కుంకంబొట్టు పెట్టుకొని, '' ఈ గంగా తీరాన్నే ప్రాణం విడుస్తా'' నని శపథం చేసే అవకాశం ఉండదు కాని పండిజ్జీ నిగురించి ముందు విద్యార్థులు మాకన్న ఎక్కువగా కథలు చెప్పుకుంటారు పండిజ్జీ ఆత్మ యూనివర్సిటీని శాశ్వతంగా ఆవరించి ఉంటుంది.

*ముద్రణ ఆంధ్రజ్యోతి, మాసపత్రిక 1. డిశెంబరు 1946*

## 2. పిల్లల చదువు

పిల్లల చదువు గురించి '' ఆంధ్రమహిళ'' డిసెంబరు సంచికలో ప్రచురితమైన అనువాద వ్యాసంలో లోపించిన ఒక ముఖ్యాంశం గురించి అందరూ జాగ్రత్తవహించాలి.

పిల్లల మనస్తత్వానికి స్వరూపం ఇచ్చే వాటిల్లో గృహవాతావరణం ముఖ్యమైన దనటానికి సందేహం లేదు. అందులో కూడా పెద్ద వాళ్ళ మనస్తత్వం మరీ ముఖ్యమైనది.

మనం సాధారణంగా పిల్లలకి బోలెడంత హితబోధ చేస్తూ ఉంటాం ఆ హితబోధలన్నీ వారు పాటించినట్లు కనబడరు కారణమేమంటే కేవలమూ నోటిమాటల ద్వారా పిల్లలకు విశ్వాసాలు కలిగించటం సాధ్యంకాదు

కాని పిల్లల్లో ఒక అపూర్వమైన శక్తి ఉంది మనం ఆ శక్తితో ఏయే పనులు చేస్తామో ఆ పనులను అనుకరించటానికి వాళ్లు తయారవుతారు మన అసక్తులను వారి దగ్గిర దాచటానికి ప్రయత్నించి లాభం లేదు ఇంట్లో పెద్దవాళ్ళ నుండే గాఢమైన అభిరుచులు పిల్లలకు వచ్చేస్తాయి తల్లి దండ్రులు తిండి పోతులైనా, పరనింద చేసేవారైనా అటు వంటి పనులలో వారికుండే ఆనందం పిల్లలు అందుకుంటారు

ఎన్నడూ ఆసక్తితో పుస్తకం చదివిన పాపాన పోని తల్లిదండ్రులు ''హితబోధ'' చేసి పిల్లలకి పుస్తకాల మీద ఆసక్తి పుట్టించలేరు తమ అన్నలుగాని, అక్కలు గాని '' ఎందుకొచ్చిందిరా తద్దినం!'' అన్నట్టు పాఠాలు చదువుతుంటే చిన్న పిల్లలకు చదువంటే విసుగు వెయ్యక మానదు. పిల్లల కోసం మనం కొన్ని లేని అభిరుచులు ఉన్నట్టు నటించవచ్చు, కాని ఈనటన ఎక్కువ కాలం సాగదు పిల్లలు మనని సులభంగానే పట్టెయ్య గలరు పట్టేసి వాళ్ళు చేసేదేమంటే, మనని శిక్షించటం కాదు, అనుకరించటం.

ఈకారణం చేత పెద్దవాళ్ళు గ్రహించవలసిన మొదటి నీతి ఏమంటే

మనలో లేని ''సద్గుణాలు'' పిల్లలకు కరపలేం.

ఏ కారణం చేతనన్నా మనలో లేని ''సద్గుణం'' పిల్ల వాడికి కరపవలసిన అవసరం ఉంటే, అటువంటి గుణంగల వాడి సాంగత్యం పిల్లవాడికి ఇప్పించాలి.

పెద్దల మనస్తత్వం గురించి మరో విషయం చెప్పి పూర్తి చేస్తాను

కేవలం హితబోధవల్ల ప్రయోజనం ఉండదని పైన చెప్పాను అపాయంకూడా ఉంటుందని ఇక్కడ చెబుతున్నాను.

''నయానా, భయానా'' మనం హితబోధ చేస్తాం నయాన చేసే హితబోధ పిల్లలకు అంటటం లేదని తెలుసుకోగానే భయాన చెప్పటం ఆరంభిస్తాం ఆసక్తి పుట్టనిదే పిల్లలేపనీ చెయ్యరనీ, చేసినా దాని ఫలితాలు పొందలేరని గుర్తించినట్టయితే మనం '' భయాన'' పిల్లలకి చెప్పటం ఎన్నడూ జరగదు.

అయితే అది తెలియకనే తల్లి దండ్రులు పిల్లలకి ఇటు వంటి భయాలు పెడతారు

''మంచిగా చదువుకోమంటే చదువుకుంటావా? పంతులు బడిలో పూజ చేస్తేగాని చదువుకోవు!''

''వెధవ, కిందూ మీదూ కానకుండా ఉన్నాడు. బళ్ళో వేస్తే రోగం కుదురుతుంది ''

''చదువు కోకపోతివా అడుక్కు తింటావు''

ఇవి పిల్లలకి చదువు మీద ఆసక్తి పుట్టించే మాటలు కావు ఈ మాటలు విసీ విసీ ఉన్న పిల్లలు అక్షరాభ్యాసమంటే హడలెత్తి పోతారు చదువంటే దయ్యంగా వారికి కనిపిస్తుంది

పెద్దవాళ్లు పిల్లలని చదువుగురించి ఇట్లా ఎందుకు భయపెడతారనేది ఆలోచిస్తే పెద్దవాళ్ల యధార్ధ మనస్తత్వం బోధపడుతుంది!

వారికీ చదువులో నమ్మకం లేదు!

చదువు అవసరం కావచ్చు- అది ఆహ్లాదకరం కాదని పెద్దవాళ్ల నమ్మకం!

పెద్దవాళ్లు తమ అంతస్సులు దాచుకునే ఈ మూఢ విశ్వాసాలు పిల్లల జీవితాలమీద అతి దారుణ ప్రభావం కనబరుస్తాయి

పిల్లల గృహ వాతావరణంలో సత్పరిణామం రావాలంటే పెద్దల మనస్తత్వాలు పూర్తిగా సంస్కారం పొందాలి.

*ముద్రణ ఆంధ్రమహిళ సం 4 సం 7 జనవరి 1948 సంక్రాంతి*

## 3. సోవియట్ విద్యా విధాన ప్రాశస్త్యం

సాధారణంగా అమెరికా పత్రికలలో సోవియట్ విధానాలను మెచ్చుకుంటూ వ్యాసాలు వెలువడవు. ముఖ్యంగా 'టైమ్', 'లైఫ్', 'న్యూస్ వీక్' వంటి పత్రికలలో అటువంటి ప్రశంసలు అసలే ఉండవు. సోవియట్ రష్యాలో నీళ్ళు తెల్లగా ఉంటాయనీ, పాలు నల్లగా ఉంటాయని రుజువు చెయ్యటానికి ఈ పత్రికలు అవిరామ కృషిచేస్తూ ఉంటాయి. అటువంటి సందర్భంలో నవంబరు 17 తేదీగల 'టైమ్' పత్రికలో సోవియట్ విద్యా విధానాన్ని మెచ్చుకుంటూ, దానితో పోల్చి అమెరికాలోని విద్యావిధానాన్ని ఖండిస్తూ వెలువడిన వ్యాసం గమనార్హం

ఈ వ్యాసానికి ఆధారం ఒక గ్రంథం. దాన్ని రచించినవారు ఆర్థర్ ఎస్ ట్రేస్ (జూనియర్). ఆయన క్లీవ్‌లాండ్ లోని జాన్ కారల్ యూనివర్శిటీలో ఇంగ్లీషు ప్రొఫెసర్ ఈయన రాసిన గ్రంథంలో ప్రాథమిక, మాధ్యమిక విద్యలను గురించి మాత్రమే చర్చించబడినట్టు కనబడుతుంది

''రష్యన్ విద్యా సంస్థలలో విద్విషయ బోధ అణిచి పెట్టబడుతుందనీ, అమెరికాలో అలాటి బోధలకు ప్రోత్సాహం ఉన్నదనీ అమెరికన్ విద్యావేత్తలు అనుకుంటారు'' అన్న వాక్యంతో ప్రారంభమైన ఈ వ్యాసం ఈ అభిప్రాయం పూర్తిగా

పొరపాటుని నిరూపిస్తున్నది ఇందుకు గాను ట్రేస్ రచించిన గ్రంథంనుంచి అనేక వివరాలు ఉదహరించబడ్డవి వాటిని మనం కూడా తెలుసుకొనటం అవసరం

అమెరికాలోని పిల్లలకంటే రష్యాలోని పిల్లలు నిజమైన సాహిత్యాభిలాష చాలా చిన్న వయస్సులోనే అలవరచుకుంటారు అమెరికాలో 'జానీ' ఆరవ ఏట మొదటి తరగతి (గ్రేడ్ 1) లో ప్రవేశిస్తాడు రష్యాలో ఇవాన్ 7వ ఏటగాని మొదటి తరగతిలో ప్రవేశించడు అయినా ఇవాన్ చదువు రాకెట్ వేగంతో నడుస్తుంది

తమ భాష యొక్క అక్షరమాలతో పరిచయం సంపాదించి అన్ని రకాల ఉచ్చారణా సాధించడానికి సోవియట్ విద్యార్థికి కొద్ది వారాలు పడుతుంది ఈ 'అయిదుబళ్ళు' పూర్తికాగానే వాడు మొదటి తరగతి వాచక పుస్తకం చేబడతాడు అందులో 2000 మాట లుంటాయి (అమెరికా లోని బడులలో ఉపయోగించే ఒక మొదటి తరగతి పాఠ్యపుస్తకంలో 158 మాటలు మాత్రమే ఉన్నాయట)

శుభ్రంగా ఉండమనీ, కష్టపడి చదవమనీ, నిజంపలక మనీ హెచ్చరించే నీతి వాక్యాలతో ఆరంభమయ్యే ఈ మొదటి వాచక పుస్తకంలో తేనెటీగలూ, చీమలూ, ఉడతలూ మొదలైనవాటి జీవిత వివరాలుంటాయట ఈ పుస్తకం చదివిన కుర్రాడు 6 రకాల కుక్కగొడుగులనూ, 12 రకాల పక్షులనూ, కుందేళ్ళ, నక్కల, తోడేళ్ళ అడుగుజాడలనూ గుర్తించ గలడట ఈ వాచక పుస్తకంలో పూర్తిగా మూడోవంతు నికరమైన సాహిత్యం పుష్కిన్, లెర్మంటోవ్, నెక్రసోవ్‌ల పద్యరచనలూ, ప్రాచీన రష్యన్ నీతికథలూ, ఏడు టాల్‌స్టాయ్ కథలూను.

రెండవ వాచకంలో సోవియట్ విద్యార్థి 4.000 మాటలు నేర్చుకుంటాడు, మూడవ వాచకం పూర్తయే సరికి వాడికి 8 000 మాటలతో పరిచయం కలుగుతుంది. ఈ మూడవ వాచకంలో ''నదులు మొదలుకొని ఉక్కువరకూ, కప్పలు మొదలుకొని గాలి వరకూ'' ప్రతిదాని యొక్క ఉత్పత్తి గురించీ ఉంటుంది ఇది 384 పేజీలు పుస్తకం. ఇది చవకబారు కాగితంతో ''విలువైన'' భాష కలిగి ఉంటుంది. శరీర రచనా శాస్త్రం (ఎనాటమీ), వైద్యశాస్త్రమూ విద్యార్థికి పరిచయం అవుతాయి. ఎముకలూ, కండరాలూ, గుండెకాయా, చెవీ, అంటువ్యాధులూ మొదలైనవాటిని గురించి పెద్దవాళ్ళు తెలుసుకోదగినన్ని వివరాలు, ఆరుబ్యాక్టీరియాలు, బొమ్మలతో సహా ఈ వాచకంలో ఉంటాయి ఈ వాచకం నిండా చెఖోవ్, తుర్గెనేవ్, గోర్కీల వంటి అత్యుత్తమ రచయితల కథలున్నాయి

నాలుగో తరగతి వాచకం ముగించేసరికి విద్యార్థికి 10,000 మాటలు కరతలామలకంగా ఉంటాయి. వాడు రష్యన్ సాహిత్యాన్ని క్షుణ్ణంగా అధ్యయనం

వేయగలస్థితిలో వుంటాడు వాడు జాగ్రఫీ, హిస్టరీ వంటివి ప్రత్యేక విషయాలుగా నేర్చుకోవటానికీ, యితర భాషలు నేర్చుకోవటానికీ సిద్ధంగా వుంటాడు

( అమెరికాలో నాలుగో తరగతి విద్యార్థికి 1800 మాటలు మాత్రమే వచ్చి ఉంటాయి వాడు పాఠ్యపుస్తకాలలో చదివే కథలు ఊరు పేరులేని వాళ్ళు రాసినవి, అందులో ''అమ్మలూ, నాన్నలూ, అవస్థపడుతున్న 'ఆదర్శ' జీవితంలో వాళ్ళుగా ఉంటారట )

రష్యాలో ఇంగ్లీషు అభ్యసించే 7 వ తరగతి విద్యార్థులలో 45 శాతం మందికి అమెరికాలోని 7 వతరగతి విద్యార్థులకంటే ఆంగ్ల సాహిత్యం గురించి ఎక్కువ పరిచయం ఉంటుందని ట్రేస్ తన పుస్తకంలో అన్నాడు 'టైమ్' పత్రిక ఈ అంచనాలను ఆమోదిస్తున్నది.

చాలా ముందుకు వచ్చామనుకునే దేశాలే ఈ విధంగా తమ విద్యావిధానాన్ని సోవియట్ విద్యావిధానాలతో పోల్చుకుంటున్నప్పుడూ, అన్ని విషయాలలోనూ వెనుకబడి ఉన్నామనుకునే మనం మన విద్యా విధానాలను కూడా సింహావలోకనం చేసుకోవటం అవసరం. అందుకు మన విద్యావేత్తలు పూనుకోవాలి.

విద్యావిషయకమైన పరిజ్ఞానంలేని నాబోటివాడికి సయితం మన చదువులు పీతనడక నడుస్తున్నట్టు కనిపిస్తూనే ఉన్నది ముఖ్యంగా మన పిల్లలు వాచకాలలో నేర్చుకునే కృతకమైన తెలుగు వారికి జీవితంలో ఎందుకూ పనికి వచ్చేదిగాదు. అందులోని పదజాలంలో హెచ్చుభాగం మరిచి పోవటానికి పనికి వస్తుంది. 30 ఏళ్ళపాటు గిడుగు రామమూర్తి పంతులుగారు చేసిన అనన్యమైన భాషాకృషి మన పిల్లకాయలకింకా ఎటువంటి ఫలాలనూ అందించలేదు. సెకండరీ విద్య ముగించిన విద్యార్థులలో హెచ్చుభాగం మాతృభాషలోగాని, రెండో భాషలో గాని 'చక్కని వచనం' లో ఒక పావుటావు మించి రాయలేని స్థితిలో ఉన్నారు. ఈనాటి పిల్లలు తెలుగు నేర్చుకోవటానికి పాఠ్యపుస్తకాల కంటే పత్రికలు ఎక్కువగా తోడ్పడుతున్నాయన టానికి ఎటువంటి సందేహమూ లేదు ఈ పిల్లలకు గురజాడ వారిని గురించి గాని, కందుకూరి వీరేశలింగం గారిని గురించిగాని, ఆధునిక కవులను గురించిగాని విద్యాసంస్థల ద్వారా తెలుసుకునే అవకాశాలు ఇంకా తక్కువగానే ఉన్నాయి విద్యాధికారులు ప్రాచీన కవులను గురించి మటుకు కొంత పిల్లలకు తెలియనిస్తున్నారు

భాషలోనూ, పాఠ్యపుస్తకాలలోనూ, బోధనాంశాలలోనూ, ఎంతో పెద్ద విప్లవం జరిగితే గాని మన పిల్లల చదువును గురించి సంతృప్తి పడటానికి ఏమాత్రం అవకాశం లేనట్టు కనబడుతుంది.

*విశాలాంధ్ర, 10-12-1961*

# 4. నైపుణ్యం- సమర్థతా

నేను విజయనగరం కాలేజీలో బి ఏ చదువుకునేప్పుడు మాకు ఇంగ్లీషు చెప్పిన వారిలో ఒకరయిన 'సుబ్బకవి' (కె వి సుబ్బారావు) గారు బి ఏ ప్యాసయినవాడే ఆయన మాకు లెక్చరర్‌గా పనికిరాడని మాలో ఎవరికీ అనిపించలేదు

ఈనాడు మన కాలేజీలలో ఇటువంటిది సాధ్యమనుకోను ఇప్పుడు సమర్థతను డిగ్రీలలో జ్వరాన్ని కొలిచినట్టు కొలుస్తున్నారు డాక్టరేటున్న వాళ్ళకే ప్రిఫరెన్సు

డిగ్రీలను పాటించటమైతే మంచిదేగాని, వాటిని సమర్థతకు గీటురాళ్ళుగా ఉపయోగించటం అంత మంచి పద్ధతిగా కనిపించదు. కీర్తి శేషుడైన ప్రొఫెసర్ హాల్డేన్ కూడా రీసెర్చి స్కాలర్ల విషయంలో ఇందుకే అధికారులతో పేచీపడ్డాడు

పెరిగే దేశంలో సమర్థతకూ, నైపుణ్యానికి ఎంతో ఆదరం ఉండాలి (పెరగటమంటే ప్రజాదారిద్ర్యమూ, సమస్యలూ, పరాధీనత, పాలకవర్గంవారి ఉన్మాదమూ పెరగటం కాదు.) ముఖ్యంగా వైజ్ఞానిక, సాంకేతిక రంగాల్లో నిపుణులకు ఎంతైనా పని ఉంటుంది. మన దేశం అధమం 150 ఏళ్ళు వెనక పడి ఉన్నది అది ముందుకు రావాలి

ఈయుగంలో ప్రతి ఒక్కడికీ ప్రాథమిక విజ్ఞానం అవసరం. నిత్యమూ వాడుకునే వస్తువుల పంపిణీ ఏమిటో, అవి ఎలా పనిచేస్తాయో సామాన్యులకు తెలియకపోతే వారు నాగరికత చేతి కీలుబొమ్మలుగానే ఉండిపోతారు. ఒక్కొక్కసారి ప్రమాదాలకు కూడా గురి అవుతారు. కరెంటు తీసెయ్యకుండా స్నానాల తొట్టిలో కూర్చుని, షాక్‌తో చనిపోయినవాడిలాగా!

కొత్తగా వచ్చే గృహపరికరాల వల్ల చిక్కులున్నాయని తెలుసుకుని, కొందరు వాటిని ఏవగించుకుని, పాతవాటితోనే సరిపుచ్చుకుంటారు నాగరికతకు దూరంగా ఉంటారు. కాని నాగరికత నుంచి పారిపోయే వాళ్ళతో దేశం పెరగదు. ప్రతీ నాగరికతకూ కొంత విజ్ఞానం అవసరమవుతుంది. దాన్ని మనుషులు అలవరచుకోవాలి

పాతకాలంలో వాళ్ళు కూడా ఇత్తడి పాత్రలలో పులుసుపోస్తే విషమిస్తుందని తెలుసుకోకపోతే దెబ్బతిన్నారు ఒకే కూటానికి చెందిన వాళ్ళు ఆకూటం లోనే పెళ్ళిళ్ళు చేసుకుంటూ పోతే జాతి క్షీణిస్తుందన్న విషయం మన పూర్వీకులు ఏనాడో గ్రహించి సగోత్ర వివాహాలు నిషేధించారు. ఈనాడు మనం గోత్రాలు పాటిస్తున్నాంగాని మేనరికాలు చేస్తున్నాం! ఆచారాలు కట్టుదిట్టంగా ఉన్నంత మాత్రాన విజ్ఞానం అవసరం లేకుండా పోతుందనేది భ్రమ అని దీనివల్ల మనకు స్పష్టంగా తెలుస్తుంది.

నైపుణ్యానికీ సమర్థతకూ మూలాధారం విజ్ఞానం అందుకే డిగ్రీలు చూడటం సమర్థనీయమవుతున్నది అయితే ఈ కాలంలో 14 కేరట్ల డిగ్రీలూ 4 కేరట్ల

ఉగ్గీయా కూడా ఉంటున్నాయి గనక, సామర్థ్య నైపుణ్యాలనూ, వాటితో పాటు చిత్తశుద్ధినీ కూడా చూడక పోతే డాములు నీటిలో పడి పెళ్లగా తేలిపోవటం లాంటి దౌర్భాగ్యాలు సంభవిస్తాయి

అన్నిటికీ అర్హతలు చాలా శ్రద్ధగా పాటిస్తాం అయిన వాళ్ళకు ప్రమోషను లివ్వటంలో తప్పిస్తే కాని మనని పరిపాలించటానికై మనం ఎన్నుకునే వారికి ఓట్లు వెయ్యటంలో ఏ అర్హతలు పాటిస్తున్నాం? ఎన్నికలు జరిగేటప్పుడు, రాష్ట్రాలలో ఎవరు మంత్రులవుతారో, కేంద్రంలో ఎవరు ఏ శాఖను చేబడతారో మనకు తెలీదుగదా?

మంత్రుల నియామకాలు రాజకీయాల స్థాయిలో జరుగుతాయి. పోర్టు ఫోలియోల మార్పులు కూడా అంతే దేశం ఎత్తునా, రాష్ట్రం ఎత్తునా కూడా కాంగ్రెస్ పార్టీలోని అంతస్సంఘర్షణలే మన దేశం నుదుట బ్రహ్మరాతలాగా చలామణి అవుతున్నాయి

ఎవరో, ఎందుకో ఆర్థిక మంత్రి అవుతాడు అతగాడి కుండే ఆర్థిక పరిజ్ఞానం ఎంతో మనకు తెలియదు అతని అనుయాయులకు అవసరంలేదు అలాగే మరెవరో రక్షణ మంత్రి అవుతాడు. అతనికి యుద్ధతంత్రం ఎంత తెలుసో బహుశా ఎవడికి తెలిసి ఉండదు ఏవో నిర్ణయాలు జరుగుతాయి అవి మంచివో కావో మనం నిర్ణయించలేం!

సమస్యలు తెచ్చి పెట్టేవాళ్ళూ, వాటికి పరిష్కార మార్గాలూ చెప్పేవాళ్ళు నిపుణులు కారు పరిష్కారమార్గాలు చెప్పేవాళ్ళలో నిపుణులుండవచ్చు. కాని పత్రికలలో అచ్చుగా వారన్నది ప్రచారం కాదు

ఉదాహరణకు రూపాయికి పట్టిన క్షయవ్యాధిని తీసుకుందాం. వేతనాలు స్తంభింపజేస్తే ఈ రోగానికి విరుగుడు అవుతుందంటున్నారు వేతనాలు స్తంభించటంతో పాటు డిప్రెషన్ - డబ్బును చలామణి లో నుంచి భారీగా ఉపసంహరించటం కూడా జరగకపోతే ప్రమాదం ఉన్నదని నిపుణులు - ధనికవర్గం వాళ్ళ ఏజంట్లు కాదు నిజమైన నిపుణులు- అంటున్నారు. ఇలాంటి సూచనలు కూడా చర్చలో జరుగుతాయిగాని అవి అమలు జరిగేదాకా నమ్మకంలేదు.

మన పాలకవర్గం వాళ్లు దేశాన్ని నడిపించటంలో చూపే 'సమర్థతా', 'నైపుణ్యమూ' మన ఆడవాళ్ళు వంట ఇళ్ళలో చూపినట్టయితే మన జాతి ఏనాడో సోదిలోకి రాకుండా పోయి వుండును అంతసమర్థులను మనం ఎన్ను కుంటున్నాం!

ఇది మన దేశంలోనే జరగుతున్నదని నేననను ''స్వేచ్ఛాప్రపంచం'' అంతటా ఇది జరుగుతున్నది మొదటి ప్రపంచ యుద్ధం వచ్చాక కూడా ఇంగ్లాండు జర్మనీకి గ్లిసరిన్ సరఫరా చేస్తూ వచ్చిందట గ్లిసరిన్ పేలుడు మందుకు అవసరం గదా, జర్మనీకి ఎందుకు అందిస్తున్నారు?'' అని ఎవరో అడిగితే, పార్లమెంటులో, 'అది కొత్తగా కనిపెట్టిన విషయం గనుక తెలియలేదు'' అన్నారట. గ్లిసరిన్‌తో పేలుడు మందు చేసే

పద్ధతి ఏ 1760 ప్రాంతాలలో కనిపెట్టి ఉండిందట ఆనాటి బ్రిటిష్ పాలకుల నైపుణ్యం అలా ఏడిచింది సోషలిస్టు పద్ధతుల నవలంబించిన కమ్యూనిస్టు దేశాలలో కూడా అవకతవకలు జరిగే అవకాశం లేకపోలేదు కాని అక్కడ ప్రజాజీవితం దెబ్బ తినక పోవటానికి కారణం, కమ్యూనిస్టు పార్టీ మెలకువగా ఉండి పనికి మాలిన వారిని పార్టీనుండీ, అప్రయోజకులను పదవుల నుండీ తొలగిస్తూ వుంటుంది వీటికి 'పర్జెస్' అని పేరు పెట్టి మన పత్రికలు మహాఘోరంగా చిత్రిస్తాయి ఈ 'పర్జ్'లు మనకూ ఉన్నాయి అయితే అవి ధనకవర్గం వారి అవసరాలకు అనుగుణంగా జరుగుతాయి గనక వాటిని పత్రికలు దారుణంగా చిత్రించవు

ప్రస్తుతం మన పాలక యంత్రాన్ని నడిపేవాళ్ళు ఏ విధంగానూ 'నిపుణులు' కారు - కావటానికి అవకాశం లేదు. వారికి సలహాలిచ్చే నిపుణులున్నారు, కాని వారు ధనికవర్గానికి అమ్ముడయిన వాళ్ళు అమ్ముడుపోని వాళ్ళది అరణ్యరోదనం ఈ పాలక యంత్రం అమెరికా, బ్రిటనుల చంకలో దూరి దేశమంతటా సామ్యవాదం పాకించబోతున్నది!

*3-7-1966 జనశక్తి (ద్వై వారపత్రిక)*

# 5. చదువు- సాహిత్యం

''చదువని వాడజ్ఞుండగు, చదివిన సద సద్వివేక చతురతకలుగున్'' అన్నాడు హిరణ్యకశిపుడు ప్రహ్లాదునితో ''చదువుకున్నవాని కంటే చాకలివాడు మేలు'' అని లోకోక్తి. రెండూ సూక్తులేకాని ఒకదాని కొకటి విరుద్ధంగా వున్నాయి. రెండు సూక్తులలో 'చదువు' అన్న మాటకు అర్థాలు వేరు.

హిరణ్యకశిపుడి కాలంలో 'చదువు' అన్నది మనిషికి జీవితావసరమైన జ్ఞానాన్ని ఇచ్చేదిగా వుండేదనుకోవాలి. అలాంటి చదువు జీవితానికి ఎలా అంటకుండా పోయిందంటే, చదువుకొన్నవాడికి చాకలివాడికున్న పాటి లోకజ్ఞానం కూడా లేకుండా పోయింది. చదువులో కలిగిన పరిణామాన్ని మనం సులువుగా ఊహించవచ్చు వేద కాలపు ఆర్యులకు యజ్ఞమే జీవనోపాధి. అందుచేత బుక్కులు వారికి జీవితావసరాలయ్యాయి.

రాను రానూ యజ్ఞకర్మల స్థానాన్ని ఇతర కర్మలాక్రమించుకున్నాయి. శాస్త్రాలు పుట్టాయి. విద్యలు పుట్టాయి. సాహిత్యం పుట్టింది. వేదాలు పోలేదు కానీ, జీవితంలో పరిమిత ప్రయోజనమే మిగిలింది వాటి అంతరార్థానికి విశిష్టత పోయింది. వేదాన్ని

అర్ధం చేసుకోకుండానే, అర్ధం చేసుకోవలసిన అవసరం లేకుండానే కొన్ని బ్రాహ్మణ శాఖలవారు వాటిని, భట్టీయం వేసి ఛాందసులు అనే బిరుదు సంపాదించుకున్నారు.

అయితే, వేదాలు వెనకబడినంత మాత్రాన సామాజిక పురోగమనం నిలిచిపోలేదు (నిలిచిపోయిందని కొందరనుకొంటే వారి భ్రమ). ఒకప్పుడు వేదాలు ఎలాంటి సాంఘిక పరిణామాన్ని సాధించాయో. కొంత కాలమయ్యాక సాహిత్యం అదే ప్రయోజనాన్ని సాధించింది మహాభారతానికి పంచమ వేదమనే పేరు ఊరికేరాలేదు. చరిత్రయుగంలో సైతం చాలా కాలం సామాజిక జీవికి భారతం ప్రమాణగ్రంధంగా వుంటూవచ్చింది

ఆస్థితి కూడా క్రమేణా మారిపోయింది. అయినామనవాళ్ళు భారతాన్ని వదలి పెట్టలేదు. కవిత్రయం భారతాన్ని తెలుగులోకి అనువదిస్తూ, తమ కాలానికి పనికి వచ్చే విషయాలను మూలంలో లేక పోయినా చేరుస్తూ వచ్చారు. ( ఉదాహరణకు పాండవులు అజ్ఞాతవాసంచెయ్యబోయే ముందు ధౌమ్యుడు వారికి సేవకా వృత్తిని గురించి బోధించాడు. ఇది మూలంలో లేదు. కారణం తిక్కన సోమయాజి కాలానికి ఉపకరించేవై యుండాలి.)

13,14 శతాబ్దాలలో తెలుగు భారతం చదివి, అందులోని విషయాలను జీర్ణించుకోని తెలుగు వాడు, అజ్ఞుల జాబితాలో చేరిన వాడే అయుండాలి. ఆమాటకు వస్తే రాయలసీమలో నిత్యసంభాషణలో కూడా అసంఖ్యాకులు భారతం నుంచి పద్యాలు చదువుతారు. ఇదొక విధంగా మెచ్చుకోదగిన విషయమే కానీ ప్రజా జీవితం తగినంతగా పురోగమించి వుంటేవారు తమ నిత్యజీవితాలకు తెలుగు భారతాన్ని అంతగా ఆధారం చేసుకోరేమోనని నాఅనుమానం.

30,40 సంవత్సరాల క్రితం నాకారువాళ్ళం 'కన్యాశుల్కం' నుంచి 'కోట్' చెయ్యకుండా చాలాసేపు మాట్లాడ లేక పోయేవాళ్ళం. ఇప్పటి కుర్రకారు ఏ పుస్తకాలను 'కోట్' చేస్తున్నారో నాకు తెలీదు. 'కన్యాశుల్కం' నుంచి 'కోట్' చేయకుండా ఈ తరం వారికి జరిగి పోయే మాటుంటే నేనాశ్చర్యపడను. ఎందుకంటే ఇవాళ కాకపోతే రేపైనా 'కన్యాశుల్కం' జీవితానికెడమై పోక తప్పదు. శ్రీశ్రీ ఇంకా చలామణిలో వున్నాడు. కాని, శ్రీశ్రీ రచనలకు కూడా జీవితం ఎడం కావచ్చు. అవుతుందనే అనుకోవాలి. ఏ రచన ఎంత కాలానికి జీవితం నుంచి ఎడమవుతుందో చెప్పడం సాధ్యం కాదు. వేమన పద్యాలలో చాలాభాగం ఇంకా సజీవంగానే వున్నాయి.

జీవితానికి ఎడమై పోయిన సాహిత్యం అమాంతం అంతరించిపోదు. సినిమాలలో కనిపించే తండ్రిఫోటోలాగా చాలా కాలం అలానే వుండిపోతుంది.... పూలహారంతో సహామరీనూ! మనపురాణాలూ, ప్రబంధాలూ, శతకాలూ, కీర్తనలూ అలా నిలిచివున్నవే. వాటిని చదవడం వల్ల నిత్య జీవితానికంతగా ఉపయోగం వుండక పోవచ్చు. అది ఒక ప్రత్యేక మేధసాధన అవుతుంది. మన ప్రాచీన కవులు ఛందస్సును ఎన్ని సొంపులతో దిద్దారో, మాటలమీద ఎలా శ్లేషించారో, ఆయా

యుగాలలో భాషలనుడికారం ఎలా వుండేదో, సాంఘికవ్యవహారాలూ, మర్యాదలూ యేమిటో ఇత్యాది విషయాలను తెలుసు కోవడానికి ప్రాచీన సాహిత్యం ఉపయోగ పడుతుంది. వాటిలో కొంత విస్మృత చరిత్ర కూడా లభ్యమవుతుంది.

దీన్ని నేను రెండో రకం చదువు అంటున్నాను జీవితానికి అంటని సాహిత్యాన్ని యావజ్జీవితం అధ్యయనం చేసినప్పటికీ నిత్యజీవితంలో 'అజ్ఞుడు' గానే వుండిపోవచ్చు. హిరణ్యకశిపుడన్నట్టు ఈ విషయంలో ప్రహ్లాదుడికి, హిరణ్యకశిపుడికీ అభిప్రాయ భేదం రావడం వల్లనే వారిద్దరి మధ్య జట్టీ వచ్చింది. 'చదువులలో మర్మమెల్లా' హరిభజనేనంటాడు ప్రహ్లాదుడు. ఇది హిరణ్యకశిపుడికేమాత్రం నచ్చలేదు. ఒకరు జీవితం (ఇహం) గురించి మాట్లాడుతున్నారు, మరొకరు మోక్షం (పరం) గురించి మాట్లాడుతున్నారు.

ఇలాంటి అభిప్రాయాభేదాలకు ఈనాడూ తావున్నదని మనం మరిచి పోకూడదు. గిరీశం ఇంగ్లీషు ముక్క రాకుండా 'కన్యాశుల్కం' దురాచారమని ఉపన్యాసం ఇవ్వలేదు. అగ్నిహోత్రావధానులు బ్రహ్మదేవుడు వచ్చి చెప్పినా కన్యాశుల్కం దురాచారమని ఒప్పుకోడు, సరికదా, '' ఈవెధవ ఇంగ్లీషు చదువునుంచి బ్రాహ్మణ్యం చెడిపోతూంది. దేవ భాష లాగా భోజనాల దగ్గర కూడా ఆమాటలే కూస్తారు, సంధ్యావందనం, శ్రీసూక్త, పురుషసూక్తాలు తగులపడిపోయినాయి సరేకదా'' అని దుమదుమలాడుతాడు.

మనం ''సెల్లింగ్ గర్ల్స్, 'డామిట్!'' అని షాక్ తిన్న గిరీశంతో ఏకీభవించగలం కానీ, ఆనవాయితీగా కన్యాశుల్కం పుచ్చుకొని ఆడపిల్లలను అమ్మే అగ్నిహోత్రావధానుల తో ఏకీభవించం. అయితే, అగ్నిహోత్రావధానులు ఆడపిల్లలను అమ్మడానికీ, అయనకు శ్రీసూక్త, పురుషసూక్తాలలో అపారమైన విశ్వాసం వుండడానికి మాత్రం చాలా దగ్గర సంబంధం వుంది. దేవ భాష మీద వల్లమాలిన అభిమానమూ, ఇంగ్లీషు ముక్కల మీద ద్వేషమూ గల అగ్నిహోత్రావధానులలో మానవత్వం కొడిగట్టిపోయింది. హిరణ్యకశిపుడు చెప్పిన అజ్ఞుడికి అగ్నిహోత్రావధానులు చక్కని ఉదాహరణ.

ఇంగ్లీషు వాళ్ళువుమన దేశంలో పరిపాలన ఆరంభించినాక జీవితం మారినంతగానూ, అంతవేగంగానూ అంతకు పూర్వం మారలేదు. ఈ మార్పుకు మూలకారణం పాశ్చాత్య విద్య. అదుంటేగానీ పెద్ద పదవులు కాని చిన్న ఉద్యోగాలు కానీలభించవు. కరటక శాస్త్రులు చెప్పినట్టు సంస్కృతం ఎవడిక్కావాలి? చదువు కొన్నదెందుకు. పొట్టపోషించుకోడానిగ్గదా! కావచ్చు, గానీ ఇంగ్లీషు చదువుతో పాటు ఇంగ్లీషులో ఆలోచించడమూ, ఇంగ్లీషుసాహిత్యాన్ని ఆరంభించడమూ, ఇంగ్లీషు సంస్కారాన్ని భుజాలకెత్తుకోవడమూ జరిగాయి. కాళిదాసు ఏం రాశాడో, శ్రీనాథుడేం రాశాడో తెలీకుండాపోయింది. షేక్స్పియర్, మిల్టన్, థాకరే, బైరన్, కీట్స్, డికెన్స్ మొదలైన ఇంగ్లీషు రచయితల రచనలను అధ్యయనం చేసినవాళ్ళు విద్యాధికులు

అనిపించుకున్నారు. స్కూళ్ళలో వుండే అధ్యాపకులలో దిష్టిపిడతలెవరంటే తెలుగు, సంస్కృతం మేష్టర్లు.

ఇలా జరగడం తప్పు కాదా? అవును, కాదు కూడాను. మన జీవితం ఎలా పరిణమించిందంటే, మొల్ల రామాయణం చదవడం కన్న డికెన్స్ నవలను చదవడమే ఎక్కువ ఉపకరించింది. మనప్రాచీన కవులకన్న పాశ్చాత్య రచయితలో కొందరు మనకు సన్నిహితులయ్యారు. అంతర్జాతీయ జీవితం మనపైన దాడి చెయ్యసాగింది. మన జీవితాలను, ప్రభావితం చెయ్యదగిన ఆధునికభావాలు మనపూర్వ సాహిత్యంలో కన్న పాశ్చాత్య సాహిత్యంలోనే ఎక్కువగా కనిపించాయి.

ఆ కారణం చేతనే మనసాహిత్యంలో ఆధునిక యుగకర్తలందరూ పాశ్చాత్య సంస్కృతిచేత అంతో ఇంతో ప్రభావితులై, ఆప్రభావాన్ని మనజీవితానికి జోడించి ఆధునిక సాహిత్యం సృష్టించారు వీరేశలింగం గారు. గురజాడ అప్పారావుగారు వేసిన బాట చెరగకుండా ముందుకు పోతుంది. అందులో సందేహమేంలేదు. కానీ, చదువు మాటేమిటి? మన వాళ్ళలో విద్యావంతులందరూ ఈ ఆధునిక సాహిత్యాన్ని చదివి తమ జీవితాలకు అన్వయించుకొని 'సదసద్వివేక చతురత' సంపాదిస్తున్నారా? లేదు.

పరీక్షలు పాసై విద్యావంతులనిపించుకుని ఏ సాహిత్యమూ చదవనివాళ్ళను నేనుచూశాను. వాళ్ళడిగ్రీలు చూస్తే. వింత పశువులు అనడానికి నోరురాదు మరి. అందరికీ అందుబాటులో వుండేకథల్లోని క్షుద్రపాత్రలలాగా ప్రవర్తించేవాళ్ళను చూశాను. వాళ్ళు ఆకథలు శ్రద్ధగా చదివితే అలా ప్రవర్తించరని నా దృఢ విశ్వాసం. ఇదిలా వుండగా, సంఖ్యలో పెరిగిపోతున్న అక్షరాస్యులకోసం చాలా చవుకబారు సాహిత్యం వస్తున్నది. దాని ప్రభావం జీవితం మీద వుండదా? ఒక వేళ వున్నట్టయితే అపకారం చేసేదిగానే వుంటుంది. అక్షరాస్యత పెరిగి ఈసాహిత్యం చదివేకన్న, ప్రజలు నిరక్షరులుగా వుండి నప్పుడే వారిలో సహజ మానవత్వం ఎక్కువగా వుండేదేమో నన్న సందేహం కలుగుతుంది. తెలుగులో చవకబారు సాహిత్యం రావడంతో ఒకమార్పు జరిగింది. చాలా మంది ఇంగ్లీషు రచనలు చదవడం మానేసి తెలుగు రచనలే చదువుతున్నారు. ఒకప్పుడు ఏ రచనలూ చదవని వారు సైతం ఇప్పుడు తెలుగు రచనలను చదువుతున్నారు. ఈరచనలు జీవితం గురించి అబద్ధాలు చెప్పిన మేరకు వారికి చదువు 'అవిద్య'గా వుండిపోతున్నది. అయితే మంచి సాహిత్యం చదవడానికి ఇది ప్రథమ సోపానంగా పనిచేసే అవకాశం లేకుండా పోలేదు.

ఈ అవకాశాన్ని అక్షరాస్యులు సద్వినియోగం చేసుకునేందుకు ఎవరు తోడ్పడేట్టు? విద్యాలయాలు తోడ్పడవు. అట్టహాసంగా ప్రభుత్వం ఏర్పాటు చేసిన అకాడమీలు తోడ్పడవు ఈ అకాడమీలకు సాహిత్యం గురించి ఏమాత్రం విచక్షణాజ్ఞానం వున్నట్టు ఇంత వరకూ దాఖలాలు లేవు. ఈ పని స్థానిక సంస్థల ద్వారా మాత్రమే జరగాలి.

సాహిత్యాభిలాషులైన తల్లిదండ్రులు తమ పిల్లలకు సాహిత్యాభిలాషను, ఆధునిక సాహిత్యంలో ఆసక్తిని రేకెత్తించాలి. మాతరంవాళ్ళం కుచేలోపాఖ్యానం, రుక్మిణీకళ్యాణం కంఠస్థం చేశాం వచ్చేతరం వారు 'మహాప్రస్థానం' కంఠస్థం చేస్తారనీ, పిల్లలు మొదట ఆధునిక సాహిత్యం చదివి పోను,పోనూ ప్రాచీన సాహిత్యాన్ని చదువుతూ పోతారని అనుకోవడంలో నాకు కొంత ఊరట కలుగుతుంది. అలాంటి పరిణామం ప్రారంభమయిన నాడు తుక్కు సాహిత్యం చెత్త గుట్టలు దాటి రాకుండా అదుపులో వుంటుందని కూడా నావిశ్వాసం.

*( గుడివాడలో జరిగిన ఉపాధ్యాయ మహాసభలో చదివిన శ్రీ కొడవటిగంటి కుటుంబరావు వ్యాసం. 20-7-1969 నాటి ' ఉపాధ్యాయ' లో ప్రచురణ అయింది )*

## 6. విద్య సఫలం కావాలంటే

విద్యకు రెండే రెండు ప్రయోజనాలు: సార్థకంగా జీవించటమూ, జీవితాన్ని అవగాహన చేసుకోవటమూను. నిజానికి ఇవి విడదీయరాని ప్రయోజనాలు, ఎందుచేత నంటే, జీవితం అర్థం చేసుకోలేని వాడు సార్థకంగా జీవించలేడు. కాని ఈనాటి వ్యవస్థలో డబ్బో ప్రాపకమో వున్నవాడు జీవితాన్ని గురించి ఏమీ తెలియకుండానే చాలా వరకు సార్థక జీవి కాగలుగుతున్నాడు. అలాటివాడి జీవిత భారాన్ని మరెవరో మోస్తున్నారన్నమాట

బుద్ధజాతక కథలో ఒక చక్కని కథవున్నది. బియ్యం ఎక్కడినుంచి వస్తాయంటే నలుగురు యువకులు చెప్పలేక పోతారు. ఒకడు బానలోనుంచి వస్తాయని మాత్రం చెప్పగలుగుతాడు! వాళ్ళు బాగా బతుకుతున్న వాళ్ళేగాని విద్యావిహీనులు.

ఈనాడు కూడా విద్యావంతులలో మూఢులు చాలా మంది అన్నారు. ''చదువుకున్న వాడికంటె చాకలివాడు మేలు'' అన్న సామెత పుట్టింది విద్యా విధానాన్ని విమర్శించటానికే అయివుంటుంది.

డబ్బు విద్యకు ప్రత్యామ్నాయంగా ఉండటం మనం రోజూ చూస్తున్నాం. మనది ధనవ్యవస్థ. జబ్బులు వస్తే చూడటానికి డాక్టర్లున్నారు. వ్యాజ్యాలు చూడటానికి ప్లీడర్లు న్నారు. ఇంటి చాకిరీ చెయ్యటానికి నౌకర్లున్నారు. మనకు కావలసిన వస్తువులు ఉత్పత్తి చెయ్యటానికి కార్మికులున్నారు. మందులు తయారు చెయ్యటానికి మందుల కంపెనీలున్నాయి. తగినంత డబ్బు ఉంటే అతి నవీనంగా, సుఖంగా ఇళ్ళు కట్టించుకో వచ్చు. రేడియోలు కొనుక్కోవచ్చు. ప్లాస్టిక్ దుస్తులు ధరించవచ్చు. అందమైన స్త్రీల పొందు అనుభవించవచ్చు. మందులున్న సమస్త వ్యాధులనూ నయం చేసుకోవచ్చు. దీనికి విద్య ఎందుకు? అనవసరం.

డబ్బును పురస్కరించుకునేదే పదవి కూడాను. పదవిగలవాడు తన మిత్రులకూ, బంధువులకూ, ఇతరత్రా సన్నిహితులకూ ప్రాపుగా ఉండవచ్చు. వారిని ఆశ్రయించిన వారికి కనీసం రెండోరకం జీవితం - ఉద్యోగాలూ, ప్రమోషన్లూ, జీవితంలో కాలు నిలదొక్కుకోవటమూ - సాధ్యం అవుతోంది. కుబేరసంతానానికి చదువు ఉపయోగించదుగాని, వీరికి కొంత చదువుకావాలి.

ఉద్యోగం దొరకనివాడు ఎంత చదివినా ఒకటే వాడికీ, సాధారణ శ్రామికుడికీ తేడాలేదు, అసలు లేకపోదు. కొద్దిగా ఉంటుంది. శ్రామికుడు ఒళ్ళు విరుచుకు పనిచేస్తాడు, చదువుకున్న నిరుద్యోగి ఆ పనీ చెయ్యలేడు.

విద్యయొక్క ప్రధానాశయం బతుకు తెరువు అనుకున్నట్టయితే, ధనస్వామ్యం దాన్ని ఎలా తలకిందులు చేసిందీ మనం ప్రత్యక్షంగా చూడవచ్చు. నిరుద్యోగులలో హెచ్చు చదువుకున్నవాళ్ళూ, ఉద్యోగాలు చేసుకుంటున్న వారిలో మధ్యమవిద్య గల వారున్నారు, చాలా మంచి స్థితిలో ఉన్నవాళ్ళలో చదువు చాలా స్వల్పంగా గలవాళ్ళున్నారు. అంటే, విద్యాధికులు ఉన్నత పదవులలో అసలే లేరనికాదు. ధనస్వామ్యం నూటికి నూరుపాళ్ళు విజయవంతం కావటం ఎప్పుడూ సాధ్యంకాదు; అయిన నాడు చాలా మంది చదువే మానెయ్యవచ్చు.

వెనకటి కాలంలో చీనా దేశంలో ప్రతి ప్రభుత్వోద్యోగానికీ పండిత పరీక్షలుండేవి. ఈనాడు మనకు అలాటి పరీక్షలు పబ్లిక్ సర్వీస్ కమిషన్లు జరుపుతున్నాయి. చీనాలో జరిగిన పరీక్షలు చదువుకు నిజమైన పరీక్షలుగా ఉండి ఉండవచ్చు; ఈ నాటి సర్వీస్ కమీషన్ ఇంటర్వ్యూలు చదువుకు పరీక్షలని చెప్పటానికి లేదు.

చదువు యొక్క రెండో ఆశయం ఎంతవరకు నెరవేరుతున్నదీ చూదాం. జీవితాన్ని అర్థం చేసుకోవటం ఈ ఆశయం.

తొలి మానవులు రాతి పరికరాలు చెయ్యటం కూడా చేతగాని దశలో ఆహారం ఏరుకు తినేవారు. ఆదశలో తినదగిన దేదో గుర్తించటం తప్ప వేరే విద్య అవసరం లేకపోయేది . పాలు తాగటం మానేసిన పిల్లలు సహితం తమ ఆహారాన్ని తాము ఏరుకు తినేవారు.

క్రమంగా రాతి పరికరాలు అభివృద్ధి అయాయి. అవి హెచ్చు మన్నిక కలవి కావు; సులువుగా పగిలిపోవటమో, రాతి అంచులు మొక్కపోవటమో జరిగేది. అందుచేత రాతి పరికరాలు చెయ్యటం ఆనాటి ఆటవిక మానవులకు నిత్యకృత్యంగా ఉండేది. ఈ పనికి ప్రవీణులుండేవారు కారు, ప్రతి ఒకరూ రాతి పరికరాలు చేసేవారు, అందుచేతనే పూర్వం రాతియుగం తాలూకు మానవావశేషాలు అతిస్వల్పంగా దొరికినా, ఆనాటి రాతి పరికరాలు మాత్రం లక్షల, కోట్ల సంఖ్యలో లభ్యమయాయి. ఆహారాన్ని గుర్తించటంతో పోల్చితే రాతి పరికరాలు చెయ్యటం పెద్ద విద్యే. కాని ఆదశలో మానవ సమాజంలో విద్యావిహీనులుగాని, పనికి మాలిని విద్యగాని లేదని చెప్పవచ్చు.

రాను రాను గుణకర్మ విభజన జరిగి వర్గ సమాజం ఏర్పడేసరికి విద్య శాఖోపశాఖలై వేరువేరు కులాలకు విభజించబడింది కులవృత్తులే కుల విద్య లయినాయి వర్గసమాజంలో దోపిడీ విధానం ఉంటుందన్నది అబద్ధం కాదుగనక, లేదా శాస్త్రాధ్యయనమూ, యుద్ధవిద్యలూ ఉన్నత విద్యలుగానూ, పొలం పనులూ, కుమ్మరి , కమ్మరి, చాకలి, మంగలి పనులూ మొదలైనవి హీనవిద్యలుగా లెక్కలోకి వచ్చాయి దున్నేవాడు పొలం దున్నకపోతే ఎవడికీ కూడుండదు అయినా అదిగొప్ప విద్యకాదు అలాగే చాకలీ, మంగలీ, లోహకారుడూ, కుమ్మరీ, మేదర వాడూ, సాలెవాడూ, చర్మకారుడూ- ఎవరు లేకపోయినా సామాజిక జీవితం నడవదు. అంతదాకా ఎందుకు? కట్టెలు కొట్టేవాళ్ళు లేకపోతే ఎవరి పొయ్యిలోనూ పిల్లిలేవని కాలంలో కూడా కట్టెలు కొట్టేవాళ్ళు అతి పేదవాళ్ళని జానపద కథలలో మనం చదువుతాం

ఉన్నత విద్యలు ఉన్నత సంస్కారాన్ని ప్రతిబింబిస్తాయనీ అందుచేత విద్యలలో హెచ్చుతగ్గులు వచ్చాయనీ అనుకోవటం భ్రమ. ఒకనాడు గ్రీసుదేశంలో లలిత కళలను అభ్యసించినవారు బానిసలు. ఆ కళలద్వారా వారి స్థాయి పెరగలేదు. మన దేశంలో ఒకప్పుడు నృత్యనాదాలకు పేరు పెట్టినది దేవదాసీలు వారికి సంఘంలో ఔన్నత్యం రాకపోగా, నటవిట గాయకులు అపాంక్తేయులుగా పరిగణించబడేవారు.

ధనస్వామ్యం వచ్చాక ఈ పరిస్థితి కొంతవరకే పరిష్కృతమయింది ఈనాడు సినిమా నటులకూ, సినీ ప్లేబాక్ గాయకులకూ, సినీరచయితలకు పెద్ద పరపతి వున్నది. ఒక సినిమా తారకున్న పలుకుబడి మంత్రులకు లేదు. సినీ ప్లేబాక్ గాయకులు సంపాదించేదానిలో అయిదోవంతు సంపాదించలేరు కొమ్ములు తిరిగిన సంగీత విద్వాంసులు. సినీరచయితే ఒకనెలలో సంపాదించేది ఎంతటి సాహితీవేత్త అయినా ఏడాదిలో సంపాదించలేడు.

ఏమిటి కారణం? సినిమా పెద్ద పరిశ్రమ, నాటకాలు కాదు. అందుచేత నాటకాలాడి మేటినటుడని పించుకున్న వాడు రెండుపూటలా కడుపునిండా తినలేకపోయినా, అలానే సినీనటుడై త్వరలోనే ఇన్‌కమ్‌టాక్స్ వాళ్ళకళ్ళల్లో దుమ్ముకొట్టే స్థాయికి పెరుగుతాడు. సినీ పరిశ్రమలో జనాదరణ పొందగల వారందరూ, తమ విద్య ఏ స్థాయిలో ఉన్నప్పటికీ, ధనస్వామ్యం ధర్మమా అంటూ కొమ్మెక్కి కూర్చోగలరు.

అదే ఇతర రంగాలకూ వర్తిస్తుంది. జర్నలిజం అన్నది పుస్తక ప్రచురణ కన్న ఎక్కువ స్థాయిలో ఉండే పరిశ్రమ. పుస్తకాలు రాసుకునేవాడు బతకలేకపోవచ్చు; అంతకన్న తక్కువ రచనా సామర్థ్యం గలవాడు బతక గలుగుతాడు. రాజకీయ వేత్తగా బతకలేనివాడు, ఏదినపత్రికకో లీడర్ రైటర్‌గా హాయిగా బతకవచ్చు. రాజకీయ రంగం పారిశ్రామిక మైనదికాదు మరి!

బాగా బతకగలవాళ్ళనూ, బతకలేకుండా ఉన్నవాళ్ళనూ లిస్టువేసుకుంటూ పోతే దానికి అంతుండదు అది అలా ఉంచి, బాగా బతకగలిగిన వాళ్ళు అధిక విద్యావంతులని ఎలా చెప్పలేమో, జీవితాన్ని మరింత బాగా అవగాహన చేసుకున్నవారని కూడా అలాగే చెప్పలేం

జీవితాన్ని ఈనాడు అర్థంచేసుకోవాలంటే

1. ఏవి మూఢ విశ్వాసాలో తెలియాలి. జ్ఞానం పెరిగేకొద్దీ నిన్నటి విశ్వాసాలు నేడు మూఢ విశ్వాసాలవుతాయి. విద్య వ్యాప్తి చెందుతూనే ఉన్నది, దేవుళ్ళకి ముడుపులు కట్టటమూ జాస్తి అవుతూనే వున్నది. దేవుడంటూ ఉన్నాడే అనుకున్నా తాను మోయగల భారాన్ని దేవుడి మీద వేసేవాడు మనిషికింద జమకాడు. దేవుడి మీద భారంవేసి ఏ యిల్లాలూ పొయ్యిరాజెయ్యటం మానదు. పిల్లలు దేవుడిస్తాడన్న నమ్మకం తో ఏ భార్యాభర్తలు దాంపత్యం మానరు. ఉద్యోగాలకు దరఖాస్తులు పెట్టేవాళ్ళూ, నిత్యకృత్యాలు విధిగా నిర్వహించేవాళ్ళూ, కూరలసంచులు మోసుకొచ్చేవాళ్ళూ, పిల్లల్ని చావగొట్టి చదివించేవాళ్ళు దేవుడు లేనట్టే ప్రవర్తిస్తారు. అలాటప్పుడు కొందరు తమ వైద్యుడికిచ్చిన మొత్తానికి పదింతలు తీసుకు పోయి దేవుడికెందుకు ముడుపు చెల్లిస్తారు? ఎవడి సిఫార్సుతోనో ఉద్యోగం సంపాదించుకుని తిరుపతిలో గుండు చేయించుకుని ఎందుకు వస్తారు? సుఖరోగాలు తగిలిన మనిషికి చికిత్స చేయించక భూతవైద్యుణ్ణి పిలిపించి, మంత్రోచ్చాటన ఎందుకు చేయిస్తారు? మనం విద్య అనుకునేది మూఢ విశ్వాసాలను పోగొట్టేదిగా లేదు.

2. అది సమాజ స్వరూపాన్ని స్పష్టపరిచేదిగా కూడా లేదు. ఫలానా పారిశ్రామికుడు ఇన్ని వేల మందికి తిండి పెడుతున్నాడంటారు. శ్రామికులు ఆ పారిశ్రామికుడికి మేడలూ, కార్లూ బంగారమూ, ధనమూ చేర్చి పెడుతున్నారన్నది విద్యావంతులలో కూడా చాలా మందికి తెలిసినట్టు కనబడదు. లాభాలు తగ్గిన మరుక్షణం ఏ పరిశ్రమా నడవదన్నది వాళ్ళు గ్రహించగలిగినట్టు కనబడరు.

3. మనని పరిపాలించే చట్టాలు మనలో ఎంతమందికి తెలుసు? అజ్ఞానం సాకుగా ఆమోదించబడదు. శాసనోల్లంఘనం శిక్షించబడుతుంది. కాని ఆశాసనాలను గురించి విద్య ఏమిచెబుతున్నది? ఆటవిక సమాజాలలో నియమోల్లంఘనం అంటూ ఉండేదికాదు. కారణం, నియమాలు అందరికీ తెలుసు.

4. సుఖజీవనానికి ఆరోగ్యం అత్యంత ప్రధానమైనది. ఆరోగ్యకరమైన ఆహారం అందరికీ లభ్యంకాదు. అది లభ్యమయేటట్టుచేయడం విద్యవల్ల కాదన్నది అటుంచుదాం. డబ్బుండిచదువున్న వాళ్ళకయ్యాడా చాలా మందికి సరిఅయిన ఆహారం ఏమిటో, ఆహారపు మార్పులతో ఏయే చిల్లర వ్యాధులు నివారణ చేసుకోవచ్చునో తెలీదు. పెద్ద రోగాలకు డ్వాక్టర్లుండనే ఉన్నారు. అలాంటిదే పిల్లల్ని పెంచటం. ఇది పెద్ద విద్య, నేటి బాలుడే రేపటి పౌరుడు అని చీటికీ మాటికీ అంటాం. కాని పిల్లల్ని

పెంచే విధానం మీద దేశభవిష్యత్తు ఆధారపడి ఉండవచ్చునని, పిల్లల్ని పెంచటం సహజంగా దానంతట అదే రాదనీ ఎంత మందికి తెలుసు? భార్యాభర్తలు సెక్సుసుఖం అనుభవించటం దగ్గర్నుంచీ నేర్చుకోవలసిందే. రోజూ కావలసిన ఈసుఖం గురించి విద్యద్వారా ఏం తెలుస్తుంది ?

5. ఈయుగంలో మనిషి రాజకీయాలను తప్పించుకుని జీవితంలో ఒక్క అడుగు వెయ్యలేడు. ప్రతి వయోజనుడికీ, తన రాజకీయ ప్రతినిధిని ఎన్నుకునే హక్కున్నది. పదిరూపాయలు పుచ్చుకుని ఓటు వెయ్యటం అక్షరజ్ఞానం లేని ఏ ముసిలి ముండైనా చెయ్యగలదు. కాని తనవోటు ఎవరికి వెయ్యాలో తెలుసుకునే పరిజ్ఞానం గలవాళ్ళు ఈ దేశంలో ఏ శాతం వున్నారు? వారికాపరిజ్ఞానం విద్యద్వారా ఎంతవరకు లభిస్తున్నది?

అమెరికాలో ప్రతి కుర్రవాణ్ణీ'' నువ్వు ప్రెసిడెంటువి కాగలవు!'' అని ఆశీర్వదిస్తారుట. ఇది అబద్ధం. అమెరికాలోనే ఒక వందమంది పిల్లలను తీసుకుని ''మీరెవరూ ప్రెసిడెంటు కాలేరు'' అని చెప్పవచ్చు. వారంతా నీగ్రోలో, క్రైస్తవేతరులో, ఇతర దేశాల నుంచి కొత్తగా వలస వచ్చినవారో అయితే ఈ మాట అక్షరాలా నిజమవుతుంది. వాళ్ళు కార్మికుల పిల్లలయినా నిజమే అవుతుంది.

ఈయుగంలో ఒక గృహాలంకరణ చేసేవాడో, చిన్న తనంలో పత్రికలు అమ్ముకున్నవాడో అగ్రనాయకుడైన సందర్భాలు లేకపోలేదు. హిట్లరు, ముసోలినీ, స్టాలిన్, మావో లాటి వాళ్ళను చిన్నతనంలో చూసి ఎవరూ వాళ్ళు మహానాయకులవుతారని మాటవరసకైనా అని ఉండరు; అయినా వాళ్ళు అయ్యారు. అది ఎంత విడ్డూరమంటే వారి వల్ల చరిత్రలే తారుమారయాయి. ఇంతకు చెప్పవచ్చిందేమంటే ఈనాడు విద్యకూ, అవిద్యకూ ఆటే తేడాలేదు. బతకటానికీ, జీవితాన్ని చక్కగా అవగాహన చేసుకోవటానికీ అనుకూలంగా మారినదాకా మనకు ఒక విద్యావిధానం అంటూ ఉన్నదని చెప్పలేం. విద్య రూపంలో మనం నేర్చుకునేది చాలా వరకు పనికి మాలిన చెత్త. దాన్ని వదలించుకున్నవాడు అదృష్టవంతుడు, బాగుపడవచ్చు. దాన్ని నమ్ముకున్నవాడు తప్పక చెడిపోతాడు, పడిపోతాడు, మరిలేవడు.

*ముద్రణ 1971 ఫిబ్రవరి ఉపాధ్యాయ*

## 7. జీవితంలో కొన్ని వైరుధ్యాలు

జీవితంలో ప్రతివాడూ ఎదుర్కొనేవైరుధ్యాలు అందరికీ తెలిసినవే. ఇవి అధిక సంఖ్యాకులైన తక్కువ తరగతి, మధ్య తరగతులలో కనిపించేవి. చాలా వరకు వీటివెనకేదో అభావం వుంటుంది. పనిచేసుకునే శక్తి వుంటుంది, పని దొరకదు. చేతిలో డిగ్రీ వుంటుంది. ఉద్యోగం దొరకదు. జీర్ణించుకునే శక్తి వుంటుంది. తిండికి

డబ్బుండదు. పెళ్ళికి ఎదిగిచ్చిన కూతుళ్ళుంటారు. కట్నాలుపోసే శక్తి వుండదు. వచ్చిన రోగానికి షాపుల్లో మందులుంటాయి. కొనటానికి డబ్బు వుండదు.

ఇలా జీవితాన్ని దుర్భరంచేసే వైరుధ్యాలు జీవితంలో కొల్లలు. ఇవి మన సాంఘిక వ్యవస్థ నుంచి ఉత్పన్నమైనవే ఎందుకంటే ఇలాంటివైరుధ్యాలను అంతం చేసుకున్న వర్గరహిత సమాజాలు ఈనాడు అనేక దేశాలలో వున్నాయి. ఎవడో నీటిలో పడుతుంటే చూస్తూ వుండిపోయే ఈతగాళ్ళను మనం మనుషులని అనుకోము. ఎవడన్నా దాహంతో చస్తుంటే నీళ్ళు పొయ్యని వాణ్ణి మనం పశుప్రాయుడుగా భావిస్తాం. అలా భావించటం సబబే అయితే ఈమన సమాజంలో మానవత్వం లేదు, పశుత్వం వున్నది.

ఎందుకంటే - ఈ సమాజంలో అభావం మనుషులను పొట్టన బెట్టుకుంటు న్నది. ఒకడు సిగిరెట్లకిందను, తాగుడుకిందను, ముండలకు ఒక్క రోజులో ఖర్చుపెట్టే మొత్తం లేని కారణంచేత జనం ఆకలితో అలమటిస్తున్నారు. నయం కాదగిన రోగాలతో తీసుకుంటున్నారు ఒక ఆంగ్లకవి అన్నట్టు సంపద పెరుగుతున్న కొద్దీ మనుషులు తరుగుతున్నారు (మానవత్వంలో)

నేనిక్కడ చర్చించదలచినవి ఈ వైరుధ్యాలు కావు.

మానవ సమాజంలో రెండు తాత్విక దృక్పధాలున్నాయి. ఒకటి భౌతికవాదం; రెండు ఆధ్యాత్మికవాదం. ఈరెంటిమధ్యా వైరుధ్యం వున్నది.

భౌతికవాదికి శ్రమలోనూ, విజ్ఞానంలోనూ, ఇహజీవితాన్ని చక్కబరచుకోవటం లోనూ పూర్తి విశ్వాసం వుంటుంది. అతను హేతువాది. అభివృద్ధికి అడ్డంగావున్న అంశాలేమిటో గ్రహించి, వాటిని తొలగించే మార్గాలు ఏమిటో ఆలోచించి, తద్వారా జీవితాన్ని అభివృద్ధి పరుచుకుంటాడు. భూమిమీద జరిగే ఘటనలకు కారణాలను ఊర్ధ్వలోకాలలో వెతకడు. ఈ లోకంలోనే వెతుకుతాడు. సకల శాస్త్రాలూ, నాగరికతా, యంత్ర పరికరాలూ, సుఖజీవనోపాయాలూ భౌతికవాదం నుంచి పుట్టినవే.

ఈనాడు మనం వుండే ఇళ్ళు భౌతిక పదార్థాలతో ఏర్పడినవే గాక, శ్రమ ఫలితంగా లభించినవి. మనం తినే కూరలూ, ధాన్యాలూ వాటంతట అవి పుట్టినవి కావు. భౌతికశాస్త్రజ్ఞులు కృత్రిమంగా ఉత్పత్తి చేసినవి. భౌతికవాదం అవిచ్ఛిన్నంగా పెరుగుతూ రావడం చేతనే మనం గుర్రాలకన్న వేగంగానూ, పక్షులకన్న ఎత్తుగానూ ప్రయాణం చెయ్యగలుగుతున్నాం. మనం ఈనాడు వాడే ఔషధాలలో దాదాపు అన్నీ- విటమినులతో సహా - కృత్రిమమైనవి. ఈ మందులే మన ఆయుర్దాయాన్నీ, జనాభాను పెంచుతున్నాయి. మనం అటవికదశలో వుండిపోక నాగరిక దశకు వచ్చామంటే అందుకు కారణం విజ్ఞానాభివృద్ధీ, శ్రమ ఫలితాల అభివృద్ధీనూ.

రెండో వాదం ఆధ్యాత్మికవాదం: దేవుడు, పరలోకం, పునర్జన్మ, విధి, వీటిని ఎవరూ సరిగా నిర్వచించలేరు. నిర్వచనానికి అందక పోవటమే వాటిగొప్పతనంట! ఉద్యోగాలను సృష్టించే వారు మనుషులు, వాటిని ఇప్పించేది మాత్రం దేవుడట! మనిషి

గాలిలో ఎగిరే విమానాన్ని సృష్టించినదాకా దేవుడు పైలట్ ఉద్యోగాలు సృష్టించలేక పోయాడు! విస్కీ బ్రాందీలు విదేశాలనుంచి దిగుమతి అయేదాకా ఎవడికీ వాటిని తాగే యోగం విధి కలిగించలేకపోయింది!

ఆధ్యాత్మికవాదం మతం పేర ప్రచారమవుతూ వస్తున్నది కాని మతమే భౌతికవాదానికి లొంగిపోయింది. తిరుపతికి వెళ్ళి తలలు గొరిగించుకునేవారు ఉత్తమ లోకాలు కాదు కోరేది - ఉద్యోగాలూ, డబ్బూ, లాటరీలో లాటూ, గుర్రప్పందాల్లో జాక్‌పాటూ, సినిమా చిత్రానికి శతదినోత్సవాలూ వగైరా, వగైరా

వేదకాలంవాళ్ళు తిండో, పశువులో అని ఆక్రోశించారు. వాళ్ళ వారసులమైన మనమూ భౌతికావసరాల కోసమే ఆక్రోశిస్తున్నాం. అయితే యిందులో తిరుగుడు యేమంటే, మన కోరికలు తీరటానికి భౌతికమైన మార్గాలే వున్నాయి. ఇప్పుడు మన కున్న ప్రభుత్వమే తీర్చగల కోరికలు చాలా వున్నాయి. ప్రభుత్వం మారితేగాని, రాజకీయ - సామాజిక వ్యవస్థ సాంతంగా మారితేనే గాని తీరని కోరికలూ వున్నాయి. అంటే విప్లవ పరిణామాలు రావాలి.

విప్లవం అనేది భౌతికవాదం నుంచి తప్పపుట్టజాలదు. విప్లవం అంటే విరుచుకుపడిపోయి నోట నురుగులు కక్కేవాళ్ళు అజ్ఞానులు. ఎందుచేతనంటే ఎన్నో విప్లవదశలు గడవకుండా మనం ఇక్కడిదాకా రాలేదు. గత సామాజిక విప్లవాల సత్ఫలితాలన్నిటినీ పుష్కలంగా అనుభవిస్తున్నవాళ్ళే భావి విప్లవాలను గురించి దడదడ లాడుతున్నారు. మనం ఇవాళ అత్యున్నతమైన సామాజిక దశకు పచ్చామనుకునే మూర్ఖులూ, ఈ వ్యవస్థలో సుఖజీవనం గడుపుతున్నామనుకునే వాళ్ళూ తప్ప విప్లవ పరిణామాలు రాగూడదని అనుకోరు.

ఆధ్యాత్మిక దృష్టిలో గల గొప్ప అనర్థం ఏమంటే దేవుణ్ణి నమ్ముకుని వంచించ బడినవాళ్ళు మనిషిచేత వంచించబడటానికి తగిన మనస్థితి కలిగివుంటారు. స్వార్థంకోసం దేవుడికి లంచాలు పెట్టటానికి సిద్ధమైనవాళ్ళు అధికారులకు లంచాలు పెట్టటం సంఘద్రోహం అనుకోరు.

మన సమాజంలో వున్న ప్రతి మూఢవిశ్వాసానికి ఆధ్యాత్మికవాదంతో సంబంధం వున్నది. దేవుడుంటే దయ్యాలూ, భూతాలూ, చేతబడులూ అన్నీ వుండవచ్చు.

స్త్రీని గౌరవించే మతం ప్రపంచంలో ఎక్కడా లేదు. శక్తి ఉపాసకులూ, తాంత్రికులూ, వామాచారులూ స్త్రీని ఆరాధించి ప్రకృతికి ప్రతీకగా చూసినమాట నిజమే. కాని వాళ్ళ ఆచారాలు మతాచారాలు కావు. వారంతా భౌతికవాదులు. మన దేశంలో శాస్త్ర గ్రంథాలను మొట్టమొదట రచించిన వారంతా ప్రకృతి ఉపాసకులైన తాంత్రికులేనని చెబుతారు.

స్త్రీ జాతికి హైన్యం వుండనట్టయితే ఆడపిల్లల తల్లి దండ్రులు వాళ్ళను వదిలించటానికి ముందు మనోవేదనా, అనంతరం ఆస్తులు అమ్ముకోవటాలూ చేస్తారా? కట్నాలను దీవించే వారిలో ఎంతమందికి మతం తమ కొంపలు తీస్తున్నదని తెలుసు?

.మత విశ్వాసాలు మంచితనం అనేదాన్ని మంట గలిపిన సంగతి చాలామంది గుర్తించరు పుణ్యకార్యాలు అనబడేవి - దానధర్మాలూ, పూజలూ, తీర్థయాత్రలూ, ఇతర దేవ కార్యాలూ - చెయ్యాలంటే డబ్బు వుండాలి. మంచితనం ఎందుకూ కొరగాదు ఎంత మంచివాడైనా గంజినీళ్ళకు మొహంవాచిన వాడు పుణ్య కార్యాలు ఏం చేస్తాడు? పుణ్యకార్యాలు చేసే శక్తి డబ్బున్న వాళ్ళకే పరిమితం చేసిన మతం ఎలాటి పాషండ మతమనాలి? ''సర్వే గుణాః కాంచన మాశ్రయంతే'' అని వెటకారం చేసిన కవి, కాంచనంతో జన్మరాహిత్యం కూడా వస్తుందని చెప్పటం మరిచాడు.

అంతేకాదు, భౌతికవాది దృష్టిలో డబ్బుచేసేవాడు పాపం చెయ్యకుండా వుండలేడు. రెండువందల రూపాయల నెలజీతం చాలా తక్కువజీతం, కాని అది ఈనాడు మన దేశంలో తలసరి ఆదాయానికి ఏడు రెట్లు అనేక వందలమంది తాలూకు తలసరి రాబడిగలవాళ్ళు మనకు తెలిసినవారిలోనే వున్నారు. వాళ్ళు అంత మందినీ కటిక దారిద్ర్యంలో వుంచుతున్నట్టేనా? ఇది సామాజికమైన పాపం కాదా? ఎవడి జేబైనా కత్తిరిస్తేనే పాపమా? ఇది కాదా?

భౌతికవాదం అర్థం చేసుకుని, దాని దృష్టితో జీవితాన్ని సింహావలోకనం చేసినట్టయితే మన జీవితంలో ఏ లోపాలున్నాయో తెలియటమే గాక, అవి ఎందుకున్నాయో, వాటిని ఎలా అధిగమించవచ్చునో స్పష్టమవుతుంది. మన తిండి అలవాట్ల దగ్గిర నుంచి ఉన్నత రాజకీయాల వరకూ అన్నీ కొత్తరంగులో కనిపిస్తాయి. మన కళలూ, సంస్కృతీ కూడా ఎందుకు మార్పు చెందాలో, ఎలా మార్పుచెందాలో తెలిసిపోతుంది.

ఏ విధంగా చూసినా భౌతికవాదం వెంట గాని సరి అయిన జ్ఞానం కలగదు. మన యువకులు జ్ఞానులు కావాలంటే భౌతికవాదాన్ని సమగ్రంగా అలవరుచుకోవాలి. ఆ జ్ఞానంతో జీవితంలోని లోపాలను ఎదుర్కొంటూ తమ జీవితానికి ఒక అర్థం కలిగేలాగు చూసుకోవాలి. ఒంటరిగా అధిగమించలేని సామాజిక వైరుధ్యాలను సమష్టిగా ఎదిరించాలి.

మన భౌతిక దృక్పధాన్ని ఆధ్యాత్మిక దృక్పధం రాహువు లాగా పట్టి పీడిస్తున్నది. మన ఇహవాంఛలకు మూఢవిశ్వాసాలు అడ్డువస్తున్నాయి. వాటిని దేవుడు అనే భావం తప్పు దారులు పట్టిస్తున్నది. దేవుడు పరీక్షల్లో మార్కులు వేయిస్తాడనీ, ఉద్యోగాలూ, డబ్బూ, ఆరోగ్యమూ ఇప్పిస్తాడనీ అనుకునే వాళ్ళకన్న మూఢులుండరు. కాని అలాటి మూఢులను లక్షల సంఖ్యలో చూస్తున్నాం. చదువుకున్నవారిలో కూడానూ.

భౌతికవాదాన్ని పెంపొందించలేని చదువు చదువుకాదు. హిరణ్యాకశిపుడికీ చదువంటే ఏమిటో తెలుసు. ''చదువులలో మర్మమెల్ల చదివితి, తండ్రీ!'' అన్న ప్రహ్లాదుడు గొప్ప వంచకుడు.

*ముద్రణ ఉపాధ్యాయ మాసపత్రిక ఫిబ్రవరి 1972,*
*పునర్ముద్రణ ప్రజాబంధు పక్షపత్రిక 1-3-1972*

# 8. పీఠిక

విద్యాభ్యాసం అంటే చదువుకోవటం అని మనం అర్థం చేసుకుంటాం. కాని ఇది పొరపాటు. లేఖనం అన్నది ప్రారంభమై ఏ అయిదు వేల సంవత్సరాలో అయింది, అంతకు ముందూ, తరవాత కూడా చదవటంతో సంబంధం లేని విద్య ఎంతో ఉన్నది. ఆదిమ మానవులు రాళ్ళతో ఆయుధాలూ, పరికరాలూ తయారు చెయ్యటం నేర్చుకునేవాళ్ళు; వాళ్ళ మనుగడ పూర్తిగా ఆ విద్య పైనే ఆధారపడి ఉండేది.

లేఖనమూ, పుస్తకరచనా వచ్చాక కూడా అత్యధిక సంఖ్యాకులు అనేక వేల సంవత్సరాలపాటు ''చదువు'' లేకుండానే సంపూర్ణమైన జీవితాలు జీవించగలిగేవారు. నిరక్షరులై ఉండి కూడా శిల్ప ప్రవీణులూ, గాయకులూ, ఇతర వృత్తుల వాళ్ళూ తమకు కావలసిన విద్యాభ్యాసం అనుభవం ద్వారా సంపాదించుకున్నారు. 'చదువు' ఉన్నప్పటికీ అప్పటి పరిస్థితులలో వారి జీవితాలు అంతకన్న మెరుగుగా ఉండేవి కావని నిస్సందేహంగా చెప్పవచ్చు. ఒక్క మాటలో చెప్పకోవాలంటే, ప్రతి దేశానికీ, కాలానికీ దానికి తగిన విద్యావిధానం ఉంటూనే వచ్చింది.

ఎటొచ్చీ ఆధునిక యుగంలోనే అవసరమైన చదువుకూ, అమలులో ఉన్న చదువుకూ మధ్య వ్యత్యాసం పుట్టుకొచ్చింది. దీనికి అనేక కారణాలున్నాయి. మొదటిది, విద్యకు 'చదువు' పునాది అయింది. ఆధునిక ప్రపంచంలో ఉత్త అనుభవం మనిషికి చాలదు. అనేక విషయాలు పుస్తకాలద్వారా మాత్రమే తెలుస్తాయి. పుస్తకాల ద్వారా తెలుసుకోవలసిన విషయాలు నానాటికీ పెరుగుతున్నాయి. యాభైయేళ్ళ క్రితం వైద్యపరీక్షలు పాసయినవాడు ఆనాడు తాను సంపాదించిన వైద్యవిజ్ఞానంతో ఈనాడు వైద్యం చెయ్యలేడు. ఒక్క వైద్యశాస్త్రమే కాదు, అన్ని రకాల విజ్ఞానమూ సాంకేతిక పరిజ్ఞానమూ, అపారంగా పెరిగిపోతున్నది.

మరొక విషయమేమంటే, వర్గసమాజంలో వేరువేరు వర్గాలకు కావలసిన చదువు వేరు వేరుగా ఉంటుంది. దోచుకునేవర్గాలు చదువుకు ఇచ్చే ప్రాముఖ్యం దోచుకోబడే వర్గాలకు ఉండదు. వర్గ దోపిడీ ఆరంభదశలో అత్యధికసంఖ్యాకులకు

చదువు అందుబాటులో లేకుండా ఉంచటం జరుగుతుంది. ముఖ్యంగా వలస విధానం అమలు జరిగే దేశాలలో అక్షరాస్యులు పది, ఇరవై శాతం మించి ఉండరు.

దేశానికి పరాధీనత తొలగిపోయి, బూర్జువా సంస్కృతి అమలు జరిగినాక నిరక్షరత తొలగించే కార్యక్రమం కొనసాగుతుంది. కాని ''విద్య'' అన్నది డబ్బుగల వారికి అనుకూలంగా ఉంటుంది. ఖరీదుగా కూడా ఉంటుంది. సిద్ధాంతం ప్రకారం ఎవరైనా చదువుకోవచ్చు కాని చదువుకునే స్తోమతు అడుగు వర్గాలకు ఉండదు. అదీగాక పెట్టుబడిదారీ దేశాలన్నిటా నిరక్షరత నిర్మూలమయిందన్న కట్టుకథను మనం నమ్మనవసరం లేదు. అమెరికాలో ప్రధానోపాధ్యాయులకే ఇంగ్లీషు సరిగా రాదని ఇటీవలే వార్త వచ్చింది. ఇంగ్లండులో నిరక్షరులు చాలామంది ఉన్నారు.

మూడో విషయమేమంటే, వర్గ సమాజంలో విద్యకూ, జీవితానికీ మధ్య అడ్డుగోడలు ఏర్పడినాయి పది హేనేళ్ళు విద్యాభ్యాసం చేసి పట్టాపుచ్చుకుని, విద్యార్థి తాను గుర్తించలేని ప్రపంచంలోకి అడుగుపెడతాడు. తన చదువును, జీవితానికి ఎలా ఉపయోగించుకోవాలో తెలియక దిగ్భ్రమ చెందుతాడు. ప్రపంచంలో అత్యధిక సంఖ్యాకుల శ్రమ ఫలితంగా వినియోగ వస్తువులు తయారవుతున్నప్పటికీ, తాను చేతులు ఉపయోగించి ఏది చెయ్యలేడు సరికదా, అలా చేతులు ఉపయోగించి అన్నీ తయారు చేసేవాళ్ళు తనకన్న హీనులన్న భావాన్ని ఒకంతట వొదిలించుకోలేడు. ''చదువు'' రాని వాళ్ళలో అతడికి ''అజ్ఞానమే'' కనబడుతుంది, కాని వాళ్ళ 'వివేకం' కనబడదు

మనం ఈనాడు అన్ని విధాలా పనికిమాలిన విద్యావిధానాన్ని అనుభవిస్తున్నాం. పైపై సంస్కరణలు దీన్ని బాగుచెయ్యలేవు. సంస్కరణలద్వారా ఏదో లాభం కలుగుతుందన్నది వట్టి భ్రమ.

విప్లవానికి పూర్వం చీనా మనకన్నా కూడా అనేక విధాల అన్యాయంగా ఉండేది. అక్కడి స్త్రీలూ, కార్మికులూ నరకయాతనలు అనుభవించే వారు. నగరాలు నరక కూపాలకన్న ఘోరంగా ఉండేవి. అందుచేత చీనాలో నూతన విద్యా విధానం 1949 నుంచే ఆరంభమయింది. కేడర్లందరూ కనీసం 1500 మాటలు నేర్చుకోవాలన్న నియమం నాకు తెలిసినంత వరకు మొదటిది. వెంటనే పిల్లలకోసం లక్షలకొద్దీ పుస్తకాలు అచ్చువేశారు. పిల్లలు బడులు వదలిపెట్టగానే పుస్తకాల షాపులమీదపడి, తలా ఒక పుస్తకమూ తీసుకుని చదివి, మళ్ళీ ఎక్కడి పుస్తకాలు అక్కడ పెట్టిపోయేవారు.

చీనాలో '' ఇన్‌స్టింక్టివ్''గా ప్రారంభమైన విద్యావిధానం అనేక పరిణామాలు చెందింది. దాని లక్ష్యాలు 1966-69 సాంస్కృతిక విప్లవంనాటికికూడా రూపొందు తూనే ఉన్నాయి. ఏమిటీ లక్ష్యాలు?

సమసమాజంలో అన్నిరకాల వ్యత్యాసాలకూ స్వస్తి చెప్పాలి స్త్రీలకూ, పురుషులకూ; శ్రామికులకు, మేధావులకూ; నగరాలకూ, పల్లెలకూ, పరిశ్రమలకూ, వ్యవసాయానికీ, అధ్యాపకులకూ, విద్యార్థులకూ - ఇలాంటి ద్వంద్వాలకుమధ్య ఉండే

వైరుధ్యాలను పరిష్కరించటమే చీనా ప్రజా జీవితలక్ష్యం, ఇదే లక్ష్యం విద్యావిధానంలో ద్యోతకం కావటానికి విస్తృతమైన కృషి జరుగుతున్నది

చదువూ, అనుభవమూ కలిస్తేగాని చీనాలో విద్య పూర్తి కాదు పిల్లలు వ్యవసాయం పనులూ, కార్ఖానా పనులూ నేర్చుకుంటారు చిన్నతనంనుంచి స్వయంపోషకత్వం - తమ పనులు తాము చెయ్యటం - నేరుస్తారు. దేశ రక్షణకోసం ప్రతీ పౌరుడూ సైనికశిక్షణ పొందుతాడు.

అన్నిటికన్న కష్టమైనది పాత చీనా సామాజిక మనస్తత్వాన్ని సోషలిస్టు జీవితానికి అనుగుణంగా మార్చటం. అందులో బూర్జువా అవశేషాలను సమూలంగా నిర్మూలించటం. దీని అవసరం సాంస్కృతిక విప్లవం స్పష్టం చేసింది.

చీనీయులను తీర్చిదిద్దటానికి అక్కడి విద్యావిధానం ఎలా ఉపయోగపడుతున్నదీ ఈ చిన్న పుస్తకం చదివితే మనకు చాలవరకు తెలుస్తుంది. ఈ విద్యావిధానం మనకు పనికిరావచ్చు మరొక శతాబ్దం గడచినమీదట చీనాకే పనికిరాకపోవచ్చు. కాని జీవితలక్ష్యాలకు విద్య ఏవిధంగా సహకరించాలో ఈ పుస్తకం చదివితే మనకు సూత్రప్రాయంగా అర్థం అవుతుంది మనం కూడా మన జాతీయ లక్ష్యాలను స్పష్టంగా నిర్వచించగలిగినప్పుడు వాటికి అనుగుణంగా మన విద్యావిధానాన్ని రూపొందించుకోవాలన్న నీతిని మనం ఈ పుస్తకంనుంచే నేర్చుకోగలం.

*'సమసమాజంలో విద్య' - జనచైనాలో విద్యావిధానం సంకలనం,*
*అనువాదం - సి రాంప్రసాద్, సమతా ప్రచురణలు, అక్టోబరు 1974*

# 9. విద్యావిధానాలు

(విద్య అంటే ఏమిటి? విద్యార్థికి ఎలాంటి జ్ఞానం కావాలి? విద్యావిధానాలలోవచ్చే మార్పులేమిటి? వాటికిగల కారణాలేమిటి? ఈనాడు క్రమంగా ప్రపంచ విద్యావిధానాలలో అనివార్యంగా రూపొందుతున్న లక్ష్యమేమిటి? ఈనాడు ప్రపంచాన్నంతా ఆకర్షిస్తున్న విద్యావిధానమేమిటి? జీవితానికీ, విద్యకూ ఉండవలసిన అవినాభావ సంబంధమేమిటి? నిజమైన జాతీయ విద్య స్వరూప స్వభావాలేమిటి? ప్రభుత్వాలకూ, విద్యా విధానాలకూ గల పరస్పర సంబంధం ఎటువంటిది? నిజమైన విద్య రూపొందే మార్గమేది? మొదలైన విషయాలపై రచయిత చేసిన వాస్తవిక శాస్త్రీయ వివేచనను యీ వ్యాసంలో గమనించగలరు. సం )

విద్య అంటే జ్ఞానం సంపాదించటం. జ్ఞానం రెండు విధాలు · పుస్తకజ్ఞానమూ, అనుభవ జ్ఞానమూ. ఈ రెండురకాల జ్ఞానమూ విద్య ద్వారా లభ్యం కావాలి.

విద్యార్థికి ఎలాంటి జ్ఞానం కావాలన్నది దేశ కాల పరిస్థితులను బట్టి నిర్ణయమవుతుంది. అవి మారుతూ ఉంటాయి గనక ఏ విద్యా విధానమూ ఈనాడు

శాశ్వతంగా అమలు జరగదు. ఈ విషయంలో సంప్రదాయానికి ప్రసక్తి లేదు. గురుకులాలు పోయాయి. ఆధునికయుగంలో ప్రపంచమంతటా విద్యావిధానం ఏకలక్ష్యం గలదిగా ఉంటున్నది - ఒకే పద్ధతిలో సాగకపోయినప్పటికి ఈ కారణంగా ఒక దేశాన్ని చూసి మరొక దేశం నేర్చుకునే అవకాశంకూడా ఉంటున్నది. 1930 ప్రాంతంలో అనుకుంటాను, ఒక బ్రిటిషు విద్యావేత్త Can We Compete? అని ఒక వ్యాసం రాస్తూ జర్మనీలో ఇంజనీర్లు తయారయే పద్ధతులను మెచ్చుకున్నాడు ఆ కాలంలో జర్మనీలో రెండో సంవత్సరపు ఇంజనీరింగు చదివే విద్యార్థి మొదటి సంవత్సరం చదివే వాడికి బోధకుడుగా ఉండగలిగేవాడట. అది సరి అయిన విద్యాప్రమాణం అనటానికి సందేహం లేదు. 35 మార్కుల పాసుగాళ్ళు మళ్ళీ పరీక్ష పెడితే తప్పరని, గ్యారంటీ ఉండదు. డబ్బిచ్చి మార్కులు వేయించుకునే వాళ్ళమాట చెప్పేదేమిటి?

కొద్దిసంవత్సరాల క్రితం అమెరికనులు రష్యాలోని విద్యా విధానాన్ని మెచ్చుకోవడంచూశాను. రష్యాలో ఏడో తరగతి విద్యార్థికి ఉత్తమ సాహిత్యం చదివేశక్తి లభించేదట. ఇది మెచ్చదగిన సంగతే కద.

ఇప్పుడు చీనాలో అమలులో ఉన్న విద్యా విధానం మన దృష్టిని బాగా ఆకర్షిస్తున్నది. ఈ విద్యావిధానంలో విశిష్టత పుస్తక జ్ఞానాన్నీ, అనుభవ జ్ఞానాన్ని కలగలపటం. వెనక్కు తిరిగిచూసుకుంటే ఆశ్చర్యం కలుగుతుంది. 1921 లో మా ఊళ్ళో ప్రారంభించిన జాతీయ పాఠశాలలో నన్ను ఆకర్షించినవి చేతి పనులు. పెద్దలు నన్ను ఆపకపోతే నేను అందులో చేరి ఉండేవాణ్ణి. అయినా ఒక సంవత్సరం పాటు నేను వారానికి ఒక గంట చొప్పున వడ్రంగం నేర్చుకున్నాను. మరుసటి సంవత్సరం లో మూడు నెలల పాటు మంచాన పడకపోతే నేను మంచి వడ్రంగిగా తయారు కావలసినవాణ్ని. మా మేష్టరు నా పనితనాన్ని మెచ్చుకునేవాడు.

ఏ విద్యా విధానమైనప్పటికి అది విద్యార్థిని జీవితానికి అనుకూలంగా మలుస్తున్నదా లేదా అన్నది మొట్టమొదటి సమస్య. '' ఉన్నత విద్య'' చదివినవాడు జీవితానికి విలక్షణంగా తయారైతే చెత్తకుప్ప మీదికో, విదేశాలకో పోతాడు. విద్యాలయాలు జీవితంలో అంతర్భాగాలుగా ఉండాలి గాని అగడ్తలుగల కోటలుగా ఉండరాదు. విద్యాలయాలనుంచి బయటికి వచ్చినవాడు దేశాంతరంలో అడుగుపెట్టినట్టుగా తలచరాదు. కాని మన దేశంలో ఎంతో కాలంగా అదే జరుగుతూ వస్తున్నది. చదువుకున్న వాళ్ళ కన్న చాకలివాళ్ళు మేలుగానే ఉంటున్నారు.

నేను జాతీయవాదినికాను, కాని అనేక విషయాలలో జాతీయ దృక్పథాలకు విలువ ఇస్తాను. విద్యలో జాతీయత అవసరం. అది లేనప్పుడు విద్యార్థి అలవరచుకుంటున్నది అంతర్జాతీయత కాదు విజాతీయత. అదీ ఒక జాతీయతే. చదువుకున్న వాళ్ళలో కొందరు '' ఆంగ్లమానసపుత్రులు'' గా ఉండేవారని ఒకప్పుడు అనేవారు. 'ఆంగ్లమానస పుత్రులు' , 'అమెరికా మానస పుత్రులు' అంతర్జాతీయ వాదులు కారు

విద్యావిధానంలో లోపించినది జాతీయత. ఈ జాతీయతను హిందూత్వంత దురహంకారంలోనూ, ప్రాచీన సంప్రదాయాలలోనూ, పిలకజుట్టు లోనూ చూడటం అవివేకం. అది ప్రజాజీవితంలోనే చూడాలి ప్రజా సంస్కృతిలో చూడాలి. ఈ విజాతీయత మనకు విద్యాలయాలలోనే గాక సాహిత్యంలో కూడా కనిపిస్తూనే ఉన్నది.

మామూలు పాఠశాలలు ఎంత దౌర్భాగ్యపు స్థితిలో ఉన్నా యంటే, స్థితి మంతులు తమ పిల్లలను పసితనం నుంచీ కాన్వెంటు పాఠశాలలో చేర్పుతున్నారు. వాళ్ళు అక్కడ నేర్చుకునేది పచ్చి విజాతీయ సంస్కృతీ, పనికిమాలిన మత బోధలూ, జీవిత దృక్పథాలూనూ, ఇలాంటి చదువులో ఉత్తీర్ణులైన వారికన్న పారా పలుగు పట్టుకుని పనిచేసే నిరక్షరులే దేశ భవిష్యత్తుకు నిజంగా పునాదులు తవ్వుతున్నారు.

ఇతర దేశాలలో విద్యావిధానాలు ఎలా ఉన్నాయని చూడటం మంచిదే, అవసరమేకూడానూ, కాని అందువల్ల కలిగే ప్రయోజనం చాలా పరిమితమైనదని నా నమ్మకం. రష్యా, చీనాలలో ఉండే విద్యావిధానాలు అక్కడి ప్రభుత్వాలు రూపొందిస్తున్నవి. పెట్టుబడి దారీ దేశాలలో ఉండే విద్యావిధానం అరాజకంగా ఉంటుంది.

సోషలిస్టు దేశాలలో ఈ అరాజకం ఉండదు. ఈ పెట్టుబడిదారీ దేశాలే సామ్రాజ్యాలు పెలగబెట్టితే వలసలలో మరోరకం విద్యావిధానాన్ని అమలు చేస్తాయి.

స్థూలంగా ఒక్క మాట చెప్పుకోవచ్చు. ఏ ప్రభుత్వమైనా తన మనుగడకు పనికివచ్చే విద్యావిధానాన్నే అమలు కానిస్తుంది. అదికూడా చేత గాని ప్రభుత్వం వాజమ్మ ప్రభుత్వమన్నమాట. అలాంటి దిక్కుమాలిన ప్రభుత్వంకూడా తనకు ప్రమాదం కలిగించే విద్య విధానాన్ని అమలు చెయ్యదు. నిషేధాలతో ఆత్మరక్షణ చేసుకుంటుంది.

ఈ కారణంచేత ప్రజాక్షేమానికి పనిచేయని, ప్రజల పరం కాని ప్రభుత్వం సరయిన విద్యావిధానాన్ని అమలు చెయ్యదు. అమలు జరగనివ్వదు. మన ఈనాటి ప్రభుత్వం తన అవసరాలకు తగిన విద్యావిధానాన్ని కూడా అమలు చెయ్యలేని దుస్థితిలో ఉన్నది. పాపం, ప్రజల పక్షం నుంచి చూస్తే దేశానికి వర్తమానం ఏమీ లేదు. భవిష్యత్తు మాత్రమే ఉన్నది. ఈ భవిష్యత్తుకు కావలసిన విద్య ఎక్కడ లభ్యమవుతుంది. టాగూరు గారు చెట్ల క్రింద పాఠాలు చెప్పే పద్ధతి పెట్టాడు. భవిష్యత్తుకు కావలసిన విద్య ఈనాడు అడవుల లోనూ, కొండలలోనూ లభ్యమవు తున్నది. ఏవో సంస్కరణలు తెచ్చి ఈనాటి విద్యావిధానాన్ని వర్తమాన పరిస్థితిని చక్కదిద్దుకునేటట్టు రూపొందించవచ్చునన్న నమ్మకం ఎంత ప్రయత్నించినా నాకు కలగకుండా ఉన్నది. దేశానికి నిజమైన భవిష్యత్తు రూపొందినప్పుడే దానికి అనుగుణంగా సరియైన విద్యావిధానం రూపొందుతుందని అనుకుంటున్నాను.

*ఉపాధ్యాయ 1974, ఫిబ్రవరి*

ఆఆఆఆ

# 1. మహాలశక్తి

బాగా చదువుకుని, ఆధునిక విజ్ఞానం గలవాళ్ళు దేవుణ్ణి నమ్మటానికి వైజ్ఞానిక కారణాలు వెతుక్కుంటున్నారు. అటువంటి వెతుకులాటలో వారికి దొరికేది శక్తి ఈ కనిపించే జగత్తును సృష్టించినది ఏదో ఉండాలి గదా! దాన్ని నియమబద్ధంగా నడిపించే శక్తి ఒకటి ఉండాలి కదా!

ఇది అట్టే ఆధునికమైన వాదం కూడాకాదు ఒక దశలో మానవుడు ఆదిశక్తిని ఆరాధించాడు పురుషుడి కన్న స్త్రీ మానవ పురోగమనంలో హెచ్చు పాత్ర నిర్వహిస్తున్నట్టు కనిపించిన కాలంలో భూమాత , ఆదిశక్తీ, మాతృదేవతలూ దేవుడి స్థానం ఆక్రమించారు.

తరువాత సామాజిక పురోగమనంలో పురుషుడి పాత్ర ప్రధానంగా కనిపించినప్పుడు పురుషుడు దేవుడయాడు.

శక్తి స్త్రీలింగం, పురుషుడు పుంలింగం. ఒక దశలో దేవుడి లింగం మారేటప్పుడు లింగమూ, యోని కలిసి ఆరాధించ బడ్డాయి.

ఆధునికులు ఒక శక్తి రూపంలో దేవుణ్ణి గుర్తించి ప్రయత్నించటంలో కొత్తదనం లేదు సరికదా శాస్త్రీయ దృష్టి కూడా లేదు. ఎందుకంటే, శక్తి పదార్థాన్ని సృష్టించదు. పదార్థం నుంచి శక్తిని వేరు చెయ్యటానికి లేదు. పదార్థం నుండి అనేక శక్తులను మనం ఉత్పత్తి చేస్తున్నాం, ఇంధనాల నుంచి వేడి, రసాయన ప్రక్రియల నుంచి విద్యుత్తు, అణువిచ్ఛిత్తి, సంయోగాల నుంచి అణుశక్తి, కాని విడుదల అయిన శక్తి పదార్థం ద్వారానే మనకు ద్యోతకమవుతుంది.

మరొకటి ఏమిటంటే, మనం శక్తిని గుడ్డి గా పనిచేసేది గానే ఊహించగలం. శక్తికి స్వయం నిర్ణయాధికారం లేదు. దాని వల్ల కలిగే ప్రయోజనాన్ని అది నిర్ణయించలేదు. వర్షాలు భారీగా కురిసి, వరదలు వచ్చి ఇళ్ళు కూలేటప్పుడూ, మనుషులూ, పశువులూ, బాధ పడేటప్పుడూ వర్షం యొక్క ఆశయాలు నెరవేరటం అంటూ ఉండదు. ఫలాని ఇళ్ళు కూలాలనీ, ఇంత పంట పాడు కావాలనీ, ఇన్ని పశువులూ, మనుషులూ చావాలనీ వర్షం ముందుగా నిర్ణయించదు. కానిదేవుణ్ణి ఒక శక్తిగా భావించే వాళ్ళు ఆ శక్తికి ఆశయాలు అంట గట్టక తప్పదు! లేకపోతే శక్తి స్వరూపుడైన దేవుడు బ్రైబాటరీలో ఉండే విద్యుత్తు కన్నా, ఎండు పుల్లలలో ఉన్న అగ్నికన్నా ఏమంత గొప్పకాదు- ఈ శక్తులు ఎవరైనా బయటికి తెస్తే తప్ప కదలవు పని చెయ్యవు. అవిచేసే పనిని నిర్ణయించేవి కూడా అవి కావు.

అయితే ప్రకృతిలో గుడ్డి శక్తులతో బాటు లక్ష్యంతో కూడుకున్న శక్తులు కూడా కనిపిస్తాయి ఇవి ముఖ్యంగా జీవపదార్థం వెంట ఉన్నట్టు కనిపిస్తుంది ప్రతి బీజం నుంచి దాని తాలూకు ప్రాణి ఉద్భవిస్తుంది వేపచెట్టు తయారు కావటానికి అవసరమైన పదార్థాలన్నీ వేప విత్తులో లేకపోవచ్చు, కాని వేప చెట్టు సృష్టి కావటానికి అవసరమైన శక్తి ఏదో వేప విత్తులో వున్నట్టు కనిపిస్తుంది

ఇలాటి ఉదాహరణల సహాయంతో మానవులు సృష్టియొక్క ఒక బుద్ధి ఉన్నదనీ, అదే దేవుడనీ నమ్మారు దేవుడి నిర్వచనాలలో ఒకటి బుద్ధి స్వరూపుడు

జీవపదార్థం వెంట ఉండే శక్తులకు లక్ష్యం ఉన్నదని ఒప్పుకున్నా అది గుడ్డి శక్తి కాదనటానికి లేదు నిప్పు నీటిని మంచుగా తయారు చేయటం ఎంత ఊహించరానిదో వేప విత్తు నుంచి మఱ్ఱిచెట్టు రావటం కూడా అంతే ఊహించరానిదే

ప్రతి బీజం నుంచీ ప్రతి ప్రాణి పుట్టేటట్లు చేస్తున్నది దేవుడే అని అనుకుంటే ఆ దేవుడికి ప్రకృతి నియమాలను అస్తవ్యస్తం చేసే శక్తి ఉన్నట్టు కనబడదు

ఈ సందర్భంలో మనం రెండు విషయాలు గుర్తు ఉంచుకోవాలి

ఒకటి, నిర్జీవ పదార్థానికి కూడా లక్ష్యం ఉండేటట్టు చేయవచ్చు పడుకుంటే కళ్ళు మూసుకుని, కూర్చుంటే కళ్ళు తెరిచే బొమ్మలు ఉన్నాయి కీ ఇస్తే నడిచేవి, డప్పులు వాయించేవి, తలా, కాళ్ళూ, చేతులూ – ఆడించేవీ రకరకాల అద్భుతమైన బొమ్మలున్నాయి. వీటిలో ప్రాణం లేదు. ఈ బొమ్మలకు లక్ష్యం ఆపాదించే బుద్ధి ప్రతి ఒక బొమ్మకి ప్రత్యేకంగా సృష్టించాలి విత్తునుంచి చెట్టూ, చెట్టు నుంచి విత్తూ వచ్చినట్టుగా లక్ష్యం నిర్జీవ పదార్థంలో నిక్షిప్తం అయిపోదు

రెండు, ఏ జీవ పదార్థానికి గల లక్ష్యసాధన శక్తి ఎంత – గుడ్డిది అనుకున్నా, అది లక్ష్యాలను సాధించే పద్ధతులు మహామేధావి అయిన మానవుడికి పూర్తిగా అర్థం కాలేదు, బహుశా ఎప్పటికీ కావు

ఏక కణజీవిగా ప్రారంభమయ్యే మనిషిని తీసుకుందాం. దాని నుంచి అనేక రకాల కణజాతులూ, ధాతువులూ పుట్టుకొస్తాయి; అవి మనిషి శరీరాన్ని సవ్యంగా వుంచటానికి రకరకాల యాంత్రిక, రసాయనిక, విద్యుత్ ప్రక్రియలు తామే చేస్తాయి. అవిచేసే పనిని ఒక్క పీసం అర్థం చేసుకున్న వాడు గొప్ప శాస్త్రవేత్త! ఉదాహరణకు, మనం ఏ పదార్థం తింటే పచనం చెయ్యగల రసాయనాన్ని జీర్ణకోశం సృష్టిస్తుందీ, తినే ఆహారానికి, దాన్ని జీర్ణం చేసే ద్రవాలకూ గల సంబంధం తెలుసుకోవటం మనిషికి గొప్ప విజ్ఞానం. కాని జీర్ణకోశానికి స్వతస్సిద్ధంగా తెలుసు

మనం తెలుసుకోవటం అనేది మెదడుకూ, జ్ఞానేంద్రియాలకూ, మనస్సుకూ, పరిమితం చేస్తాం అలాగే జ్ఞానం అనేదాన్ని సంచిత జ్ఞానానికే పరిమితం చేస్తాం -అయితే

జాత్యం ద్వారా ప్రాణులకు సంక్రమించే సహజ జ్ఞానమూ, శరీర ధర్మాలను నిర్వర్తించే లక్ష్యసాధనా జీవ పదార్థానికి ఉన్నమాట స్పష్టం.

జీవపదార్థానికే తెలివీ జ్ఞానమూ ఉండి నిర్జీవపదార్థాన్ని జీవపదార్థంగా మార్చుకునే శక్తి జీవపదార్థానికి, జీవపదార్థాన్ని నిర్జీవ పదార్థంగా మార్చేశక్తి నిర్జీవ పదార్థానికీ ఉన్నప్పుడు దేవుడి పాత్ర నిరుపయోగం కావటం కాదా?

జీవ పదార్థానికి గల లక్ష్యసాధన శక్తి మనిషి బుద్ధికే అంతుచిక్కటం లేదు గనక అది దేవుడి ప్రసాదం ఎందుకు కారాదు?

ఇందులో జీవ పదార్థానికి అతీతమైన మరోదాన్ని తీసుకురావాలసిన అవసరం లేదని సులువుగా రుజువు చెయ్యవచ్చు ఎలా?

క్రిములు కలిగించే వ్యాధులు అందరికీ సోకవు వాటిని నిరోధించే శక్తిచాలని వారికే అవిసోకుతాయి. మశూచికం లాంటి వ్యాధులు సైతం అందరికీ రావు. కాని అవి వచ్చి నయమైనాక ఆ మనుషులకు వాటిని నిరోధించే శక్తి వచ్చి, ఆవ్యాధి వారికి మళ్ళీ రాదు. అంటే ఆమనిషి శరీరంలో గల జీవపదార్థం ఆ రోగంతో బాధపడే కాలంలో దాన్ని నిరోధించుకునే పదార్థాలను సృష్టించేసుకున్న దన్నమాట అలాటి పదార్థాలను ఆంటీబాడీస్ అంటారు. వీటిని సృష్టించుకునే శక్తి జీవ పదార్థానికి గాక ఏ దేవుడికో అంటు గట్టితే తేలేదేమిటి? మొదట రోగ నిరోధక శక్తి లేకుండా చేసినదీ దేవుడే, తరువాత దాన్ని పుష్కలంగా సమకూర్చినదీ దేవుడే నన్నమాట! ఇంతకన్నా బుద్ధి మాలిన ప్రతిపాదన ఊహించలేం.

ఒక్క రోగాల విషయంలోనే కాదు, మానవ శరీరాలు ప్రతి క్షణమూ తమ తెలివి ప్రదర్శిస్తూనే ఉన్నాయి.

చాలాకాలంనుండి తినని ఏ పచ్చి దోసకాయనో, నిమ్మకాయనో, ఇంకే పదార్థాన్నో తింటే అది జీర్ణం కాదు అందుకునిదర్శనంగా అదే రుచిగల త్రేనుపులు వస్తాయి. అంటే జీర్ణ కోశం ఆ కొత్త పదార్థాన్ని పచనం చేసే స్రావాలను సృష్టించలేక పోయిందన్న మాట. దాన్ని రోజు తింటూ పోతే దాన్ని జీర్ణం చేసుకునే దారి జీర్ణకోశం తెలుసుకుంటుంది. అదే రుచి గల త్రేనుపులు రావటం మానేస్తాయి.

మెదడు సహాయం లేకుండా, మనసుతో ఆలోచించ కుండా, ప్రాణుల శరీరాలు అద్భుతమైన తెలివి ప్రదర్శించగలవు అంతదాకా ఎందుకు? మనం ఆలోచిస్తుందనుకునే మెదడు తాలూకు జీవ పదార్థమే ఎన్నో విషయాలు తెలుసు కొంటుంది. వాటిని మనం కండిషన్డ్ రిఫ్లెక్సెస్ అంటాం భాష దగ్గిర నుంచి మన జీవితంలో అతి ముఖ్యపాత్ర వహించే అనేక విషయాలు ఇలాంటి కృత్రిమ రిఫ్లెక్స్‌లే

ఒక జానపద కథలో జ్యోతిష్కుడి కన్నా చాకలి వాడి గాడిద వాన రాకడను సరిగ్గా సూచిస్తుంది! జపానులో అను కుంటాను, ఒకరకం చేపలు రాబోయే భూకంపాలను ముందే సూచిస్తాయట తొలి సింధు నాగరికతా కాలంలో సముద్ర యానం చేసేవారికి తీరం ఎటుగా ఉన్నదీ దిక్కు తెలియకుండా పోయినప్పుడు ఒక కాకిని వదిలే వారట, అది సూటిగా తీరం కేసి ఎగిరి పోయేదట! అందుకోసం కోస్తా ప్రయాణీకులు తమ పడవలలో కాకులను బంధించి ఉంచేవారట దొంగలను పట్టటానికి పోలీసులు కుక్కలను ఉపయోగిస్తున్నారుకదా?

గురు శుశ్రూషలు చెయ్యకుండా, పుస్తకాలు చదవకుండా భాష ఆధారం చేసుకోకుండా అనేక క్షుద్ర జీవులు మనిషి కన్న అనేక రెట్లు హెచ్చు తెలివి తేటలు ప్రదర్శిస్తున్నాయి.

అంత మాత్రాన మనిషి తెలివి తేటలను తీసి పారెయ్యటం లేదు జంతువులు ప్రదర్శించే తెలివి గుడ్డిదే భూకంపాలు సూచించే చేపలు కుక్కలలాగా పసికట్ట లేకపోవచ్చు కుక్కలు పిల్లుల లాగా చీకటిలో చూడలేక పోవచ్చు ఏ ప్రాణి తెలివి ఆ ప్రాణికే పరిమితమై ఉన్నది ఏ తెలివినైనా కృత్రిమంగా సాధించే తెలివి ఒక్క మనిషికే ఉన్నది ఆవిధంగా మనిషి తెలివి అంటే, మెదడూ, బుద్ధీ జ్ఞానమూ కలిసి సాధించే తెలివి ఏ ఇతర ప్రాణికీ లేదు వేరు వేరు జంతువుల గుడ్డి తెలివికి దేవుడు కారకుడని ఎవరైనా వాదించ దలిస్తే మనిషి ఆ దేవుడి కన్న తెలివైన వాడని వాదించవచ్చు. మనిషి తెలివి కూడా దేవుడిచ్చినదే కదా అని వాదిస్తే కాదని నిరూపించవచ్చు విచక్షణతో కూడిన మనిషి తెలివి మనిషి స్వార్జితం కృషి చేసి ఏదో ఒక శాస్త్రరంగంలో జ్ఞానానుభవాలు సంపాదిస్తేనే గాని మనిషికి ఆ రంగంలో ప్రవేశం ఉండదు ఇంజనీర్లు వైద్యం చెయ్యలేరు శస్త్ర చికిత్సలు చేసేవారు, విశిష్ట ప్రయోజన కరమైన మిశ్రమ లోహాలు తయారు చేయలేరు జంతువుల తెలివి అలాటిది కాదు. ఒక తేనెటీగ చేసేపని, అన్ని తేనెటీగలు (అదే తరగతివి) చెయ్యగలవు. పెంపుడు జంతువులలో ప్రత్యేక ప్రయోజనాల కొరకు ప్రత్యేక జాతులు సృష్టించినదీ, వృక్ష జాతులలో కోరిన మార్పులు తెచ్చినదీ మానవుడు- దేవుడుకాదు

దేవుణ్ణి గురించి ఇంత దూరం చర్చించటం అనవసరం దేవుడన్న భావన విజ్ఞాన ఫలితంగా ఏర్పడినది కాదు, సామాజిక అవసరాల కోసమూ, దరిమిలా ఒక వర్గం ఇతర వర్గాల మీద అధికారం చలాయించటం కోసమూ ఏర్పడినది. అందుకే ఒక ఫ్రెంచి మేధావి దేవుడనే వాడు లేకపోతే వాణ్ణి సృష్టించవలసిన అవసరం ఉన్నది అన్నాడు.

అలాంటి అవసరం ఉన్నదా, లేదా అని మనం స్వతంత్రంగా ఆలోచించవచ్చు.

*(ముద్రణ ఆంధ్రజ్యోతి, వారపత్రిక 1974 అక్టోబరు)*

# 2. హేతువాదం- భౌతికవాదం

హేతువాదం అనేది దుర్బలమైనమాట దానిని సంస్కర్తలు అధికంగా ప్రచారంలోకి తెచ్చారు ఆ మాట ఆధారంతో వాళ్ళు సాధారణ పరిజ్ఞానానికి విరుద్ధంగా ఉన్న మూఢ ఆచారాలను ఖండించి, సమాన్ని సంస్కరించే యత్నం కొనసాగించారు వారిలో చాలామంది సరి అయిన భౌతిక వాదులు కారు యుగపురుషుడని చెప్పదగిన వీరేశలింగం గారు ఎన్నో మూఢవిశ్వాసాలు నిర్మూలించటానికి తమ సర్వశక్తులూ ధారపోసికూడా కొన్ని కొన్ని యాదృచ్ఛిక సంఘటనలు తనకు అనుకూలంగా జరిగినప్పుడు ఈశ్వరుడే తనకు తోడ్పడ్డాడని మనస్ఫూర్తిగా నమ్మారు వీరేశలింగం గారు హేతువాదే గాని, భౌతిక వాదికారు.

ఒక మనిషికి జబ్బుచేసింది తగిన వైద్యుణ్ణి పిలిస్తే రోగానికి కారణం కనిపెట్టి, అంటే రోగహేతువును గురించి ఆరా తీసి, సరి అయిన చికిత్స చేస్తాడు సమర్థుడయిన వైద్యుడు కేవలమూ హేతువాది మాత్రమే కాడు, భౌతిక వాదికూడానూ, కాని రోగి బంధువులు అలా చెయ్యక సోది చెప్పించుకుంటారు. తూర్పున ఉన్న వాళ్ళు ఎవరో చేతబడి చేశారనీ, అందుకే రోగం వచ్చిందనీ తెలుస్తుంది రోగ హేతువు చేతబడి! భూతవైద్యుణ్ణి పిలిపించి, ముగ్గులు వేయించి, మంత్రాలు చదివించి, డబ్బుతగలేసి చికిత్స చేయించేవాళ్ళు తాముకూడా హేతువాదుల మని చెప్పుకోవచ్చు కాని వాళ్ళు భౌతికవాదులు కారు ఈ మాట అనటానికి మనకు హక్కు ఉన్నదా? తప్పకుండా ఉన్నది

అది రుజువు చెయ్యటానికి మనం చేతబడులు అనేవి అబద్ధం అని రుజువు చెయ్యటానికి ఊబిలో దిగనవసరం లేదు. టీకాలు దేశంలో మశూచికాన్ని రూపుమాపాయి, ఆధునిక వైద్యవిధానం సగటు ఆయుర్దాయాన్ని ఎంతో పెంచింది పాతికేళ్ళక్రితం మందులూ, చికిత్సలూ లేని రోగాలకు ఈనాడు చికిత్స ఉన్నది ఇదంతా సాధించినది వైద్యశాస్త్రం- భూత వైద్యంకాదు.

భూత పిశాచాలు మనిషి భౌతిక జీవితాన్ని ప్రభావితం చెయ్యగలవని - ఏ కారణంచేతగాని- పూర్తిగా నమ్మేవాడితో, నువ్వు హేతువాదివి కావు! అని చెప్పి ఏంప్రయోజనం. నువ్వు భౌతికవాదివి కావు, అని చెప్పి భౌతికవాదం అర్థమయేటట్టు చెప్పటంలో కొంత ప్రయోజనం ఉన్నది.

అలాటిదే గ్రహాలలో నమ్మకంకూడా. భౌతికవాదం వంటబట్టని వాళ్ళకు జ్యోతిషంలో నమ్మకం కలిగించేపాటి విషయాలను వాస్తవంగా చెప్పగల దైవజ్ఞులు చాలామంది ఉన్నారు కాని వాళ్ళు చెప్పేవి చాలా భాగం జరగవు. గ్రహాలే జీవితాన్ని నడిపే హేతువులు అనుకున్న వాడు తప్పక గోతిలో పడతాడు. భౌతిక వాదికి అలాటి గతి

పట్టదు గ్రహాలకు మన జీవితాలమీద వుండే ప్రభావానికి రుజువు భౌతికంగా లభించేది కాదు గనుక

వ్యక్తి జీవితంలోగాని, సంఘ జీవితంలోగాని కలిగే ప్రతి పరిణామానికీ భౌతికమైన కారణాలుంటాయని నమ్మినవాడు ఆకారణాలను అన్వేషించగలడు అన్ని కారణాలూ మనకు స్పష్టంగా తెలియక పోవచ్చు కాని భౌతిక విజ్ఞానం క్రమంగా పెరుగుతున్నదిగాని తరగటం లేదు నిన్నటివరకూ ఏవిధంగా కనిపించని వైరస్ రోగకారణాలను ఈనాడు ఎలెక్ట్రాన్ మైక్రోస్కోపులు చూపుతున్నాయి. ఇలాంటి పరిణామం ఇతర హేతువాదులు సాధించలేకపోయారు

దీనినిబట్టి హేతువాదులమనుకునే వాళ్ళు తాము భౌతికవాదులమనుకుంటుండాలి. కానివారి భౌతికవాదం ఇతర విశ్వాసాలను కాదనటానికి పరిమితమైతే లాభంలేదు. ''దేవుడులేడు– దేవుడున్నాడు,'' రెంటికీ రుజువుండదు. దేవుడున్నాడనే వాళ్ళను దుయ్యబట్టటంలో హేతువాదం తృప్తి పొందుతున్నట్టు కనబడుతుంది. .. 'నీ విశ్వాసం తప్పు, నా విశ్వాసం అవలంబించు'' అనటంవల్ల ప్రయోజనం ఏమీ ఉండదు.

భౌతిక వాదంతో ఈచిక్కులేదు. భౌతికవాదం దేవుణ్ణి అనవసరం చేస్తుంది. సోషలిజం దారిద్ర్యాన్ని అనవసరం చేసినట్టు. ఈనాటి సమాజంలో మతంకన్నా కూడా భగవంతుడి మీది భక్తి చాలాముఖ్యమైంది. ప్రజలలో ఈభక్తి విస్తరింపటానికి రేడియో దగ్గరనుంచీ ఎన్నో సాధనాలు తోడ్పడుతున్నాయి. దీని వెనుకవున్న భౌతికసత్యం ఏమిటి? ఈ భక్తి వర్గపీడనకు అటూ ఇటూ సహాయం చేస్తున్నది ఒకవంక అధిక సంఖ్యాకులు భగవంతుడిపైన ఆధారపడవలసిన పరిస్థితి ఎక్కువవుతున్నది. ఇంకోవైపు అల్పసంఖ్యాకులు తమ లాభాలను నిరాటంకంగా పెంచుకోవటానికి ఈ భక్తి తోడ్పడుతున్నది. వర్గ వైరుధ్యానికి భక్తి ఒక వంతెన!

ఈపరిస్థితిలో ''దేవుడులేడు!'' అని ఎలుగెత్తిచాటటంవల్లపీడితులకు జరిగే మేలేమిటి? దేవుడున్నట్టు ఏదో ఒక రుజువు చూపటం ఆస్తికులకు సాధ్యంకాదని నాస్తికుల నమ్మకం. యాదృచ్ఛికంగా జరిగే అనేక సంఘటనలు ఆస్తికులకు దేవుడున్నట్టు రుజువిస్తాయి. అందుచేత, దేవుడు లేడని రుజువు చెయ్యటానికిచేసే ప్రయత్నంకన్న జీవితంలో ఏర్పడే సమస్యలకు పరిష్కారం వెతకటానికి భౌతికసాధనాలమీద ఆధారపడటం ప్రయోజనకరమని నిరూపించటం తేలిక. మన దేశంలో వున్న సమస్యలన్నింటనీ పరిష్కరించుకున్న దేశాలు ప్రపంచంలో మనకళ్ళ ఎదుటే ఉన్నాయి. ఆ దేశాలు భౌతిక వాదంతోనే ఆ సమస్యలను పరిష్కరించుకున్నాయి. వెంకటేశ్వరుడి హుండీలలో నోట్లకట్టలు వేసి కాదు.

భౌతిక వాదంవల్ల మరొక లాభం ఏమిటంటే అది ఉదాహరణ సహితమైనది అమెరికాలో ఎర్ర ఇండియన్లు మొక్క జొన్నలు నాటటానికి అనవాయితీ ప్రకారం ఏదో కర్మకాండ జరిపేవారు ఒక తెల్లవాడు వాళ్ళమధ్యకు వచ్చి ఏ కర్మకాండా లేకుండా పొలందున్ని విత్తనాలు చల్లాడు. ఈ పొలం పండుతుందా? అనుకున్నారు ఇండియన్లు వాళ్ళ పొలాల కన్న తెల్లవాడిపొలం ఎక్కువ బాగా పండింది. ఆ దెబ్బతో వాళ్ళు అనాదిగా పాటిస్తూవచ్చిన హేతువాదనికి కాళ్ళు విరిగి పూడుకున్నాయి

సాధారణ భౌతిక వాదంకన్నా పై మెట్టు గతితార్కిక భౌతికవాదం, భౌతిక పరిణామాలను ఇది సూక్ష్మంగా అంచనా కట్టగలదు భౌతిక పరిణామాలు తాడు పేనినట్టుగా సాగవు శాఖోపశాఖలుగా విస్తరించుతాయి గుణాత్మక మైన మార్పులు అనేకం ఏర్పడతాయి సామాజిక వికాసాన్ని భౌతిక ప్రాతిపదికమీద సాధించేవాళ్ళు గతితార్కిక భౌతికవాదాన్ని అవలంబించకుండా విజయం సాధించలేరు

భౌతికవాదం అవలంబించని హేతువాదులు ఇలాటి పరిణామాలను సాధించలేరు అందుకే వీరేశలింగంగారు తన జీవితమంతా ధారపోసి వీరోచితంగా ఏమూఢ విశ్వాసాల నైతే ఖండించారో అవన్నీ మన వెంట ఇంకా అలాగే ఉన్నాయి-కొన్ని సందర్భాలలో మరింత తీవ్రంగా కూడా ఉన్నాయి

*ముద్రణ వార్తాపత్రిక, మాసపత్రిక, జూన్ 1976*

## 3. మూఢాచారాలూ - భౌతికవాదం

దాదాపు నూరేళ్ళ క్రితం మన దేశంలో అన్ని ప్రాంతాల సంఘ సంస్కరణవాదులు పుట్టుకువచ్చి, మన ఆచార వ్యవహారాలలో పెద్ద పెద్ద మార్పులు జరగాలని ప్రచారం చేస్తూ, సంస్కరణోద్యమాలుకూడా సాగించారు మూఢవిశ్వాసాల జాబితాలు తయారయాయి. సంస్కరణోద్యమాన్ని సనాతనవాదులు ప్రతిఘటించారు, సంస్కర్తలను ఆంగ్లమానసపుత్రులన్నారు, సనాతనధర్మాలు మంటగలిసి పోతున్నాయని ఆక్రోశించారు.

నిజానికి జరిగిందేమిటి? మన సంస్కర్తలు అకస్మాత్తుగా పాశ్చాత్య ఆచారాలతో వ్యామోహితులై పోలేదు వారిలో జాతీయత ఉన్నట్టుండి ఇగిరిపోలేదు వారు పాశ్చాత్యుల దృష్టినుంచి మరింత భౌతికవాదదృష్టి అలవరచుకున్నారు భౌతికదృష్టితో పరిష్కరించటానికి అవకాశం ఉన్న చోట్ల కూడా దాన్ని అవలంబించకపోవటాన్ని మూఢత్వం క్రింద జమకట్టడం స్వాభావికమే కదా! ''మీరు కర్రనాగళ్ళను ఉపయోగించి ఎక్కువపంట పండించలేరు. ఇనుపనాగళ్ళను వాడండి,'' అని ఆటవికులకు చెబుతాం '' మేం అనాదిగావాడుతున్న కర్ర నాగళ్ళను వదులుకుంటే మా సంస్కృతి

దెబ్బతింటుంది, మా జీవితం దుఃఖభాజనం అవుతుంది '' అని వాళ్ళన్నప్పుడు మనం వాళ్ళకు పరాయి వాళ్ళమైతే వారి అజ్ఞానాన్ని చూసి జాలి పడతాం మనం వాళ్ళలో వాళ్ళమే అయితే వాళ్ళ మూఢత్వం చూసి సిగ్గుపడతాం చిరాకుపడతాం

సంస్కర్తలు మనలోవాళ్ళే గనక మన ఆచారాలలో మూఢత్వం - అంటే భౌతికదృష్టిలోపం -చూసి సిగ్గుపడ్డారు చిరాకుపడ్డారు మన ఆచారాలకు ఒకనాడు సమర్థన ఉండి ఉండవచ్చు కాని మానవ విజ్ఞానం పెరుగుతున్నకొద్దీ దానికి అనుగుణంగా ఆచారాలలో హేతుబద్ధమైన మార్పులు రావాలి కొన్ని రోగాలకు మందులులేని పరిస్థితిలో వాటిని నయంచేసుకోవటానికి మంత్రాలు వేయించుకుంటే తప్పు పట్టటానికి లేదు. కాని ఆరోగాలకు సరైన చికిత్సలు కనిపెట్టిన అనంతరంకూడా సదాచారం నెపంతో మంత్రాలను వేయించుకొనే వాళ్ళను మూఢులు అంటాం వాళ్ళు మూఢులే ఏది మౌఢ్యం అన్నది లభ్యంగా ఉండే భౌతిక విజ్ఞానాన్ని బట్టి ఉంటుంది. అందరికీ అందుబాటులో ఉండే జ్ఞానాన్ని కూడ ఉపయోగించుకోలేనిజాతి అజ్ఞానాంధకారంలో ఉన్నదని అందరం ఒప్పుకుంటాం. అటవికజాతులు అజ్ఞానంలో ఉన్నట్టు అందరమూ ఒప్పుకుంటాం కాని కొన్ని జాతులతో పోలిస్తే మనం అజ్ఞానంలో ఉన్నామన్నది ఒప్పుకోవటాన్కి మనస్కరించదు

మరింత భౌతికదృష్టి అలవర్చుకున్న వారు సంస్కర్తలు అవుతారని ఇందాక అన్నాను అసలు భౌతిక దృష్టి లేని మనుషులు ఎవరూ, ఎక్కడా ఉండరు వేదకాలపు ఆర్యులు మొదలుకొని ఈనాటి సనాతనులదాకా అందరికి కావలసినది సుఖప్రాప్తే '' హత్వావా! ప్రాప్స్యసేస్వర్గం, జిత్వావా భోక్ష్యసే మహీం'' అని కృష్ణుడు అర్జునుడికి జయాపజయాలు రెండిటిలోనూ సుఖాన్నే చూపాడు! మూఢాచారాలను పట్టుకొని వేళ్ళాడుతూ వాటిని విడిచి పెట్టటానికి అంగీకరించని వాళ్ళు ఆ ఆచారాలలోనే ఎక్కువ సుఖం ఉంటుందనుకొనే వాళ్ళే, వాటిని సంస్కర్తలు చెప్పినట్లు మార్చుకుంటే దుఃఖపడిపోతామనే వారిభయం

అందుచేతనే భౌతికదృష్టివిస్తరించనిదే సంస్కరణలు కూడా అమలు జరుగవు ఎంతమంది సంస్కర్తలు ఎన్నిత్యాగాలు చేసి, ఎంతగా తమ జీవితాలు ధారపోసి సంఘసంస్కరణోద్యమాలు నడిపినా మూఢాచారాలు అలాగే ఉంటున్నాయి, కొన్ని సందర్భాలలో ముదిరిపోతున్నాయి కూడాను.

ఈనాడు మనజాతిలో భౌతికదృష్టి ఒక్క విషయంలోనే బలపడింది ఇవాళ ఉన్నత లోకాలలో లభించేరంభా సంభోగాది సుఖాలకోసం గాని అనిర్వచనీయమైన మోక్షసుఖం కోసం గాని పాకులాడేవాడు కానరాడు దేవుళ్ళకు లంచాలు పెట్టినా, అధికారులకు లంచాలుపెట్టినా, దేవుడి సొమ్ముతిన్నా, మనిషి సొమ్ము తిన్నా ఇహలోక రంభలతో క్రీడించటానికీ, విదేశీసారా తాగటానికీ మాత్రమే

ఈ రకం భౌతిక వాదంలో ఉండే దుర్మార్గం ఏమిటంటే ఇది వ్యక్తులకు మాత్రమే వర్తిస్తుంది అందుచేత సమిష్టికి ఏవిధంగానూ ఉపయోగించదు పైపెచ్చు, ఈ భౌతిక వాదం మూఢాచార విశ్వాసాలను మరింత బలపరుస్తుంది అందుచేత దారిద్ర్యమూ, నిరక్షరతా, ఆకలీ, నిరుద్యోగమూ మొదలైన సమిష్టి సమస్యల పరిష్కారానికి ఈ భౌతిక వాదం ఉపకరించకపోగా అంతరాయంగా కూడా తయారవుతుంది ఆఖరుకు కార్మికులు తమ వేతనాలను పెంచుకునేందుకు సాగించే సమ్మెలు మొదలైనవికూడా సంఘాభ్యున్నతికి చాలవనీ, వారి సామాజిక (రాజకీయ) దృష్టి మరింత విస్తరించితేగాని ప్రగతి సాధ్యంకాదనీ గుర్తించబడుతున్నది

సామాజిక, భౌతిక దృక్పథం లేకపోవటమే వెనుక బాటుతనం అనడానికి సందేహంలేదు వెనుక బడిన జాతులను పరిశీలించినట్టయితే తాత్వికంగా వారిలో మనకు కనిపించేలోపం భౌతిక హేతువాదం వారిజీవితాలలో అమలు కాకుండా ఉండటం. నేను ఇంతకుముందు చెప్పినట్టు, ఇదేలోపం మనలో ఇతరులకు - మనకన్న ముందుకు వెళ్ళిన వారికి- కనిపించవచ్చు.

జాతి మొత్తం మీద హేతువాద- భౌతికవాద దృష్టి లోపించటమనేది ఎలా జరుగుతుంది? ఆకలితో బాధపడుతున్న వాడు ఎదురుగా ఉన్న ఆహారాన్ని తినకుండా బాధపడటం అసహజం కాదా?

కొన్ని పరిస్థితులలో కాదు, వాస్తవ జీవితంలోనే అగ్రవర్ణుణ్ణి అనుకునే బ్రాహ్మణుడు తాను అస్పృశ్యుడు తిండిపెడతానంటే తినడు, శోషవచ్చి చావటానికైనా ఒప్పుకుంటాడు. ఇలాంటి ఉదాహరణలు ఇంకా చాలా చూపవచ్చు. శాఖలో, కులాలో వేరయ్యాయనీ, జాతకాలు కలవ లేదనీ నిక్షేపంలాంటి సంబంధాలను వదులుకునే పిల్లల తల్లిదండ్రులు చాలా మంది మనకు కన్పిస్తారు

దీన్ని బట్టి ఏం తేలుతుంది? భౌతిక వాదదృష్టి పనిచెయ్యక పోవటం వెనక బలవత్తరమైన కారణాలున్నాయి. ఒట్టి బోధనలతో ఆ దృష్టి మారేదికాదు.

ఏమిటాకారణాలు? అజ్ఞానం తాలూకు వేళ్ళు గతంలో లోతుగాకూరుకుపోయి ఉంటాయి. వ్యక్తులకు జ్ఞానం కలిగించవచ్చు సామూహికంగా జ్ఞానోదయం కలిగించటం అమిత దుర్లభం. సంస్కార భావాలు కలిగి సంస్కరణ వివాహాలకు ఎంతగానో తోడ్పడిన ఒక పెద్దమనిషి మందీ, మూర్బలం వత్తిడికి తట్టుకోలేక తనకుమార్తెకు రజస్వలకాకుండానే పెళ్ళి ఏర్పాటుచేసి అమితంగా రోతపడ్డాడు.

కాని మన మూఢత్వానికి గతంలో వేళ్ళుతన్ని ఉండటం ఒక్కటే కారణం కాదు ఎండిపోయిన చెట్టు కొంతకాలం వేళ్ళపట్టుమీద నిలబడి ఉన్నప్పటికీ ఏగాలి వానకో పడిపోక తప్పదు. కాని దాన్ని నిలబెట్టి వుంచటానికి ఎవరో పోటీలు పెట్టి,

అదినజీవంగా ఉన్నట్టు భ్రమ కలిగించటానికి కృత్రిమంగా రంగులుపూసి, కాగితం ఆకులుకట్టి భ్రమలు కలిగించాలనుకోండి

అలాచేస్తున్న వాళ్ళు సమాజంలో ఉన్నారు వారిది స్వార్థ- భౌతికవాది దృష్టి అది కొనసాగాలంటే అధిక సంఖ్యాకులను భౌతిక- హేతువాదదృష్టికి దూరంగా ఉంచటం అవసరం భాగస్తుణ్ని మోసంచేయాలంటే లెప్పుడు లెక్కలు చూపక తప్పదు

మతాచారాలకు, మూఢ విశ్వాసాలకు రెండో ఆధారం సామాజిక దోపిడి ఇది మనకు వేదకాలంనుంచీ వస్తున్నది పెద్దలు చెప్పే ఉదాహరణ అశ్వమేధం ఇది వేదకాలంలో చాలా సులభమైన యాగం. రాను రాను ఇది చాలా క్లిష్టం కావటమేగాక రాజ్యాలు గెలుచుకొనేసాధనమైంది చాలా కాలంక్రితం రాయుడు శాస్త్రులుగారు చెప్పారు, కర్మకాండలో బ్రాహ్మణులు తమ వర్గస్వార్థంకోసం అసందర్భంగా దక్షిణలు, దానాలు చేర్చుతూ వచ్చారట

సంఘ వ్యవస్థ కొన్ని వర్గాలకు అనుకూలంగ ఉన్నపుడు ఆవ్యవస్థలోని భౌతిక దృష్టిలో అభివృద్ధి తమకు కష్టం కలిగించే పక్షంలో దాన్ని ఆవర్గాలు ప్రతిఘటించి అసత్యప్రచారాలు చేయటం ఆశ్చర్యం కాదు. ఆప్రచారాన్ని దోపిడీకి గురిఅయ్యేవాళ్ళు ఆమోదించటం ఆశ్చర్యం అస్పృశ్యుడు తాను అస్పృశ్యుణ్నని నమ్మటం భయంకరం కూటికిలేని వాడు పెట్టుబడిదారీ పోరాదని వాదించటం భయంకరం ఖైదీ సంకెళ్ళను కళ్ళకు అద్దుకొనటం భయంకరం.

కాని ఇలాంటి భయంకర పరిస్థితిని కాపాడ్డానికి పీడక వర్గాలు తమయావచ్ఛక్తిని వినియోగిస్తాయి వారి ప్రయత్నాలకు విఘ్నాలు కలిగించేవాళ్ళను నాశనంచేయటానికి ప్రయత్నిస్తాయి. అన్నిమౌఢ్యాలలోకీ మతమౌఢ్యం బలవత్తరమైనది ఎందుకంటే మత సత్యాలకు రుజువులేదు, అవసరంలేదుకూడ అందుచేతనే మతమూఢులు అత్యధిక విద్యావంతులలోనూ, శాస్త్రవేత్తలలోనూ కూడా మనకు కనిపిస్తారు వయోవృద్ధులలోనూ, చదువుకోని వారిలోను, ఇల్లుదాటి బయటికిరాని స్త్రీలలోను మత మౌఢ్యం ఉండటం సహజం

మూఢాచారాలుకూడా ఉన్నాయి కాని అవి మూఢవిశ్వాసాలంత బలమైనవి కావు. కాలం మీదచూస్తే విశ్వాసాల కన్న ఆచారాలలోనే ఎక్కువ మార్పు వస్తున్నది. ఎంత ఆచారమైనా పరిస్థితుల ప్రాబల్యానికి లొంగక తప్పదు. ఆపద్ధర్మం అనేది ఒకటి ఆమోదించి ఆచారాలను ఉల్లంఘించటానికి సావకాశం కల్పించారు.

మూఢ విశ్వాసాలనుంచి బయటపడని జాతికి భౌతిక దృష్టిలేదని వేరేచెప్పనవసరంలేదు. భౌతికదృష్టి లోపించిన జాతి వెనుకబడి ఉండక తప్పదు.

మశూచి, కలరా, ప్లేగులాంటి వ్యాధులువస్తే పూర్వం గ్రామదేవతలకు కొలుపులుచేసేవారు గొర్రెలనూ, మేకలనూ, కోళ్ళనూ బలిపుచ్చుకొని గ్రామదేవతలు

ప్రజలను ఈ వ్యాధులనుంచి కాపాడుతాయన్నది ఆనాడుకూడా వివేకవంతుల దృష్టిలో మూఢవిశ్వాసమే కాని అలాంటి కొలుపుల వల్ల ఆనాటి సమాజానికి పెద్దనష్టం జరుగలేదు ఆ వ్యాధులకు సరియైన చికిత్సలు ఉండేవికావు అమ్మవారికి బలిపెట్టిన జంతువులను మనుషులే తినేవాళ్ళు

కాని టీకాలు ఇనాక్యులేషన్లూ, అంటు రోగాలను నిగ్రహించే ప్రక్రియలూ వచ్చాక అమ్మవార్ల కొలుపులకు అర్థంలేకుండా పోయింది అంతేకాదు టీకాలు వేయించుకోని కారణంగా మశూచి తెచ్చుకొన్నవాళ్ళు సంఘద్రోహులుగా పరిగణించవలసిన పరిస్థితికూడ ఏర్పడింది

అమ్మవారి కొలుపులకన్నా కూడా మూఢమైన యజ్ఞాలు వచ్చిపడ్డాయి ఈ యజ్ఞాలు మూఢమైనవేకాదు, దుర్మార్గమైనవి యజ్ఞాలు తలపెట్టిన వారిని శిక్షించటానికి శాసనం జరుగవచ్చును ఎందుకో చెబుతాను

యజ్ఞాలు ఈనాటివికావు వాటి తంతు ఏర్పాటు అయిన కాలంలోనే భయంకరమైన అనావృష్టి ఏర్పడింది వరుసగా పది ఏళ్ళపాటు వానలులేకపోతే అనసూయ తన పాతివ్రత్య ప్రభావంతో వానకురిపించినదని వాల్మీకి రామాయణంలో చెప్పియున్నది ఇది మంచి జోకుకింద చెప్పుకోవచ్చు పదేళ్ళు కురవని వాన పదకొండో ఏడు కురిసిందంటే అందుకు ఏ ప్రభావమూ అవసరంలేదు అనసూయ శక్తులు పదేళ్ళపాటు ఏమైనట్లు? వానాకాలంలో వానలు కురిపించటానికీ, ఎండాకాలంలో ఎండలు కాయించటానికీ యజ్ఞాలెందుకూ?

ఇటీవల అమెరికావాళ్ళు వియత్నాంలో శాస్త్ర ప్రయోగాలద్వారా వానలు కురిపించారట వియత్నాంలో తాము సాగించే రాక్షస చర్యలలో అంతర్భాగంగా అమెరికావారు వానలు కురిపించటం కూడా దుర్మార్గమేకాని దాని వెనుక మూఢ విశ్వాసాలేమీలేవు. వానలు కురిపించటానికి యజ్ఞాలుచేయటమనేది మోసమేగాక మూఢవిశ్వాసం కూడానూ విశ్వాసాల మాటకువస్తే ఏదో రాగంపాడితే వర్షం కురుస్తుందన్న విశ్వాసం కూడా వున్నది అలాంటి నిరపాయమైన విశ్వాసం నిన్నుపరీక్షకుపెట్టి దానికి ఆధారం ఉన్నదీ లేనిదీ తేల్చుకోవచ్చు అటవికులలో వానల పాటలుపాడుతూ వాననృత్యాలు చేసే ఆచారమున్నది. కాని వారు వాటిని వానలు వచ్చేతరుణంలోనే చేస్తారు. వాన రాబోతుంది గనుక పాటలూ, నృత్యాలు మొదలైనవి చెయ్యటమూ - వానలు రావటం కోసం పాడి, ఆడటమూ ఒకటి కాదు అలాగే వాన కురుస్తున్నపుడు రక్తికట్టే రాగం ఉందనుకోవచ్చు. ఆరాగం పాడితే వాన కురుస్తుందనుకోవటం వేరు వర్షాలకోసమో, కరువు నివారణకోసమో యజ్ఞాలు చేస్తామనటం ఆటవిక దశకన్నా వెనక్కుపోవటమే. ఆ యజ్ఞాల పేరుతో వెయ్యిలాటి ఆహారాన్ని అగ్గిపాలు చెయ్యటం పరమకిరాతకం, శిక్షించదగిన నేరం.

ప్రభుత్వం ఇలాంటి దారుణాలను సాగిస్తున్నదంటే దానికి వేరే అర్థం లేదు ప్రజలలో మౌఢ్యాన్ని బలపరిచటంవల్ల దానికి అభ్యంతరంలేదు ఈ ప్రభుత్వం సోషలిజమునూ, ప్రజాస్వామ్యాన్నీ పదేపదే చెబుతున్నదికదా! ఇలాంటి ప్రభుత్వం ప్రజల మౌఢ్యాన్ని ఎందుకు బలపరుస్తున్నదని సందేహం కలగవచ్చు. ఈ ప్రభుత్వం చెప్పే ప్రజాస్వామ్యమూ, సోషలిజమూ వట్టిదగా అనటానికి యజ్ఞాలు హోమాలుచేసే వారిని జైలులో పెట్టకపోవటమే నిదర్శనం.

బ్రిటిష్‌వారు తమ దేశంలో డెమోక్రసీనీ, పెట్టుబడి దారీకి అవసరమైన బూర్జువా సంస్కృతినీ పోషిస్తూకూడా మన దేశంలో కులమతవైషమ్యాలను, అటవిక ఆచారాలను పరిరక్షించారు "మీరు స్వపరిపాలనకు అర్హులు కారు" అనిమనకు కితాబుకూడా ఇచ్చారు బ్రిటిషువారి ఏలుబడిలో రెండు వందల ఏళ్ళు ఉన్నతరువాత కూడా మనం స్వపరిపాలనకు అర్హులము కాకపోతే అది తమతప్పే అయి ఉండాలని అయినా వారికి తోచలేదు

బ్రిటీషువారు పోయినా మన అర్హతలు మారలేదు బూర్జువా, భౌతిక దృక్పథాలు మరింత వెనక్కుపోయాయి. బ్రిటిషుకాలములో మతపిచ్చ ఇంత ముదరలేదు పాలకవర్గీయుల మత పిచ్చ ఇంత బాహాటంగా ప్రజలముందు నగ్న తాండవం చెయ్యలేదు. బాబాల పుట్టలు ఇంతగా బద్దలు కాలేదు

ప్రజలలో ఇలా మూఢవిశ్వాసాలు పెంపొందుతూ పోతే, సోషలిజంమాట దేవుడెరుగు, మనం బూర్జువా డెమోక్రసీని కూడా సాధించలేము, తిన్నగా రాతియుగం కేసిపోతాం ఇది ఎవరిదో కొద్దిమంది సమస్యకాదు – నీది, నాదీ, ప్రతివాడిదీను సరి అయిన భౌతిక దృష్టిగల వ్యక్తులు ఎప్పుడూ ఉన్నారు ఈ దృష్టి జాతికంతకు లభిస్తేనేగాని మహాప్రస్థానం సాగదు.

మన జీవితాన్ని నడిపించే భౌతిక శక్తులేవో, వాటిని అనుకూలంగా ఉపయోగించుకొనేటందుకు అవసరమైన విజ్ఞానమేమిటో అందరూ గ్రహించాలి అర్థం లేని మతవిశ్వాసాలు, కాలదోషం పట్టిన ఆచారాలు, వాటిని వ్యాప్తిలో ఉంచే సినిమాలు, సాహిత్యాలు, ఇతర క్షుద్రకళలు, దేవుళ్ళు, బాబాలు, భక్తులు, ప్రచారాలు – ఇలాంటి భూతాలు మన జీవితాలనుపట్టి పీల్చి పిప్పి చేస్తున్నాయి. నాగరిక ప్రపంచంలో వీటికి స్థానం లేదు వీటి నుంచి జాతి విముక్తి పొందటమే గొప్ప అభ్యుదయం.

శాస్త్రవిజ్ఞానం ఒకరిసొత్తు కాదు గదా! దాన్ని అందరూ సంపాదించి నిత్యజీవితానికి వినియోగించుకోవచ్చు గదా! ఇదికూడ ఒక సంస్కరణ లాంటిదేగదా, అనుకున్న వారికి కనువిప్పు కలుగుతుంది. ఎందుచేతనంటే, నిజమైన భౌతిక దృష్టి సామాజిక విప్లవానికి తిన్నగా దారితీస్తుంది.

ఈ సంగతి మనం ప్రత్యక్షంగా చూస్తున్నదే సోషలిస్టు సమాజంలో యజమానులకన్న కార్మికులకు ఎక్కువ హక్కులుంటాయి. టూరిస్టుమోటార్లకన్న

స్కూళ్ళు, అస్పత్రులు ఎక్కువగా పరిగణించబడుతాయి ప్రజలను ఆందోళనపరిచే ప్రతి సమస్యకు ప్రాముఖ్యం ఇవ్వబడుతుంది మనదేశంలో అలా జరగటంలేదు, కార్మికులమీద కాల్పులు, ఊరేగింపులమీద కాల్పులు, ఆర్జీల మట్టదాఖలు, జైళ్ళనిండా యువకులయిన రాజకీయ ఖైదీలు, గ్రామాలపై పోలీసుల భీభిత్సకాండలు - రోజూ పత్రిక చూచేవాడికి కోట్ల సంఖ్యలో ప్రజల ప్రతిఘటన ఏదో ప్రమాణంలో ప్రత్యక్షమౌతున్నది ఈ ప్రజలు దేవుడికోసమూ, మోక్షం కోసమూ, తమ సనాతన ఆచారాలకోసమూ తిరగబడటం లేదు-తిండి, బట్టలాంటి ప్రాదమిక అవసరాలు తీరక తిరగబడుతున్నారు రాజకీయ విప్లవ చైతన్యం భౌతిక దృష్టిగల వారినుంచీ, దాన్ని తుపాకులతోను, దౌర్జన్యంతోను అణచే ప్రయత్నం పాలక వర్గంనుంచీ వస్తున్నది

మంత్రులూ, పోలీసుశాఖ, వ్యాపారులూ, ఆస్పత్రులూ, విద్యాలయాలూ, మతసంస్థలూ - జీవితంలోని అన్నిరంగాలా అవినీతి విలయతాండవం చేస్తున్నది. కుటుంబ పోషణ చేయలేనివారు ఆత్మహత్యలు చేసుకుంటున్నారు. అస్పత్రులలో రోగులు అనాధలచావు చస్తున్నారు. బయట రోగులు మందులు లేక చస్తున్నారు. తిండిలేక జనం చస్తున్నారు మందులనుకొని విషం త్రాగి పిల్లలు చస్తున్నారు. జీవితమంతటా మృత్యువు వీరవిహారము చేస్తున్నది ఈనాడు చావు తెచ్చి పెడుతున్న ప్రతి ఒక సమస్యకు భౌతిక పరిష్కారం ఉన్నది భౌతిక దృక్పధం పైన అతి తీవ్రమైన దాడి ఈ దేశంలో జరుగుతున్న సంగతి చాలామందికి తెలియనట్టు కనబడుతుంది. ఇది అత్యంత శోచనీయం. ఇది తెలుసుకోవాల్సిన సంగతి దానికి అడ్డంగా ఉండేవి మూఢవిశ్వాసాలే దారిద్ర్యానికి కారణం పూర్వజన్మ దుష్కృతం అన్న నమ్మకం ఉన్నంతకాలం సంఘంలో దోపిడి ఎలా జరుగుతున్నది అర్థం కాదు జననమరణాలు ఈశ్వర సంకల్పంవల్ల కలుగుతాయనుకున్నంతకాలమూ ప్రభుత్వం సాగించే మారణహోమం బాధ్యత ఈశ్వరుడిదే అవుతుంది. తిరుపతి దేవుడికి లంచాలు పెట్టడానికి అభ్యంతరం లేనివాళ్ళు అధికారులకు లంచం పెట్టడానికి సంకోచించరు. జీవితం ఇలాగుంటపూలు పూస్తూ ఇలకరుచుకుపోతుంది

ఇలా జరగకుండా చూడాలన్నా, జీవితాన్ని పైమెట్టు కెక్కించాలన్నా, భౌతిక జ్ఞానంతో పాటు దాన్ని అమలు చేసే సామాజికచైతన్యం ప్రజలనుంచి పుట్టుకు రావాలి. భౌతిక దృష్టికి సామాజిక విప్లవమే ఏకలక్ష్యం. ఇది గుడ్డినమ్మకం కాదు ఈ దారినే అనేక దేశాలు అంధకారం నుంచి వెలుగులోకి వచ్చాయి. ఆదేశాలలో ప్రజాజీవితపు భౌతిక సమస్యలు పరిష్కారమై జీవితం ముందుకు పోతున్నది వాటిని గురించి తెలుసుకున్నా మనకు జీవితసత్యం బోధపడుతుంది

ముద్రణ చార్వాక, మాసపత్రిక

# 4. సంకేతాలు - సాధనాలు

సరిగా అరవై ఏళ్ళ క్రితం మా అమ్మ నాచేత పెద్దకాగితంమీద, చివర రు ఉండే ఊళ్ళపేర్లు - ఏలూరు, పెండురారులాంటివి - నాకూ, తనకూ తెలిసినన్నీ రాయించింది ఎందుకో తెలుసా? ఇంట్లో పుట్టలు పుట్టలుగా ఉన్న నల్లులు పోవటానికి!

ఆటవిక, అనాగరిక దశలలో మానవ జీవితాలు చాలావరకు ఇలాటి ప్రయోగాలమీదనే గడిచిపోయేవి. వాళ్ళు పదాలకూ, పదార్థాలకూ అట్టే తేడా పాటించేవారు కారు. మంత్రాలతో చింతకాయలు రాలేవని నిజంగా నమ్మేవాళ్లు.

మాటలేగాక, బొమ్మలుకూడా సంకేతాలే. అవి భౌతిక జగత్తులో దేన్నో ఒక దాన్ని సూచిస్తాయి. గుర్రం అనేమాట గుర్రం బొమ్మా నిజమైన గుర్రాన్ని సూచిస్తాయి కాని గుర్రం అనేమాటనూ గుర్రం బొమ్మనూ ఎక్కి సవారి చేయలేం అని మనం అనుకుంటున్నాం. కాని అదిమమానవులు అనుకోలేదు. ఛాందోగ్యోపనిషత్తులో శునకులు ఆకలితో అలమటిస్తూ, అది తీరటానికి ''ఓం అదాం, ఓం పిబాం?'' అని మంత్రాలు చదివారు. ఆకలి దప్పులు తీరటానికి ''తింటున్నాం! తాగుతున్నాం!'' అనటం వాళ్లకు తప్పనిసరి అనిపించింది.

ఆకాలం వాళ్లే వానలు కురవటానికి పంటలు పండటానికీ, పిల్లలు పుట్టటానికి, ఇంకా సవాలక్ష భౌతికావసరాలు తీరటానికి మంత్రాలతో కూడిన తంత్రాలు చేసేవారు. తంత్రాలలో అసలు కిటుకు ఉండనూవచ్చు కాని మంత్రాలులేని తంత్రాలను వాళ్ళు గర్హించారు. మంత్రపూరితమైన యజ్ఞంలో గోవులనూ, మనుషులనూ చంపటం పవిత్రమైనది. ఊరికే పశువులను కోసుకు తినేవాళ్లు అనార్యులూ, పాపులూనూ!

ఈ నాగరికతతో అంతమైన హేతువాద దృష్టి ప్రజలకు కలిగిందా? దురదృష్టవశాత్తు జరగలేదు. నాగరికులమని చెప్పుకునే వాళ్ళం కూడా సంకేతాలను సాధనాల కింద పరిగణిస్తాం.

శకునాలు మంచికీ, చెడుకూ సంకేతాలుగా ఈనాడు కూడా భావించబడుతున్నాయి. ఈ సంకేతాలనే మంచి చెడ్డలుగా మనం భావించి, మన ప్రయత్నాలు కొనసాగించటమో, విరమించటమో చేస్తున్నాం. అలాంటివే వర్జ్యాలూ, రాహుకాలాలూ, యమగండాలు, మొదలైన యోగాలు. ఈ సంకేతాలను బట్టి మనం మన జీవితాలను నడిపిస్తున్నంత కాలమూ వాటిని సంకేతాలుగా కాక, సాధనాలుగా ఉపయోగిస్తున్నట్టే కదా. ఇలాటివి నిజమైన సంకేతాలా కాదా అని పరీక్షచెయ్యటం హేతువాదం అవుతుంది. ఆ హేతువాదదృష్టి లేని కారణం చేతనే ఈ సంకేతాలు ఇంకా విశ్వసించబడుతున్నాయి. మంచి శకునాలు, మంచినీ, చెడ్డశకునాలు చెడునూ కలిగిస్తున్నాయా లేదా? అమ్మో! దుశ్శకునాలకు పరీక్షపెట్టటం ప్రమాదం కాదా? ఒకవేళ

ప్రమాదమైతే, దాన్ని ఎదుర్కోవడంలోనే శాస్త్రదృష్టి వున్నది. రోగ కారణాలను నిరూపించటానికి బలి అయిన శాస్త్రవేత్తలు ఉన్నారు అలాంటి వాళ్లు మానవజాతి క్షేమానికి చేసిన సేవ అతీతమైనది దుశ్శకునాల విశ్వాసాలను ప్రచారం చేసేవాళ్లు మానవజాతికి చేసే అపకారం కూడా అలాంటిదే

గుళ్ళలో దేవుడి విగ్రహాలు సంకేతాలు అవి ఎవరికి సంకేతాలు ఆ విగ్రహాలను ఆరాదించే వారికి ఆ దేవుళ్ళు ఎవరో, తమను ఏం చేస్తారో, తెలీదు. ఎక్కడో, ఎప్పుడో, ఎవరో ఆ దేవుళ్ళను గురించి రాసిపెట్టారు ఆ రచనా సంకేతమే దాని వెనక ఉన్న భౌతిక వాస్తవం ఏమిటి? దేవుళ్ళ విషయంలో భౌతిక సమస్యలేదు పోనీ ఆధ్యాత్మిక వాస్తవం ఏమిటి? అది రుజువుకు వచ్చేది కాదు అందుచేత ఏం జరుగుతున్నదంటే, ఏమీ లేనివాడైనా ఒక రాయి తెచ్చి అర్ధరాత్రివేళ రోడ్డుప్రక్కన పెట్టి దానిమీద ఇంత ఎర్రరంగు వేస్తే, సంవత్సరం తిరిగేలోపల అక్కడ ఒక చిన్న గుడి వెలుస్తుంది దక్షిణ దేశంలో ఇది విడువకుండా జరుగుతున్నది దారిన పోయేవాళ్లు దానిముందు ఆగి, చెప్పులువిడిచి, చెవులు పట్టుకుని గుంజిళ్ళు తీసి నెప్పిపుట్టకుండా చెంపలు వేసుకుని, మొట్టికాయలు మొట్టుకుని, ఏదో గొణుక్కుని, వెళ్ళిపోతారు కొందరు ఆరాయి ముందు ప్రణామాలు పడతారు కొందరు దాని చుట్టూ ప్రదక్షిణలు చేస్తారు వీళ్ళను చూస్తూంటె ఓం అదాం ఓంపిచాం అన్నవాళ్లు గట్టి భౌతికవాదులేమో ననిపిస్తుంది

సంకేతాలను సాధనాలుగా ఉపయోగించటం ఎన్నిరకాలుగా ఉంటుందో వివరించటం చాలా కష్టం తాయెత్తులుంటాయి వాటిలో ఏవేవో యంత్రాలు గీసి, అక్షరాలు రాసిన రాగిరేకులుంటాయి వాటితో భూతప్రేత పిశాచాలను దూరంగా ఉంచవచ్చు! హనుమంతుడి బిళ్ళ మెడలో వేసుకుంటే భూతాలు కీడుచెయ్యవు తథాస్తు దేవతలుంటారు ఎవరైనా చెడ్డమాట అంటే వాళ్ళు దాన్ని నిజం చేస్తారు. ఇలాటి వాక్శుద్ధి ఒకప్పుడు ఘోరతపస్సులు చేసినవాళ్ళకే ఉండేదట. రానురాను అది పిల్లలకు కూడా సంక్రమించింది నాగరికత ముందడుగు

నాచిన్నతనంలో ఎవరో అన్నారు. రైలునదిమీదగా పొయ్యేటప్పుడు వంతెన విరిగిపోతుందేమో ననుకుంటే అదికాస్తా నిజంగా విరిగిపోతుందట కృష్ణమీదగా రైలు వెళ్ళేటప్పుడల్లా వంతెన విరిగి పోతుందేమోనన్న భయమే నాకు కలిగేది. అయినా వంతెన ఎన్నడూ విరగలేదు. ఈ వంతెన విరిగి, రైలునదిలో పడిపోవాలి అని నేను అనుకున్నా అలా జరిగే శక్తి నాకులేదని తెలుసుకోవటానికి చాలా కాలం పట్టింది.

నాగరికతలో సంకేతాలకు స్థానం ఎంతైనా ఉంది. కాని అవి సాధనాలు అయినప్పుడే వాటివల్ల ప్రయోజనం ఉంది. రోడ్ల మీద ట్రాఫిక్ లైట్లు ఉంటాయి. రైళ్ళకు సిగ్నల్స్ ఉంటాయి. ఇళ్ళకు నంబర్లుంటాయి. ఉత్తరాలమీద ఎడ్రసులు ఉంటాయి. హైటెన్షన్ కరెంటు హెచ్చరికలుంటాయి విమానాల కోసం ఎత్తయిన ప్రదేశాలలో ఎర్ర లైట్లుంటాయి. నౌకలకోసం లైట్ హౌసులుంటాయి అలాగే

రేడియో రాదారి సంకేతాలుంటాయి వాటివల్ల అపారమైన ప్రయోజనం ఉన్నది వాటిని గ్రహించలేనివాళ్ళు నిజంగా అపాయానికి గురవుతారు

నాగరిక మానవుడు ఈనాడు కూడా ఆటవిక అజ్ఞానం నుంచి బయటపడ లేకుండా ఉన్నాడన్నది నిజం ఈ ఆటవిక లక్షణాలు వ్యక్తుల జీవితాలలోనూ సామాజిక జీవితంలోనూ, రాజకీయాలలోనూ నిలచివుండి పురోగమనానికి తీరనిహాని కలిగిస్తున్నాయి అయితే నాగరికత పెరుగుతూ వచ్చింది మటుకు ఈ ఆటవిక లక్షణాల ద్వారా కాదు సాధనాలుగా ఉపకరించే సంకేతాల ద్వారానే పురోగమనం సాధ్యమయింది భాషా, గణితమూ, ఇతర శాస్త్రజ్ఞానమూ, ప్రకృతిరహస్యాలూ ఇవన్నీ సంకేతాల రూపంలోనే సహస్రాబ్దాల మీద గణన పురోగమనానికి తోడ్పడ్డాయి పనికిమాలిన సంకేతాలను విసర్జించటమూ, పనికి వచ్చే సంకేతాలను సాధనాలుగా ఉపయోగించటమూ కూడా వ్యక్తులకూ, సమాజాలకూ ఎంతో మేలు

*ముద్రణ చార్వాక, మాసపత్రిక, ఫిబ్రవరి, మార్చి 1976*

## 5. ఉచితపద ప్రయోగం

హేతువాదం దుర్బలమైనది కనుక భౌతికవాదం అవసరం అంతేకాదు, గతి తార్కిక భౌతికవాదం సాధారణ భౌతికవాదం కన్నాపైమెట్టు? అనేవారున్నారు అంటున్నారు ఎం.వి రామమూర్తి (చార్వాక, జులై 76)

ఈ మాట నేనే అంటున్నాను కారణం ఉండి అంటున్నాను మాటలు మారవు గాని వాటి అర్థాలు మారుతాయి. ఉదాహరణకు శంకరాచార్యులుగారి అద్వైతం చెప్పేమాయా వేదంలో ఉండిన మాయ ఒకటి కాదు బ్రహ్మ అనే మాటకు అర్థాలు మారాయి దాసం అనే మాట మారింది

ప్రస్తుత విషయం అదికాదు హేతువాదిని అని చెప్పుకొనేవాడు భౌతికవాదం నిర్వచనాన్ని పూర్తిగా స్వీకరించటానికి సిద్ధంగా లేనప్పుడు హేతువాదానికీ, భౌతికవాదానికీ మధ్య వ్యత్యాసం చూడవలసి వస్తుంది. దేవుడు లేడనీ, దయ్యాలు లేవనీ ఆవేశంగా అరిచే వాడికన్నా, జీవితంలో ఆదేవుడికీ, దయ్యాలకూ భౌతికాధారం లేకుండా వ్యవస్థ ఏర్పాటు చేసుకున్నవాళ్ళు మరింత భౌతికవాదులని మనం ఆమోదించక తప్పదు

అయితే అంత మాత్రం చేతనే ఆ భౌతిక వాదులు హేతువాదులకన్న గొప్ప హేతువాదులై పోయారని అనుకోనవసరం లేదు ఎందుకంటే ప్రపంచంలోకెల్లా హెచ్చు భౌతిక వాదాన్ని జీవితంలో అమలుపరిచే జాతులు దేవుణ్ణి నిషేధించక ఆధ్యాత్మిక

రంగంలో నిలబెట్టి, సాబిమునిపని పబప్రు స్థితిలో ప్రపంచానికీ, వారి రక్తం తాగటానికి ఉపయోగిస్తున్నారు. వీళ్ళతో పోలిస్తే దేవుడు లేడని అనే హేతువాదులు కొంత బుద్ధిమంతులే కదా.

అందుచేత గతి తార్కిక భౌతికవాదం తప్ప హేతువాదమున్నను మరేదీ సమగ్రంగా సమీక్షించలేదు. నిజమైన హేతువాది మనుష్యుల మనసులను మార్చే వ్యాఖ్యానంతో తృప్తిపడడు, జీవితాన్ని మార్చే కార్యక్రమం గురించి ఆలోచిస్తాడు. అందుకే భౌతికవాదాన్ని ఆశ్రయిస్తాడు. అది అమెరికన్ భౌతికవాదం కాదు మార్క్సిస్టు భౌతికవాదం.

అందుచేత నాబోటి వాడి దృష్టిలో ఏ ఉద్యమమయినా కొనసాగుతూ పోతే ప్రజల వేట రూపంలో జరిగే రాజకీయాలకు అవసానం కమ్యూనిజం లోకి వస్తుందా అన్నది తప్ప మిగిలినవి అంతగా భాసించవు. ఈ ఉద్యమంలో పాల్గొనే వాళ్ళు కూడా, మనం సొంత డబ్బా కొట్టుకుంటున్నామా? లేక ప్రజా జీవితం గురించి మనలో ఏ మూలనన్నా ఆందోళన ఉన్నదా? మన కృషి సూటిగా సామ్యవాదానికి దారితీసి, మనిషిని మనిషి కాల్చుకు తిని, ''మాడు నా సంస్కృతి'' అనే దశకు స్వస్తి చెబుతుందా? లేక మనం ఒక పబ్లిక్ రాకెట్‌లో అనుకోకుండా దూరిపోతున్నామా? అని ప్రశ్నించుకుంటే తప్పులేదు. అలా ప్రశ్నించుకున్న వాళ్ళ అంతరాత్మ తృప్తి చెందితే హేతువాదానికీ, భౌతికవాదానికీ, గతి తార్కిక భౌతికవాదానికి పెద్ద తేడాలేదు. మార్గాన అవి వేరువేరు దశలు.

ముద్రణ చార్వాక మాసపత్రిక, ఆగష్టు 1976

# 6. మూఢవిశ్వాసాల బలం

పాశవిక మానవుడి నుంచి ఆధునిక మానవుడి దాకా అందరి ప్రతినిధులూ ఈనాడు భారత భూ ఖండంమీద ఉన్నారు. మానవుడు అన్ని దశలలో అవలంబించిన విశ్వాసాలూ ఈ దేశంలో ఏదో మూల సజీవంగా ఉన్నాయి. వాటివల్ల ఏమైనా ప్రయోజనం ఉన్నదా అని అడగకండి. బౌద్ధంమీద ధ్వజమెత్తిన శంకరాచార్యులుగారికి బుద్ధుడు తొలుత ప్రచారం చేసినది యేమిటో బొత్తిగా తెలియదని డి. డి. కోసాంబీగారు అన్నారు. ఈనాడు కమ్యూనిజమును వ్యతిరేకించే వారిలో చాలామందికి కమ్యూనిజం అంటే ఏమిటో కొంచెం కూడా తెలియదు. శాస్త్రీయమైన దృక్పథం అవలంబించామనుకునేవారు కొంతమంది తాము నమ్ముతున్న విశ్వాసాలు ఎలాగో శాస్త్రీయమైనవి అన్న గుడ్డి నమ్మకం తప్పిస్తే శాస్త్రీయమైన దృక్పథం ఏమిటో

ఎంతమాత్రమూ ఎరగరని ఇటీవల నాకు తెలిసివస్తున్నది ఇలా ఎన్ని ఉదాహరణలైన ఇయ్యవచ్చు ఈ ఉదాహరణలకూ, మూఢవిశ్వాసాలకున్న బలానికీ సంబంధం ఉన్నది దాన్నే ఇక్కడ చర్చిస్తాను.

ఆంధ్రలో కమ్యూనిస్టుపార్టీ మొదటిసారి ఎన్నికలకు నిలబడుతున్నప్పుడు కొన్ని భూస్వామి కుటుంబాలకు చెందినవారు కమ్యూనిస్టుపార్టీలో ఉండటం జరిగింది అయితే అవే కుటుంబాలలో కాంగ్రెసువాదులూ ఉన్నారు. అందుచేత కొన్ని మోతుబరి కుటుంబాలవారు తమకు ఉమ్మడిగా ఉన్న నూరు వోట్లలో 50 కాంగ్రెసుకూ 50 కమ్యూనిస్టుకూ వేస్తామన్నారు. (నేను చెవులారా విన్నది వారన్న మాటలే, నిజంగా అలావేశారో లేదో నాకు తెలియదు) దీనినిబట్టి పాత అభిమానాలు పోకుండానే వాటికి వ్యతిరేకమైన కొత్త అభిమానాలు ఏర్పడటం మన జాతికి సాధ్యమన్నమాట. ఇది మనకు అనాదిగా వస్తున్న సంస్కృతే దానాలూ, ధర్మాలూచేసి పాపాలను మన పూర్వీకులు క్షాళన చేసుకునేవారు. డబ్బుతో బ్రహ్మ జ్ఞానం మాత్రమేగాక, కైవల్యాన్నీ, ఉన్నత లోకాలనూ కొనుక్కునేవారు. ఇందులో వాళ్ళకు మతిమాలినతనం ఏమీ కనిపించలేదు. వాళ్ళు సృష్టించిన సాహిత్యం చూస్తూ వారిని బొత్తిగా బుద్ధిహీనులనలేం. కాని వాళ్ళ విశ్వాసాలు చాలావరకు హేతువాదానికి కట్టుబడినవికావు. ఆమాటకు వస్తే ఈనాడు హేతువాదులమనుకునే వారి దృఢ విశ్వాసాలలో ఎన్ని భావితరాలవారికి సబబుగా తోస్తాయో చెప్పలేం. కొన్ని విశ్వాసాలు అసంగతమైనవని తెలుసుకోవటానికి కూడా కొంత-విజ్ఞానం కావాలి. హేతువాదులందరి విజ్ఞానమూ పరిపూర్ణమయిపోయిందనుకోవటం సాధ్యం కాదు. అది హేతువాదానికే విరుద్ధం.

మూఢ విశ్వాసాలకు బలం ఎక్కడినుంచి వస్తున్నది. మూఢాచారాలను పాటించేవారిలో అత్యధిక సంఖ్యాకులకు తాము పాటిస్తున్న ఆచారాలు మూఢమైవని తెలుసును. కాని పాటించకుండా ఉండలేరు. ఎందుచేత? సామాజికంగా వాళ్ళు పూర్తి స్వతంత్రులుకారు. వాస్తవ సామాజిక జీవితాలు వ్యక్తివాదం జయించుకురాలేదు. ఈనాటి హేతువాది అయిన యువకుడు తాను మూఢమైనవని నమ్మిన భావాలనూ ఆచారాలనూ పూర్తిగా వదిలెయ్యాలంటే దాదాపు తన వారినందరినీ వొదిలెయ్యాలి. కథలు రాయటానికి బాగానే ఉంటుంది. కాని నిజంగా అయినవారినందరినీ వదులుకున్నాక ఆ యువకుడికి అనుమానం వస్తుంది. నేను చేసిన ఈ త్యాగానికి సమాజపరంగా పొందిన లాభం ఏమిటి? అని చిన్న సమాజంలో నుంచి విస్తృత విశాల సమాజంలోకి పోగలనన్న తృప్తి కొందరికి ఉండవచ్చు. కాని ఇది అనుమానాస్పదం. ఒకసమాజానికి వెలి అయినవాడు అంతకన్న పెద్ద సమాజానికి ఆదరణీయుడు కావాలంటే ఏ జాతీయోద్యమంలోనో విప్లవోద్యమంలోనో, కనీసం చెయ్యవచ్చు.

సంఘ సంస్కరణోద్యమంలోనో రాణించాలి అలా రాణించగల శక్తి ఉన్నవాడు అవలంబించే హేతువాదం యొక్క స్వరూపాన్ని ఆ ఉద్యమాలే నిర్ణయిస్తాయి.

ఈ విషయానికి గల ప్రాముఖ్యం ఏమిటి?

హేతువాదం పేరిట వ్యక్తులలో ఉండే మూఢ విశ్వాసాలను సంస్కరించ బూనటంలో కొంత అసందర్భం ఉన్నది, వారిలో కొందరికి తమ విశ్వాసాలు అర్థహీనమైనవని తెలిసి ఉండవచ్చుననే మాట అటుంచి మూఢ విశ్వాసాలకున్న బలం సమష్టి మీద ఏర్పడుతున్నదనీ, సమష్టి ప్రయోజనం లక్ష్యంగా పెట్టుకోకుండా వ్యక్తులను సంస్కరించటం వల్ల చివరకు మిగిలేది ఏమీ ఉండదనీ గమనించటం అవసరం.

సమాజాన్ని పీడించి, అధోగతిలో ఉంచిన విశ్వాసాలన్నీ వ్యక్తికి గురిచేసి నవేనని మనం గుర్తించాలి. పెళ్ళాం ఎవరు? పిల్లలు ఎవరు? వారిని విస్మరించి మోక్షం చూసుకో! ఒంటరిగా ప్రపంచంలోకి వచ్చావు, ఒంటరిగా పోతావు. ఈ మధ్య జరిగేదంతా భ్రమ, మిథ్య? నువు ఏ జన్మనో పెట్టిపుట్టావు! ఈ జన్మలో బ్రాహ్మలకు దానం చెయ్యి. చచ్చి ఉత్తమ లోకాలు పొందుతావు మళ్ళీ పుట్టి ఇంకా గొప్ప జన్మ ఎత్తుతావు. కిందటి నీ జన్మ చేసుకున్న పాపం చేత నీ చకులంలో పుట్టావు పై కులాల వాళ్ళకి అణగి మణగి పడివుండి, సేవచేస్తే, ఎప్పటికైనా నీకు కూడా ఉత్తమ జన్మ కలగవచ్చు. సాటిలేని మన భారతీయ సంస్కృతి అంతా వ్యక్తి మీదనే గురిపెట్టింది. ఇప్పుడు హేతువాదులమని మనం వ్యక్తులను సంస్కరించి, వారికి అరిచేతిలో వైకుంఠం చూపే స్థితిలో కూడా లేకపోతే అంతకన్న శోచనీయం ఏమిటి?

నిజమైన జీవితం ఎప్పుడూ సమష్టిగానే ఉంటూవచ్చింది భగవద్గీతలో అర్జునుడు యుద్ధం చెయ్యక పోవటానికి సమష్టి కారణాలే చెప్పాడు. తన చేతిలో చావవలసిన వాళ్ళు తన తండ్రులు, గురువులు, జ్ఞాతులు, మామలు! కృష్ణుడు ఆ అర్జునుడి సమష్టి దృక్పథాన్ని పగల గొట్టటానికి ఎంత దీర్ఘోపన్యాసం చేశాడో భగవద్గీత చదివితేగాని తెలీదు. చంపేవాడివి నీవు కాదు. నీ ధర్మం నువు నెరవేర్చు, నిన్ను ఏ పాపమూ అంటదు. యుద్ధంలో చచ్చావో స్వర్గంలో అనుభవిస్తావు. గెలిచావా రాజ్యభోగాలు అనుభవిస్తావు. అన్ని మరచిపోయి నా భక్తుడివికా! ఇది అద్వైత సనాతన ధోరణి

ఇంతకూ నేను గట్టిగా చెప్పదలచుకున్న దేమంటే ,

మూఢ విశ్వాసాలు సంస్కారంగలవాడికి తలవంపులనే మాట అక్షరాలా నిజం అవి పోతేగాని సమాజం అభివృద్ధి కాదన్నమాట కూడా నిజం కాని వాటి వేళ్ళు సమాజ వ్యవస్థలో లోతుగా ఉన్నాయి. వ్యవస్థను మార్చే యత్నం బహు ముఖాల జరగాలి. అలాటి ప్రయత్నంలో ఒక భాగంగా మూఢ విశ్వాసాలమీద దాడి

కాని మూఢ విశ్వాసాలను తొలగించటమే ఒక ఉద్యమం చేస్తే అందువల్ల ప్రయోజనం శూన్యం. సంఘ సంస్కారణోద్యమంలో జంధ్యాలు వేసుకున్న వారిని చూశాను. నేను నా జంధ్యాన్ని తీసిపారేసి, తద్దినాలు పెట్టటం మానేశాను. వాళ్ళుగాని, నేనుగాని సాధించిన సామాజిక ప్రయోజనం నాకేమీ కనబడలేదు.

*ముద్రణ చార్వాక మాసపత్రిక, జూన్ 1978*

# 7. అనవసరమైన నమ్మకాలు

దేశం పరాధీనంగా వున్న కాలంలో నిజాతీయులమీదా, వారి సంస్కృతి మీదా స్వతంత్ర భావాలు గలవారిలో రెండురకాల మానసిక పరివర్తన కలిగింది. కొందరు ఇంగ్లీషువారి అధీనంలో ఉన్న మన దేశంలోని సంస్కృతి కన్న మన ప్రాచీన సంస్కృతి చాలా రెట్లు గొప్పదని తెలుసుకున్నారు ఈ విశ్వాసాన్ని చాలా మేరకు పాశ్చాత్యులే బలపరిచారు. ఈ పాశ్చాత్యులు సంస్కృతం నేర్చుకుని వేదాలు అపూర్వమైన సాహిత్యమనీ, ఉపనిషత్తులలో కనిపించే తాత్త్విక చర్చలు గొప్పసంస్కారాన్ని సూచిస్తాయనీ మనకు చెప్పారు. మనం గర్వపడటానికి ఎలాటి అభ్యంతరమూ లేదు!

ఇంచుమించు ఇదే కారణంచేత మన మేధావులు ఇందుకు విరుద్ధమైన ఆలోచన కూడా చేశారు. పరాధీన భారతంలో మన సంస్కృతి మన ప్రాచీన సంస్కృతికి తీసికట్టు కావచ్చు కాని అది ఆధునిక పాశ్చాత్య సంస్కృతికి కూడా తీసికట్టే, పాశ్చాత్య సంస్కృతి ద్వారానే మనకు మన గతం తాలూకు గొప్పతనం తెలియ వచ్చింది ఆ గత సంస్కృతి ఎంత గొప్పదయినా అది వర్తమానానికీ, భవిష్యత్తుకూ పనికివచ్చేదికాదు అందులో భౌతిక - ఐహిక అభ్యుదయానికి పనికివచ్చేది చాలా తక్కువ. ఆ సంస్కృతిని పునరుద్ధరించటం కన్న, మన వర్తమాన సంస్కృతి కన్న పాశ్చాత్యుల వర్తమాన సంస్కృతి స్పష్టంగా ముందున్నది గనక, మన భవిష్యత్తుకు మంచిదన్న భావం పైకి వచ్చింది.

పునరుద్ధరణ వాదం ఒకటీ, పురోగమన వాదం ఒకటీనూ!

అలాటి పురోగమనవాదం సంఘ సంస్కారాలకు పునాది అయింది. ఆధునిక పాశ్చాత్య సంస్కృతి దృక్పథం నుంచి చూస్తే మూఢవిశ్వాసాలుగా కనిపించినవన్నీ తీవ్రంగా ఖండించబడ్డాయి. ఆఖరుకు హిందూమతం కూడా సంస్కరణకు గురి అయి, బ్రహ్మ సమాజం, దియోసఫీ, స్టార్ ఆఫ్ ది ఈస్ట్ రూపాలలో, మనని ఏలుతున్న దొరలకు మరింత ఆమోదకరంగా ఉండే లాగా, క్రైస్తవమతానికి సాధ్యమైనంత సన్నిహితంగా ఉండేటట్టుగా, సంస్కరించబడింది.

ఒక చారిత్రక దశలోనుంచే పుట్టిన ఈ రెండు దృక్పథాలకు గర్భశత్రుత్వం తప్పలేదు ఒక పక్షంవారు పాశ్చాత్యులను మన సంస్కృతిని నాశనంచేసిన శత్రువులుగా చూస్తే, ఇంకో పక్షంవారు ఆ పాశ్చాత్యులనే మన సంస్కృతిని పునరుద్ధరించి, మన అభ్యుదయానికి బాటవేసిన మిత్రులుగా చూశారు (గాంధీ గారు రెంటినీ మేళవించి బ్రిటిషువారి మీద కత్తికట్టుతూనే వారితో మనకు మైత్రి వుంటుందని ఉద్ఘాటించాడు)

జాతీయ సంస్కారం దృష్ట్యా వెనక్కు పోయినా, ముందుకుపోయినా మంచిదే గనక ఏదైతేనేం అనుకునేటందుకు అవకాశం లేకపోయింది ఇందుకు ప్రబల కారణం సామాజిక పరిణామవాదం. ముసలివాడు కుర్రవాడు కావటం ఎంత అసంభవమో, ఒక పరిణామ దశకు వచ్చిన సమాజం నాలుగైదువేల ఏళ్ళ నాటి దశకు - రైళ్ళూ, రోడ్లూ, విమానాలు, టపా, విద్యుచ్ఛక్తి లేని దశను, పిల్లలు లేనివాళ్ళు తమ భార్యలకు గర్భం కలిగించటానికి యితరులను వినియోగించే దశను, రాజులను విష్ణువు అవతారంగా భావించే దశను, లోకకళ్యాణంకోసం ఆహార పదార్థాలను భారీ ఎత్తున అగ్గిపాలు చేసే దశను - తిరిగిపోవటం అంత అసంభావ్యం దశాబ్దాలమీదటసామాన్య ప్రజలు ఆర్థికంగా బాగుపడకపోయినా, రాజకీయ హక్కులూ, సామాజిక స్వాతంత్ర్యమూ కొంచెం కొంచెంగా పెంపొందించుకుంటూ వస్తున్నారు దీన్ని తుడిచి పెట్టటానికి తప్ప పునరుద్ధరణ వాదం ఇంకా ఎందుకు పనికిరాదు దీన్ని ఎవరుగాని ఎలా కాదంటారో ఊహించటం కూడాసాధ్యం కాదు

పోతే, పురోగమన- సంస్కార-వాదులు మిగిలారు వీరు సమస్యను పరిష్కరించారా? అదీ లేదు.

వీళ్ళు భారతీయ సంస్కృతి ఎలా ఉంటే బాగుంటుందో గాలిలో ఒక అంచనా కట్టి, దానికి అనుకూలంగాలేని విశ్వాసాలన్నిటినీ మూఢవిశ్వాసాల కింద ప్రచారం చేశారు అవి పురోగతికి అడ్డంగా వున్న విశ్వాసాలు! బాగానే ఉన్నది. కాని అవి ప్రజలలో చాలా బలంగా వేళ్ళు తన్నిన విశ్వాసాలు! హుష్ కాకీ! అంటే పోయేవి కావు. ప్రజలను అవమానించకుండా వాటిని తిట్టటం సాధ్యంకాదు. పిల్లవాడి మంచి కోరుతూ వాణ్ణి చావబాదే బడిపంతుళ్ళ దుస్థితిలో పడ్డారు సంస్కర్తలు!

మమ్మల్ని ఏంచెయ్యమంటావు? ప్రజలు మూఢవిశ్వాసాలకు బలి అయి పోతుంటే, నిస్సహాయులమై, చేతులు కట్టుకు కూర్చోమంటావా? ఈ దిక్కుమాలిన విశ్వాసాలూ, ఆచారాలూ మనుషుల మానవత్వాన్ని కూడా నాశనం చేస్తూంటే, దాన్ని గురించి గట్టిగా చెప్పవలసిన అవసరమూ, బాధ్యతా మేధావులకు ఉన్నాయా, లేదా? అని అడగవచ్చు.

కాని ఈ అవసరాన్నీ, బాధ్యతనూ గుర్తించ దలచుకున్న వాళ్ళు కొన్ని ప్రశ్నలకు సమాధానాలు తెలుసుకోవాలి అప్పుడుగాని వారు తమ బాధ్యతను నిర్వర్తించలేరు.

1 మూఢాచారాలలో కొన్ని మూఢ సాంప్రదాయాలు. వీటిని బాధ్యతగల వారు స్పష్టంగా గుర్తించాలి.

మనుష్యులలో సంఘీభావం చిత్ర విచిత్ర రూపాలలో ఉంటుంది. నా చిన్నతనంలో మా బంధువుల ఇళ్ళలో ఎవరికి కాస్త పెద్ద జబ్బుచేసినా, ప్రథమ చికిత్సలాగా వెంకటేశ్వర స్వామికి పసుపు గుడ్డపీలికలు ఒకరాగి-డబ్బు ముడుపు కట్టి మొక్కుకునేవాళ్ళు, ఎవరైనా ఒక కుటుంబీకుడు డామ్ నాన్సెన్స్! జబ్బుకు మందిస్తారుగాని, మొక్కుకోవడం ఏమిటి? అని పెడ దిరిగితే, వాడు తనవాళ్ళకు అంతో, ఇంతో ఎడంకావటం తప్పనిసరి.

ఇటువంటి అనవాయితీలు సవాలక్ష! వీటిని వ్యక్తిగతమైన విశ్వాసాలు అనలేం - ఒక సముదాయానికి చెందినవి. పెళ్ళిచేసుకుంటే ముందు వెంకటేశ్వర స్వామి దీపారాధనా, తరవాత సత్యనారాయణ వ్రతమూ చెయ్యి! అందరూ చేస్తారు! ఒంటికంటి రామలింగం లాగా. ఊరందరి దారీ కాదన్నా ఉలిపికట్టెలాగా ప్రవర్తించకు!

ఇది నియమం అని కాదు. నీకు మందనుంచి వేరైపోయే ధైర్యమో అంతకన్నా ముఖ్యమైనది డబ్బో ఉంటే ఎడంగా పో! నిన్ను ఎవరూ ఏమీ చెయ్యలేరు. కాని సగటు మనిషికి పదిమంది లాగా ఉండాలని వుంటుంది గాని విలక్షణంగా ఉండాలని ఉండదు.

సినిమా ప్రొడ్యూసరు అయినవాడు ప్రతివాడూ పిక్చరు టిన్నులు తిరపతికి పట్టుకెళ్ళి, ప్రోక్షంచేయిస్తూంటే ఒకానొకడు 'నేను నమ్మను,' అని పిక్చరు రిలీజు చేసి డబ్బు చేసుకుంటే వాణ్ణి ఎవరూ అడగరు, కాని పిక్చరు ఫ్లాప్ అయిందో లోకం కోడై కూసినట్టుగా అందరి ఆక్షేపణలకూ గురి అవుతాడు. పైకి ఎలా కనిపిస్తుందంటే, టిన్నులు ప్రోక్షణ చేయించుకున్నవాళ్ళందరూ, పిక్చరు మట్టికరిచిన వాళ్ళతో సహా, చాలా వివేకం గల వాళ్ళయినట్టూ, అలా చెయ్యని ఒక్కడూ గాడిద అయినట్టూ కనిపిస్తుంది. ఇటువంటి ఒక్క నిదర్శనం మూఢ సంప్రదాయాన్ని గట్టిగా బలపరిచి నట్టు భ్రమ కలిగిస్తుంది.

ఇలాంటి మూఢ విశ్వాసాలను బాధ్యత గలవారు వ్యక్తుల జాడ్యాలుగా కాక, సాముదాయిక రుగ్మతలుగా గుర్తించాలి.

2. లా వొక్కింతయు లేక ధైర్యము విలోలంబైన పరిస్థితిలో మనుష్యులకు సంక్రమించే మూఢవిశ్వాసాలు.

ఇలాటివి కూడా నా చిన్నతనంలో అసాధారణ పరిస్థితులలో తల ఎత్తేవి. మనిషి దీర్ఘరోగం పాలవుతాడు. వైద్య విజ్ఞానం అంతగా అభివృద్ధి కాలేదు. రోగనిదానం

చేసి, సరిఅయిన చికిత్స తెలిపే నాథుడు కనుచూపుమేరలో లేడు భూతవైద్యుడు అందుబాటులో ఉండే వాడు వాడి వృత్తి వాడిదీ! తుమ్మినా చేతబడే నంటాడు. దయ్యాలను, పిశాచాలను మారణ హోమం చెయ్యాలంటాడు. ఒకప్పుడు వైద్యానికి లొంగని రోగాలన్నీ మాంత్రికుల పాలపడేవి

గత్యంతరంలేక భూతవైద్యం చేయిస్తావు నీకు నమ్మకం ఉందా? కాదు. గత్యంతరంలేక! ఆఖరు ప్రయత్నం కింద! ఇలాటి పరిస్థితిలో ఉన్నవాడికి హేతువాదం ఉపదేశించటం ఎంత వృథా. భూతవైద్యం చేయించిన వాడు శాస్త్రీయ చికిత్సల జోలికి పోకుండా తిన్నగా బూత వైద్యుడి దగ్గరికి పోతే వాడికి హేతువాదం చెప్పొచ్చు. కాని హేతువాది అయి కూడా గత్యంతరం లేక భూతవైద్యం చేయించిన వాణ్ణి ఏమనగలం?

అది అలా ఉంచి, దారితప్పి ఒక దీర్ఘవ్యాధి ఏ చికిత్సకూ లొంగక, మనకు తెలియని మనోవైజ్ఞానిక కారణాలవల్ల భూతవైద్యానికి లొంగి, నయమయిందను కోండి, భూత వైద్యానికి దానివల్ల కలిగే ప్రతిష్ఠను హేతువాదం తుడిచి పెట్టగలదా?

మనుషులను మూఢవిశ్వాసాలనుంచి కాపాడే బాధ్యతను మీదవేసుకున్న వాళ్ళు ఆ మూఢవిశ్వాసాలు ఏ పరిస్థితులలో బలపడుతున్నదీ స్పష్టంగా తెలుసు కొనేటంత ఓపిక కలిగి ఉండరు

ఇవాళ పోస్ట్ హిప్నాటిక్ సజెషన్‌తో కొన్ని వ్యాధులు నయం చేయవచ్చునన్నది విస్తృతంగా తెలిసిపోయింది కాని అర్ధశతాబ్దం క్రితం మన దేశంలో అలాంటి చికిత్స చేయించినవాణ్ణి సంస్కర్తలు మూఢుడి కింద తప్పక జమకట్టి ఉండేవారు.

ఈ సంస్కర్తలతో వచ్చిన చిక్కుల్లో ఒకటి ఏమిటంటే తమ జ్ఞానం సమగ్రమన్నట్టు వారు ప్రవర్తించటం. ఇదొక మూఢ విశ్వాసమే, న్యాయం పడితే!

3. విశ్వాసాలు కాని విశ్వాసాలు. ఇవి రకరకాలుగా ఉంటాయి. ఇక్కడ మద్రాసులో వీధికి మూడు చిన్నచిన్న గుడులుంటాయి దారేపోయే వాళ్ళలో కొందరు ప్రతి గుడి దగ్గిరా ఆగి గాని, ఆగకుండా గాని, కారులో పోతూ గాని చెంపలు వేసుకున్నట్టు అభినయిస్తారు. ఇలా చెయ్యటం వల్ల తమకు కలిగే లాభం గురించి వారిలో ఎక్కువ మంది ఆలోచించరు. కాన్వెంటులో చదువుకునే పిల్లలు చీటికీ, మాటికీ క్రాస్ చేసుకోవటం అలవాటు చేసుకోవచ్చు. కొందరు యువకులు తమ అయోమయ స్థితిని వ్యక్తం చెయ్యటానికి భుజాలు ఎగిరేసినట్టు! మరికొందరు ఆశ్చర్యం ప్రకటించటానికి ఈల వేసినట్టు.

వీటిని గట్టిగా విశ్వాసాలనటానికీ లేదు, కాదనటానికీ లేదు - అలవాట్లకింద వచ్చే విశ్వాసాలు శనివారం రాత్రి ఫలహారాలూ, ఏకాదశి నిరాహారమూ, శుక్రవారం తలంట్లూ, ఆదివారం విందు భోజనమూ లాటివి కొందరు, తమ జీవితమంతా

వాటమీదనే ఆధారపడినట్లు ఆచరిస్తారు ఏమొక్కూ, ఏ కోరికా లేకుండా ఏటా తిరుపతి కొండకు వెళ్ళి వచ్చేవాళ్ళున్నారు.

ఇలాటి వాటిని సీరియస్‌గా మూఢవిశ్వాసాల కింద పరిగణించనవసరం లేదు

ఈ సందర్భంలో మనం గమనించవలసిన దేమంటే ఒక ఆచరణ మూఢవిశ్వాసంతో కూడినది కావచ్చు, కేవలం అలవాటు కావచ్చు- తిరుపతి కొండకు వెళ్ళటంలాగా! బిచ్చగాళ్ళకు దానధర్మాలు చెయ్యటం లాగా! కొందరు స్త్రీలు సివిల్ మారేజ్ చేసుకున్నాక నల్లపూసలూ, పుస్తెలూ వేసుకున్నట్టు!

4 మన భారతదేశంలో ప్రతి ఆచారమూ మతానికి సంబంధించినదే నన్న భ్రమ హెచ్చుమందికి ఉన్నది అనాగరిక దేశంలో మతాచారాలకూ, సాంఘిక సంప్రదాయాలకూ ఎలాటి భేదా ఉండేది కాదు మన లౌకిక జీవితం గట్టి పునాదిమీద నిర్మితం కాని కారణం చేత ఇవాళ మన కట్టూ, బొట్టూ దగ్గిరనుంచి అన్నీ మతమే అన్న భ్రమ కలుగుతుంది అందుచేత అన్ని ఆచారాలనూ మతాచారాలుగానే భావించే వాళ్ళున్నారు చొక్కా విప్పకుండా తిండి తినటం మత విరుద్ధం బల్ల భోజనం మత విరుద్ధం సొంత ఘరంలో కూడా మైల ఉంటుంది

కాని నిజమైన మత విశ్వాసాలూ, వాటిలో మూఢవిశ్వాసాలూ బాధ్యత గల వాళ్లు గుర్తించాలి వాటి వెనక అసలైన దోపిడీ ఉంటుంది. ఇవే మనిషిలో అవసరమైన హేతువాదాన్ని దెబ్బతీసేవి. అంతేకాదు, వీటికి పెత్తందార్ల ప్రాపు ఉంటుంది. వర్గసమాజం అన్నది ఏర్పడినాక దోపిడీకి అవసరమైన మత విశ్వాసాలను పాలకవర్గాలు సామదానభేద దండోపాయాలతో కాపాడాయి.

ఆస్తి హక్కూనుకాపాడటానికి దొంగలను శిక్షించటం మనం అర్థం చేసుకోవచ్చు కాని దొంగతనం చేసిన వాళ్ళను నరకంలో రంపాలతో కోస్తా రన్నదానికి అర్థం ఏమిటి? నరకంలో ఈ ఏర్పాటు ఎప్పటినుంచి జరిగింది? తొలి వేదయుగంలో ఆస్తి హక్కులు సమష్టిగా ఉండేవి. శత్రువుల గోగణాలను బందిపోటు చేసి తెచ్చిన ఇంద్రుడు వేదకాలపు ఆర్యులకు ఆరాధ్యుడైనాడు!

వ్యక్తులకు వర్తించే ధర్మాలు జాతులకు వర్తించవు హంతకులను ఉరితీస్తారు. యుద్ధరంగాల్లో లక్షలాది జనం చావటానికి కారకులైన వారి నెత్తిన కిరీటాలు పెడతారు. అట్లాగే ఒకనాటి ధర్మం ఇంకోనాటి అధర్మం అవుతుంది. ఒకప్పుడు ఇరుగుపొరుగు రాజులతో యుద్ధాలు చెయ్యడం క్షత్రియ ధర్మంగా ఉండేది. ఈనాడు ప్రపంచ శాంతికి భంగం కలిగించిన నాయకులు నేరస్థులవుతారు. యుద్ధాలు నివారించే శక్తి ఎవరికీ లేకపోయినా, అవి అనివార్యాలని ఎవరూ నమ్మటం లేదు

మతంతో ఏమీ సంబంధం లేని విషయాలను మతంతో ముడివేస్తూ సామాజిక వ్యవస్థను దోపిడీదార్లకు అనుకూలంగా కొనసాగించటానికో, మరొక దోపిడీ వర్గానికి అనుకూలంగా మలచటానికో ప్రయత్నాలు చేస్తారు. ఇందుకు గాను జరిగే మూఢవిశ్వాసాల ప్రచారాన్ని తీవ్రంగా ఎదుర్కోవాలి. అలాంటి పోరాటంలో ప్రజల జీవితం బాగుపడుతుంది.

ఆధునిక జీవితంలో ఆహారము, ఇతర వినియోగవస్తువులూ ఉత్పత్తి చేసేవాళ్ళకు సుఖంగా బతికే హక్కున్నది. ఉత్పత్తి చేయకపోయినా, సేవచేసే పోలీసులూ, సైనికులూ, వాహనాలు నడిపేవారూ, ఉత్తరాల బట్వాడా చేసేవారూ, వాణిజ్యం చేసేవారూ, మూటలు మోసేవారూ, చదువులు చెప్పేవారూ, రోగాలకు చికిత్స చేసేవారూ మొదలైన అనేక తరగతుల వాళ్ళు సుఖంగా బతకటం అవసరం.

కాని అప్పుగా మతసంబంధమైన వృత్తులను ప్రజలు ఎందుకు పోషించాలి? మనం కొంచెం ఆలోచించి నట్టయితే దేశానికీ, ప్రజలకూ నిజంగా అవసరమైన వృత్తులన్నీ మతాలకూ, మత విశ్వాసాలకూ అతీతమైనవే. మా ముస్లిమ్ డ్రాయింగు మేస్టరు ఇంటికి పోయి, నమాజ్ చేసినా ఎగగొట్టినా మాకు ఆయన విలువ మారదు. అల్లాగే మా తెలుగు మేస్టరు ఇంటికి పోయి శివుడికే అర్చన చేసేవాడో, విష్ణువునే ఆరాదించేవాడో మాకు పట్టేది కాదు.

మత స్వాతంత్ర్యం అన్నది పైకి కనిపించినంత ఉదారమైనది కాదు. మతాలన్నీ ఒకటేనన్న వాళ్ళు మత మూఢులు. మతాలు ఏకం కావలసిన జనాన్ని విడగొట్టటమే గాక, పూర్తిగా నిరుపయోగమైన విశ్వాసాలను అమలులో ఉంచుతాయి, ఆధునికజీవితంలో మతానికి చెప్పుకోదగిన స్థానం లేదన్న భావాలు మతాలన్నీ ఒకటేననవచ్చు. ఈమాట ఒప్పుకున్నవాడు ఏ మతానికీ కమిట్ అయినవాడు కాడు. అలా కాకుండా ఒక హిందూ మతపిచ్చిగాడు, మరో మత పిచ్చిగలవాడు, మతం మీద బతుకుతూ, అదే వృత్తిగలవాడు అన్ని మతాలూ ఒకటేనని ఒప్పుకుంటాడా? చచ్చినా ఒప్పుకోడు.

నూటికి నూరుపాళ్ళ సోషలిజంలో కూడా వ్యక్తులు ఎవరి ఇష్టానుసారం వారు ఆరాధన చేసుకోవటం వల్ల ప్రమాదం లేదు. కాని సంఘజీవి అయి పదిమందిలో చావు పెళ్ళితో సమానం అన్నట్లు జీవించే సామాన్య ప్రజలలో ఒక మత మూఢుడు వందమందిని మత మౌఢ్యంలో ఉంచగలడు. ఈ సత్యాన్ని గుర్తించే, అలుగ్గడ్డ స్థాయిలో ఉన్న మన దేశాలు ప్రజాశత్రువులైన ప్రజాపాలకులు ప్రజలకు పొద్దున్నే కాఫీతోపాటు భక్తి రంజనులూ, భజనలూ, మతోపన్యాసాలూ మొదలైనవి రేడియోలు ప్రారంభించి, రోజుల్లా తోముతారు. ఈ తోముడు ప్రజలను మరింత మంచి

పారులను చేస్తాయనా? వారి ఆర్థిక దశను ఒక శాతం మెరుగుపరుస్తాయనా? ఏదికాదు ఇది ప్రజలకు విరుద్ధంగా బాహాటంగా జరుగుతున్న కుట్ర

అందుచేత బాధ్యత వహించదలచుకున్నవాళ్ళు వూరికే మూఢ విశ్వాసాల జాబితాలు తయారుచేసి ఊక దంపుళ్ళు దంచక, అసలైన మతమౌఢ్యాన్ని, దాన్ని ప్రచారం చెయ్యటానికి లక్షలూ, కోట్లూ ప్రజాధనంలో వేస్తున్నవాళ్ళనీ పురుగే రండి, దేవుళ్ళనూ, మతాన్ని తుడిచిపెట్టే వ్యర్థప్రయత్నం చేసేకన్న, వాటికి సామాజిక శక్తి ఏమీ లేకుండా చెయ్యటం అవసరం. విచక్షణా రహితమైన సంస్కరణోద్యమాలు గుడ్డివాడి చేతి రాయిలాగా గురికి తగిలేది లేంది చెప్పటం కష్టం

*ముద్రణ యువ, మాసపత్రిక, ఫిబ్రవరి 1980*

*పునర్ముద్రణ. కళలు – శాస్త్రీయ విజ్ఞానం, విరసం ప్రచురణ, సెప్టెంబరు 1980*

# 1. పత్రికా సాహిత్యం

అప్రతిభ తెలుగు వాళ్ళ సొమ్ము

అందుచేత తెలుగు వాళ్ళు ఏ పెద్దపని చెయ్యబోయినా కొంచెం హాస్యాస్పదంగా ఉంటుంది. పని పూర్తి అయినాక పర్యవసానం సున్నా

మనం నాటకాలాడతాం, పత్రికలు సాగిస్తాం, పుస్తకాలయాలు ప్రారంభిస్తాం మనం ఏది ప్రారంభించ బొయ్యేటప్పుడు కూడా తుమ్మేవాళ్ళుంటారు వారు దీవించినట్టే మన ప్రతి ఒక ఉద్యమమూ చివరకు తుస్సుమని పోతుంది.

సంఘం ఎప్పటిచోటే ఉంటుంది కళలు కళ్లయినా తెరవ్వు.

మనం బయలుదేరదీసే రాజకీయసంస్థలూ కాస్త హెచ్చు తగ్గుగా ఇంతే

ఏ ఉద్యమంలోకీ సరి అయినవాడు రాడు, ఉత్సాహమూ, ఆసక్తీ సమానపాళ్ళుగా గలవాడు ముందుకొస్తాడు. నిరుత్సాహమూ అప్రయోజకత్వమూ సమానపాళ్ళుగా గలవాళ్ళు వాణ్ణిచూసి నవ్వుతారు .. సరి అయినవాడు తెలుగుగడ్డలో పుట్టడని నేననటం లేదు. సరి అయినవాళ్ళు పుట్టరు, తయారవుతారు. తెలుగు దేశంలో తయారీ లేదు

స్వతస్సిద్ధమైన తెలివితేటలు తెలుగువాళ్ళకున్నట్టు మరెవరికీ లేవు. కాని తెలుగు దేశంలో తయారీలేదు

దాదాపు మూడుకోట్ల ఆంధ్రులకి ఎన్ని సాంఘిక సంస్థలైనా ఉండాలి లేవు. కాని తెలుగు దేశంలో తయారీ లేదు వాటిని నడిపేవాళ్ళు లేరు

జర్నలిజం తీసుకోండి - మిగిలినవి తీసుకున్నట్టే

మునిసిపాలిటీలు రోడ్డువేసి, ఊడ్చి, దీపాలు పెడతై, స్కూళ్ళు రాయటమూ చదవటమూ నేర్పుతై. సినిమాలూ, నాటకాలూ వినోదం కలిగించుతై.

విజ్ఞానం ఎవరిస్తారు? సంఘానికి అవసరమైన మానసిక పరిణామం ఎవరు కలిగిస్తారు? ఇన్ని కోట్ల మందికి సమత్వమూ, సంప్రదాయాలూ- ఈమారే పరిస్థితులలో - ఎవరు కల్పిస్తారు? స్వతహాగా రేగని ఈ కోట్లమంది ఆలోచనలను ఎవరు రేపుతారు?

పత్రికలు! చాలా ఉన్నై, కాని చాలవు. ఇంకా కావాలి - అనుకునేవారు లేరు. ఉన్నవే ఎక్కువయినై - సరి అయినవి కానందువల్లా, వాటి వల్ల ప్రయోజనం లేనందువల్లా!

పత్రికలు ఎవరి అనుమతీలేకుండా విజృంభించుతున్నై. పత్రికలు విజృంభించ టానికి మరెవరి అనుమతీ అవసరం లేదు వాటి అనుమతే కావాలి.

ఎందుకంటే వాటి సంఖ్య పెరిగినకొద్దీ వాటి యొక్క ఐకమత్యం అధికంగా అవసరం అవుతుంది రెండువందల పత్రికలు రెండు వందల సంస్కారాలకు ప్రచారం ఇచ్చి ప్రయోజనం లేదు. అట్లా అయినట్టయితే పత్రికలే అవసరం లేదు మూడుకోట్ల సంస్కారాలుగల మూడు కోట్ల ఆంధ్రులున్నారు!

పత్రికలలోపోటీ ఉండవచ్చును, ఉండాలి. కాని తలా ఒకదిక్కు పరిగెత్తే వాళ్ళు పోటీ ఎట్లా చేస్తారు? పోటీ చెయ్యటానికైనా అంతా ఒక దిక్కే పరిగెత్తాలి. ఒక విధమైన సంస్కారాన్నే - లేక ఏ రెండుమూడు విధాల సంస్కారాల నయినాసరే - ప్రచారం చెయ్యటంలో రెండువందల పత్రికలు పోటీ వేసుకోవచ్చు, నష్టం లేదు లేదా ఎన్ని పత్రికలుంటే అన్నీ కార్యవిభజన చేసుకోవచ్చు తప్పులేదు ఒకపత్రిక చేసేపనే మరోపత్రిక మరింత అసహ్యంగా చెయ్యటానికి పోటీ చెయ్యటం హాస్యాస్పదం ఆ ప్రతిభ - ఆంధ్రులసొమ్ము

పత్రిక నడిపేవాడికి ముందు కావలసింది ధనతృష్ణ, ఆ తరువాత దాన్ని తీర్చుకునే తెలివితేటలూ, యుక్తీ, ప్రజ్ఞా ...

డబ్బు గడించటానికి సాధ్యమైన మార్గాలన్నీ మంచివి కావని కొందరు పెద్దలు! వారు అన్ని మార్గాలూ అవలంబించనక్కర్లేదు, వారికి యోగ్యమైన మార్గంగా తోచినదే అవలంబించవచ్చు. ఎవరిమటుకు వారు, '' డబ్బు సంపాదించుకునేటందుకు నాకు చాతనయిన మార్గాలన్నీ యుక్తమైనవే! '' అనుకోవాలి. నిజంగా తప్పుడు మార్గాలనేవి వుంటే వాటిని అవలంబించినవాడు మనం వద్దన్నా మానడు. శాసనవిరుద్ధమైన పనులు చేసినవాడు శిక్ష అనుభవించనే అనుభవిస్తాడుగదా!

అందుకని ప్రతి పత్రికాధిపతీ తన పత్రిక అమ్మకం రెట్టింపు కావటానికి తనకు సాధ్యమైన ప్రతిపనీ చెయ్యవచ్చు, చెయ్యాలి.

పత్రికను ఎంత మందికొంటే అంతమందికి అంతకంటే షుమారు పదింతల మందికి దానితో ప్రయోజనం ఉందన్నమాట; పత్రికప్రకటించే సంస్కారాన్ని అంతమంది ఆమోదించారన్నమాట. ఆ సంస్కారాన్ని చిన్న చూపు చూసే అధికారం ఎవడికీ లేదు.

పత్రికాధిపతులకు - సంఘ సేవచెయ్యటం విషయంలో - తృప్తి అనేది ఎందుకు కలగాలి?

జీవితసూత్రాలనూ, జీవితాన్నీ, ప్రజాభిప్రాయాన్నీ తెలుసుకోనివాడు సంఘసేవ సమగ్రంగా చెయ్యలేడు. పత్రిక నడపటానికి అసమానవ్యక్తులు కావాలి.

వ్యక్తుల అసమానత్వం కొంత జన్మతహా కలుగుతుంది. కొంతపరిసరాలనూ విద్యనూబట్టి అబ్బుతుంది మిగతాది కృషి చేసి తయారు చెయ్యాలి. తయారీ ఆంధ్రదేశంలో లేదు.

డబ్బు సంపాదించటానికి బద్ధకంకణుడైన పత్రికాధిపతి అసమానవ్యక్తికోసం చూసి విసిగి లాభం లేదు. ఉన్నంతలో మెరికలంటి వాళ్ళను ఏరి పట్టుకుని వారికి అన్ని విధాలా ప్రోత్సాహం ఇవ్వాలి

ప్రోత్సాహం చాలావరకు డబ్బుతో కలుగుతుంది డబ్బుపెట్టుబడి పెయ్యకపోతే కాగితమూ, అచ్చుయంత్రాలూ రావు - పత్రికలు నడిపేవాళ్ళూ రారు. మనుష్యులకు జీతం సాధ్యమైనంత తక్కువజీతం - ఇచ్చేవాళ్లు చాలా మంది ఉన్నారు మనిషి మీద తెలివిగా డబ్బు పెట్టుబడి చేసేవాడు లేడు

ఈ వాణిజ్యయుగంలో మనకు పదిహేను రూపాయల సహాయం చేసేవాడికి మనం పది రూపాయలు మాత్రమే ఇచ్చి మిగిలినది మన జేబులో వేసుకోవడం ధర్మం అందుచేత మన నౌకరుకు మనవల్ల కలిగే సహాయం కంటే మనకు వాడి వల్ల సహాయం జాస్తి. ఆ మాట మనం పైకి ఒప్పుకోరాదు - మరిచి పోనూరాదు.

పత్రికలయొక్క ఆశయం లోకం మరమ్మతు అయినప్పటికీ లోకం మరమ్మతుకోసం పత్రికలు పెట్టరాదు. ఇది స్వేచ్ఛాయుగం! ''మావత్రికచదివి నువ్వు మరమ్మతు కా! '' అంటేపత్రికను ఎవరూ కొనరు ''మా పత్రికతో నిన్ను ఆకర్షించి నీజేబులో అణాకాను - బేడకానూ - పావలాకాను - దోచటానికి తీర్మానించాం. చాతనయితే ఇవ్వకుండా ఉండు! '' అంటేకొంతమంది అయినా శ్రద్ధ కనబరచవచ్చు.

లోకం ఇష్టంలేకుండా లోకం మరమ్మతు జరగదు. ఇందులో అసత్యం లేదు.

పత్రికలకు పిల్లిబుద్ధి ఉండటం కంటే కుక్క బుద్ధి ఉండటం మంచిది కుక్క మనిషిని నమ్ముకుంటుంది పిల్లి తనకు దక్కే పదార్థాలనే నమ్ముకుంటుంది.

పత్రికలు విరివిగా- తెలుగుదేశంలో కన్న పదింతలుగా - అమ్ముతున్న దేశాల్లో పత్రికాధిపతులు రాతగాళ్ళను నమ్ముకున్న వాళ్ళే తెలుగు పత్రికలు రాతగాళ్ళ మీద కన్న రచనలమీద ఎక్కువ మనుకారాన్ని చూపించుతై.

రహస్య మేమంటే రెండు మూడు పనికొచ్చే వ్యాసాలు రాసినవాడు, ప్రోత్సాహమిస్తే మరి కొన్ని రాయలేకపోడు. అందుచేత రాతగాణ్ణి ముందు సరిగా ఎన్నుకుని - నమ్ముకుంటే నష్టంలేదు. మంచి వ్యాసాలు ప్రమాదవశాన సృష్టికావటం ఎప్పుడన్నా ఉంటే అప్పుడు పత్రికలు వ్యాసాలను నమ్ముకోవటం ప్రారంభించ వచ్చును.

ఏ దేశంలో మంచి రాతగాళ్ళు కాదగినవాళ్ళు పైకి రాకుండానే పోతారో ఆదేశంలో పత్రికలు బాగా అమ్మవు... ఆంధ్రదేశంలో పైకి వచ్చిన రాతగాళ్ళు ఎవ్వరైనా ఉంటే వాళ్ళకు పత్రికలంటే మంట. వాళ్ళు పత్రికలకి చూపదగిన కృతజ్ఞత దాదాపు ఏమీలేదు.

రాతగాడు తన రచనమీద జీవించ లేకపోతే తన రచనలద్వారా ఏమీ సాధించలేడు. ఈ యుగంలో ఎవడైనా ముందు సాధించదగినది బతికి ఉండటం. తన రచన మీద రాతగాడు కేవలమూ బతికి ఉండి కూడా లాభం లేదు. రచన చేసేటందుకే

మాత్రం సంస్కారం అవసరమో ఆ సంస్కారంతో బతికి ఉండగలగాలి డబ్బుకీ సంస్కారానికి చాలా లంకె!

ఒక పత్రిక రచయితలను వారి సంస్కారానికి తగినరీతిగా బతికేటట్టు చూడాలని ఎక్కడా లేదు. ఆపత్రిక అమ్ముడు పోవాలనిన్నీ ఎక్కడా లేదు.

పత్రికలు సజీవంగా ఉండాలంటే అందులో ఉండే వ్యాసాలకీ స్వేచ్ఛ చాలా అవసరం మనం ఎంత స్వేచ్ఛను సభ్యత అని భావిస్తున్నామో అంతకంటే చాలా స్వేచ్ఛ ఉండాలి (ఇది హిట్లరు ప్రభుత్వానికి వర్తించదు. హిట్లరు లెక్కలో చచ్చినట్టుపడి ఉండటం జీవించటమూ, తగలబెట్టి ధ్వంసం చెయ్యటం జయించట మూనూ.)

బంధితుడి చైతన్యంలో పునరుక్తి ఉంటుంది. అనుకరణ ఉంటుంది స్వేచ్ఛకలవాడి చైతన్యం అట్లా ఉండదు.

జరగవలసిన లోకం మరమ్మతులో స్వేచ్ఛా వాంఛ ప్రచారం ఒకటి. స్వేచ్ఛలేని పత్రికలు స్వేచ్ఛను ప్రచారం చెయ్యలేవు. అది ప్రేయసితో వ్యాకరణ యుక్తంగా మాట్లాడినట్టుంటుంది

*ఆంధ్రపత్రిక, వార పత్రిక 1-1-1941*

## 2. ప్రచారం

సాంఘిక జీవితం తెచ్చిపెట్టిన అవసరాల్లో ఒకటి ప్రచారం. అది లేక సాంఘిక జీవితం నడవదు.

మనం నిత్యమూ మాట్లేడేదాన్లోనూ, చేసేదాన్లోనూ, చూసే దాన్లోనూ, వినేదాన్లోనూ, ప్రచారం ప్రయత్నం ఎంత ఉన్నదీ తెలుసుకోవటానికి ప్రయత్నిస్తే ఆశ్చర్యం వేస్తుంది.

రాజులు ఊరేగుతారు రాజకీయవేత్తలూ, ఎలక్షను అభ్యర్థులూ ఉపన్యాసాలిస్తారు. హరిదాసులు వీధులవెంట తిరిగి పాటలు పాడతారు. సినిమాల వాళ్ళు గోడలమీద పోష్టర్లు అంటిస్తారు. పత్రికల నిండా ప్రకటనలుంటై. ఎవరో వచ్చి మనతో ఫలాని వాడు వట్టి తాగుబోతని చెప్పిపోతాడు.

ప్రచారం అంటే మనలో చాలా మందికి అనుమానం.

జపాను రష్యామీదకు దూకటానికి సిద్ధంగా ఉందటగా?

నమ్మకు. అదంతా ప్రచారంలే!

ప్రచారమంటే అబద్ధమని.. .

నేను ప్రచారానికి లొంగే మనిషిని కాను . ప్రచారం అబద్ధమనీ తాను నిజాన్ని మాత్రమే నమ్ముతాడనీనూ

ప్రచారం నిజం కావచ్చు, అబద్ధం కావ అబద్ధపు ప్రచారం ఆరువేల ఏళ్ళు మనొచ్చు (బ్రాహ్మణులు విష్ణుమూర్తి తల్లోనించీ , శూద్రులు అతగాడి కాళ్ళలో నించీ ఊడిపడ్డారు !) నిజం ఒక్క రవ్వయినా ప్రచారం కాకపోవచ్చు

కాని ఒకటి మాత్రం చెప్పవచ్చును సమంగా ప్రచారం చేస్తే అబద్ధం కంటే నిజం బాగా ప్రచారం అవుతుంది. కనకనే నిజాన్ని సంఘం ఆరాధించ కలిగింది. అంతేకాని దేముడికి అబద్ధం కంటే నిజం ఎక్కువ ప్రీతి అని కాదు

అయితే పాడి నిజం చెప్పటం మటుకే ప్రచారం అయిపోదు. మంచుగడ్డ నీళ్ళమీద తేలుతుందీ అంటే అది అమాంతం ప్రచారమైపోదు.

ప్రచారం యొక్క ఉద్దేశ్యం మనిషిని ఒక పని చెయ్యటానికి ప్రేరేపించటం, ఒక రంగు పెట్టెలో నోటు కాగితం పడేయించటం, ఒక సినిమా చూడటానికి బయలుదేరదీయించటం.

ఒక భౌతికమైన ప్రయోజనం చూపకుడా ప్రచారం మనిషిని ఒక పని చెయ్యటానికి పురికొల్పలేదు . . ఫలాని రంగు పెట్టెలో ఓటు వేసి ఫలాని అభ్యర్థిని గెలిపించినట్టయితే వాడి వల్ల మీకే విధమైన ఉపకారం వుంది, ఫలాని సినిమా చూసినట్టయితే మీకు ఏ విధంగానూ కలగని జ్ఞానమో వినోదమో కలుగుతుంది.

మీరు ఫలాని టూత్ పేస్టు వాడినట్టయితే దేశానికి ఉపకారం చేసిన వాళ్ళు అవుతారు. .. మంచి ప్రచారం కాదు.

ప్రయోజనం ఎంత వ్యక్తిపరంగా వుంటే, ఎంత భౌతికంగా వుంటే అంత మంచిది.

ప్రచారం ఎక్కువగా జనసామాన్యానికి గురిచేయబడుతుంది. రాజులూరేగితే చూసేదీ, ఎలక్షను ఉపన్యాసాలు విని ఓటు చేసేదీ, డిఫెన్సు సేవింగ్స్ సర్టిఫికెట్లు కొనేదీ, పత్రికల్లో ప్రకటించే వస్తువులు కొనేదీ జన సామాన్యం.

జన సామాన్యం యొక్క రాజకీయార్థిక సాంఘిక స్థితి మారుతున్న కొద్దీ ప్రచారం యొక్క సాంఘిక విలువ మారుతున్నది. గొప్పవాడు నిలబడి ఉపదేశం చేస్తే జనసామాన్యంలో చైతన్యం పుట్టటం కద్దు. రాజు గారు దేశమంతటా తమ ఆజ్ఞను డప్పు కొట్టిస్తే అట్లాగే జరగటం కద్దు. ప్రచారంపై రెంటికన్నా సరికొత్త ఆయుధం.

రెండు పూటలా ఇంత తిండి తినటం కంటె మోక్షం పొందటమే ఎక్కువనీ, తమ మానప్రాణాలు ఇంకోర్ని సేవించటానికేననీ నమ్మే జనసామాన్యం వున్న చోట ప్రచారం సమగ్రంగా పరిణామం చెందలేదు గాని పరిణామం చెందినచోట ప్రచారానికి పైన చెప్పిన లక్షణాలుంటై.

1 ప్రచారం జనసామాన్యానికి గురి చేయబడుతుంది

2 అది ఒక సత్యాన్ని ప్రకటిస్తుంది

3 ఒక ప్రయోజనాన్ని సూచిస్తుంది.

4 ఒక విధమైన చైతన్యాన్ని ప్రేరేపిస్తుంది

ఈ అంశాలలో ఎందులో కొరత జరిగినా ప్రచారంలో లోపం జరుగుతుంది వీటిని అవగాహన చేసుకుంటే ప్రజాహితవాదులు కాని వారు చేసే ప్రచారంలో లోటెందుకు వచ్చేదీ గ్రహించవచ్చు

1. జన సామాన్యానికి గురి కాని ప్రచారం దెబ్బతింటుంది. ప్రస్తుతం మన దేశంలో యుద్ధానికి అనుకూలంగా జరిగే ప్రచారం జనసామాన్యానికి గురి కావటం లేదు. మన దేశంలోని పదో వంతు అక్షరాస్యులు బ్రిటిష్ సామ్రాజ్యతత్వంతో తృప్తి పడి ఊరుకోవటం ఎల్ల పత్రికా ప్రకటనలు జనసామాన్యాన్ని అంటవు. బ్రిటిష్ రాజకీయవేత్తల దృష్టిలో స్వాతంత్ర్యభారం వహించలేని దేశీయ పార్టీలు జనబాహుళ్యం మీద తృప్తికరమైన ప్రచారం చేసుకోగలిగినై!

2. ప్రచారం ద్వారా అబద్ధం వ్యాప్తి కావలసిన అవసరం ఒక పరిస్థితిలోనే కలుగుతుంది దాని వల్ల లాభం సాధించగల పార్టీ ఒకటి ప్రచారం కొనసాగిస్తున్నప్పుడు. ఫాసిస్టు దేశాల ప్రచారం ఎటువంటి అసత్యాల మీద ఆధారపడి వున్నదీ మనకు తెలుసు పాకిస్తాను ప్రచారం గానీ, అఖండ హిందుస్తాను ప్రచారం గాని ఈ జాతికి చెందినవే ముస్లిము జనసామాన్యం యొక్క భౌతిక క్షేమం మహమ్మదు ప్రచారం చేసిన మతం మీదనూ, హిందూ జనసామాన్యం యొక్క భౌతిక క్షేమం భగవద్గీత మీదనూ ఆధారపడి వున్నదనే ప్రచారం సమగ్రంగా వుండటానికి వీల్లేదు.

సరి అయిన ప్రచారం సత్యాన్ని వ్యాప్తి చెయ్యటం వల్ల జనసామాన్యం ప్రచారం ద్వారా క్రమంగా సాంఘిక విజ్ఞానం పొందుతారు. నిజం మరికొంత నిజానికి దారితీస్తుంది.

వేరు వేరు ఆశయాలు గల వాళ్ళు జనసామాన్యం యొక్క సానుభూతి కోసం ప్రచారం ద్వారా పోటీ చెయ్యటం ప్రారంభిస్తే చివరకు ఎక్కువ నిజం ప్రచారం చేసేవాడి ప్రచారం సఫలమవుతుందని రూఢిగా చెప్పవచ్చును. ఇటువంటి పోటీ విరివిగా సాగినకొద్దీ ప్రచారం యొక్క మంచిచెడ్డలను జనసామాన్యం నిర్ణయించుకోగల స్థితికి రాక తప్పదు.

ఏదో ఒక ప్రయోజనాన్ని సూచించకుండా ప్రచారం జనసామాన్యంలో చైతన్యాన్ని కలిగించలేదు గనక ప్రచారం జాస్తిగా అమలులోకి వచ్చిన కొద్దీ ప్రజల హక్కులూ భౌతిక క్షేమమూ క్రమంగా అభివృద్ధి కాక తప్పదు. జనసామాన్యం యొక్క అభివృద్ధి

ఏ మాత్రమూ కోరనివారు వాళ్ళచేత ఏ పని అయినా చేయించడానికి మరే ఆయుధమైనా ప్రయోగించవచ్చుగాని ప్రచారం మాత్రం వినియోగించలేరు.

సాంఘిక పరిణామం వెనకపడి ఉన్నప్పుడు దాన్ని ముందుకు తెచ్చే ఆసక్తి కనబరిచే శక్తులు దేశంలో కనిపించటం జరుగుతుంది అటువంటి వర్గాల వారు తమ అభ్యుదయాన్ని కొంత దూరం పాటు సాంఘిక పరిణామంతో ముడిపెట్టి కేవలమూ ప్రచారం ద్వారా, ప్రజాసామాన్యానికి చైతన్యం కలిగించి ఒక్క సమగ్రమైన ప్రజావిప్లవం సాధించగలరు. కాని ఈ విప్లవం ఒక కణువు దాటినట్లయితే ఆ వర్గం వారి అభ్యుదయానికి భంగం కలుగుతుంది గనక జనసామాన్యం తాలూకు చైతన్యం తాము నిర్ణయించిన గడి దాటిపోకుండా చూడగలందుకు రకరకాల శాసనాలు చేయవలసి వస్తుంది. ఒకప్పుడు అభివృద్ధికి దోహదమైన వర్గం సాంఘిక పరిణామానికి ఆటంకం కాసాగితే ఆ వర్గం సామాన్యంగా ప్రచారంతో తృప్తి పడి ఊరుకోదు. ఉన్న ప్రచారం కూడా దుష్టప్రచారంగా ఉంటుంది.

ప్రచారం ద్వారా ప్రజలలో చైతన్యం తీసుకురావటానికి ప్రజాహిత వాదులు తప్ప మరెవ్వరైనా జంకుతారు. ప్రచారం వల్లగాని, తదితర కారణాలవల్ల గాని ప్రజలలో పట్టుకొచ్చిన చైతన్యం ఎక్కడ ఆగుతుందో నిర్ణయించటం కష్టం.

సాంఘిక పరిణామంలో ఎంత వెనకపడి ఉన్న దేశమైతే ప్రజాచైతన్యం వల్ల హక్కుదార్ల కంత ప్రమాదం ఉంది. గత యుద్ధమప్పుడు అందరికన్న వెనకబడి ఉన్న రష్యనులు సాంఘిక పరిణామంలో అందరికన్న ముందుకు తోసుకొని వచ్చారు

అదే అమెరికావంటి పెట్టుబడిదారీ సంస్కారం గల దేశంలో ప్రజాచైతన్యం అంత విప్లవం సాధించలేదు. ఈ కారణంచేతనే సాంఘిక పరిణామం ముందుకు పోయిన కొద్దీ ప్రచారం విజృంభించి పనిచెయ్యటానికి అవకాశం ఉంది. రష్యను చక్రవర్తి తన ప్రజలకు కనిపించినదానికన్న అమెరికను ప్రజలకు తమ పెట్టుబడిదార్ల మరా దగ్గిరవాళ్ళుగా కనిపిస్తారు. సరి అయిన ప్రచారం రెండు భాగాలు: విజ్ఞానం ఇచ్చేదీ, చైతన్యం తెచ్చేదీనూ.

ఏ మనిషిలో గాని చైతన్యం తెచ్చే అంశాలు రెండు విధాలుగా ఉంటై బుద్ధిపూర్వకంగానూ, ఉద్రేకపూర్వకంగానూ, మంచిచెడ్డలూ, కష్టసుఖాలూ, లాభనష్టాలూ, బాగా గ్రహించి ఒక పనికి పూనుకునేవాడు కాలక్రమాన బోలెడంత విషయగ్రహణం చేసి ఉండాలి. తాత్కాలికమైన ఉద్రేకంలో వెళ్ళి ఏదో అఘాయిత్యం చేసి వచ్చేవాడు తరువాత పశ్చాత్తాపపడటమే కాక తాను చేసిన పనివల్ల తాత్కాలిక ప్రయోజనం కూడా పొందలేక పోవచ్చు. అయితే ప్రతివాడూ ఉద్రేకం ఏమీలేకుండా నిశ్చలమైన బుద్ధి నిర్ణయం ద్వారా చైతన్యం పొందగలడను కోవటం కూడా భ్రమే. బుద్ధి నిర్ణయానికి తోడు ఉద్రేకంకూడా కొంత ఉండాలి. ఈ రెంటికి సమన్వయం ఉండాలి.

ఇది సాధించటం ప్రచారం యొక్క విధి. నిన్నటివరకు హిట్లరును మెచ్చుకునే వర్గం ఈనాడు అకస్మాత్తుగా హిట్లరు రాక్షసుడని ప్రచారం సాగిస్తే ఆ ప్రచారం వ్యర్థం కాక తప్పదు. ప్రజాహితం కోరని వర్గాలు చేసే ప్రచారం ఇట్లానే ఉంటుంది.

అంతర్జాతీయాయుధంగా చూస్తే ప్రచారం చాలా వింత వస్తువు. దాని యొక్క ఉపయోగం ప్రజాహితవాదులు కాంక్షించాలి. అది ప్రజలకు విజ్ఞానం ఇవ్వటంలోనూ చైతన్యం కలిగించటంలోనూ సాటిలేనిది. ఒక దేశపు రాజు మరొక దేశపు రాజుకు గర్భశత్రువు కావచ్చు, ఒక దేశపు క్రైస్తవులు గాని ముస్లిములు గాని మరో దేశపు క్రైస్తవుల మీదా ముస్లిముల మీదా మతాభిమానం పాటించకుండా కత్తికట్టగలరు, ఒక దేశపు పెట్టుబడిదార్ల మురా మరోదేశపు పెట్టుబడిదార్ల గొంతులు కొయ్యటానికి సన్నద్ధులు కాగలరు. కాని ఒక దేశపు జనసామాన్యం ఇంకో దేశపు జనసామాన్యం మీద పగబట్టలేదు. ఆ కారణం చేత ప్రచారం ఒకటే నిజమైన అంతర్జాతీయ సాధనం. దీనిని విరివిగా వాడటం జరిగితే యుద్ధ ఫలితాలు యుద్ధాలు ప్రారంభం కాకపూర్వమే తెలిసిపోతై గనక యుద్ధాలు అరికట్టటానికీ, ప్రపంచమంతటా సరి అయినా సాంఘిక పరిణామం రావటానికీ ప్రచారం మించిన పనిముట్టు లేదు. అందుచేత ప్రజాహితవాదులు ముందుగా ప్రచార సాధనాన్ని సక్రమంగా ప్రయోగించే విజ్ఞానం సంపాదించాలి.

*రాసింది · 2-3-1943, అచ్చు అరుణతార ఫిబ్రవరి 1985*

## 3. పత్రికలు నడపటం

పత్రికలు నడవటం ఒక విద్య - ఒక కళ - ఒక ఉద్యమం. పత్రికలు నడుపుదామని సంకల్పించిన వాళ్ళు ముందు పత్రికలు పెట్టాలి. పత్రికలు పెట్టటం రాజకీయాల కిందికి వస్తుంది. పత్రికలు నడవటం లాగా అది నేర్చే విద్య కాదు. పత్రికలు నడపగలవాళ్ళంతా పత్రికలు పెట్టలేరు. (కనకనే కొంతవరకు బతికిపోయినాం) కాని పత్రికలు పెట్టేవాళ్ళంతా వాటిని నడిపే విద్య నేర్చుకోవచ్చు. రాజకీయాలలో ప్రవేశంలేని వాడవటంచేత ఈ రచయిత పత్రికపెట్టే అవకాశం లేదు అందుచేతనే ఈ వ్యాసం.

పత్రికలు నడపదలిచిన వారు మొట్టమొదట తెలుసుకోవలసిన రహస్యం ఏమిటంటే పత్రికలు నడవ్వు - కదలనైనా కదలవు. వాటి నెవరైనా కదిలించి నడిపించాలి. కొందరు అమాయకులు తమ పత్రికలు మరీవేగంగా నడిచి పారిపోతాయే మోనని భయపడతారు. కాని ఇది పొరపాటు. మనం పడుకున్న పత్రికలను చూస్తాంగాని పారిపోయిన పత్రికల్నిచూడం. అయితే ఒకటుంది. మనం పైకి పంపించేసిన

సంచికలు, కాలిపోయిన అవ్వాయి చువ్వల మొహంలేసుకుని మళ్ళీ తిరిగి రావటానికి అవకాశం వుంది. పత్రికల్ని పైకి నడిపించటం ఎంతకష్టమో అవి వెనక్కు తిరిగిరావటం అంత సులభం అందుచేత తెలివిగా పత్రికలు నడిపేవారేం చేస్తారంటే పత్రికల్ని బయటికి పంపేసి తలుపు బిడాయించేస్తారు ''మిగిలిపోయిన కాపీలు వాపసు తీసుకోబడవు'' అని ఏజంట్లకు ఒక షరతు పెడతారు ఈ షరతుప్రకారం కొందరు ఏజెంట్లు మనపత్రికను స్వార్జితంతో పోషించవలసి వస్తుంది. ఇటువంటి ఏజెంటు విశేషకాలం దిక్కడు· సమయం కోసం కని పెట్టుకునివుండి పత్రికలమ్మిన డబ్బు పులుసులో వేసుకుని ఏజన్సీ విరమించుకుంటాడు ఏజెంటు హంతకులిటువంటి దుర్మార్గానికి పాల్పడకుండా వాడిదగ్గిర తగుమాత్రం డిపాజిట్టు తీసుకోవాలి.

ఈ డిపాజిట్లు మన ఏజెంట్లు తోక ఝాడించకుండా చూడటమే కాక మన పత్రిక నడపటానికి ఆర్థికంగా చాలావరకు సహాయపడ గలవు. ఎంతో డబ్బుంటేగాని పత్రికలు నడప లేమనుకునేవాళ్ళు ఈ రహస్యం ముఖ్యంగా గుర్తించేది

పత్రికలు నడిపేవాడి కష్టాలింతటితో గట్టెక్కవు. మనం వేసే పత్రికలన్నీ అమ్ముడుపోయినా ఏజెంట్లందరూ పైనెల మొదటి వారం లోపల డబ్బు పంపిస్తున్నా పత్రికల మీద లాభాలుండవు. సహృదయలోకానికి మన సర్క్యులేషను రెట్టింపుచేసి చెప్పినప్పటికీ ఈ కొరత తీరదు. పత్రికకు తైలం లేందీ నడవదు. ఈ తైలం ప్రకటనలద్వారా వస్తుంది ప్రకటనలు సులభంగా రావు. వాటి కోసం కొంతకాలం ప్రయత్నించిన తరవాత అవి అసలు రానే రావని తేలిపోతుంది. అప్పుడు పత్రిక నడిపేవాడు పెద్ద సత్యం గ్రహిస్తాడు – పత్రికలు నడిపేవాడి మహోన్నత ఆశయం ప్రకటనలు తెచ్చుకోవటమని ! పత్రికల్లో కులభేదాలున్నాయి. ఆభేదాలు పత్రికలో పడే వ్యాసాలనుబట్టి గాని, బ్లాకులను బట్టి గాని, పత్రిక రంగులనుబట్టి గాని, ప్రింటింగుబట్టి కాని రావు, పత్రికలోపడే ప్రకటనలు బట్టివస్తాయి. మీకేమీ సందేహం అక్కర్లేదు. లింటాన్, జే. వాల్టర్ థాంప్సన్ ఈ స్టర్న్ లిమిటెడ్ మొదలయిన పెద్ద ఏజన్సీల ఎడ్వర్టయిజమెంట్లు తెచ్చుకునేవాడు ముష్టిసాహిత్య సేవకులతో మాట్లాడడు. ఎందుకు మాట్లాడాలీ? చాతనయితే నువు కూడా ఆ ప్రకటనలు తెచ్చుకో!

నిజంగా డబ్బిచ్చే ప్రకటనలు తెచ్చుకోవటానికి పు ష్ – కలం కావాలి. అన్ని కలాలకూ పు ష్ వుండదు. గొప్పవాళ్ళు కాదలచినవారు రెండురకాలుగా వుంటారు: గొప్పవాళ్ళలో కొద్ది వాడుగానైనా తిరుగుదామనుకునే వాళ్ళూ, కొద్దివాళ్ళ లోనే అయినా గొప్పగా తిరుగుదా మనుకునేవాళ్ళూ . రెండో రకం వాళ్ళు ప్రకటనలు తెచ్చుకోలేరు. దాని సంగతంతే!

పత్రికలు నడిపేవాడి ఆఖరుసమస్య రచయితలూ, వ్యాసాలూనూ. ఇది ప్రధాన సమస్యకాదు. కనకనే దాన్ని ఆఖరుకు వేశాం. పత్రికల్లో కొన్నివ్యాసా లుండాలి. వాటిని

ఎవరో ఒకరురాయాలి. అంతకంటే ఇందులో ఏమీ సమస్యలేదు పరమ తుక్కు రచనలు వేసే పత్రికలు కూడా హాయిగా నడుస్తున్నాయి. '' మంచి రచనలు, మంచి రచనలు'' అని ఆరాటపడే పత్రికలు సోదిలోకి రాకుండా పోతున్నై

ప్రఖ్యాత రచయితల చేత రాయించటం పత్రికకు ఆకర్షణ అని కొందరపోహ పడతారు. ఇది కేవలమూ భ్రమ. అస్తమానమూ ప్రఖ్యాతరచయితలవ్యాసాలే వేస్తుంటే ఇక సంపాదకుడు చేసేదేముంది? అందుచేత సంపాదకుడు ప్రఖ్యాత రచయితలమని భ్రమ పడేవాళ్ళ రచనల్ని తొక్కిపెట్టి, తన యిష్టం వచ్చినట్టుచేసి పత్రికకు సంపాదకుడెవరో స్పష్టంగా తెలియజేయాలి పత్రికకెప్పటికైనా పేరొస్తే అది సంపాదకుడి సంపాదకత్వ బలం వల్ల రావాలిగాని ప్రఖ్యాతరచయితల మూలంగా రాకూడదు. ఆ మాటకొస్తే పత్రిక చూడటానికి అసహ్యంగాకూడా ఉండాలి. పత్రిక ఎంత అసహ్యంగా ఉంటే సంపాదకుడంత పేరు సంపాదిస్తాడు. అనామకులైన కుర్రకారును పక్కనే వేసుకుని గొప్పనటులు కొందరు పేరుకు పేరూ, డబ్బుకు డబ్బూ కూడా గడించే మాత్రం మీదే సంపాదకుడు కూడా పేరూ, డబ్బూ సంపాదించ వచ్చు.

కొందరు పత్రికలు నడిపేవారు. వ్యాసకర్తలకు డబ్బివ్వక పోవటం గురించి కించపడతారు. కాని నిజం ఏమిటంటే, అనేక సంవత్సరాలనుంచీ అవిచ్ఛిన్నంగా సాగే పత్రికలు కూడా వ్యాస కర్తలకు డబ్బివ్వటం మొదలు పెడితే రక్కున దివాలాతీసి వూరుకుంటై పత్రికలెప్పుడూ దివాలా అంచున నడుస్తూ వుంటై. అందుచేత ప్రెస్సుబిల్లూ, ప్రకటనలు తెచ్చేవాళ్ళకిచ్చే కమిషనులూ, అప్పుడప్పుడూ ఏజెంట్లు ఎగేసేదిపోను, పత్రిక నడిపేవాడికి ఇంటి ఖర్చు బొటాబొటిగా వస్తుంది. ఇందులో వ్యాసకర్తల కివ్వటమంటూ పెట్టుకుంటే ప్రెస్సు బిల్లెగ్గొట్టాలిసొస్తుంది. లేదా ప్రకటనలుపోతై. అదీ కాక ఏజెంట్లు టోపీపెయ్య టానికుండదు. పత్రికకు ఉచితంగా వ్యాసాలు కట్టలకు కట్టలు వచ్చి పడుతుండగా కొన్ని వ్యాసాలకు డబ్బివ్వటం న్యాయంగా వుండదు. ఇస్తే అన్నిటికీ ఇవ్వాలి. పోతే, ఊరికేవచ్చే వ్యాసాలక్కూడా డబ్బివ్వటం హాస్యాస్పదంగా ఉంటుంది. అందుచేత వ్యాసకర్తలకు డబ్బివ్వటమనే దాన్ని, సాహిత్యం విలవలాగే, కాలం నిర్ణయించేస్తుంది.

పత్రిక పాలసీగురించి ఒక ముక్క. పత్రికలు జనసామాన్యం కోసం నడుపుతాం. ఓ యస్. పత్రిక ప్రజాసాహిత్యాన్ని ప్రచారం చెయ్యాలి. నిజమైన ప్రజాసాహిత్యం ఏదంటే జనసామాన్యానికి నచ్చే రాజకీయభావాలూ విమర్శలూ పత్రికలో ప్రచారం కావాలి. ప్రజలకి పనికొచ్చే భావాలని పేరుపెట్టి తమ యిష్టం వచ్చిన వివాదాలు ప్రచారం చేసేవాళ్ళు, నిజమైన ప్రజాహితులు. ప్రజల స్థితిని చూసీ, వారి అజ్ఞానాన్ని చూసీ అసంతృప్తి చెందరు. ఒకవేళ ప్రజల అభిప్రాయాల్లో తికమకలుంటే

మన పాలసీకి మరీ మంచిది ఎటురాసినా సులభంగా సమర్థించుకోవచ్చు జనసామాన్యం గాంధీజీని తిడితే మనమూ తిట్టాలి. అందరూ తిట్టక పూర్వమే మనం కూడా తిట్టటం అది దేశద్రోహం అవుతుంది ఆంధ్రులకు అరవలంటే మంట గనక మనం అరవలను దుమ్మెత్తి పొయ్యొచ్చును. ఇతరులెవరో రాజకీయాల్లోకి జాతివిభేదాలు తెచ్చి పెడతారు గనక మనజాతిని మనం గట్టిగా సమర్థించటం మన ఉత్కృష్ట ధర్మం.

కొత్తగా బయల్దేరే ఉద్యమాలని పత్రికలు నడిపే వాళ్ళం బెదురుతో చూడాలి. ప్రతి ఉద్యమంలోనూ గర్భితంగా వున్న మంచి చెడ్డలూ, శక్తులూ ఎవడు అంచనా కట్టుతూ కూచుంటాడు? అందుచేత ప్రతి కొత్త ఉద్యమాన్నీ ముందు ఎదుర్కొని చూడాలి. మనం ఎంత ఆపినా ఆగకుండా అది ముందుకొస్తే అప్పుడు మనం కూడా దాన్ని మెచ్చుకోవచ్చు. వెనక నువ్వు, తిట్టావే అని ఎవడూ అడగడు. ఉమర్ ఖయ్యాం చెప్పినట్టు నిన్న అనేది ఎవడిక్కావాలి?

మన ప్రయత్నం లేకుండా పైకొచ్చే వ్యక్తులను కూడా పత్రిక ద్వారా భట్రాజులల్లే పొగడాలి. తాలూకాఫీసు గుమాస్తాలు రెవెన్యూ ఇన్స్పెక్టర్లయినప్పుడూ, ప్లీడర్లు మునసబులైనప్పుడూ మనం వారికి తగుమాత్రం జిడ్డురాచి వదలాలి ప్రపంచం మారటానికి మన మేమీ చెయ్యరాదు. వాటంతట అవి జరిగినప్పుడల్లా ప్రతి మార్పునూ మనం గుర్తించి శ్లాఘించాలి. మనం వేసే టమటమాల్లో, కేకల్లో పస తక్కువైనప్పుడు డబ్బా మరింత గట్టిగా కొట్టాలి.

ఎవరన్నా ప్రఖ్యాత పురుషులు చచ్చిపోతే మనం సంపాదకీయకంగా కిందబడి మూర్ఛ పోయి, పొర్లి, రాగాలు పెట్టి ఘట్టిగా ఏడిచి మనకన్న మరెవ్వరూ ఏడవలేరనేది రూఢి చేసుకోవాలి. చచ్చిపోయిన ప్రతివాడి గొప్పా అన్వేషించి చెప్పటానికి మనకి నిజంగా టైముండదు.

ఈ పద్ధతుల మీద తెలుగు పత్రికల్ని నడిపి నట్లయితే తెలుగు జర్నలిజం చక్కని సర్కసు లాగా తయారు కావటానికేమీ సందేహం లేదు.

*ఆంధ్రజ్యోతి మాసపత్రిక, జూన్ 1946*

# 4. పత్రికలు - ప్రజలు

ఇవాళ అకస్మాత్తుగా పత్రికలన్నీ ఆగిపోతే ఏమవుతుంది? అని మనని నిలదీసి ప్రశ్నవేస్తే మనకు నవ్వూ, ఆశ్చర్యమూ, కోపమూ కూడా వచ్చేస్తాయి ఎందుచేతనంటే అది అర్థంలేని ప్రశ్న. పత్రికలు లేకుండా ఈనాటి జీవితాన్ని మనం ఊహించుకోను కూడాలేం ఇవాళ నుంచీ పత్రికలను నిషేధిస్తే జనం అల్లాడిపోతారు అంతవరకు మనంసులభంగా ఊహించుకోగలం కానీ, ఎందుకు అల్లాడి పోతారు? ప్రజాసామాన్యానికి పత్రికల వల్ల నేరుగా లభిస్తున్న ప్రయోజనం ఏమిటి? పత్రికలు చదవని వారంతా నష్టపడిపోతున్నారా? అంటే మటుకు నూటిగా చెప్పలేం. ఒకప్పుడు పత్రికలు లేకుండా చరిత్ర నడిచిపోయింది అటువంటి కాలంలో లేనిది ఈనాడు ప్రజలకు అకస్మాత్తుగా పత్రికల అవసరం ఇంతగా ఎట్లాకలిగింది?

ఈ ప్రశ్నలన్నింటికీ సమాధానం చెప్పవచ్చు. ఒకనాటి ప్రజాజీవితానికీ ఈనాటి ప్రజాజీవితానికీ చాల వ్యత్యాసం ఉంది. ఆనాటి ప్రజల జీవితం ఖండ జీవితంగా ఉండేది వారి ప్రపంచమూ, వారి అనుభూతీ క్లుప్తంగా ఉండికూడా సమగ్రంగా ఉండేవి. ఇప్పటి ప్రజాజీవితం జీవిత ఖండం. విశ్వప్రజాజీవితంలో వివిధ దేశ, రాష్ట్ర గ్రామ ప్రజల జీవితం ఒక తునక, దీనికి సమగ్రత లేదు. ఏ జర్మనీ మీదనో, ఇంగ్లాండు, ఫ్రాన్సు దేశాలు యుద్ధం ప్రకటించగానే ఈ దేశంలో ఒక మూల ఒక పల్లెలో ఉన్న అన్నదమ్ముల ఎడబాటవుతుంది. మరోమూల మరో పల్లెటూళ్ళో వున్న కుర్రవాళ్ళందరికీ సంపాదన దొరుకుతుంది, ఇంకోమూల ఇంకో పల్లెటూళ్లో తిండి దొంగలు బయల్దేరి గ్రామస్తులను మాడ్చేస్తారు... ఈనాటి ప్రజాజీవితం దేశాన్ని చుట్టి వస్తుంది. ప్రపంచాన్నే చుట్టి వస్తుంది పత్రికలు లేని పక్షంలో ఎవరి అనుభవానికి అర్థం కనబడదు. తెరమీద చూపించే సినిమాచిత్రం తెరలో ఒక చదరపు అంగుళం మాత్రమే చూసేవాడికేమి బోధపడుతుంది? ప్రజాజీవితంకూడా అంతే.

ప్రజలంతా పత్రికలు చదవటం లేదు. చదివేవాళ్ళుకూడా ప్రజాజీవిత సినిమా కథను పూర్తిగా అవగాహన చేసుకోవటం లేదు. కానీ టూకీగానైనా అధికసంఖ్యాకులకు మానవ చరిత్ర అర్థమవుతున్నదంటే అది పత్రికల మూలంగానే. పత్రికలు చూడని వాళ్ళు కూడా చూసినవారి సంపర్కం వల్ల కొంత వరకుజ్ఞానం సంపాదిస్తున్నారు. బొత్తిగా పత్రికల వాసనే తగలకుండా జీవిస్తున్నవాళ్ళు కళ్ళు లేకుండానూ చెవులు లేకుండానూ బతికే వాళ్ళలాగే బతుకు తున్నారుగానీ అంతకంటే ఏమీలేదు.

అసలు సమస్య పత్రికలు ప్రజలకుపయోపడతాయా అనికాదు, ఇంతకన్నా అధికంగా ఎందుకుపయోగపడటం లేదని, ప్రజాజీవిత సినిమా కథ ప్రజలందరికీ

పత్రికల ద్వారా ఎందుకు సరిగా అర్థం కావటం లేదని, ఈ ప్రశ్నకు సమాధానం ఉంది, పత్రికలు సాధారణంగా నడపబడుతున్నది ప్రజలకోసం కాదు.

ప్రజాజీవితానికి అపారమైన సేవ చేసేశక్తి పత్రికలలో ఉంది కాని ప్రజలకు పత్రికల ద్వారా ప్రయోజనం కలగాలనే ఆశయం పత్రికలు నడిపేవారికి లేదు యంత్రాల లాగానే పత్రికలు కూడా తమ స్వశక్తి చేత ప్రజా జీవితాన్ని పై స్థాయికి తీసుకు పోవటానికి ఉపయోగపడినప్పటికీ యంత్రాలను నడిపేవారు కూడా వీటిలో సహజంగా ఉండే ఈ శక్తిని అరికట్టి ప్రజలకు ద్రోహం చెయ్యటానికి పూనుకొని ఒక సందిగ్ధం తెచ్చిపెడుతున్నారు దోపిడి విధానం అమలులో ఉండే సమాజం ఇలాంటి సందిగ్ధాలతో కూడుకొని ఉంటుందనే సాంఘికతత్వం తెలిసిన వారంతా ఎరిగిన విషయమే. ఈ వైషమ్యాలను సరిగా అవగాహన చేసుకోవటానికి తగినజ్ఞానం, ఓపిక, ఆసక్తీ లేని కారణముగా వాళ్ళు, తననికొట్టిన రాతిని కరిచే కుక్కల్లాగా యంత్రాల మీదా, పత్రికల మీదా విరుచుకు పడతారు.

పత్రికలను గురించి మాట్లాడేటప్పుడు పత్రికలను నడిపే వ్యక్తుల్ని వదిలేసి మాట్లాడటం చారిత్రక దృష్టికల వాడికి ఉచితంకాదు. సంఘ విద్రోహుల చేతిలో పడి పత్రికలు ప్రజలను మభ్యపెట్టినై, ప్రజలకు మతులుపోగొట్టినై, ప్రజలను పశువులకన్న హీనంగా చేసినై, ప్రజల చేత ఆత్మహత్య చేయించినై, ఫాసిస్టులు పత్రికల మీద ఎక్కివచ్చి ప్రపంచాన్ని సంక్షోభపెట్టారు దేశద్రోహులు పత్రికల చాటున మాతృదేశాలనూ అమ్మేశారు. పత్రికల అండ చూసుకొని ఫ్రెంచి మిలటరీ పాలకులు డ్రేఫసును అన్యాయంగా శిక్షించారు. అమెరికాలో పెట్టుబడి దార్లు టామ్మునీని జైలులోకి తోశారు బ్రిటీషు పత్రికలు హిట్లరు ముసోలినీలను ఆకాశానికెత్తినై. అమెరికను పత్రికలు రూజువెల్టుకు విరుద్ధంగా ఎలెక్షను ప్రచారం చేసినై. మానవచరిత్రలో పత్రికలు చేసిన భయంకరమైన, సంఘవిద్రోహకరమైన పనులకు, పత్రికలే మనుషులై ఉంటే వాటిని ఎప్పుడో ఉరితీసి ఉండవచ్చు. కానీ పత్రికలు నడిపే వారుచెక్కు చెదరకుండా ఉన్నారు.

పత్రికల వ్యాప్తికి యంత్రసహాయం తోడు కాగానే పత్రికలన్నీ పెట్టుబడిదార్లచేతి పనిముట్లయి పోయినై. ఈ మార్పుతో పత్రికలన గానే ప్రజల ప్రబల శత్రువులనేది రూఢి అయిపోయింది. ఎందుచేతనంటే ప్రజాహితానికి పెట్టుబడి దారీ కన్న ప్రబల శత్రువులేదు. ప్రజా పీడనకు ఎన్ని కారణాలు అయితే ఉన్నాయో అన్నీ నేరుగా పెట్టుబడి దారీలో నుంచి పుట్టినవే ఈ విషయం స్పష్టంగా తెలుసుకోవడానికి చాలా మందికి బిడియం. ప్రజా సామాన్యంలో తెలివి తక్కువ వారనీ, ఇటువంటి కారణాలచేత వారు అధోగతిలో ఉంటారనీ వాదించే వారీ నాడు కూడా ఉన్నారు. వీరు తడవకొకవ్యక్తిని గురించి తప్ప ఆలోచించలేరు. గనక వీరికి జీవితం తాలూకు రంగులూ, అల్లికా, ఏమీ అర్థంకావు. పెట్టుబడి దారీ తన మరణశాసనం సంపుటాల

మీద సంపుటాలు రాసుకుని సంతకాలు చేసుకుంటూ, వస్తున్నది కాని అదంతా చదవలేని వాళ్ళు సంఘంలో జాస్తిగా ఉన్నంతకాలమూ పెట్టుబడి దార్లు నడిపే పత్రికలు ప్రజలకు అంతులేని హాని చెయ్యగలవు- చేస్తున్నాయి కూడాను. గొడ్డలి వెళ్ళిచెట్టును పెడి అడిగిందట, చెట్టు ఇచ్చిందట!

కాపిటలిజమూ, ఇంపీరియలిజమూ, ఫాసిజమూ - ఇవి ఉంటేనే పత్రికలు ప్రజాద్రోహం చేస్తాయనీ, ఇదిలేని చోట్ల పత్రికలు చాలా మడిగట్టుకుంటాయనీ అనుకోనవసరం లేదు. ప్రజలను దోపిడి చెయ్యాలనే కుతూహలం ఉన్నచోటనల్లా పత్రికలు ప్రజలకు ద్రోహంచేసి తీరుతాయి బానిసత్వంలో పడి ఉన్న మన దేశంలోనే పత్రికలు ప్రజాద్రోహానికి వెనకాడవు. యుద్ధం జరుగుతున్న రోజుల్లో యుద్ధప్రకటనలను, వేసిన పత్రికలే యుద్ధానికి వ్యతిరేకంగా సంపాదకీయాలు రాశాయి. రాజకీయపోరాటం - పైవాళ్ళతో కాదు. దేశంలో ఉన్నసాటివాళ్ళతో - సాగించడానికి గాను ఫోర్జరీ ఉత్తరాలు ప్రకటించి రాజకీయ వైషమ్యాలు రెచ్చగొట్టాయి. బ్రిటీషు సామ్రాజ్య వాదులు తమ ఏజెంట్లయిన రాయిటర్సు ద్వారా తట్టలకు తట్టలు రష్యావిరుద్ధ ప్రచారాలు, స్వదేశ పరిశ్రమలు కూడా సాగించాయి. స్టాలిన్‌ను రాయిటరు అనేక సార్లు మంచం పట్టించాడు, అనేక సార్లు చంపాడు. అనేక సార్లు పార్టీలో నుంచి వెళ్ళగొట్టించాడు అటువంటి అసత్యప్రచారం వల్లరాయిటరును పోషించేవారికి ప్రయోజనం ఉంది ప్రపంచ ప్రజలతో పాటు వారికి కూడా లాభం ఉందన్నమాట! ప్రతి దేశంలోనూ ఉండే ప్రజాసామాన్యంలో అనేక విభజనలు ఏర్పడి ఉన్నై - అనేక కులాలు, మతాలూ, వృత్తులూ, ఇత్యాది ఉన్నై, కాని అన్ని విభజన లకంటే కూడా ప్రజాక్షేమానికి విద్రోహకరమైనది వర్గ విభజన అని ప్రజలే తెలుసుకుంటున్నారు ''ఇది మూఢవిశ్వాసమనీ, సోషలిస్టులూ, కమ్యూనిస్టులూ మభ్యపెట్టి, ప్రజలకీ విశ్వాసం అంటగడుతున్నారు'' అనీ అనేవారు లేక పోలేదు కాని ప్రజలీ విశ్వాసాన్ని స్వీకరిస్తున్నది సోషలిస్టుల, కమ్యూనిస్టుల తీపిమాటలకు, లొంగి కాదు; వర్గ పోరాటం అర్థం చేసుకుంటే తప్పవారికి తమ సమస్యలు అర్థం కావటం లేదు. మామిడి చెట్ల మీదే మామిడి కాయలు దొరుకుతాయని ఎటువంటి అనుభవంతో తెలుసుకుంటారో అటువంటి అనుభవంతోనే వర్గపోరాటం గురించి తెలుసుకుంటారు. ఈ తెలివి ప్రజలలో హెచ్చిన కొద్దీ పత్రికలకు - సంఘద్రోహం చేసే పత్రికలకు ప్రజలలో పలుకుబడి తగ్గుతుంది. ప్రజాసామాన్యం వర్గ వ్యవస్థను నిర్మూలించే ఆశయం గల పత్రికలనే విశ్వసించటం నేర్చుకుంటారు. ఆ ఆశయంతో నడిపే పత్రికలే ప్రజలకు అపారమైన సేవ చేయగలుగుతై. అటువంటి పత్రికలు రాజకీయ దృక్పథంతో నడిచినా, అవివార్తలే ఇచ్చినా, సాహిత్యమే ఇచ్చినా, వాటిని నడిపే వారు కష్టజీవులే అయినా, మధ్య తరగతి వారయినా, జమిందారులయినా

కూడా ఏమీ వ్యత్యాసం లేదు అటువంటి పత్రికల ద్వారా మాత్రమే నిజమైన అభ్యుదయం సాధ్యమవుతుంది ఒక ప్రత్యేక రాజకీయ పర్గాన్ని బలపరచినంత మాత్రం చేతనూ, ఒక ప్రత్యేకనినాదాన్ని పదేపదే ప్రకటించినంత మాత్రంచేతనూ పత్రికకు ప్రయోజనం లేదు ''సత్యం జరిగిన దానితో జరిగే దాన్ని ముడిపెట్టి జీవితంలో ఏకత్వం నిరూపిస్తుంది అసత్యందానికాళ్ళ మీదనే అది ఎంతోకాలం నిలబడలేదు.'' అన్నాడొక మహాపురుషుడు నిజమైన ప్రజాసేవ చేసే పత్రికలు జరిగే చరిత్రలో ఏకత్వాన్ని నిరూపిస్తే, ప్రజలకు ద్రోహంచేసే పత్రికలు ఏనాటి మాట ఆనాడు చెబుతై వీటిని సీరియలుగా వెలువడే అసత్య చరిత్రలనవచ్చును

*19-1-1947 నూదియ జయంతిసంచిక*

## 5. ఆంధ్ర ప్రజలకు స్వంతదినపత్రిక

విశాలాంధ్ర అవతరించడంతో ఆంధ్రప్రజానీకానికి, ముఖ్యంగా శ్రామిక వర్గాలకు, స్వంత దినపత్రిక ఏర్పడ్డట్టు అవుతుంది విశాలాంధ్ర సామాన్యప్రజల రాజకీయాలను అనుసరించుతూ, వారి రాజకీయ వాంఛలను చాటుతూ, వారి రాజకీయ పోరాటాలను బలపరుస్తూ విశాలాంధ్ర నిర్మాణోన్ముఖంగా సాగి అఖండ విజయాన్ని సాధిస్తుందని దృఢంగా నమ్ముతున్నాను. విశాలాంధ్ర ను నడపడంలో మీకు మేధావుల, కళాకారుల, అభ్యుదయ కారుల సహకారం సమగ్రంగా లభించగలదు. ఇందుకు ఎట్టిసందేహమూ అవసరం లేదు.

*22-6-52 విశాలాంధ్ర*

## 6. మామాట- (అ)

ఆంధ్రజ్యోతి ఈ సంచికతో మరొక దీపావళి చేసుకుంటున్నది. ఎప్పటిలాగే ఈ ప్రత్యేక సంచిక కూడా మా పాఠకుల ఆదరాను రాగాలను చూరగొంటుందని ఆశిస్తున్నాము.

ఆంధ్రజ్యోతి పుట్టిన నాటి నుండి కూడా ఉత్తమ కథల పత్రికగా ఆంధ్ర ప్రజానీకం యొక్క అభిమానాన్ని పొందింది. బాహ్యాకర్షణలతో ఇతర పత్రికలమీద ఈ పత్రిక ఎన్నడూ పోటీచేయలేదు. అటువంటి పోటీలోకి దిగే ఆలోచనకూడా లేదు. అయితే ఇకముందు ఆంధ్రజ్యోతి లో ఉత్తమతర సాహిత్యాన్ని వెలువరించాలని సంకల్పించాము.

ఇటీవల పత్రికలకు సర్క్యులేషన్ వ్యామోహం పెరిగిన ఫలితంగా దేశంలో సాహిత్యగౌరవం సన్నగిల్లింది చవుకబారు రచనలకు చలామణీ హెచ్చింది మరొక వంక సాహిత్యప్రియులుగా భావించబడేవారు ఆధునిక రచనలతో తెగతెంపులు చేసుకుని పాతసాహిత్యాన్నే పారాయణ చేసుకుంటున్నారు. యథార్థమైన సాహిత్యంలో కొత్తమార్గాలను ఏ పత్రికా పట్టుబట్టి సాగించటం లేదు ఈ లోపం కొంతవరకైనా తీరేలాగు ఆంధ్రజ్యోతిని వినియోగించడానికి నిశ్చయించాము

ఈమా ఆశయానికి అనుగుణంగా ఆంధ్ర జ్యోతి లో పైసంచికనుండీ కొన్ని మార్పులు తెస్తున్నాము. ఇక ముందు ఆంధ్రజ్యోతి కేవలం సాహిత్యానికే అంకితం చేయబడుతుంది సాధ్యమైనంతవరకు విశిష్టతగల రచనలనే ఇందులో ప్రచురిస్తాం. సాహిత్య సమీక్షలూ, విమర్శలూ ఉంటాయి.

తెలుగులో నవలారచన బొత్తిగా వెనకపడి ఉన్నది. నవలారచనని ప్రోత్సహించడానికి గాను ఒక సీరియల్ నవలను పైసంచికలో ప్రారంభిస్తున్నాము ఇది ఆధునిక వంగసాహిత్యంలో గొప్పదిగా పరిగణించబడుతోంది. దీని కర్త అయిన తారాశంకర్ బెనర్జీ వంగసాహిత్యంలో బంకిం, టాగోర్, శరత్‌ల శ్రేణికి చెందినవాడు గానూ. ఈనాటి వంగరచయితలలో అగ్రగణ్యుడు గానూ భావించబడుతున్నాడు. ఈ నవల పేరు మన్వంతర్ ఇందులోని వాతావరణం గత యుద్ధకాలంలో బెంగాలు కరువునాటిది. ఇతివృత్తం ఒక బెంగాలీ జమీందారు యొక్క కుటుంబవిచ్ఛిత్తిని నిరూపించేది. మారే సామాజిక వ్యవస్థను తారాశంకర్ బెనర్జీ ఈ నవలలో అతి నేర్పుగా చిత్రించాడు.

ఇక మీదట ఆంధ్రజ్యోతి అనుసరించే పంథా సాహిత్యప్రియులకూ, మా పరితలకూ ఆదరణీయంగా ఉంటుందనీ, మా ఉద్యమానికి ప్రోత్సాహం లభిస్తుందనీ ఆశిస్తున్నాము.

*ముద్రణ, ఆంధ్రజ్యోతి, అక్టోబరు 1952*

# 7. మామాట-(ఆ)

ఆంధ్రజ్యోతి దీపావళి సంచిక చదువరులను తృప్తిపరచి వుంటుందని వూహిస్తున్నాము ఫలితంసంగతి చెప్పలేము గాని మా వైపునుంచి ప్రయత్నలోపం మటుకు లేదు

క్రిందటి సంచికలో, ఆంధ్రజ్యోతిలో కొన్ని మార్పులు చేయబోతున్నామని మేము సూచించాము ఆ మార్పులలో కొన్నిటిని ఈ సంచికలో ప్రారంభిస్తున్నాము మేము వాగ్దానంచేసి నట్లే ఈ సంచికలో ప్రఖ్యాత వంగరచయిత తారాశంకర్ బెనర్జీ రచించిన మన్వంతరం ధారావాహినీ రూపంలో మొదలు పెడుతున్నాము ఈ నవల మా పాఠకుల అభిరుచికి అనుకూలంగా వుంటుందని వారికి విశిష్టంగా ఆనందాన్ని కలిగిస్తుందని ఆశిస్తున్నాము

ఈ రోజుల్లో ఒక ఉత్తమ పత్రికను నడపడంకంటే గాని, ఒక పత్రికను వుత్తమంగా నడపడం కంటే గాని, కష్టసాధ్యమైనపని, యింకొకటి లేదు. తదితరమైన అవాంతరాల మాట అటుంచినా, పాఠక బాహుళ్యపు అభిరుచిని సంతృప్తి పరచటం మధ్యా, దానినే యింకా నిశితంగా ప్రశస్తంగా తయారు చేయటం మధ్యా, పత్రికా వ్యాసంగం గలవారు కత్తిమీద సాము చేయవలసి వస్తున్నది. ఒక లక్ష్యం రెండవలక్ష్యానికి అడ్డుతగులుతున్నది. దాని సాఫల్యాన్ని భగ్నపరుస్తున్నది, వీలైనంత యెక్కువమంది చదువరులను, వీలైనంత యెక్కువగా సంతృప్తి పరచటం అత్యాకర్షకమైన ఆదర్శమే, కాని చిత్తశుద్ధిలేని పక్షంలో యిదే ఆదర్శం, ఆచరణలో కొచ్చేటప్పటికి, పాఠకుల అసంస్కృతీమయమైన అభిరుచులకు మత్తుమందు వేసి , వాటిని యింకా అసంస్కృతంగా తయారు చేయటంలోకి దిగనాసిల్లుతుంది. ఇది రచయితలకు, పాఠకులకుకూడా అపాయకరమైన పరిస్థితి. దీనిని మార్చవలసిన బాధ్యత అందరిమీదా వుంది.

పత్రికలు, ఉద్యమాలు రగులు కొలిపే ప్రచారసాధనాలుగా మారిపోవాలని మేము చెప్పటంలేదు. మేము చెబుతున్నది. పాఠకుల అభిరుచిని సంస్కరించవలసిన బాధ్యత కూడా పత్రికా వ్యాసంగం గల వారి మీద వుందని మాత్రమే ఈ బాధ్యతను వారు ఏనాడు చక్కగా గుర్తిస్తారో, ఆనాడే చవుకబారుసాహిత్యపు దిగుమతి ఆగిపోతుంది.

ఒక రచనయొక్క ప్రాశస్త్యాన్ని నిర్ణయించటం చాలా కష్టమైన విషయం. అంటే విలువగట్టటానికి కొలవమానాలేవీ లేవనికాదు, ఉన్నవి. కాని వాటిని ఉపయోగించటం లోనే వస్తుంది. చిక్కంతా, ఆసమయమొచ్చే టప్పటికి నిర్ణేతలో పాతుకపోయిన సంస్కారాలు, అభిప్రాయాలు, విశ్వాసాలు, (అంధవిశ్వాసాలుకూడా)

పని చేస్తాయి అందువల్ల నిర్ణేత అనుకోకుండానే పొరబడే అవకాశం కలుగుతుంది సాధారణంగా నిష్పక్షవిమర్శ లనబడేవాటిలో నిష్పక్షత గాని, కనీసం విమర్శగాని యెంత వరకు వుంటున్నదో, అందరికీ తెలిసిన విషయమే ముఖ్యంగా మన తెలుగులో విమర్శనా - సాహిత్యం వలసినంతగా అభివృద్ధి చెందలేదు గుణ గ్రాహ్యతకూడా పెరగలేదనే అనుకోవలసివున్నది. ఈ పరిస్థితిని సృష్టించటంలో పుట్టగొడుగుల్లాగా ఎదిగివచ్చేకుహనా విమర్శకులపాలు చాలా వున్నదనటంలో అతిశయోక్తి యేమి వుండదు

ఎంతలోప భూయిష్టమైనప్పటికీ, మనకున్న వ్యక్తిగత విచక్షణను సదుపయోగపరిచి, సాధ్యమైనంతవరకూ ప్రశస్తమైన సాహిత్యాన్నే పాఠకలోకానికి అందచేదామని, మనస్ఫూర్తిగా ప్రయత్నించటంలో తప్పేమీలేదు. క్రిందటిసారి మేము యిదే వాగ్దానం కూడా చేశాము ఇది యెంత వరకు ఆచరించ గలిగామనేది, పాఠకులే ఈ సంచిక చదివి నిర్ణయించకోగలరు. వారి నిర్ణయానికి మేము తప్పకుండా ప్రాముఖ్యత నిస్తాము.

*ఆంధ్రజ్యోతి మాసపత్రిక - నవంబరు 1952*

# 8. సమాలోచన

ఈనాడు కథకుల సంఖ్య అపారంగా పెరిగి పోతున్నది. ఒక విధంగా ఇది వాంఛనీయమే. ఏమంటే, ఈనాటి ప్రజాజీవితం బహుముఖాల వ్యాప్తి చెందుతోంది. అనేక కొత్త పరిశ్రమలూ, కొత్తవృత్తులూ ఏర్పడుతున్నాయి. అనేక కొత్తవిషయాలను గురించి ప్రజలు తెలుసు కొంటున్నారు. అనేక కొత్త సమస్యలు ప్రజలను ఎదుర్కొంటున్నాయి. వీటన్నిటి ప్రభావమూ సాహిత్యం మీద ఉంటేగాని సాహిత్యానికి జీవితానికుండే వైవిధ్యమూ సమగ్రత ఏర్పడదు. ఇది జరగాలంటే నాటకాలకన్నా, కవిత్వం కన్నా కూడా చిన్న కథ అనువైన సాధనం

దీనికి అనేక కారణాలున్నాయి. కవిత్వంలో భావాలకుండే స్థానం కేవలం సంఘటనలకూ, సాంఘిక వాతావరణానికి ఉండదు. నాటకంలో వీటికి స్థానం ఉన్నప్పటికి అది అతి ముఖ్యమైన సంఘటనలను మాత్రమే ప్రదర్శించటానికి అనుకూలమైన శిల్పంతో కూడుకున్నది. పైగా నాటక రచనా, ప్రదర్శనమూ సులభసాధ్యమైన పనులుకావు. చిన్న కథకు ఈ చిక్కులేవీ లేవు ఒక్కొక్క సంఘటనగురించి ఒక్కొక్క కథ రాసెయ్యవచ్చు. అతి స్వల్ప విష యం గురించికూడా కథ అల్లవచ్చు. సంఘంలో ప్రతి వ్యక్తికీ క్లోజప్ ఇవ్వవచ్చు.

ప్రచురణ సౌకర్యాలుకూడా చిన్న కథకు అపారంగా ఉన్నాయి. ఈనాటి సాహిత్యరూపాలన్నిటిలోకి ప్రజాదరణను హెచ్చుగా సంపాదించుకుంటున్నది చిన్న కథే కథలను ఆబాలగోపాలమూ చదువుతారు. దాదాపు ప్రతి పత్రికకూడా అనేక కథలను అచ్చువేస్తున్నది. కాలెండరులో ఒక కాగితం తిరిగేసరికి ఎన్నో డజన్ల కథలు ప్రచురితమవుతున్నాయి. ఎన్నో డజన్ల మంది కొత్త కథకులు ప్రతి నెలా పుట్టుకొస్తున్నారు.

కాని ఒక్కటే చిక్కు కనిపిస్తుంది. ఈ కొత్త కథకులలో చాలా మందికి కథాశిల్పం బాగా అలవడినట్టు కనబడదు. అనేక వందల కథలు విమర్శగా చదివితేగాని ఎవరూ కథలు రాయలేరు. ఏకళ అభ్యసించేవాడయినా ఆకళలో మునిగితేలాలి. ఏదో కథలు చదివి లాభం లేదు. ప్రతిభా, శిల్ప చాతుర్యమూ, ఉదాత్తమయిన సాంఘికాశయమూ గల కథలనే కొత్త రచయితలు చదవాలి. పత్రికలలో ప్రతిభా శూన్యమైన కదలు పడటం కొత్త కథకులకు హానికరంగా పరిణమించగలదు. పరిణమిస్తున్నట్టు కనిపిస్తున్నది కూడానూ.

మరొక విషయమేమంటే కొత్త కథకులు బొత్తిగా భాషా పరిచయం లేనివారుగాకూడా ఒక్కొక్కప్పుడుంటున్నారు. ఏ రచన అయినా భాషతో కూడుకున్న విద్య, పనివాడికి తన పనిముట్లను పదునుగా ఉంచుకొని, వాటి ఉపయోగం ఎరిగి వాడటం ఎంత అవసరమో రచయితకు మాటల ఉపయోగం తెలియటంకూడా అంత అవసరమే.

ఇటువంటి లోపాలను సరిదిద్దటానికి కొత్త కథకులైన యువకులు పూనుకున్నట్టయితే మన కథాసాహిత్యం ఇంకా ఎంతో అభివృద్ధికి రావటానికి సందేహంలేదు

*ఆంధ్రజ్యోతి మాసపత్రిక, డిసెంబరు 1952*

## 9. నేటి పత్రికా సాహిత్యం - దాని మంచి చెడ్డలు

ప్రజలలో నానాటికీ పెరిగిపోయే పఠనౌత్సుక్యాన్ని తృప్తి పరచటానికి గాను పత్రికలు బహుముఖాల కృషిసాగిస్తూ, పలురకాల సాహిత్యాన్ని సృష్టిస్తున్నాయి. ఆధునిక కవులూ కథకులూ చేసే రచనలతో బాటు, జానపద గేయాల సంకలనమూ, పాత సాహిత్యం తాలూకు విమర్శా, పరిశోధనలూ, బాల సాహిత్యమూ, స్త్రీల కోసం ప్రత్యేక శీర్షికలూ, సినిమా వ్యాసాలూ, రాజకీయ వ్యాసాలూ, డిటెక్టివ్ సాహిత్యమూ, సెక్సు సాహిత్యమూ మొదలైనవి పత్రికలలో వెలువడుతున్నాయి. పత్రికలు ఈ

కృషిని వ్యాపార దృష్టితోనే సాగిస్తున్నప్పటికీ వాటి గమ్యం, జన బాహుళ్యంలో వ్యాప్తి గనక స్థూలంగా చూసి నట్టయితే పత్రికల కృషి బాగానే ఉన్నదని చెప్పాలి

పైన చెప్పిన సాహిత్యంలో కొంత ఉదాత్తంగామూ, మరికొంత పేలవంగానూ, కొంత ప్రయోజనకారి గానూ, మరికొంత నిష్ప్రయోజనం గానూ, కొంత విజ్ఞాన ప్రదంగానూ, మరికొంత పారకులను మభ్యపెట్టేది గానూ, ఉన్నమాట నిజమే కాని ఈ తేడాలు ఉండి తీరుతాయి. వాటిని అవగాహన చేసుకోవలసింది పారకులు. అనేక పాశ్చాత్య దేశాలలో కంటే మన దేశంలో వెలువడే పత్రికా సాహిత్యం కల్మషరహితంగా ఉన్నందుకు మనం సంతోషించాలి. ఈ సాహిత్యం పూర్వం కంటె సర్వతోముఖంగా ఉంటున్నందుకు కూడా మనం సంతోషించవచ్చు

గడిచిన దశాబ్దంలో బాగా పైకి వచ్చినవి బాల సాహిత్యమూ, సెక్సు సాహిత్యమూ, సినిమా సాహిత్యమూ, ఇప్పుడిప్పుడు డిటెక్టివ్ సాహిత్యమూనూ.

## బాల సాహిత్యం

బాల సాహిత్యం విషయంలో మన దేశంలో తెలుగు వాళ్ళకంటె మిగిలిన అందరూ ముందుకు వెళ్ళినట్టు కనిపిస్తుంది. మనమే ఆఖరుకు మేలుకున్నవాళ్ళం. తెలుగులో బాల, చందమామ పత్రికలు వెలువడే నాటికి (1946-47) తమిళ బాషలో కూడా అనేక బాల పత్రికలున్నాయి. అయితే ఈ లోపం త్వరలోనే చక్కబడినట్టు కనబడుతుంది ఈనాడు తెలుగులో పిల్లల పత్రికలతో బాటు పత్రికలలో పిల్లల శీర్షికలూ, పిల్లల పుస్తకాలూ, గేయసంపుటాలూ, నవలలు కూడా ఉంటున్నాయి. పిల్లల కోసం రామాయణ, భారత, భాగవతాలను బొమ్మలతో సహా అచ్చువేసిన సంస్థలున్నాయి.

బాల సాహిత్యం ధర్మమా అంటూ ప్రాచీన కథలు, వివిధ దేశాలకు సంబంధించి నవి తెలుగులోకి అవతరిస్తున్నాయి. మార్క్‌ట్వే న్, డికెన్స్ మొదలైన పాశ్యాత్యుల రచనలు తెలుగు లోకి దిగాయి. ఇంకా అనేకం దిగుతున్నాయి. అరేబియా, రష్యా, చైనా వగైరా దేశాల జానపద కథలు తెలుగులోకి వస్తున్నాయి. బుద్ధజాతక కథలూ, బృహత్కథలోని కథలూ దిగుతున్నాయి. ఈనాడు పిల్లలు చదువు కొనటానికి తగినన్ని పుస్తకాలూ, పత్రికలూ ఉన్నాయి. వీటి సంఖ్య పెరుగుతుంది గాని తరగదు.

పిల్లలకు పరనాసక్తి స్వతస్సిద్ధంగా ఉంటుంది. చదువు మీద విముఖత్వమే అసహజమైనదీ, పరిస్థితుల ప్రాద్బలం వల్ల ఏర్పడేదీనూ. కేవలం ఒక్క అక్షరం మాత్రమే గుర్తించగల పిల్లవాడు కూడా దాన్ని కనిపించిన చోటనల్లా గుర్తించి స్నేహితుణ్ణి చూసినట్లుగా ఆనందిస్తాడు. చదవటం నేర్చుకున్న పిల్లలను చదవకుండా ఆపడం దాదాపు అసంభవం. వారి కోసరం పత్రికలూ, పుస్తకాలూ ఉండటం ఎంతైనా అవసరం. ఈ అవసరాన్ని తీర్చే పత్రికలను అభినందించి తీరాలి.

బాల సాహిత్యం ఎంత ఉపకారిగా ఉంటున్నదో సెక్సు సాహిత్యం దాదాపు అంతా నిరుపయోగంగా ఉన్నట్టు కనిపిస్తున్నది సెక్సు విషయాలు తెలుసుకో దగినవి కావని కాదు అవి వైజ్ఞానిక విషయాలు. ఇతర విజ్ఞానంతో బాటు సెక్సు విజ్ఞానం కూడా అవసరమైనదే అయితే సెక్సుసాహిత్యం అనే దానిలో అచ్చగా విజ్ఞానమే ఉండటం లేదు. చెత్తరకం కథలు కూడా ఉంటున్నాయి. అమెరికాలో వెలువడే సైంటిఫిక్ ఫిక్షన్ పత్రికలలో ఉండే శాస్త్ర విజ్ఞానం లాంటిదే సెక్సు పత్రికలలో ఉండే సెక్సు విజ్ఞానం కూడా. ఈ రకం సాహిత్యం ఇప్పుడు చాలా వరకు వెనక పడింది దీని స్థానాన్ని డిటెక్టివ్ సాహిత్యం ఆక్రమించుకున్నది డిటెక్టివ్ సాహిత్యం మన దేశంలో ప్రధానంగా తర్జుమా సాహిత్యం. ఈ రకం సాహిత్యం బీభత్సంగా లేనపుడు మనసుకు కొంత విశ్రాంతి నిస్తుంది ఇది ఒక రకమైన పలాయన సాహిత్యం.

సినిమా సాహిత్యం కేవలం సినిమా పరిశ్రమను ఆశ్రయించి పుట్టింది సరిగా సాగితే ఇది ప్రేక్షకుల అభిరుచులను పెంపొందించటానికీ, చిత్ర నిర్మాణంలో మంచి లక్షణాలను పెంపొందించి, దుర్లక్షణాలను నిరుత్సాహ పరచటానికీ ఉపకరిస్తుంది. ఆపని చేసినపుడు సినిమా తారలను ప్రజలకు సన్నిహితంగా తీసుకురావటానికి తోడ్పడుతుంది. ఇది వినోద సాహిత్యం.

## వైజ్ఞానిక సాహిత్యం అవసరం

పత్రికలలో తగినంతగా వెలువడని సాహిత్యం వైజ్ఞానిక సాహిత్యం. ఇది ఈనాడు చాలా అవసరం. ఈనాటి ప్రపంచంలో శాస్త్రవిజ్ఞానం శాఖోపశాఖలుగా విస్తరించి పోతున్నది. కిందటి తరం పట్ట భద్రులకు శాస్త్ర శాఖల పేర్లు కూడా కొన్ని తెలియవు. పామరులకు ఖగోళ శాస్త్రమూ, భూతత్వ శాస్త్రమూ, పదార్ధ విజ్ఞానశాస్త్రమూ, రసాయన శాస్త్రమూ మొదలైన వాటిని గురించి తెలపటానికి కొద్ది యత్నాలు జరుగుతున్నాయి. కాని చిన్న పిల్లలు లగాయతు వైజ్ఞానిక విషయాలు తెలుసుకొనేటందుకు అనుకూలంగా, ఆకర్షవంతంగా రచించిన వ్యాసాలూ, పుస్తకాలూ చాలా తక్కువ.

ఈ విషయమై పత్రికలు ఎంతైనా కృషిచేయవచ్చు. శాస్త్రవిషయాలు తెలిసిన వారిని అనేక మందిని కూడగట్టి వారి ద్వారా ఈ పని చేయవచ్చు. తెలుగులో శాస్త్రగ్రంధాలే తక్కువ. ప్రామాణికమైన పారిభాషిక పదసముదాయం కూడా లేదు అందుచేతనే వైజ్ఞానిక విషయాలను చిన్న పిల్లలకు సయితం అర్ధమయే భాషలో అందించ వలసిన ఆవశ్యకత మరింత హెచ్చు తున్నది. భౌతిక ప్రపంచం గురించీ, మానవ నాగరికత యొక్క భౌతిక స్వరూపం గురించీ తెలుసుకోవలసిన అవసరం ఈనాడు ప్రతి వాడికీ ఉంది

*విశాలాంధ్ర దినపత్రిక 12-4-1956*

# 10. ప్రైవేటు పత్రికలు

పత్రికలు ఆధునిక జీవితంలో అవసరాల కింద జమ అవుతున్నాయి వార్తా పత్రికల మాట చెప్పనే అవసరం లేదు రేడియోలు రోజుకు అనేక పర్యాయాలు వార్తలు ప్రసారం చేస్తున్నప్పటికీ ప్రతి ఉదయమూ ఎన్నో లక్షలమంది ఆంధ్రలో వార్తా పత్రికలు చూస్తూనే ఉన్నారు.

వార్తాపత్రికల మాట అటుంచి, సారస్వత, సాంఘిక, కళాదిక విషయాలను గురించి తెలుసుకోగోరేవారు కొన్ని దశసహస్రాల సంఖ్యలో ఉంటారు. కధలూ, వైజ్ఞానిక విషయాలూ, సినిమా కబుర్లూ, స్త్రీల సమస్యలను గురించి చర్చలూ, రాజకీయ నేపధ్యవార్తలూ, సాహిత్య విమర్శలూ మొదలైన వాటిలో వీరికి ఆసక్తి. వీరు మాస, పక్ష, వారపత్రికలు చదువుతారు. పిల్లలకూ, స్త్రీలకూ, రాజకీయ పక్షాలకూ ప్రత్యేక పత్రికలున్నాయి. స్థానిక విషయాలు చర్చించేటందుకు స్థానిక పత్రికలున్నాయి. డబ్బుపెట్టికొనో, అరువు తెచ్చుకునో, లైబ్రరీ రీడింగురూములకు వెళ్ళో ఈ పత్రికలన్నిటినీ జనం చదువుతున్నారు. ఇ. చదవటం ప్రజల నిత్యావసరాలలో ఒకటి.

గడచిన నలభై ఏళ్ళకాలంలో పత్రికా ప్రచురణలో ఎటువంటి మార్పులు వచ్చినదీ నేను కళ్ళారా చూశాను. ఒకప్పుడు ప్రతిక ప్రారంభించటం ఏమంత కష్టంగా ఉండేది కాదు. లాభం కోరని ఔత్సాహికులు ప్రారంభించిన పత్రికల సంగతి వదిలేద్దాం. సాహితి, సఖి, జ్వాల వంటి సాహిత్య పత్రికలు అసంఖ్యాకంగా వచ్చాయి.

కాని వాటిలో కొన్నిటికి అమ్మకాలు కూడా లేవు. వీణ, మహతి, ఉదయిని లాంటి పత్రికలు కొన్ని అమ్మినప్పటికి, వాటి మీద లాభాలు రాలేదు. నష్టం ఖాయమనిపించి నప్పుడు వాటిని నిలిపి వేశారు. ఆ కాలపు పత్రికలలో లాభసాటిగా అమ్మిన పత్రికలు బహుశా వినోదినీ, చిత్రగుప్తా అయివుంటాయి. కాని అవి చెప్పుకోదగినంత సాహిత్యసేవ తలపెట్టలేదు.

ఆంధ్ర శేషగిరిరావుగారి ఆంధ్రభూమి , శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారి ప్రబుద్ధాంధ్ర చెప్పుకోదగిన ప్రయత్నాలు. పెద్దగా పెట్టుబడి గాని, స్తోమతగాని లేని వ్యక్తులు, స్వయంకృషితో ఈ పత్రికలు నిర్వహించి పత్రికలు ఆర్థికంగా నిలబడటానికి యత్నించారు. దీనికి ఒక్క పుష్కరం ముందుగానే కౌతా శ్రీరామశాస్త్రిగారు బందరు నుంచి శారదను ప్రచురించటమూ, తరువాత నాగేశ్వరరావు పంతులుగారు భారతిని ఆరంభించటమూ ఈ రకం ప్రయత్నాలు కావు. శారదగాని, భారతిగాని లాభసాటిగా నడిచే అవకాశం ఏనాడూలేదు. అవి బృహద్యత్నాలు.

ప్రబుద్ధాంధ్ర ఎరవడిలో ఆంధ్రదేశమంతటా ఒంటరి గాళ్ళ కృషితో అనేక సాహిత్య పత్రికలు వెలువడి కొంతకాలం నడిచి నిలిచి పోయాయి

వీరంతా చేతులు కాల్చుకున్నారనటానికి లేదు. యుద్ధంవచ్చిన దాకా ఇటువంటి వాతావరణం ఉండేది

సోషలిస్టు గమ్యంతో భారత ప్రభుత్వం పదిహేనేళ్ళు పాలించిన ఫలితంగా ఏర్పడిన పరిస్థితి ఏమంటే ఈనాడు ఒంటరిగాళ్ళు పత్రిక పెట్టి నిర్వహించే అవకాశం ఏమీలేదు. పెట్టుబడిదారీ వ్యాపార విధానంలో పత్రిక నడపగల వాడికే ఈనాడు సాహిత్య పత్రికనైనా చచ్చు ప్రేమకథల పత్రికైనా నడిపే అవకాశం వుంది అట్టలమీద ఆకర్షణీయమైన రంగుల బొమ్మలూ, కథలకు బొమ్మలూ, మంచి పారితోషికాలూ, వందలూ వేలూ కుమ్మరిస్తూ కథల పోటీలూ, అచ్చువెయ్యటానికి రోటరీ యంత్రాలూ – ఈ హంగులుండే పత్రికలతో ప్రబుద్ధాంధ్రలాంటి పత్రికలు ఎక్కడ పోటీ చేయగలవు?

ఈ వాతావరణంలో పత్రికా నిర్వహణా దక్షత అనేదాన్ని కొలిచే సాధనాలు లేకుండా పోయాయి. పత్రిక అమ్మకాల పెరుగుదల సంపాదకుడి సామర్థ్యం మీద గాక, కేవలం యంత్రాల మీదా, గెటప్ ఆకర్షణలపైనా ఆధారపడుతున్నది సాహిత్యపు విలువలను పరిగణించేవారి శాతం పెరగలేదుగాని, ఈ ఆకర్షణలకు గురి అయ్యే వారి శాతం జనంలో బాగా హెచ్చింది.

వెనకబడి వున్న మన దేశంలో ఈ పరిణామం వాంఛనీయమైనదేననీ, పత్రికాపఠనం విస్తరించటానికి యిది బాగా తోడ్పడుతున్నదనీ తృప్తిపడే వారున్నారు ఇది పాక్షిక సత్యం మాత్రమే. సాహిత్య పిపాసువులకు పత్రిక అన్నదే లేకుండా పోవటం ఒక నష్టం మరొక విషయం ఏమంటే, పెట్టుబడిదారీ పత్రికలలో పరిస్థితి ఏ విధంగా పరిణమిస్తున్నదీ మనం బ్రిటన్, అమెరికాలలో చూడవచ్చు. బ్రిటన్‌లో లక్షల సంఖ్యలో అమ్మే పత్రికలు సైతం నష్టం వచ్చి మూసివేయటం జరిగింది. బ్రిటన్‌లోని ముఖ్య వార్తాపత్రిక లన్నీ రెండు సంస్థల చేతికిందికి వచ్చేస్తున్నాయి ఈ విషపరిణామం జరగకముందే బ్రిటనులో లేబరు పార్టీ తరఫున ఒకటి రెండు పత్రికలకంటే ఉండేవి కావు అమెరికాలో డెమోక్రాట్లకు బహుకొద్ది పత్రికలున్నట్టే. అమెరికాలో కూడా రీడర్స్ డైజెస్టు తప్ప మిగిలిన ఏ పత్రికా వ్యాపారరీత్యా సుస్థిరంగా లేదని అంటున్నారు! మనదేశంలో కూడా పత్రికలు పెట్టుబడి వాతావరణానికి గురి అయినట్టయితే యిలాటి పరిణామం తప్పదు.

దీనికి విరుగుడేమిటి? వ్యాపార ధర్మాన్ని అనుసరించి లాభసాటిగా నడిచే పత్రికల ధోరణి మారదు, ఎవరూ మార్చలేరు. కాని నిజమైన సాహిత్యాభిలాషగలవారు పనిపెట్టుకుని , దీక్షతో సాహిత్య పత్రికలను పోషించి నట్టయితే, అవి బతికి ఉండటానికి ప్రయత్నించి నట్టయితే చాలా ఉపయోగం ఉంటుంది. ఇటువంటి పత్రికలు వస్తూనే ఉన్నాయి. గాని వాటికి తగిన ఆదరణ ఉండటం లేదు. ఉండినట్టయితే అభ్యుదయ ను నిలపవలసిన దుస్థితి కలిగేదేకాదు.

*విశాలాంధ్ర, 29-7-62*

# 11. పత్రికలూ, ప్రజలూ

''ఓదుర్వార్త పత్రికలారా! చెప్పండి ఈ మాటనిజమేనా?'' - శ్రీశ్రీ

ఇప్పుడు నడిచేదాన్ని పత్రికా యుగమని కూడా అనవచ్చు ఎందుచేతనంటే, ప్రపంచ ప్రజల నిత్యజీవితంలో పత్రికలీనాడు నిర్వహించేటంత ప్రముఖ పాత్రలోగడ ఏనాడూ నిర్వహించి ఉండలేదు. దాదాపు ప్రపంచ మంతటా ప్రతి రోజూ కొన్ని కోట్ల మంది వార్తా పత్రికలు చదువుతారు. వార్తలు తెలుసుకుంటారు.

పత్రికలు నడపటంలో శ్రమవిభజన కొంత ఉన్నది. జాతీయ పత్రికలనేవి జాతీయ అంతర్జాతీయ వార్త లందిస్తాయి. ప్రాంతీయ వార్తలనూ, స్థానిక వార్తలనూ అందించటానికి వేరే వేరే పత్రికలున్నాయి. ఇవి గాక వివిధ విషయాలపైన ప్రత్యేక పత్రికలు విజ్ఞానానికీ, వైద్యానికీ, వ్యవసాయానికీ, తత్వబోధకూ, సారస్వతానికీ, సినిమాకూ, రాజకీయాలకూ, సెక్సుకూ సంబంధించినవి - అసంఖ్యాకంగా వెలువడుతున్నాయి.

జ్యోతుల్లాగా ఇన్ని రకాల పత్రికలు ఇన్ని విషయాలపైన వార్తా విజ్ఞానాలను వెదజల్లే ఈ యుగంతో పోలిస్తే పత్రికలు లేని యుగం అంధకార యుగమేమో అనిపిస్తుంది. ఎందుకంటే ఆ కాలంలో వార్తలు కాలినడకన వెళ్ళేవి, అదైనా ఎంతో దూరం వెళ్ళేవికావు. ఈనాడు వార్తలు కాంతి వేగంతో రేడియోద్వారా అందుతున్నాయి. ప్రపంచంలో ఏమూల ఏ మహామేధావి ఏ వైజ్ఞానిక విషయాన్ని కొత్తగా కనిపెట్టినా, వెంటనే దానికి ప్రపంచవ్యాప్తి లభిస్తుంది.

అయితే ఇన్ని పత్రికలూ ఉండి ఇది నిజంగా కాంతి యుగంగా ఉన్నదా? ఎవరి అనుమానాలు వారికి ఉండవచ్చు. మిట్టమధ్యాహ్నపుటంధకారం కొంత లేదనటానికి లేదు.

ముఖ్యంగా కొట్టవచ్చినట్టు కనబడేదేమంటే రాజకీయాలకు సంబంధించిన అంధకారం. సినిమా వార్తలు చదివే వాళ్ళకు చిత్రనిర్మాణం గురించిన వార్తలూ, వ్యాయామక్రీడలను గురించి చదివే వారికి ఆవార్తలూ కచ్చితంగా తెలుస్తాయి. ఫలాని చిత్రంలో ఎవరెవరు నటిస్తున్నారు; దానికి టెక్నీషియను లెవరు అంటే సినిమా పత్రికాభిలాషులందరూ ఒకే విధంగా చెబుతారు. స్పోర్ట్స్ వార్తలు చదివే వారందరూ ఫలాని క్రికెట్ మాచ్‌లో వెస్టిండీస్ వాళ్ళు ఎన్ని రన్స్ చేశారంటే అభిప్రాయ భేదాలు లేకుండా చెబుతారు. కాని రాజకీయ సంబంధమైన వార్తల దగ్గరికి వచ్చేసరికి అయోమయం ఏర్పడుతుంది. ఏవి రాజకీయ వార్తలని అడక్కండి. సందర్భాన్ని బట్టి కొంపలంటుకోవడం కూడా రాజకీయవార్తే. ఈ యేడు వర్షాలు ఆలస్యంగా రావటానికి వామపక్ష కమ్యూనిస్టులే కారణమని ఎవరన్నా అంటే ఆశ్చర్య పడనవసరం లేదు. అంతకన్నా వెర్రివార్తలే పత్రికలలో వెలువడ్డాయి.

పత్రికలు రాజకీయాంధకారాన్ని ప్రచారం చెయ్యటానికి సవాలక్ష మార్గాలు. కాని కారణం ఒకటే రాజకీయ సత్యం అన్నది కూడా వర్గ స్వభావంతో కూడుకున్నది ఈ వర్గ స్వభావం రకరకాల వేషాలుకట్టి మన ఎదట ప్రత్యక్షమవుతుంది

''మనం అమెరికన్లం. మన అధ్యక్షుడు జాన్సన్. మన రాజకీయ భవిష్యత్తు అంతర్జాతీయ కమ్యూనిజంను అంతం చెయ్యటంపైన ఆధారపడి ఉన్నది '' అనుకునే వాళ్ళకోసం నడుస్తున్నాయా అనిపించే పత్రికలు, వ్యాసాలు, లేఖలూ మనం మనదేశంలో చూడవచ్చు

అమెరికా వియత్నాంలో చేసే పైశాచిక కృత్యాలకు ఎలాటి సమర్ధనా లేదని వాదించే ఘరానా మనుషులు అమెరికాలోనే ఉన్నారు. ఉత్తర వియత్నాంపైన అమెరికా బాంబులు వేస్తున్నందుకు పండగ చేసుకునే ఘరానా మనుషులు మన దేశంలో ఉన్నారు. ఈ పత్రికా యుగం అవతరించక పూర్వం ఇది సాధ్యమై ఉండేదిగాదు రాజకీయాంధకారం సృష్టించటానికి ప్రధాన సూత్రాలు రెండు, అబద్ధ ప్రచారం చెయ్యి, నిజం దాచి పెట్టు మన వార్తా పత్రికలు యధాశక్తి ఈ రెండు పనులూ చేస్తున్నాయి. వామపక్ష కమ్యూనిస్టులు చీనా ఏజంట్లనీ, వాళ్ళు సరిహద్దు మీద జరిగే యుద్ధంలో మనకు అవలీలగా అపజయం కలిగిస్తారనీ - వాళ్ళు సరిహద్దుకు కొన్ని వేల మైళ్ళ దూరాన ఉన్నా సరే. మన సైనిక శాఖలకు అమెరికనుల సలహాలు ఉంటున్నాసరే! పత్రికలు కాలములకు కాలములు చదివాం - అంగుళం పదేసీ పాతికేసీ రూపాయలు విలువచేసే కాలములు! కాని ఆకమ్యూనిస్టులే అంత అద్భుత శక్తులున్నవాళ్ళే మీటింగుపెట్టి పదిలక్షలమంది హాజరైతే, దాన్ని గురించి పత్రికలలో వార్తే ఉండదు.

యుద్ధకాలంలో అసత్య వార్తలను ప్రచారం చెయ్యటమూ, యధార్ధవార్తలను అణచిపెట్టటమూ భద్రత దృష్ట్యా అవసరంగా ప్రపంచమంతటా భావించబడుతున్నది. ఇలాంటి పని శాంతి కాలంలో కూడా ఎందుకు జరుగుతున్న దయ్యా అంటే వర్గ సంఘర్షణ ఉంటూనే ఉన్నది గనక ననుకోవాలి (మరీ మేధావులు కొందరు వర్గ సంఘర్షణను మార్క్సు సృష్టించాడనుకుంటున్నారు. మార్క్సుపై గల భక్తికొద్దీ కాబోలు దాన్ని మానవప్రపంచం తూచా తప్పకుండా అమలు చేస్తున్నది!)

ఇంతకూ పత్రికలు నడపడం ఒక బృహద్వ్యాపారం. ఇంగ్లీషులో చెప్పినట్లు, వ్యాపారం వ్యాపారమే. పెద్దచేప చిన్న చేపను మింగడం వ్యాపారధర్మం. నీ అవసరం కన్నా నాది మిన్న అన్నది వ్యాపార నినాదం

కనుక వ్యాపారార్థం నడిపే పత్రికలకు ప్రజలకు దీపాలు పెట్టి వెలుగు చూపాలన్నది ఒక లక్ష్యమే కాదు. బ్రిటనులో పాతికముప్పై లక్షలు రోజూ అమ్మే పత్రికలు గిట్టుబాటు కాక మూసేయడం జరిగింది. అమెరికాలో కూడా అలా తుడిచిపెట్టుకు పోయిన పత్రికలున్నాయి. అందుచేత వ్యాపార పత్రికలకు ఏది నిజం ఏది అబద్ధం అన్న సమస్యకన్నా నిజం చెబితే గిట్టుబాటా, అబద్ధం చెబితే గిట్టుబాటా అన్నదే ముఖ్యం. సర్క్యులేషను కోసం మాన భంగాలను, హత్యలను దోపిడీలను,

గొప్పవాళ్ళ రంకు పురాణాలనూ రాజకీయ వార్తల కంటే ప్రముఖంగా వేసే పత్రికలున్నాయి ఆ వార్తలందించటం వాటికి గిట్టుబాటు.

అంధకారాన్ని ప్రచారం చెయ్యటానికి దేశుళ్ళు, బాబాలూ, స్వాములార్లు, తత్వవిచారమూ బహుచక్కని సాధనాలు. లక్షలూ, కోట్లూ గడించే వెంకటేశ్వర స్వామికీ, తేరవిందులు కుడిచే పీరాధిపతులకూ ఉచితంగా - ఉంటే డబ్బు తీసుకోకుండా ఎంత పబ్లిసిటీ అయినా మన పత్రికలలో లభిస్తున్నది.

ఏమండీ ఏమిటివాళవార్తలు?
ఏముందీ? మంధర్నకైకను మరాలడగమన్నదట
అది నిన్నసేమొచ్చినట్టుందే?
నిన్న హనుమంతుడు తగలబెట్టలేదుటయ్యా?
కాదు స్వామీ నిన్న రాముడు సీతను అగ్నిపరీక్షచేసాడు
మరైతే రాముడయోధ్యకు తిరిగి వచ్చి పట్టాభిషేకం చేసుకున్నది అటు మొన్నా ఏం?

*జనశక్తి 23-7-66*

## 12. మన పత్రిక

పెట్టుబడిదారీని ఆశ్రయించుకున్న ఆర్థికవ్యవస్థగల ఏ దేశం లోనూ ప్రజాసామాన్యం తరఫున, ప్రజావాణిని వ్యక్తంచేసే పత్రికలు అంతగా ఉండవు. స్వజాతీయులనే భక్షించే గుత్త రాక్షసి ప్రతిపక్షాలను ఒకంతట వదిలిపెట్టదు. పెట్టుబడి దారీని బలపరిచే పత్రికలే తమ కంటె బలంగల పత్రికలకు ఎర అవుతున్నాయి. అయినప్పటికీ ప్రజలు పూనుకున్నట్టయితే తమ కోసం నడిచే పత్రికలను ఈ పోటీనుంచి కాపాడు కోగలుగుతారు.

ప్రజాసామాన్యం కోసం పుట్టిన పత్రికలు ప్రజలలో విశ్వాసం కోల్పోయి నట్టయితే వ్యాపార దృష్టి అవలంబించడమూ, అవాంఛనీయమైన రాజీవిధానాలు అనుసరించటమూ, ప్రకటనలమీది లాభంచేత చెత్త సినిమా చిత్రాలను సైతం తెగ పొగడడమూ మొదలైన దుష్పరిణామాలకు అవకాశం ఏర్పడుతుంది.

వారపత్రికగా ప్రారంభమై, ద్వైవార పత్రికగా మారి, దిన పత్రికగా రూపొందుతున్న జనశక్తి ప్రజా బాహుళ్యానికి సేవచెయ్యడం విషయంలో స్థితప్రజ్ఞ కనపరచాలని నా గాఢ వాంఛ.

సాహిత్య రచనలోలాగే పత్రికా నిర్వహణలోకూడా వాస్తవిక, అభ్యుదయ దృక్పథం ఉన్నది. జనశక్తి అలాటి దృక్పధాన్ని ఇంతవరకూ అంటిపెట్టుకుని ఉన్నదని నా విశ్వాసం. ఇక ముందు కూడా అంటి పెట్టుకుని ఉంటుందని నా ఆశ.

*జనశక్తి దినపత్రిక ప్రారంభోత్సవ సంచిక 1-9-1966*

# 13. Narla- Harbinger of modern journalism

We INDIANS, MAY HAVE HAD A CLAIM TO FAME ON SEVERAL accounts, but at keeping an accurate record of events we were quite lousy In short, we were badly lacking in a sense of history when history itself was lacking we could easily invent it Then came the British and with them journalism Journalism in Telugu appears to be more than a century old, but modern Telugu journalism is comparatively recent

It is not hard to guess why Telugu journalism took a century or so to become modern People were not very anxious to know what was going on in the wider world They had a philosophical attitude to life things happen as they are ordained to happen, life is but a temporary halt in the eternal journey of the soul, we are all puppets in His hands meant to play our part and then depart

A keen interest in what is going on in the world pre - supposes that we can interfere with and change the affairs of the world This conviction was not there even in fairly well educated persons To be sure, the early journals and periodicals were read by only a few hundred persons when they were popular Dozens of them had to close down for want of enough readers

Things improved a little after the end of the First World War, and more particularly after the advent of the Mahatma on the Indian political stage With the commencement of the national struggle under the leadership of the Indian National Congress and Gandhi the masses began to take keen interest in not only what was happening in this country but also abroad

It was a great opportunity for Telugu journalism to advance with the Seven League Boots But it did not There were other factors standing in the way of the progress of Telugu journalism

For one thing it had to compete with English journalism and in this respect it was very badly handicapped on several counts

There were no competent Telugu journalists

The source of all news was English and the Telugu journalist had to translate it He was ignorant on what he was translating and there were great “”howlers” perpetrated in the daily press as when Round Table was rendered as a table that was round

Even the commonest words with which an English journalist was familiar had to be invented in Telugu Very often they were invented by pedants and prigs

There was the question of the language itself The archaic language of the eleventh to thirteenth centuries was hopelessly inadequate as a vehicle for twentieth - century journalism, but that was the language that was sought to be used in journals of that period - not at all with any degree of accuracy

To crown everything, the Telugu journalist was paid very poorly compared to the journalist in English, though he worked several times more hard because of the need for translating Most educated persons preferred to get their news in English, if

only because when read in Telugu they had great difficulty in understanding it So you could not blame them The poor publishers of Telugu journals could not get readership or advertisement revenue So they could not pay their editors and their assistants any better You could not blame them either

Thus, during the in - between - the - wars period Telugu journalism was like Augean stables very badly in need of thorough cleaning

That cleaning job was undoubtedly a great turning point in the history of modern Telugu journalism Here we find Narla playing a very important and historical role

He did his job quite silently - without bugles- and thoroughly He seemed to know the priorities He started the reform with the language and style of Telugu journalism The language was the spoken language of the educated Telugu man - ""vyavaharika bhasha" The style was an impersonal style free from slang and regional idiosyncrasies - a sort of genuine Telugu journalese Narla was blamed by some for being hard on his subs But the results were excellent Even the smallest bit of news had the ""Narla" stamp Narla did not merely dictate, he wrote the language and style he wanted his staff to adopt

Narla contribured another factor ot Telugu journalism, which was more or less lacking until then He put ""fire" into it It was not merely a matter of infusing nationalist fervour through the pen, others did it before him But talked his language He played the part of a political leader - with the pen He was probably the first important Telugu journalist who would have, had he chosen, made a first grade journalist in English The list of Telugu people who became famous English journalists is fairly long Narla could have very easily found his place amongst them, but he chose the unattractive field of Telugu journalism and put life into it If only the earlier Telugu journalists had a similar qualification perhaps Telugu journalism would have taken a modern turn much earlier But as it happened the proud job of guiding Telugu journalism into modern channels fell to Narla, and the fact should be acknowledged

*From Narla's Diamond Jubilee Issue - 1-12-68 Delhi*
*re-printed studies in the History of Telugu journalism*
*(A book published on the occasion of Narla's hashtyabdepurthi*
*Edited by K R. Seshagiri Rao)-1968*

# 14. శ్రీ గోరాశాస్త్రి

శ్రీ గోరాశాస్త్రితో నా పరిచయం 1941లో ఆరంభమయింది రచయితగా నాకు ప్రారంభంలో ఆయనను గురించి తెలిసినదల్లా దస్తూరీ చాలా బాగుంటుందనీ, పుస్తకాలు చదవడంలో చాలా ఆసక్తి గలవాడనీ మాత్రమే.

ఏదో అమెరికన్ పత్రికలో ననుకుంటా, ఒకపెద్దకథ పడింది. దాని పేరు Sally అని జ్ఞాపకం. అదే ప్రధాన పాత్రపేరుకూడాను

''ఇలాంటి కథను మన వాళ్ళెవర్నారాయగలరా? '' అన్నాడు గోరాశాస్త్రి ఆ కథ చదవడానికిస్తూ.

చదివాను Sally పాత్ర బాగానే వున్నది

''ఇంతకన్నా బాగా రాయవచ్చునే!'' అన్నాను, కాస్త పొగరుగానే

''రాయి చూస్తాం '' అన్నాడు గోరాశాస్త్రి

రాశాను, ఆరోజే ప్రారంభించి. ' నీకేం కావాలి?' రాశాను. మర్నాడు గోరాశాస్త్రికి చూపాను. ' నీకేం కావాలి?' లో కస్తూరి పాత్ర sallyని ఏమాత్రమూ తీసిపోదని నా నమ్మకం.

''ఇది బాగానేవుంది. ఒప్పుకుంటాను '' అన్నాడు గోరాశాస్త్రి. Sally కన్నా బాగున్నదని ఆయన అనలేదు. అనిపించాలని నేను ప్రయత్నించనూ లేదు.

'నీకేం కావాలి?' అన్న రచనను భారతి మాసపత్రిక నిరాకరించింది. అదేంచిత్రమో, దాన్ని సాటి రచయితలు కొందరు పొగిడారు.

తరువాత కొంత కాలానికి గోరాశాస్త్రి తెలుగు స్వతంత్ర కు ఎడిటర్ కావడం తటస్థించింది. ఆయన ఎడిటరుగా ఎలా రాణించేదీ నేను వూహించుకోలేక పోయాను. ఏమంటే ఎడిటరనే వాణ్ణి గురించి నాకు కొన్ని కచ్చితమైన అభిప్రాయాలుండేవి. రచయితలు పంపే వ్యాసాలూ, ఇతర రచనలూ చూసి వాటిలో నుంచి కొన్ని ఏరి ప్రచురించినమాత్రాన ఎడిటరై పోడు. పాలసీసా బిడ్డ నోటికందించిన మనిషల్లా తల్లి అవుతుందా?

నిజమైన ఎడిటరు పత్రికకు ఒక వ్యక్తిత్వాన్నిస్తాడు ప్రాణం పోస్తాడు. పత్రికయొక్క ఘనత పరోక్షంగా ఎడిటరు ఘనతే. గన్నవరపు బుచ్చిరామయ్య గారు, శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారులాటి ఎడిటర్లు తాము నిర్వహించే పత్రికలకు ఎలా ప్రాణప్రతిష్ఠ చేశారోనాకు తెలుసును.

గోరాశాస్త్రి అలాటి ఎడిటర్ల శ్రేణిలోకి వస్తాడా? లేక ఖాసా సుబ్బారావు గారి నీడన దాక్కుంటాడా?

నా అనుమానం త్వరలోనే తీరిపోయింది గోరాశాస్త్రి తెలుగు స్వతంత్రను తన సొంతం చేసుకున్నాడు!

అది చాలా ముఖ్యం. ఎడిటరుగా చలామణి అయ్యేవాడికి పత్రిక పట్టినా, పట్టకపోయినా ఎడిటింగు పని చేసేవాడికి ఆ పత్రిక గురించి ఉత్సాహమూ, బెంగా, శ్రద్ధా, తాపత్రయమూ, ఆనందమూ మొదలైన వ్యాధులన్నీ వుండాలి. గోరాశాస్త్రిలో ఈ జబ్బులన్నీ కనిపించాయి.

'ఈ రచయిత మనకు కావాలి వీణ్ణి వదిలిపెట్టరాదు' అన్న సరిఅయిన నిర్ణయానికి వచ్చాక ఎడిటరు ఆ రచయితను బుజ్జగించో, కవ్వించో, పొగిడో, మస్కాపేసో ఆకట్టుకోవాలి. అది చేతకాని వాడు ఎడిటరే కాడు

తెలుగు స్వతంత్ర రచయితలకు హెచ్చుడబ్బు యిచ్చేస్థితిలో లేదు. కొందరికి ఏమీ ఇవ్వలేదని విన్నాను. కాని అనేకమంది రచయితలు దానికి రాశారు. అందులోనే మొదటిసారిగా రాసిన తర్వాత పేరు తెచ్చుకున్నవారు కూడా ఉన్నారు. అవసరాల రామకృష్ణారావు అ జాబితాలోకి చేరుతాడనుకుంటాను.

డ్వాక్టరు శ్రీదేవి మరొకతె. 'కాలాతీతవ్యక్తులు' రాసి శాశ్వతకీర్తి తెచ్చుకున్న రచయిత్రి ఆమెకథలు నాకు అంతగా నచ్చేవి కావు. అయినా ఆమెలో ఒక ప్రసిద్ధరచయిత్రిని చూసిన గోరాశాస్త్రి సూక్ష్మదృష్టి ప్రశంసనీయం.

గోరాశాస్త్రి, తెలుగు స్వతంత్ర లో నాచేత వారంవారం సినిమా శీర్షికను రాయించాడు. అతని ప్రోత్సాహంతో సినిమా రంగానికి సంబంధించిన థీసిస్‌లాటి దొకటి ప్రతివారమూ రాశాను.

మా ఇద్దరి రాజకీయ దృక్పధమూ ఒకటి కాదు. అయినప్పటికీ నేను రాజకీయసమస్యలపైన రాసినవ్యాసాలు కూడా తెలుగు స్వతంత్ర లో అచ్చుయాయి. ఆ విధంగా గోరాశాస్త్రి తన రాజకీయాలను పత్రికకు అడ్డు రానివ్వలేదనే చెప్పాలి.

కొందరు ఎడిటర్లు తాము పాఠకులే కాకుండా పోతారు, మిఠాయి అమ్మేవాడికి జిహ్వాచాపల్యం లేకుండా పోయినట్టు. తెలుగు స్వతంత్రను కొన్ని సంవత్సరాలపాటు ఎడిట్‌చేసి కూడా గోరా శాస్త్రి పాఠకుడుగా చావలేదు. నేను డిటెక్టివు సాహిత్యాన్ని పేరడీచేస్తూ రాసి ఇచ్చిన మర్నాడు గోరాశాస్త్రి నన్ను టెలిఫోన్‌లో పిలిచి ఏం, గురో! అని పెట్టిన కేక నాకింకా చెవులలో మోగుతునే వున్నది.

తనకు నచ్చినది రెండు పంక్తులు కనిపించినా, ఆ ఆనందాన్ని ఇతరులతో పంచుకునేదాకా నిద్రపట్టని గుణం గోరాశాస్త్రిలో ఉండేది. ఎడిటర్ కావటానికి అంతకన్న పెద్ద అర్హత ఏం కావాలి?

*శ్రీ గోరాశాస్త్రి - 50 వ జన్మదిన అభినందన సంచిక*
*సంపాదకులు· ఎన్. ఇన్నయ్య సి ధర్మారావు, మండవ శ్రీరామ్మూర్తి 1969 ఏప్రిల్*

# 15. రాజకీయ విజ్ఞత

సాహిత్యానికి ప్రయోజనం ఉండక్కర్లేదని వాదించిన వారున్నారుగాని జర్నలిజంకు ప్రయోజనం అవసరం లేదన్నవాళ్ళు లేరు అందుచేతనే కాబోలు పుస్తకాలకన్న పత్రికలు ఎక్కువ అమ్ముడవుతాయి వెయ్యి కాపీలు అమ్మే పుస్తకం మంచి పుస్తకం కిందనే లెక్క, రోజుకు వెయ్యికాపీలు అమ్మే దిన పత్రిక మూయవలసిందే వారపత్రికలు కూడా అంతే. మాసపత్రికలు మాత్రం అటు పుస్తకాలకూ, ఇటు పత్రికలకూ మధ్యస్థంగా ఉంటాయి

జర్నలిజం ప్రయోజనాత్మకమైనది కాని ఎవరి ప్రయోజనం? ఏ ఆత్మ?

పత్రికలు చదివి జనులు మూఢులుగానే వుంటున్నారంటే జర్నలిజం వారికి ఉపయోగించటం లేదన్నమాట. జర్నలిజం ప్రజలకు ఉపయోపడటం లేదనడానికి – ప్రజలను వంచించ ప్రయత్నిస్తున్న దనడానికి – ఆధారాలున్నాయి.

అమెరికాలో వాటర్‌గేట్ ఉదంతం తీసుకోండి వాటర్‌గేట్ విచారణలలో బయటపడిందేమంటే అమెరికా పాలకపర్గీయులలో అగ్రశేణివాళ్ళు పచ్చిదొంగలు! శిక్షార్హులు. కాని ఈ విచారణలు చూసి, ''ఆహా! అమెరికాలో ప్రజాతంత్రం ముమ్మరంగానే ఉందిగనక ఈ విచారణ సాధ్యమయింది! సత్యం బయటపడింది!'' అని వ్యాఖ్యానించారు కొందరు జర్నలిస్టులు.

ప్రజలచేత ఎన్నుకోబడిన వాళ్ళు ఘోరమైన నేరాలు చెయ్యటం ప్రజాస్వామ్యానికి హానికరం కాదట! వాళ్ళు దొరికి పోవటంలో ఉందట ప్రజాతంత్రమంతా! కాని ''ఇద్దరు వ్యక్తులూ, రెండు సంస్థలూ పూనుకోకపోతే ఈ నేరాలు బయట పడేవికావు '' అంటున్నాడు క్లిసింజర్

దీన్ని బట్టి అమెరికా లోని ప్రజాస్వామ్య మంతా ఇద్దరు వ్యక్తులపైనా, రెండు సంస్థలపైనా ఆధారపడి ఉన్నదన్నమాట!

అది అలా ఉండగా నిజంబయట పడిందన్న మాట పూర్తిగా నిజంకాదు. ఇంకా సగం నిజం కూడా బయటికి రాలేదని అమెరికన్ పత్రికలే అంటున్నాయి. నిజం చెప్పగలవాళ్ళు అభయం (ఇమ్యూనిటి) అడుగు తున్నారు!

అమెరికన్ ప్రజాతంత్రానికి ఏమాత్రము తీసిపోని ప్రజాతంత్రం మనకూ ఉన్నది. పాలక వర్గాలకు ప్రతికూలంగా ఉన్న వ్యక్తులు ఇక్కడ కూడా ఆకస్మిక మరణాల పాలవుతుంటారు. ఇక్కడా టెలిఫోన్‌లను టాప్ చెయ్యటం వున్నది. ఇక్కడా ఉత్తరాలు తెరిచిచూసి, వారం రోజుల అనంతరం బట్వాడా చెయ్యటం వున్నది. అనుకూలంగా ఓట్లు వెయ్యనివారిని సమయానికి మాయం చెయ్యటం ఉన్నది కాని ఇదంతా పత్రికలలో ఎందుకు రాదంటే – జర్నలిస్టులు లేక కాదు ప్రజాస్వామ్యానికి మూలస్తంభాలనదగిన వ్యక్తులూ, సంస్థలూ లేక

దిండిగల్లులో డియంకెకు డిపాజిట్టు పోయినంతపని ఎందుకు జరిగిందంటే మద్రాసు ముఖ్యమంత్రిగారు సరయిన కులంవాణ్ణి నిలబెట్టనందు వల్ల అన్నారు. తీరా చూస్తే కులం సరి అయినదే గాని శాఖ సరి అయినది కాదు!

ఈ మాట ఒక రాష్ట్రానికి చెందిన ముఖ్యమంత్రే అన్నారు. గనక మన పార్టీలు గెలవాలంటే వారి ప్రణాళికలూ, కార్యక్రమాలూ ఎందుకూ పనికి రావు. ఎన్నికకు నిలబడే వాళ్ళు సరియిన కులాలకూ, శాఖలకూ చెందినవాళ్ళు కావాలన్నమాట! మనకున్నది 'కులశాఖా ప్రజాస్వామ్యం! '. లేక ఇది కేవలం ద్రావిడ దేశానికి మాత్రమే వర్తిస్తుందేమో చూడాలి. ఎందుచేతంటే ప్రధాని ఇందిరా గాంధీ గారు కుల వ్యవస్థ నిర్మూలమైందంటున్నారు. లేక నేను 1942లో తొందరపడి 'కులం గాడి అంత్యక్రియలు' రాసినట్టు ఆమె కూడా పాపం, తొందరపడుతున్నారేమో!

దిండిగల్లులో డి యంకె ఓడటానికి మరొకరు చెప్పే కారణం ఏమంటే, ఎంజి ఆర్ దిండిగల్లు నియోజకవర్గ అభ్యర్థి కాదు. అతడు పార్టీ నాయకుడు. సినిమా తారడు అని కావచ్చు. మన జగ్గయ్య పూర్వం అఖండ విజయం సంపాదించి ఎం.పీ. అయ్యాడు. అలాటప్పుడు కుల శాఖ ప్రజాస్వామ్యం బదులు సినిమా ప్రజాస్వామ్యం ఎందుకు నెలకొల్పరాదూ? ఇవాళ సినిమా తారలకు లోటులేదు కొందరు యావద్భారత తారలున్నారు. ఎక్కడ నిలబెట్టినా జయించుకొస్తారు. మన జర్నలిస్టులు అసలు రాజకీయాలు తప్ప ప్రజలకు అన్నీ చెబుతారు. అదీ అసలు సంగతి రాజకీయ నాయకులే జర్నలిస్టుల్లాగా మాట్లాడుతూ, రాజకీయాలు తప్ప మిగతాదంతా మాట్లాడేటప్పుడు జర్నలిస్టుల నుంచి రాజకీయాలు ఎలా ఆశిస్తాం? ప్రపంచంలోకెల్లా పెద్ద డెమోక్రసీ అయిన మనదేశాన్ని ప్రజాతంత్ర పద్ధతిలో రచ్చకీడ్చే వ్యక్తులూ, సంస్థలూ లేనంత కాలమూ మన ప్రజాతంత్రానికి అజ్ఞాన వాసం తప్పదు కాబోలు.

*కల్పన మాసపత్రిక జులై 1973*

# 16. ఎడిటర్ అనేవాడు

ప్రతి పత్రిక్కీ ఎడిటర్ అనేవాడు ఒకడుంటాడు. కొద్ది వంటింటి పత్రికలు మినహాయిస్తే, ఎడిటర్ జీతగాడు అయి ఉంటాడు. వంటింటి పత్రికల ఎడిటర్లు ప్రొప్రయిటర్లే గనక వారిగొడవ ఇతరులకు పట్టదు. జీతగాడైన ఎడిటర్ల గొడవే కొంత మందికైనా పట్టుతుంది. అనేకమంది ఎడిటరు జీతగాళ్ళపేరు పత్రికలో ఎక్కడా కనిపించదు. అయినా వాళ్ళే ఎడిటర్లు. ఎడిటరు పేరు గుద్దుకునే ఆయనకు ఎడిటింగు ఏమీ చేతకాక పోవచ్చు కూడా. అయినా పేరు అచ్చుగుద్దుకున్నందుకు, పత్రిక చదివేవాళ్ళ

తిట్లూ, దీవనలూ అతగాడు భరించాలి అసలు ఎడిటరు వాటికి అతీతుడు. అందుచేత పేరువేసుకున్న ఎడిటరు ఊరూపేరూ లేని ఎడిటరు మీద చాలా జులుం చేస్తాడు. జులుం చలాయించటానికి చాలా తేలికైన సూత్రం ఏమిటంటే పాఠకుల దీవనలన్నీ పేరుగల ఎడిటరు భరిస్తాడు. తిట్లు అసలు ఎడిటరుకు బట్వాడా అవుతాయి.

ఒకప్పుడు ఈ తిట్లూ దీవనలూ చాలా సీరియస్ విషయంగా ఉండేది ఏ పత్రికకూ వెయ్యి కాపీల ప్రచారంలేని రోజుల్లో పదిమంది మెచ్చుకున్నా లోకమంతా లేచి నిలబడి కరతాళధ్వనులు చేసినంత గొప్పగా ఉండేది. తిట్లయినా అదే ప్రమాణంలో ఉండేవి ఇప్పుడు రోజులు మారాయి. ఏ పత్రికను ఎన్ని లక్షలమంది చదువుతారో ఎవరికీ తెలియదు. ఈ మందిమీద ఎవడన్నా మెచ్చుకుంటూ రాసినా తిడుతూ రాసినా వాడికి తెలీదులే! అని సరిపెట్టుకోవచ్చు వాడుమన టిపికల్ రీడర్ కాడులే! అనుకోవచ్చు. అయినా ఇతర పాసిబిలిటీస్ లేకపోలేదు తిడుతూ వచ్చిన ఉత్తరాలను ఎడిటర్ అయినవాడు సప్రెస్ చెయ్యొచ్చు. మెచ్చుకుంటూ వచ్చే ఉత్తరాలు విధిగా అసలు వాడికి అందుతాయి వాటిని చూసి అసలు వాడు పొంగిపోతాడా? పోడు. ఎడిటర్ పని చేస్తున్నవాడు ఎవరిచేతైనా రాయించాడేమో.

ఈ పరిస్థితి రెండు రకాల పరిణామాలకు దారి తీస్తుంది.

ఒకటి - జీతగాడైన ఎడిటరుమీద ఎడిటరునని చెప్పుకునేవాడు హమేషా నిఘా వుంచటం. అంటే వారిద్దరిమధ్యా ఒక విధమైన కోల్డ్ వార్ ఉంటుంది. రెండు. మేధావులకింద జమ అయిన వాళ్ళు తిట్టటమో, దీవించటమో చేస్తే? లాభంలేదు, సార్. వాళ్ళు ఇవాళ ఏ పత్రిక పాఠకలోకానికి ప్రతినిధులుకారు, వాళ్ళ అభిప్రాయాలకోసం పత్రిక నడిపితే చిప్ప చేతికొచ్చేస్తుంది. సినిమాలు విమర్శకుల కోసం తీసినట్టయితే కొంప గుండమే! (కమ్యూనిస్టులకు మేధావులంటే చిన్నచూపు అని ప్రతీతి. అది పెట్టుబడిదారీ విషయంలో అక్షరాలా నిజం. మేధను అమ్ముకున్నవాడైతే అంత పరవాలేదు. గానీ సొంతాన మేధ ఉపయోగించేవాడు పెట్టుబడిదారీకి గర్భశత్రువు)

రాజకీయాలలో అయేది, బిజినెస్‌లో అయేది, కోల్డ్‌వార్ ప్రతిష్టంభనకు దారి తీస్తుంది గాని పురోగమనానికి దారితీయదు. తనకూ, ప్రొప్రయిటరుకూ మధ్య వుండే మూగయుద్ధం దుష్ఫలితాలనుంచి బయటపడాలంటే ఎడిటింగ్ చేస్తున్నవాడు ముందు తన మేధావిత్వాన్ని తీసి అవతలపెట్టాలి. తాను పత్రికను నడపటంలో సమర్థుడైన కారణం చేతనే తనకు ఉద్యోగం ఇచ్చి ఉండవచ్చు. కాని తాను పత్రిక ఎట్లానడపాలో తనకన్న తక్కువ తెలిసిన వాళ్లనుంచి నేర్చుకోవాలి (ఎక్కువ తెలిసిన వాళ్లయితే ఇంకోర్ని పెట్టుకోనే పెట్టుకోరుగా!).

నిన్నగాక మొన్న కన్ను తెరిచినవారికి మన సాంస్కృతిక రంగంలో ఉన్న ఈ తల్లకిందులు ఆశ్చర్యం కలిగించవచ్చు కాని ఇది అనుక్షణమూ జరుగుతున్నది.

ఎవడికి దేన్ని గురించి ఎవడికన్న ఎక్కువ తెలుసునన్న ప్రశ్నలేనేలేదు జీతం పుచ్చుకునేవాడు ఇచ్చేవాడికి లోకువ. సినిమా ప్రొడ్యూసర్లు ప్రసిద్ధ రచయితలనూ, కళాకారులనూ బోలెడంత డబ్బుపోసి ఎంగేజ్ చేసి, వాళ్ళకు ఎట్లా రాయాలో, ఎట్లా పాటలు కట్టాలో, ఎట్లా ఆర్ట్‌వర్క్ చెయ్యాలో చెబుతారు.

ఇదంతా బిజినెస్ లెమ్మంటారేమో ఎంతమాత్రం కాదు బాబూజీ, ఇది ప్యూర్ సంస్కృతి ఒక ఘరానా మనిషి ఒక సుప్రసిద్ధ నర్తకిని పెళ్ళాడి. ''ఇక నుంచి నువ్వు నృత్యాలు మానెయ్యాలి! '' అంటాడు. ఒక రచయిత్రిని ఒక అరచయిత పెళ్ళాడి, ఆవిడ రచనలు చూసి ముగ్ధుడై మరీ పెళ్లాడి – పెళ్ళాడిన మరుక్షణం నుంచీ ఆవిడ కలాన్ని పామును చూసినట్టు చూస్తాడు ఇందులో బిజినెస్ గొడవ ఏముందో? చెప్పాను ఇదొక సంస్కృతి. దీన్ని తీర్చిదిద్దిన వాళ్ళు బిజినెస్ మెన్ అయితే కావచ్చు. ఇది సంఘం నరనరానా ఎక్కిపోయింది. ఇదికోల్డ్ వార్ సంస్కృతి అందాం

మన ఎడిటర్‌ను దాటి చాలా దూరం వచ్చేశాం రెండోపాయింటు దూషణ భూషణలు పత్రికలను అంటవు. మరేది అంటుతుంది? వాటికి గూడా ముఖ్యమైనది ఏదో ఉంటుందిగద? అవును, ఉంటుంది. అది స్థూలంగా సర్క్యులేషన్, సూక్ష్మంగా రాజకీయాలు. కేవలరాజకీయ పత్రికల విషయంలో రెంటికీ అవినాభావ సంబంధం ఉన్నది. సాంస్కృతిక పత్రికల విషయంలో రాజకీయం తెరచాటుగా ఉంటుంది

చాలా కాలం క్రితం నాకు బాగా తెలిసినవాడొకడు ఒక వారపత్రిక ''చూస్తూ'' ఉండేవాడు. అతను వారం వారం ఒక చిన్న బాక్స్ కట్టి అందులో కొన్ని విషయాలు వేసేవాడు. వాటిని గురంచి ఎడిటరు గారికి ఏదో రిపోర్టు వెళ్ళినట్టుంది. జీతగాణ్ణి పిలిచి ''ఈ విశేషాలు ఏ కమ్యూనిస్టు పత్రికలో నుంచి వేస్తున్నావు?'' అని అడిగాడు.

''మన ఆఫీసుకు కమ్యూనిస్టు పత్రికలు రావండీ. న్యూస్‌వీక్ లో నుంచి వేస్తున్నాను'' అన్నాడు జీతగాడు.

జీతం ఇచ్చే ఆయన ఒక క్షణం తెల్లబోయి, ''అలాగా? ఏమైనా ఆ ఫీచరు మానెయ్యి ''. అన్నాడు. మరేనని మానేశాడు జీతగాడు

కమ్యూనిస్టు వ్యతిరేక దేశాలకన్న కూడా మనదేశం కమ్యూనిస్టు వ్యతిరేకత ప్రదర్శించటంలో ఒక సంస్కృతి లేదంటారా? తప్పకుండా ఉంది. వియత్నాంలో అమెరికా చేసిన యుద్ధానికి విరుద్ధంగా అమెరికనులే ప్రదర్శనలు చేస్తూంటే మన మహానాయకులు, స్వాతంత్ర్య పోరాటపు అతిరథులు ఆ యుద్ధాన్ని మెచ్చుకోవటంలో ఒక సంస్కృతి లేకుండా ఉంటుందండీ?

యస్సార్! ఈసంస్కృతిలో రాజకీయాలే ఉంటాయి. విద్యార్థులకు రాజకీయాలు ఉండరాదనండి – పోలీసులకూ, ప్రభుత్వోద్యోగులకూ, నిరుద్యోగులకూ రాజకీయాలు పనికిరావనండి – కాని దయచేసి సంస్కృతి

విషయంలో రాజకీయాలు పనికి రావని అనకండి. ఈనాటి మన సంస్కృతికి ఒక రూపం ఇచ్చేది రాజకీయాలే గదండి! అందుకే గదా, ప్రాజెక్టుకు శంకుస్థాపన చెయ్యటం దగ్గర్నించీ పాడిగేదెను ఆవిష్కరించటం వరకూ ప్రతిదానికి మంచి అంతస్థుగల రాజకీయవాదిని ఆహ్వానిస్తాం. అంతర్జాతీయ కేన్సరు నిపుణుల మహాసభను ప్రారంభించటానికి ఎవర్ని పిలుస్తారు? కేన్సరుతో బాధపడుతున్నవాళ్లనా? కేన్సరు కేసులు చికిత్స చేస్తున్నవాళ్ళనా? కానేకాదు ఏ దేశపు అధ్యక్షుణ్ణో, ప్రధానమంత్రినో పిలుస్తారు

చిన్న సర్కిల్స్‌లో పరిభ్రమించేవాళ్ళం సంస్కృతి అంటే డబ్బు అనుకుంటాం ఎందుకంటే ఎక్కువ డబ్బున్నవాడు తక్కువ డబ్బున్న వాళ్ళను అయస్కాంతంలాగా, కృష్ణుడు గోపికలను లాగా ఆకర్షించటం చూస్తూ ఉంటాం. కాని ఇంకా పైకి పోతే అసలు విషయం రాజకీయాలని తెలిసి పోతుంది. రాజకీయ హోదా ఎదుట డబ్బు చేతులు పిసుక్కోవటం మనం రోజూ చూసే దృశ్యం కాదు. అందుకేగదా రాజకీయంగా పెరగటానికి లక్షలు లక్షలు కుమ్మరించేది. మరీ పైకి పోతే రాజకీయాలకూ డబ్బుకూ అవినాభావ సంబంధం కనబడుతుంది. రాబడిపన్ను వందల్లోనూ, వేలల్లోనూ ఎగ్గొట్టేవాడు జైలుకుపోతాడు. కోట్లల్లో ఎగ్గొట్టేవాడు మరింతగొప్పగా వర్మిట్స్లూ, లైసెన్సులూ సంపాదిస్తాడు అమెరికా వీపి (వైస్ ప్రెసిడెంట్) ఆగ్నూ రాజకీయంగా చాలా గొప్పవాడు గనక బయటపడ్డాడుగాని మామూలు మనిషైతే పదిహేనేళ్ళు జైల్లోకూర్చునేవాట్ట. ఆ లెవెల్‌లో వాణ్ణి ఎవరూ ఏమీ చెయ్యలేరు.

ఈ గొడవలో మళ్ళీ మన ఎడిటరు ఎటో జారుకున్నాడు. అతగాణ్ణి జీతం ఇచ్చే వాడు వెయ్యికళ్లలో కనిపెట్టి ఉండాలనుకున్నామా లేదా? అందులో తొమ్మిది వందల తొంభై తొమ్మిది కళ్లు అతగాడి రాజకీయాలను హమేషా అన్వేషిస్తూ ఉండాలి.

అదేమిటంటే? రాజకీయాలు సంస్కృతికి ప్రాణంగద! కాని రాజకీయాల్లో చాలా రంగులున్నాయి మత రాజకీయాలు ఫరవాలేదు. వాటిని ప్రత్యక్షంగా తిట్టినా పరోక్షంగా ప్రోత్సహించవచ్చు. కులతత్వ రాజకీయాలను గట్టిగా తిట్టరాదుకూడా. కులతత్వాలు మానండి అని ప్రజలకు అనగా మతం కూడుపెట్టని వాళ్ళకు – గొంతులు చించుకుని చెప్పవచ్చు; అమాటే కులతత్వం రాజకీయ వాదులతో అంటే ఎలెక్షన్లలో డిపాజిట్లు పోగొట్టుకోవలసి రావచ్చు. ఎర్రగిల్టు రాజకీయాలు చాలా ఉపయోగం కూడానూ. ''ప్రజలకోసం! '' అని అరిచేవాళ్లు చేతికందే దూరంలో ఉండటంవల్ల లాభమేగాని నష్టంలేదు. స్థూలంగా చెప్పుకోవాలంటే ఎన్నికల రాజకీయాలన్నీ సహించదగినవే. ఎన్నికలలో ఏమాత్రం నమ్మకం లేని బద్మాష్ రాజకీయాలను కనిపెట్టి ఉండాలి.

మన జీతగాడు (అనగా ఎడిటరు) ఏ రాజకీయాలను దొడ్డిదారిన ప్రవేశ పెడుతున్నదీ శ్రద్ధగా గమనిస్తూ ఉండాలి. సాధారణంగా జీతం డబ్బులకోసం వాడు అన్ని రాజకీయాలూ వదిలేసుకుంటాడనుకొండి, వాడిలెవెల్‌లో డబ్బుకీ, రాజకీయాలకూ

పొంతన వుండి చస్తుందా? చావదు! అయినా చెప్పలేం. దూదిలో నిప్పులాగా వాడిలో చాలా ఏళ్ల అనంతరం కూడా రాజకీయాలు సొరకాలుతూ ఉండొచ్చు. లేదూ, వాడు కళా, కాకరకాయా అనే దృష్టితో రాగూడని రాజకీయాలను పత్రికలోకి రానియ్యొచ్చు (ఒక్కోసారి పనికిమాలిన రాజకీయాలు మరింత కళాన్వితరూపంలో రచనలలో దూరటం కద్దు. కవితా కన్య కమ్యూనిస్టులను వరిస్తున్నందుకు ఒకప్పుడు సురవరం ప్రతాపరెడ్డి గారు ఆశ్చర్యం వెలిబుచ్చారు) జీతగాడికి కళా, కందపచ్చడీ లేకుండా కడిగెయ్యటం కూడా మంచిదే

దొడ్డిదారిన పత్రికలోకి రాజకీయాలు రాకుండా ఎలా చూడటం. అసలు ఎడిటరు జీతగాడు లేకుండా పత్రిక నడపాలంటే మనది వంటింటి పత్రిక కాదాయె. ఈ జీతగాడు మనని ఏమార్చి ఏదోవేసి ప్రాణం మీదికి తీసుకురావచ్చు. ఎందుకు దీన్ని వేశావయ్యా అంటే, రచన బాగుంది. సార్! మంచి ఆర్టు, సార్! ఇటువంటివి వెయ్యొద్దని మీరు చెప్పలేదుగా, సార్? అనొచ్చు. అందుచేత మనం వాడికి గైడ్‌లైన్స్ ఇవ్వాలి. ఇది అన్నంత తేలిక అనుకునేరు. చాలా డిఫికల్ట్, మోస్ట్ కాంప్లికేటెడ్. అనగా, ఎలా చెప్పాలో మనకు చచ్చినా తెలీదు.

అందుకని మనం కొన్ని సులువు మార్గాలు అవలంబించాలి. ''ఇదుగో, అబ్బాయ్! నువు ఏ రచనలోనూ విప్లవం అనేమాట రానివ్వకు. వెనకటికి బ్రిటిషువాళ్లు 'స్వరాజ్యం' అన్నమాటను నిషేధించారు చూడూ! వాళ్ళేం వెర్రివాళ్ళా? సూర్యుడు అస్తమించని సామ్రాజ్యాన్ని ఏలారు. ఏమిటనుకున్నావేమిటోను! శ్రీకాకుళం, వరంగల్లు, విశాఖపట్నం ప్రాంతాలనుంచి ఎవడేం రాసినా వెయ్యకంతే! మనకు రచనలు కరువా? వెలవెలా బండెడు వ్యాసాలు అవతలపారేస్తున్నావే. అందులో ఏదివేసినా పత్రిక నిండిపోతుంది గద. అదే అనొద్దు. పాఠకులకేం తెలుసు, వెధవలు! ఏది అచ్చెయ్యిగాక చదివేస్తారు! వాళ్ళకి బుర్రలుంటే మనం ఈ పత్రిక నడపగలమూ? పత్రిక గెటప్, వ్యాసం మరీ బాగాలేక పోతే మంచి కార్టూన్ తగిలించు, నీకు లిస్టు తయారు చేసిస్తాను. మారుపేరుతో రాసిన వాళ్ళ రచనలు వెయ్యకు. ఎందుకొచ్చిన గొడవ, వియత్నాం మీద ఆ పద్యం వేసుండవలసిందికాదు. వాళ్లు గెలిస్తే మనపత్రిక్కి ఏం వొరిగింది. వాళ్లు ఓడితే మనకేం తరిగింది?... '' ఇలా మనం జీతగాడికి బోధించాలి. మన బాధలు వాడి తలకెక్కేట్టు చూడాలి.

ఇదంతా సంస్కృతి కాదనుకుంటే మీరు దొడ్డిదారినున్నారు. ఇదే ఈనాటి మన సంస్కృతి. దానికి నిదర్శనం మనం ఆదర్శ ఎడిటరనుకునేవాడు.

*సృజన, మార్చ్ 1974*

# 17. మాసపత్రికల తీరు తెన్నులు

భమిడిపాటి కామేశ్వరరావుగారు స్కూళ్ళ ఇన్‌స్పెక్టర్లను కాళ్ళుకడగడం, మాసికం, తద్దినం అని వర్గీకరించారు. అలాగే పత్రికలలో దిన, వార , మాస పత్రికలుంటున్నాయి పత్రికలలో ఇవే ప్రధాన వర్గాలు పక్ష పత్రికలూ ద్వైమాస త్రైమాస పత్రికలూ కేవలమూ 'ఎబరేషన్స్ ' అని చెప్పాలి తరిచి చూస్తే అవి ప్రధాన వర్గాలలో ఏదో ఒకదాని కిందికి వస్తాయి ఇక సావనీర్ల సంగతి చెప్పే అక్కర్లేదు పత్రికలలో అతిఘరానా బిచ్చగాళ్ళు. అవి బయటికి రావాలేగాని వాటిలో శుద్ధా, అశుద్ధ ప్రకటనలు లగాయతు నాలుగు కాలాలపాటు నిలిచే రచనలదాకా ఉండవచ్చు దీపావళీ, ఉగాదీ, సంక్రాంతీ, రిపబ్లిక్‌డే, 'జన్మదినమూ ' వగైరా సందర్భాలను పురస్కరించుకుని వెలువడే ప్రత్యేక సంచికలు కూడా సావనీర్ల జాతివే

ప్రజల దైనందిన రాజకీయ జీవితాన్ని వార్తలనూ తడివేవి దినపత్రికలు. సాంస్కృతిక విషయాలనూ, రాజకీయాలనూ సమీక్షించేవి వారపత్రికలు, కళలకూ, ప్రగాఢమైన సామాజిక సమస్యలకూ అంకితమై ఉండేవి మాసపత్రికలు. ఈ విధంగా మనం ఒక స్థూల నిర్వచనం చేసుకోవచ్చు కాని పత్రికలు ఈ సరిహద్దులలో ఇమిడి ఉండవని వేరే చెప్పనవసరం లేదు. అది అలా ఉండగా, ఒకటి రెండవుతుంది అన్న సూత్రం ప్రకారం, జీవితంలో వైవిధ్యం పెరిగిన కొద్దీ పత్రికలలో ఉపవర్గాలు కొత్తవి పుట్టుకొచ్చాయి. స్త్రీల పత్రికలూ, రాజకీయ పక్షాలకు చెందిన ప్రత్యేక పత్రికలూ, సినిమా పత్రికలూ, చాలా స్వల్ప సంఖ్యలో కులపత్రికలూ పుట్టుకొచ్చాయి.

ప్రస్తుతాంశం మాస పత్రికలు. ఇక్కడ నేను తెలుగు పత్రికల చరిత్ర లోకి పోబోవటంలేదు.

నా అనుభవంలో మొట్టమొదటి ముఖ్య మాసపత్రిక భారతి. అరంభంలో అది సర్వాగ సుందరమైన పత్రిక. అది ఆనాటి ప్రముఖ రచయితలకూ, కళాకారులకూ, చరిత్ర పరిశోధకులకూ, ఇతర మేధావులకూ అవకాశం యిచ్చింది. రామానందచటర్జీగారి మోడరన్ రివ్యూ నమూనాలో. అంతకన్న కూడా అందంగా వెలువడిన ఈ పత్రిక వ్యాపార దృష్టితో నడవలేదు అలాగని ప్రజల పత్రికా అనిపించుకోలేదు. అది ఆంధ్రప్రదేశంలో ప్రతిలైబ్రరీ రీడింగ్ రూమ్‌లోనూ కనిపించేదన్న మాటేగాని, ఆ లైబ్రరీలు నెలకు ఆరణాలు కూడా ఇచ్చుకునేవి కావు. మొదటి ప్రపంచ యుద్ధానంతర ప్రజలలో కలిగిన చైతన్యంలో ఒక భాగంగా లైబ్రరీల సంఖ్య అమితంగా పెరిగింది. చాలా లైబ్రరీలకు కాశీనాధుని నాగేశ్వరరావు గారు ప్రారంభోత్సవం చేసి 'విరాళం' ఇయ్యటమే గాక, ఆంధ్రపత్రికనూ, భారతిని 'ఫ్రీ' గా యిస్తూ వచ్చారు. 'భారతి' లూజ్ సేల్స్ చాలా తక్కువ.

'భారతి' చేతిలోకి రాగానే నేను పొందుతూ వచ్చిన ఆనందం జీవితమంతా జ్ఞాపకముండే ఆనందాల స్థాయికి చెందినది. అయితేఅది ఆనాటి మేధావి వర్గానికి పరిమితమైన పత్రిక. ప్రజలలో పఠనాసక్తిని పెంపొందించే పత్రిక కాదు అంత ఆనందం పొందినా, నాకు 'భారతి' లో అనేక వ్యాసాలు అర్థం కూడా అయేవి కావు - శాసనాలూ, రాగి రేకులూ వగైరా

మాస పత్రికల విజృంభణ ప్రారంభమయినది డిప్రెషన్ తరవాత 'భారతి' ప్రేరణతో - ప్రోత్సాహంతో కాదు - రచయితలు అయి, తమ రచనలను ఎక్కడ ప్రచురించాలో తెలియనివారు చాలామంది తయారయారు వీరి పాలిట కల్పవృక్షాల లాగే ఊరుకో పత్రిక పుట్టుకొచ్చింది. వీటిని 'పుట్టగొడుగు' లన్నారు 'వంటింటి' పత్రికలన్నారు వీటిలో కొన్ని 'బతుకు తెరువు' పత్రికలు ఒక్క 'వినోదిని' తప్ప ఏ పత్రికా వెయ్యి కాపీలు అమ్మకపోయినా, ఈ కొత్తరకం మాసపత్రికలను నడిపినవారు మరీ అసమర్థులైతే తప్ప, వీటి మీద 'సంపాదక' యజమాని బతికే అవకాశం వుండేది.

పత్రికలు వ్యాసాలను 'కృతజ్ఞతతో' స్వీకరించేవి. అచ్చులో పేరు చూసుకోవాలన్న దుగ్ధ గలవారు ఎగబడి రాసేవారు. పత్రికల సంఖ్య పెరుగుతున్న కొద్దీ 'భుజ బలం' గల వస్తాదు రచయితలు పైకి తేలారు కొత్త పత్రిక పెట్టదలచుకొన్న వాడు వాళ్ళ ఎడ్రసులు తెలుసుకొని, వాళ్ళ 'అమూల్య' రచనల కోసం అడిగితే చాలు. పత్రికకు కావలిసిన 'పిండి' ఆటోమాటిక్‌గా చేతికి అందేది.

ఈ పత్రికల ధర్మమా అంటూ ఏజెన్సీలు వ్యాపార ధర్మాలను అవలంబించాయి. అంతకుపూర్వం ఏజెంట్లు దినపత్రికల మీద మాత్రమే కాస్త డబ్బు చేసుకునేవారు. అయినా పత్రికలకు ఏజెంటుగా వుండటం ఒక 'గౌరవం' అనిపించుకునేది గాని, 'వృత్తి' అనిపించుకునేది కాదు. మాసపత్రికల విజృంభణతో, ఈనాటి సినిమా డిస్ట్రిబ్యూటర్ల లాగా, ఏజెంట్లు తయారు కావటమే గాక అది పోటీ వ్యాపారంగా తయారయింది.

ఈ దశలో కొత్తదారి తొక్కిన మాసపత్రిక 'గృహలక్ష్మి', స్త్రీల పత్రిక. దానికి సంపాదకత్వం వహించిన ఆంధ్ర శేషగిరిరావు గారు సొంతాన 'ఆంధ్రభూమి' నడిపారు. తరవాత కొంతకాలానికి 'ప్రబుద్ధాంధ్ర' వచ్చింది. జిల్లా ఖ్యాతీ, తాలూకా ఖ్యాతీ స్థానిక ఖ్యాతీ గల పత్రికలకు అంతే లేదు

వీటిలో చాలాభాగం కథల మూలాన కొంతకాలం బతికాయి. తెలుగులో చిన్న కథ అభివృద్ధి కావటంతో ఈ 'పుట్టగొడుగు' పత్రికలు నిర్వహించిన పాత్ర నిర్ణయించటం సాధ్యం కాదు. అచ్చుగా కథల ఆధారంతోనే ఆ 'వేదకాలం' లో ఏడెనిమిది వేలు నెల నెలా అమ్మిన పత్రిక 'వినోదిని'. దాన్ని ఉచ్చదశలో నిర్వహించినది శ్రీనివాస శిరోమణి, ఒకప్పుడు సాహితీ సమితి సభ్యుడు!

భారతి పుట్టిన దశాబ్దం తరవాత వచ్చిన ఈ మాసపత్రికలు కళలను గురించిగాని, చరిత్ర పరిశోధన గురించి గాని భారతి చూపిన శ్రద్ధలో నూరోవంతు చూపలేదు. ఒకవంక జాతీయోద్యమం తోనూ, ఇంకోవంక ఆర్థిక ప్రతిష్టంభన తోనూ ఎంతో చైతన్యం పొంది ఉండవలసిన ప్రజలు దీన్ని గురించి ఏమి బాధపడకపోవటం ఆశ్చర్యకరం. వాళ్ళు పత్రికలనుంచి ఆశించినది కాలక్షేపం మాత్రమే అని తోస్తుంది అందుకే ఏ పత్రికా వెయ్యి కాపీలు అమ్మనిరోజుల్లో ఖులాసా కథల పత్రిక వినోదిని 7,8 వేల దాకా అమ్మింది రాజకీయాలపట్ల ఆసక్తి గల వారు దినపత్రికలనూ, వారపత్రికలనూ చదివారు

డిప్రెషనుకూ, రెండో ప్రపంచ యుద్ధానికి మధ్యకాలంలో పత్రికా ప్రచురణలో అన్నిటికన్న తేలికైనది మాస పత్రికలు నడపటం నెలరోజులు గడువుంటుంది పెద్ద పెట్టుబడి అవసరంలేదు వ్యాసాలూ, కథలూ రావన్న భయంలేదు ఎవరో లెక్కలుగట్టి రుజువు చేసినట్టే మామూలు మాసపత్రికకు పాఠకులున్న దానికన్న దేశంలో రచయితలు ఎక్కువమంది ఉండేవారు అన్ని పెద్ద బస్తీలలోనూ పత్రికను అమ్మిపెట్టే ఏజెంట్లు ఉండేవారు పత్రిక నడిపే వాడికి రచయితల పేర్లు, ఎడ్రసులూ తెలిస్తే చాలు. వేరే అర్హతలు ఏవీ అవసరంలేదు ఈ మధ్యకాలంలో సినిమా చిత్ర నిర్మాతల క్వాలిఫికేషన్స్‌కూ , ఆనాటి మాసపత్రికా నిర్వాహకులకూ ఏమీ తేడా లేదు

మాసపత్రికలు నడపటానికి తోడ్పడిన కథకుల పని తేలికే అయింది. అందరూ చరిత్ర పరిశోధనలు చెయ్యలేరు అందరూ రాజకీయాలను చర్చించలేరు. అందరూ కళలను గురించి రాయలేరు కాని కథలు ఎవరైనా రాయొచ్చు. అనుకరించటానికి బోలెడంతమంది పాశ్చాత్యకథకులున్నారు. వాటిని ఇంగ్లీషులోనే చదివే పని కూడా లేదు. మొపాసా కథలు ప్రతి పత్రికలోనూ అనువాదం అవుతున్నాయి. శరత్ అగ్ర తెలుగు అనువాద రచయిత కాకముందే మొపాసా అగ్ర తెలుగు కథకుడు అయాడు చలం గారిని అనుకరించినా గొప్ప కథకుడు అనిపించుకోవచ్చునని చాలామంది యువ కథకులు తెలుసుకున్నారు ఈ కారణాల వల్ల మాసపత్రిక పరిశ్రమలన్నిటి లోకి చాలా సులువయింది

తరవాత వచ్చిన 'వేరియేషన్స్' అన్నిటికీ మాసపత్రికే ముఖ్య క్షేత్రం అయింది తొలి సినిమా పత్రికలూ 'అభ్యుదయ' లాటి రాజకీయ దృక్పథం గల సాహిత్య పత్రికలూ కూడా మాసపత్రికలే. సినిమారంగంలో కళాసారభ్యం లేకపోవడం చేత కాబోలు సినిమా పత్రికలు చాలావరకు వారపత్రికలుగా మారాయి. (మన మొదటి నిర్వచనం ప్రకారం వారపత్రికలు సాంస్కృతిక విషయాలనూ, రాజకీయ వార్తలనూ చర్చిస్తాయి. సినిమా సంస్కృతి సార్వజనీనం కావడమే గాక, సినిమా వార్తలు రాజకీయ వార్తలను తలదన్నిపోయాయి.)

అలాగే వైజ్ఞానిక పత్రికలు నడపటానికి యత్నించిన కాశీపట్నం కొండయ్య గారి లాటివారూ, చిన్న పిల్లల పత్రికలను పెట్టదలచినవారూ మాసపత్రికలనే నడిపారు ఆ కాలంలో జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి ఈ అరకపు మాసపత్రికలకు 'మాసికలు' అని పేరు పెట్టాడు ఈ మధ్య కరపత్రం లాగా వెలువడుతున్న 'అభ్యుదయ' కూడా 'మాసికే'.

అయితే ప్రపంచయుద్ధం ముగిసినాక, ప్రత్యేకించి దేశం స్వతంత్రం అయిన తరవాత, పత్రికలను నిర్వహించటం భారీ పరిశ్రమగా తయారయింది. విస్తృత ప్రచారం వారపత్రికలతో ప్రారంభమైనప్పటికీ, మాసపత్రికలు కూడా లాభం పొందాయి

ఈనాడు నెలకొక కొత్త మాసపత్రిక వస్తున్నా ఇవి వొంటింటి పత్రికలు కావు. వీటిని నడపటానికి డబ్బు పెట్టుబడే గాక ఇంకా చాలా హంగులు కావాలి. మంచి ఇలస్ట్రేషన్లు, కార్టూన్లు, పేరుమోసిన రచయితలూ, అందమైన అచ్చుపనీ, నమ్మకమైన ఏజెన్సీలూ ఏర్పడితేనే గాని ఈ రోజుల్లో మాసపత్రికను నిర్వహించటం సాధ్యం కాదు. ఈరోజుల్లో రాయగలవాళ్ళెవరూ అచ్చులో పేరు చూసుకోవటానికి రాయరు. డబ్బు ఇచ్చుకోవాలి.

చచ్చు, బొచ్చు, సాహిత్యంగా చలామణీ అయేదానికి ఈనాడు ప్రధాన వాహికలు మాసపత్రికలే. ఇందులో మాసపత్రికలకు వారపత్రికల పోటీ ఉన్నప్పటికీ ప్రస్తుతం మాసపత్రికలు 'సాహిత్య' పత్రికలుగా మాత్రమే నడవగల దశలో ఉన్నాయి. నిజానికి మాసపత్రికలు ఇంచుమించు ఏ విషయానికి సంబంధించిన రచనలైనా ప్రచురించవచ్చు. కళలూ, రాజకీయ సిద్ధాంతాలూ, సాహిత్య విమర్శలూ , సాంకేతిక విషయాలకు సంబంధించిన వ్యాసాలూ, ఆర్కియాలజీ, ఆంత్రొపాలజీ, ప్రీహిస్టరీ, విజ్ఞానం మొదలైన సవాలక్ష విషయాలను ప్రజలకు అందించే అవకాశం మాసపత్రికలకున్నది.

కాని మాసపత్రికల వ్యాపారపు ఫార్ములా వాటివి పెరగనీయకుండా ఉన్నది. లక్షకాపీలు అమ్మటం వారపత్రికలకు సాధ్యమైనా, 30 వేల కాపీలు చాలా గొప్ప సర్క్యులేషన్ అని మాసపత్రికలు భావించే స్థితిలో ఉన్నాయి. నిజానికి, కథలూ, సీరియల్సూ, కార్టూనులూ మించి ఫార్ములాను విస్తరించితే, ఈ ఉన్న అమ్మకాలు పడిపోయే భయం లేకపోలేదు. అందుచేత వారపత్రికలకు అగ్రస్థానం వదిలి, ఆలోటు ఖరీదులో భర్తీచేసుకుని మాసపత్రికలు ఒక గాట్లో నడుస్తున్నాయి. మాసపత్రికల మధ్య పోటీ తీవ్రదశకు వచ్చినా, పాఠకులలో తాము చదివే దానిపట్ల నిర్లక్ష్యం పోయినా ఇప్పుడున్న ఫార్ములా దెబ్బ తింటుంది. ప్రస్తుతానికి మటుకు, ఉన్న పత్రికలు లాభసాటిగానే నడుస్తున్నప్పటికీ మాసపత్రికలలో వైవిధ్యం కనబడదు. కొద్ది మంది రచయితలే అన్నింటికీ ఒకే రచనలు పంపుతున్నారు.

ప్రస్తుతం 'మల్టీసెక్షన్' మాసపత్రికలు వస్తున్నాయి. ఇది వ్యాపార పోటీ ఫలితం మాత్రమే దీన్ని పత్రికా నిర్వహణ విద్యలో ప్రగతి అనలేం ఇప్పుడున్న స్థితిలో మాసపత్రిక లన్నిటిలోకీ హెచ్చు ప్రచారం పిల్లల పత్రికల కుండటం గమనార్హం. అవి వర్తమాన జీవితాన్ని దాదాపు ఏమాత్రమూ స్పృశించవు. ఇది చూసిన మీదట మాసపత్రికలు జరగబోయే భావిపరిణామం ఊహించటం మరీ కష్టం అవుతున్నది

*ప్రభవ, మార్చి 1978*

## 18. సాహిత్యమూ - పత్రికలూ

గత శతాబ్దిలో ఇంగ్లండులో రాబర్ట్ బ్రౌనింగ్ అనే సుప్రసిద్ధ కవి వుండేవాడు. అతని భార్య ఎలిజిబెత్ బారెట్ బ్రౌనింగ్ కూడా కవిత్వం రాసేది ఇద్దరూ గొప్ప కవిత్వం రాసినప్రసిద్ధులే అయినప్పటికీ, రాబర్ట్ బ్రౌనింగ్ తన పద్యం ఒకటి కూడా పత్రికకు పంపి ఎరగడు.

ఒకసారి ఒక పత్రికవాళ్ళు అతనికి పది పౌన్లకు కాబోలు చెక్ పంపుతూ తమ పత్రికలో ప్రచురణకు ఒక్క పద్యం రాసి పంపమన్నారు. బ్రౌనింగ్ తాను పత్రికలకు రాయనని చెబుతూ ఆ చెక్ తిప్పిపంపాడు ఈసారి పత్రికవాళ్ళు తమ గుమాస్తా పొరపాటుకు క్షమాపణ చెప్పుకుంటూ, నూరు పౌనులు పంపటానికి మారుగా పొరపాటున పది పౌనులు పంపటం జరిగిందనీ, తప్పక ఒక కవిత పంపవలసిందనీ కోరారు. బ్రౌనింగ్ దాన్ని కూడా తిప్పిపంపేస్తూ, నేను పత్రికలకు పద్యాలు, రాయను. నన్నెందుకు వేధిస్తారు? నా భార్య పత్రికలలో పద్యాలు ప్రచురిస్తుంది. ఆమెను కోరండి అని రాశాడు.

ఈ సంఘటన నుంచి మనం తెలుసుకోదగిన విషయాలు చాలా వున్నాయి. నూరుపై చిల్లర ఏళ్ళక్రితం బ్రిటనులో పత్రికలు 'సాహిత్యం' ప్రచురించటానికి ఆత్రపడేవి. 'సాహితీపరులు' పత్రికల మీద ఆధారపడకుండా, వారి వర్తక ఔదార్యం లక్ష్య పెట్టకుండా తమ రచనలను పుస్తకాలుగా వెలువరించుకోగలిగేవారు. కొందరు సాహితీపరులు (ఉదా. చార్ల్స్ డికెన్స్) తమ రచనలను పత్రికలలో ప్రచురించటానికి సంకోచించలేదు. అందుచేత పత్రికలలో నుంచి సాహిత్యం రాదన్న మాట బ్రిటన్‌లో ఏనాడూ లేదు.

మన దేశంలో పరిస్థితి ఏమిటి? నిన్న మొన్నటి దాకా మన 'ప్రకాశకులు' ప్రాచీన సాహిత్యాన్నీ పాఠ్యపుస్తకాలనూ ప్రచురించినవారు. ఆధునిక సాహిత్యం అర్భకపుదశలో వున్నప్పుడు కూడా దాన్ని ప్రోత్సహించటానికి పుట్టిన పుస్తక ప్రచురణ

సంస్థలు చాలా కొద్ది ప్రజలలో పఠనాసక్తి పెరిగిన తీరుగా సాహిత్యగ్రంథాల ప్రచురణ విస్తరించని మాట నిజం

అలాటి పరిస్థితిలో లక్షలాది పాఠకుల కోసం వందల సంఖ్యలో బయలుదేరిన పత్రికలు సాహిత్యానికి తప్పనిసరిగా వాహకాలయాయి కాకపోతే ఈ పత్రికలు వ్యాపారకారణాలవల్ల అచ్చుగా ఉత్తమసాహిత్యమే వేస్తాయని కంకణం కట్టుకోలేదు రాశిమీద లఘుసాహిత్యం అధికంగా వుండిన కారణంచేత పత్రికలు అచ్చుగా అదే ప్రచురిస్తున్నట్టు, భ్రమకలిగి వుండవచ్చు. కాని అది భ్రమే.

ఈ కాలంలో వచ్చే మంచి సాహిత్యం ముఖ్యంగా కల్పనసాహిత్యం – ఒక్క శాతమే అనుకున్నా, దాదాపు అది అంతా పత్రికల ద్వారానే వచ్చింది. చిత్రం ఏమిటంటే ఈ నాడు విరివిగా వున్న పుస్తకప్రకాశకులు ఉత్తమసాహిత్యం జోలికి పోవటానికి భయపడుతు న్నారు.

ఒకటి రెండు ఉదాహరణలు చెబుతాను 1937లో నేను తొలిగా యువ ప్రచురణలు ప్రారంభించి, చలంగారిని కొన్ని కథలు అడి గితే ఆయన బోలెడన్ని వ్రాతప్రతులు నాముందుపడేసి, కావలసినవి తీసుకోమన్నారు. ఆ రోజుల్లో చలంగారి రచనలు అచ్చువెయ్యటానికి అప్పుడు కొద్దిపత్రికలు భయపడేవి పుస్తకాలు వేసేవాళ్ళు లేరు అప్పుడు నేను 'పాపం!!! ' ప్రచురించాను. పత్రికలు చెయ్యని పని పుస్తక ప్రచురణకర్తలూ చేయలేదు.

నేను నలభై ఏళ్ళ పాటు రాసిన కథలూ, పెద్దకథలూ ఇవాళ ప్రచురించేవాళ్ళు లేరు కాని సాహిత్యంగా ఆ రచనలను ఆదరించే వారు కొద్దిగా యింకా వున్నారు. ఆ మాటకు వస్తే నా రచనల ఆధారంతో డ్యాక్టరేట్ సంపాదించుకున్నవారూ వున్నారు ఆ రచనలన్నీ పత్రికలలో వచ్చినవే.

మళ్ళా ఒకసారి ఇంగ్లండుకు పోదాం. ఒక పుస్తక ప్రచురణకర్త చార్ల్స్ డికెన్స్‌కు ఒక కంట్రాక్టు రాసి ఇస్తూ, ఆయన రాగల నాలుగేళ్ళ లోపల చేసే రచనలను తాను పుస్తకాలుగా వేసుకునేటందుకు అడ్వాన్సుగా – పరిష్కారంగా కాదు! – 28,000 పౌన్లు ఇచ్చాడు. తెలుగులో ఇటువంటి గౌరవం 'హాట్‌వేవ్' రచయిత్రులకు కూడా జరిగివుండదు

ఇవాళ కూడా మంచి సాహిత్యం కావలసిన వారికి అది, సముద్రంలో కాకిరెట్టలాగే అనుకోండి, పత్రికలలోనే దొరకాలి పుస్తకాలలో లభించటం కష్టం. ఎప్పటికప్పుడు సృష్టి అయ్యే సాహిత్యం మాట చెబుతున్నాను.

*ముద్రణ జ్యోతి మాసపత్రిక, జూన్ 1979*

ఊఊఊఊ

# 1. స్వేచ్ఛ

స్వేచ్ఛ మానవుడి జన్మహక్కు. ఒకడి స్వేచ్ఛను మరొకడు అరికట్టడం మహాపాతకం! సంస్కారి అయిన మానవుడు నిర్బంధం ఎక్కడ ఉన్నా సహించలేడు. సామాన్య మానవుడు తనస్వేచ్ఛ కోసం ఎట్లా పోట్లాడుతాడో సంస్కారి మరొకరి స్వేచ్ఛకోసం అట్లాపోట్లాడుతాడు. స్వేచ్ఛ తన జన్మహక్కని గ్రహించిన ప్రాణి ఒక మానవుడే కాదు. క్రిమి కీటకాలు మొదలుకొని ప్రతిజీవి తన స్వేచ్ఛ కోసం చాలాగోల చేస్తుంది. గుప్పిట్లో చిక్కిన ఈగలూ, బోనులో పడ్డ ఎలుకలూ, పంజరం లో పెట్టిన చిలకలూ స్వేచ్ఛ కోసం పడే బాధ వర్ణనాతీతం. స్వేచ్ఛ కోసం ఎంత ఘోరం చేసినాలోకం తప్పుపట్టదు. అందుకోసం చేసే హత్యలు హత్యలుకావు. అందుకోసం ప్రాణాలు విడవటం ఆత్మ హత్య కూడా కాదు. ప్రతి ప్రాణీ స్వేచ్ఛకు సహజమైన హక్కు కలిగి వున్నది.

అట్లాగే ఆహారం తినడానికి కూడా ప్రతి ప్రాణీ సహజమైన హక్కు కలిగి వుంది. అందుచేతనే ఆహారానికి గాను జీవహింస చెయ్యటం పాతకం అనిపించుకోదు. తనకంటే తక్కువ ప్రాణిని హింసించకుండా ఏ ప్రాణిజీవించలేదు. ఏ విధమైన తక్కువ కానివ్వండీ! అది ప్రకృతి నిర్ణయం. అన్నంతినటానికి ప్రతిప్రాణికి కల సహజ హక్కులను గుర్తించే కొందరు సంస్కారులు సామ్యవాదులని పేరు పెట్టుకుని తమ జాతిలోకొందరు తిండికే మాడుతున్నవారుండటం ఘోరమని ప్రచారం చేస్తున్నారు. ఇప్పుడు ప్రపంచమంతా అమలులో ఉన్న ఆర్థిక చట్టం అనేక లక్షల మందికి ఉన్న ఆహారాన్ని అందకుండా చెయ్యాలని చూస్తున్నది. దీని స్థానే మరొక చట్టాన్ని ఏర్పాటు చెయ్యాలని చూస్తున్నారు సామ్యవాదులు.

కాని ఒక వైద్యుడు రోగికి నాలుగురోజుల పాటు ఆహార లంఘనం విధిస్తే ఈసామ్యవాదులు ఆవైద్యుణ్ణి ఉరితియ్యరు. అనేక మంది ఆరోగ్య సూత్రం గుర్తెరిగిన వారై తమకు తామే నిరశనం ఉంటారు, కొంత కాలంపాటు, ఒక్కొక్క సమయంలో ఉపవాసం చెయ్యని వాణ్ణి మనం తప్పుపడతాం కూడానూ. ఎందువల్ల? వాడికి భోజనం చేసే హక్కు తాత్కాలికంగా పోయింది కనక! ఆవిధంగానే నెలల పిల్లవాడు పెద్దవాళ్ళు తినే వస్తువులు కొన్నితినటానికి ఆశించితే మనం ఒప్పం! ఆ వస్తువులు వాడికి అందకుండా కూడా చూసి వాడి సహజ హక్కును అరికడతాం. ఎందువల్ల? ఆ పదార్థాలు తినే హక్కుకు వాడింకా అర్హత పొందలేదు కనక!

కనక మనం తెలుసుకోవలసిందేమంటే, స్వేచ్ఛకానివ్వండి ఆహారం తినటమే కానివ్వండి, జ్ఞానాన్వేషణే కానివ్వండి, మరొకటి ఏదైనాకానివ్వండి, అది సహజ హక్కు అయినంత మాత్రాన వ్యక్తులకు కలిగిన ఉపకారం ఏమీలేదు. ముందు ఆ హక్కులు

అనుభవించటానికి ప్రతీవాడూ మరొకడితో ఏంతు లేకుండా, అర్హత పొందాలి, ఆ తరువాత ఆ అర్హతను నిలబెట్టుకోవాలి అందుకనే భోజనం విషయమై అన్ని ప్రాణులకూ కలిగిన సహజ హక్కును గౌరవించే సామ్యవాదులు కూడా పని చెయ్యని వాడికి భోజనం చెయ్యటానికి అర్హత లేదని శాసిస్తారు. భోజనం చెయ్యటానికి తనకు గల హక్కును దుర్వినియోగపరచి అమితంగా తిన్న వాణ్ణీ, జీర్ణం కానిది తిన్న వాణ్ణీ వాడికి హక్కు ప్రసాదించిన ప్రకృతే శిక్షించుతుంది అప్పుడు కడుపులో నొప్పి అజీర్ణవ్యాధి ప్రాప్తమయి తాత్కాలికంగా వాడికి తినటానికి గల హక్కు దూరమైపోతుంది మళ్ళీ వైద్యుడు వచ్చి వాడికి భోజనం చెయ్యటానికి హక్కును ప్రసాదించేదాకా అంతే! తినటానికి మనకు గల సహజ హక్కును దుర్వినియోగ పరచటం పాపం, అందుకు నరకం, కడుపులో నొప్పి , అజీర్ణమూనూ

నిజమైన స్వేచ్ఛ ఏమిటంటే సహజ హక్కులను వినియోగించుకునేటందుకు సంపూర్ణమైన అవకాశం. పక్షుల మాదిరిగా గాలిలో ఎగిరేటందుకు మనకు సహజమైన హక్కు లేదు. అందుకనే గాలిలోకి ఎగరలేక పోయినామని ఎవరూ చింతించరు కాని తమశక్తి సామర్థ్యాలతో విమానాలను నిర్మించుకుని గాలిలో ఎగరటానికి మనిషికి హక్కున్నది ఇంత ఎందుకు? ఒకమనిషి తనకు గల జ్ఞానాన్నీ శరీర బలాన్నీ వినియోగించి ఏమేమి చెయ్యవచ్చునో అవన్నీ చెయ్యటానికీ సహజమైన హక్కున్నది. - జ్ఞానాన్ని అభివృద్ధి చేసుకోవటంతో సహా!

ఈహక్కులను అంతులేకుండా పెంపుచేసుకోకుండా ప్రకృతే మానవుణ్ణి అరికట్టుతున్నది వాటిని ఒకమితి దాటి వినియోగించినప్పుడు ప్రకృతే శిక్షించుతున్నది. అయితే, ప్రకృతి శిక్షకు పాత్రం కాకుండా చెయ్యదగిన పనులు అనేకం మనం చెయ్యకుండా మానుతున్నాం ఎవరినన్నా హత్య చేసినట్టయితే మనల్ని ప్రకృతి శిక్షించదు కాని మానవుడు శిక్షించుతాడు! అనగా మానవుడి స్వేచ్ఛకు ప్రకృతి గీసిన గిరులు అట్లా వుండగా మానవుడు మరికొన్ని గిరులు గీశాడు ప్రకృతి గుర్తించే అర్హతతో మనిషి తృప్తి పడలేడు. అందువల్ల ఒక బ్రాహ్మణుడు మాంస భక్షణ చేసినట్టయితే అతన్ని ప్రకృతి శిక్షించక పూర్వమే సాటి బ్రాహ్మణుడు శిక్షించుతాడు.

మనిషిపెట్టిన ఈ నిర్బంధం ప్రకృతిపెట్టిన నిర్బంధం మోస్తరుగా న్యాయంగా ఉండటం అసంభవం. మానవుడు చేసే పాపాన్ని ప్రకృతి పెంట్రుకవాసి తేడా లేకుండా తూచి సరిగా దానికి తగిన శిక్షే ఇస్తుంది. అందుకనే ఎంత ఎక్కువ తిన్నవాడికి అంత అజీర్ణ మే చేస్తుంది. ప్రకృతి మార్గాన్ని తప్పుపట్టేటందుకు ఎవరికీ అధికారం లేదు అదీకాక ప్రకృతి వ్యక్తులలో తారతమ్యాన్ని గుర్తించుతుంది. ఒకణ్ణి ఒకందుకు శిక్షించి అపనే చేసిన మరొకణ్ణి ఏమీ చెయ్యదు. ప్రకృతి ఒక వ్యక్తి యొక్క శారీరక సంస్కారాన్ని చక్కగా గుర్తించగలదు. కాని మానవుడు తనకు తాను కల్పించుకున్న నియమాలు గుడ్డివి, అందుచేత అవి మానవుడికీ మానవుడికీ గల తేడాను గుర్తించలేవు.

అందరు మానవులకూ ఒకటే శాసనం దీనిని మాటిమాటికీ సంస్కరించవలసిన అగత్యం కలుగుతూ ఉండటానికి కారణం కూడా వాటి అపరిపూర్ణత్వమే అది అట్లావుండగా మనం ప్రకృతికట్టు మీరలేం కాని మానవుడి కట్టు మీరగలం మనిషి కల్పించిన నియమాలు ప్రతిక్షణమూ ఉల్లంఘించబడుతూనే ఉన్నవి అట్లా అతిక్రమించిన వ్యక్తులందరూ శిక్షపొందటం లేదు శిక్షపొందే వారికి కూడా నూటిలో ఒక్కడికైనా వెంట్రుక వాసిలేకుండా న్యాయమైన శిక్ష పడుతున్నదనటానికి లేదు అసలు న్యాయమైన శిక్ష అంటూ లేదు మనిషి దృష్టిలో పాపం చేసిన వారికి! కొందరు పెద్దలు చేరి ఏది న్యాయం అని రాస్తే అదే న్యాయం ఈనాడు న్యాయమైనది రేపు మరి కొందరు పెద్దల మాటమీద అన్యాయంగా మారుతుంది

ప్రతి ప్రాణికీ జన్మహక్కు అయిన స్వేచ్ఛను ప్రకృతే కొంత వరకు అరికట్టి ఉండగా మానవుడు మరి కొంత ఎందుకు అరికట్టాలి? ఇట్లా అరికట్టటానికి మనం అభ్యంతరం చెప్పక పోగా, మనల్ని శిక్షించేటందుకూ, శాసించేటందుకూ న్యాయాధికారులను, ఏర్పాటు చెయ్యనిచ్చి, వారికింద ప్రతి సంవత్సరమూ కొన్ని లక్షలు వ్యయం చేస్తూ, ఆ వ్యయాన్ని పన్నుల ద్వారా, శిస్తుల ద్వారా ఎందుకిస్తున్నాము? అందువల్ల ఉమ్మడి మీద జాతికి లాభం ఉందని మనం విశ్వసిస్తున్నాం?! ఏనియమాలు లేకుండా ఉండటం కన్న కొన్ని గుడ్డి నియమాలన్నా ఉండటం అవసరమని మనం నమ్ముతున్నాం. జాతి యొక్క క్షేమంకోసం వ్యక్తుల యొక్క స్వేచ్ఛను అరికట్టుతున్నాం కాని ఇందువల్ల ఆఖరుకు వ్యక్తుల యొక్క స్వేచ్ఛ పెంపొందుతున్నదని మనం సులభంగా నిరూపించవచ్చును. సంవత్సరం ప్రారంభంలో నూరు రూపాయలు బ్యాంకులో వేసి సంవత్సరం చివర నూట నాలుగు రూపాయిలు తీసుకున్నట్టు!

పోలీసులూ, న్యాయస్థానాలూ, న్యాయమూర్తులూ లేరనుకుందాం. అప్పుడేమవుతుంది? అంతర్జాతీయ రక్షకశాఖా, అంతర్జాతీయ న్యాయచట్టమూ లేనందువల్ల ఏం జరుగుతున్నదో అదే జరుగుతుంది మనం రెండు చేతుల లోనూ రెండు తుపాకులూ జేబులో తూటాలు లేకుండా బయటికి పోలేం. ఎవడైనా ఏకారణం వల్లనైనా మనమీద పడి మన ప్రాణం హరించ వచ్చును. మనలో ఎవరు చచ్చినా ఎవరో ఒకరికి ఎంతోకొంత మేలు ఉండి తీరటా నికి అవకాశం వుది కనక, మనలను చంపేవాడు ఆ పని వినోదార్థం చేస్తాడనుకోనక్కర్లేదు. సకారణంగానే చంపుతాడు. ఈ విధంగా బలం కలవాడు బలహీనుణ్ణి, సమర్థుడు అసమర్థుణ్ణి, నేర్పరి అమాయకుణ్ణి, రూపుమాపటం ప్రారంభిస్తే, ఇదెక్కడ ఆగుతుంది? లోకంలో ఉన్న జనంలో కొంత మంది మాత్రమే రెండు పక్షాలై ఒకరి నొకరు రూపుమాపసాగితేనే ఎంతో అపకారం జరిగింది దేశాలకు. ఇక అందరూ తలా ఒక పక్షమూ అయితే చెప్పేదేమిటి? అరణ్యమృగాలు కూడా మందలుగా నివసించటం నేర్చుకున్నై. కాని అరణ్యంలోనే జ్ఞానాన్వేషణ అవకాశం లేదు – పొద్దస్తమానమూ ఆహారాన్వేషణతోనే తీరదుకనక!

కనక అభివృద్ధికంటే ముందు అవసరమైనది క్షేమం ఆక్షేమం లేకనే వన్య మృగాలు అభివృద్ధి ఎరగనివై ఉండటం!

క్షేమం అనేది ఉండటం వల్ల మానవుడు పొందుతున్న లాభం ఇంతా అంతా కాదు. ఒక వ్యక్తి సంపాదించే జ్ఞానం అందరికీవినియోగ పడుతున్నది ప్రతిక్షణమూ తన శక్తులు మనిషిహస్తగతమవుతూ ఉన్నవి. యీనూతన శక్తులను దుర్వినియోగ పరచకుండా – జాతి యొక్క క్షేమానికి వీటి వల్ల అపకారం రాకుండా క్రొత్తనియమాలు ఏర్పాటు చేసుకుంటున్నాం ఈనాడు మనం ఎగిరే హక్కూ, రాత్రి పగలుగా మార్చేహక్కూ, అనేకవేల మైళ్ళు శీఘ్రప్రయాణం చేసే హక్కూ, ప్రపంచములో ఏ మూలనో ఉన్నవాడు సంపాదించిన జ్ఞానాన్ని మనసొత్తు చేసుకునే హక్కూ, ఎండలూ, వానలూ, చలి, కరువు మొదలైన వాటివల్ల బాధపడకుండా ఉండే హక్కూ ఎక్కడెక్కడి దృశ్యాలూ అక్కడికి వెళ్ళకుండానే చూసే హక్కూ, ఎక్కడో ఎవరో మాట్లాడుతున్నది మనం ఇంట్లోనే ఉండి వినే హక్కూ, ఇటువంటి అసంఖ్యాకమైన హక్కులు సంపాదించాం. వీటిని వినియోగించటంలో మనకు ఉండదగిన స్వేచ్ఛలో కొంత కొంత మానవ నిర్మితములైన నియమాల వల్ల లేకుండా పోతున్నప్పటికీ మొత్తం మీద అనేక కొత్త పనులు చెయ్యటానికి మనకి స్వేచ్ఛ లభిస్తోంది. ఈ విధంగా హక్కులను పెంపొందించుకోవటం నాగరికత, వాటిని దుర్వినియోగ పరచకుండా ఉండగలగడం సంస్కారం. మన స్వేచ్ఛను అరికట్టే పోలీసునూ, న్యాయాధికారిని మనమే పోషించుతున్నామంటే అదిమన సంస్కారాన్ని తెలియజేస్తుంది

మనిషి నియమించిన ఈ నియమాలు గుడ్డివైనప్పటికీ, వాటి వల్ల సరైన న్యాయం జరగనప్పటికీ, వాటి ద్వారా జాతికి క్షేమమూ, లాభమూ కలుగుతున్నప్పుడు అప్పుడప్పుడూ వాటిని మార్చకపోతేనేం? ఈ ప్రశ్ననే మనం ఇంకో విధంగా వెయ్యవచ్చును. ఈనాడు మనం సనాతన ధర్మాన్ని అవలంబిస్తేనేం?

ఆప్రశ్నకు సమాధానం తెలుసుకునే ముందు యీ నియమాల స్వరూపాన్ని ఆలోచించుదాం ఈనాడు ఆహార శాస్త్రవేత్త ఒకడు గొప్ప వాడున్నాడనుకుందాం. శరీరానికి ఫలాని ఆహారం మనిషి తూకాన్ని బట్టి ఇంత పడినట్టయితే ఆ ఆహారం సరి అయిన ఆహారం. అట్లా తిన్నవాడికి దీర్ఘాయువూ, ఆరోగ్యమూ కలుగుతవి అని అతను చెప్పగలడు. ఇది ఒక నియమం ఒక నిర్బంధం. దీన్ని పాటించటం వల్ల అందరికీ క్షేమం ఉంది. మన సంస్కారం అనారోగ్యాన్ని ఎవరిలోనూ సహించలేనిదీ, మనకు యీ సూత్రం చెప్పిన వాడి మీదగల విశ్వాసం అపారమైనదీ అయినప్పుడు మనం యీ నియమాన్ని, ధర్మం– విధిగా ఆచరించదగినది– గా చేసి, దాన్ని ఆచరించని వాడికి శిక్ష కూడా వేస్తాం. ఈ రోజున ఆశాస్త్రజ్ఞుడికన్నా తెలివిగలవాడు లేడని మనం నమ్మాలి – ఇంతకంటే తెలివైన వాడు వచ్చి యీ నియమాన్ని సంస్కరించే వరకూ. ఏమానవుడు కూడా సర్వజ్ఞుడై ఉండటం అసంభవం. ఈనాడు మన శాస్త్రజ్ఞుడు చేసిన శాసనాన్ని

మన మంతా పాటిస్తున్నా మనలో అనారోగ్యం ఉంటుంది కాని పూర్వం ఉండినంత ఉండదు మనకు నాలుగైదు దశాబ్దాల అవతల వచ్చేవారు ఈనాడు మనం ధర్మం అన్నదానిలో విశ్వాసం కలవారైతే వారికి రెండు రకాల ప్రమాదం ఉంది. ఒకటి మన కంటే ఆరోగ్య వంతులు కాకపోవటం, ఈ లోపుగా ఆహారపదార్థాలలో ఏమైనా మార్పుగలిగి ఉంటే మనకంటే కూడా అనారోగ్యంగా ఉండటం. ( ఈజీవితవిధానాలల్లో ఈ లోపుగా కలగగల మార్పు సంగతి చెప్పనే అక్కర్లేదు.)

అది అట్లా ఉండగా అవసరమైన నిర్బంధాలలో కూడా ఉచితమైన నిర్బంధమూ ఉంది జైళ్ళు అవసరమే స్వేచ్ఛను అమితంగా దుర్వినియోగం చేస్తూ, ఎక్కడికి పడితే అక్కడికి పోవటానికి తనకు సంఘం యిచ్చిన స్వేచ్ఛను సరిగా వినియోగించే సంస్కారం లేని వాణ్ణి జైలులో పెట్టటానికి అందరమూ ఒప్పుకుంటాం జైలులో ఉండటం వాడికి యిష్టం ఉండదు. జైలులో లేని వాణ్ణి చూసివాడు అసూయపడతాడు. జైలు బయట ఉన్నవాడు అనుభవించే ఇతర సౌకర్యాలన్నీ వాడికి యివ్వండి, వాడు తృప్తి పడడు. జైలు బయట ఉన్నవాడు కావాలంటే పదిమైళ్ళువెళ్ళి రాగలడు, జైలులో ఉన్నవాడు కూడా తనగది లోనే పదిమైళ్ళు నడవవచ్చును కావాలంటే ! అదికూడా కాదు, జైలు బయటవాడు తన యిష్టం వచ్చిన పదిమైళ్ళు వెళ్ళి రాగలడు, జైలులో వాడు ఆపని చెయ్యలేడు! అతనికి పదిమైళ్ళు వెళ్ళాలని ఉందని కూడా కాదు. కేవలమూ అది అందరికీ అందుబాటులో ఉన్న హక్కు తనకు లేనిదీనూ!

అతన్నే ఆజైలులో ఒక అరశతాబ్దం ఉంచామనుకోండి అది అనుచితమయిన నిర్బంధం, శిక్షలో కూడా అందువల్ల అతనికి కలిగిన నష్టం ఆలోచించుదాం. యాభై సంవత్సరాలూ శిక్ష అనుభవించి అతను జైలు బయటికి రాగానే అతనికి భయం వేస్తుంది. పదిమైళ్ళు నడిచే హక్కును వినియోగించాలనే యిచ్ఛ అతనికిప్పుడు లేదు. జైలు దాటి రెండు మైళ్ళు ఎటువెళ్ళినా సరే అతనికి దిక్కు తెలియదు. వెళ్ళిన దారిన కూడా తిరిగి రాలేక ఏడుస్తూకూర్చుంటాడు. ఈ అరశతాబ్దంలో బాహ్యప్రపంచం సంపాదించిన కొత్త హక్కులు అతని మతిని పోగొట్టుతై . పదిమైళ్ళు వెళ్ళి రావటమనే హక్కును వినియోగించుకునేశక్తిని సంస్కారాన్ని- పోగొట్టుకున్న అతను యీ కొత్త హక్కులను ఎలా వినియోగించుకుంటాడు?

అతన్ని అంతకాలం పాడుజైలులో ఉంచిన చట్టం మీద ఆచట్టం ఆమోదించిన జాతిమీదా మనకు చెప్పరాని ఆగ్రహం కలుగుతుంది. సహజమే మనం సంస్కారులం కనక! మన నీతి చట్టం ఎంతో కాలం నుంచీ మన బాల వితంతువులను ఎంతో మందిని అరశతాబ్దం కంటె ఎక్కువ కాలం వైధవ్యంలో ఉంచి, సంసారసుఖం అనుభవించటానికీ పిల్లలను కనటానికీ వారికి గల హక్కును అరికట్టుతూ వస్తున్నది! దీనికి మనం యెందుకు మండిపడమూ? అనేక వేల సంవత్సరాల పాటు ఒకే ధర్మం యొక్క నిర్బంధంలో ఉన్న మన సంస్కారంజైలులో ఉన్న వాడి సంస్కారం మోస్తరుగానే ఎన్నడో చచ్చిపోయింది!

అనుచితమయిన నిర్బంధం సంస్కారానికి యెంత ప్రమాదం కలుగజేస్తుందో రుజువు చెయ్యటానికి యింత కంటె నిదర్శనం ఏంకావాలి?

సంస్కారమనేది ఒక్కసారి సంపాదించి ఇనప్పెట్టెలో పెట్టే వస్తువుకాదు దాన్ని సంపాదించటానికి ఎంత కష్టపడాలో అది దక్కించుకునేటందుకూ అంత కష్ట పడాలి. ఈనాడు కూడా మనం అరణ్యాప్యుగాల మోస్తరుగా అయిపోయి ఆ జీవితానికి త్వరలోనే అలవాటు కూడా పడిపోగలం!

సనాతన వాదులంతా తమ అభిప్రాయంలో ఏకీభవిస్తారు, ఆధునికులు ఒకరు చెప్పినట్లు ఒకరు చెప్పరు అనటం సనాతన మతాన్ని సమర్ధించేటందుకు వాదనగా ఉపయోగించదు.

అర శతాబ్దం పాటు జైలులో ఉన్నవారంతా జైలులోనే ఉండిపోతామంటారు ఏకగ్రీవంగా పదిమైళ్ళు నడిచివెళ్ళేవారు ఎవరి దారిన వారు పోతారు. గోరీలో పాతిన శవాలు చక్కగా కలిసికట్టుగా ఉంటాయి. ఒకదానితో ఒకటి పోట్లాడుకోవు సజీవుల మోస్తరుగా! మనలో సనాతన వాదుల సంగతి ఏమయింది? మనపూర్వీకులు ఎరగని పొటేటో (ఉర్లగడ్డ) టొమేటో (రామాఫలం) వీరు ముట్టరు! సనాతన పరులం కాని మనం ఈ రెండు వస్తువుల వల్లా ఎంతో ఉపయోగం పొందుతున్నాం.

సంస్కారం పెంపొందిన కొద్దీ మనకు వస్తువుల వెలబాగా అర్ధమవుతుంది (ఇక్కడ వస్తువు అనేది సృష్టిలో ఉన్నచేతనా చేతనాలకూ మహదమహత్తులకు విచక్షణ లేకుండా వర్తించుతుంది.) అప్పుడే మానవుడు తన అరిచేతిలో వున్న శక్తులను దుర్వినియోగ పరచకుండా ఉంటాడు. మనక్షేమానికి గానూ మనం పోలీసులనూ, న్యాయస్థానాలనూ పెట్టుకున్నామని పైన చెప్పాను. కాని నిజంగా వారివల్ల మనజాతికి క్షేమం చేకూరటం లేదు. మనక్షేమం కొరకు మనం ఇతరుల సంస్కారం మీదనే ఆధారపడి ఉన్నాం. లేకపోతే నామీద ఏ కించిత్తయినా కోపం ఉన్నవాడు నన్ను వీధిలో నిలబెట్టి కత్తితో పొడవకుండా న్యాయస్థానాలూ, జైళ్లూ, పోలీసులూ చెయ్యలేరు. వారికి చేతనయిన దల్లా నన్ను పొడిచిన వాణ్ణే పట్టుకుని శిక్షించటమే. అక్కడక్కడా ఇటువంటి అసంస్కారంతో కూడిన పనులు జరుగుతున్నప్పటికీ మన సాటి మానవుల సంస్కార మందు విశ్వాసం ఉంచుతూనే ఉన్నాం. అదిధర్మం కూడానూ. పట్టే శిక్ష భయంవల్ల అసంస్కారి దుండగాలు చెయ్యకుండా ఉంటాడనే భ్రమ. రంకుతనం చేసినందుకు నిజంగా శిక్షేమీ లేదు. కాని అందరూ రంకుతనం చెయ్యటంలేదు. ఇందులో చాలా మందికి పాపభయం ఉన్నదనుకున్నా కొంత మందికైనా సంస్కారం ఉందని ఒప్పుకోవాలి.

ఆపాపభయమే నిజమైన సంస్కారికి తలవంపులు కలిగించేది! సనాతన వాదులకు ఆశ్రయమున్నూ అదే! మంచు వచ్చినట్టు వచ్చి ఇట్టే విచ్చిపోయేది

పాపభయం! తగు పోషణ చేస్తే వృక్షం వలే పెరిగేది సంస్కారం. ఒక స్థితిలో - వస్తువుల విలువను వ్యక్తి అర్థం చేసుకోలేని స్థితిలో ఉన్నప్పుడు - పాప భయంవల్ల కొంత పని అవుతుంది. కాని ఎప్పటికైనా ఈ డమ్మీని తీసి పారేసి దానిస్థానే సంస్కారం నెలకొల్పక పోతే సంఘానికి ప్రమాదం ఉంది.

ఈ సంస్కారాన్ని పెంపొందించటం ఎట్లా? మతం వల్ల, మతం అనగానే, అదేదో జీవాత్మ పరతత్వం మొదలైన వాటితో కూడుకున్నదని భయపడరాదు. మత జిజ్ఞాసువులకు, ఇతర శాస్త్రాలలో కృషిచేసేవారి కున్నట్టే ఇటువంటి సాంకేతిక పదాలులేక కొండగుర్తులు ఉండి తీరాలి. మతమంటే మరేమీ లేదు. క్షణభంగురమైన జీవితాన్ని ఎడతెగని జీవిత ప్రవాహంతో సమన్వయింపజేసేదే మతం. ప్రత్యేక వ్యక్తులు పుట్టుతున్నారు. కర్మచేస్తున్నారు, పోతున్నారు. కాని వారితాలూకు బీజాలు జాతిలో నిలిచిపోతున్నవి. ఈప్రత్యేక వ్యక్తుల ఉమ్మడి మంచి చెడ్డలు జాతి యొక్క భావిని నిర్ణయించుతున్నవి ప్రత్యేక వ్యక్తులకు జాతితో సంబంధం లేక పోయినట్లయితే ఆ ప్రత్యేక వ్యక్తులకు ఎట్లా ప్రవర్తించినా ఇబ్బంది లేదు, వారి కర్మఫలం వారే అనుభవించుతారు కనక.

మత బుద్ధిఅంటూ ఒకటి ఏర్పడగానే సహజంగా మానవుడి ప్రవర్తన మారవలసి వస్తుంది. బ్రహ్మచారి అయిన ఒంటరి వాడు సంసారం నెత్తిన పడగానే బాధ్యత తెలుసుకుని ప్రవర్తించినట్టు! ఆ మత బుద్ధి కలగగానే మానవుడు తనంతట తానే జాతి యొక్క గమ్యస్థానాన్ని నిర్ణయించుకుని దానికి అభిముఖుడై నడుస్తాడు. వెంటనే అతనికి వస్తువులు కొత్త విలువ కలవిగా కనిపించుతై, అతను చేసే ప్రతి పనికీ అర్థమంటూ ఒకటి కలుగుతుంది. అతను తన మత జీవితాన్ని సహజంగా నిషేధాలతోనే ప్రారంభించుతాడు.

మతాభిమానికి మత బుద్ధిలేనివాడి ప్రవర్తన ఎట్లా కనిపిస్తుందో. ఒక ఉదాహరణతో చూపిస్తాను. ఒక గ్రామంలో మంచినీళ్ళ చెరువు ఉందనుకోండి. అందరూ అందులోంచే త్రాగే నీరు తీసుకు పోవాలి. అందులో నేను ఒక తులం విషంకలుపుతాను. ఇందువల్ల ఎవరికీ ప్రమాదం లేదు. ఎందుకంటే ఈ విషం చెరువంతా కలవటం వల్ల. ఈ చెరువులో నీళ్ళు తాగే వారికి ఒక్కొక్కరి శరీరాలలోకి పొయ్యే విషాన్ని లెక్కకట్టటం బహుకష్టం- అంతస్వల్పంగా ఉంటుంది. అదీకాక అంతకు పూర్వమే ఆ చెరువులో నేను కలిపిన విషానికి ఎన్నోరెట్లు ఉండి ఉండవచ్చును. కాని ఊరివారు నా వాదన వింటారా? వినరు! నేను చేసినపని వారికి తెలిసినట్టయితే వారు నన్ను శిక్షించకుండా వదలరు. అయ్యో! పాపం! అనేవాడు ఒక్కడుండడు నేను శిక్షించబడితే! మతబుద్ధిగల వాడు మత బుద్ధిలేని వాడికి శిక్షకోరుతాడు. ఇక్కడ కాకపోయినా అవతలనైనా వాడికి శిక్ష పడితేనే గాని మతాభిమాని

తృప్తి పడడు నరకమనేది వున్నదని చూసివచ్చిన వాడికంటే కూడా ఎక్కువగా నమ్ముతాడితను అల్లా నమ్మక పోతే అతని మతం దొంగ మతమన్నమాట! (మన పూర్వులు కల్పించిన కుంభీపాకాది నరకాలన్నిటినీ మనం విశ్వసించాలనికాదు) ఆనాటి వారివిశ్వాసాలను సమర్ధించుతున్నాను. కాలక్రమాన అన్నీ మారినట్టే. మన సంస్కారాన్ని బట్టి విశ్వాసాలు కూడా మారుతూ ఉంటాయి గొర్రెలనూ, మేకలనూకోసి నందుకు నరకంలో రంపాలతో కోస్తారని నమ్మే మూఢులున్నారు. అటువంటి విశ్వాసాలు మన జ్ఞానం సంస్కారాల వల్ల వదులుతవి. కాని అసలు విశ్వాసాలే అవసరం లేకుండా ఎప్పటికీ జరగదు!

అయితే ఒక్క మతం వల్లనే సంస్కారం పెంపొందదు అసలు మత బుద్ధి అనేది కలగటానికీ కొంత లౌకికమైనసంస్కారం వ్యక్తిలో ఉండి ఉండాలి. భయపెట్టి ప్రతి మనిషినీ మత బుద్ధి ఉన్నవాడు ప్రవర్తించినట్టే ప్రవర్తింప చేయవచ్చును కాని అటువంటి ప్రవర్తనం వల్ల వాడికి ఎప్పటికైనా మత బుద్ధి కలుగుతుంద నటం భ్రమ- మతాన్ని ఆచారంగా మార్చి వంకాయలను వరుసచేసి బస్తాలో కెక్కించినట్టు! ఆ ఆచారాన్ని పాటించుతూ గొప్ప మత ప్రవర్తకుల మనుకునే అజ్ఞానులు లక్షోపలక్షలుగా ఉన్నారు. దేశం నిండా మతాన్ని వారు కొన్ని కొండగుర్తుల సహాయం వల్ల అర్ధంచేసుకొని ఆ కొండగుర్తులు కనిపించక పోగానే మతం పోయిందని లబలబలాడుతారు పిలక జుట్లూ, గంధం బొట్లూ, బిళ్ళగోచీ, మొదలైనవి వారికి హిందూ మతాన్ని సూచిస్తవి. తమ యొక్క యీ నమ్మకంలో యీ మూర్ఖులకు ఎంత విశ్వాసం ఉందంటే ఇతర మతాలవారు కూడా ఇటువంటి కొండగుర్తులతో పనిచేస్తున్నారనే వీరి నమ్మకం అందువల్ల క్రాపింగును కిరస్తానీ అని లుంగీని తురక అనీ వీరంటారు! అనేక మతాలున్న చోట యేమతం వారు ఆ మతాన్ని సూచించటానికి బాహ్య చిహ్నాలు ఏర్పరుచుకోవటంలో తప్పులేదు. కాని ఆచిహ్నాలు మాత్రమే గుర్తించగలిగి మత మంటే ఏమిటో తెలియక పోవటం మతాభిమానం అనిపించుకోదు. కనక ఈ సంస్కారాన్ని ధ్వంసం చెయ్యటం అవసరం. ఈపని ఒక్క సాహిత్యం వల్లనే అవుతుందని గట్టిగా విశ్వసిస్తున్నాను. ఒక చెంప నించి సాహిత్యం మన సంస్కారాన్ని మెరుగు పెడుతూ ఉండకపోతే వట్టి మతం మనలను ఉద్ధరించ లేదు. ఒక తరం వారు కాక పోయినా మరో తరం వారయినా మతాన్ని వరుస చేసి బస్తాల్లో కెక్కించక పోరు. మతం కోసం లౌకిక సంస్కారాన్ని త్యజించటం మేధస్సును వృద్ధి చేసుకునే నిమిత్తం శరీరారోగ్యాన్ని త్యజించినట్టుంటుంది. అది ఎన్నటికీ జరుగదు.

స్వేచ్ఛను అంతు లేకుండా అభివృద్ధి చేసుకోవటానికి మత సాహిత్యాల ప్రచారం కన్న మార్గాంతరం కనుపించదు.

వీణ, *11-10-1937*

# 2. స్వార్థం గురించి

చాలా సామాన్య విషయాలను గురించికూడా మనకు దురభిప్రాయాలుంటా యనేది నిర్వివాదాంశం వాటిని బుద్ధిమంతుడు ఒక్క క్షణంలో సంస్కరించుకో వచ్చును. కాని అవి ఒక్కొక్కప్పుడు శతాబ్దాల తరబడి సంస్కారం లేకుండా సర్వజనామోదం పొందుతూ ఉంటై

మరొకరిలో తప్పులు వెతికే కాంక్ష అవిద్యవల్ల కలుగుతుంది. వ్యక్తులూ సంఘాలూ పరస్పర దూషణలో ఆత్మ శక్తిని వ్యయం చేసుకుంటై. తండ్రి కొడుకునూ, అన్న తమ్ముణ్ణీ , బ్రాహ్మణులు శూద్రులనూ, బీదలు భాగ్యవంతులనూ, స్త్రీలు పురుషులనూ, లేక రెండోవారు మొదటి వారినీ ఏదో ఒక విధమైన దూషణకు గురిచెయ్యచూస్తూ ఉంటారు కాస్త జాగ్రత్తగా పరిశీలించినట్లయితే ఏనేరాన్ని కూడా సంపూర్ణంగా ఒక వ్యక్తి మీద గాని ఒక సంఘం మీదగాని ఆరోపించగలగటమనేది అసంభవం. కొడుకును తప్పుపట్టే తల్లిదండ్రులు ఆ కొడుకులో తమ ఇద్దరిలోనూ, తమ పూర్వుల లోనూ లేని గుణాలు లేవని విచారించరు. దొంగతనం చేసినందుకు కారాగృహ శిక్ష విధించే న్యాయచట్టం దొంగయొక్క దారిద్ర్యాన్ని లెక్క చెయ్యదు, దాన్ని సంస్కరించదూనూ.

ఇటువంటి నేరారోపణ తప్పని కూడా నా అభిప్రాయం కాదు. అది కారణాంతరాలవల్ల తప్పని సరే కావచ్చును. కాని అటువంటి నేరారోపణచేసేవాళ్లు తాము చేస్తున్నది. శాస్త్రీయమైనపని కాదని తెలుసుకుంటే, ఆ నేరారోపణకు ఉద్రేకం జతచెయ్యకుండా ఉంటే, జీవితం ఇంత దుఃఖ భాజనంగా ఉండదు.

అటువంటి అర్థం లేని అవేశం హింస ద్వారా బయట పడుతుంది. తండ్రి కొడుకునూ, భర్త భార్యనూ, న్యాయాధికారి ముద్దాయినీ, హింసిస్తారు. హింసకు ప్రతిక్రియలేదు. హింసించేబుద్ధి నేరారోపణ వెంట గుప్తంగా వుంటుంది.

మనం చప్పున ఇతరులలో చూసి సహించలేనిది స్వార్థం. దాన్ని తప్పుపడితే ఎవరూ మనని తప్పు పట్టరు. స్వార్థం చాలా హేయమైనదిగా గణించబడినట్టే స్వార్థత్యాగం చాలా ఘనమైనదిగా గణించబడుతున్నది.

కాని నా బుద్ధికి స్వార్థం దానికది హేయమైనదిగా కనిపించదు. ఉత్తమ సంస్కారం వల్ల పోగొట్టదగిన గుణాలను మాత్రమే నిరసించవచ్చుననీ, వాటిని వదిలించుకోవటానికి అటువంటి సంస్కారమే తప్ప వేరే మార్గంలేదనీ నేనభిప్రాయపడుతున్నాను. నాకు సంస్కారంలో ఉన్న విశ్వాసం శాసనాల యందూ శిక్షల యందూ లేదు. మానవ జీవితానికి శాసనమూ, శిక్ష స్వాతంత్ర్యం లేకుండా

చేస్తున్నాను. నేను స్వాతంత్ర్య ప్రియుణ్ణి. మానవజీవితాన్నీ, మనస్సునూ సరియైన విధంగా సంస్కరిస్తే ఆదర్శప్రాయమైన సంఘం తయారవుతుందనీ, మానవుడు పరిపూర్ణమైన, స్వాతంత్ర్యానికి అర్హుడవుతాడనీ, అటువంటి సంఘంలో పరిపాలన మానవ సేవారూపంలో ఉంటుందనీ, శాసనరూపంలో ఉండదనీ, నాదృఢనమ్మకం సంస్కారంవల్ల కామక్రోధాదులను జయించినట్టు స్వార్థాన్ని జయించటం అసంభవం. మనకళ్ళతో చూసేదే మనకుకనిపించి, మన నోట్లో పెట్టుకున్నదాని రుచే మనకు తెలిసి, మన కష్టసుఖాలే మనకు అనుభవం అయి, మనకు వ్యక్తిత్వం వదలనంతకాలమూ మనము స్వార్థపరులమే. ఇంకొకరి అనుభవంతో సానుభూతి పొందగలగటం మన స్వార్థం నశించటం కాదు, మన వ్యక్తిత్వమూ, దాని వెంట మన స్వార్థమూ విస్తరించటం అవుతుంది. సంఘం కోసమో, ప్రేమకోసమో ఉద్రేకం లేకుండా ఆత్మార్పణ చేసుకోగలవాడి స్వార్థం పరిపూర్ణత్వం పొందిందనుకోవాలి.

వ్యక్తియొక్క ప్రయత్నమంతా మనసు సుఖపెట్టటమే. ఇంద్రియాలను తృప్తి చెయ్యటమనేది అర్థంలేని మాట, ఇంద్రియాలద్వారా మనసు సుఖపడలేకపోతే ఇంద్రియాలు ప్రత్యేకించి సుఖం కోరవు. సుఖదుఖాలేమిటో ఇంద్రియాలకు తెలియవు. శరీరం తనకు కావలసిన ఆహారాన్ని ఏ విధంగా సంగ్రహిస్తుందో తెలుసుకోవటం ఎంతకష్టమో, మనస్సు తనసుఖాన్ని ఎటువంటి అనుభవంద్వారా పొందగలుగుతుందో తెలుసుకోవడం అంతకంటె కూడా కష్టం. ప్రేమకోసం ఆత్మత్యాగం చేసి అపారమైన అనందం పొందగల వాళ్ళు వున్నట్టే కనిపిస్తుంది

కాని పులిని చూసి నక్క వాతలుపెట్టుకుంటే పుండవుతుంది. మనసు సంతోషం పొందకుండా చేసే ప్రతి చిన్న త్యాగమూ పశ్చాత్తాపానికీ, మానసిక రుగ్మతకూ కారణభూతమవుతుంది. అటువంటి త్యాగాన్ని ఎవరూ చెయ్యరాదు, హర్షించరాదు. వ్యక్తులు స్వార్థం లేని త్యాగం చేస్తూ ఉండటం సంఘానికి మంచిది కాదు. ఆ విషయం మన భార్యలద్వారా మనము తెలుసుకొనవలసినకాలం అసన్నమవుతున్నది. వారిచేత మనంస్వార్థరహితం – మానసికంగా ప్రతిఫలం లేనిది – అయిన త్యాగం చేయిస్తూన్నాం దానికి మనకు కలిగిన ఫలితం ఏమంటే ప్రేమలేని జీవితం.

స్వార్థం కుసంస్కారం వల్ల వికటిస్తుంది. అటువంటప్పుడు స్వార్థంలో అవలక్షణాలు కలుగుతై. అసూయా, అధికారవాంఛా, అపాయకరమైన ఆవేశమూ అటువంటి అవలక్షణాలే.

ఇప్పుడమలులో ఉన్న ఆర్థిక చట్టం అటువంటి రుగ్మత కలిగించింది స్వార్థానికి. మనలో ధనికులే కాక దరిద్రులు కూడా ఆ అవలక్షణాలు ప్రకటించుతున్నారు. వస్తువులను ఉపయోగించుకోవటమూ, సంపదని అవసరమైనంత వరకూ ఖర్చు చెయ్యటమూ స్వార్థం అనిపించుకుంటుంది,

కాని వస్తువులను స్వంతం చేసుకోవటమూ, మనకు ఉపయోగం లేనప్పుడు కూడా వాటిని మన హక్కులోనే ఉంచుకుని వాటి వల్ల అవసరం ఉన్నవారికి అందనివ్వక పోవటమూ స్వార్థం కాదు - దాని తాలూకు అవలక్షణం వస్తువులను స్వంతం చేసుకోవాలనే ప్రయత్నం అందరిలోనూ సమానంగా ఉండటమేగాక అది లేనివాడు క్షణంలో అడుగంటి పోతున్నాడు

వస్తువులను స్వంతం చేసుకోవటం న్యాయమైనంత కాలమూ నేను నిస్వార్థంగా జీవిస్తున్నాను! అని ఎవడూ చెప్పలేడు (ఇక్కడ స్వార్థమనేది చెడు అర్థంలో ఉపయోగించాను). స్వార్థంయొక్క అవలక్షణాలను వ్యక్తులు జయించలేరని వేరేచెప్పనక్కర్లేదు. జాతి యావత్తూ ఒకటి అయితే గాని స్వార్థంయొక్క అవలక్షణాలు నశించవు

సరిఅయిన సామ్యవాదం ఇందుకు తోడ్పడుతుందనుకోవటానికి సందేహం ఏమీలేదు. కేవలమూ పెట్టుబడి దార్లను హత్యచేసి సాధించే సామ్య ఫలితాల లోనూ, ధనికుల అవగుణాలను అటువంటి అవగుణాలతోనే ప్రతిఘటించే సామ్యవాదం లోనూ నాకు విశేషం నమ్మకం లేదు. ఒక జాతివారు దుర్వినియోగపరుస్తున్న హక్కులను అన్ని జాతులవారూ పంచుకుని దుర్వినియోగ పరచటం ప్రారంభిస్తే ప్రపంచం బాగుపడుతుందని నాకు విశ్వాసంలేదు.

*ముద్రణ ఇల్లరికం కదల సంపుటి మార్చి 1939*
*స్వార్థ బుద్ధి అనే తన కథని వివరిస్తూ రాసిన వ్యాసం ఈ కద కుటుంబరావు సాహిత్యం ఆరవసంపుటంలో వుంది.*

# 3. మానవ సంస్కారం

## చరిత్ర

మానవచరిత్రలో కలిగే శోచనీయమైన సంఘటనలన్నిటికీ మానవ సంస్కారంలో గల లోపాలే కారణం. కాని చరిత్రను ఈ దృష్టితో రాసినవారు లేరు. ఎంతసేపటికీ చరిత్రను వ్యక్తిపరంగా చిత్రిస్తూ వచ్చారు. వ్యక్తుల మంచిచెడ్డలూ, వ్యక్తుల బలపరాక్రమాలూ, వారి జీవిత ఘట్టాలూ ప్రాముఖ్యంగా వుంటూ వచ్చినై. ఆ వ్యక్తులకు ఆధారభూతమైన వాతావరణాన్ని విమర్శించినవారు బహుకొద్దిమంది. అవిమర్శ ఎంత సమగ్రంగా, ఎంత విజ్ఞానంతో కూడినదై ఉంటే దాని వల్ల మనం నేర్చుకునేది అంత అధికంగా ఉండి ఉండును. వ్యక్తిపరంగా రాసిన చరిత్ర చదవటానికి హృద్యంగా ఉంటుంది. అటువంటి చరిత్ర రాయటానికి విజ్ఞానం ఆటే అవసరం

లేదు. దాని ద్వారా వ్యక్తులకూ, ప్రత్యేక జాతులకూ ప్రచారం బాగా కలుగుతుంది. ఈకారణాలవల్ల వ్యక్తిపరంగా రాసిన చరిత్రకు అవకాశాలు ఏర్పడి ఉండవచ్చును. అటువంటి చరిత్రలను లోకం ఆమోదించటానికి కూడా తగిన కారణాలు లేకపోలేదు సామాన్య మానవులకు విజ్ఞానం మరీ తక్కువ, వ్యక్తికీ, వాతావరణానికీ ఉండే సంబంధం వారికి అర్థం కాదు. ధీమంతులకంటే వారు అధికంగా కళాప్రియులు, వారికి వ్యక్తిత్వం జాస్తి.

జనసామాన్యంలో కళాప్రియత్వమూ, వ్యక్తిత్వమూ అధికంగా ఉంటవనేమాట నమ్మదగినదిగా కనిపించదు గాని నిజం. అయితే వారి కళా ప్రియత్వమూ, వ్యక్తిత్వమూ సక్రమ మైనవి కావు. కళ యొక్క ఆశయాలను గ్రహించి కళను ఆరాధించలేడు సామాన్యవ్యక్తి. అందుచేత చిన్న పిల్లలూ, మూఢులూ కళలకు చప్పున బానిస లైపోతారు. వీరికి ఒక్క మెట్టుపైన ఉండే జనసామాన్యం చరిత్రలో ఉండే కళలను మాత్రమే గ్రహించగలుగుతుంది గాని వాటి ఆశయాలను విమర్శించలేదు కనకనే వాల్మీకి రామాయణం ఇంతకాలం మనగలిగింది కొద్ది మంది కది సాహిత్యం కావచ్చు. ఎక్కువ మంది కది చరిత్ర. వాల్మీకిలో ఏ కవిత్వకళ చూసి రామాయణాన్ని పెద్దలు ఉత్తమ సాహిత్య కళ అన్నారో ఆకళే జనసామాన్యానికి రామాయణం యథార్థంగా చేసి ఉండాలి.

వ్యక్తిత్వం కూడా అటువంటిదే. దారిద్ర్యమూ, దురదృష్టమూ, అజ్ఞానమూ, అధోగతీ మానవుడి వ్యక్తిత్వాన్ని తగ్గించకపోగా హెచ్చించుతై. మూఢుడు ఆత్మవిమర్శ చేసుకోలేడు కనక తన అభిప్రాయాలకూ, అభిరుచులకూ విశ్వాసాలకూ అధికమైన ప్రాముఖ్యత ఇచ్చు కుంటాడు. దరిద్రుడు తన సమస్యను అసహాయుడుగా ఎదుర్కోవలసి రావటం వల్ల వ్యక్తి ప్రయత్నంలో విశ్వాసం కనబరుస్తాడు. అధోగతికి పొయిన వాడు తనకు సానుభూతి చూపేవారుండరు కనక తన అధోగతిని డ్రమెటైజు చేసి అందులో ఏదో ఘనత ఉన్నట్టు భావిస్తాడు. జనసామాన్యంలో వ్యక్తిత్వం అధికం గనకనే సామాన్యమానవులు ఐకమత్యం ప్రకటించలేరు. బీదలను దోచటానికి భాగ్యవంతులు ఒకటి కాగలరు గాని భాగ్యవంతులను దించేటందుకు బీదలు ఒకటి కాలేరు. వారంతా ఒకటి అయ్యే లోపుగా చరిత్ర చాలా దూరం సాగిపోతుంది

వ్యక్తిపరంగా రాసేవారికి చరిత్ర రాయటమూ, చదివేవారికి చదవటమూ పైకారణాల వల్లసులభం కనకనే చరిత్ర యావత్తూ వ్యక్తి పరంగా ఉంటూ వచ్చింది. చరిత్రను గురించి అప్పుడప్పుడూ ప్రపంచం అభిప్రాయం మార్చుకుంటూ వచ్చినమాట నిజమే కాని ఆ మార్పు అటే చెప్పుకోదగినది కాదు ఒకజాతిలో నిన్నటివారకూ ఉంటూ ఉండిన కొన్ని అభిప్రాయాలు ఇవాళనుంచీ మార్పు చెందగానే ఆ జాతిచరిత్రలో కొన్ని విషయాలు నిన్నటివరకూ హర్షించబడుతూ ఉండి ఈనాటి

నుంచీ నిరసించబడటం జరుగుతుంది అంతే కాని ఆ విషయాలను గురించి ఆజాతికి అధికంగా తెలిసిందేమీలేదు.

వ్యక్తుల పరంగా రాసిన చరిత్రలో నీతిలేదు. పెద్దలకు కోపం రావచ్చు గాని రామాయణంలో నీతి లేదు రాముడాదర్శపురుషుడనుకున్నప్పటికీ మనం రాముళ్ళం కాలేము - తల్లకిందులుగా తపస్సు చేసి కూడా. రాముడి చరిత్ర మనకు ఆనందం కలిగించవచ్చుగాక మన కది ఇంకేవిధంగానూ పనికిరాదు.

మానవుడి తెగుళ్ళన్నీ సామాజికమైనవే. మన మంచి ఏమిటో చెడేమిటో రామాయణం నిర్ణయించదు. ఈనాటి ఇంగ్లీషువాడికి జర్మనీ వాళ్ళ మీద బాంబులు వేసిరావటం నీతి, యుద్ధ రహస్యాలను గురించి అబద్ధం ఆడటం నీతి, వాతావరణంలోకలిగే మార్పులను బట్టి మానవధర్మం మారుతూ ఉంటుంది. ఆ వాతావరణంలో ఏ సంస్కారం లోపించిందో చూపటం చరిత్ర యొక్క విధి.

సంస్కారపరంగా చరిత్రను రాస్తూ వస్తే చరిత్రలో మనకు నేర్చుకోదగిన నీతి ఎప్పుడూ ఉండేది మానవచరిత్రకు కారణభూతులవుతున్న భీకరశత్రువులార్గురు. ప్రతి యుగంలోనూ, ప్రతి జాతిలోనూ అమలులో ఉండే రాజకీయ సాంఘిక, నైతిక చట్టాలలో ఈ అరిషడ్వర్గం యొక్క విజృంభణం అంతో ఇంతో కనిపిస్తూనే ఉంది. చరిత్ర దాన్ని ఎత్తి చూపినట్టయితే మనం చరిత్ర నుంచి బాగుపడగలిగే అవకాశం ఉండేది తరవాత మనం బాగుపడినా, పడకపోయినా, అట్లా జరగలేదు. మానవుడి అభివృద్ధికి అడ్డంగా ఉండినవి కామ, క్రోధ, లోభ,మోహ మదమాత్సర్యాలని రుజువు చెయ్యటానికి బదులు , నెపోలియననీ, కెయిజరనీ, హిట్లరనీ, సోషలిజమనీ, నాజీజమనీ, ఫాసిజమనీ చెప్పుతున్నై చరిత్రలు ఈ అభిప్రాయాలు కాలక్రమాన మార్పుచెందుతవని చరిత్రలు రాసేవారే ఎరుగుదురు కాని చరిత్రను గురించి అటువంటి దృష్టి పరిణామం ఉండటం పరిపాటి అయిపోయింది. తన గుణాలు తనని నడిసముద్రంలో ముంచినప్పుడల్లా మానవుడు సంధిప్రలాపాలు చేస్తుంటే అది యావత్తూ చరిత్ర అవుతున్నది.

*ఆంధ్రప్రతిక - 1941 ఫిబ్రవరి 5*

# 4. త్యాగం యొక్క పరిమితి

ఏది త్యాగం? దానియొక్క పరిమితి ఎంత?

జీవితం ఒక విధమైన విలాసవిహారం కాదని గుర్తించిన ప్రతి వ్యక్తికీ ఈ ప్రశ్నలు తట్టి తీరాలి. వ్యక్తి యొక్క దైనిక జీవితం మొదలుకొని జాతియొక్క చరిత్ర వరకూ ఈ సమస్యను అర్థం చేసుకోవటం మీద ఆధారపడివుంది. ఈ సమస్యను అర్థం చేసుకోవటానికి ఓపికో తాహతో చాలక మనిషి తన నిత్య జీవితంలో నష్టం పాలుకావటమే కాక సాంఘిక జీవితంలో పరిణామానికి దూరమవుతున్నాడు.

వెనకబడి ఉన్న మన జాతి వంటి జాతుల్లో ఈ త్యాగం అనే మాట సాంఘిక రాజకీయాది విప్లవాల సందర్భంలో మాత్రమే వినిపిస్తున్నది. ప్రణయకథల్లోనూ, సాంఘిక చిత్రాల్లోనూ కూడా ఈ త్యాగం ప్రతిధ్వనిస్తున్నది, (కాని అది వేళాకోళమని అందరికీ తెలుసు.)

ఇంతకూ ఏది త్యాగం? జనసామాన్యం యొక్క అభిప్రాయంలో ఇతరుల మేలు కోసం నష్టపడటం త్యాగం, త్యాగం స్వార్థరహితమైనది.

కొంచెం ఆలోచిస్తే ఈ నిర్వచనంలో అర్థంలేదని తెలుతుంది. అందరూ త్యాగం చెయ్యటం మొదలు పెడితే దాని ఫలితం పొందే వాడెవడు? లేక కొందరు మాత్రమే త్యాగం చెయ్యాలంటే, ఆ కొందరెవరో ఎట్లా నిర్ణయించటం? ఇటువంటి స్వార్థత్యాగం ఉత్కృష్టమైనదైతే బ్రిటిషువారు భారతీయులను దాస్యంలో ఉంచటం వల్ల భారతీయులంతా త్యాగం చేసినవాళ్ళవుతున్నారు. ప్రపంచమంతా స్వార్థత్యాగం చేసి హిట్లరుకు అడిగిందల్లా ఇవ్వవచ్చును. ఈ త్యాగానికి మెడమీద తల వున్నవాడెవడూ ఒప్పుకోడు.

మరొక నిర్వచనం చూతాం. ఎక్కువైన విలువగల దాని కోసం తక్కువ విలువ గలది విసర్జించటం త్యాగం అందాం. ఇది చాలా మందికి హాస్యాస్పదమైన నిర్వచనంగా కనిపించవచ్చు. ఎందుకంటే ప్రతికోమటీ, పెట్టుబడిదారూ చేసే పని ఇదే. నూటపదిరూపాయలు సంపాదించగలందులకు నూరు రూపాయలు పెట్టుబడి చెయ్యటం త్యాగమేనా? సంస్కారం సరిగా పరిణామం పొందని దశలో ఇది త్యాగమే. ఇంకో గంట సేపటికి తల్లి కాల్చిన చిలగడదుంప యిస్తుందనే విశ్వాసంతో చేతికి చిక్కిన పచ్చి చిలకడదుంప తల్లి చేతిలో పెట్టే అబ్బాయి చేసేది త్యాగమే. కావలిస్తే వాడి మొహం చూడండి. క్లైవ్ బెల్ అభిప్రాయంలో ఇటువంటి త్యాగతత్వం పురస్కరించుకునే నాగరికత అభివృద్ధి అయింది. ఇటువంటి త్యాగం చేసే సంస్కారం కూడా లేనిది కనకనే ఆంధ్రజాతికి పరిశ్రమలు లేవు అనేక కోట్ల రూపాయలు ఆంధ్రదేశంలో ఇనప్పెట్టెల్లో మురుగుతున్నై, వాటికి పెట్టుబడి లేదు.

అయితే ఈ నిర్వచనానికి కూడా అభ్యంతరం ఉంది. ఈ నిర్వచనం ప్రకారం వ్యాపారస్తులంతా మహా త్యాగులు కావటమే కాకుండా ప్రాణత్యాగం చేసిన వారెవరూ ఈ జాబితాలోకి రారు ఎందుకంటే ఈ నిర్వచనం ప్రకారం త్యాగం స్వార్థరహితమైనది కాదు. స్వార్థరహితమైన పనులు చేసి ప్రపంచానికి మేలు చేసిన వ్యక్తులు చాలా మంది ఉన్నారు. భయంకరమైన వ్యాధులను గురించి పరిశోధనలు చేస్తూ ఆ వ్యాధులు చేజేతులా తెప్పించుకుని వాటికి ఆహుతి అయిన వారున్నారు. నీళ్ళలో పడి చనిపోబొయ్యే వాణ్ణి రక్షించటానికి నీళ్ళలోకి ఉరికే వాడిది త్యాగం కాదు – పై నిర్వచనం ప్రకారం ఇది అసమంజసం.

ఈ సందర్భంలో కాంగ్రెస్ వాదుల త్యాగం కూడా పై నిర్వచనం మీదే ఆధారపడి వుందనేది నిరూపించటం అవసరం కాంగ్రెసు వాదుల ఆశయం భారతీయ స్వాతంత్ర్యం. వారు చేస్తున్న త్యాగానికి ఈ స్వాతంత్ర్యం ఫలితం. అయితే ఈ నిర్వచనానికి న్యాయం అనేది ఒకటి ముడిపెట్టబడింది. స్వాతంత్ర్యం భారతీయులకు న్యాయంగా చెందవలసినది. అది త్యాగం కంటె అధికమైన విలువ కావటమే కాక న్యాయమైన విలువ అయితే ఈ న్యాయం నిర్వచించబడలేదు. ఇది కేవలమూ ఊహ్యాం. ఎవరెవరు భారతీయులు? స్వాతంత్ర్యం ఈ భారతీయులకు ఏయే పాళ్ళలో పంచిపెట్టబడుతుంది? ఎన్ని వేల సంవత్సరాలుగా ఈ గడ్డ మీద ఉంటున్న జాతులకు భారతీయత అబ్బుతుంది? ముందు ముందు ఇక్కడికి వలసరాబోయే జాతులకు భారతీయత ఏమాత్రం అందుబాటులో ఉంటుంది? ఇటువంటి ప్రశ్నలు ఇకముందు – స్వాతంత్ర్యం వచ్చినాక గాని తేలవు.

కాంగ్రెస్ భారతీయ స్వార్థం కోసం కాక ఒక నైతిక సూత్రం కోసం, శాంతి యుతంగా నైతేనేం పోరాడుతున్నదని భ్రమ పడే వారికి గాంధీగారు కనువిప్పు చేస్తున్నారు. సింధురాష్ట్రంలో లోహార్లమూలంగా అశాంతి ప్రబలితే వారిని శాంతంగా ఎదుర్కోవటం అక్కడి ప్రజల విధి. నేనల్లా సూత్రం చెప్పగలవాణ్ణే! అంటున్నారు గాంధీగారు. ఎవరి పొలాలు, ఎవరి గ్రామాలు, ఎవరి జిల్లాలు, ఎవరి రాష్ట్రాలు, ఎవరి దేశాలు వారు వారు చూసుకోండి కాంగ్రెస్ ఉద్యమంలో గల ప్రత్యేకత త్యాగం చెయ్యటం యొక్క శిల్పంలో మాత్రమే ఉందిగాని ఒకనైతికసూత్రం కోసం పోరాడటంలోలేదు. రష్యావారూ, చైనా వారూ కోరే ఆశయం సవ్యమైనదే. అందుకు సానుభూతి చూపబడుతుంది. వారి శిల్పం తప్పు. అందుచేత సహకారం చెయ్యబడదు. (శిల్పం సక్రమమైనా సహకారం చెయ్యబడదు. చూడు – సింధురాష్ట్రం.) అయితే బ్రిటిషువారు మాత్రం సానుభూతికి కూడా అర్హులు కారు. వారి ఆశయం తప్పు వారు తమ దేశంకోసం కాక సామ్రాజ్యం కోసం పోరుతున్నారు. ప్రమాదవశాన మనం ఏదేశంలో పుడతామో ఆదేశం న్యాయంగా మనది. ప్రజ్ఞచేత మనం ఏ వ్యాపారమో, ఇతర వ్యాపకమో చేసి సంపాయించిన లక్షలు మనవి. వాటి కోసం మనం పోరటం న్యాయం. శాంతంగా

పోరటం సక్రమం కాని బ్రిటిషువారు ఎట్లాగో ఆర్జించిన సామ్రాజ్యం మాత్రం వారిది కాదు. దానికోసం వారు పోరటం అన్యాయం. యుద్ధం చెయ్యటం అక్రమం

ఈ ఎగుడు దిగుడు సూత్రాలు పునాదిగా పెట్టుకుని ఈనాడు భారతీయులచేత కాంగ్రెస్ ఆధ్వర్యం కింద చెయ్యబడుతున్న త్యాగం మహోఘనంగా భావించబడుతున్నది ఇందులో ఒక నైతిక సూత్రం ఉన్నట్టు నటించటం అనవసరం ఇక త్యాగం అనేదానికి ఒక్క నిర్వచనమే మిగిలి వుంది అది నైతిక సూత్రం మీద ఆధారపడి వుంది

నైతిక సూత్రాలు పొలిమేరలెరగవు. అవి అన్ని దేశాలకూ, అన్ని జాతులకూ ఒకే కాలంలో ఒకే విధంగా ఉంటై (అన్ని కాలాలకూ ఒకే విధంగా ఉంటవని నేను వాదించటానికి పూనుకోవటంలేదు.) వాటి ఆశయం మానవ కోటికంతకూ క్షేమమూ అభివృద్ధీ కలిగించటమే, మార్క్సు సిద్ధాంతం ఇటువంటి సూత్రాల్లో ఒకటి. దాన్ని ఆమోదించని వారు తప్ప దానికి విరోధులూ, విజాతీయులూ లేరు అటువంటి సిద్ధాంతాన్ని ఎంతవర్కైనా సరే, ఏ జాతి తరపున అయినా సరే పాటించవచ్చును. కాని నైతిక దృక్పథం లేనిత్యాగం మాత్రం పరిమితమయినది. పైగా క్షీణదశకు చేరుకుంటుంది. తన జాతి కోసం మాత్రమే పోరాడేవాడు ఏదో దశలో - తన జాతియొక్క విజయం దుస్సాధ్యమనే నమ్మకం కలగగానే - తన క్షేమం కోసం జాతిని విసర్జించక మానడు. ఈ మనస్తత్వం రష్యావంటి దేశంలో కంటె జర్మనీ వంటి దేశంలో త్వరగా ఏర్పడడానికి చాలా అవకాశం వుంది. ఇప్పటివరకు ప్రతి జర్మనుసైనికుడూ తమ అవతారపురుషుడి ఆజ్ఞమాత్రమే నిర్వర్తిస్తున్నాడు. కాని ఎప్పుడో ఒక్కప్పుడు ఈ జర్మన్ సైనికుడికి తమఅవతార పురుషుడి దురాశ కోసం తమ స్వార్థత్యాగం చేస్తున్న సంగతి తెలిసి రాక తప్పదు. ఆస్థితి ఏర్పడేటట్టు చేసే శక్తి మిత్రమండలి వారి తుపాకుల మీద ఆధారపడివుంది.

మనదేశంలో కూడా మన అవతారపురుషుడి ఆజ్ఞ నిర్వర్తించడానికి సిద్ధంగా ఉన్నంతగా ఒక నైతిక ఆశయం అవగాహన చేసుకోగల వారు జన సామాన్యంలో లేరు. ఇది ఇర్వై రెండు సంవత్సరాల ప్రచారం ఫలితం! ఇర్వై సంవత్సరాలు ఏమూలా చాలా వంటున్నాడు గాంధీగారు. హిట్లరుకు పదిహేడు సంవత్సరాలే చెల్లినై - జర్మను ప్రజలందరినీ పశుతుల్యులను చెయ్యటానికి ! రష్యా అరణ్యం నుంచి నాగరికతను తేవటానికి స్టాలినుకు అంతకాలం కూడా పట్టలేదు!

*సమదర్శిని 1944 (కొకు బొంబాయిలో వుండగా రాసింది)*

## 5. జోస్యం గురించి

జ్యోతిశ్శాస్త్రం గురించి నాకేమి తెలీదు. అసలు జోస్యం ఒక శాస్త్రం అవునో కాదో కూడానే నెరుగను కాని జోస్యం ఒక కళమటుకవును ఇతర కళలిచ్చే ఆనందమూ, మనోవికాసమూ ఈ కళద్వారా ప్రజలకు లభ్యమయ్యే అవకాశం వుంది.

జోస్యం ఎన్నడూ నిజంకాదనీ, ఎక్కడన్నా నిజమయితే అది గుడ్డి వేటుగా నిజమవుతుందనీ, అందుచేత జోస్యాన్ని ప్రోత్సహించరాదనీ కొందరు అమాయకు లనటం కద్దు. కాని ఇది శుద్ధ పొరపాటు. ఈ తర్కంతో కల్పనా సాహిత్యాన్నంత కొట్టివెయ్యవలసిందే. కాని కళాదృష్టితో చూస్తే ఇప్పుడు జోస్యులు చాలామంది నిలవరంటే అందులో కొంత అర్థం వుంది. ఎందుకంటే కల్పనా సాహిత్యంలాగే జోస్యం కూడా నిజం కానప్పటికీ, నిజం లాగున్నట్టుండాలి. లేనట్టయితే అది కేవలం అభూత కల్పన కింద వెళ్ళిపోతుంది.

జోస్యాన్ని జనసామాన్యం ఒక శాస్త్రం కింద గణించటంలేదని వేరేచెప్ప నవసరం లేదు. ఎందుచేతనంటే ఇన్ని వేలమంది నిత్యమూ వివిధ పత్రికల్లో నక్షత్ర ఫలితాలు చూసుకున్నప్పటికీ అది నిజమయిందా లేదా అని ఒక్కరుకూడా వెనక్కుతిరిగి చూసుకోకుండానే వచ్చే వారానికి కొత్త ఫలితాలు మళ్ళీ ఆసక్తితో చదువుకుంటారు.

ఏమాట కామాటే చెప్పాలి. పత్రికల వాళ్ళుకూడా జోస్యం ఒక శాస్త్రమనీ, తమకు నక్షత్ర ఫలితాలురాసే దైవజ్ఞుడు అక్షరాలా నిజమే రాస్తాడనీ ఒక్కనాటి కనుకోరు అటువంటి అపోహలు వారి కుండేపక్షంలో పత్రికలవాళ్ళు రాబోయే వారానికి నక్షత్రఫలితాలు వెయ్యటానికి బదులు జరిగిన వారం ఫలితాలే వేతురు.

అయితే, ఒకప్రశ్న వెయ్యొచ్చుజోస్యం ఒక కళమటుకే అయితే కథలు చదివేవాళ్ళకన్నా, రాజకీయాలు చదివే వాళ్ళకన్నా, నక్షత్రఫలితాలు చదివేవాళ్ళెందు కెక్కువున్నారూ? (లేరనకండి దయచేసి)

దానిక్కారణం లేకపోలేదు. కథలు వగైరాలు పరితలకి దూరంగా వున్నట్టుంటై, నక్షత్రఫలితాలు తమమీద రచనలే సాక్షాత్తూ! ఒక్కపేరు మినహా తన్ని గురించే! అంచేత పరిత ఆసక్తితో చదువుతాడు. అంతకన్న అందులో వేరే రహస్యమేమీలేదు.

కాని, నేను ముందే చెప్పినట్టు, మన దైవజ్ఞులీ ఉత్తమ కళని సరి అయిన విధంగా ఆరాధించని కారణంచేత వారికి సన్మానాలూ అవీ జరిగే అవకాశం లేకుండా ఉంది. సరయినకళ నిజంలాగా కనపడాలనీ, జనాన్ని రంజింప చెయ్యాలనీ చెప్పనే చెప్పాను.

ఈ రెండు అంశాల్లోనూ మన దైవజ్ఞులు పప్పులో కాలువేస్తున్నారు. మచ్చుకు నిజంలాగా ఉండటం గురించి రెండు సంగతులు గమనించండి. మీ భార్య ఆరోగ్యం ఈవారం సరిగా వుండదు అంటాడు దైవజ్ఞుడు. వెంటనే అది చూసుకునే ఆడవాళ్ళకి జుగుప్సా, బ్రహ్మచార్లకి విచారమూ కలుగుతై బిడ్డల విషయం సూచించి నప్పుడు

కూడా ఇంతే కుటుంబంలో అనారోగ్యం అంటే ఎంత తేలికలో పోతుంది ఒక్క స్వాములార్లకుతప్ప మిగతా అందరికీ కుటుంబా లుంటాయి గద! కాకపోయినా నక్షత్రఫలితాలు చూసే స్వాములార్లెంత మంది ఉంటారు గనక! అందులోకూడా తమ పూర్వాశ్రమం తాలూకు కుటుంబాలను గురించి మమకారం అనుకున్నంతగా చావని స్వాములార్లకి అభ్యంతరమే ఉండదూ!

అసలు అనారోగ్యం మాట దేనికని నా రెండోవాదన కల్పన హృదయ రంజకంగా ఉండాలి మీసహోదరుల కీరం అజీర్తిబాధ, మీ భార్యాకున్నల్పసుస్తీ మీ ఒంట్లోతగినంత ఉల్లాసం ఉండదూ అంటూ రాసుకు పోతే ఎవడికి హృదయ రంజకంగా ఉంటుందీ? ఈ విషయమై జోస్యులకి ఒక గొప్ప సలహా యిచ్చాడొక అప్రాచ్య (అనగా పాశ్చాత్య) రచయిత. అదేమిటంటే ఎప్పుడూ శుభమే ఆలోచించ మన్నాడు అశుభంసూచించేట్టు చెప్పే ముక్కలు అబద్ధాలుగా పరిణమిస్తే జనానికి తగని కోపం వస్తుంది. నిజంగా పరిణమిస్తే ఓ చెంప అశుభం అనుభవిస్తూ అశుభం జరిగితే జరిగిందిగాని జోస్యుడు మాగొప్పగా చెప్పాడులే! అని ఏ నిర్భాగ్యుడు సంతోషిస్తాడూ? ఓవేళ దారితప్పి అప్పటికి సంతోషించినా ఇక ఆ జోస్యుడు రాసేది మరి చదవడు - ఇట్లాగే మరోసారి అశుభం చెబితే అది నిజమౌతుందేమోనని హడిలిచావాలిసొస్తుందే అని! అట్లా కాక శుభమే చెప్పేవాణ్ణి చూసి అందరూ సంతోషిస్తారు. శుభం నిజమయిందా, కీర్తి వుండనే ఉంది. ఓవేళ నిజంకాదూ, పోనీలే, జోస్యుడుశాయశక్తులూ మన మంచే కోరాడు, విధి కలిసిరాకపోతే అతను మటుకేం చేస్తాడు? అనుకుంటారు.

ఈ విషయంలో తూకం యంత్రాల టిక్కెట్లు తయారుచేసే వాళ్ళు మహా గడుసు పెధవలు. ఈ యంత్రాలు మీరు చూసేవుంటారు. యంత్రం మీద మనం ఎక్కినిలబడి ఒక బొక్కలో అణావేసేస్తే అణాకాస్తా లోపలికి వెళ్ళి మన తూకంతో సహా ఒకటిక్కెట్టు బయటి కొస్తుంది. ఆ టిక్కెట్టు మీద మన తూకమేకాక అదనంగా మన అదృష్టం కూడా అచ్చేసి వుంటుంది. ఇది నిజంగా అదృష్టమే. ఎన్నివేల రూపాయలైనా ఖర్చుచేసి ఎన్నిలక్షల టిక్కట్లయినా తీసుకొండి, మన దురదృష్టం గురించి ఒక్క ముక్కకూడా వుండదు. అందుకనే మరి పత్రికలు పెట్టుకోవటం కంటె తూకం యంత్రాలు పెట్టుకోవటం ఎక్కువ గిట్టింపుగా వుంటున్నది.

అందుచేత కళాకారుడుగా పైకిరాదలిచిన దైవజ్ఞుడు అశుభాలు పలకటం మానాలి. మీకు రోగంవస్తుందీ, మీకు అవమానం జరగొచ్చు, మీరయిన వాళ్ళతో పోట్లాడతారు, రేసులకూ జూదానికీ వెళ్ళేరూ, వ్యాజ్యాల్లో రాజీపడటం మంచిదీ వగైరా అక్షింతలు పూర్తిగా మానెయ్యాలి.

వెనకటికి, కోడలు పొమ్మన్న బిచ్చగాణ్ణి వెనక్కు పిలిచిన అత్తగారు తన హక్కులపట్ల చాలా గౌరవం ఉన్న మనిషి, ఆవిణ్ణి పెద్దమనుషుల జాబితాలో

తరవాత, మరో ముఖ్యమైనసంగతి. ప్రతికళా దేశకాల పాత్రల ననుసరించి వెళ్లాలి. ముఖ్యంగా, కాలధర్మాన్ని గుర్తించని కళకు ఆరాధన ఉండదు. మాట వరసకి, పత్రికలు చదివేవాళ్ళలో స్త్రీల సంఖ్యే జాస్తి అవుతున్నదనే మాట మరిచి మగాళ్ళకోసమే నక్షత్రఫలాలు రాసి, ఆడాళ్ళకు జన్మ నక్షత్రాలూ అవీ వుండనట్లు ప్రవర్తించటం చేతులారా సర్క్యులేషను తగలేసుకోవటమే అవుతుంది.

ఆవిధంగానే ఇతర హంశాలూ సరిచూసుకుని దైవజ్ఞులు కుశాగ్రబుద్ధులైమెలగాలి.

మనదైవజ్ఞుడు రెండుమూడు వేల యేళ్ళక్రితం, నక్షత్రఫలితాలు రాస్తున్నాడనుకోండి, అప్పుడు చదువొచ్చిన వాళ్లు అధికంగా విప్రులే గనక ఫలితాలు ఈ విధంగా వుంటే బాగుంటుంది   ఈ వారంలో మీకు మంచి విందులు తగులుతాయి. కిందటివారంకంటె తద్దినబ్రాహ్మణార్థాలు జాస్తి అయేసూచన వున్నది. అజీర్తివ్యాధి కలగొచ్చు. వారాంతాన సంభావన కోసం దూరప్రయాణం స్వల్పకలహం. మానహాని.

అదే జమీందారీ యుగంలో అయితే,   స్త్రీ మూలక కలహంలో శిరస్సుకు అపాయం తప్పిపోవచ్చు. మీ స్త్రీలలో సఖ్యత ఈవారం బహు తక్కువగా వుంటుంది. పాడ్యమీ, విదియా, తదియా ఏకాంత శయనప్రాప్తి.  వారాంతంలో తలవని తలంపుగా ఇల్లు వదిలి వెళ్ళటమూ, నిరాహారదీక్ష, భాగవదాలోచనా.

ఈనాటి నక్షత్రఫలితాలెట్లా వుండాలో సూచించటానికి నేనెవణ్ణిగాని మన దేశంలోకూడా దేవుడు మేలుచేసి సామ్యవాదంవస్తే, నక్షత్రఫలితా లప్పటిదాకా బతికివుంటే అప్పుడవి ఈరీతిగా వుండొచ్చు, అశ్విని మొదలు రేవతి వరకూ అన్ని నక్షత్రాలవారికీ - ఈవారం మీ ఆరోగ్యం బాగుంటుంది. గతవారం కంటె ఎక్కువ పరిశ్రమ చేయగలుగుతారు. భోజనసౌఖ్యం. కళత్ర సౌఖ్యం. పిల్లల ఆరోగ్యం, ఉత్తమ కావ్యపఠనం. శరీరానికి తగినంత వ్యాయామం.

*ఆంధ్రజ్యోతి మాసపత్రిక, జులై 1946*

# 6. హక్కులూ, వాటి కమామీషూ

''పెద్ద మనిషయినవాడు తన హక్కులను వదులుకోడు, అనవసరంగా ఉపయోగించుకోడు కూడా!''  అన్నాడు బెర్నార్డ్‌షా.

బుద్ధిమంతులు డబ్బు విషయంలో కూడా ఇదేవిధంగా ప్రవర్తిస్తారు. డబ్బు విషయంలో బుద్ధిమంతులంటే పొదుపు తెలిసినవారన్న మాట.

జూదం ఆడేవాళ్లు తమకు రావలసిన బాకీలు దమ్మిడీలతో సహా రాబడతారు. ఊరికే పారెయ్యమంటే పదిరూపాయలు పారెయ్యనన్నా పారే స్తారుగాని!

వెయ్యవచ్చు, ఎందుకంటే, బిచ్చం వేసే తన హక్కును ఆవిడ దుర్వినియోగ పరచలేదు, బిచ్చగాడికి ఉత్తచేతులు చూపి పంపింది

కాని అందరూ అంత పెద్దమనిషి తరహాగా ఉండరు కొందరు తమ హక్కులకోసం ఎట్టి ప్రయత్నమూ చెయ్యరు. వాళ్లు ఎలెక్షనుల తాలూకు వోటర్ల జాబితాలో తమ పేరు లేకపోతే వేయించుకునేటందుకు బద్ధకించే వాళ్ళలాంటి వాళ్ళు.

మరికొందరు తమకున్న హక్కుకు వినియోగించుకోరు – వోటు ఉండికూడా వెయ్యనివాళ్ళ లాగా,

ఇంకొందరు తమ హక్కులకు తామే శత్రువులవుతారు – భారతదేశానికి స్వాతంత్ర్యం అక్కర్లేదనిన వాళ్లలాగా! ఆంధ్రరాష్ట్రం వద్దని మహజరు పెట్టిన వాళ్ళలాగా!.. . వీళ్ళలో పెద్దమనిషి తనం ఏమీ లేదనుకోవచ్చు.

అయినా నాకు ఇటువంటి వాళ్ళను చూస్తేనే అసూయ. (నిజమైన పెద్ద మనుషులను చూసి నేనెన్నడూ అసూయపడ్డట్టు జ్ఞాపకం రావటం లేదు!)

బ్రిటిషువాళ్ళ ఆదేశంమీద కాంగ్రెసు వాళ్ళను లారీచార్జీలు చేసి చేసి, శకం మారగానే కాంగ్రెసువాళ్ళ ఆదేశానుసారం సామాన్య ప్రజలను తుపాకులతో కాల్చే వాళ్ళని చూస్తే నాకు చాలా ఆసూయ.

యుద్ధకాలంలో యుద్ధయత్నానికి తోడ్పడి కోట్లు గడించి, స్వాతంత్ర్యం వచ్చాక అగ్రదేశ భక్తుల జాబితాలో చేరి పరిపాలనా యంత్రాన్ని పరోక్షంగా నడిపేవారిని చూస్తే నాకు చాలా అసూయ.

రాబడి దాచి ప్రభుత్వానికి కోట్ల లెక్కన ఎగనాం పెట్టి ఘరానా మనుషులకింద చలామణి అవుతూన్న వాళ్ళని చూస్తే నాకు అసూయ.

ఎన్నికలలో ఓడిపోయి దొడ్డి దారిన, ప్రజాస్వామికానికి ఏమాత్రమూ విఘాతం కలగకుండా, ముఖ్య మంత్రులయే వారియెడల నాకు అపారమైన భక్తితోపాటు, అమితమైన అసూయ కూడానూ!

ఎలెక్షన్లలో విజయం కోసం ఒక పార్టీతో ములాఖత్ అయి, పదవులకోసం ఇంకొక పార్టీతో చేతులు కలిపేవాళ్ళంటే కూడా నాకు అసూయే.

ఆంధ్రరాష్ట్రం రాకుండా చెయ్యటానికి విశాలాంధ్ర కాంగ్రెస్ పార్టీ నాయకత్వానికి సమంగా కృషి చేసే ప్రతిష్ట గల వాళ్ళను చూస్తే నాకు అసూయ అని వేరే చెప్పనవసరం లేదు.

ఆంధ్ర కాంగ్రెస్ అగ్రనాయకులెందరైతే ఉన్నారో అందరిమీద కూడా చండాలమైన కార్టూనులు వేసికూడా ఆంధ్రలో కాంగ్రెసుకు పట్టుగొమ్మగా ఉండే పత్రికను చూస్తే నాకు ఒక వంక ఆశ్చర్యమూ, ఇంకో వంక గౌరవమూ, మూడోవంక అసూయా!

ఇలాంటి పెద్ద అసూయలు నాకు చాలా ఉన్నాయి. ఇక చిల్లర అసూయలను గురించి చెప్పనే అక్కర్లేదు చచ్చేట్టు తాగి ప్రాహిబిషన్‌ను బలపరిచే వాళ్ళనూ, హత్యలు చేసి అహింసను బలపరిచే వాళ్ళనూ, ఇండియా పౌరులుగా ఉంటూ దేశానికి శత్రువులైన వారిని బలపరిచే వాళ్ళనూ చూస్తే నాకు అసూయ

ఒక కళయందు ప్రవేశంగాని, అసక్తి గాని, లేకుండా ఆ కళపై విమర్శకులుగా తయారయే వాళ్ళనూ, అవతలి వాడి డబ్బునుబట్టి వాడి అజ్ఞానాన్ని విజ్ఞానంగా పరిగణించే వాళ్ళనూ చూస్తే నాకు అసూయ.

వీళ్ళంతా లేని హక్కులను వినియోగించటమో, ఉన్న హక్కులను దుర్వినియోగం చెయ్యటమో చేస్తున్నవాళ్ళే. బెర్నార్డు షా లెక్కన పెద్దమనుషులు కారు.

కాని నా సందేహమల్లా, వాళ్ళకేం లోటు వచ్చిందని! వాళ్ళకులోటేవస్తే, వాళ్ళను చూసి నేను కుళ్ళుమోతును కావలసిన గతే పట్టక పోనుగా!

ఒక మేధావి, దేన్నీ గుడ్డిగా నమ్మరాదు! అని సిద్ధాంతీకరిస్తాడు, ఆయనపట్ల గౌరవం గలవాడు, చిత్తం! మీరు చెప్పారు గనక, ఆ విషయంనేను గుడ్డిగా నమ్మటానికి సిద్ధంగా ఉన్నాను! అంటాడు ... శాసనసభ్యులు ఒక్క ఓటు మెజారిటీతో ప్రజాస్వామికంలో అవిశ్వాసం ప్రకటించిన చందంగా... హంతకుడు తనమీద తుపాకీ బారు చేసి రాయమంటే చావబోయేవాడు చావుకు భయపడి, నేను జీవితంమీద విరక్తిచెంది ఆత్మహత్య చేసుకుంటున్నాను, అని రాసి సంతకం పెట్టినట్టు... ఒక్కొక్కసారి సాధ్యాలూ, సాధనాలూ పరస్పర వైరుధ్యంతో కూడుకుని ఉంటాయి.

జీవితంలో అటువంటివి వుంటాయి. ఒకడు అడ్డమైన గడ్డీ తిని డబ్బు పోగు చేస్తే, ఇంకోడు హాయిగా ఖర్చు చేసేస్తాడు, ఒకడు చెట్టునాటితే ఇంకోడు పండుతింటాడు. యుద్ధంలో పోరాడిన వారు చస్తారు, గాయపడి వికలాంగులవుతారు, సమ్మెలు చెడగొట్టటానికి ఉపయోగపడతారు; వాళ్ళు సంపాదించిన గెలుపు వల్ల లాభాలు యుద్ధం చెయ్యని వాళ్ళే పొందుతారు.

హక్కులు కూడా ఒక్కొక్కసారి అట్లాగే సంక్రమిస్తాయి. భారతీయులకు స్వాతంత్ర్యం అట్లాగే వచ్చింది. ఆంధ్రులకు ఆంధ్రరాష్ట్రం అట్లాగే వచ్చింది. రేపు ఆంధ్ర ప్రదేశ్ కూడా అంతే!

కష్టించకుండా వచ్చిన డబ్బు వంటిదే కష్టించకుండా వచ్చిన హక్కుకూడా, అది అలాములూ పలాములూ అయిపోతుంది

ఈ రెంటికీ సామ్యమేగాదు, సంబంధం కూడా ఉన్నది. డబ్బును దుర్వినియోగ పరచే వాడు ఆ డబ్బుతో హక్కులు కొంటాడు. తొందర పని లేకపోయినా విమానంలో వెళ్ళే హక్కు, ఆకలిలేకపోయినా తినే హక్కు, ఏమీ

రాకపోయినా అన్నీ తెలును ననిపించుకునే హక్కు, తన భార్య కాకపోయినా అనుభవించే హక్కు, పనీ పాటా లేకపోయినా కార్లలో తిరిగే హక్కు, ఇత్యాది.

అదేవిధంగా హక్కులను దుర్వినియోగపరిచే వాడు ఆ హక్కులను డబ్బుకు విక్రయిస్తాడు. వోటును అయిదురూపాయల నుంచి మంత్రి పదవి దాకా ఎంతకైనా అమ్ముకోవచ్చు అసాధారణ ఎన్నికలన్నిటిలోనూ డెమోక్రసీ ఈవోట్ల క్రయవిక్రయాల మీదే ఆధారపడి ఉంటుంది అదే చరిత్ర దానికే గౌరవం.

అసలు అధికారంకోసం పోటాపోటీలు దేని కంటే అధికారంద్వారా వచ్చే హక్కులతో డబ్బు చేసుకోవచ్చు గనకనే ఆశ్రితులకూ, ప్రియురాళ్ళ భర్తలకూ ఉద్యోగా లివ్వ వచ్చు. పాత్రులైనవారు డబ్బు చేసుకునే సౌకర్యాలు కలిగించి, వారి కృతజ్ఞతకు పాత్రులు కావచ్చు.

హక్కులను డబ్బుగా మార్చుకోవటంలో చరిత్ర ఇమిడి ఉందేమోగాని, రాజకీయాలు ఇమిడి ఉన్నాయనుకోవటం చాలా పొరపాటు, అటువంటి దేమీలేదు.

హక్కులూ, డబ్బూ - వీటి పరస్పరము గురించి తెలుసుకున్నాం. ఇంకో పద్ధతికూడా ఉంది.

డబ్బు సహాయంతో మరింత డబ్బు చేసుకునేవాణ్ణి పెట్టుబడిదారంటాం, ఆ విధానాన్ని పెట్టుబడిదారీ అంటాం. అలాగే, హక్కులద్వారా మరిన్ని హక్కులను సంపాదించే వాళ్ళు నిరంకుశులు, నియంతలు, వాళ్ళు అమలు చేసే విధానాలను ఫాసిజం అంటాం.

కళాకారులకు ఈరెండూ చాతగావు వాళ్ల అసహాయస్థితికి జాలిపడి గాబోలు, ప్రపంచం వాళ్లని అకాశానికెత్తి ఆనందపరుస్తుంటుంది!

*ఢంకా, మాసపత్రిక, నవంబర్- 1956*

## 7. చిత్ర జగత్తు

జీవితపు విలువలు మన కళ్ళెదుటే మారుతూండటం చూస్తే మన పిల్లలకు ఏ విధమైన నీతి పాఠాలు నేర్పాలి? అన్న సందేహం కలిగి సమాధానం తెల్సుకోలేకపోతాం.

హేయమైన జీవిత విధానాలు అవలంబించి బాగుపడిన వాళ్ళు ఏ కాలంలోనైనా ఉన్నారు. ఇద్దరు ముగ్గురు అక్క చెల్లెళ్ళు తలా ఒక సంపన్నుడికి ఉంపుడు కత్తెలుగా వుండి తలా ఒక మిద్దె సంపాదిస్తే అంతమాత్రం చేత జీవితపు విలువలు తారుమారు కాలేదు. మనుషుల్లో ఘరానా మనుషులంటూ ఉన్నారు. ప్రపంచంలో సభ్య

ప్రపంచమంటూ ఉన్నది. సభ్య ప్రపంచానికి చెందిన ఘరానా మనుషులు జీవితపు విలువలను తారుమారు చేసినప్పుడే సమస్యలు పుట్టుకొచ్చేది.

చిత్ర నిర్మాతలు ఘరానా మనుషులు, వారిది సభ్య ప్రపంచం. అయితే నా కళ్ళ ఎదుటనే కళకోసం పాకులాడిన నిర్మాతలు పోయి, మాది వ్యాపారం, లాభాలు తియ్యటం తప్ప వేరే ఆశయం లేదు అని ఎలుగెత్తి చాటే నిర్మాతలు వచ్చారు.

సినిమా రంగంలో చేరి నాలుగు డబ్బులు చేర్చుకునే సదవకాశం వచ్చిన నాడు కళకు అశ్రుతర్పణం విడిచి, కళాదృష్టీ కళాప్రమేయమూ, కళా వైఖరిని విసర్జించటమూ లేక ముష్టెత్తుతూ, అప్రయోజకుల జాబితా లోనూ, పిచ్చివాళ్ళ జాబితాలోనూ చేరటమా? సులువుగా తేలే సమస్య ఎంత మాత్రమూ కాదు.

ఈనాడు డబ్బు చేసుకోవటంలో పోటీ ఉంది. ఒకనాడు డబ్బు చేసుకునే పద్ధతులకు ఎక్కువ ఆధారం ఉండేది కాదు. ఈనాడు అదంతా పోయింది ఒక పడుచు పడుచుకుని మిద్దె సంపాదిస్తే పదిమంది పడుచులు అదే మార్గాన ఎగబడి రావచ్చు. అది వివేక మనిపించుకుంటుంది కూడాను.

డబ్బు సర్వోత్తమమైన జీవితవిలువ కాదనుకోనడం మూఢవిశ్వాసంగా పరిణమిస్తుంది. డబ్బు కోసం ఏదైనా చేయటానికి సిద్ధపడటం వాస్తవ దృష్టి అవుతుంది.

ఒకప్పుడు హరిశ్చంద్రుడు మాటకోసం రాజ్యాన్నీ భార్యనీ, కొడుకుని, తన స్వాతంత్ర్యాన్ని పోగొట్టుకున్నాడంటే నాకు వీడేంమనిషిరా! అనిపించేది. కాని డబ్బుదగ్గరికి వచ్చేసరికి కిందటి శతాబ్దం మనుషులు కూడా సత్య హరిశ్చంద్రుడి వంటి విడ్డూరపు వ్యక్తులుగా కనిపిస్తున్నారు.

రాబర్డు బ్రౌనింగ్ అనే 19 వశతాబ్దపు బ్రిటిష్ కవి తన పద్యాలను పత్రికలలో ప్రకటనలకు ఇచ్చే వాడు కాడట. ఒకసారి ఒక పత్రికాధిపతి ఆయనకు 50 పౌనులు (ఆరువందల రూపాయల చిల్లర) చెక్కుపంపి ఒక పద్యం పంపమన్నాట్ట. బ్రౌనింగ్ ఆచెక్కుని తిప్పి పంపుతూ పత్రికలకు పద్యాలు పంపటం నాకు అలవాటు లేదు. కావలిస్తే నా భార్యను కోరండి అని రాశాట్ట (ఆయన భార్య ఎలిజిబెత్ బారెట్ బ్రౌనింగ్ కూడా కవిత్వం రాసేది). పత్రికాధిపతి ఈసారి 500 పౌన్లకు చెక్కు పంపిస్తూ గుమస్తా పొరపాటు వల్ల చెక్కుమీద 500 అంకెకు బదులుగా 50 పడిందనీ పద్యం జరూరుగా కావాలనీ మళ్ళీ కోరాట్ట. బ్రౌనింగ్ ఆ చెక్కుని కూడా తిప్పి పంపాడు. చివరకు ప్రాణం విసిగి పత్రికాధిపతి ఖాళీ చెక్కు పంపుతూ దాని మీద మీ ఇష్టం వచ్చిన అంకె వేసుకుని ఒక పద్యం పంపండి అని రాశాట్ట. మన దేశంలో ఒక మంత్రి పదవికి గానీ, కనీసం ఒక సెక్రెటరీ పదవికి గాని పనికి రాని బ్రౌనింగ్ ఆ చెక్కును కూడా తిప్పిపంపాట్ట. ఏనాడో మరో దేశంలో ఉండినవాడు - అందులోనూ కవి, తిక్కగాడు- అటువంటి పని చేస్తే చేశాడు. మన దేశంలోనే మొన్న మొన్ననే - పది పదిహేనేళ్ళ

క్రితం ఒక దొంగమార్కెటు అసామీ లక్షరూపాయల చెక్కు ఇస్తానంటే నిరాకరించిన అధికారి - బొంబాయివాడు బొత్తిగా వాస్తవిక దృష్టి లేని వాడుగా కనబడతాడు

రాను రాను యిటువంటి అవాస్తవిక దృష్టి గలవారి సంఖ్య సభ్య ప్రపంచంలో తగ్గిపోతూందనటానికి సందేహం లేదు. కానీ వాళ్ళ సంఖ్య జన సామాన్యంలో - ముఖ్యంగాపేద సాదల్లో పెరిగి పోతున్నట్టు కనిపిస్తుంది

ఏదో మనకు సహాయంచేసి చేతిలో అణో బేడో పెట్టజూస్తేనిరాకరించిన నౌకర్ల ను చాలా మందిని చూస్తున్నాను. వీళ్ళను బజారుకు పంపిస్తే చిన్న చిన్న అబద్ధాలాడి ఏయాపైసలు కైంకర్యం చేయకుండా వున్నారు

సభ్య ప్రపంచం పాటించే విలువలు వీళ్ళకు తెలియటమే లేదో, తెలిసి కూడా వాటిని తృణీకరిస్తున్నారో నాకు సరిగ్గా బోధపడకుండా వున్నది

దురదృష్ట వశాత్తు నేను చిన్న తనంలో నేర్చుకున్న విలువలను ఈ నీలి మనుషులు పాటించటం చూస్తే ఒకందుకు వాళ్ళమీద అభిమానంగానూ వున్నది. ఇంకొకందుకు భయంగానూ వున్నది భయందేనికంటే భవిష్యత్తు మాటేమిటి? ముందు తరాల వాళ్ళు మంత్రులూ, సెక్రెటరీలూ, నాయకులూ అయితే బాగానే వుండును కానీ జీవితం విలువల మాటేమిటి? వాళ్ళతో మనం ''అబ్బాయిలూ, అమ్మాయిలూ! కళలూ, గాడిదగుడ్డూ, ఆత్మాభిమానమూ, దీక్షా, న్యాయమూ, సంఘప్రీతి మొదలైనవి బడుద్ధాయిలు పరిగణించే విలువలు, మీరు అయిన కాడికి డబ్బుకు అమ్ముడుపోండి. కీర్తీ, ప్రతిష్ఠా, సంఘగౌరవమూ డబ్బేసి కొనుక్కోండి! మిగిలిందంతా మిధ్య డబ్బొహటే నిత్యం! '' అనిచెప్పటమా అని

*ముద్రణ, విశాలాంధ్ర దినపత్రిక, 28-5-1961*

# 8. బిరుద నామాలు

వ్యాసుడికీ, వాల్మీకికీ, భాసుడికి ఏం బిరుదులుండేవో మనకు తెలీదు. అసలు వాళ్ల పేర్లే మనకు తెలీదు. మనకు తెలిసినవి వాళ్ళ గోత్రనామాలటు. చాలామంది కవులు తమ రచనలో గద్యలు రాసుకునేటప్పుడు తమ ప్రత్యేకతలు తెలుపుకునే మాటలు కొన్ని వాడారు గాని, అవి వాళ్ళ ఎడ్రసు లాటివి, వాటిని వాళ్ళు బిరుదులుగా తగిలించుకు తిరిగారనటానికి ఆధారం కనిపించదు.

ఉభయ భాషా ప్రవీణ కళా ప్రపూర్ణ , బి. ఏ., ఎం ఏ., లాటివి విద్యాసంస్థలో, పరిషత్తులో ఇచ్చేవి అవి బిరుదుల కింద జమ కావు. పద్మశ్రీ , పద్మభూషణ మహావీరచక్ర ,

భారతరత్న లాటివి బిరుదులే కాని ఆ బిరుదు లను ప్రభుత్వం, కొన్ని కొన్ని వర్గాల శిఫార్సులను అనుసరించి యిస్తుంది అక్కర్లేని వాళ్ళు నిరాకరించవచ్చు.

ఇటువంటి బిరుదులతో వచ్చిన చిక్కేమిటంటే, వాటిని పుచ్చుకునే వాళ్లు తమ బిరుదులకన్న ప్రసిద్ధమైన పేర్లు కలిగి ఉంటారు. స్థానం నరసింహారావు, చిత్తూరువి నాగయ్య, భానుమతీ రామకృష్ణ లాటి పేర్ల ముందు పద్మశ్రీ తేలిపోతుంది మీకు పద్మశ్రీ బిరుదు వచ్చిందని మేము మరిచిపోలేదు లోకాన్ని మరిచిపోనివ్వం, అని చెప్పటానికే వాటిని మనం వాడతామనిపిస్తుంది.

అర్హతలను సూచించేవి కూడా ఒక్కొక్క సందర్భంలో మానెయ్యటమే బాగనిపిస్తుంది. తెరమీద ఎన్ టి రామారావు బి. ఏ., ముక్కామల కృష్ణమూర్తి బి. ఏ , బి. ఎల్ అంటూ కనిపిస్తే ప్రేక్షకులకు అదనంగా ఆమోదం కలుగుతుందని తోచదు.

డాక్టర్ జవహర్లాల్ నెహ్రూ, జగదుద్ధారక కార్ల్ మార్క్స్, శాంతి విభూషణ జె. ఎఫ్. కెనడీ, కథక చక్రవర్తి మొపాసా . ఇలా అంటూ పోతే విషయం హాస్యాస్పదంగా పరిణమించక తప్పదు.

రాజ్‌కుమార్, మీనాకుమారి, సావిత్రి, శ్రీశ్రీ, ఆరుద్ర, బాపు, శరత్, టాగూర్, సత్యజిత్ రాయ్... ఇటువంటి పేర్లముందు ఏమీ చేర్చటానికి వీల్లేదు - వీటిని అవమానించాలంటే తప్ప.

పైన చెప్పిన బిరుదులు గాక యింకో రకం బిరుదులున్నాయి. వాటిని ఎవరో ఇస్తారు. ఇచ్చేవారికున్న బిరుదు లేమిటో, అర్హత లేమిటో మనకు తెలీదు.

ఒకకవో, నటుడో, గాయకుడో, వాద్యగాడో తగినంత కీర్తి సంపాదించుకున్న మీదట కొందరు ఆకీర్తిలో భాగం పంచుకునే ఆశకొద్దీ సన్మానాలు ఏర్పాటు చేస్తారు అందుకు గాను చందాలు మీదగ్గరా, నాదగ్గిరా, వాళ్ళదగ్గిరా, వీళ్ళ దగ్గిరా వసూలు చేసుకుని, అందులో ట్రేడ్ డిస్కౌంటు తమ జేబులో వేసుకుంటారు బొత్తిగా మానాభిమానాలు గాలికి వొదిలేసి వాళ్ళు సన్మానితుడి దగ్గిరే బిల్లు మొత్తం వసూలు చేసేస్తారు.

ఒక కళాకారుడికి కొన్ని సన్మానాలు జరిగాక ఒక బిరుదు ఇవ్వవలసిన పరిస్థితి ఏర్పడిపోతుంది - ఇన్ని గిఫ్ట్ కూపన్‌లకు ఈ బహుమానం అన్నట్టుగా, పేరుకు బిరుదు ట్రేలర్ లాగా తగులుకుంటుంది. తప్పేదేముందీ? పదిమంది మధ్య ఆ కళాకారుడి పేరు ఉచ్చరించవలసి వచ్చినప్పుడూ, దాన్ని కాగితం మీద అచ్చొత్తించ వలసి వచ్చినప్పుడూ ఆ ట్రైలర్‌ను మర్చిపోకుండా పేరుకు తగిలించటం జరుగుతుంది.

సీరియస్‌గా ఆలోచించేవాడికి యింతకన్న ఫన్నీగా మరోటి కనబడదు.

ఇంకోవిధంగా చూస్తే యిదో దురాచారం. ఇక్ష్వాకులనుంచీ రాస్తున్నాడు గదా అని ఓ కథకుణ్ణి పట్టుకొని ఎవరో ఔత్సాహికులు కథక చక్రవర్తి అనేశారనుకోండి. అందువల్ల ఆ కథకుడికి జరిగే, పెరిగే గౌరవం చాలా అనుమానాస్పదం. అనుమానాస్పదం

కాని దేమిటంటే, అంతకన్నా బాగా కథలు రాసేవాళ్ళకూ, రాయగలమనుకొనే వాళ్ళకు అ దౌర్భాగ్యుడిమీద బిరుదు తగిలించిన వాళ్లమీద కాదు - ఆగ్రహం రావటం!

అర్హత లేనివాళ్ళు అనుమానాస్పద మైన అర్హతగలవాళ్ళకు అంటగట్టే అనవసరమైన బిరుదనామాలు ఏమీ మంచి చెయ్యలేకపోగా అంతులేని చెరువు చేస్తాయి.

పెద్దవాళ్లు చిన్నవాళ్లను, పేరు సంపాదించుకుని పైకిరా నాయనా! అని ఆశీర్వదించటం బిరుదులు సంపాదించుకోమని కాదు మనకున్న సత్యనారాయణా, వెంకట్రావూ, రాంభొట్లూ, దక్షిణామూర్తీ, వగైరా, వగైరా పేర్లే అన్ని బిరుదులకన్నా ప్రసిద్ధం కావాలని

ఇది ఇంటి పేర్లక్కూడా వర్తిస్తూంది. సంకేత నామాలకూ, సంగ్రహ నామాలకు కూడా వర్తిస్తుంది షేక్స్పియర్, ఐన్‌స్టీన్, ఇలియట్, షా, ఇబ్సెన్, గాంధీ, తిలక్, లతా, ఘంటసాల... ఇటువంటివి ఏ బిరుదులకన్న గొప్పవే ఒక పద్మ శ్రీమీద పది పద్మశ్రీలు వుండొచ్చు. వాటిని తలదన్ని పాతిక పద్మభూషణ లుండొచ్చు. కాని ఒక స్థానమే ఉన్నాడు. ఒక ఎం.ఎస్సే ఉన్నది.

ప్రారబ్దం కొద్దీ బిరుదులు వస్తే రానివ్వండి. కాని వాటిని వాడి వ్యక్తిత్వాన్ని చంపుకోవద్దు. అర్థంలేని బిరుదులను ఆమడదూరాన వుంచండి. అవి కేవలమూ నిరుపయోగమే కాదు, అపాయకరం. కొంచెం ఆలోచించండి, మనం నిజంగా మెచ్చుకునేవాణ్ణి తిడతాం, హోరి నీ దుంపతెగ ఎంత మంచి పద్యం రాశావురా! ఎంతబాగా నటించావురా! అనుకుంటాం. అహో! పద్మశ్రీగారూ, ఎంతబాగా నటించారండీ! అనుకోం. అనుకునే వాళ్ళను బ్రెయిన్ స్పెషలిస్టు దగ్గరికి పంపాలిసిందే! ఆమాటకొస్తే బిరుదుల విషయంలో బ్రెయిన్ స్పెషలిస్టుల దగ్గిరికి పంపాలిసిన వాళ్ళు చాలా మంది ఉంటారేమో!

*ముద్రణ, వాణిశ్రీ మాసపత్రిక ప్రథమ సంచిక ఏప్రిల్ 1968*

# 9. సాంఘిక సమస్యలూ, వాటి పరిష్కారాలూ

ప్రాణులకు అడుగడుగునా సమస్యలు ఏర్పడుతూనే వుంటాయి, వాటిలో కొన్ని పరిష్కారమవుతాయి, కొన్ని కావు. పరిష్కారమయ్యేవాటిలో కూడాకొన్ని తేలికగా అవుతాయి. మరికొన్ని శ్రమ పడితేగాని కావు, కొన్ని సమస్యలను వ్యక్తి స్వయంకృషితో పరిష్కరించుకోవాలి. కొన్నిటికి ఇతరుల సహకారం కూడా వుంటుంది. విద్యార్థులు పాఠాలు చదవాలి. పరీక్షలు రాయాలి. గృహస్థులు ఉద్యోగులు చేయాలి. డబ్బు గడించాలి. కుటుంబాలు పోషించాలి. పిల్లలకు పెళ్ళిళ్ళు చెయ్యాలి. శ్రామికులు పని సంపాదించుకోవాలి. ఇల్లాళ్ళు గృహకృత్యాలు నిర్వహించాలి. ఇంటిల్లిపాదికీ కాచిపొయ్యాలి. ఈ విధంగా నిత్యమూ అనేక సమస్యలు మనుషులకు ఏర్పడుతుంటాయి.

వ్యక్తులను బాధించే సమస్యలే విస్తరించి సాంఘిక సమస్యలవుతాయి. అనేక వేలమంది శ్రామికులకు పనులు దొరకనట్టయితే అది ఒకనిరుద్యోగ సమస్యగా సంఘాన్ని ఎదుర్కొంటుంది. ఈనాడు మనం చూసే ఆహార సమస్యా, కట్నాల సమస్యా, విద్యాధికుల నిరుద్యోగ సమస్యా, మొదలైనవి సాంఘిక సమస్యలు. ఇవి సంఘస్వభావం నుంచే ఏర్పడతాయి. సమస్యల పరిష్కారం భౌతిక సాధనాలతో సాధ్యమైనట్టే అవి ఏర్పడటానికి కూడా భౌతిక కారణాలుంటాయి.

అంతేగాక ఈసమస్యలకు వర్గ స్వభావం ఉంటుంది. డబ్బుగలవాడి సమస్యలు వేరు, డబ్బు లేనివాడి సమస్యలు వేరు, లక్షరూపాయలు కట్నం పోసి అల్లుణ్ణి సంపాదించగల వాడు, కట్నాలను నిషేధిస్తూ చట్టం ఏర్పడాలని తహతహలాడడు. బ్లాక్ మార్కెటులో మేలుజాతి బియ్యం కొనగలవాడికి రేషన్ బియ్యం గురించి తలగోడకేసి కొట్టుకునే పనేలేదు. శ్రామికుల సమస్యలూ, విద్యార్థుల సమస్యలూ, ఉపాధ్యాయుల సమస్యలూ, స్త్రీల సమస్యలూ అంటూ ప్రత్యేక వర్గాలకు సమస్యలు ఏర్పడటమూ, వాటికి తేలిక పరిష్కారాలు లేకపోవటమూ మనం చూస్తూన్నాం.

కొన్ని సాంఘిక సమస్యల వర్గ స్వభావం కాలానుగుణంగా మారటం కూడా గమనించవచ్చు. బ్రిటిష్‌వారి హయాంలో నూరింట పది మంది అక్షరాస్యులుండే వారు. ఆ పది మందిలో ఒకటి మాత్రమే స్త్రీ అయి ఉండేది. ఆడవాళ్లుకూడా మగవాళ్ళతోబాటు చదవటం ప్రారంభించేసరికి విద్యాలయాలసమస్య పురుషులతో బాటు స్త్రీలదికూడా అయింది. ముప్ఫై ఏళ్ళ క్రితం ఉద్యోగసమస్య పురుషులదిగా మాత్రమే ఉండేది. ఇంకో ముప్ఫై ఏళ్ళకు అది స్త్రీ పురుషులను సమంగా బాధించవచ్చు. ఒకప్పుడు కార్మికులుమాత్రమే సమ్మెలు చేసేవారు. దేశం స్వతంత్రమయాక మేష్టర్లూ, డాక్టర్లూ, అఖరుకు పోలీసులూకూడా సమ్మె చేపట్టారు.

వ్యక్తి సమస్యల లాగే సాంఘిక సమస్యలు కూడా కొన్ని కొద్దిశ్రమతో పరిష్కారమైతే మరి కొన్ని విప్లవాలకు దారితీస్తాయి ఈ సమస్యలు స్పష్టమైన వర్గస్వభావం కలవి అయినప్పుడు వీటి పరిష్కారానికి ఇతరవర్గాల ప్రతిఘటన విధిగా ఉంటుంది. ఇది ధనికవర్గాల పత్రికలలో సంపాదకీయాల రూపంలో వుండవచ్చు. లేదా అమెరికాలోలాగా తుపాకీ గుళ్ళ రూపంలో ఉండవచ్చు. ఎంతో దూరం పోనవసరం లేదు, సోషలిస్టుపంథాలో ప్రయాణించే మనదేశంలో ప్రతి ఒక్కడికీ తిండీ, బట్టా, పనీ ఏర్పాటు అయే విధంగా ఒక మంచి పథకం ఆలోచించండి. అది అమలు కావటానికి రక్తపాతం జరిగి తీరుతుంది.

మనం చరిత్రను సరిగా అర్థం చేసుకోలేక క్రమంగా మానవుడు వివేకాన్ని సంపాదించుకుని, తనలో పెంపొందే మానవత్వంతో జీవితాన్ని సంస్కరించుకుంటూ ముందుకు పోతున్నాడని భ్రమపడతాం. చిల్లర దొంగతనాలకు కూడా చేతులు నరికెయ్యడమూ, చచ్చిన భర్తలతో బాటు బతికున్న భార్యలను తగలెయ్యటమూ,

విద్యావిముఖులైన పిల్లలకు బండకొయ్యలు వెయ్యటమూ మొదలైన అమానుష ఆచారాలు వెనకబడటం కేవలమూ మనిషిలో మానవత్వమూ, ధార్మిక దృష్టి పెరగడంచేత జరగలేదు కూతుళ్ళను అల్లుళ్ళతోబాటు కాలిపోనిచ్చిన తల్లి దండ్రులు రాక్షసులుకారు. సతీసహగమనం నిషేధించబడితే ధర్మచ్యుతి జరుగుతున్నదని వాపోయినవాళ్ళూ మనుషులే అయితే వారి ఆలోచనలో ఈనాడు మనం ప్రదర్శించేపాటి మానవత లేదు. అది ఆనాటి సామాజిక వ్యవస్థలోనేలేదు

రాను రాను సమాజంలో వితంతువులకు మార్కెట్ ఏర్పడింది. బుర్రగొరిగి, తెల్లముసుగువేసి , ఒంటిపూట తిండిపెట్టి , చాకిరీ చేయిస్తే వితంతువనే మృగం ఆర్థికంగా ఎంతో ఉపయుక్తమైనది ఈ విషయం స్పష్టమయాక ప్రజలలో మానవత ముందడుగువేసి, సతీసహగమనాలు అంతమయాయి. మరికొంతకాలానికి సమాజంలో మీనాక్షులూ , భ్రూణహత్యలూ పెద్దసమస్యగా పరిణమించాయి. సామాజిక స్వభావాలు కొన్ని అయినా పాశ్చాత్య బూర్జువా లక్షణాలను సంతరించుకున్నాయి. అవకాశం దొరికేసరికి స్త్రీ పునర్వివాహోద్యమం ముందడుగువేసింది.

అమెరికాలో బానిసత్వం అంతం కావటానికి అబ్రహం లింకన్‌గారి భూతదయే కారణమని పాఠ్యపుస్తకాలలో చెబుతున్నారు. బానిసత్వం అమలులో వున్నంత కాలమూ లింకన్ వంటి భూతదయాపరుడు అమెరికాలో పుట్టలేదనుకోవాలి. అంతకన్న, ఉత్తరరాష్ట్రాలలో పారిశ్రామికాభివృద్ధి కొనసాగినందువల్లా, వాటిలోపని చెయ్యడానికి స్వతంత్ర కార్మికులు విరివిగా కావలసివచ్చినందువల్లా బానిసత్వం అంతమయిందనుకోవటం చాలారెట్లు తేలిక

ఇటీవల నీగ్రోల పౌరహక్కులను గురించి కొంచెం జాస్తిగానే వినవచ్చింది. అమెరికా పాలకుల అభ్యుదయ దృక్పథాన్ని ఘనంగా కీర్తిస్తూ ప్రపంచంలో చాలాపత్రికలు రాశాయి కానీ, ఈ అభ్యుదయ దృక్పథానికి అసలు కారణంఅనేక ఆఫ్రికా దేశాలు ఇటీవల స్వతంత్రం కావటమూ, వాటితో స్నేహ సంబంధాలు అమెరికాకు ఆర్థికంగా అవసరం కావటమూనని అమెరికాలోని నీగ్రో నాయకులు అంటున్నారు. కాదనటానికి మన మెవరం?

మానవతను కించపరచటానికి ఇదంతా చెప్పటంలేదు, మానవసమాజంలో మానవత్వం పెరగటమే అభివృద్ధికి గీటురాయి. కాని మానవత స్వయంభువు కాదు. దానికికూడా భౌతికమైన ఆధారాలుండాలి. ఈ రకం సమాజంలో ఇంతకుమించి మానవత్వం సాధ్యంకాదు అని ఖచ్చితంగా చెప్పవచ్చు. అనేక సాంఘిక దురన్యాయాలతో కూడిన ఈ మనసమాజంలో మనమంతా దుర్మార్గులమే. మానవత హెచ్చుగాగల వాళ్లెవరైతే ఉన్నారో వాళ్లు ఈ సమాజం పునాదులను మార్చటానికి కృషి చేసి, తమ ప్రాణాలనుకూడా బలిపెడుతున్నారు. అలా బలి అయేవాళ్ళ పక్షాన ఉండటానికి తగిన మానవతకూడా మనలో లోపిస్తున్నది.

పాలకవర్గంలో ఎంత అవినీతిని మనం సహిస్తున్నాం రాజకీయవాదాల సాకుతో ఎలాంటి నీచులకు మనం భజన చేస్తున్నాం, అసహాయులైన హరిజనులపైనా, గిరిజనులపైనా నగ్నమైన హత్యాకాండ సాగుతుంటే మనం ఎంత ఓర్పుతో దాన్ని సహిస్తున్నాం! మనలో మానవత లోపించిందని ఒప్పుకుందామా ?

రష్యాలో సోషలిజం అమలు జరిగాక సుఖవ్యాధులూ, పడుపువృత్తీ అంతమయాయట ఇది ఎలా సాధ్యమయినదీ సిన్ అండ్ సైన్స్ అనే పుస్తకంలో వివరించి వున్నది. ఒక్క సారిగా రష్యాలో అందరూ నీతిపరులై పోయారా? అది సాధ్యమా? అసలు జరిగినదేమిటంటే సోవియట్ వ్యవస్థలో ప్రేమవివాహాలకు తప్ప మరొక రకం వివాహానికి ఆస్కారం లేకుండా పోయింది

1960 లో చీనా పర్యటించివచ్చిన ఎడ్గర్‌స్నో ది అదర్‌సైడ్ ఆఫ్ ది రివర్ అన్న పుస్తకంలో చీనాలో ఈనాడు వ్యభిచార సమస్య వున్నట్టు కనబడదని ఒప్పుకున్నాడు. చీనా కమ్యూనిస్టులు అంత నీతిమంతులా? వాళ్ళు ప్రభుత్వంలోకి వస్తూనే కొన్ని లక్షల పాత కాలపు వివాహాలను రద్దు చేయించారు. వేశ్యావృత్తిలో వున్నవారందరినీ పెళ్ళిళ్ళు చేసుకోనిచ్చారు, సోషలిస్టు పునాదిమీద, సమాజంలో వ్యభిచారాన్ని నిర్మూలించారు. చీనాలో వ్యభిచారం దాదాపు లేకుండాపోవడానికి ఇవే కారణాలేమో! మూరుటన్నుల మానవతా వాదం కంటే వీశెడు సాంఘిక భౌతిక పునాది హెచ్చు మానవతకు దారితీస్తుందేమో.

*ఆంధ్రజ్యోతి దినపత్రిక, 19-7-68*

# 10. నాకాలేజీల్లో నేను

నామొదటి కాలేజీ గుంటూరు ఏ.సీ. కాలేజీ.

1925-27లో ఇందులో ఇంటరు చదివాను. హాస్టల్లో వుండేవాణ్ణి. తెలికిచర్ల వెంకటరత్నం గారు మా వార్డెన్. మాకు తెలుగు నాన్‌డిటేల్డ్ కూడా చెప్పేవారు. వారికింద రాజశేఖర చరిత్ర, గోరా మొదటిభాగమూ చదివాను. నాకు పుస్తకాలు నగం నగం చదవటం చిరాకు . గోరా రెండో భాగంకూడా తెప్పించి చదివాను.

వెంకటరత్నం గారికి అప్పటికింకా పెళ్ళి కాలేదు మా హాస్టల్లోనే వారికో గది వుండేది. ఆ గదిలోకి రెండు మూడుసార్లు గిడుగు రామ్మూర్తి పంతులుగారు వచ్చి రెండేసి మూడేసి రోజులున్నారు. రామ్మూర్తి పంతులు గారు మా కాలేజీలో వ్యావహారిక భాషమీద ఉపన్యాసం ఇచ్చి, అట్టెడు అనే మాటకు ద్వితీయావిభక్తి బహువచనం ఏమిటి? ప్రయోగం చూపించు! అని గట్టిగా అడిగారు. నాకు విషయం పాడగట్టింది.

వెంకటరత్నం గారి మూలంగా ఒకసారి దేవులపల్లి కృష్ణశాస్త్రి గారు మా హాస్టలుకు వచ్చి చాలా పద్యాలు చదివారు. ఎంకి పాటలు పాడారు. నిజంగానే పాడారు

నాతో కలిసి ఇంటరు చదివిన వాళ్ళలో కపిల కాశీపతి ఒకడు కాశీపతి గురించి ప్రత్యేకంగా ఎందుకు చెప్పుతున్నానంటే కాశీపతి ఇంటర్ చదువుతూ బళ్లారి రాఘవాచారి గారి ఒథెల్లో నాటకంలో ఎమిలియా వేషం వేశారు. ఆ నాటకం చూడటానికి మేం కొందరం బెజవాడ వెళ్ళాం.

ఆమంచర్ల గోపాలరావు నాకు ఒక ఏడు సీనియర్ my nuptial marriage will take place in a carriage అని కార్డులు అచ్చు వేయించి, దానికింద తన క్లాస్‌మేటు పేరు పెట్టి కాలేజీ నుంచి వెళ్ళగొట్టించుకొని నెల్లూరులో మళ్ళా రెండో ఏడు చదివాడు ఆ రోజులే వేరు .

నేను ఇంటర్ చదివేటప్పుడే సి. ఎస్ ఆర్. ( 1 9 ఏళ్ళ కుర్రాడు) మా హాస్టల్‌కు వచ్చాడు. అక్కడ అతని వూరు కుర్రాళ్ళు ముగ్గురు, నలుగురు వుండేవాళ్ళు . సి. యస్. ఆర్. గుంటూరులో రెండు నాటకాలు ఆడారు. మేము గేట్లల్లోను అక్కడా నిలుచున్నాము. నాటకాలకు డబ్బు రాలేదు.

నాకు మొదటినుంచి ఫిజిక్స్ అంటే యిష్టం, కెమిస్ట్రీ అంటే కాస్తభయం. బి ఏలో ఫిజిక్స్ తీసుకో దల్చుకున్నాను. ఫిజిక్స్ బి ఏ రాజమండ్రిలోను, విజయనగరంలోను మాత్రమే ఉండేది విజయనగరంలో 1 9 2 7 బ్యాచీ డాక్టర్ ఎ .ఎల్. నారాయణగారిదని తెలిసింది. అక్కడకి పరుగెత్తాను.

విజయనగరం మహారాజా కాలేజీలో చదివినందుకు నాకు ఇప్పటికీ వల్లమాలిన గర్వం. అక్కడ నా లెక్చరర్లలో డాక్టర్ నారాయణ గారే కాక, శొంఠి పురుషోత్తంగారు, డాక్టర్ బుర్రా శేషగిరి రావుగారు , కిళాంబి రంగాచార్యులు గారు కూడా ఉండే వారు. ఒక సారి అటువంటి వారికి శిష్యుడైనవాడైనా విర్రవీగ వచ్చు.

అందులో రంగాచార్యులు గారంటే నాకు ప్రత్యేక ఆకర్షణ వుండేది . మా కాలేజీ డే కోరుకొండ ప్యాలెస్‌లో జరిగినప్పుడాయన విద్యార్థుల నడిగి సిగిరెట్లు తీసుకొని కాల్చడమే గాక వాళ్ళతో చీట్లపేక కూడా ఆడాడు. ఆయనకు సిగరెట్టు అలవాటు లేదని నాకు తెలుసు, ఏం మనిషి!

మా విజయనగరం కాలేజీకి కూడా దేవులపల్లి కృష్ణ శాస్త్రి గారు వచ్చి ఆనాటి ఆధునిక కవిత్వం చదివారు. బుర్రా శేషగిరిరావు గారు ఆ మీటింగుకు రాలేదు. తరువాత క్లాసులో భావ కవిత్వం గురించి ఆయనను అడిగితే భావ కవిత్వం లిరికల్ పోయట్రీ కాదు అన్నారు

ఒక సారి మా కాలేజీకి కోడి రామ్మూర్తిగారు వచ్చి ఉపన్యాసం ఇచ్చారు. ఆయన డ్రిల్ మేష్టర్‌ను పిలిచి మాకు హనుమాన్ బస్కీ చేసి చూపమన్నాడు. పాపం డ్రిల్ మేష్టరు చూపాడు. ఇది హనుమాన్ బస్కీ కాదు, మంకీ బస్కీ అన్నాడు కోడి రామ్మూర్తి. కోడి రామ్మూర్తి మీదికి ఒంగి నప్పుడల్లా పెద్ద బల్ల కీళ్ళన్నీ వదులుగా

వున్నట్టు ఆడటం గమనించాను తరువాత ఎవరూ చూడకుండా దాన్ని ఆడించాలని చూస్తే అది చచ్చినా ఆడలేదు ఎట్లాగైనా ఏనుగును మోసిన వాడి దారి వేరు గదా అనుకున్నాను

మల్లాది విశ్వనాధశర్మ గారు దాదాపు రోజూ కనబడేవారు ఆయనకు నేను తెలీదు. కాని నేను తగుదునమ్మా అని కథలు రాయడం మొదలు పెట్టాక ఆయన వద్దనుంచి అనుకోని ప్రశంసతో ఉత్తరం వచ్చింది డంగయిపోయాను ఆయన హాస్యనాటకాలు ఎన్నో చదివి ఆనందించి కూడా ఆయినకు ఒక్క కార్డు ముక్క రాసిన పాపాన పోలేదు నేను తరువాత దాదాపు 15 ఏళ్ళ తరువాత మేం కలుసుకోవటం జరిగినప్పుడు ఆయనకు నామీద వుండే వాత్సల్యం పెరిగింది కాని తరగలేదని తెలిసింది

విజయనగరంలో వుండగా మా హాస్టల్ డేకు భమిడి పాటి వారి 'బాగు బాగు' ఆడాం. ఎలా జరిగిందో తెలీదు గాని దాన్ని నిర్వహించే భారం నా మీద పడింది మేమప్పుడు ఆడిన నాటకం కామేశ్వర రావుగారు స్వయంగా ఆడించిన దానికన్నా బాగున్నదన్నవారున్నారు.

కిటుకేమిటంటే మాకు అద్భుతమైన 'భాగయ్య' దొరికాడు. అతన్ని చూసినాకా మరొకర్ని ఆ పాత్రలో ఊహించటం సాధ్యం కాదు. 40 ఏళ్ళ అనంతరం ఆనాటి మా 'బాగుబాగు' ప్రదర్శనను ఇంకా జ్ఞాపకం పెట్టుకుని మెచ్చుకునేవారు కనీసం ఒకరున్నారు!

నా మూడో కాలేజీ బెనారస్ హిందూ యూనివర్శిటీలోని సైన్స్ కాలేజీ ఎమ్ ఎస్సీ ఫిజిక్స్ క్లాస్‌లో మేం తొమ్మిది మందిమి. కాని మా సీనియర్ క్లాసులో ముగ్గురే ఉండేవారు, అందులో ఒకరు ఆంధ్రుడు, మరొకరు బెంగాలీ లాగుండేవాడు పేరు రాజేంద్ర అతని ఫైనల్ పరీక్షలు ఇంకా మూడు నెలలు కాబోలు ఉన్నాయనగా ఒకరోజు నాదగ్గిరికి వచ్చి చెయ్యి యిచ్చి ''నేను వెళ్ళి పోతున్నాను'' అన్నాడు.

'' ఎక్కడికీ'' అని అడిగాను.

''మా అన్నతో పారిస్ పోతున్నాను'' అన్నాడు.

''మరి పరీక్షలు?'' అన్నాను.

''నాకు ఈ పరీక్షలతో ఏం పని'' అన్నాడు నిర్లక్ష్యంగా

అప్పటికి గాని నాకు తెలియదు, అతను ఉదయశంకర్ తమ్ముడని ఈ సంగతి మొదటే తెలిసి వుంటే అతనితో మరింత స్నేహం చేసి ఉదయ శంకర్ గురించి ఎన్నో విషయాలు తెలుసుకుని వుండేవాణ్ణి . ఆర్థిక కారణాలవల్ల సరిగా రాజేంద్ర చదువు మానిన సంవత్సరం తరువాత నేనూ ఎం. ఎస్సీకి ఉద్వాసన చెప్పి ఇంటికి వచ్చేశాననుకోండి.

నేను కాశీలో వుండగా చాలా జరిగాయి.

జవహర్‌లాల్ అధ్యక్షతన ఇండియన్ నేషనల్ కాంగ్రెస్ సంపూర్ణ స్వాతంత్ర్య లక్ష్యాన్ని ప్రకటించింది

భగత్‌సింగ్‌ను, దత్తునూ ఉరి తీసారు దత్తు చెల్లెలు వచ్చి హాస్టల్ వరండా మెట్లమీద నిలబడి వణుకుతున్న గొంతుతో చుట్టూ మూగిన విద్యార్థులతో మాట్లాడింది మా రక్తం ఉడికి పోయింది

హిందూ ముస్లింల కొట్లాటలు జరిగాయి యూనివర్శిటీ మూసేశారు కొట్లాటల మూలంగా కాదు- ఉప్పు సత్యాగ్రహం మూలంగా

వినాయక దామోదర సావర్కారు తమ్ముడు వచ్చి ' ఇంగ్లీషు వాళ్ళు ఇవాళ కాకపోతే రేపు పోతారు. మనతో వుండే శత్రువులు ముస్లింలు' అని హితబోధ చేశారు.

ఒక రోజు విఠల్‌భాయి పటేల్ వచ్చి కొత్తగా కట్టిన జిమ్నాసియం హాలులో we want freedom -freedom with honour అని గర్జించాడు. సింహంలాంటి మనిషి చాలా పొట్టివాడు, పెద్ద తల, సింహం జూలు లాంటి గడ్డం, భయంకరమైన కళ్ళు.

ఒక రోజు చాపకూడు ఏర్పాటు చేసి పాకీ వాళ్ళ చేత వడ్డన ఏర్పాటు చేశారు. పండిత మాలవీయ రాడనుకున్నాం వచ్చాడు. హిందూ యూనివర్శిటీలో నేను ఏం చదువుకున్నానో నాకిప్పుడు జ్ఞాపకం లేదు. మానసిక స్వాతంత్ర్యం నేనక్కడ అనుభవించినట్టుగా పూర్వంగాని, ఆతర్వాత గాని అనుభవించలేదు.

*ఆంధ్రజ్యోతి వారపత్రిక, 11-12-1970*

# 11. వ్యష్టి - సమష్టి

అతి స్వల్ప సంఖ్యలలో ఉండిన ఆది కాలపు మురాలలో వ్యష్టి భావాలకూ, సమష్టి భావాలకూ తేడా ఉండే అవకాశం లేదు. ఒక సంఘంగా వాళ్ళ సమైక్యత సమష్టి భావాలు ఉమ్మడిగా ఉండటం మీదనే ఆధారపడి ఉండేది. ఆ భావాలు దాదాపు అన్నీ విశ్వాసాలే అయి ఉండాలి. ఎందుకంటే ఆ దశలో వాళ్ళకు తమ అనుభవాన్ని శాస్త్రీయంగా సూత్రీకరించే శక్తి చాలా తక్కువగా ఉండి ఉంటుంది.

అయితే ఒకే విధమైన భౌతిక వాతావరణంలో జీవించే మురాలు తమ వ్యక్తిత్వాన్ని చంపుకోకుండానే పరస్పర సంబంధాలు కలిగించుకొని, పెళ్ళిళ్ళద్వారా చుట్టరికాలు ఏర్పాటు చేసుకునే ఒకేజాతికి చెందిన వేరువేరు తెగలుగా పరిణమించే అవకాశాలు ఉండేవి. కొన్ని ప్రాంతాలలో ఈ మురాలు ఆహారంకోసం మృగాలను వేటాడటానికి ఏకమై, తమ ఆర్థిక సమర్థతను పెంపొందించుకున్నట్టు కనబడుతుంది.

అయినప్పటికీ ఏమురాదేవత ఆ మురాదే. దేని నిషేధాలు (raheus అనవచ్చు. దాని అసలు అర్థం నిషేధాలు కాకపోయినా) దానివే. ఈ దశలో కూడా ప్రతి ఒక్క తెగలోనూ వ్యష్టి సమష్టి భావాలమధ్య వైషమ్యం లేదు

ఈ కారణం చేతనే పేరుపేరు నైసర్గిక వాతావరణం గల జాతుల మధ్య సఖ్యత అసాధ్యమయింది ఎందుకంటే జాతులు వేరైనప్పుడు వాటి తెగల వ్యష్టి-సమష్టి భావాలు భిన్నంగా వుండక తప్పదు, ఆదశలో స్వజాతి వాడికి అన్యాయం చెయ్యడం భయంకరమైన నేరం కాని ఇతర జాతివాణ్ణి చంపడం ఎంతమాత్రమూ నేరంకాదు ఒకజాతికి చెందిన గుణాలు అత్యంత సన్నిహిత మైనవి కాని ఒకజాతికి మరొక జాతి సహజ శత్రువు

ఇందుకు బలమైన ఆర్థిక కారణం ఉన్నది ఆదిమ జాతుల ఆర్థిక విధానం పరిణామ శూన్యమైనది. ఆహారం ఏరుకోవటమూ, వేటాడటమూ అన్నవి ఎదుగూ బొదుగూ లేనివి. అన్ని ప్రాంతాలు సహజాహార సమృద్ధి కలిగి ఉండవు వేటకు సమంగా అనుకూలించవు కొంచెం పచ్చగా ఉన్న జాతిని కటకటలాడే జాతి జయించగలిగితే రెండో జాతి మనుగడ కాస్త మెరుగవుతుంది నీజాతికి యుద్ధం చేసే అవసరం లేకపోతే, నీతో యుద్ధం చేసే అవసరం నీ పొరుగు జాతికి ఉండవచ్చు

( ఈపరిస్థితి, ఆటవిక దశనుంచి మనిషి నాగరిక దశకు మారిన తరవాత కూడా మార్పుచెందలేదు. అనాగరిక దశలో మనుషులు పశువుల పెంపకమూ, కొద్దిపాటి వ్యవసాయమూ నేర్చిన జాతులలో కూడా ఇతర జాతుల మీద దాడులు చేసి గోగ్రహణం చెయ్యటం జరిగేది. అలాటి దాడులను గోష్ఠి అనేవారట. వేదకాలపు ఆర్యులు కూడాను ఇంద్రుడి సహాయంతో శత్రు జాతుల గోవులను విడువకుండా కాజేశారు. అటు తరవాత నగరిక దశలో కూడా రాజుల ప్రాథమిక ధర్మాలలో ఒకటి ఇరుగు పొరుగు రాజులతో యుద్ధాలు చెయ్యటం )

వ్యష్టి - సమష్టి సమస్యను దాటి చాలా దూరం వచ్చాం ఇది సమస్యగా ప్రారంభమయింది తొలి అనాగరికత తోనే. ఆ దశను చేరుకొనే సరికి మానవుడు ప్రకృతి మీదపడి జీవించటంమానేసి, పశుపోషణతోనూ, ప్రాథమిక వ్యవసాయంతోనూ ఆహారోత్పత్తి సాగించాడు. ఈ విధంగా సాధించిన ఆర్థిక అదనపు శక్తితో అతను ఆటవిక దశలో ఉన్నవారిని తమ సమాజంలోకి నయానో, భయానో చేర్చుకోగలిగాడు. యుద్ధాలలో ఓడి పోయిన ఆటవికులను బానిసలుగా ఉపయోగించుకున్నాడు. కొన్ని ఆటవిక జాతులు తమ పరిస్థితి కన్న అనాగరికుల ఆర్థికస్థితి బాగున్న దనుకొని, కొత్త సమాజాలలో హీనస్థితి ఆమోదించి వచ్చినా వచ్చి వుండవచ్చు.

ఏమైనా మురాలదశా, సంఘాల దశా దాటి మానవుడు వర్గ వైవిధ్యం గల సమాజాన్ని ఏర్పరచి, దాని ఆర్థిక పునాది విస్తరింప జేశాడు. అయితే, ఈ మార్పునుంచి వ్యష్టి, సమష్టి భాగాల మధ్య వ్యత్యాసాలు ప్రారంభమయాయి. ఒకే సమాజంలో అనేక దేవతాశక్తులను ఆరాధించేవారు. అనేక వివాహాదిక ఆచార నియమాలుగలవారు, భిన్నమైన నమ్మకాలు గలవారు ఉండటం తటస్థించింది. ఈ భిన్నత్వంలో ఏకత్వం సాధించినది సమాజం లోని సమిష్టి ఆర్థిక కృషి ( మానవుడి అన్నిదశల లోనూ సంపద

ఉత్పత్తి అయినది సోషలిస్టు పద్ధతి లోనే అని నిరూపించవచ్చు, సంపద వినియోగం లోనే సామ్యవాదంలోపించింది )

వ్యష్టి సమష్టి భావాలమధ్య నూతన సమాజంలో ఏర్పడుతున్న వైవిధ్యాన్ని కొంతవరకు సరిచేసి, దాని మూలంగా తీవ్ర వైరుధ్యాలు తల ఎత్తకుండా చూడగలందులకు ఆ కాలపు అనాగరిక మేధావులు మతాలను సృష్టించారు. మత విశ్వాసాలు అన్నవి ఆటవిక దశకు చెందిన భావాలలో నూతన సమాజానికి అనుకూలమైన సంస్కరణలు కలిగించడమేగాక, వ్యష్టి భావాలను సమష్టిమత భావాలతో రాజీపరుస్తాయి ఈ రాజీ గురించి బలంగా ఉండగలందులకు సమాజంలోని వివిధ వర్గాల (మాజీ జాతుల)వారి ఆరాధనలను సమన్వయించటానికి దేవతలమధ్య పెళ్ళిళ్ళూ, వావి వరసలూ, తప్పనిసరి అయితే శత్రుత్వం స్థానంలో మైత్రి సృష్టించారు. ఈ విధంగా శిలాయుగపు మాతృకలు లోహయుగపు కర్షక దేవతలకు భార్యలూ, తల్లులూ అయ్యారు. ఉత్తరాన వెలసిన దేవతలకు దక్షిణాన వెలసిన దేవతలు కొడుకు లయ్యాయి. ఆదరాబాదరా పురాణరచన సాగింది. సమాజం విస్తరించిన అనంతరం పురాణాలను కలబోసి చూస్తే ఒక్కొక్క దేవుడికీ ముగ్గురు తండ్రులూ, ఆరుగురు తల్లులూ ఉండినట్టు బయటపడింది

అయినా పని జరిగిపోయింది. ఎందుకంటే, సామాజిక పరిణామం పుంజుకొన్న కొద్దీ వ్యష్టి, సమష్టి, విశ్వాసాల మధ్య అగాధంలాంటి తేడాలు సరి చెయ్యడం అసాధ్యమయింది. ఈ వైరుధ్యాన్ని అదుపులో పెట్టటానికి సమాజపు పెత్తందారులు తగిన అధికారాలను. అంగబలాన్నీ హస్తగతం చేసుకుని, దండనీతితో అధిక సంఖ్యాకుల మనసులకూ అవసరమైనప్పుడు శరీరాలకూ సంకెళ్ళు తొడిగారు.

నాగరిక యుగంలో పెత్తందార్ల దమన దక్షత ఒక విచిత్రమైన సంస్కృతిగా రూపొందింది. సమాజ స్థితి వీలయినంతస్థిరంగా ఉండగలందులకు మానవుల మానసిక చైతన్యం చీల్చబడింది. వ్యష్టి సమష్టి భావాల మధ్య ఒక కృత్రిమమైన రాజీ పద్ధతిని రాజభక్తి, దేశభక్తి, దైవభక్తి, ధర్మం, సత్యం, త్యాగం, పుణ్యం, పాపం అనే సవాలక్ష కృత్రిమ సిద్ధాంతాలతో ఒక గొప్ప సంస్కృతిగా రూపొందించారు. దీని ఫలితంగా వ్య ష్టి భావాలు సమాజ స్థిరత్వానికి అపాయకరంగా పరిణమించే టప్పుడు సమష్టి భావాలను రెచ్చగొట్టవచ్చు.

ఉదాహరణకు, సామాజిక దోపిడీ పరాకాష్ఠ అందుకుని, ప్రతి ఒక్కడూ నా గతి ఇలా ఎందుకయింది? అని ప్రశ్నించుకుని తిరగబడే తరుణంలో పొరుగుదేశం మీద యుద్ధం తెచ్చి, దేశ భక్తి గీతాలు రేడియోలో హోరెత్తించి సమష్టిభావాలను రగిలించ వచ్చు. అదే విధంగా కమ్యూనిస్టు సిద్ధాంతాలు సరి అయినవని మధ్యతరగతి వాళ్ళు సైతం గ్రహించి, మత్తు వదిలించుకునే సమయంలో కమ్యూనిస్టు దేశాలలో వ్యక్తి స్వాతంత్ర్యం లేదు అని ఊదరపెట్టవచ్చు. ఆ మాటలు నమ్మకం కలిగే లాగా

ప్రచారం చెయ్యొచ్చు. ఈనాటి జలగల చేతిలో అధికారాలూ, మారణాయుధాలూ, పోలీసు -సైనిక బలగాలూ మాత్రమే గాక, రేడియో, పత్రికలూ, టీ.వీ లాటి ప్రసార సాధనాలు కూడా ఉన్నాయి మరి!

దాదాపు పదివేల ఏళ్ళుగా మనుషులు తమమనస్సులను చీల్చుకొని, వ్యష్టి సమష్టి తేడాలతో రాజీపడి బతుకుతూ బతక లేనప్పుడు తిరగబడుతూ, కొంత అభ్యుదయం సాధిస్తూ, అందుకోసం తమ రక్తాన్ని ధారపోస్తూ వస్తున్నారు. ఈ పదివేల ఏళ్ళ చరిత్ర చెరిపేసి, వ్యష్టి, సమష్టి, భావాలను ఏకం చేసే ప్రక్రియ ప్రారంభమయింది. ఇది ప్రారంభమై నూరేళ్ళు దాటిందనుకున్నా, త్వరలో పూర్తి అయ్యేది కాదు. మార్క్సిస్టులూ, విప్లవవాదులూ తొందరపడటం సహజమే. కాని రాజకీయ విప్లవం వెంటనే సాధించినా, వ్యష్టి, సమష్టి, భావభేదం పూర్తిగా అంతరించటానికి అనేక శతాబ్దాలు పట్టుతుంది. ఆ సంగతి స్పష్టంగా గ్రహించిన వాడు మావో ఒక్కడే లాగ కనబడతాడు.

ఈ వ్యష్టి- సమష్టి భావ వైరుధ్యం మనుషుల బుర్రలనుంచి ఒకంతట తొలగలేదు. పూర్వశిలాయుగ సంస్కృతిలో జీవిస్తున్నవాళ్ళు ఇప్పటికీ భూమిమీద అక్కడక్కడా ఉన్నారు కలకత్తకాళీ, ఆంధ్రుల బాలా త్రిపురసుందరీ, మరాఠీవాళ్ళ జోగూబాయిలాంటి నూతన శిలాయుగ దేవతలకు భారీ ఎత్తున ఇంకా పూజలు జరుగుతూనే ఉన్నాయి. ఈ కాలపు శాస్త్రవేత్తలు వర్గ సమాజం కోసం వచ్చిన మతాలకు, వర్గరహిత సమాజాలవారి అభౌతిక విశ్వాసాలకూ తేడా తెలియక శిలాయుగం వాళ్ళకోసం (శ్రద్ధాయం) జరిపిన తంతు కూడా మతమే అంటున్నారు. నా ఉద్దేశంలో అది మతం అని పించుకోదు. వివిధ విశ్వాసాలను ఏకం చేసినంత కాలమూ నిజమైన మతం మానవ సమాజ పురోగమనానికి గొప్ప సేవ చేసింది. మతాల మధ్య దారుణ యుద్ధాలు ఆరంభమయ్యే సరికి మతం సంఘ విద్రోహక శక్తిగా మార్పు చెందింది.

ఈనాడు మనం భావ వైరుధ్యం మనుష్యులలో చిత్రమైన రూపాలలో చూడవచ్చు. ఆచార వ్యవహారాల దగ్గిరికి వచ్చేసరికి మనుషులు తమకు నమ్మకం లేక పోయినా సమష్టి విశ్వాసాలను అనుసరిస్తారు. నూటికి 90 మంది ఏడుస్తూ తద్దినాలు పెడతారు. ఒక చోట రిజిస్టరు పెళ్ళిచూసి చిత్తశుద్ధి గల ఒక పెద్దమనిషి, పెళ్ళిళ్ళు ఇలాగే జరగాలి కాని నేను చెయ్యలేను నాకు ధైర్యం లేదు అన్నాడు.

సమష్టి భావాలు ఇలావుంటాయని ఊహించుకొని, వాటితో ఏకీభవించనివాళ్ళు అనేక వందల మంది తమ సొంత భావాలను అణిచి పెట్టుకుని, తన ఊహలో ఉన్న వ్యష్టి భావాలనే అమలు చేస్తారు. ఇది అనేక మార్లు నా అనుభవం లోకి వచ్చింది. 52 ఏళ్ళ క్రితం ఒక వితంతువు పెళ్ళాడింది. ఆమెను తల్లి కూడా ఇంట్లోకి రానివ్వటానికి భయపడింది అందరూ పొడిచి చంపేస్తారని భయం అలాంటి భయం లేని బంధువు ఆమెను తన ఇంటికి తీసుకుపోయి ఆతిధ్యం ఇచ్చాడు ఎవరూ అభ్యంతరం చెప్పలేదు.

వితంతు వివాహానికి అందరూ అనుకున్న వ్యష్టి వ్యతిరేకతలేదు. సమష్టి వ్యతిరేకత కేవలమూ భ్రమఅని తేలింది.

ఇలాంటి భ్రమలు మనుష్యులను దెయ్యాల్లా పట్టుకోక పోతే తిరపతి మొక్కులూ, జాతకాలూ, మౌఢ్యాలూ, కమ్యూనిజం లాటివాటిని గురించి భయాలూ చాలా భాగం నయమవుతాయి. సమష్టి పేరున వేల కొద్దీ మనుషులు తమ వ్యష్టి భావాలను చంపుకుని వందల కొద్దీ అర్థం లేని పనులు చేస్తున్నారనటానికి సందేహం లేదు.

*ముద్రణ చార్వాక, మాసపత్రిక, డిసెంబర్ 1979*

# 12. పుచ్చి పోయిన జీవితం

అది కృతయుగం అనండి, స్వర్ణయుగం అనండి, ధర్మం నాలుగు పాదాల నడిచిందనండి, ఏమన్నా చరిత్రలో మానవ సమాజాలు బలంగా పుష్టిగా, మానవత్వపు విలువలు అని మనం అనుకునేవి అమలులో ఉండినకాలాలు కొన్ని కనిపిస్తాయి. దానికి విరుద్ధంగా సమాజాలు పుచ్చిపోయి అతి స్వల్ప అఘాయిత్యాలకు కూడా తట్టుకోలేక, శిథిలమైపోయిన సందర్భాలూ కనిపిస్తాయి – యాదవ కులంలో ముసలంలాగా ఆదిమ మానవ సంఘాలను దృఢంగానూ, పుష్టిగానూ ఉంచినవి సాంఘిక నియమాలు, వాటిని అమలుపరచటానికి పెద్ద శిక్షాస్మృతులు కూడా లేవు. అన్నిటినీ మించిన శిక్ష సంఘ బహిష్కరణం. అది ఆనాటి పరిస్థితులలో మరణదండన లాటిదే గనక సాంఘిక నియమాలను ఎవరూ ఉల్లంఘించేవారు కారు.

అయితే, నాగరికత పెరిగి సమాజం లోకి అనేక సంఘాలు వచ్చి చేరి, సంపద ఉత్పత్తి అయే క్రమంలో శ్రమ విభజన ఏర్పడి, అందులో ఎక్కువ తక్కువలూ, శ్రమదోపిడీ, దానితోబాటు సామాజిక దురన్యాయాలూ పుట్టుకొచ్చినాక, సమాజం విచ్ఛిత్తి పొందటానికి తగినవైరుధ్యాలూ, సమాజం ఏకంగా ఉండటం అవసరం అయిన ఆర్థిక అవసరాలూ ఒకే సమయంలో ఏర్పడ్డాయి. సామాజిక ఐక్యతకోసం అంతర్గత వైరుధ్యాలను అణచిపెట్టటానికి రాజకీయ వ్యవస్థా, శాసనాలూ, శిక్షా విధానాలూ అవసరమయాయి. అంటే మనుషులు రెండు రకాల కట్టుబాట్లను పాటించటం జరిగింది: ఒకటి, సమాజానికి సహజ శక్తిని కలిగించే సంఘనియమాలు, రెండు, అవసరమైతే దౌర్జన్యాన్ని ప్రయోగించగల శాసనాలు.

ఏకాలంలో కూడా, సంఘనియమాల కున్న బలం శాసనాలకు లేదు. ఈనాటికి కూడా, అత్యధిక సంఖ్యాకులకు శాసనాలతో పరిచయం లేదు. జనసామాన్యం సంఘ నియమాలలో మాత్రమే న్యాయం చూడగలరు. అయితేసమాజం మారుతున్న కొద్దీ

ఆ మార్పుకు అనుగుణంగా సంఘనియమాలు కూడా మారాలి లేకపోతే వాటి బలం నశిస్తుంది. వాటిని జనం పాటించటం మానేస్తారు ఆ స్థితిలో సంఘం పుచ్చిపోకుండా రాజకీయ శాసనాలు ఆపలేవు

ఈనాడు విరివిగా జరుగుతున్న రెండురకాల నేరాలను గమనిస్తే ఈవిషయం స్పష్టమవుతుంది

ఒకటి బలవన్మైథునాలు - రేప్‌లు స్త్రీలను చెరచినవాళ్ళు ఏ కాలంలోనూ వుండే వుంటారు మరీ ప్రాచీన కాలంలో బృహస్పతి, గర్భవతిగా ఉన్న తన తమ్ముడి భార్యతో బలవంతంగా సంభోగించ యత్నించినట్టు మనకు రికార్డు వున్నది అయితే సనాతనులు కాదన్నప్పటికీ, మన పూర్వీకులకు కూడా ఒక ఆటవిక దశ వుండేదన్నది నిజమే గనక బృహస్పతిది అనాగరికచర్య అనుకోవచ్చు.

కాని నాగరికత వచ్చినాక, ఆడది సంభోగం కోరితే ఏ పురుషుడు గాని నిరాకరించటం ఎంత పాపమో, స్త్రీ ఇష్టానికి వ్యతిరేకంగా ఆమెతో రమించటం కూడా అంత పాపంగానే భావించబడేది రాక్షస రతి అమానుషంగానూ, అనాగరికం గానూ భావించబడేది. రంభను బలాత్కరించిన రావణుడి కథ పురాణాలలో వున్నది. కాని ఆ రావణుడే సీతను బలాత్కరించలేదు. బ్రహ్మశాపం అడ్డొచ్చిందన్నారు. గాని, ఆ మాట రామాయణంలో లేదు. రావణుడు రామాయణంలో గొప్ప రసికుడు రసికులు రాక్షసరతీ, రేప్‌లూ కోరరు

నా చిన్నతనంలో కూడా బలాత్కార మైథునం అన్నది సంఘ నియమాల దృష్టిలో ఎంత దారుణమైన నేరమంటే, 1925-26లో, నేను గుంటూరులో చదివే రోజుల్లో, ఒక పోలీసు ఎవరో ఖైదీ భార్యను బలాత్కరించాడు. ఆమె రిపోర్టు చేసేసరికి ఆ పోలీసువాడు తుపాకితో కాల్చుకుని ఆత్మహత్య చేసుకున్నాడు. అటుతరువాత ఇటీవలి కాలం వరకు- అంటే మనకు స్వాతంత్ర్యం బాగా వంటబట్టి పోలీసులు శాంతి భద్రతలు కాపాడటానికి బీద వాళ్ళ ఇళ్ళలో జొరబడి కుండలు పగలగొట్టటమూ, ఏంనేరం చేసినదీ చెప్పకుండా కనిపించిన వారిని చావగొట్టటమూ, క్లైమాక్స్ కింద ఆడవాళ్ళను రేప్ చెయ్యటమూ అనవాయితీ అయినదాకా పోలీసులు తమ నిత్యకృత్యాలలో బలాత్కార మైథునాలు కూడా చేర్చుకోవటం ఎరగను.

రెండోది హత్యలు గత జీవితంలో తనజాతివాణ్ణి చంపటం కంటె దారుణమైన నేరం ఊహించరానిది. గత నియమాలను శిరసావహించిన ఆఖరువాడు చార్వాకుడు- ధర్మరాజును, ' నువ్వు నీ జ్ఞాతులను చంపావు, నువ్వు చావాలి ' అంటాడు. గత జీవిత నియమాలు తెలిసిన ధర్మరాజు కాదనక, చావటానికి సిద్ధపడతాడు. అయితే గతజీవితం బ్రాహ్మణులు అమలులోకి తెస్తున్న వర్ణ వ్యవస్థకు విరుద్ధం. అందుచేత వాళ్ళు ధర్మరాజును చావవద్దని తామే చార్వాకుణ్ణి చంపుతారు!

వర్ణ వ్యవస్థ ఆరంభమైనాక హత్యలు పూర్వం అంత ఘోరానేరాలు కాకుండా పోయాయి వాటికేవో ప్రాయశ్చిత్తాలు కూడా కల్పించారు అన్ని హత్యలూ ఒకటి కావు కొన్ని హత్యలు నేరాలే కావు. తన తండ్రిని తిండికి మాడ్చి చంపిన అజాతశత్రువు ఉపనిషత్తులో పెద్దమనిషే రాజ్యాధికారం కోసం అడ్డం నిలిచిన తండ్రినీ, అన్నలనూ చంపటం మామూలు రాజనీతి అయింది మొగలుల్లో కూడా దాన్ని ఆమోదించి, భారతీయ సంప్రదాయాన్ని నిలబెట్టి నట్టున్నారు.

శిక్షాస్మృతిలో మరణదండన కూడా చేరింది దాన్ని ఈనాటి సంస్కారులు లీగల్‌మర్డర్ అంటున్నారు. ఈ సంస్కారుల ఒత్తిడితో కొన్ని దేశాలు మరణదండనను విసర్జించి, యావజ్జీవ ఖైదు అమలు చేస్తున్నాయి. కాని ఈ సంస్కృతికి అతీతంగా హత్యలు జరుగుతున్నాయి. పోలీసులు నక్సలైట్లను అడవిలోకి తీసుకుపోయి, కాల్చి చంపటం ఏరకమైన హత్య? బిల్లా రంగాలు దారిలో దొరికిన పిల్లలను కారులో తీసుకుపోయి, ఆడపిల్లను చెరచి, ఇద్దరినీ హత్య చేయటం ఏరకమైనహత్య? వీటి వెనక పైశాచికం తప్ప ఏరకమైన సంఘ నియమమైనా ఉండగలదా?

పైశాచికం ఆవహించిన చోట సంస్కృతి సమస్యలేదు. యాదవులు కొట్టుకు చచ్చేటప్పుడు వారిని వారించటానికి ప్రయత్నించిన కృష్ణుడు చివరకు అందరికన్నా ఎక్కువమందిని తానే చంపాడట!

ఏ రకం సంఘనియమాలకూ కట్టుబడకుండా పోయిన మనుషుల సంఖ్య నానాటికీ పాపం పెరిగినట్టు పెరగటం మనం రోజా పత్రికలలో చూస్తున్నాం. ఇది సమాజ విచ్ఛిత్తిని సూచిస్తుంది పరస్పరం నియమ రహితంగా ప్రవర్తించగల వాళ్ళు ఒక సమాజానికి చెందిన వాళ్ళు కారు, అదిమ జాతులలో కూడా మరో జాతివాణ్ణి చంపితే అదినేరం అయేది కాదు, కీర్తి కారణంగా కూడా ఉండేది.

రాజకీయ వ్యవస్థ ఏర్పడ్డాక చిల్లర మల్లర రాజులు ఇరుగుపొరుగు దేశాల పట్ల ఆ అదిమజాతి మనస్తత్వమే అవలంబించేవాళ్ళు. ఇరుగుపొరుగు రాజులతో యుద్ధాలు చేస్తూండటం క్షత్రియ ధర్మంగా కూడా చెప్పబడింది.

ఈ ఆదిమజాతి మనస్తత్వం ఇప్పుడు మళ్ళీ మన ప్రజాతంత్రం లోకి అడుగు పెట్టింది, అవతలి పార్టీ అభ్యర్థి గెలిచేటట్టుంటే వాణ్ణి చంపెయ్యి, ఈ పుచ్చి పోయిన వ్యవస్థను మార్చటానికి కృషి చేస్తున్నవాళ్ళను ఉగ్రవాదులని పేరు పెట్టి పోలీసుల చేత చంపించు.

మన దేశం కూడా, నాగరిక దేశాలలో లాగే, మరణ దండన ఎత్తేస్తే బాగుండేదా అని అనవసరంగా తర్జనభర్జనలు పడుతున్నారు. మరణ దండన ఎత్తివేయటంవల్ల చంపవలసిన వాళ్ళను చంపటానికి సవాలక్ష మార్గాలున్నాయి. పోలీసుల లాక ప్‌లో చచ్చినవాళ్ళను గురించి విచారణా, శిక్షా ఉండవు. ఎన్ కౌంటర్ చావులు సుప్రసిద్ధం అయ్యాయి. మరణదండన శిక్షాస్మృతి నుంచి ఎత్తేసి, మనంకూడా నాగరికులమే అనిపించుకోవటానికి నిజంగా నాగరికులం కానవసరంలేదు. నాగరికత ఈనాడు

అరువుసొమ్ము రేవు మునక. కలర్ టి వి రాబోతున్నది నూటికి అరవైమందికి తిండి లేకపోయినా మనం కృత్రిమ ఉపగ్రహాలు ప్రయోగించగలం

అందుచేత సంపసీతీ, సంఘనియమాలూ పిచ్చెత్తి సమాజానికి పునాది పిట్టి పోయి, భూకంపాలతో పోల్చదగిన సంఘటనలు సమిష్టి జీవితాలలో జరుగుతున్నా మనం నాగరికతగల వారిలాగా వేషం వేసే అవకాశం ఉంది

అలా వేషం వెయ్యటమే ఈనాటి సాంస్కృతిక కార్యక్రమమంతా - అకాడమీలూ, బహూకృతులూ, సన్మానాలూ, కళాప్రదర్శనలూ, కళాదౌత్యబృందాలూ అంతర్జాతీయ సాంస్కృతిక సమావేశాలూ! ఇలాంటివి లక్ష చేసినా మానవసమాజం ప్రపంచం అంతటా శిథిలం అవుతున్నదన్న సత్యాన్ని దాచలేదు

* * *

సమాజంలో ఐక్యత సాధించేశక్తులు లేవని నా ఉద్దేశం కాదు. కొన్ని అనుకూల శక్తులు కొన్ని వర్గాలను కూడగట్టి వుంచుతున్న మాట నిజం.

అన్నిటికన్నా నిర్మలమైనది, దాదాపు నిరుపయోగమైనదీ కళారంగం. కళాభిరుచిలో సామ్యం సాంఘిక ప్రగతి శక్తులలో నిస్సందేహంగా ఒకటి, కాని బలీయమైనది కాదు. ఇతర శక్తులు అనుకూలిస్తే అది గొప్పగా రాణిస్తుంది. కళాభిరుచివల్ల ఒక కవిని గాని, రచయితను గాని, గాయకుణ్ణి గాని, నటుణ్ణిగాని అభిమానించే వాళ్ళు ఏకమవుతారు ఈ అభిరుచి సంఘంలో ఉండే మామూలు అడ్డుగోడ అన్నింటినీ దూసుకుపోగలదు అలాంటి పరిస్థితిలో ఆయాకళాకారులు తమ కళల ద్వారా ప్రత్యేక సామాజిక ప్రయోజనాన్ని సాధించటానికి పూనుకున్న వారైతే కళాభిరుచులు గలవారు కనీసం మానసికంగా ఆప్రయోజనాలకు సుముఖులవుతారు.

మానసికంగా అని ఎందుకు చేర్చవలసి వచ్చిందంటే సంఘంలో సంస్కరణలు జరగాలని ఒప్పుకునేవారందరూ తామై పోటికి నడుముకట్టరు. సిద్ధాంతరీత్యా విప్లవాలు తప్పనిసరి అని ఒప్పుకునే వారంతా విప్లవాచరణను సహించగలరని అనుకోవటానికి లేదు. ఈతేడా ఎందువల్ల వస్తుందంటే, సమాజం యొక్క భౌతిక పునాదులను కదిలించే శక్తి కళలకు లేదు, కదిలించ పూనుకున్నవారికి అవి ఊతం ఇయ్యవచ్చు అంతే! ఇదే ప్రధానంగా కళలు సాధించే ఐక్యతలో ఉండే దౌర్బల్యం. జనాన్ని ఏకం చేసేవి ఇంకా చాలా ఉన్నాయి రకరకాల బాబాలమీద భక్తీ, క్రీడారంగం గురించిన ఆసక్తీ, సాంస్కృతిక ఉద్యమాలలో సభ్యత్వమూ, రాజకీయ పార్టీలలో సభ్యత్వమూ వగైరాలు. ఇవి చాలామటుకు సమాజంలో ప్రత్యేక సంఘాలుగా రూపొందటానికి తోడ్పడతాయి గాని మౌలికంగా సంఘ నియమాలపట్ల ప్రజలలో దృఢమైన విశ్వాసం కలిగించటానికి గానీ, కాలానుగుణ మైన మార్పులు వాటిలో తేవటానికి గాని పనికిరావు

అంతేగాక ఈకాలంలో ప్రజలు ఏ ప్రాతిపదికమీద ఏకంకావటానికైనా రాజకీయాలు అడ్డుతగలవచ్చు రష్యాలో జరగనున్న ఒలింపిక్ క్రీడల విషయంలో ఎంత రాజకీయ దుమారం రేగిందో మనం చూస్తూనే వున్నాం రాజకీయ కారణాలు అడ్డం పెట్టుకుని మంచి సాహిత్యాన్ని దుమ్మెత్తిపోస్తూ వస్తున్నవాళ్లు ఉంటూనే ఉన్నారు

కమ్యూనిస్టుకవిత్వం , కమ్యూనిస్టుసాహిత్యం అనే అనిర్వచనీయమైనమాటలు కూడా సృష్టి అయ్యాయి! (ఏ కారణంచేతనో కాంగ్రెస్ కథలూ, కాంగ్రెస్ నవలలూ అన్నమాటలను ఎవరూ సృష్టించలేదు!) సాహిత్యం రాజకీయమైనదైతేనే దానికి రాజకీయమైన పేరు తగిలించాలి మార్క్స్, ఎంగెల్స్, లెనిన్, మావో రచనలను మార్క్సిస్టు రచనలు అనవచ్చు కాని మావో కవిత్వాన్ని పట్టుకుని కమ్యూనిస్టు కవిత్వం అంటే తెలిసిన వాళ్ళు నవ్వుతారు. వీర రాజకీయ వాదులు నలుగురి ఎదుటా నవ్వులపాలు కావటానికి కూడా సిగ్గుపడబోరు

రాజకీయాల ప్రభావం ఈ విధంగా ఉన్నకారణంచేత, మౌలికమైన సాంఘిక, రాజకీయ సూత్రాలమీద మనుషులు ఏకమైతేతప్ప, సమాజం తాలూకు పునాదులలో నిజమైన కదలిక రాదు

విచారకరమైన విషయం ఏమంటే, చాలా రాజకీయ పార్టీలు బోగస్ అనిపించే పేర్లు పెట్టుకుంటాయి. వెనక జస్టిస్ పార్టీ ఉండేది. కాంగ్రెస్ పార్టీ మానిఫెస్టోను యథాతథంగా కాపీ కొట్టి 1937 ఎన్నికలప్పుడు పీపుల్స్‌పార్టీ అంటూ వచ్చింది. ఈనాడు కాంగ్రెస్ , జనత , లోక్‌దళ్ లాంటిపేర్లతో అమ్ముడవుతున్న పార్టీలు సమాజాన్ని ఎటు నడిపించటానికి పుట్టాయో వాటి పేర్లు చూస్తే తెలీదు. ఆ పార్టీల నాయకులు చెప్పేదేమో నమ్మటానికి లేదు కాలచక్రాన్ని వెనక్కు తిప్పి క్రీస్తు పూర్వ స్థితిని తిరిగి నెలకొల్పటానికో, కాలచక్రాన్ని కదలకుండా గట్టిగా పట్టుకుని ఇప్పుడున్న ధనిక, దరిద్ర వ్యవస్థను యిలాగే శాశ్వతంగా ఉంచటానికో, భవిష్యత్తులో మరొక కృతయుగాన్నో, స్వర్ణయుగాన్నో సృష్టించి ధర్మాన్ని నాలుగు కాళ్ళమీదనో, ఎనిమిది కాళ్ళమీదనో నిలబెట్టటానికో అంకితమైన రాజకీయపార్టీలే వాస్తవమైన పార్టీలు, వాటిమధ్య జరిగే సంఘర్షణే నిజమైన సామాజిక చైతన్యం. అంతేగాని, దేశాన్ని దేశీయ, విదేశీయ ధనస్వాములకు తాకట్టు పెట్టేసి 'ఇదే సోషలిజం' అనే పార్టీలు బోగస్ పార్టీలు ఒకటి చెబుతూ ఇంకొకటిచేసే పార్టీలన్నీ బోగస్ పార్టీలే జనసామాన్యాన్ని కూడగట్టుకోకుండా జెండాలెత్తే పార్టీలు అసలు రాజకీయ పార్టీలే కావు – మద్రాసులో కార్యదర్శి తప్ప సభ్యులు లేని సభల లాగా!

*ముద్ర యువ మాసపత్రిక, సెప్టెంబర్ 1980*

*పునర్ముద్రణ కళలు శాస్త్రీయ విజ్ఞానం – విరసం ప్రచురణ, సెప్టెంబరు – 1980*